## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి, జ్ఞాన, ధర్మ ప్రచారార్ధం మహానుభావులైన శ్రీ 64 కళలు వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన మాసపత్రికలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు.వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. ఈ మాసపత్రికలు క్రొత్తవా లేక పాతవా? అని చూడకుండ, అందులోగల రత్నాలలాంటి విషయాలను తెలుసుకోవటానికి ప్రయత్నం చేయగలరు అని మనవిచేసుకొంటున్నాము..

ఈ మాసపత్రికలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) 64 కళలు వెబ్ సైట్: http://www.64kalalu.com
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.



**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

# 64 కళలు వెబ్ సైట్

## http://www.64kalalu.com



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

Life is short - Art is long

జనవరి 2011

# 64కళలు.కామ్

www.64kalalu.com

సకల కళల సమాహారం

నూతన సంవత్సర శుభాకాంక్షలతో...



- ప్రకృతి చిత్రకారుడు వి.వి. భగీరధీ
- నిత్య గాంధర్వ బాలుడు - బాలు
- తెలుగు నాటికా వైభవం...
- శంకర్ కేరికేచర్స్ షో...
- అతివగా అభినయం.. అజేయం...
- విజయవాడలో తానా చైతన్య స్రవంతి

నాగురించి నేను...
రాగతి పండరి

# 64కళలు.కామ్

www.64kalalu.com

సకల కళల సమాహారం

సంపుటి :1 సంచిక :3 జనవరి 2011







మనిషి ఏదైనా ప్రగతి సాధించిన ప్రతీ సంవత్సరం ఓ నూతన సంవత్సరమే

మనం ఆనందంగా ఉన్న ప్రతిరోజు మనకు ఓ ఆనంద సంవత్సరమే

మత్సరాయుమాని మనుషుల మధ్య వాత్సల్యం పెరిగిననాడు

మానవాళికి నిత్య 'నూతన' సంవత్సరమే

కళాసాగర్
ఎడిటర్

ముఖచిత్రం చిత్రకారుడు : **వి.వి. భగీరధీ**

# అతివగా అభినయం... అజేయం...

**భారతీయ సంప్రదాయం నృత్యరీతులలో కూచిపూడికి ప్రత్యేకస్థానం ఉంది. నృత్యనాటికలు, రూపకాలు, శాస్త్రీయనృత్య ప్రదర్శనలతో ఆధ్యాత్మిక, పౌరాణిక అంశాలతో పాటు, సమకాలీన అంశాలను కూడా ఇతివృత్తాలుగా తీసుకుని ప్రజల మనసుల్లోకి నవరసాల్ని చొప్పించగల మహత్తర సాధనం నాట్యం.**

ఆంధ్ర రాష్ట్రానికి అజరామరమైన కీర్తి ప్రతిష్ఠలను అందించిన అపురూపమైన నాట్యకళా ప్రక్రియగా కూచిపూడి ఎంతగానో ప్రఖ్యాతి గాంచింది.

అలనాటి కూచిపూడి నాట్య దిగ్గజాలు వేదాంతం రాఘవులు, వెంపటి చిన సత్యం మొదలుకుని వర్ధమాన నాట్యకళాకారుల వరకు తెలుగువారి సాంస్కృతిక వారధులుగా కూచిపూడి కళా వైభవాన్ని, భారతీయ ఆచార వ్యవహారాలు, చారిత్రక ప్రాభవాలను దశదిశలా వ్యాప్తి చేస్తున్నారు.

కూచిపూడి నృత్యాన్ని మరింత శోభాయమానం చేసిన ప్రక్రియలలో రూపాను రూపానికి ప్రత్యేక స్థానం ఉంది.

భామా కలాపం రుక్మిణీ పరిణయం వంటి పలు అంశాలలో స్త్రీ పాత్రలను పోషించి, అతివలను సైతం అబ్బురపరచిన నాట్యకారుల అసామాన్య ప్రతిభా పాటవాలు ఆ ప్రక్రియ గొప్పదనాన్ని చాటిచెపుతున్నాయి.





అటువంటి రూపానురూప ప్రక్రియకు తన నాట్య కళను అంకితం చేసి కేవలం స్త్రీ పాత్రలకే పరిమితమై అతివలకే అసూయపుట్టేంతగా ఒయ్యారాలొలికిస్తూ, ఆహార్యం, అభినయాలలో చూపరులను, కళాభిమానులను, అందమైన అమ్మాయిగా భ్రమింపజేస్తూ,, ఒక్కొక్క మెట్టు ఎదుగుతున్న వర్ధమాన కళాకారుడు అజయ్‌కుమార్.

విద్య వినయాన్ని సమకూర్చుతుందన్న మాటకు ఇతడు నిలువెత్తు నిదర్శనం. కూచిపూడి నాట్యానికి పుట్టినిల్లు కూచిపూడి మొదలుకుని దేశ సాంస్కృతిక రాజధాని విజయవాడలో అతడు ఎక్కని వేదిక లేదు ఆ అందెల సవ్వడి మ్రోగని చోటు లేదు. మనదేశంలోను, విదేశాలలో కూడా. కూచిపూడి గిన్నీసు రికార్డుల కార్యక్రమాలతో పాటు ఇస్కాన్ దేవాలయం వంటి అనేక పవిత్ర స్థలాల్లో అజేయుని నృత్యప్రదర్శనలు అభినందనీయాలు.

మగవారు ఆడవారి పాత్రలను ధరించి నృత్య ప్రదర్శన ఇవ్వడమంటే మామూలు విషయం కాదు. పురుష సహజమైన గాంభీర్యాన్ని బయటపడకుండా స్త్రీలకు మాత్రమే సొంతమైన లాలిత్యాన్ని, సౌకుమార్యాన్ని ప్రదర్శించటం ఒక సవాలైతే... యువకుడైన అజయ్ చిన్ననాటి నుండీ స్త్రీ పాత్రలు చేస్తూ ఎటువంటి పరిస్థితులు ఎదుర్కోవాల్సి వస్తుందో మనకి తెలియంది కాదు. అయినప్పటికీ అతని సంకల్పం ముందు ఏ అవాంతరం నిలబడలేదు. స్వశక్తితో నిత్య విద్యార్థిగా ఒక్కొక్క మెట్టు ఎదిగాడు. తనలాంటి ఎందరినో తయారు చేసే సంకల్పంతో హంసధ్వని నృత్యాలయ సంస్థను స్థాపించి, అనేక మంది చిన్నారులను నాట్య మయూరులుగా తీర్చిదిద్దే ప్రయత్నం చేస్తున్నాడు. అవార్డులు, సత్కారాలు మనిషిలో అహంకార భీజాన్ని నాటుతాయంటారు. కానీ ఈ కళాతేజం అహంకారం, అసూయ, ప్రశంసలపై మోజు వంటి చీకట్లను చీల్చుకుంటూ స్వచ్ఛమైన కాంతిపుంజంగా నటరాజ పదార్చన చేస్తూ... వినమ్రుడై, విజేయుడై... అజేయుడై మాతృమూర్తి కలల దీపం కావాలని... అజేయంగా కూచిపూడి ప్రాభవాన్ని ప్రపంచానికి చాటిచెప్పాలని ఈ కొత్త సంవత్సరంలో... మంచి మనసులతో... శుభాకాంక్షలందిద్దాం.

## 'సింగరమణి' అజయ్‌కుమార్ గురించి...

| | | |
|---|---|---|
| చదువు | : | బి.కాం., ఎం.ఏ. (కూచిపూడి, నృత్యం తెలుగు యూనివర్శిటీ నుండి) |
| గురువులు | : | వేదాంతం వెంకటేశ్వర్లు, కె.వి. సత్యనారాయణ. |
| అవార్డులు, బిరుదులు | : | సింగరమణి, నృత్య కళాజ్యోతి, నృత్య కౌముది, నవరస భావనాట్య కేశరి. ఇంకా అనేక సంస్థల నుండి సత్కారాలు-సన్మానాలు అందుకున్నారు. |
| ఉద్యోగం | : | విజయవాడ, ఘంటశాల ప్రభుత్వ సంగీత నృత్య కళాశాలలో కూచిపూడి నృత్య అధ్యాపకునిగా |

email: ajaykumarkuchipudi@gmail.com

- వెంటపల్లి సత్యనారాయణ

# ప్రకృతి ఆత్మసౌందర్యాన్ని చిత్రించిన భగీరథి

దాదాపు పదేళ్ళ క్రితమనుకుంటా ప్రముఖచిత్రకారిణి శ్రీమతి బి. పద్మారెడ్డిగారు "ది హిందూ" ఆంగ్ల దినపత్రికలో ఆర్ట్ గురించి వ్రాస్తూ దానిలో ఒక ప్రకృతి చిత్రాన్ని ప్రచురించారు. నేను అప్పుడు ఆ ఆర్టికల్ జోలికి పోలేదు కానీ దానిలో ప్రచురించిన ఆ సజీవ ప్రకృతి చిత్రం మాత్రం ఇన్నేళ్ళయినా నాకళ్ళముందు ఇంకా అలా కదలాడుతూనే ఉంది.



వి.వి. భగీరధి

ఒక సాయం సంధ్య పంటపొలాలకు దగ్గర, రెండు తాటి తోపుల మధ్య మైదానంలో గల గడ్డి వాముల వంటి ప్రదేశాన్ని ఆయన చిత్రించిన తీరు ఒక ఎత్తైతే, సాయం సమయంలో వాతావరణాన్ని మనకు చూపించిన తీరు అద్భుతంగా ఉండి ఆ సంధ్యా కాలపు నీరెండ గోరువెచ్చగా మన శరీరాలను స్పృశించిన అనుభూతి చూసిన ప్రతీ ఒక్కరికీ కలిగేలా చేస్తుంది. అందుకే నన్ను అప్పుడు ఆ చిత్రం చూపు మరల్చకుండా చేయడమే కాక ఇప్పటికీ సజీవంగా నాకళ్ళ ముందు అలా కదలాడుతూనే వుంది. నన్ను అంతలా కట్టిపడేసిన ఆ చిత్రమే " ది ఈవినింగ్ గ్లో" ప్రఖ్యాతి ప్రకృతి చిత్రకారుడు స్వర్గీయ వి.వి. భగీరధి కుంచె నుండి జాలువారిన అనేక శతాధిక చిత్రాల్లో ఒకటది.

ప్రకృతిలోని పుష్పాలను యథాతథంగా చిత్రించడం ఒక ఎత్తైతే వాటితోపాటు, ఆ పుష్పాలు తాలూకు పరిమళాన్ని కూడా చిత్రంలో చూపించగలిగితే... ఇక వాటి సౌందర్యాన్ని వీక్షించకుండా, ఆ గుభాళింపును ఆస్వాదించకుండా ఏ ప్రేక్షకుడు ఉండగలడు? ఇక వాటిని మరువగలమా? అందుకే భగీరధి ప్రకృతిశిల్పి అయ్యాడు.

ప్రకృతిలోని దృశ్యాలను యధాతథంగా చాలా మంది చిత్రించి వుండవచ్చు. కానీ ఆ ప్రకృతిలో గల ఆత్మసౌందర్యాన్ని కూడా తన చిత్రాల్లో రంగులతో చూపించే నేర్పు, ఓర్పు మాత్రం ఒక్క భగీరధిగారే సొంతం చేసుకున్నారు. అందుకే ఆయన చిత్రాల్లో పూర్వ దిగంతంలోని ఉష: కాంతులు, పశ్చిమాకాశంలోని సంధ్యారాగాలు, హేమంతంలోని అస్పష్ట హిమ దృశ్యాలు, శరత్ కాలంలోని నిర్మల నీలిదృశ్యాలు మనిషికి ఆత్మలా ఆయన చిత్రాల్లో జీవాన్ని కలిగి వుంటాయి. కనుకనే ఆయన చిత్రాలు ఒక్కసారి చూస్తే మరిచిపోకుండా రసజ్ఞుల్ని కలకాలం వెన్నాడి వుంటాయి. అందుచేతనే ఆయనను విశ్వ విఖ్యాత ప్రకృతిశిల్పి అయిన టర్నర్‌తో సరిపోల్చడం జరిగింది.

ప్రకృతి శిల్పి. ఆంధ్రాటర్నర్‌గా పేరు గాంచిన భగీరధి పూర్తిపేరు వరహాగిరి వెంకట భగీరధి. శ్రీ సర్రాజు పంతులు శ్రీమతి నరసమాంబ దంపతులకు క్రీ.శ 1901 జూలై 21వ తేదీన విశాఖజిల్లా అనకాపల్లి దగ్గర మామిడిగూడెం గ్రామంలో జన్మించారు. కానీ తండ్రిగారి స్వగ్రామమైన తూర్పుగోదావరి జిల్లా జగ్గంపేట గ్రామంలో నివసించడం జరిగింది. బాల్యంలోనే చిత్రకళపై ఆసక్తి ఏర్పడి స్వయం కృషితో ప్రకృతి చిత్రాలను రచించడం మొదలుపెట్టారు. ప్రముఖ చిత్రకారులు శ్రీ దామెర్ల రామారావు గారితో పరిచయం ఏర్పడిన తరువాత ఆయన వద్ద కొంతకాలం శిక్షణ పొంది కళకు మెరుగులు దిద్దుకున్నారు. పిదప

బొంబాయిలోని జె.జె.స్కూల్ ఆఫ్ ఆర్ట్స్‌లో చిత్రకళాభ్యాసం కోసం చేరారు. కానీ తీవ్ర అనారోగ్యం కారణంగా అక్కడ చిత్రకళను పూర్తిగా అభ్యసించలేకపోయారు. ఇంటికి వచ్చి తిరిగి స్వయంకృషితో చిత్రసాధన చేయసాగారు. ప్రారంభంలో మానవ మూర్తుల చిత్రాలు కూడా వేసిన భగీరధి కాలక్రమంలో ప్రకృతి చిత్రాలకు అంకితమయ్యారు.

మది ఎదలో కదలాడే కనరాని భావాల కల్పనకు రూపకల్పనచేయడం ఒక ఎత్తు. అది పూర్తిగా చిత్రకారుని అభీష్ఠం. కానీ నిత్యం మనకళ్ళెదుట కనిపించే దృశ్య జగతి యధాతథంగా చూపిస్తూ ప్రేక్షకున్ని మెప్పించడమే కాక అంతర్లీనంగా ఆ ప్రకృతికి ఆవల ఉన్న రసరంజితమైన ఆ వాతావరణాన్ని చిత్రంలో ప్రతిబింబించి నిజప్రకృతి ఒడిలో మనం ఉన్నప్పుడు పొందే ఒకరమ్యమైన, ఆహ్లాదకరమైన అనుభూతిని కూడా చిత్రం చూసేటపుడు ప్రేక్షకునికి కలగజేయాలి అంటే దానికి ఎంతో ఏకాగ్రత ప్రకృతి పరిశీలన, పరిశోధన, పరిశ్రమ, రంగుల మేళవింపులో ఎంతో జాగరూపకత, పరిణతీ అవసరం. లేకుంటే సృష్ఠికి ప్రతిసృష్ఠి చేయగలమేమోగానీ ఆప్రకృతి ఒడిలో వున్న అనుభూతిని ప్రేక్షకునికి అందించలేము. భగీరధి దీనిలో సఫలీకృతు దయ్యారు కాబట్టే ఆయన ప్రకృతిశిల్పి అయ్యారు. అందుకు ఆయన చేసిన శ్రమ వర్ణణాతీతం.

వృత్తిపరంగా డ్రాయింగ్ మరియు డ్రిల్లు టీచర్‌గా జిల్లా బోర్డు మిడిల్ స్కూల్ మండపేట, పుల్లేటి కుర్రు, అనపర్తి, జగ్గంపేట, సామర్ల కోట, మొదలైన గ్రామాల్లో పనిచేసినప్పటికీ ఆప్రకృతి ప్రేమికుని దృష్ఠి ఎల్లవేళలా వివిధ రకాలైన ప్రాకృతిక ప్రదేశాలు, కాలానుగుణంగా ప్రకృతిలో మారే రంగులపైనా, వాటిపరిశీలనపైనే వుండేది. అందుకే రవాణా సదుపాయాలు అంతగాలేని ఆరోజుల్లో కాలినడకన అధ్భుత దృశ్యాల వీక్షణకోసం అనంత దూరాలు ప్రయాణంచేసేవారు. ఉద్యోగానికి ఆరేసి నెలలు సెలవుపెడుతూ యావద్భారతదేశంలోని సుందర ప్రదేశాలు తిరిగి జయపురమున పర్వత పంక్తులు, కొడైకెనాల్, నీలగిరి కొండలు తిరువాన్కూర్ పరిసరములలో వుండు పడమటికనుములు, కన్యాకుమారి అగ్రము, ఉదకమండలమునందలి మేఘావృత దృశ్యాలు, డుడుమాజల పాతం, పాపికొండల మధ్య గోదావరి, అరమాపర్వతం, స్టీమ్‌ఎట్ మత్స్య గుండం, పవిత్ర బెజవాడ, రాయగడ మార్గం, మాడుగుల మార్గంలో కూల్ ఆఫ్ కేప్ కేమరన్ మొగల్రాజపురం, రాయగడ జలపాతం, జగ్గంపేట మార్గం ఇలా మొదలయిన చిత్రాలు చిత్రించారు.

అంతేకాకుండా ప్రాత:కాల మంచును చిత్రించడంలో ఎంతో ప్రావీణ్యం పొందిన వీరు ప్రకృతిలోని వివిద



ప్రారంభంలో మానవ మూర్తుల చిత్రాలు కూడా వేసిన భగీరధి కాలక్రమంలో ప్రకృతి చిత్రాలకు అంకితమయ్యారు.

మార్పులను "మిస్టీమార్నింగ్" కమింగ్ డార్క్‌నెస్, ఒక మంచుతెర, అప్పర్ సన్ సెట్, కమింగ్‌డార్క్‌నెస్, ఈవినింగ్ గ్లో, ఈవినింగ్ స్కై, కిస్సింగ్ రాక్స్, జెయింట్ రాక్స్, ఫ్లోటింగ్ మిస్ట్స్, క్రిమ్‌సన్ సాయిల్, సిల్వరీ క్లౌడ్స్, చంద్రోదయం, సూర్యోదయం మొదలైన చిత్రాలు వేసారు.

అంతటి మహనీయుని శతాధిక సంఖ్యలో గల అసలు చిత్రాలలో కనీసం కొన్నింటినైనా ప్రత్యక్షంగా చూసే భాగ్యం ఇటీవలనే నా మిత్రుడు శ్రీనివాస్ ద్వారా కలిగింది.

వేసవి సెలవుల నిమిత్తం మా ఊరు (కందుల పాలెం, రామచంద్రపురం, తూ॥గో॥జిల్లా) వెళ్లిన నా యొక్క పిల్లలను చూసేందుకు ఖమ్మంజిల్లా చర్లనుండి మిత్రుడు శ్రీనివాస్‌తో కలిసి 8.5.2009 రాత్రి బయలుదేరి మరుసటిరోజు ఉదయం రాజమండ్రిలో స్నానాధికాలు ముగించుకొని రాజమండ్రిలోనే నివసిస్తున్న శ్రీమతి ఎన్.వి.పి.యస్.యస్.లక్ష్మి గారికి ఫోన్‌చేసి స్వర్గీయ భగీరధిగారి చిత్రాలను చూడాలని ఆశపడుతున్నామని చెప్పగానే ఆమె సాధరంగా ఆహ్వానించడమే కాక ఆ మధ్యాహ్నం అమృతతుల్యమైన భోజనం కూడా పెట్టి మాకు ఆతిథ్యం ఇచ్చారు.

"తాతదండ్రుల సుగుణాలు తనయులకు, మనుమలకూ రాకుండా ఎలా ఉంటాయి"? ఏ మనిషినైతే అంత గొప్పగా చెప్పుకొంటున్నామో ఆప్రకృతి శిల్పి భగీరధి గారికి స్వయంగా మనుమరాలే శ్రీమతి యన్.వి.పి.యస్.యస్ లక్ష్మిగారు. అందుచేతనే ఆ లక్షణాలు కూడా ఆమెలో కానవచ్చాయి. స్వయంగా ఆమె చిత్రకారిణే కాక మంచి రచయిత్రి కూడా. ఇటీవలనే ఆమె ప్రముఖ చిత్రకారులు శ్రీ బి.ఏ. రెడ్డిగారు కళాయాణంపై గోల్డెన్‌పేలట్" అదే పుస్తకాన్ని ఎంతో గొప్పగా రచించి పలువురి ప్రశంసలందుకున్నారు. ఒక వ్యక్తి జీవితచరిత్రను ఆమె రొటీన్‌గా కాకుండా, కవితాత్మకంగా రాసిన తీరు నిజంగా ఆ పుస్తకంలోని శ్రీ బి.ఏ.రెడ్డిగారి బొమ్మలతో పోటీపడి నువ్వా, నేనా అనేంత గొప్పగా వుంది. ఆర్ట్ లవర్స్ అందరూ కూడా కొనుక్కొని చదవాల్సిన పుస్తకం అది.

మధ్యాహ్న భోజనాలకు ముందుగానే ఆమె స్వర్గీయ భగీరధిగారి చిత్రాలు మాముందుంచారు. ఎంతోకాలంగా పత్రికల్లో కూడా ఆయన బొమ్మలు ఒక్కసారిగా ఆయన స్వహస్తాలతో వేసిన ఒరిజనల్ చిత్రాలను చూడడం మాకు గొప్ప అనుభూతినిచ్చింది. చిత్రాలన్నీ ముందుగా నేను చెప్పినట్లే ప్రకృతిలోని వివిధ ప్రదేశాలను కాలమాన ప్రభావంతో నీటిరంగులతో ఆయన చిత్రించిన విదానం చూసినపుడు మనం నిజంగా ప్రకృతి ఒడిలోనే ఉన్నామా అన్న భ్రాంతిని కలగజేస్తుంది. అంతేకాకుండా ఎ. పిక్చర్, బి.పిక్చర్, "సి.పిక్చర్ ఇలా ఆంగ్లభాషాక్షరాలను కూడా ప్రకృతి దృశ్యాలుగా మలచిన తీరును చూసినపుడు నిజంగా మాకు



ప్రకృతిలోని వివిధ ప్రదేశాలను కాలమాన ప్రభావంతో నీటిరంగులతో ఆయన చిత్రించిన విదానం చూసినపుడు మనం నిజంగా ప్రకృతి ఒడిలోనే ఉన్నామా అన్న భ్రాంతిని కలగజేస్తుంది.

అబ్బురమనిపించింది.

ఇక భగీరథిగారికి బ్రిటీష్, మద్రాస్, గవర్నమెంట్ కాలంలో వివిధ ప్రముఖులు మరియు వివిధ సంస్థలనుండి వచ్చిన మోడల్స్ అవార్డులు అప్పటి పత్రికలలో భగీరథి గురించి ప్రచురితమైన ఆర్టికల్స్ అన్నీకూడా పెద్దకట్టేవుంది. అన్నింటినీ ఆమె చాలా భద్రంగా పదిల పరిచారు. దురదృష్టవశాత్తూ తక్కువ ప్రాధాన్యమున్న చిత్రాలు మాత్రమే ప్రస్తుతం లక్ష్మి గారి వద్ద వున్నాయి. చాలామటుకు వివిధ వ్యక్తులు, సంస్థల సేకరణల్లో వుండిపోయాయి.

శ్రీరాజారాయ్ రామన్ బహద్దూర్, హైదరాబాద్, శ్రీరాజాదనరాజ్ గురూజీ హైదరాబాద్, శ్రీనవాబ్ సాలార్‌జంగ్ బహుదూర్ హైదరాబాద్, ది దాదగర్ మహారాణి సాహెబ్ ఆఫ్ విజయనగరం (65) నీటిరంగుల చిత్రాలు ఈమె ఒక్కరే సొంతం చేసుకున్నారు) ఇంకా వాల్షన్ ప్రిన్స్ అజమ్ జాహి బహద్దూర్, మిస్ఎలీనర్ మెక్ డూగల్, మిస్టర్ హెచ్.ఏ బుల్లర్ శ్రీ చుండూరు వెంకటరెడ్డి బెజవాడ మొదలయిన వారి సేకరణలో వారి అత్యధిక చిత్రాలు ఉండిపోయాయి.

భగీరథి తన జీవితకాలంలోనే మనదేశపు ఆర్మిం బ్రిటీష్ గవర్నర్ జనరల్ అయిన లార్డ్‌మౌంట్‌బాటన్, మన జాతీయనాయకులైన మహాత్మాగాంధీ, నెహ్రూ, సర్వేపల్లి రాధాకృష్ణ, జస్టిస్ సి.వి. రాజమన్నార్, ఇంకా జయపురం మహారాణి, విజయనగర మహారాణి సాహెబా, తిరువనంతపురం మహారాణి, సి.డబ్ల్యు కాటన్, డా॥ టి.హెచ్. సోమర్‌నెల్, జె.ఎక్స్ మిల్లర్, బి.ఎఫ్ ఉడ్‌వర్త, ఇ.పి. మెట్‌కాపే, లేడిఇర్విన్, లేజీ బ్రిటీక్స్ స్టాన్లీ



ఇంకా ప్రఖ్యాత శిల్పి శ్రీ దేవిప్రసాద్ రాయ్‌చౌదరి మొదలయిన మహామహులచే సత్కారాలు, సన్మానాలు పొందిన శ్రీభగీరథి తన సతీమని శ్రీమతి రత్నమాణిక్యం (ఈమెకూడాచిత్రకారిణే) మరణించిన 16వ రోజున అనగా 1949 నవంబర్ 19వ తేదీన జీవితాంతం తాను ఏలోకాన్నైతే ప్రేమించాడో ఆ అనంతమైన ఆనందలోకాలకు ఈభువినుండి శాశ్వతంగా తరలివెల్లిపోయారు.

భౌతికంగా భగీరది దూరమైనా ఈ ప్రకృతి ఉన్నంతకాలం శరత్‌కాలపు చల్లనివెన్నెల్లా, వసంకాలపు లేలేత హరిత వర్ణాల్లా హేమంతంలోని తుషార బిందువుల్లా ప్రతినిత్యం మసకగులిపించే పశ్చిమాకాశపు సంధ్యారాగాల్లోనే కాదు. పూర్వ దిగంతాల ఉష:కాంతులలో కూడా ప్రతిరోజూ కళాహృదయులకు భగీరథి కనిపిస్తూనే ఉంటాడు.



# నా గురించి నేను...

## కుమారి రాగతి పండరి

**తొలి తెలుగు మహిళా కార్టూనిస్టుగా గత నాలుగు దశాబ్దాలుగా పాఠకులను అలరిస్తున్న కుమారి రాగతి పండరి తన జీవన గమనాన్ని - కార్టూనిస్టుగా స్వయంకృషితో ఎదిగిన వైనాన్ని "నా గురించు...నేను" పేరుతో అక్షరీకరణ చేసారు. 64కళలు.కామ్ లో ధారావాహిక రూపంలో నెల-నెలా ...**



కుమారి రాగతి పండరి

ఇలా వుండగా ఒకరోజు నా కొక ఉత్తరం వచ్చింది. కవరు మీద నా అడ్రసు అందంగా రాసి ఉంది. ఎవరు రాశారబ్బా అనుకొంటూ కుతూహలంగా విప్పాను.

తెనాలి నుండి ప్రముఖ చిత్రకారుడు శ్రీగోలి శంకరరావుగారు రాసిన ఉత్తరం. ముత్యాల్లాంటి అక్షరాలతో పెద్ద లెటర్ రాశారు. వాళ్ల నాన్నగారు, అన్నయ్యలు ప్రముఖ చిత్రకారులేనని, తాను కూడా చిత్రాలు గీస్తుంటానని తనను తాను పరిచయం చేసుకొంటూ పత్రికల్లో నా కార్టూన్లు చూస్తున్నానని, తనకీ బాగా నచ్చుతాయనీ, ఇంకా విరివిగా కార్టూన్లు గీస్తూ పత్రికలకు పంపమని సూచిస్తూ నా గురించి కూడా రాయమని రాశారు. అంత గొప్ప చిత్రకారుడు నా కూర్టూన్ల గురించి రాయడం తన గురించి అంతబాగా పరిచయం చేసుకోవడం నాకెంతో ఆనందం కలిగించింది.

నా గురించి రాసేందుకు పెద్దగా ఏమీలేదని, ఇప్పుడిప్పుడే తప్పటడుగులు వేస్తున్న బుల్లి కార్టూనిస్టునంటూ నేను వెంటనే జవాబు రాశాను. పరిచయం అనే చెట్టుకు అనురాగమనే నీళ్లు పోస్తే స్నేహమనే పూలు పూస్తాయట, శ్రీ గోలిశంకరరావు గారు అప్పటి నుండీ నాకు ఎంతో చక్కగా లెటర్స్ రాస్తుండేవారు. అవి నన్ను ఎంతగానో ఆకట్టుకునేవి. నేను కూడా వెంటనే లెటర్స్ రాసేదాన్ని. ఇలా దిన దిన ప్రవర్ధమానమై మా కలం స్నేహం ఒకటి కాదు, రెండు కాదు పదిహేనేళ్లకు పైగా కొనసాగింది. పువ్వు పరిమళం దినాంతరం, స్నేహ పరిమళం యుగాంతరం. జీవితమనే నందనవనంలో స్నేహం ఒక పారిజాతం.

నేనెక్కువ అభిమానించే చిత్రకళామిత్రుడు అతను. అప్పుడు అతని చిత్రాలు ప్రభ వీక్లీలోను, కొన్ని పత్రికలకి ముఖచిత్రాలుగాను వస్తూ ఉండేవి. ఇక పత్రికల్లో నా కార్టూన్లు దండయాత్ర






## కుమారి రాగతి పండరి కార్టూన్ పాత్రలు

కొనసాగుతూవుంది. యువలో నా కార్టూన్లు బాగా రావడం మొదలయ్యాయి. గొలుసు కార్టూన్లు తొమ్మిది, పది వరకు వేసేదాన్ని. వరుసగా యువ ఎడిటర్‌గారు నాకు లెటర్స్ రాసేవారు కార్టూన్లు త్వరత్వరగా వేసి పంపిస్తుండమని, పత్రిక, ప్రభ, జ్యోతి, వీక్లీల్లో కూడా నా కార్టూన్లు బాగా వస్తుండేవి. పత్రిక వీక్లీలో శ్రీ వీరాజీగారు పంపే కథలకు బొమ్మలు వేస్తున్నాను. ఆ తర్వాత వీరాజీగారు. పత్రిక వీక్లీలో సామెతల కథలు అనే కొత్త శీర్షికను ప్రారంభించారు. దానికి నా చేత కార్టూన్లు వేయించారు. పత్రిక వీక్లీలో సామెతల కథలు, నా కార్టూన్లు కొన్ని వారాల పాటు ధారావాహికంగా వచ్చాయి. అలాగే పత్రిక వారి కలువబాల పక్ష పత్రికలో కూడా శ్రీ వీరాజీగారు కవి చమత్కారాలు అనే శీర్షికకు నా చేత కార్టూన్లు వేయించారు. కొన్నాళ్ల పాటు కొంతమంది కార్టూనిస్టులతో లెటర్స్ ద్వారా పరిచయాలు, అభిమానుల ఉత్తరాల సందడి పెరిగింది.

అందరికీ ఇష్టమైనది హాస్యరసం. హాస్యానికి వ్యంగ్యం జత కలిపితే ఎంత గంభీర సమస్య అయినా సూటిగా చెప్పవచ్చు. సంఘంలో నిత్యం వచ్చే మార్పులు ఆకలింపు చేసుకొంటూ సమస్యలను బాగా పరిశీలించి కార్టూన్లు గీయడానికి ప్రయత్నించేదాన్ని, బయట తిరిగేది తక్కువే అయినా భగవంతుడు నాకిచ్చిన తెలివితేటలతో అనేక విషయాల మీద ముఖ్యంగా స్త్రీలకు సంబంధించిన సమస్యల మీద కార్టూన్లు గీస్తుండేదాన్ని. నేను వేసే కార్టూన్లలో మితిమీరిన ధోరణి ఉండదు. లోపాన్ని భూతద్దంలో చూపించి హాస్యాన్ని అపహాస్యం చేయడం నాకిష్టం ఉండదు. నా కార్టూన్లు పెద్దవారికే గాక చిన్నపిల్లల్ని సైతం ఆకట్టుకుని, అర్థమయ్యేలా వేసేదాన్ని. నేను పసితనం వదలని వయసు నుండీ కార్టూన్లు గీస్తున్నా ఒక టీనేజ్ గర్ల్‌నని పాఠకులు ఊహించుకొనేవారు.

ఆ సమయంలోనే బాగా పాత బడిపోయిన మా ఇంటిని కొన్ని రిపేర్లతో మళ్లీ కొత్తగా మార్చాలని అన్నయ్య ప్లాన్ చేశాడు. అంచేత మేమంతా మా ఇంటిని ఖాళీ చేసి నీలమ్మ వేపచెట్టు దగ్గర ఒక ఇంట్లో కొన్నాళ్లు అద్దెకు దిగాం. ఆ ఇళ్ళు గలవాళ్లకు కార్టూన్లు గీసే రాగతి పండరిని నేనేనని తెలిసింది. ఆ ఇంట్లోవాళ్లంతా ఎంతో సరదాపడ్డారు. నన్ను చూడడానికి వచ్చారు. పత్రికల్లో నా కార్టూన్లు చూస్తున్నామని, బాగా నచ్చుతాయని తెగమెచ్చుకున్నారు. వాళ్ల అభిమానం ముందు నా బిడియం, సంకోచం ఎటోపోయాయి. నేను కూడా వాళ్లతో ఎంతో ఆత్మీయతతో మాట్లాడి నేను వేసిన, వేస్తున్న కార్టూన్లను చూపించాను. ఇలా అక్కడ చుట్టుపక్కలవాళ్లు, వాళ్లఫ్రెండ్స్ అందరికీ తెలియడంతో రోజూ ఎవరో ఒకరు నన్ను చూడటానికి వచ్చి మాట్లాడి వెళ్లేవారు.

అన్నయ్య బాగా బిజీ అయిపోయాడు. ఒక పక్క ఆఫీసు, ఇంకోపక్క ఇంటిపని, అయినా నా కార్టూన్ల గురించి సలహాలిస్తూ ప్రోత్సహిస్తూ ఉండేవాడు. నేనొక కార్టూనిస్టుగా పేరు తెచ్చుకోవడంతో అమ్మ ఎంతగానో పొంగిపోయింది. అక్కయ్యలు సంతోషించారు. రమక్క వీలు చిక్కినప్పుడల్లా కథలు, కవితలు రాస్తూనే ఉండేది. ఈమధ్యకాలంలో తన కథలు ఒకటి, రెండు పత్రికల్లో ప్రచురించబడ్డాయి కూడా. మా ఇళ్లు రిపేర్లు పూర్తయ్యాయి. మేము అద్దె ఇంటిని ఖాళీచేసి మరలా మా ఇంటికి వెళ్లిపోయాము. మేడమీద సెపరేటుగా గదులు కట్టుకుని కింది భాగం షాపులకు అద్దెకిచ్చేశాం. కొత్త ఇళ్లు సౌకర్యంగా బావుండేది. ఆ తర్వాత కొద్ది రోజుల్లోనే మా రెండో అక్క రత్నకుమారికి హైదరాబాదు హెచ్‌ఎంటిలో ఇంజనీరుగా పనిచేస్తున్న శ్రీ పిజరామచంద్రరావుగారితో వివాహం నిశ్చయించి ఘనంగా పెళ్లి జరిపించారు అన్నయ్య.

అక్క తన ఉద్యోగం మానేసింది. తను హైదరాబాదు వెళ్లిపోతుంటే నాకు ఎంతో బాధ వేసింది. నాకు అ ఆ లు నేర్పించిన అక్క, ఇన్నాళ్లూ మాతో కలిసి మెలిసి ఉన్న అక్క మాఅందరికీ

# చలి



కుమారి. రాగతిపండరి















దూరంగా వెళ్లిపోతోంటే నాకు ఏడుపొచ్చింది. అక్క హైదరాబాదు వెళ్లిపోయాక కొన్నాళ్లకు అన్నయ్యకు వివాహం అయింది. వదిన మా ఇంట అడుగు పెట్టింది. తాను కూడా గ్రాడ్యుయేటే. కవితలు రాస్తుంది. పైగా సాహిత్యాభిమాని. మరో విశేషం ఏమిటంటే వదిన పేరు కూడా రత్నకుమారి. కొత్తలో చాలా రోజులు వదినతో బాగా కలవలేకపోయాను. మా ఇంట్లో ఎవరో కొత్త వ్యక్తి వచ్చినట్టు తన దగ్గర బిడియంగా ఫీలయ్యేదాన్ని. ఇంట్లో ఎప్పుడూ అమ్మ, నేనే ఉండేవాళ్లం. ఇప్పుడు కొత్తగా వదిన కూడా ఉండేసరికి నాకేమిటో మరింత కొత్తగా అనిపించసాగింది. వదిన వాళ్లది బందరు. వాళ్లమ్మగారు, నాన్నగారు, కార్టూనిస్టు రాగతిపండరిగా నన్ను ఎంతో అభిమానించేవారు. మొదట్లో వదిన కూడా మాతో పెద్దగా మూవ్ కాలేకపోయింది. రోజులు గడుస్తున్న కొద్దీ మాలో దూరం తగ్గిపోయింది. అతికొద్ది కాలానికే మంచి వదినగా, మాలక్ష్మిలాంటి కోడలిగా, మమత గల ఇల్లాలిగా మా ఇంట్లో అందరికీ ఎంతో ఆత్మీయురాలై పోయింది. అంతేకాదు. ఇపుడు ఏది అడగాలన్నా అన్నయ్య కంటే వదిన దగ్గరే చనువు ఏర్పడింది.

అప్పుడు హైదరాబాదు నుండి శ్రీశంకుగారి ఆధ్వర్యంలో కార్టూనిస్టుల కోసం క్రోక్విల్ మాగసజైన్ ఒకటి వస్తుండేది. ఆయన దానికి నన్ను కార్టూన్లు పంపించమని రాశారు. నేను పంపించేదాన్ని. ఒక బ్రదర్‌లా శంకుగారు ఎంతో ఆత్మీయంగా లెటర్లు రాసేవారు. ఆ సమయంలో దిగ్విజయంగా సికింద్రాబాద్‌నుండి ప్రారంభమైంది. ఆంధ్రభూమి వీక్లీ. ఆ వీక్లీ వచ్చాక నా కెరీర్ మారిపోయింది. అప్పుడు ఆ వీక్లీ ఎడిటర్ శ్రీ కనకాంబరరాజుగారు నాకిచ్చిన ఎనలేని ప్రోత్సాహాన్ని నేను ఎన్నటికీ మరిచిపోలేను. భూమి వీక్లీ ప్రారంభం నుండి ఆయన స్వయంగా నాకు లెటర్లు రాసి మరీ కార్టూన్లు వేయించుకొనేవారు. ఆంధ్రభూమి వీక్లీ వచ్చాక పత్రికల్లో కార్టూన్ల స్పీడు, పోటీ విపరీతంగా పెరిగింది. కారణం ఆంధ్రభూమి వీక్లీలో కార్టూన్లకు పెద్దపీట వేశారు. ఫుల్‌పేజీ కార్టూన్లు, కార్టూన్ కథలు, స్ట్రిప్ కార్టూన్లు ఇలా ఒకటేమిటి, ఎన్నో విధాలుగా ఆంధ్రభూమిలో కార్టూన్లకు అధిక ప్రాధాన్యత ఇచ్చారు. అది చూసి అన్ని పత్రికలూ అదేబాటలో నడిచాయి. ఇక నాకు చేతినిండా పనే. ఏ సీజన్‌కు ఆఫుల్‌పేజీ కార్టూన్లు, ఏపండక్కి ఆ ఫుల్‌పేజీ కార్టూన్లు ఇలా ఆయా సందర్భాలకు కార్టూన్లు వెంటవెంటనే వేసి ఎడిటర్‌గారికి పంపించేదాన్ని. అన్నీ ఆంధ్రభూమి వీక్లీలో ప్రచురించబడేవి.

ఆంధ్రభూమి వీక్లీతోపాటు పత్రి, జ్యోతి, ప్రభ వీక్లీలకు, యువ, జ్యోతి మంత్లీలకు ఎక్కువ కార్టూన్లు వేస్తుండేదాన్ని. ఇలా నా పేరు పాపులర్ కాసాగింది. ఆ సమయంలో ఒక మోసగాడు తానే రాగతి పండరినని నా పేరు ఉపయోగించుకోసాగాడు. నేను లేడీ కార్టూనిస్టునని అప్పటికి ఎవరో కొద్ది మందికి తప్ప చాలా మందికి తెలియదు. అతను కొంతమందిని కలుసుకొని తను కార్టూన్లు గీసే రాగతిపండరినని, మూర్ఛరోగినని, ఈ వూరు వచ్చి మధ్యలో మూర్ఛవచ్చి పడిపోతే ఎవరో తన బ్యాగు, పర్సుకొట్టేశారని, విశాఖపట్నం వెళ్లడానికి జేబులో చిల్లిగవ్వ లేదని, ఎంతోకొంత సాయంచేస్తే ఊరు వెళ్లి తిరిగి వారి డబ్బు వారికి ఎం.ఓ చేస్తానని చెప్పేవాడట. అరే పత్రికల్లో కార్టూన్లు వేసే రాగతి పండరి ఇతనా.. అని కొందరు ఆశ్చర్యంతో, ఒంకొందరు అభిమానంతో ఎంతో కొంత ఇస్తే, మరికొందరు భారీగా సాయంచేసేవారంట. ఆ తర్వాత అతను మరి అడ్రస్ లేకుండా పోయేవాడని తెలిసింది. తెనాలి, బాపట్ల , విజయవాడ ఇలా కొన్ని ఊళ్లలో ఇలాంటి మోసం జరిగింది. ఆనక ఎప్పటికో అతను రాగతి పండరి కాదని, తాము మోసపోయామని తెలిసి కొందరు నాకు లెటర్లు రాశారు. జరిగింది తెలిసి నేను చాలా బాధపడ్డాను. నా పేరుతో ఇలా మోసం చేయడం అసలు నేను నమ్మలేనంత ఆశ్చర్యానికి గురిచేసింది. నాపేరుతో ఎవరు వచ్చినా అలా నమ్మి మోసపోవద్దని నా అభిమానులకు లెటర్లు రాస్తూ వారికి తెలిసిన వారికి కూడా ఈ విషయం చెప్పమని రాశాను.

ఇదే షయాన్ని శ్రీ గోలి శంకరరావు కూడా నాకు లెటర్ రాస్తూ ఒక మంచి సలహా ఇచ్చారు. పండరి గారూ మీరు లేడీ కార్టూనిస్టన్న విషయం ఏ కొద్ది మందికో తప్ప చాలా మందికి తెలియదు. స్త్రీ కార్టూనిస్టన్న విషయం పాఠకులకు తెలియాలి. అంచేత మీరు ఇకపై మీ ఫుల్‌పేజీ కార్టూనలకు తప్పనిసరిగా మీపేరు ముందర కుమారి రాగతిపండరి విశాఖపట్నం అని కూడా రాయండి. అప్పుడు ఇలాంటి మోసాలకు తావుండదు. అప్పుడే లేడీ కార్టూనిస్టులు ఒకరైన ఈ ఫీల్డులో మీరొకరున్నారన్న విషయం తెలుస్తుంది. అంటూ రాశారు. అప్పటి నుండీ నా కార్టూన్లలో ఫుల్‌పేజీ కార్టూన్లకు కుమారి రాగతి పండరి విశాఖపట్నం అంటూ రాసుకోసాగాను.

ఆ రోజుల్లోనే శ్రీ గోలి శంకరావుగారికి ఆంధ్రభూమి వీక్లీలో ఆర్టిస్టుగా జాబ్‌వచ్చింది. ఆయన వెంటనే తెనాలినుండి హైదరాబాదు వచ్చి వారి బ్రదర్ ఇంట్లో ఉంటూ జాబ్‌లో చేరినట్లు నాకు లెటర్స్‌లో రాశారు. అదే సమయంలో మద్రాసులో ఒక సినీ పత్రికకు రిపోర్టరుగా వర్క్ చేస్తున్న శ్రీ ఎల్యా నారాయణ్రావుగారితో లెటర్స్ ద్వారా నాకు పరిచయం కలిగింది.

అతను మంచి హాస్య రచయిత కొద్ది రోజుల్లోనే ఆయన నాకు మంచి ఫ్రెండ్ అయిపోయారు. ఆయన చక్కగా లెటర్స్ రాసేవారు. నేను కూడా అంత చక్కగానూ జవాబులు రాసేదాన్ని. ఇద్దరం కలిసి ఒక కార్టూన్ కళ వేయాలని అనుకున్నాం. వెంటనే ఆయన ఒక చక్కటి హాస్యకథ రాసి నాకు పంపించారు. నేను దాన్ని నాలుగు పేజీల కార్టూన్ కథగా బొమ్మలతో మలిచాను. ఆ కథలోనే ఓ పొడుగమ్మాయి, ఓపొట్టమ్మాయి సృష్టి జరిగింది. దాన్ని బట్టతలపై భాగ్య కిరణం అనే టైటిల్‌తో సంక్రాంతి ఆంధ్రభూమి వీక్లీకి పంపడం జరిగింది. అది ఎడిటర్ శ్రీ కనకాంబరరాజుగారికి ఎంతోబాగా నచ్చింది. ఆయన వెంటనే నాకు లెటర్ రాశారు. అది ఆంధ్రభూమి సంక్రాంతి సంచికలో ప్రచురణకు తీసుకున్నాం. ఇలాంటి కార్టూన్ కళలు ముందుముందు ఇంకా ఇంకా పంపిస్తూ ఉండండి. మీకు నా ప్రోత్సాహం ఎప్పుడూ ఉంటుందని రాశారు.

*ఆంధ్రభూమి నుండి ఎడిటర్ శ్రీ కనకాంబరరాజుగారు నాకు లెటర్ రాశారు. సికరాజకీయం అని ఆయన రాస్తున్న ఎడిటోరియల్ దగ్గర సింగిల్ కాలంలో వారం వారం ఒక రాజకీయ కార్టూన్ వేయమని కోరారు. నేను విస్తుపోయాను.*

ఇక నా ఆనందానికి అవధులు లేవు. వెంటనే ఎల్యూ నారాయణ గారికి రాశాను. ఆయన కూడా ఎంతో సంతోషించారు. హాస్య కథలు రాసి నాకు పంపిస్తూ ఉండేవారు. అవి నేను బొమ్మలతో కార్టూన్ కళలు రాసి నాకు పంపిస్తూ ఉండేవారు. అవి నేను బొమ్మలతో కార్టూన్ కథలు మంచి పాపులర్ అయ్యాయి. ఎంతో మంది నాకు స్వయంగా లెటర్స్ రాసేవారు. కార్టూన్ కథలు ఎంతో బావుంటున్నాయంటూ ఆ ఇద్దరమ్మాయిల చేష్టలు, డైలాగులు, హావభావాలు చూసి నవ్వాపుకోలేకపోతున్నాం అంటూ తెగమెచ్చుకొనేవారు.

నా కార్టూన్ల అభివృద్ధికి అమ్మ, అన్నయ్య, వదిన, రమక్క ఎంతో ఆనందించారు. రమక్క కథలు కొద్దికొద్దిగా పత్రికల్లో రాసాగాయి. అక్క అప్పుడు ఎంఏ చదువుతుండేది. నేను ఇంట్లోనే ట్యూషన్ ద్వారా ఇంటర్ వరకు కోచింగ్ తీసుకొని పరీక్ష రాయలేదు. ఇంట్లో బాగానే నడవడమే గాక చిన్నచిన్న పనులు చేస్తుండేదాన్ని. బయటకు వెళ్లేది తక్కువే అయినా ప్రపంచాన్ని అర్థంచేసుకోవడానికి ప్రయత్నించేదాన్ని. నాలో ఉన్న భయాన్ని, బిడియాన్ని తగ్గించుకొని నాకోసం ఎంతో అభిమానంతో చూడాలని వచ్చే అభిమానులను, మిత్రులను సాదరంగా ఆహ్వానించి (లేనని పంపించకుండా) మాట్లాడేదాన్ని. ఈవిధంగా విశాఖ నౌకా నిర్మాణ కేంద్రంలో పనిచేస్తున్న ప్రముఖ కార్టూనిస్టు శ్రీ బి.ఎన్. రాజుగారితో పరిచయం కలిగింది. ఆయన గొప్ప కార్టూనిస్టే కాక మంచి ఆర్టిస్టు కూడా. సరదాగా, నిర్మొహమాటంగా మాట్లాడే ఆయన మాటలు వింటుంటే అసలు టైమే తెలియదు. ఆయన ద్వారా కొంతమంది కార్టూనిస్టులతో నాకు పరిచయం కలిగింది. విశాఖలో కూడా అప్పుడప్పుడు కార్టూనిస్టుల సమావేశాలు కార్టూన్ ఎగ్జిబిషన్‌లో జరిగేవి. కార్టూనిస్టులంతా ఉత్సాహంతో కార్టూనిస్టుల ఎగ్జిబిషన్ నిర్వహించారు. నా వంతుగా నేను ప్రత్యేకంగా కొన్ని కార్టూన్లు వేసి ఎగ్జిబిషన్ కోసం ఇచ్చేదాన్ని.

ఆంధ్రభూమి నుండి ఎడిటర్ శ్రీ కనకాంబరరాజుగారు నాకు లెటర్ రాశారు. సికరాజకీయం అని ఆయన రాస్తున్న ఎడిటోరియల్ దగ్గర సింగిల్ కాలంలో వారం వారం ఒక రాజకీయ కార్టూన్ వేయమని కోరారు. నేను విస్తుపోయాను. రాజకీయాల గురించి ఓనామాలు కూడా తెలియని నేనేంటి, రాజకీయ కార్టూన్లు వేయడమేంటి... ఆవిషయమే ఎడిటర్‌గారికి లెటర్ రాశాను. సార్ నాకు రాజకీయాల గురించి బొత్తిగా తెలియదు. మీరిస్తున్న ఈ అవకాశానికి నేను న్యాయం చేయగలనా అని భయపడుతున్నాను అంటూ రాశాను. కానీ ఎడిటర్‌గారు ఊరుకోలేదు. పండరీ నువ్వు తప్పక రాజకీయ కార్టూన్లు కూడా వేయగలవు, నాకా నమ్మకం ఉంది... అంటూ నన్ను ఎంక్రేజ్ చేయడమే కాక కొండంత ధైర్యం చెబుతూ లెటర్ రాశారు.

*మిగతా రాబోయే సంచికలో...*



# తరం మారినా స్వరం మారని
# నిత్య గాంధర్వ బాలుడు బాలసుబ్రహ్మణ్యం



**'ఏదో ఒక రాగం' ఎల్ల వేళలా మోసే పాటల పల్లకి... సదా పల్లవిస్తూనే ఉంటూన్న నిత్యగాన పల్లవి... సినీ సంగీత సాగరంలో ఐదు దశాబ్దాలుగా వెల్లువెత్తుతున్న తర'గని' గాన తరంగం... లోతైన బావుకతను పలికే 'స్వరం'గం-శ్రీపతి పండితారాధ్యుల బాలసుబ్రహ్మణ్యం- సర్వ కాలాల స్వర బాలుడు...**

**మేరు పర్వత సదృశ వీనుల పర్వం...**
**నిలువెత్తు గాన గాంధర్వం...**
**తెలుగుజాతి నేపథ్యగాన సగర్వం.**

'మాటే రాని చిన్న దాని కళ్ళుపలికే ఊసుల్ని' మోసు లెత్తించినా... తెలుగు పదానికి జన్మదినమై, జానపదానికి జ్ఞానపదమై నదమై నన లెత్తినా...పుణ్యభూమిని మనసాస్మరించినా...'ఈ నేల మనదిరా, ఆ నింగి మనదిరా' అని అరుణ రాగాలను నేపథ్య సంగీతానికి అద్దినా – అది చెల్లిందొకరికే–బాలూకు! ముఖంలో ఎప్పుడూ కదలాడే చిరునవ్వు, అలసట ఎరుగని నిరంతర 'తరం'తర కృషికి ని'దర్శనం'కాగా, సుమధుర సంగీతానికి నిధియై... పాటంటే చెవి కోసుకునే వారి పెన్నిధియై పులకింపజేస్తున్నారు, బాలు.

పొట్టి శ్రీరాములు నెల్లూరుజిల్లాలో సాధారణ బ్రాహ్మణ కుటుంబంలో 1946 జూన్ 4న పుట్టిన బాలు, చెవి కోసుకునే అలవాటును చిన్ననాటినుంచీ అలవరచుకున్నారు. కారణం, పారంపరికంగా వచ్చిన తండ్రి ఎస్.పి. సాంబమూర్తి హరికథా గాన స్ఫూర్తి. సరదాగా పాడుకొంటూ ఉండే 'బాల' సుబ్రహ్మణ్యంకు పెద్దయ్యాక ఆపాటే జీవితపు బాట కావడం విశేషం. కాలేజీ రోజుల్లో రఫీ, జానకిల పాటలు పాడి అనేక బహుమా నాలందుకున్నారు ఎస్.పి. అంతే కాకుండా తండ్రి కూర్చిన కవితలనుస్వరపరచి గేయాలుగా పాడుతూండేవారు. తండ్రికోరిక మేరకు ఇంజినీరు కావడానికి 1963లో చెన్నై వెళ్లి ఎ.ఐ.ఎం.ఇ., కోర్సులో చేరిన బాలు, ఆంధ్రాక్లబ్ నిర్వహించిన 'కళాసాగర్' అమెచూర్ సింగర్స్ పాటల పోటీలో పాల్గొని అప్పటి సినీ సంగీత ప్రముఖులు ఘంటసాల, పెండ్యాల, సువర్ణల న్యాయనిర్ణేతకత్వంలో ప్రథమబహుమతి సాధించి సినీ సంగీత దర్శకుల దృష్టిలో పడ్డారు. ప్రముఖ సినీ సంగీత దర్శకుడు ఎస్.పి. కోదండపాణి 'శ్రీశ్రీశ్రీ మర్యాద రామన్న' చిత్రంలో బాలూకు నేపథ్యగానావకాశం కల్పించారు. కృతజ్ఞతగా కోదండపాణి జ్ఞాపకార్థమని అత్యాధునిక సౌకర్యాలతో ఓ ఆడియోలాబ్ నెలకొల్పారు, బాలు.

'ఏమి ఈ వింత మోహం' అంటూ తొలి పాట పాడిన బాలు, తన పాట పట్ల ఒక వింత మోహాన్ని శ్రోతల్లో కలిగించారు. మొదట్లో బాలు స్వరం మరీ లేతగా, పేలవంగా ఉందని చాలామంది భావించినా, నిరాశ చెందకుండా 'గుంతలకిడి గుంతలకిడి' అంటూ హుషారుగా ముందుకు సాగారు బాలు. అప్పట్నించీ అలా మును ముందుకూ, మన





ముందే సాగుతూ.. .న్నారు.

నాకైతే నా చిన్న తనంలో విన్న ఆ లేత స్వరంలో ఒకానొక ఆకర్షణే గోచరమైంది. నాకంటే నాలుగేళ్ల చిన్నవాడైన నా సోదరుడ్ని ఏడిపిస్తూ, "నీపాపం పండెను నేడు... నీ భరతం పడతా చూడు" అంటూ నాలుగు ఉతికేసిన సందర్భాలు ఇప్పుడు గుర్తుకొస్తున్నాయి. ఘంటసాలకు, బాలూకు సంధికాలం అది. బాలసుబ్రహ్మణ్యం కంటే ఘంటసాల పాటలు బాగుంటాయనేవారు మా పెద్దలు. నాకైతే బాలూవే నచ్చేవి. ఆ పాటలే కూని రాగాలూరుతుండేవి నా గొంతులో.

గాయకుడిగా బాలు తొలి దశకంలో ఉన్న లేలేత స్వర మధురిమ మలి దశకంలో సంతరించుకున్న బొంగురు దనంతో (అది వయసు ప్రభావమే కావచ్చు) నా బోటి వారికి నిరాశ కలిగించినా, కొంతకాలానికి 'అసలు కంఠం' స్వరపడి, తిరిగి మైమరపించింది. హీరో కృష్ణకు అప్పట్లో బాలూ గొంతు అతికినట్లుగా సరిపోయేది. దాంతో మొదట్లో కృష్ణ చిత్రాలకు నేపథ్యగానం బాగా చేశారు బాలు. 'విశాల గగనంలో చందమామ'ను పాలరాతి మందిరాన', 'కలలు కనే చిన్నారి'లకు పట్టిచ్చారు. 'పాలపిట్ట పాలపిట్ట వెంట నీకు పరుగూ లెందుకు?' అంటూనే, కుర్రకారును తన వెంట పరుగు లెట్టించుకున్నారు బాలు పాటల వల్లే ఆయన ఫాన్స్‌లో చాలామంది కృష్ణకు దొరికారంటే అతిశయోక్తికాదు.

తన రెండవ పాట 'నక్కరే అడిత స్వర్గ'తో కన్నడంలోనూ, ఎమ్మెస్ విశ్వనాథం సంగీత నిర్వహణలో 'హోటల్ రంభ'చిత్రంతో తమిళంలోను మొట్ట మొదటగా పాడారు బాలు. ఎల్.వి.ప్రసాద్ కల్పించిన అవకాశంతో 'ఏక్ దూజ్ కౌ లియే' చిత్రంలో 'తేరే మేరే బీచ్ మె కైసా హై యె బంధన్ అంజానా' అన్న పాటను హిందీలో మొదటిసారిగా పాడారు బాలు. ఆ విధంగా తెలుగు, కన్నడ, తమిళ, మళయాళ, తులు భాషల్లో ప్రముఖంగాను, దాదాపు మరో ఆరేడు జాతీయ భాషలలోను ఇప్పటికే ముప్పై ఆరు వేల పాటల వరకు పాడారు, బాలసుబ్రహ్మణ్యం.

'ప్రతి రాత్రి వసంత రాత్రి' అని ఘంటసాలతో గొంతు కలిపిన బాలు, తెలుగులో ఆనాటి మేటి నటులైన ఎ.ఎన్నార్, ఎన్.టి.ఆర్‌లకు పాడడానికి మాత్రం 'ఎన్నాళ్ళో వేచిన హృదయం'తో ఎదురు చూశారు. (తమిళంలో అయితే మొదటే ఎం.జి.ఆర్‌కు పాడే అవకాశం వచ్చింది). చివరికి 'కోడలు దిద్దిన కాపురం'లో 'నిద్దురపోనా పిల్లా'అని మొదలుపెట్టి 'ఎయ్‌రేఖా... శశిరేఖా' అంటూ రేగిపోయి, 'చిలకొట్టుడు'ల రుచి చవిచూపించారు. 'కృషి ఉంటే మనుసులు ఋషులవుతారు...' 'జననీ జన్మభూమిశ్చ' వంటి ప్రబోధాత్మక పాటలతో రామారావు నటనా గాంభీర్యానికి గాత్ర గాంభీర్యాన్ని అందించారు బాలు. 'నా హృదయపు కోవెలలో... ఆనందం నిండాలి... అనురాగం పండాలి' అంటూ 'ఇద్దరమ్మాయిలు'తో మొదలెట్టి,తర్వాత కొంచెంముక్కుతో పలుకుతూ, 'వందనం... అభివందనం' అనిపించుకుని, ఏ.ఎన్నార్ నట సరళిని తన గొంతులో పలికింపజేశారు. ఇంకా







తర్వాత్తర్వాత చిరంజీవి, బాలకృష్ణ, వెంకటేష్, నాగార్జునులకు కొండంత స్వర బలాన్నిచ్చి, నేటి తరంలో పవన్‌కళ్యాణ్ వంటి కొత్త హీరోలకు కూడా ఇంకా వన్నె తగ్గకుండా పాడగలగడం నిజంగా ఆయనే చెప్పుకున్నట్లు, "తన స్వరం ఒక వరం". దీనికంతకీ కారణం బాలు ధ్వన్యనుకరణ చేయగలగడమే.

నేపథ్య గానంలో మిమిక్రీని మించి ఆయా నటుల కంఠాన్ని పాటల్లో పలికించి ఒక కొత్త ట్రెండ్ సృష్టించారు బాలు. మహామహా నటుల నుంచి సత్యనారాయణ, చంద్రమోహన్, రంగనాథ్ వంటి

క్యారెక్టరు ఆర్టిస్టులు, రాజబాబు, అల్లు రామలింగయ్య, బాబూమోహన్ వంటి హాస్య నటులకు కూడా వారే స్వయంగా పాడుతున్నారనిపించేంత విస్మయాన్ని కలిగిస్తూ, సహజ స్వరంతో పాడి బాలు మెప్పించారు. 'రంగమ్మా నువ్వు ఉతుకుతుంటే అందం... అబ్బ వేశావే బంధం', 'కంకంకం కాకినాడ రేవులో ఓడెక్కి' అని పాడుతుంటే రాజబాబే పాడుతున్నాడనిపించేది. 'రంజు బలే రాంచిలకా' అంటే అల్లు హాస్య నటనలోని అరుపులు సాక్షాత్కరించేవి. 'కొద్ది కూడుంటే ఎట్టమ్మ' అంటుంటే స్వయంగా బాబూమోహనే అడుక్కుంటున్నట్లుగా అనిపిస్తుంది. సినిమాల్లో ఆయా పాటలు వస్తున్న సందర్భాల్లో బాలు గొంతు మరుగున పడిపోయి, ఆయా నటుల గొంతులే మన చెవుల్లో ప్రతిధ్వనిస్తున్నాయనిపించేంత భ్రాంతికి మనల్ని గురిచేయగల గాత్ర మాంత్రికుడు బాలు, గొంతులు మార్చి మార్చి, ఏమార్చగల స్వర తాంత్రికుడు. పాటే కాదు, ఎందరికో డబ్బింగ్‌తో తన మాటను కూడా ఎరువిచ్చారు బాలు. తెలుగురాని ఎందరో హీరోలకు, నటిస్తూ వారే మాట్లాడుతు న్నారనిపించేలా డబ్బింగ్ ఇచ్చారు. కమలహాసన్, భాగ్యరాజా, విసు, రాజేందర్, కులభూషన్, కర్బందా వంటి వారెందరికో డబ్బింగ్ చెప్పారు బాలు.



'కన్యాకుమారి' చిత్రం కోసం 'ఇది తొలిపాట' అంటూ మొట్టమొదటి పాటను స్వరపరచిన బాలు, బాపూ, 'తూర్పు వెళ్ళేరైలు' ఎక్కి సంగీత దర్శకునిగా పరిచయమయ్యారు. వివిధ భాషల్లో యాభై చిత్రా లకు పైగా సంగీత దర్శకత్వం వహించారు. తెలుగులో కన్యాకుమారి, రారా కృష్ణయ్య, మాయావి, పడమటి సంధ్యా రాగం, జాకీ వంటి చిత్రాలు ఆయన సంగీత దర్శకత్వంలో మచ్చుతునకలు. 'చుట్టూ చెంగావి చీర కట్టావే చిలకమ్మా', కో అంటె కోయిలమ్మకూ కూ', పెబరే రామ రసం', 'ఈ తూరుపు ఆ పశ్చిమం', 'అలా మండిపడకే జాబిలీ' వంటి పాటలు బాలు సంగీత దర్శకత్వానికి మచ్చుతునకలు. 'అలా మండి పడకే జాబిలి'కి ఫ్లూట్ చిట్స్‌తోను, పెబరే రామ రసం' 'ఆ తూరుపు' పాటలకు పియానో వాయిద్యపు వాయులీనానుసరణతోను తన సంగీత పర్యవేక్షణ ప్రత్యేకతను చాటి చెప్పారు బాలు. వైవిధ్యభరితమైన సంగీతంలో 'కళ్ళు' చిత్రంలోని ఛాయాగ్రహణం సొంపుకు, కథనంలోని ఇంపుకు సరిపోయేలా బాణీలు కూర్చి చూపారు.

శాస్త్రీయ సంగీతం నేర్చుకోకపోయినా, పాట పట్ల చిన్నతనం నుంచీ చూపిన మక్కువ బాలూను తిరుగులేని గాయకుణ్ణి చేసింది. 'ఏ దివిలో విరిసిన పారిజాతమో', 'శివరంజనీ... నవరాగిణీ', 'చరణ కింకిణులు ఘల్లుఘల్లు మన', 'ఝుమ్మంది నాదం' వంటి పాటలు బాలు సంగీతాభినివేశానికి నిదర్శనాలు. శాస్త్రీయ సంగీత మాధారంగా కూర్చిన పాటలను కూడా బాలు అవలీలగా పాడగలరని నిరూపించిన చిత్రం 'శంకరాభరణం', ఆ చిత్రాన్నొక సంగీత రసఘురిగా మలచి, జాతీయ, అంతార్జతీయ పురస్కారాలెన్నో పొంది, శాస్త్రీయ సంగీతారాధకుల ప్రశంసలందుకున్నారు బాలు. పాటంటే ప్రాణమైన బాలు, తన కుమార్తెకు 'పల్లవి' అనీ, కుమారునికి 'చరణ్' అని పేర్లు పెట్టుకున్నారు.




శంకరాభరణంతో (1979) మొదలుపెట్టి 'ఏక్‌దూద్ కౌలియే' (హిందీ1981), సాగర సంగమం( 1983), రుద్రవీణ(1988), 'ఉమెండ ఘుమండ ఘన గరణే బరరా' (కన్నడం 1996) చిత్రాల పాటలకు ఐదు సార్లు జాతీయ అవార్డు లందుకున్నారు బాలు. 1990 నుండి ఇప్పటి వరకు ఎన్నో కళాసంస్థల ఉత్తమ గాయక అవార్డులను, ఆంధ్రప్రభుత్వ 'నంది' అవార్డులను పొందారు. నేపథ్య గానానికే కాకుండా సంగీత దర్శకత్వానికి, గాత్రధారణకు కూడా ఎన్నో అవార్డులందుకున్నారు బాలు.

గొంతుకు సంబంధించిన నేపథ్య గానమూ, డబ్బింగులకే పరిమితం కాక, నటనను, చిత్ర నిర్మాణాన్ని కూడా చేపట్టారు బాలు. చిత్రదర్శకత్వం నెరపడానికి సంసిద్ధులవుతున్నారు. బాల్యం నుంచీ నాటకాలలో వేషాలేసిన బాలు, 'మహమ్మద్ బీన్ తుగ్లక్' చిత్రంలోని గాయక పాత్రతో మొదలుపెట్టి 'పక్కింటి అమ్మాయి', 'మల్లెపందిరి', 'అస్త్రం', 'ఆరో ప్రాణం', 'ప్రేమ' వంటి ఎన్నో చిత్రాలలో తన సహజ నటనతో ప్రేక్షకులను అలరించారు. 'గుణ', 'శుభ సంకల్పం' చిత్రాలను నిర్మించారు.

కొత్తగాయకులనుఉత్సాహపరచి, ప్రోత్సహించేందుకుగాను ఈటీవీ, జెమిని చానెళ్ళలో 'పాడుతా తీయగా', 'ఎందరో మహానుబావులు' వంటి కార్యక్రమాలను రూపొందించి వందల ఎపిసోడ్లను నిర్వహిస్తున్నారు. ఒకప్పుడు ఘంటసాల లేకపోతే ఎలా అనుకున్నారు. రేపు బాలు లేకపోతే ఎలా అన్న ప్రశ్న రావచ్చు. అందుకే మరుగున పడి ఉన్న ప్రతిభను వెలికి తీయాలనే సత్సంకల్పంతో కొత్త కొత్త గాయనీ గాయకులను ప్రోత్సహిస్తూ నిర్వహిస్తున్నారీ కార్యక్రమాలు.

మంచి పాటకు మంచి సాహిత్యమే ప్రాణమని నమ్మే బాలు–పాట కలకాలం నిలచి ఉండాలంటే ఇంపైన సంగీతం ప్రధాన మంటారు. నేడు సినీ సంగీతంలో వస్తున్న వింత వింత శబ్దాల హోరు, సాహిత్యంలో వస్తున్న బూతుల జోరు తగ్గి భవిష్యత్తులో పాట మళ్ళీ సర్వాంగ సుందరంగా వికసించగలదనే ఆశాభావాన్ని వ్యక్త పరుస్తున్నారు బాలు. అశ్లీల సాహిత్యంతో ఉన్న పాటలను పాడనని ప్రమాణం చేసుకుని, మంచి పాటలు కావాలనుకునే శ్రోతలకు ఆనందాన్ని పంచుతూ తన స్వర ప్రస్థానంలో నేటికీ అజరామరంగా... అనితర సాధ్యంగా సాగుతున్నారు ఎస్.పి. సుమారు అర్ధ శతాబ్దంగా చిత్ర సీమ విస్తృత పరిధిలో విశృంఖల స్వైర విహారం చేస్తున్న బాలు, స్వరసామ్రాట్టుగా నిలుస్తారనడంలో ఏ సందేహమూ అవసరం లేదు.

నేపథ్య సంగీతంతో పాటు చిత్ర సీమకు సంబంధించిన డబ్బింగ్ ఆర్టిస్టుగా, సహజ నటునిగా, చిత్రనిర్మాతగా ఆ రంగాన్ని ప్రభావితం చేస్తున్న ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం – 'నటరాజ శత సహస్ర రవితేజుడు... నటగాయక వైతాళిక ప్రేక్షక జన మానస చోరుడు'.

## ఎస్.పి. బాలు

నారద – తుంబురుడు అన్నా... 'గాన గంధర్వుడు" అన్నా... తక్కువే అనిపించేంత ఎక్కువగా పాడగలుగుతున్న మహాగాయకుడు మన బాల సుబ్రహ్మణ్యం.

జానపదమైనా, జ్ఞానపదమైనా అక్షరమాలను సుస్వరమాలగా మలచగలిగిన మహిమగల గానం బాలు గారి సొంతం.

సంగీత సాధనలో తనని తాను ఇంకా బాలునిగానే భ్రమించి, నిత్యం శ్రమించి స్వరసాధన చేసే నిరంతర స్వర విద్యార్థి బాలు.

కాళిదాసు మొదలు త్యాగయ్య, క్షేత్రయ్య, అన్నమయ్య, రామదాసులకు వారసుడే అనిపిస్తారు ఈ "బాలు"డు.

స్వరసోపానాలను అధిరోహించి ఎంతో ఎత్తుకు ఎదిగిన మహోన్నతుడు ఈ "బాలు"డు.

ఘంటసాలగారి తరువాత తెలుగుపాటకు ఉత్తరాధికారిగా నిలబడి తెలుగుపాటను సమర్ధవంతంగా కా"పాడు"తున్న వ్యక్తి మన బాలు.

*బి.ఎం.పి. సింగ్*

# తెలుగు నాటికా వైభవం-నూరేళ్ళ నాటికకు నీరాజనం

**తెలుగు నాటక రంగాన్ని కళాకారులే బతికించుకోవాలని ఎండోమెంట్స్ (రెవెన్యూ) ప్రిన్సిపల్ సెక్రటరీ డాక్టర్ కేవీ రమణాచారి సూచించారు. అరవింద ఆర్ట్స్, ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ ఆధ్వర్యాన 'తెలుగు నాటికా వైభవం-నూరేళ్ళ నాటికకు నీరాజనం' పేరుతో విజయవాడ తుమ్మలపల్లి కళాక్షేత్రంలో డిశంబరు 17 నుండి 19 వరకు నిర్వహించిన ఉత్సవాలను, శుక్రవారం కేవీ రమణాచారి ప్రారంభించి, మాట్లాడుతూ నాటకాన్ని ఇప్పుడు బతికించుకోలేకపోతే, ఎందుకు బతికించుకోలేక పోయామా? అని విచారించాల్సి వస్తుందన్నారు.**




వైద్యుడు రోగులకు మాత్రమే వైద్యం చేస్తే రచయిత సమాజంలోని రుగ్మతల పరిష్కారానికి కృషి చేస్తాడన్నారు. ప్రముఖ సినీ రచయిత, నటుడు పరుచూరి వెంకటేశ్వరరావు మాట్లాడుతూ పదేళ్లకు ప్రతి పదేళ్లలో ప్రదర్శించిన వాటిలో ఉత్తమబహుమతి పొందిన నాటికలను విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్ ప్రచురిస్తే సహాయం అందిస్తానన్నారు. ప్రముఖ రచయిత, నటుడు తనికెళ్ల భరణి మాట్లాడుతూ తెలుగు నాటికా వైభవం పేరుతో నిర్వహిస్తున్న ఈ కార్యక్రమాలను చూస్తే శ్రీ కృష్ణదేవరాయల సాహితీ వైభవం గుర్తుకు వస్తోందన్నారు. నటుడు, రచయిత ఎల్‌బీ శ్రీరామ్ మాట్లాడుతూ ఈ మూడురోజుల కార్యక్రమాలు చరిత్రలో చిరస్థాయిగా నిలిచిపోతాయన్నారు. నాటక రచయిత, నటుడు రావికొండల రావు, పారిశ్రామిక వేత్త గోకరాజు గంగరాజు మాట్లాడారు. ఈ సందర్భంగా ప్రముఖ రచయితలు రచించిన 108 నాటికల సంకలనాలను 'ప్రసిద్ధ తెలుగు నాటికలు', 'ప్రసిద్ధ తెలుగు హాస్య నాటికలు' పేరుతో ఆవిష్కరించారు. అదేవిధంగా 1912లో శృంగార కవి సర్వారాయుడు రచించిన తొలి తెలుగు నాటికా సంపుటి 'సివిక్స్ డ్రామాలు' పుస్తకాన్ని, నాటక రంగ విశేష సంచిక 'రూపిక'ను కూడా ఆవిష్కరించారు. అభ్యుదయ రచయితల సంఘం అధ్యక్షుడు పెనుగొండ లక్ష్మీనారాయణ అధ్యక్షతన జరిగిన ఈ కార్యక్రమంలో విశాలంధ్ర జనరల్ మేనేజర్ వై.చెంచయ్య, మేనేజర్ బి. ఈశ్వర రెడ్డి, బి.జయప్రకాష్ పాల్గొన్నారు. ఈసందర్భంగా రచయితలు డీవీ రమణమూర్తి, జీవనశ్రీ, రావికొండలరావు, ఎన్.తారకరామారావు, ఆచార్య కొలకలూరి ఇనాక్, ధవళ సన్యాసిరావు, కేవీ బలరామమూర్తి, కాశీవిశ్వనాథ్, శ్రీరాజ్, ఎంవీఎస్ హరనాధరావు, ఎస్‌ఏ రావు, ఆకెళ్ల పల్లెటి లక్ష్మీకులశేఖర్, వైఎస్ కృష్ణేశ్వరరావు, ఎల్‌బీ శ్రీరామ్, అత్తలూరి విజయలక్ష్మి, చిత్రకారులు చంద్ర, బాలి,




రామారావు, టీవీ, ఆర్. గిరిధర్‌గౌడ్‌లను నిర్వాహకులు సత్కరించారు. అనంతరం హైదరాబాద్‌కు చెందిన మాధురి ఎడ్యుకేషనల్ అండ్ ఎంటర్‌టైన్‌మెంట్ థియేటర్ అసోసియేషన్ ఆధ్వర్యంలో 'ముగింపు లేనికథ' నాటికను ప్రదర్శించారు. సినీ నటుడు రాళ్లపల్లి రచనా దర్శకత్వం వహించారు.

### ఆకట్టుకున్న ర్యాలీ

తొలుత ఏలూరు రోడ్డులోని విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ నుంచి తుమ్మలపల్లి కళాక్షేత్రం వరకు కళాకారులు భారీ ర్యాలీ నిర్వహించారు. ఈ ర్యాలీలో తనికెళ్ల భరణి, జయప్రకాష్‌రెడ్డి డప్పు వాయిస్తూ నృత్యం చేశారు.

# పరిషత్‌ల వల్లే నాటకం బతికుంది

ప్రేక్షకులు టికెట్ కొని నాటకం చూసినప్పుడే నాటక రంగానికి పూర్వవైభవం సంతరించు కుంటుందని ప్రముఖ సినీనటుడు, నిర్మాత మురళీమోహన్ అన్నారు. 'తెలుగునాటికా వైభవం–నూరేళ్ల నాటికకు నీరాజనం' ఉత్సవాల్లో భాగంగా డిశంబరు18, రెండవరోజు, శనివారం జరిగిన కార్యక్రమంలో మురళీమోహన్ పాల్గొన్నారు. ఈ సంర్భంగా ఆయన మాట్లాడుతూ పరిషత్‌లు ఉండం వల్లే ఇప్పటికీ నాటకరంగం బతికే ఉందన్నారు. 'కాలధర్మం' వంటి మంచి సబ్జెక్టుకు కాలానుగుణంగా స్క్రీన్ ప్లే రూపొందించుకుంటే మంచి సినిమాలు వస్తాయన్నారు. ప్రస్తుత ట్రెండ్‌కు తగినట్లుగా రచనలు లేకపోవడంతో పరభాషా చిత్రాల కథల కోసం వెళ్లాల్సి వస్తోందన్నారు. ప్రముఖ రంగస్తల, సినీ నటుడు మిశ్రో మాట్లాడుతూ నాటికకు నూరేళ్లు నిండినా తీరు మారలేదన్నారు. కళాకారులను ప్రోత్సహించినప్పుడే నాటకరంగం చిరంజీవిగా ఉంటుందన్నారు.

### ఆలోచింపజేసిన నాటికలు

సాయంత్రం ప్రదర్శించిన పలు నాటికలు ఆహూతులను ఆలోచింపజేసే విధంగా ఉన్నాయి. తొలుత నగరానికి చెందిన సుమధుర కళానికేతన్ సంస్థ వారు కందుకూరి వీరేశలింగం రచించిన కన్యాశుల్కం ప్రహసనాన్ని ప్రదర్శించారు. బీఆర్ఎస్ ప్రకాష్ దర్శకత్వం వహించడంతోపాటు నటించిన ఈ ప్రహసనంలో నందగిరి నరసింహారావు, పి.మోహన్‌రామ్‌ప్రసాద్ నటించారు. హెచ్‌వీఆర్ఎస్ ప్రసాద్, పీవీ భాస్కరశర్మ, పీవీఎన్ ప్రసాద్ నిర్వహించారు. అనంతరం విశాఖపట్నానికి చెందిన బహురూప నటసమాఖ్య వారు 'కాలధర్మం' నాటిక ప్రదర్శించారు. శ్రీరాజు రచించిన ఈ నాటికకు ఎస్‌కే మిశ్రో దర్శకత్వం వహించడమే కాకుండా నటించారు. వైజాగ్ ప్రసాద్, ఎంపీ నాగేశ్వరరావు, కేవీబీహెచ్ బాబూరావు, వీఆర్‌జే పంతులు, ఎన్‌నారాయణరాదు, అనూరాధ నటించారు. ఆర్‌కే ఆర్ట్స్ హైదరాబాద్ వారు 'కుక్కపిల్ల దొరికింది' హాస్య నాటికను ప్రదర్శించారు. ఈ నాటికను సినీనటుడు రావి కొండలరావు రచించడంతో పాటు దర్శకత్వం కూడా వహించారు. ఎంపీ దాస్, రాధాకుమారి, గరిమెళ్ల విశ్వేశ్వరరావు, ఆర్‌పీ గంథం, అల్లు రమేష్ నటించారు. చివరగా గుంటూరు నెచ్చెలి సంస్థ వారు 'దొంగాటకం' నాటికను ప్రదర్శించారు. నుసుము కోటిశివ దర్శకత్వం వహించిన ఈ నాటికను విశ్వ నాథ కవి రాజు రచించారు. నుసుము నాగభూషణం, భవానీ, కోటి శివ నటించారు.

### రచయిత ఆలోచించుకోవాలి

ఉదయం 'నూరేళ్ల నాటిక–రచనా వైశిష్ట్యం' అనే అంశంపై సదస్సు జరిగింది. సాహితీవేత్త ఆచర్యకొలకలూరి ఇనాక్ మాట్లాడుతూనాటకం ప్రాకృతంగా ఉండాలా? పరమార్థాన్ని ప్రతిబింబించేలా ఉండాలా? అనేది రచయితలు ఆలోచించాలన్నారు. రావి కొండలరావు మాట్లాడుతూ పోటీ నాటికల వల్ల నాటక రంగం బతికే ఉందనడంలో సందేహం లేదన్నారు. రంగస్థలం నుంచి సినిమా రంగానికి వెళ్లిన రచయితలు తిరిగి ఇటువైపు చూడడం లేదనీ, సినిమా రంగ ప్రవేశానికి దారిచూపించిన రంగస్థలాన్ని మరిచిపోకూడదన్నారు. నటుడు, రచయిత ఎంవీఎస్ హరనాథరావు మాట్లాడుతూ జీవితంలో ఎదురయ్యే అనుభవాలను నటాకంగా మలిస్తే ఆదరణ లభిస్తుందన్నారు. నాటక రచయిత, అరసం రాష్ట్ర కార్యదర్శి విరియాల లక్ష్మీపతి అధ్యక్షత వహించిన ఈ సదస్సులో ఎన్. తారకరామారావు, కేవీ బలరామమూర్తి, కాశీవిశ్వనాథ్, ఎస్‌పీ రావు, ఆకెళ్ల, అత్తలూరి విజయలక్ష్మి, కళ్యాణి తదితరులు ప్రసంగించారు.





'కుక్కపిల్ల దొరికింది' నాటికలోని ఓ సన్నివేశం

# తెలుగు నాటిక గొప్పది

**సమాజాన్ని ప్రభావితంచేసి ఆలోచింపజేసే నాటిక గొప్పదని రాష్ట్ర గ్రంథాలయ సంస్థ చైర్మన్ పద్మశ్రీ తుర్లపాటి కుటుంబరావు పేర్కొన్నారు. అరవింద ఆర్ట్స్, ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం, విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్ ఆధ్వర్యంలో మూడు రోజులపాటు తుమ్మలపల్లి కళాక్షేత్రంలో జరిగిన 'తెలుగు నాటికా వైభవం-నూరేళ్ల నాటికకు నీరాజనం' ముగింపు సభ 19-12-10 ఆదివారం జరిగింది. సభకు ముఖ్య అతిధిగా విచ్చేసిన తుర్లపాటి మాట్లాడుతూ సామాజిక సమస్యల పరిష్కారాన్ని ఎత్తిచూపే నాటికలు ఎక్కువగా రావడం మంచి పరిణామమన్నారు.**

నాటికా వైభవం మొదటిరోజు ఆవిష్కరించిన నాటికల సంకలనాలను గ్రంథాలయ సంస్థ ద్వారా కొనుగోలుచేసి పాఠకులకు అందుబాటులో ఉండే విధంగా కృషిచేస్తానన్నారు. సభకు అధ్యక్షత వహించిన ప్రముఖ రచయిత డి. విజయభాస్కర్ మాట్లాడుతూ సినిమాలు చూసి చెడిపోయేవారు ఉంటారేమో గానీ, నాటకాలను చూసి చెడిపోయేవారు ఉండరన్నారు. ప్రముఖ రంగస్థల సినీ నటుడు కాకరాల మాట్లాడుతూ తెలుగునాటక వికాసాన్ని వైభవంగా భావించవచ్చన్నారు. మరో అతిధిగా అభ్యుదయ రచయితల సంఘం రాష్ట్ర కార్యదర్శి పెనుగొండ లక్ష్మీనారాయణ మాట్లాడుతూ భవిష్యత్ కళా ప్రచారోద్యమానికి నాందిగా ఈ మూడు రోజులు కార్యక్రమాలు దోహదపడతాయన్నారు. ఈ సందర్భంగా పలువురు రచయితలను, నటీనటులను నిర్వాహకులు సత్కరించారు. సభానంతరం శ్రీ సాయి కార్తీక్ క్రియేషన్స్ వారు ప్రదర్శించిన 'రాయి' నాటిక ప్రేక్షకులను విశేషంగా ఆకట్టుకుంది. స్వర్గీయ ఎస్ఎంవీ గోపాలరాజు రచించిన ఈ నాటికకు సీహెచ్ యోనా దర్శకత్వం వహించారు. ఎంవీ రాజర్షి, సీహెచ్ మహేష్, వాణీబాలా, కొండలరావు, సీహెచ్ యోనా, శ్రీరామ్, శ్రీనివాస్, థామస్, త్రిమూర్తులు తమ పాత్రలకు జీవం పోశారు. వల్లూరు శివప్రసాద్, గంగోత్రి సాయి, బి.జయప్రకాష్‌లు నిర్వహించిన ఈ కార్యక్రమంలో రాష్ట్ర నలుమూలల నుంచి వచ్చిన రచయితలు, దర్శకులు, నటీనటులు పెద్ద సంఖ్యలో పాల్గొన్నారు.


'రాయి' నాటిక


M. RAMARAO, artist


BALI, artist

# మన నాటిక శత వసంత వాటిక

– డా. గోపరాజు నారాయణరావు

*మన నాటకం సంప్రదాయం నుంచి పాత్ర చిత్రణనీ, ప్రపంచ నాటకం నుంచి పలుకుబడినీ తెచ్చుకుంది. అందుకే స్థానీయత, కొత్తదనం మన సాంఘిక నాటకానికి వాగర్థాల వలె పనిచేశాయి. 1880లో వచ్చిన 'నందకరాజ్యం' తెలుగులో తొట్ట తొలి సాంఘిక నాటకమని చెబుతారు. ఈ నాటకకర్త వావిలాల వాసుదేవశాస్త్రిగారే–1875లోనే–'జీలియస్ సీజర్' నాటకాన్ని 'సీజరు చరితము' పేరిట తెనిగించారు. షేక్స్పియర్‌ను అనువదించిన తొలి తెలుగు రచయిత ఆయనే. మహారాష్ట్ర నుంచి వచ్చిన ధార్వాడ నాటక సమాజం తెలుగునాట కొన్ని ప్రదర్శనలు ఇచ్చి, నాటక రచనలో కొత్త దృష్టికి అవకాశం కల్పించింది కూడా 1880–81 ప్రాంతంలోనే.*




భవిష్యత్తు నాటకానికి దశ, దిశా నిర్దేశించవలసిన బాధ్యతను స్వీకరిస్తూ గురజాడ 'కన్యాశుల్కం' 1892లో అవతరించింది. 'కొండుభట్టీయం', 'బిల్హణీయం' గురజాడ నాటికలే. రంగస్థలానికి సంబంధించిన రెండు దృఢమైన సంప్రదాయాలతోనే తెలుగు సాంఘిక నాటకం వేదిక ఎక్కింది. అయినా 1930వరకు ఇది సమాజం మీద ప్రభావం చూపే స్థాయికి చేరుకోలేదు.

### బలమయిన వా(బా)ణి

పాశ్చాత్య ప్రభావం, మన సంప్రదాయ నాటకం, కన్నడ రంగస్థలాల నేపథ్యం ఉన్న బళ్లారి రాఘవ, పాశ్చాత్య సాహిత్య నేపథ్యంతో ముందుకొచ్చిన పా.వెం. రాజమన్నార్ వంటి ఉద్దండులు 1930 దశకంలో రంగం మీదకు వచ్చేసరికి సాంఘిక నాటకం వాణి బలపడింది. రాజమన్నార్ 'ఏమి మగవాళ్లు?' నాటికి ముగింపు సంచలనాత్మకం. ఇందులో తనను పెళ్లి చేసుకున్నవాడు తన తప్పేంలేకపోయినా అనుమానించినందుకు తాళి తెంపి అవతల పారేస్తుంది కనకాంగి అనే వేశ్య 'నిష్ఫలం'నాటికలో వేశ్యల త్యాగాలు గర్తింపు నకు రావని తేలుస్తాడు రాజమన్నార్.

### మనిషి స్టేజీ ఎక్కాడు!

ఇక రాఘవ , స్త్రీ పాత్రలు ధరించాలన్న విప్లవాత్మక నిర్ణయాన్ని అమలు చేసి చూపించారు. తరువాత ఆంధ్రనాటక కళాపరిషత్ కూడా ఇదే నిబంధన విధించి, పాటా, పద్యాలూ లేని సాంఘిక నాటకను ప్రోత్సహించడానికి నడుం కట్టింది. ఐదేళ్ల లోపున వచ్చి నాటికలనే ప్రదర్శించాన్నది పరిషత్ వారి మరొక నిబంధన. ఇది ఆత్రేయ, డీవీ నరసరాజు, కొర్రపాటి గంగాధరరావు, భమిడిపాటి రాధాకృష్ణ వంటి వారి కొత్త ప్రతిభను రంగం మీదకు తెచ్చింది. 1945 నాటి గుడివాడ ఆంధ్రనాటక కళాపరిషత్ పోటీలలో ఆత్రేయ 'ఎన్జీవో' నాటిక ఉత్తమ ప్రదర్శనగా ఎంపికయింది. సాధారణ గుమాస్తా ఇక్కట్లే ఈ నాటికకు వస్తువు. 'బుల్లితెర మనిషిని మరుగుజ్జులా చూపిస్తుంది. వెండితెర భారీగా చూపిస్తుంది. మనిషి పరిమాణంలో చూపించేది రంగస్థలమే' అని ఎల్బీ శ్రీరాం ('నటుడు, రచయిత) ఒకకసారి అన్నారు. అలాంటి 'మనిషి' రంగస్థలం మీద ప్రత్యక్షమయ్యాడు.

### బహు నాటికీయం!

మన నాటిక ప్రయాణం ఎంత వైవిధ్యమో, నాటకీయమో చెప్పే ఉదాహరణలు చాలా దొరుకుతాయి. 'చేసినపాపం' (కొప్పరపు సుబ్బారావు, 1947), 'ప్రగతి' (ఆత్రేయ, 1950) 'ఎవరుదొంగ?' (ఆత్రేయ, 1951), 'ప్రార్థన' (కొర్రపాటి గంగాధరరావు, 1955), 'వెంకన్నకాపురం' (ముదిగొండ లింగమూర్తి, 1958), 'కళ్లు' (గొల్లపూడి మారుతీరావు. 1979) వంటి నాటికలు ఈ వాస్తవాన్ని చెబుతాయి. ఈ కాలానికిఅటుఇటుగా కె.వి. ఆర్-వేణు రాపిన 'రాజీవం' మంచి ప్రయోగం. మూగవేశ్య ఇందులో కథానాయిక. ఆయా కాలాలను కుదిపేసిన సిద్ధాంతాలు, సంఘటనల ప్రభావాలు, సమస్యలు రచయితల దృష్టి నుంచి పోలేదు. 1960-70 దశకాలలో దేశాన్ని అతలాకుతలం చేసిన సమస్యలు జనాభా, నిరుద్యోగం. 'త్రివేణి' (1971) 'కొడుకుట్టాల' (1975) నాటికలు ఈ సమస్యలను చర్చించాయి. ఇవి రెండూ బీఎస్ గణేష్‌పాత్రో రాసినవే. నిరుద్యోగ సమస్య మీద యండమూరి వేరేంద్రనాథ్ రాసిన 'మనుషులొస్తున్నారు జాగ్రత్త', నాటిక కూడా ఈసమయంలోనే వచ్చింది. నాటుగే పాత్రలతో ఆ సమస్యను అద్భుతంగా ఆవిష్కరించారు. ఆయనదే 'కుక్క' మంచి ప్రయోగం సీఎస్‌రావు 'ఊరుమ్మడి బతుకులు' గ్రామీణ పెత్తందారీ తనంమీద బడుగుకమ్మరి తిరుగుబాటు కథాంశంగా వచ్చింది.

### ప్రయోగ యోగం!

ఎనభయ్ దశకం వచ్చేసరికి నాటికలో వస్తువు, ఆవిష్కరణ కూడా సునిశితమైనాయి. తనికెళ్ల భరణి 'కొక్కొరోకో' ప్రయోగ దృష్టికి మంచి తార్కాణం. ఆయన 'పెట్టినదే' 'గార్దభాండం' 1987, ఎల్బీ శ్రీరాం 'పద్మవ్యూహం' (1985) ఒకే వ్యక్తి ఆదాయం మీద ఆధారపడిన కుటుంబం బాధను వర్ణిస్తుంది. ఇలా చెప్పుకోఓదగిన నాటకికలు ఎన్నో కనిపిస్తాయి. ఎంవీఎస్ హరనాధరావు 'యక్షగానం', శశిమోహన్ 'ఫర్‌సేల్'- కోహినూర్', ఆకెళ్ల 'పెద్ద బాలశిక్ష, వల్లూరి శివప్రసాద్ 'హింసధ్వని', కేవీ ప్రసాద్ 'సంచలనం', మండెపూడి పూర్ణ 'ఫలం' మంచి నాటికల్లో కొన్ని మాత్రమే!

తెలుగు నాటిక వేదికనెక్కి వందేళ్లు పూర్తయిన సందర్భంలో విజయవాడలో ఉత్సవాలు నిర్వహించడం, కొన్న నాటికలను ప్రదర్శించడం, సంకలనాలను విడుదల చేయడం ఆనందించదగ్గ విషయం.

(సాక్షి సౌజన్యంతో)



# బెస్ట్ కేరికేచర్స్ షో ఇన్ బెంగుళూరు



***అది 2005 వ సంవత్సరం..***

***ఇరాన్ దేశం...***

***తబ్రిన్ ఇంటర్ నేషనల్ కార్టూన్ కంటెస్ట్.... ప్రపంచవ్యాప్తంగా కార్టూన్ మరియు కేరికేచర్ రంగాల్లో అతిరథ మహామహులైన సొజాయ్ (ఇరాన్ కార్టూన్‌డాట్‌కామ్) జాన్‌ఒయ్డ్‌నిక్ (బెల్జియమ్) లాంటి మహామహుల ప్రశంసలతో పాటు, ఆ అంతర్జాతీయ కార్టూన్ పోటీల్లో వరల్డ్ బెస్ట్ కార్టూనిస్ట్ అవార్డు తొలిసారిగా ఒక భారతీయున్ని వరించింది. అంతే కాదు బ్రెజిల్‌లో 2008 లో జరిగిన అంతర్జాతీయ కేరికేచర్ పోటీలలో కూడా తను వేసిన దలైలామా కేరికేచర్‌గాను మరలా అతనే వరల్డ్ బెస్ట్ కేరికేచర్ అవార్డు సొంతం చేసుకుని– కార్టూన్ మరియు కేరికేచర్ రెండు విభాగాల్లో కూడా మొదటి బహుమతిని సొంతం చేసుకున్న మొట్టమొదటి భారతీయునిగా చరిత్ర కెక్కిన ఘనత మన తెలుగువాడు సొంతం చేసుకున్నాడు. అతను మరెవరో కాదు ప్రతిరోజూ సాక్షి దినపత్రిక "ఇదంజగత్"లో మనల్ని పలకరించే కార్టూనిస్ట్ శంకర్.***

ఇరాన్ దేశంలో అంతర్జాతీయ స్థాయిలో కార్టూన్ పోటీలు నిర్వహించే ఇరాన్‌కార్టూన్‌డాట్‌కామ్ అనే వెబ్‌సైట్‌లో 2005 సంవత్సరంలో మొదటి వ్యక్తిగత కేరికేచర్ ప్రదర్శన నిర్వహించిన వ్యక్తి కూడా మన శంకరే.

బెంగుళూరులో ఇండియన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ కార్టూనిస్టు వారు డిశంబర్ 18నుండి 31 వరకూ శంకర్ కేరికేచర్ ప్రదర్శనను నిర్వహించారు. భారతీయ కార్టూన్ కళలో వృద్ధండులైన మేరియా మెరిండా, అబూ అబ్రహం, ఆర్.కె.లక్ష్మణ్, రంగా లాంటి కార్టూనిస్టులతో కలిసి ఇంతవరకూ ఆ గేలరీ నిర్వహించిన 49 వన్‌మేన్‌షోలలో "వన్ ఆఫ్ ది బెస్ట్‌షో"గా విమర్శకులచే ప్రశంసల వర్షం కురిపించుకున్న ఘనత కూడా మన శంకర్‌దే.

40 ఏళ్ళ క్రితం నల్లగొండలో పామర్తి నరసింహులు, రాజ్యం దంపతులకు జన్మించిన శంకర్ పూర్తిపేరు పామర్తి శంకర్. కార్టూన్ కేరికేచర్ రంగాల్లో అత్యున్నత స్థాయికి చేరుకోవాలనే అతని అభిలాష అతడు అంతవరకూ పనిచేసే ప్రభుత్వ డ్రాయింగ్ టీచర్ ఉద్యోగాన్ని సైతం వదిలిపెట్టేలాచేసింది. ఆసమయంలో ఇంటాబయటా ఎన్నో సమస్యలు అతడు ఎదుర్కొన్నాడు. అయినప్పటికి మొక్కవోని అతని ధృడసంకల్పం అతన్ని ప్రఖ్యాత చిత్రకళామేధావి,కార్టూనిస్ట్ రచయిత అయిన మోహన్ వద్దకు చేర్చింది. శంకర్ కార్టూనిస్ట్‌గా మారడానికి మోహన్ తన "కార్టూన్ కబుర్లు" పుస్తకంలో ప్రపంచ చిత్రకారులు











కార్టూనిస్టుల గురించి రాసిన వ్యాసాలే కారణమని చెప్తాడు.

మోహన్ శిష్యరికంలో శంకర్‌కు తనలో రగులుతున్న చిత్రకళా జిజ్ఞాసకు సంతృప్తి లభించింది. కానీ ప్రభుత్వ ఉద్యోగాన్ని వదులుకున్న అతనికి బ్రతుకు పోరులో ఆకలి జ్వాల మొదలైంది. అందుకే 1998లో తొలిసారిగా "వార్త" దినపత్రికలో పొలిటిల్ కార్టూనిస్ట్‌గా తన కెరీర్ ప్రారంభించాడు. తర్వాత 2002లో ఆంధ్రజ్యోతిలోను, ప్రస్తుతం సాక్షి దినపత్రికలోనూ అతను పనిచేస్తున్నాడు.

ఒకవైపు ఉద్యోగ భాధ్యతలు నిర్వహిస్తూనే అనేక జాతీయ, అంతర్జాతీయ కార్టూన్‌పోటీల్లో అతను పాల్గొని ఆంధ్రదేశమే కాదు యావత్ భారతదేశ పతాకంను ప్రపంచ కార్టూన్ రంగంలో రెపరెపలాడేలా చేస్తున్నాడు.

రంగు పెన్సిళ్ళ రమ్యమైన రేఖలలో జాతీయ అంతర్జాతీయంగా ప్రసిద్ధిగాంచిన వ్యక్తుల రూపాలను స్క్వేర్, రెక్టేంగిల్స్‌లోనే కాక ఘణము, గోళాకారాలలో కూడా చొప్పించి ప్రేక్షకులను మెప్పించగల సమర్ధత గల శంకర్ ఇంతవరకూ నాలుగు వ్యక్తిగత ప్రదర్శనలు నిర్వహించాడు.

తొలి ప్రదర్శన 2005లో హైదరాబాద్‌లో లక్ష్మణ ఆర్ట్ గేలరీలో మెగా స్టార్ చిరంజీవి ప్రారంభిస్తే 2వ ప్రదర్శన అమరావతి కళాక్షేత్రం ఆర్ట్ గేలరీలో జగదీష్ మిట్టల్ ప్రారంభించారు. 3వది అలంకృత ఆర్ట్ గేలరీలో

4వది ప్రస్తుతం నడుస్తున్న బెంగుళూర్ ఆర్ట్‌గేలరీలో

కార్టూన్, కేరికేచర్ రంగాల్లో అప్రతిహతంగా సాగుతున్న



### శంకర్ అందుకున్న అవార్డులు

- **2010** – కన్సొలేషన్ ప్రైజ్ – సోనియా గాంధీ  ఇంటర్ నేషనల్ కేరికేచర్ కంటెస్ట్
- **2009** – హానరబుల్‌మెన్షన్ – వరల్డ్ కంటెస్ట్ ప్రెస్ కార్టూన్‌పోటీ – పోర్చుగల్
- **2008**–మాయాకామత్ అవార్డు – బెంగులూరు
- **2008**– వరల్డ్ బెస్ట్ కేరికేచర్ అవార్డు–బ్రెజిల్
- **2007** – బెస్ట్ పొలిటికల్ కార్టూనిస్ట్ అవార్డ్– ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
- **2005**– వరల్డ్ బెస్ట్ కార్టూనిస్ట్ అవార్డు– ఇరాన్
- **2005**– బ్రాంజ్‌మెడల్– చైనా
- **2000**– మూడవ బహుమతి– హిందూస్థాన్ టైమ్స్ కేరికేచర్ కంటెస్ట్

అతని కళాయాత్ర మరింత వేగవంతమై చిత్రకళా చరిత్రలో ఒక నూతన అధ్యాయాన్ని సృష్టించాలని, సృష్టిస్తాడని ఆశిద్దాం.

– వెంటపల్లి సత్యనారాయణ

సంస్కృతి

# మకర సంక్రాంతి

విష్ణుబొట్ల రామకృష్ణ



ప్రపంచంలోని ఏదేశములో చేసుకోనన్ని పండుగలు మన భారతదేశంలో జరుపుకొంటున్నాము. ఇది చాల గర్వపడవలసినది. కొన్ని మతపరమైన పండగలు అయితే. మరికొన్ని జాతులకు సంబంధించిన ఒక్కొక్క మతానికి ఒక్కో పండుగ. మనదేశంలో అనేక జాతులు, అనేక మతాలు ఉన్నాయి. ఒక్కొక్క మతానికి ఒకో పండుగ అనేది ప్రత్యేకంగా జరుపుకొంటాం. అలా జరుపుకొనే పండుగలతో మనదేశంలో సంవత్సరంలో ప్రతినెల ఏదో ఒకపండుగతో ఆనందోత్సాహాలతో గడపగలగటం మన భారతీయులకే చెల్లుబాటు అవుతుంది. మహాపురుషుల జన్మదినాలను, దుష్టులను సంహరించిన రోజులను మనం పండుగలుగా చేసుకొంటున్నాం.

మనం జరుపుకొనే ముఖ్యమైన పండుగల్లో సంక్రాంతి ఒకటి. సంక్రమణం అంటే గమనం, గమనం అంటే కదలిక. జ్యోతిశాస్త్రం ప్రకారం సూర్యుడు మనకున్న 12 రాశుల్లో ఒక రాశి నుండి మరో రాశిలోకి ప్రవేశిస్తుంటాడు. ఇలా రాశుల్లో ప్రవేశించుట వల్ల ఒక్కొక్క మాసానికి ఒక సంక్రమణం ఏర్పడుతుంది. ఈపన్నెండు రాశుల్లోను ఆషాడమాసంలో వచ్చే కర్కాటక సంక్రమణం పుష్యమాసంలో వచ్చే మకర సంక్రమణం ప్రాధాన్యత సంతరించుకొన్నాయి. మొదటి సంక్రమణాన్ని దక్షణాయనాన్ని, రెండవ దాన్ని ఉత్తరాయనాన్ని ప్రారంభిస్థాయి. దక్షణాయనాన్ని ఉత్తరాయనాన్ని పుణ్య ప్రధానంగా భావిస్తారు. సూర్యుడు 12 రాశుల్లో మకరరాశిలో ప్రవేశించిన రోజును మకరసంక్రాంతిగా పిలుస్తారు.

ఇది కాక పురాణాల్లో మకరసంక్రాంతికి సంబంధించి అద్భుతమైన విషయాలున్నాయి. ప్రళయకాల స్థితిలో భూమి సముద్రంలో మునిగిఉంటే ఆ శ్రీమన్నారాయణుడు ఆదివరాహరూపంలో భూమిని మకరసంక్రాంతి రోజునే ఉద్ధరించాడట. అలాగే వామన రూపుడైన శ్రీమహావిష్ణువు బలిచక్రవర్తిని మూడడుగుల నేలను కోరి, ఆ కోర్కె ప్రకారం



చిత్రకారుడు
ఎస్.ఎన్. వెంటపల్లి

ఒక అడుగుతో భూమిని, మరో అడుగుతో ఆకాశాన్ని ఆక్రమించి మూడవ అడుగుతో బలిచక్రవర్తిని పాతాళలోకానికి ఈరోజే నెట్టి వేశాడనే కథ కూడా ఉంది. ముఖ్యంగా ఈ పండుగను పెద్దల పండుగ అంటారు. పుణ్యగతులు మకర సంక్రమణ వేళ సంక్రమిస్తాయి. వైకుంఠ ద్వారాలు తెరుచుకొంటాయని నమ్మకం. ఇలా చెప్పుకుంటూపోతే అనేక సంఘటలను ఉత్తరాయణ కాలంలో చూడవచ్చు.

సంక్రాంతి పండునకు ఒక ప్రత్యేకత ఉంది. ఈ కాలంలో చలి అధికంగా ఉంటుంది. మరియు రైతులు తమ పొలాలను కుప్పనూర్చి ధాన్యరాశులను తమ ఇళ్ళకు చేర్చుకొంటారు. అందువల్ల ప్రతి రైతు ముంగిట్లో ధాన్యపుకుప్పలు కనిపిస్తాయి. పల్లెలన్నీ పట్టణాలుగా మారుతున్న ఈ రోజుల్లో వరికుప్పలు, ధాన్నపుగిద్దంగులు మనకు కనిపించకపోయినా) ఇప్పటికీ మారుమూల పల్లెల్లో ఈ సాంప్రదాయం బతికే ఉంది. గోదాదేవి తిరుప్పావై వ్రతం ఆచరించి శ్రీరంగనాథునిలో ఐక్యం అయింది. ఇదే రోజు. సంక్రాంతి గురించి మనము పురాణాల్లో ఇటువంటి ఉదాహరణలు కనిపిస్తాయి.

ఈ పండుగను అల్లుళ్ళ పండుగ అని కూడా అంటారు. కొత్తగా పెళ్ళయిన అమ్మాయి, అల్లుడు ఈ పండుగకు వస్తారు. మామగారు, అత్తగారు జరిపే మర్యాదలు, మరదళ్ళు చేసే చిలిపి



పనులు, సరదాలు, ఈ పండగరోజుల్లోనే మనకు కనిపిస్తాయి. ఇటువంటి సంస్కృతి ఇటువంటి విశిష్టత మరే పండుగలోను కనిపించదు. మరే ఇతర దేశపు పండుగల్లోను మనకు కనబడదు. అందుకే ఈ పండుగను ఎంతో ఆనందోత్సాహాలతో జరుపుకొంటారు.

మొదటి రోజు భోగి అంటే భాగ్యాన్ని ఇచ్చేది. ఈరోజు



ప్రతి ఒక్కరు తమ ఇంటి ముందు మంటలు వేసుకొంటారు. దీని వల్ల చలిని దూరంచేసుకొంటారు. ఈ మంటల్లో ఇంట్లో ఇంతకాలం ఉపయోగించని చాపలు, చెక్క వస్తువులు మొదలగు వాటిని మంటల్లో వేస్తారు. ఈ నాటి సాయంత్రం ఇళ్లల్లో చిన్న పిల్లలకు భోగిపళ్ళు (రేగిపళ్ళు)పోస్తారు. రెండవ రోజైన మకర సంక్రాంతిరోజు స్త్రీలు తెల్లవారుజామున నిద్రలేచి ఇంటి ముందు రంగవల్లిలుదిద్దిఇంటి చుట్టు వైకుంఠ ద్వారాలు తెరుస్తారు. ఆరోజున సాతానిజుయర్లు, జంగదేవర్లు, బుడబుక్కల దొర, గంగిరెద్దుల వాళ్ళు ఇంటింటికి తిరుగుతారు. నాటి సంస్కృతి నేడు గ్లోబలైజేషన్ పుణ్యమా అని కనుమరుగౌపోయింది. ఈ సంక్రమణ సమయంలో తిలాతర్పణంచేసి గుమ్మడికాయ దానం ఇస్తే విష్ణువుకు బ్రహ్మాండాన్ని దానం ఇచ్చిన ఫలం వస్తుందట ఈ పండుగ రోజు ఇళ్ళలో రసవత్తైన పిండివంటలతో పాటు బెల్లం, నువ్వులు వేసిన అరిశలు చేసుకొని ఇంటిల్లిపాది తినటమే కాక, ఇతరులకు, బంధువులకు పంపటం ఆనవాయితి. ఈరోజు నువ్వులు, సజ్జలు, బీర, పొట్ల, గుమ్మడి తదితర ఆహారపదార్ధాలు తినటం ఆరోగ్యానికి మంచిది.

ఈ పండుగను ఒరిస్సా వారు లక్ష్మీదేవికి సంబంధించిన పండుగగా జరుపుకొంటారు. లక్ష్మీదేవి ఈ మాసంలో పేదల ఇళ్ళకు వెళ్లి వరాలు ఇచ్చి ఐశ్వర్యాల్ని ప్రసాదిస్తుందని నమ్మకం అందుకు ఒక కథ చెబుతారు. ఈరోజు లక్ష్మీదేవి పేదవారి ఇంటికి వస్తుందని ప్రతిఒక్కరు లక్ష్మీదేవిని తమ ఇంటికి ఆహ్వానించటానికి తమ ఇంటి ముందు రంగవల్లులు దిద్ది ఆమె మెత్తని పాదాలు పెట్టేందుకు వీలుగా, ఆవుపేడతో చేసిన గొబ్బెమ్మలు పెడతారు. ఆ గొబ్బెమ్మలపై పెద్ద పెద్ద పువ్వులయిన తామర, లేదా గుమ్మడిపూలను పెడతారు. ఇలా చేస్తే లక్ష్మీదేవి తమ ఇంటికి వస్తుందని నమ్మకం. ఈమాసంలోనే గొబ్బిలక్ష్మిని కొలిచే ఆచారం ఉంది. గొబ్బిలక్ష్మి అంటే భూమాతా అని అర్ధం.

ఆంగ్ల సంవత్సరం ప్రకారం (న్యూఇయర్) పండుగలలో ఇది తొలి పండుగ అవుతుంది. జ్యోతిష్యశాస్త్రం ప్రకారం, ఆరోగ్య నియమాల ప్రకారం, ప్రకృతి ధర్మాల ప్రకారం. పురాణ, ఇతిహాసాలు చెప్పిన ప్రకారం సంక్రాంతి పండుగకు చాల విశిష్టతలున్నాయి. ఇన్ని విశిష్టతలున్నా ఈ పండుగను మనం భక్తిశ్రద్ధలతో ఆచరించటంతో పాటు మనం మరిచిపోతున్న మన ఆచార, సాంప్రదాయాలను మనం గుర్తుకు తెచ్చుకొని ఆచరిస్తే మనం మన భావితరాలకు మంచి సంస్కృతితో కూడిన పండుగలను అందించగలం. లేకుంటే మనం విదేశీ సంస్కృతి ప్రకారం ఏదో ఒక దేను జరుపుకొంటూ మన భారతీయ గుర్తింపును కోల్పోవలసి వస్తుంది.



*గత సంచిక తరువాయి భాగం...*



# మన "ముద్ద" ముచ్చట్లు...

## (తెలుగు జనాలు... "బఫే" భో'జనాలు'...)

బి.ఎం.పి. సింగ్
munipratapsingh.b@gmail.com

**నాటి అమ్మమ్మలకు పర్సనాలిటీ డెవలప్‌మెంట్, కమ్యూనికేషన్ స్కిల్, హూమన్ రిలేషన్స్ మెయిన్‌టెయిన్ చేయడం, మేనేజ్‌మెంట్ స్కిల్స్ పుష్కలంగా వుండేవి. నాయకత్వ లక్షణాలు, న్యాయకర్త లక్షణాలు మెండుగా వుండేవి.**

మనవాళ్లు వానాకాలం, చలికాలం, ఎండాకాలం అని కాలానుగుణమైన కూరలు వండేవారు. బాలింతలకు, చూలింతలకు వెల్లుల్లి-నల్లి కారంపొడి, శొంఠిపొడి మొదలైనవి పెట్టేవారు. మనకు పైత్యం చేస్తే నిమ్మబద్ధ, రాతిఉసిరి, ధనియాలు, మిరియాల చారు వంటివి సిద్ధంచేసేవారు. కుంపట్లో కాల్చిన వంగపచ్చడి, కందిపచ్చడి, వేడిచేస్తే బీర, పొట్ల, సొర పాలుపోసిన వండిన కూరలు, మినపవడియాలు, ఉల్లితరుగు కూర, వంకాయల పచ్చిపులుసు, పెసరకట్టు, కందికట్టు, పెరట్లో కాసిన కరివేపాకు, మునగకాయ వేసి పప్పుచారు కాని, ఉలవచారు కాని కాస్తే ఆ వీధంతా ఘుమఘుమలే. పనసపొట్టుకూర, సునాముఖి చారులాంటి వాటివలన నేటి ఇంగ్లీషు మందుల సైడు ఎఫెక్టుల బాధలేకుండా ఇంట్లో అందరి ఆరోగ్యాలు బాగుపడుతుండేవి. ఇంత గొప్పవి మన తెలుగు వంటకాలు, కుండల్లో, మట్టిబానల్లో పట్టిన నీళ్లు త్రాగుతుంటే రుచికరంగా వుండేవి. గొల్ల తెచ్చిన నల్ల పిడతలో తెల్ల పెరుగుతింటే ఆ రుచేవేరు.

కుమ్ములో కాల్చిన చిలకడదుంపలు, తాటాకు మంటలో కాల్చిన వేరుశనగకాయలు, ఉడికించిన కందికాయలు, పెసలు గుగ్గిళ్లు, దాలిపెట్టిన ఉలవగుగ్గిళ్లు, తేగలు, ఈతపళ్లు, తాటిముంజలు నిప్పుల్లో కాల్చిన జొన్నపొత్తులు, కుండపెంకులో (మంగళం) వేయించిన జొన్న పేలాలు, బెల్లం ముక్కలు ఇవన్నీ చిన్నపిల్లలకు ఆరోగ్యకరమైన తాయిలాలు... చేలల్లోని మావుల్లో పట్టిన మట్టగుడిసెల పులుసు మట్టిచట్టిలో వండి, ఉట్టిమీదపెట్టి చల్లారాక తెల్లవారుఝామున తింటే.. "ఆ" రుచి తిన్నవారికే తెలుస్తుంది. అది తిన్నవారు స్వర్గం అంటే... ఇదేరా... అంటారు.

ఎండాకాలంలో... రాత్రిపూటే అన్నంలో పాలు, తెల్లవుల్లిగడ్డ ముక్కలు వేసి, తోడేసిన అన్నం ఉదయాన్నే తింటే హిమాలయాల 'చల్ల'దనం, తిన్నవారి కడుపులో నింపుకున్నట్లు వుండేది. ఎంత ఎండ వేడినయిన తట్టుకునే శక్తివుండేది. ఈ రుచులన్నీ మాటలకందని మధురానుభూతులే.

ఇవన్నీ నేటి హైటెక్ జనానికి చెపుతుంటే... ఇదంతా వారికి 60 యేళ్ల నాటి ఓ "పాత తెలుగు సినిమా" అనిపించవచ్చు.



చాలా అరుదైనది మన తల్లులు మనల్ని కనిపెంచిన తీరు, అది ప్రపంచంలో మరెక్కడా కనిపించని తీరు, అంతగొప్పవారు మన "భారతీయ మాతలు".

కానీ నేడు మన ఇళ్లల్లో ఆ "ముద్ద-ముచ్చట్లు" వినబడటంలేదు.

మనం మన పెద్దవారిని ఓల్డ్‌ఏజ్ హోంలలో వదిలేసి మనం, మన పిల్లలం మంచి జనానికి, మంచి



భోజనానికి దూరం అవుతున్నాము.

**ఎవరికోసం...?**

నేటి ఫ్రెష్ ఫాస్ట్‌ఫుడ్‌ల వేడి పెరిగినకొద్దీ మన "చద్ది అవిరయిపోయింది. మనకు చలువచేసే ఆ చద్ది నేడు మనకొద్దనిపిస్తుంది. మన పిల్లలేమో "చైల్డ్‌కేర్"లో, మన పెద్దలేమో "ఓల్డ్‌ఏజ్ హోం"లో... మరి మనం నేడు ఎవరికోసం బ్రతుకుతున్నామో తెలియని పరిస్థితి. ఆలోచించే కోరిక, తీరిక రెండూ మనకు లేవు. అందరికీ అన్నిటా నోట్ల కట్టలే గానా, నోట్లోకింత రుచి"కరంగా తింటానికీ తీరికలేని బిజీ-గజిబిజీ. నేడు ఆదాయంమీద వున్న ఆసక్తి, ఆశక్తి, ఆయుర్ధాయం మీద, ఆరోగ్యం మీద లేవు.

అందరూ "రేపటి" గొడవలోపడి "నేటిని" విస్మరిస్తున్నారు. మన నేటివిటీని వదిలి నెగెటివిటీని స్మరిస్తున్నారు. "మొన్న" "నిన్న" అన్నవి వారికసలు తెలీనట్లుంటున్నారు. నేలవిడిచి సాము చేసి చేసి, ఇంతా చేసి ఏం సాధిస్తున్నట్లు? ఎవరికి దగ్గరవుతున్నట్లు?

నేటి తిండీ తిప్పలు పాతకాలం వలె వుండక పోవటానికి ముఖ్య కారణాలలో కొన్ని మనకు కనిపించేవి... పెరిగిన ఖర్చు నేపధ్యంలో కుటుంబంలో భార్యా, భర్త ఇద్దరూ ఉద్యోగాలకెళ్లి నాలుగు రాళ్లు సంపాదిస్తేగాని సరిగ్గా ఇల్లు గడవని పరిస్థితులు. ఇంట్లో పిల్లల్ని, పెద్దల్ని సరిగ్గా పలకరించే సమయం దొరకదు. గతంలో అయితే ఇంట గెలిచి రచ్చ గెలవాలి. నేడు ఇంటర్‌నెట్‌లో గెలిచాకే ఇంట్లో గెలవాలి. ఇంట్లో విషయాలు తక్కువ. ఇంటర్నేషనల్ విషయాలపై మక్కువ. ఏదో ఒక బిజినెస్, బిజీనెస్, మనం మనిషిగా మైనస్.

పట్టణాల్లో ఎవరూ ఇంకొకరి ఇళ్లకి వెళ్ళినాలుగు రోజులు వుండటానికి వీలుగా వుండే ఇల్లే లేవు. గాలి, వెలుతురు లేని చీకటి గుయ్యారాలు. ఆక్సిజన్ అందని ఆఫ్‌సీజన్ ఇళ్లు. పట్టపగలే దీపాలు వేసుకునే కాలం గడపాలి. ఇరుకు బొమ్మరిల్లు . అంతా అపార్ట్‌మెంటల్" కల్చర్. కుటుంబంలో సభ్యులందరూ కలిసి ఏనాడూ కలివిడిగా భోజనాలు చేసే అదృష్టం వీరికి వుండదు. మానవ సంబంధాలను దెబ్బతీస్తున్న ఉద్యోగాలు, ఉద్వేగాలు, ఉద్యోగం పట్ల అటెన్షను, దానికి అనుబంధమైన హైపర్‌టెన్షన్ ఈ రెండింటి మధ్య ఇంటి వాతా'వర్ణం' నేడు పూర్తిగా మారిపోతున్నది. కళతప్పి వెలవెలపోతున్నది. ఎంత సంపాదించినా మంచి ఆహారం వండి వడ్డించుకునే వీలుండదు. పిల్లల మోహాన ఎక్స్‌పెయిరీ డేట్ చెరిగిపోయిన చిప్స్ ప్యాకెట్లు, చాక్లెట్లు, పిజ్జాలు, నూడిల్స్, బర్గర్స్ వగైరాలు, పిల్లలకు వైరస్ జ్వరాలు.

పాతరోజుల్లో పిల్లలయినా.. పెద్దలయినా... చేలల్లో పండినవిగానీ, ఇంట్లో వండినవి గాని తినేవారు. ఈ రోజుల్లోలా బజారుల్లో అమ్మే ఆకర్షణీయ రంగులు, రుచుల కృతిమ సరుకులు తినేవారు కారు.

వంటాకాలు ఆంధ్రం..తినటం ఆంగ్లేయం... తెలుగు జనాలు... బఫే భోజనాలు.

కాలం ఎంత మారినా ... దేనికైనా ఓ హద్దు వుండాలి. కొన్ని కట్టుబాట్లకు మనం కట్టుబడి వుండాలి. అప్పుడే మనం 'మన'లా మనగలం.

మనం మన పద్ధతిలో ఆహారం తినటం మానేశాకే.. నేటి తరం నిర్వీర్యం అయిపోతుంది. చిన్నచిన్న పిల్లలకూ సోడాబుడ్డి కళ్లద్దాలు వస్తున్నాయి. 'చిగురు' వయసులోనే 'షుగరువ్యాధి, మోకాళ్ల నొప్పులు వగైరాలు. నేడు మన "ఖానా" (భోజనం) సరిగా లేకనే "దవాఖానలు" (ఆస్పత్రులు) ఎక్కువయినాయి. నేడు విందులు తక్కువ, మందులు ఎక్కువ. పూర్వం పిల్లలు-పెద్దలు



కష్టపడటానికి ఇష్టపడేవారు, బాగా తినేవారు. బాగా పనిచేసేవారు.

ఈ మధ్యకాలంలో జనం స్వీట్ తినమంటే.. అమ్మో.. షుగర్, ఒబెసిటీ (ఊబకాయం) అంటారు. హాట్ తినమంటే... వద్దుబాబోయ్ ఎలర్జీ, ఎసిడిటీ (కడుపులోమంట) అంటారు. ఇంకేం తింటారు మీరు?

మన పూర్వీకులు మనలా 'వీక్' (బలహీనులు) కారు. వారి శరీరం ఎంతో దృఢంగా వుండేది. కొండను పిండి చేసేలా వుండేది వారి శక్తి, వాళ్లు రాళ్లు తిన్నా హరాయించుకునేవాళ్లు. అందుకే వారికి ఎంత వయసొచ్చినా... వారి కంటి చూపు చెదిరేదికాదు. పన్ను కదిలేది కాదు. జీర్ణశక్తి తగ్గేది కాదు. వందకిలోల వడ్ల బస్తా ఎత్తి గిరాటేస్తే ఎగిరి ఎడ్లబండి మీద పడేది.

పూర్వం మనవాళ్ళు ఒంటెద్దు కట్టుకొని, పక్కవూరిలో జరిగేపెళ్ళిళ్లకు, గుళ్లల్లో జాతర్లకు వెళ్లేవారు. మధ్యమధ్యలో ఆగి, వంటలు చేసుకొని తింటూ చేరాల్సిన చోటికి క్షేమంగా చేరేవారు. ఇప్పట్లా స్పీడుగా 'పోయే'వాళ్ళు కాదు.

గతంలోలా నేడు ఐదు రోజులు జరిపే పెళ్లిళ్లూ లేవు. అలా జరిపినా... వెళ్లేవారు లేరు. అది వరకు లగ్నాలు పెట్టుకున్న దగ్గర్నుంచీ ఇళ్లముందు తాటాకు పందిళ్లు వేసి, ముగ్గులేసి నెలల తరబడి కష్టపడి పసుపు దంచి,, కారం దంచి, వడియాలు పెట్టి, బియ్యం, పప్పులు బాగుచేయించి వంటాకాలు వండించి, చీరలు, పంచెలు నేయించి, నగలు చేయించి, ఆరేంజ్‌లో మ్యారేజీలు ఎరేంజ్ చేసేవారు. ఇప్పుడన్నీ "అసెంబుల్డ్" పెళ్లిళ్లే. ఫోన్లు కొట్టు. డబ్బులు పెట్టు.. నేడు సా'ధన'మున పనులు సమకూరు 'ధర'(రేటు)లోన. ఇరుగుపొరుగు వారితో పనేలేదు. గంటల్లో కళ్యాణ మంటపం, భోజనాలు, హనీమూన్ ప్యాకేజీలు అన్నీ సర్దేసుకొని అంతర్ధానమైపోతుంటారు. ఇవి నేటి పెళ్లి "పే"రంటాలు. ఈపెళ్ళిళ్లకు వెళ్ళేవారు కూడా ఇది రీతిలో కరెక్టుగా ఆ(?)సమయానికి వెళ్ళి ఓ షేక్‌హ్యాండ్ ఇచ్చి అక్షింతలు విసిరేసి (ఇవ్వదలంచుకుంటే) గిఫ్టేదో ఇచ్చేసి, వీలుంటే వీడియోకి ఓ ఫోజిచ్చి, చేతులు దులిపేసుకొని వేదికమీద నుంచి దుబుక్కున దూకేసి... 'సారీ'! నేను 'బిజీ' అని నేడు మనందరి పెదాలపై ఆడే రెండు పదాలు–"ద్వి అక్షరీ" మంత్రాన్ని ఈజీగానో, అనీజీగానో పెళ్ళి పెద్దకు వినిపించి, మళ్ళా అక్కడ కనిపించకుండా జారుకుంటున్నారు.

కలుపుకుపోవటం 'నాటి' ఆచారం.

దులుపుకుపోవటం 'నేటి' గ్రహచారం.

గమనిక: ఈలోపు పొరపాటున వారి 'సెల్' మోగితే... పైన ఉదహరించిన విషయాలు ఏమీ వుండవు. సహకరించ ప్రార్థన.

సమయానికి పడాల్సిన తలంబ్రాల గొడవలో తలమునకలై



పెళ్ళివారు వాచీలు చూస్తుంటే ఈ మధ్య క్యాటరింగ్‌వారు చిన్న పిల్లల్నీ అతి జాగ్రత్తగా భో'జనాభా' లెక్కల్లో జేరుస్తూ.. "ఇదేంటయ్యా"? అని మనం అడిగితే... పిల్లలకు 'ఓటు' హక్కు లేదు గాని 'ప్లేటు' హక్కు వుందని సమాధానమిస్తున్నారు. వారి సొంత రాజ్యాంగంలోని భోజ్యాంగం వినిపిస్తూ... ఒక్కో పిల్లా, పిల్లాడు ఐదేసి ఐస్‌క్రీములు తింటారు సార్ అని అంటున్నారు. డబ్బులెక్కువ గుంజటానికి 'పే'చీలు పెడుతున్నారు.

ఈ మధ్య ఆడవాళ్లు కొందరు నైస్‌గా, నాజూగ్గా కనబడే ప్రయత్నంలో భాగంగా వేలు వేలు పోసి మరీ సదరు నిపుణుల సలహా మేరకు నీరసించిపోతున్నారు. కడుపునిండా తిండి తినకుండా నోరు కట్టేసుకుని ఎండిపోతున్నారు. తోటకూర కాడల్లా... వ్రేలాడిపోతున్నారు. గట్టిగా ఓ గంటసేపు ఏ పనీ చేయలేరు. పాతకాలం ఆడవాళ్లు లంకంత ఇళ్లూ, వాకిళ్లు ఊడ్చి కళ్లాపుచల్లి, రేవుకెళ్లి బండెడు బట్టలు ఉతికి, మైళ్లు మైళ్లు నడిచి, మంచినీళ్లు తెచ్చి, వంట-వార్పు చేసి, వడ్లు, కారం, పిండిలాంటివి దంచేవారు. పొలాలకెళ్లి గడ్డిమోపులు తలపైపెట్టి మోసుకొచ్చేవారు. గొడ్డూ గోదా పిల్ల-మేక చూసుకునేవారు. గిలకల్లాగా గిరగిరా తిరుగుతూ అన్ని పనులు చేసుకునేవారు. కడుపునిండా తినేవారు. తిండికి సరిపడా పనీ చేసేవారు. నేటి ఈ నాజూకు నీరసాల ఫలితంగా ఇళ్లూడ్చే మిషన్లు, బట్టలుతికే మిషన్లు, పిండి రుబ్బే గ్రైండర్లు, మిక్సీలు, వంటచేసి కూతపెట్టే కుక్కర్లు లాంటివి వెలుగులోకి వచ్చాయి. పొయ్యిముందు కూర్చుని వంటచేసే వర్రీ లేదు నేడు. కర్రీ పాయింట్లు వున్నాయి. ఒక్క ఫోన్ చేస్తే చాలు 'ఫ్యామిలీ ప్యాక్' డెలి'వరీ'లు. పొరపాటున ఒక్కసారి వండినా.. దాన్ని దాచి దాచి వందసార్లు తింటానికి ఫ్రిజ్‌సౌకర్యం. నేడు కొందరు నాలుగు అడుగులు వేస్తేచాలు ఆపసోపాలు. రెస్ట్‌కి ఎ/సి రూముల్లో మెత్తని కుషన్‌సోఫాలు. నిజంగా నేటి ఈ సౌకర్యాలే మన పాలిట శాపాలు.

నేటి హైటెక్ యుగంలో కౌన్‌బనేగీ
నాటి అమ్మ-అమ్మమ్మ-నాయనమ్మ
అన్నది నేటి... ప్రశ్న?

ఫోన్లు చేస్తూ, నడుస్తూ, కంప్యూటర్ల ముందు కూర్చొని పనిచేస్తూ, రంగునీళ్లు త్రాగుతూ, చిరుతిళ్లని భోజనంలా చేయకండి. కాగితం కంచాలు, ఇనుప చెంచాలు ఇకచాలు. కడుపునిండా తినే తీరికలేని 'మర'లా మారకండి మరలా మనవైపు మరలండి. తీరికగా మన భోజనం చేయండి. "కోటివిద్యలూ కూటికొరకే" అని మరవకండి. అందరం కలసి భార'తీయ' భోజనం చేద్దాం రండి.



ఎల్.ఆర్. వెంకటరమణ

# ఆధునిక ఆంగ్ల నాటకరంగ బాద్‌షా... జార్జి బెర్నార్డ్‌షా...

ఆంగ్ల సాహిత్యంలో నాటక రచయితలంటే మొదటగా గుర్తుకు వచ్చే పేరు షేక్‌స్పియర్. నాటకాన్ని సమాజశ్రేయస్సుతో మలచినది "ఇబ్సన్". వీరి తరువాత చెప్పుకోదగిన వ్యక్తి జార్జిబెర్నార్డ్‌షా. అంధవిశ్వాసాలను తీవ్రంగా నిరసించినవాడు. కాలంచెల్లిన విలువలపై కత్తి ఝళిపించినవాడు. దుస్సంప్రదాయాలను దుయ్య పట్టాడు.



బెర్నార్డ్‌షా నాటకాలతో పాత్ర మధ్య సుదీర్ఘ వాదనలు ఉంటూ, అవి నాటి సమాజానికి ఏది మంచి, ఏది చెడు వంటి అంశాలు చర్చిస్తుండేవి. ఈ వాదనలు నాటి కాలంలో - సమాజంలో పాతుకుపోయిన మూఢవిశ్వాసాలు, కాలం చెల్లిన సంప్రదాయాలను, తుప్పుపట్టిన విలువలు, అశాస్త్రీయ దృక్పథాలను తీవ్రంగా నిరసించగలిగాడు.

మానవుడు తన సంకల్పశక్తిని ప్రోది చేసుకోగలిగితే అతడొక మహా మానవుడిగా రూపొందగలడని ప్రచారం చేసినవాడు. షా సాహిత్యం ద్వారా సమాజం మార్చవచ్చని, కళ కళ కోసం కాదు, అది సమాజం కోసమని నమ్మి, ఆచరించి చూపిన రచయిత. సమకాలీన సమాజంలో పేరుకుపోయిన ఎన్నో సమస్యలకు పరిష్కారం చూపించగలిగాడు.

కానీ ఈ విషయంపై విమర్శలు కూడా ఎదుర్కొన్నవాడు. షా తాను నమ్మిన సిద్ధాంతాల ప్రచారమే అధికంగా ఉంటుందని, అతడు కళాకారునిగా కన్నా ప్రచారకుడిగానే ప్రసిద్ధుడని విమర్శించిన వారు ఉన్నారు. నోటి దురుసు ఎక్కువ ఉన్న రచయితగా కూడా విమర్శకులు విమర్శించారు. కానీ నాటి కాలంలో గొప్ప నాటకకర్త ఎవరంటే "షా" అనే ముక్త కంఠంతో చెబుతారు.

బెర్నార్డ్‌షా ఐర్లాండ్‌లోని డబ్లిన్ నగరంలో 26 జులై, 1856లో జన్మించాడు. తండ్రి జార్జి కార్ షా ఒక చిరుద్యోగి. తల్లి గొప్ప గాయకురాలు. చిరుద్యోగిగా పోషించలేడని డబ్లిన్ నుండి లండన్‌కు వెళ్లిపోయింది. అక్కడ సంగీత కచేరీలు ఇస్తూ జీవిస్తుండేది. ఆమె సంగీత కచేరీలకు మంచి ఆదరణ లభించింది.




షా తన పదహైదవ ఏట పాఠశాలను వదిలివేశాడు. అక్కడ చెబుతున్న విద్య అంతగా నచ్చలేదు. కొంతకాలం పాటు భూమి క్రయవిక్రయాల సంస్థలో గుమాస్తాగా పనిచేశాడు. 1876లో లండన్‌లోని తల్లి వద్దకు చేరుకున్నాడు. అయితే తల్లి నుండి ఎలాంటి ఆర్థిక సాయం అందలేదు. సోషలిస్టు సంస్థకు కరపత్రాలు వ్రాయడం, వైద్య సంస్థకు ప్రకటనలు వ్రాసి కొన్ని షిల్లింగ్‌లు సంపాదించగలిగేది.

షాకు చిన్ననాటి నుండి జర్నలిజంపై ఆసక్తి ఉండేది. అందుకే "స్టార్" అనే పత్రికకు సంగీత విమర్శకునిగా ఉద్యోగం లభించింది. తన తల్లి ద్వారా కొంత జన్యుపరమైన సంగీతం అందింది. లండన్‌లో జరిగే సంగీత కార్యక్రమాలు చూసి పత్రికలలో రాయడం మొదలు పెట్టాడు. ప్రశంసలు కూడా అందుకోగలిగాడు.

నాటి కాలంలో ఇంగ్లాండులో ఫేబియన్ సొసైటి చురుగ్గా పనిచేస్తుండేది ఇంగ్లాండులో సోషలిజాన్ని స్థాపించడం ఆసంస్థ ప్రధాన లక్ష్యం. షా సోషలిస్టుగా మారాక ఫేబియన్ సొసైటీలో చేరాడు. షా సామ్యవాదం మీద, జాతీయ వాదం మీద తన దృక్పథాలను వ్యక్తంచేశాడు.

నాటక రచనల విషయంగా షా పై ఇబ్సన్ ప్రభావం అధికమని చెప్పవచ్చు. నాటకరంగంమీద ప్రజలందరికీ సంబంధించిన సమస్యలు చూపాలి గానీ నిత్యజీవితంలో ఎలాంటి సంబంధంలేని ప్రేమవ్యవహారాలు పనికట్టుకుని చూపాల్సిన అవసరం లేదన్నాడు. "ఎవరో ఎవరినో ప్రేమిస్తే, అది చూడడం



అవసరం లేదన్నాడు.

ఒక సమకాలిక సామాజిక సమస్యను ఇతివృత్తంగా రచించిన మొదటి నాటకం "వడోయర్స్ హౌజెస్". దీన్ని 1892లో ప్రదర్శించారు. అద్దె ఇళ్లలో ఉండేవారి జీవన విధానాన్ని ఈ నాటకం వ్యక్తపరుస్తుంది. ఈ నాటకం విజయవంతం కావడంతో తరువాత దాదాపు నలభై నాటకాలు రాశాడు షా.




వేశ్యా వృత్తిని చిత్రిస్తూ–"మిసెస్ వారెన్స్ ప్రొఫెషన్" చిత్రించాడు. మత అసహనాన్ని "డెవిల్స్ డిసైపుల్స్"లో చూపాడు. వీటిపై సాంప్రదాయవాదులు విమర్శించారు. మరింత రెచ్చిపోయి షా పదునైన నాటకాలు రాసాడు.

మనిషి తన సంకల్ప బలంతో తానొక మహోన్నత వ్యక్తిగా మారగలడని "మ్యాన్ అండ్ సూపర్ మ్యాన్" (1905) లో చూపాడు. దీన్ని "కామడీ ఆఫ్ ఫిలాసఫీ" అన్నాడు ఇందులో "జీవశక్తి" అనే సూత్రాన్ని ప్రవేశపెట్టాడు. మానవులు మహోన్నతులుగా మారితే సమాజంలో ఏ సమస్యా ఉండదని షా నమ్మకం. ప్రభుత్వం చట్టాలు ద్వారా సమాజం మార్చవచ్చునని మొదటి షా భావించినా, అనంతరం మనిషి మనీషిగా మంచివాడు అయినపుడే ఆ చట్టాలు ప్రజల చుట్టాలు అవుతాయంటాడు.

షా మతాన్ని, మాంసాన్ని, మధ్యాన్నీ వదలి ఒక బలీయ వ్యక్తిగానే జీవించాడు. చివరి వరకు శాకాహారిగా జీవించినవాడు. నలభై అయిదేళ్ళ వయస్సులో "పిల్లల్ని కనేది లేదు. అన్న ఒప్పందంతో భార్యను పెళ్ళి చేసుకున్నవాడు. షా రచించిన "పిగ్మాలియన్" లో శిల్పి తాను చెక్కిన శిల్పాన్ని ప్రేమించడాన్ని చూపాడు. 1924లో రాసిన "సెయింట్ జోన్" జోన్ ఆఫ్ ఆర్క్‌ను ఎలా మత గురువులు మంటల్లోకి నెట్టారో మానవతా దృష్టితో రచించాడు. 1925లో షా నోబెల్ సాహిత్య బహుమతిని అందుకున్నాడు. తన తొంభై అయిదవ ఏట అంటే 1950లో నవంబరు 2న ఇంగ్లండులో షా మరణించాడు.

షా సంబంధించిన ఒక జోక్ ప్రచారంలో ఉంది. ఒక అందమైన స్త్రీ షాతో మనం పెళ్ళి చేసుకుందాం. నా అందం మీ తెలివి గలిగిన సంతానం పొందవచ్చునన్నది. షా తిప్పికొడుతూ–నా అందం, నీతెలివి రాకూడదని ఏముందన్నాడు. షా ఛలోక్తులు హాస్యంతో పాటు సత్యం కూడా ఉండేది. షా అంటాడు–

"Truth is the funniest Joke in the World"

e-mail: venkataramana_lanka@yahoo.com

# కవిత్వమంటేనే పండుగ !

-మాకినీడి సూర్యభాస్కర్

ప్రేమను అందంగా అక్షరాల్లో పొదగాలన్నా...

ప్రకృతి అందాల్ని పరవశించి పాడాలన్నా..

బాల్యపు కేరింతల్ని, యౌవన పరాచికాల్ని, వృద్ధాప్యపు అలజడుల్నో...

సమాజ పోకడల్ని అసమానతల అసహజాన్నీ వివక్షల వేదనా సుడుల్నీ దేన్నైనా

ఉద్రేకంగా... ఉద్వేగంగా.. ఉజ్వలంగా...

ఉత్సాహంగా... ఉగ్రంగా... ఉన్మాదంగా...

ఉజ్జీవంగా... ఉజ్జృంభంగా... ఉత్కర్షంగా,,,

ఉత్కృష్టంగా ఉత్తమంగా... ఉన్నతంగా..

ఎలా చెప్పాలన్నా-

అది ఒక్క కవిత్వంలోనే సాధ్యం.

కాదు కాదు. అలా చెప్పినప్పుడు అది కవిత్వమైపోతుంది.

మనం కవి సమ్మేళనాలుగా చెప్పుకునే కార్యక్రమాన్ని విదేశాల్లో 'కవిత్వ పండుగ' పేర కవులందరూ ఒక చోట చేరి వారి వారి కవిత్వాన్ని ఒకరికొకరికి వినిపించుకుంటూ ఒళ్ళు మరచి ఆనందించడం ఆనవాయితీ. ఇటువంటి 'పొయెట్రీ ఫెస్టివల్స్' ఇప్పుడిప్పుడే ఇక్కడా జరుగుతున్నాయి.



డిశంబరు 21న గుంటూరు జె.కె.సి. కళాశాల ఆడిటోరియంలో 'ఇంటర్నేషనల్ పొయెట్రీ ఫెస్టివల్- 2010' జరిగింది దీన్ని 2008, 2009ల్లో జాతీయస్థాయిలో జరిపారు. ఈ కవిత్వ పండుగ నిర్వాహకులు-ఆంగ్ల శాఖాధిపతి పరుచూరి గోపీచంద్ మరియు ఆంగ్ల అధ్యాపకురాలు పి. నాగసుశీలగార్లు, ఒకరికొకరికి చేదోడుగా, మంచి అవగాహనతో ఈ కార్యక్రమాన్ని అత్యంత వైభవోపేతంగా జరిపారు. కవిత్వంపట్ల, కవుల్ని ఒకచోట చేర్చి వారి చేత కవిత్వం చదివించి, వినిపించి, ఆనందించడం, ఆనందింపజేయడం ఇద్దరికీ ఎంతో ఇష్టం. అలాగే వారిఇరువురూ కలిసి కవిత్వం రాస్తారు... పుస్తకాలు కలిసే ప్రచురిస్తారు...



అవార్డులూ, రివార్డులూ కలిసి అందుకుంటారు... కవిత్వపరంగా కలిగే సుఖదు:ఖాలు, లాభనష్టాలు, మంచిచెడులూ, అన్నీ కలిసి పంచుకుంటారు. జంటకవులే కాదు, జంట నిర్వాహకులు కూడా.

ఆంగ్లంలో రాసే ప్రపంచవ్యాప్త కవులందరికీ ఈ పండుగను అంకితమిస్తూ, 120 మంది కవులు, కవయిత్రులు రాసిన 240 కవితల్ని 'పొయెట్స్ పారడైజ్'గా ప్రచురించారు. ఈ కవిత్వ పండుగలో విదేశీకవులు, అన్ని రాష్ట్రాలకూ చెందిన దేశీయకవులూ-లబ్ధప్రతిష్ఠులూ, ఎంతో ఉత్సాహంగా...ఉద్వేగంగా పాల్గొన్నారు. ప్రొ॥దింకో తెలికా(క్రొయేషియా), అజీమ్ సుయాన్ (ఉజ్బెకిస్థాన్), ఫ్రాంక్ జాసిన్ (జర్మనీ), పీటర్‌వాగ్ (ఆస్ట్రియా), డా॥జి. డేవిడ్ స్క్వార్జ్, డా॥ టి.ఎస్.కెలిగన్ తదితర విదేశీ కవుల కవితలతోపాటు ప్రసిద్ధమైన కవులు సానెట్ మొండల్, డా॥రతి సక్సేనా, డా॥పోన్ లక్ష్మణ్, ప్రొ॥ విప్లవ్ చక్రవర్తి, యు. ఆత్రేయశర్మ, ప్రియాంక భౌమిక్, డా॥భాస్కరరాయ్ బర్మన్, ఆర్.ఎమ్, షన్ముగం, ఛిత్రయార్, డా॥మహమ్మద్ ఫకృద్దీన్, డా॥కె.వి.రఘుపతి, డా॥ఎల్.ఎన్. వాంఖేర్, డా॥రామ్‌శర్మ, డా॥అంబికా అనంత్, వీనా రామస్వామి, మాకినీడి సూర్యభాస్కర్ తదితరులెందరో పాల్గొన్నారు.




"ఆంగ్లంలో ప్రపంచసాహిత్యాన్ని ప్రోది చేసే" వీరందరి కవితల మేలు సంపుటి 'పొయెట్ పారడైజ్', 243 కవితలతో 1/4 డెమీ సైజులో 245 పుటల అందమైన సంపుటిగా ప్రచురించబడింది. వెల రూ. 500/- కావలసిన వారు ఈ నంబర్లలో సంప్రదించగలరు.

Ph: 0966893484 & 099 85444686

e-mail: festivalpoetry@yahoo.com

ప్రపంచశాంతిని కాంక్షిస్తూ సాగిన ఈ కవిత్వ పండుగలో కవులందరూ శాంతి సౌభాగ్యాలను ప్రతిపాదించే మంచి కవిత్వం చదివారు. ఇటువంటి కవిత్వ పండుగలు అంతర్జాతీయ అవగాహనను, ప్రపంచ సౌభ్రాతృత్వాన్ని కలిగిస్తాయి. అందుకే ఇటువంటి పండుగల్లో కవులతో పాటు, అన్ని జీవనరంగాలకు చెందిన పౌరులు కూడా విరివిగా పాల్గోవాలి.

కవిత్వం, ఆ మాటకొస్తే లలితకళ ఏదైనా, మనసులను సున్నితపరుస్తుంది. మనుషుల్ని పెనవేస్తుంది.



# "కనెక్షన్ నిజం"



## ఏవిఎమ్

మానసకు శోభనం...

పాలగ్లాసుతో తలుపు దగ్గరే సిగ్గుతో తలవంచుకు నిలబడిన భార్యను చేయి పట్టుకుని డబుల్ కాట్ దగ్గరకు నడిపించాడు మహర్షి

"ఇప్పుడు నీకో నిజం చెప్పాలి!"

"చెప్పండి!"

"అదంటే నాకు చాలా ఇష్టం"!

"అంటే ! మీరు అల్రెడీ ఒకరికి అంకితమా!"

"అవును"!

"నాకన్నా అందంగా వుంటుందా?!"

"అవును"!

చాలా అందంగా వుంటుంది! అది పక్కనే వుంటే రోజులు క్షణాల్లా గడిచిపోతాయి!"

"మరి... దాన్నే చేసుకోక, నన్నెందుకు చేసుకున్నారు?!" "కట్నం ఇస్తున్నారని!"

"అది కట్నం తేలేదా?"

"లేదు!"

"అమ్మా! చూడవే నాకన్నా అదంటేనే బాగా ఇష్టం అంట! అది వరకే ఎవత్తెనో తెచ్చుకున్నారంట!"

"అల్లుడుగారూ! తండ్రి లేని పిల్లని ఇలా మోసంచేయడం తగునా!" (బోరున ఏడ్చేసింది)

"మోసమా ఏంటండీ! అది మా ఇంటా వంటా లేదు!"

"మరి... మరి... అదెవత్తో వున్నప్పుడు, నాపిల్ల గొంతు కోయడం ఎందుకూ!?

దాన్నే పెళ్ళి చేసుకోపోయావా! ఇంట్లో వాళ్ళని ఒప్పించి!"

"దాన్నెవరూ చేసుకోరూ, వుంచుకోవడమే!"

"అమ్మా! అమ్మా! చూశావా! వా..వా..!"

"అబ్బబ్బ నువ్వుండవే!! ఎంత మోసం, ఎంత దారుణం!!"

"ఆపుతారా మీగోల! అది ఇక్కడే వుంది చూపిస్తా!"

"ఏకంగా శోభనం గదిలోకే తెచ్చారా! మాకు తెలియకుండానే!?"

"వామ్మో!ఇక్కడే వుందా! దేవుడా, దేవుడా!" మానసరోధిస్తోంది

ఇదిగో అది, అటూ లాల్చీ జేబులోని 'సెల్'ఫోన్‌ను చూపించాడు మహర్షి, 3జి కనెక్షన్ కూడా తీసుకున్నా, సిన్మాలు, సీరియల్సూ, వార్తలూ అన్నీ చూడొచ్చు ప్రతినిముషం

నోరు తెరిచి బిగుసుకుపోవడం తల్లీ, కూతుళ్ళ వంతైంది.

ప్రొఫైల్

# బ్యాలేల 'బాద్‌షా' బ్నిం



బ్నిం ఓ ఫ్యామిలీ రైటర్
బ్నిం ఓ ఫెమిలియర్ రైటర్
బ్నిం సెటైర్లకే ఓ సెటైర్
బ్నిం నిరాశ నిస్పృహలను గెలిచిన ఫైటర్.
కథలు, కథానికలు, బ్యాలేలు,
బొమ్మలు, కార్టూన్లు వంటివి
ఒంటి చేత్తో నెట్టుకొచ్చే
ఈ కొంటె మనీషి ఓ 'విచిత్ర' కవి కూడాను.



సీరియస్ నెస్‌లెస్‌గా ఉండే టీవీ సీరియల్స్ రాయడం
ఈయన టాలెంట్‌కి ఓ ప్లస్,
దీనికి నంది అవార్డు గెలుచుకున్న 'రావోయి
చందమామ' సీరియల్‌ను 'మెచ్చు'తునకగా చెప్పకోవచ్చు.
శివాజీని వాళ్ల అమ్మ 'ఛత్రపతి'గా తయారుచేస్తే
'బ్నిం'ని వాళ్ల అమ్మ 'చిత్రపతి'గా తీర్చిదిద్దింది.
ఈయన పబ్లిక్‌కి, పబ్లిసిటీకి దూరంగా
ఉండడానికే ఇష్టపడతారు.

నంది అవార్డులు, బిరుదులు ఈయన్ని వరించి తరించాయి.
కల్మషంలేని పసిపాపాయిల బోసినవ్వు,
కల్లాకపటం ఎరుగని ఈయన మనసు,
చిన్నవారినీ ప్రేమించే పెద్ద మనసు వున్నటువంటి
అరుదైన వ్యక్తి 'బ్నిం' ఏ బిరుదుకైనా అర్హుడే.



రాతలో, గీతలో సహజ భావ చిత్రణలో 'బ్నిం' ఫేమస్
ఏ డిగ్రీ లేకున్నా సంగీత సాహిత్య నృత్య చిత్రలేఖనాది కళల్లో
అపారమైనటువంటి ప్రవేశం వున్నటువంటి,
డిగ్రీ ఆఫ్ నాలెడ్జ్‌లో 'బ్నిం' ఓ జీనియస్.
కొండ అద్దంముందు కొంచమై ఉండదా... అన్నట్లు
బి. నరసింహమూర్తి అనే ఈ 'బ్నిం' మూర్తి చిన్నదైనప్పటికీ
ఈయన ఘనకీర్తి ఎంతో పెద్దది.
వైకల్యాన్ని అధిగమించి జీవన సాఫల్యాన్ని సాధించిన 'బ్నిం'
వికలాంగులకు, సకలాంగులకు ఓ సజీవ ఆదర్శం.



బ్నిం తో వ్యాసరచయిత
బి.ఎం.పి. సింగ్



ఈయన అభివృద్ధికి పట్టుకొమ్మలు ఇతనిని కన్న అమ్మ,
ఈయన గీసిన బొమ్మ ఆలంబనలుగా నిలుస్తాయి.
'బ్నిం' హృదయం లలితకళల నికేతనం.
'బ్నిం' సాక్షాత్తు కళామతల్లి చేతిలోని కేతనం
కోనసీమ కొబ్బరినీళ్ల వంటి తెలుగుభాష
నందించడంలో 'బ్నిం'
తనకుతానే సాటిగా నిలుస్తాడు.
కోనసీమ కొబ్బరాకులపై హాస్యపు కవితలు, కథలు,
కార్టూన్లు గీసి
ఆంధ్రదేశమంతటా కితకితలు పెట్టిన కోనసీమ
కొంటె కుర్రాడీయన.

సప్తస్వరాల రంగుల కలయిక - సరిగమపదని సప్తస్వరాలు
జతిలయల మేళవింపుతో
నేటివరకు ఎవరూ రాయలేనన్ని, 200కి పైగా బ్యాలేలు
రాసిన 'బ్నిం'
ఆబాలగోపాలాన్ని అలరించి ఈయన్ని బాలే బాద్‌షాగా
నిలిపాయి.
తల్లి ఆలనతో, పాలనలో అక్షరాభ్యాసం లేకుండానే
భాషాభ్యాసం చేసి,
ఆటపాటల వయసులోనే తన జీవితంలో
ఎన్నో ఆటుపోటులను తట్టుకొని సాహితీ చిత్ర కళాసాగరాన్ని
ఈదగలిగాడు.

17 యేళ్లపాటు తాను పడివున్న మంచంలోనే
ఈయన తన భావి ప్రపంచం సృష్టించుకుని
బహుముఖ ప్రజ్ఞాశాలిగా నేడు మనముందు
మహోన్నత శిఖరాలను అందుకొని,
ఓ చరిత్ర సృష్టించి చరితార్థుడయ్యాడు.
నేటి, రేపటి తరానికి మార్గదర్శకునిగా
ఓ ఆదర్శ కళాకారునిగా మనముందు నిలిచాడు.

**బి.ఎం.పి. సింగ్**



## 'బ్నిం' గురించి...

పుట్టింది : 53 యేళ్ళ క్రితం
ఆత్రేయపురం(తూ.గో. జిల్లా)

చదువు : అమ్మ ఒడిలో

పూర్తిపేరు నరసింహమూర్తి భమిడిపల్లి

పబ్లిష్డ్ బుక్స్ : మిసెస్ అండర్‌స్టాండింగ్
అనగనగా...'బ్నిం' కథలు
అనగనగా... 'ఇంకొన్ని కథలు
అనగనగా... మరికొన్ని కథలు
మరపురాని మాణిక్యాలు

అవార్డు : ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నుండి 4సార్లు
నంది అవార్డులు (కథా, మాటల,
స్క్రీన్‌ప్లే రచయిత)వంశీ, కళానిలయం,
యువ కళావాహిని, ఆరాధన,
రోటరీ క్లబ్ లాంటి
ప్రముఖ సంస్థల నుండి ప్రోత్సాహం

వృత్తి : రచయిత, కార్టూనిస్టు, ఆర్టిస్టు, డాన్స్
బ్యాలేల రచన

అభిమానించేది : బాపు, ముళ్ళపూడి
వెంకటరమణగార్లతో
పాటు తన మిత్ర
బృందాన్ని



బ్నిం రాసిన కామసూత్ర బ్యాలేను ప్రదర్శిస్తున్న స్వాతీ సోమనాథ్






బాపు, రమణ లతో బ్నిం



www.64kalalu.com
64 కళలు.కామ్
సకల కళల సమాహారం
సంపుటి :1 సంచిక :4 ఫిబ్రవరి 2011



## కృతజ్ఞతలు

64కళలుడాట్‌కామ్ మూడు నెలలు పూర్తిచేసుకొని నాలుగోనెలలో ప్రవేశించింది. విశ్వవ్యాప్తంగా 38 దేశాలలో వున్న తెలుగువారు వీక్షిస్తున్న ఈ పత్రికకు రోజురోజుకు ఆదరణ పెరుగుతూనే ఉంది. ఈ నెలనుండి ప్రారంభించిన పగటివేశాలు-సామాజికాంశాలు శీర్షిక కూడా పాఠకాదరణ పొందగలదని ఆశిస్తున్నాం.

మెనూ గ్యాలరీలో వున్న నాలుగు విభాగాలకు, లైబ్రరీకి కూడా ఎప్పటికప్పుడు కొత్తవి చేర్చడం జరుగుతుంది. గమనించగలరు.

పత్రికలో వ్యాసాలు బాగున్నాయని అభిమానంతో ఇ-మెయిల్స్ ద్వారా అభిప్రాయాలు తెలియజేస్తున్న పాఠక, కళాభిమానులకు కృతజ్ఞతాభివందనాలతో...

కళాసాగర్
ఎడిటర్

ముఖచిత్రం చిత్రకారుడు : డా॥ బి.ఏ. రెడ్డి

# చిత్రకళారత్న బి.ఏ. రెడ్డి

- ఎన్.వి.పి.యస్.యస్ లక్ష్మి



నీరు పల్లమెరుగు-నిజం దేముడెరుగు... ప్రతిభాపాటవాలను పురస్కారాలెరుగు.

ప్రతిష్ఠాకరమైన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ కళారత్న(హంస) అవార్డు... నేడు ఆయనను వరించడం ఆయనకు సాధారణమే అయినా మనకందరకు అసాధారణం. కనుక ఈ సందర్భం ఆయన కృషిని మళ్ళీ స్మరించుకొనే ఒక సదవకాశం. జానపద చిత్రకారునిగా, చిత్రకళోపాధ్యాయునిగా తన జీవితాన్ని మొదలుపెట్టిన శ్రీ బి.ఏ. రెడ్డి చిత్రకళనే తన జీవితముగా మార్చుకొని - అనుభూతులను రంగులుగా, తన అనుభవాలను అంశాలుగా రంగరించి తన విలువైన కాలాన్ని అపురూపమైన చిత్రాలుగా మలుచుకున్నారు.

చిత్రాన్ని లిఖించడం లేదా బోధించడం, చిత్రకళా కార్యక్రమాలు నిర్వహించడం చేస్తూ తన ఆశయాలను సాఫల్యం చేసుకుంటూ వస్తున్నారు. సుమారు 50 సం॥ల నిర్విరామకృషికి ఫలితంగా ఎన్నో అద్భుత చిత్రాలు, "యంగ్ ఎన్వాయిస్ ఇంటర్నేషనల్ సంస్థ "సంస్కృతి" రూరల్ ఆర్ట్ సెంటర్, "ఆర్ట్‌డ్రైవ్" త్రైమాసిక పత్రికలు ఉద్భవించాయి.

ఎందరో చిన్నారులు జాతీయ దృక్పథాలను, మానవతా విలువలను, కళాభిమానాన్ని పెంచుకొని ప్రతిభావంతమైన చిత్రకారులుగా ఎదిగారు. జపాన్, పోలెండ్, ఫిన్‌లాండ్, మేసిడోనియా, బల్గేరియా, హంగరీ, రష్యా, ఇరాన్, పోర్చుగల్, స్లోవేకియా, స్లోవేనియా, ఈజిప్ట్, నోవాజిగోర, జర్మనీ, జకే రిపబ్లిక్‌లనుండి ప్రతిష్ఠాకరమైన బహుమతులను సాధించగలిగారు.

"కళ కళ కోసమే కాదు సమాజానికి కూడా చిత్రకారులు తాము సమాజంలో సభ్యులమన్న సంగతి గుర్తుంచుకోవాలి. అప్పుడే సమాజానికి మేలు చేయగలరు" అని శ్రీ రెడ్డిగారు తన అభిప్రాయాన్ని చెప్పడమే కాకుండా ఆ మాటలను అక్షరాల నిజం చేసారు. వీరు సాగించిన చిత్రకళా కృషి, చేసిన సేవలను ప్రభుత్వంతో పాటు పలు సంస్థలు గుర్తించాయి.

ప్రతిభకు పురస్కారాలు కొలమానాలు, ప్రోత్సాహకరాలు 'బాలబంధు' డా॥ బి.ఏ.రెడ్డిగారు అందుకున్న పురస్కార మాలికను పరిశీలిస్తే

- 1980 సం॥లో ఉత్తమ చిత్రకళోపాధ్యాయునిగా రాష్ట్రపతి డా॥ నీలం సంజీవరెడ్డిగారు ద్వారా
- 1984 సం॥లో రష్యా దేశపు ప్రతిష్ఠాకరమైన "సోవియట్ ల్యాండ్ నెహ్రూ అవార్డు"

ఉపరాష్ట్రపతి శ్రీ ఆర్, వెంకటరామన్ ద్వారా



- 1989 సం॥లో సి.సి.ఆర్.టి. "జాతీయ అధ్యాపక పురస్కారం" ఉపరాష్ట్రపతి డా॥ శంకర్ దయాళ్ శర్మగారి ద్వారా
- కేంద్రీయ విద్యాలయ సంఘటన్ ద్వారా 'ఎమినెంట్ ఆర్టిస్ట్' అవార్డును

## బి.ఎ. రెడ్డి గారి గురించి...




పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వ విద్యాలయం గౌరవ డాక్టరేట్ ప్రదానం
గవర్నర్ శ్రీ సుశీల్ కుమార్ షిండే, డా. జి.వి. సుబ్రహ్మణ్యం గార్లతో-2005

పుట్టింది 1940 కృష్ణాజిల్లా పామర్రులో

1958లో గుంటూరు జిల్లా పరిషత్ హైస్కూల్‌లో చిత్రకళోపాధ్యాయుడిగా తొలి ఉద్యోగం

1962లో సరోజిని గారితో వివాహం

1963లో నాసిక్‌లోని సెంట్రల్ స్కూల్‌లో ఆర్ట్ మాస్టర్‌గా చేరిక

1966 లో గోల్కొండ సెంట్రల్ స్కూల్‌కు బదిలీ

1983లో సొంత ఇంట్లో 'యంగ్ ఎన్వాయస్ ఇంటర్నేషనల్' సంస్థ స్థాపన

1994 సంస్కృతి రూరల్ ఆర్ట్ సెంటర్ ప్రారంభం

2000 సం॥లో చిత్రకళోపాధ్యాయుడుగా పదవీవిరమణ

1991 నుండి గత 19 యేళ్ళుగా జాతీయ, అంతర్జాతీయ సమాచారంలో 'ఆర్ట్‌డ్రైవ్' త్రైమాసిక పత్రికను ప్రచురిస్తున్నారు

✷ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ద్వారా 'బాలబంధు' ప్రతిభా పురస్కారం

✷ ఆల్‌ఇండియా ఫైన్ ఆర్ట్స్ అండ్ క్రాఫ్ట్స్ సొసైటీ, న్యూఢిల్లీ ద్వారా "అవుట్‌స్టాండింగ్ వెటరన్ ఆర్టిస్ట్" అవార్డు

✷ సంస్కార భారతి వారి గురుపూజా పురస్కారం

✷ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారి ద్వారా ఉగాది పురస్కారం

✷ విశాఖపట్నం లలితకళా పరిషత్ ద్వారా చిత్రకళా శిరోమణి అవార్డు

✷ మద్రాస్ తెలుగు అకాడమీ ద్వారా "సమైక్య భారతి" గౌరవ పురస్కారం.

✷ 'టీచర్ ఆఫ్ గ్రేట్ సక్సెస్' పురస్కారాలను ఫిన్‌లాండ్, పోలెండ్, స్లోవేనియా, స్కోప్జీ, పోర్చుగల్, హంగరీ, మాస్కో, బిటోలా, రోమేనియా, చైనా, స్లోవేకియా వంటి వివిధ దేశాలనుండి

✷ పోలెండ్ ప్రభుత్వం ద్వారా ప్రత్యేక స్వర్ణఫలకం మరియు గౌరవ డిప్లొమా

✷ భీమునిపట్నం సనాతన ధర్మ ఛారిటబుల్ ట్రస్ట్ వారి ద్వారా శ్రీరామ నవమి ప్రతిభా పురస్కారం

✷ పొట్టిశ్రీరాములు తెలుగు యూనివర్శిటీ వారి ద్వారా గౌరవ డాక్టరేట్ వంటి ఎన్నో పురస్కారాలు ఆయనను అలంకరించి కళా ప్రపంచాన్ని అలరించాయి. నేడు క్రొత్తగా 'హంస' అవార్డ్ అనే మణిపూస ఆయన మాలికలో చేరింది.

ఈ అవిశ్రాంత చిత్రకారులు పదవీ విరమణానంతర కాలాన్ని



కూడా ఇంకా ఉత్సాహవంతముగా కళాపూర్ణం, ఆదర్శవంతం చేసుకుంటూవస్తున్నారు. ఎందరికో స్ఫూర్తిదాయకమైన జీవన శైలి అనుసరణీయం... అసంఖ్యాకమైన వీరి శిష్య బృందానికి, కళాభిమానులకు ఈ వార్త సమ్మోదపూర్వక హర్షణీయం...

ఈ సందర్భముగా డా॥ బి.ఎ.రెడ్డిగారికి శుభాభివందనం...

# మన కూచిపూడికి గిన్నీస్‌లో స్థానం



**ఇది నిజంగా అరుదైన గుర్తింపు. వాస్తవానికి 'కూచిపూడి'కి ప్రపంచ స్థాయిలో ఏనాడో గుర్తింపు లభించింది. ఇటీవల రాష్ట్ర రాజధానిలో 2,800 కళాకారులు నృత్య ప్రదర్శన ఇచ్చినప్పుడు ఆ కార్యక్రమం గిన్నిస్ బుక్‌లో స్థానం సంపాదించుకోవడం తెలుగువారికి గర్వకారణం.**

ఈ విశేష కార్యక్రమంలో 16 దేశాలనుంచి కళాకారులు వచ్చి పాల్గొన్నారంటేనే ఇది ఇతర దేశాలలో ఎంతగా పేరు తెచ్చుకుందో అర్థం చేసుకోవచ్చు. అమెరికాలోని కాలిఫోర్నియాలో ఉన్న సిలికాన్ ఆంధ్ర సాంస్కృతిక సంస్థ, రాష్ట్రప్రభుత్వం కలిసి ఈ ప్రత్యేక రెండవ అంతర్జాతీయ కూచిపూడి నాట్యోత్సవాలను ఏర్పాటు చేశాయి. మూడు రోజుల ఈ కార్యక్రమంలో చివరి రోజున సుమారు 20 నిమిషాల పాటు ఈ కళాకారులు అత్యద్భుతంగా నాట్య ప్రదర్శన జరిపి, నాట్య ప్రియుల్ని ఆనందోల్లాసాల్లో ముంచెత్తారు.

"యువతను ఉత్తేజితుల్ని చేయడానికి, కూచిపూడి నాట్యానికి పూర్వ వైభవాన్ని తీసుకురావడానికి" ఈ కార్యక్రమాన్ని ఏర్పాటు చేశారు. బహుశా ఆ ఉద్దేశంతోనే కేంద్ర మంత్రి డి. పురంధరేశ్వరి కూడా 15 నిమిషాల పాటు ప్రేక్షకులంతా మైమరచిపోయేటట్టు నృత్య ప్రదర్శన జరిపారు. కూచిపూడి నాట్యానికి ప్రధాన కేంద్రమైన కృష్ణా జిల్లాలోనే పుట్టి పెరిగిన పురంధరేశ్వరి చిన్నతనంలో ఈ నాట్యాన్ని శ్రద్ధాసక్తులతో నేర్చుకున్నారు. విజయవాడకు సుమారు 50 కిలోమీటర్ల దూరంలోని కూచిపూడి గ్రామంలో 13వ శతాబ్దంలో ప్రారంభమైన ఈ నాట్యకళ సుమారు 800 ఏళ్లుగా భరతనాట్యం, కథకళి, కథక్ వంటి వివిధ నాట్య రీతులకి మకుటం లేని మహారాణిగా ఉంటూ వస్తోంది.

కూచిపూడి నాట్యానికి ఆద్యుడైన సిద్ధేంద్ర యోగి 13వ శతాబ్దంలో 'భామాకలాపం' పేరుతో ఇతివృత్తాన్ని రచించి, దానికి గీత గానాలను జోడించి, ఒక అద్భుతమైన నృత్య ప్రదర్శనగా తీర్చిదిద్దారు. దాన్ని తన స్వగ్రామమైన కూచిపూడిలోని పలువురికి నేర్పారు. అది తరువాత తరాలవారికి కూడా సక్రమంగా అందేటట్టు కృషి చేశారు. ఈయన నాట్య కళకు తన గ్రామంలోనే కాకుండా ఇతర ప్రాంతాలలో సైతం గట్టి పునాదులు వేశారు. ఆయన కృషి ఫలితంగా ఈ నాట్య కళ దక్షిణ భారతదేశంలోనే కాకుండా, ప్రపంచ వ్యాప్తంగా కూడా వేళ్ళూనుకుంది. ఈ భామా కలాపాన్ని






ప్రముఖ సాహితీవేత్త విశ్వనాథ సత్యనారాయణ 'వడకట్టిన అలంకార భరత శాస్త్రం'గా అభివర్ణించారు. నవరసభరితమైన కూచిపూడి నాట్య చరిత్రలో స్త్రీ పాత్రల్ని ఎక్కువగా పురుషులే పోషించడం విశేషం. భామా కలాపం తరువాత క్రమంగా ప్రహ్లాద, ఉషాపరిణయం, శశిరేఖా పరిణయంలతో పాటు ఇంకా అనేక యక్షగానాలు రూపుదిద్దుకున్నాయి. వీటన్నిటికీ దేశమంతా ప్రాచుర్యం లభించింది. యక్షగానానికి దేశమంతా ప్రాధాన్యత పెంచడంలో చింతా వెంకట్రామయ్య, చింతా కృష్ణమూర్తి, వెంపటి వెంకటనారాయణ, చింతా నారాయణ, వేదాంతం చలపతి, వేదాంతం సత్యనారాయణ శర్మ, వేదాంతం పెద సత్యం, వేదాంతం చిన సత్యనారాయణ వంటి వారు ముఖ్యులు. ఈ నాట్య కళను మరింతగా విస్తృతం చేయాలనే ఉద్దేశ్యంతో 1989లో అప్పటి ముఖ్యమంత్రి ఎన్టీరామారావు పొట్టి శ్రీరాములు విశ్వవిద్యాలయంలో విలీనం చేశారు.

అమెరికా నుంచి ఆస్ట్రేలియా వరకు కూచిపూడి నాట్యాన్ని సాధన చేయని భారతీయులు లేరంటే అతిశయోక్తేమీ ఉండదు. అయితే కూచిపూడి అనేసరికి ఎవరికైనా 'భామా కలాపం' గుర్తుకు వస్తుంది. అసలు కూచిపూడి నాట్యం అంత ప్రాశస్త్యం సంపాదించడానికి చాలావరకు భామా కలాపమే కారణమని ఘంటాపథంగా చెప్పవచ్చు. ఇది కూచిపూడికి దాదాపు పర్యాయపదంగా మారిపోయింది. అయితే, విచిత్రమేమిటంటే, ఒక శతాబ్దం కిందటి వరకూ దాదాపు భామా కలాపంతో సమానంగా 'గొల్ల కలాపం'అనే ఇతివృత్తానికి కూడా అంత ప్రాభవమూ ఉండేది. కూచిపూడి భాగవతులు మాత్రమే కాక, వీధి నాటకాల్లోనూ ఈ భామా కలాపాన్నీ, గొల్లకలాపాన్నీ ప్రదర్శిస్తూ ఉండేవారు.

భామా కలాపం కన్నా గొల్ల కలాపం మేధావి వర్గాన్నే కాస్తంత



**హైదరాబాద్‌లో 2800 మంది నృత్యకళాకారులతో ప్రదర్శన**

**కేంద్రమంత్రి డి. పురందేశ్వరి 15 నిమిషాలు నృత్యప్రదర్శన**

**రాష్ట్రపతి శ్రీమతి ప్రతిభా పాటిల్ సమక్షంలో కూచిపూడికి గిన్నిస్‌బుక్‌లో స్థానం**



ఆకట్టుకుంటూ ఉండేది. ఇందులో అశువుకి, సృజనాత్మకతకి, హాస్యానికి, చమత్కార చాతుర్యానికి పెద్ద పీట వేస్తుంటారు. దీనికి భాష మీద కూడా బాగా పట్టుండాలి. అంతే కాదు, గొల్ల కలాపంలో అరుదైన ఆధ్యాత్మిక రహస్యాలు కూడా అంతర్లీనంగా ఉంటాయి. ఓ గొల్ల భామ ఓ బ్రాహ్మణుడితో జరిపే వాదనను ఇందులో హృద్యంగా, అద్భుతంగా పొందుపరిచారు. పిండోత్పత్తి దగ్గర నుంచి బ్రహ్మ జ్ఞానం వరకు అనేక ఆధ్మాత్మిక విషయాల మీద వారిద్దరి మధ్యా ఆసక్తికరమైన చర్చ జరుగుతుంది. యజ్ఞయాగాల ప్రాధాన్యాన్ని చాల చక్కగా వివరిస్తుంది. ఆమె గ్రామ్య భాషలోనూ, ఆయన గ్రాంథికంలోనూ వాదించుకోవడం చాలా అద్భుతంగా సాగుతుంది. చివరికి గొల్లభామే బ్రాహ్మణుడి కళ్లు తెరిపిస్తుంది. మనుషులంతా సమానమే అని నిరూపిస్తుంది. అతి జటిలమైన అంశాలను అతి తేలిక భాషలో కూర్చి, అటు పండితుల్ని, ఇటు పామరుల్ని రంజింపజేసిన ఈ వాచికాభినయం నిజంగా కన్నుల పండుగ, వీనుల విందు చేస్తుంది. సుమారు 18వ శతాబ్దపు ప్రారంభంలో ప్రముఖ రచయిత్రి, సన్యాసిని అయిన తరిగొండ వెంగమాంబ రచన ఆధారంగా గొల్లకలాపం రూపుదిద్దుకుంది. 1800 ప్రాంతంలో పరమ గురు భాగవతుల రామయ్య ఈ గొల్ల కలాపాన్ని 'ఆత్మ యజ్ఞము అను గొల్ల కలాపం'పేరుతో రచించారు. 1800 చివర్లో, 1900 ప్రారంభంలో ఆయన శిష్యులు ప్రముఖ భాగవతులు తాడేపల్లి పేరయ్య, భాగవతుల విస్సయ్య, వెంపటి వెంకట నారాయణ, చింతా వెంకట రామయ్య వంటి వారు ఈ గొల్ల కలాపానికి ఎంతో ప్రాచుర్యం కల్పించారు. గొల్ల కలాపం మీద పట్టు సంపాదించాల్సిన వాళ్లు తప్పనిసరిగా పంచ మహా కావ్యాలూ ఔపోసన పట్టి ఉండాలి. సంస్కృతంలో ఛందోబద్ధంగా శ్లోకాలు చెప్పగలిగి ఉండాలి. పైగా కర్నాటక సంగీతం కూడా తెలిసి ఉండాలి. కచ్చితంగా అభినయం వచ్చి ఉండాలి. బహుశా ఇంత ప్రతిభను ప్రదర్శించాల్సిన అవసరం ఉన్నందుకనేనేమో, గొల్ల కలాపాన్ని ప్రదర్శించడం బాగా తగ్గిపోయింది. ఇంత అద్భుతమైన అభినయం క్రమంగా కనుమరుగైపోవడం నిజంగా దురదృష్టకరం. కూచిపూడి నాట్యానికి ఆద్యుడైన సిద్ధేంద్రయోగి స్థాయికే భాగవతుల రామయ్య కూడా చెందుతారనడంలో సందేహం లేదు. ఆయన భామా కలాపం ప్రాచుర్యానికి తన శిష్యులతో కలిసి దేశంలోని అనేక ప్రాంతాలలో పర్యటించడం విశేషం. ఓ నటుడిగా, ఓ సూత్రధారిగా అప్పట్లో ఆయనను మించినవారు లేరని చెప్పవచ్చు.

ఒకప్పుడు అటువంటి వైభవాన్ని సంతరించుకున్న కూచిపూడి నాట్యాన్ని ఇప్పుడు నేర్చుకునేవారు స్వస్థలంలో సాంతం తగ్గిపోతున్నారు. ఒకప్పుడు వేల సంఖ్యలో ఈ నాట్యాన్ని నేర్చుకునేవారు. కూచిపూడి నాట్యాన్ని జీవనాధారం చేసుకోవడం చాలా కష్టమని చాలామంది భావిస్తుండడమే ఇందుకు కారణం. గురువులు, శిష్యులు, ప్రేక్షకులు, సమాజం, ఇతర పరిస్థితులు వడివడిగా మారిపోతున్న ఈ సమయంలో సహజంగానే ఈ నాట్యం వెనుక బడిపోయింది. అయితే ఇప్పటికీ, వందలాది మంది ఈ నాట్యాన్ని నేర్చుకుంటూనే ఉన్నారు. "ఇప్పటి సమాజానికి అవసరమైన ఇతివృత్తాలతో నాట్యాంశాలను రూపొందిస్తే ఇది కొత్త ప్రేక్షకులను, కొత్త తరాలను ఆకట్టుకోగలుగుతుంది". అని ఇప్పటి తరం కూచిపూడి నాట్య నిపుణులైన చింతా రవి, బాలకృష్ణ వంటివారి అభిప్రాయం. చక్కని కథలు, సామాజికాంశాలతో కొత్త ఇతివృత్తాలను చేపడితే ఇంతకన్న అద్వితీయమైన నాట్యప్రక్రియ మరొకటి ఉండబోదని ఆయన అన్నారు. అంతార్జతీయ, జాతీయ స్థాయిల్లో గుర్తింపు తెచ్చుకున్న సమయంలో దీనికి స్వరాష్ట్రంలో ఆదరణ తగ్గుతోందని, ఇది ఈ నాట్యప్రాధాన్యం పట్ల అవగాహన లోపించడం కూడా ఓ కారణమని ఆయన అన్నారు. అట్టడుగు స్థాయిలో దీనిపట్ల అవగాహన పెరిగితే దీనికి మళ్లీ పూర్వ వైభవం పెరగడం ఖాయమని ఆయన భావిస్తున్నారు. ఆయన కూచిపూడిలోనే ఉంటూ ఈ నాట్యానికి మళ్లీ చక్కని ప్రాచుర్యం కల్పించే ప్రయత్నం చేస్తున్నారు.

సాహిత్యం

# తెలుగు పత్రికలు - సంపాదకులు

పుస్తకాలు, పత్రికలు లేని ప్రపంచాన్ని నేడు ఊహించుకోలేం. ఈ ప్రపంచంలో పుస్తకం ఓ అద్భుతం. ఎందరెందరో భాషాభిమానం, దేశాభిమానం, సమాజశ్రేయస్సు, ఉద్యమస్ఫూర్తితో పత్రికలు స్థాపించి పాఠకులకు అందుబాటులోకి తెస్తున్నారు. లెక్కకు మిక్కిలిగా వెలువడుతున్న పత్రికలలో చిరకాలం నడిచేవి-పాఠకాభిమానం పొందేవి కొన్నే. పత్రికలను పాఠకాభిమానం పొందేలా సారథ్యం వహించేవాడు సంపాదకుడు. అలాంటి సంపాదకులను 64కళలు.కామ్‌లో నెల-నెలా పరిచయం చేసే శీర్షికే తెలుగుపత్రికలు-సంపాదకులు.



## తెలుగు నాటక రంగ పత్రిక-కళాదీపిక

*తెలుగునాటక రంగం గూర్చి, నటుల గురించి తెలియజేసే లక్ష్యంతో, ఒక నటునితో స్థాపించబడిన పత్రిక కళాదీపిక. తొలుత పక్షపత్రికగా ప్రారంభించబడి, తర్వాత మాసపత్రికగా రూపాంతరం చెంది, ఏడేళ్ళుగా పాఠకులను అలరిస్తున్న పత్రిక కళాదీపిక మాసపత్రిక. ఎడిటర్ & పబ్లిషర్‌గా ద్విపాత్రాభినయం చేస్తూ నెల-నెలా పత్రికను సర్వాంగసుందరంగా తీసుకువస్తున్న వి.యస్. రాఘవాచారి గారి మనోభావాలు వారి మాటల్లో...*




● *'కళాదీపిక' మాసపత్రికను ఎప్పుడు స్థాపించారు?*

'కళాదీపిక' తొలుత 1-7-1990న పక్షపత్రికగా ప్రారంభింపబడి, క్రమం తప్పకుండా వరుసగా 32 సంచికలు వెలువడింది. కారణాంతరాల వలన ఆ తదుపరి ముద్రణకు నోచుకోలేదు. పిదప2004 జనవరి నుండి మాసపత్రికగా రూపాంతరం చెంది, 2010 డిశంబరు 31 నాటికి 7 వసంతాలు నింపుకొని, 84 సంచికలను క్రమం తప్పకుండా వెలువరించి ఎనిమిదో వసంతంలోకి అడుగిడింది.

● *'కళాదీపిక' పేరునే ఎంచుకోవటానికి కారణం?*

కళాసాహిత్య రంగాల భూమికగా, కళాకారుల పరిచయ వేదికగా, కళాప్రియుల కరదీపికగా పత్రికను రూపొందించదలచి 'కళాదీపిక' పేరును ఎంచుకోవడం జరిగింది.

● *స్థాపన ముఖ్యోద్దేశం- ప్రేరణ?*

రంగస్థల నటుడిగా, నాటక సంస్థ నిర్వాహకుడిగా, లైటీషియన్‌గా, 1970 నుండి 1997 వరకు దాదాపు మూడు దశాబ్దాలు నాటక ప్రదర్శనలతో మమేకమై, నాటకరంగం పట్ల అపరిమిత అభిమానాన్ని పెంచుకున్న నేను విధి బలీయమై, కారణాంతరాల వలన 1998 నుండి నాటక ప్రదర్శనల్లో ప్రత్యక్షంగా

## కళాదీపిక మాసపత్రికపై ప్రముఖుల స్పందన:

విలువైన రచనలతో ఆకర్షణీయంగా 'కళాదీపిక'మాసపత్రికపై ప్రముఖుల స్పందన పత్రికను ప్రచురిస్తున్న మీకు అభినందనలు.

*డా॥ జానమద్ది హనుమచ్ఛాస్త్రి*
*కడప, 21-02-2004*

'కళాదీపిక' పత్రిక రెగ్యులర్‌గా అందుతోంది. కృతజ్ఞతలు. 'కళా దీపిక' పత్రికను కళలు, సాహితీ, సాంస్కృతిక రంగ విశేషాలతో, సాహితీ విలువలు పెంపొందించే విధంగా పాఠక లోకానికి అందించడం అభినందనీయం.

*ప్రొఫెసర్ జి.వి. సుబ్రహ్మణ్యం, వైస్-ఛాన్సలర్*
*పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం*
*హైదరాబాదు, 29-10-2004*

'కళాదీపిక' ప్రత్యేక సంచిక అందింది. సంచిక చాలా బాగుంది. మంచి వ్యాసాలు చోటు చేసుకున్నాయి.

*ఎస్.ఆర్. పృథ్వి, కవి, రచయిత*
*రాజమండ్రి, 01-02-2005*

మీకున్న పరిధిలో వివిధ కళా విషయాలలో మంచి వ్యాసాలను ప్రచురించారు. కళలపట్ల మీకున్న అభిమానానికి ధన్యవాదాలు. పత్రిక నిర్వహణ అతి క్లిష్ట సమయంలో సుందరంగా 'కళాదీపిక'ను వెలువరిస్తున్నందుకు నా హృదయపూర్వక కళాభివందనములు

*'కళాప్రపూర్ణ' డా॥ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి*
*విజయవాడ.*
*18-11-2005*

పాల్గొనలేకపోయాను. అయినా, నాటక రంగంతో విడదీయరాని నా అనుబంధం 'కళాదీపిక' స్థాపనకు ప్రేరణ అయ్యింది. ఆంధ్రదేశంలోని శతాధిక రంగస్థల నటులతో కలిగిన ముఖాముఖి పరిచయం-స్నేహ సంబంధంపైప్రేరణకు ప్రోత్సాహానిచ్చింది. పైగా హైస్కూలు స్థాయినుంచి తెలుగు సాహిత్యంపై నాకున్న మమకారం, అభిరుచి, ఆసక్తి, అనురక్తి 'కళాదీపిక'కు శ్రీకారం చుట్టడానికి పాదులు వేసింది.

● *పత్రికా ప్రచురణలో పంపిణీలో సాధక బాధకాలు గురించి తెలియజేయండి?*

'కళాదీపిక' ప్రారంభించిన నాటి నుండి నేటి వరకు పత్రికా ప్రచురణలో కాని, పంపిణీలోగాని ఎటువంటి సంక్లిష్టమైన పరిస్థితులు తారసిల్లలేదు. ఈనాటి వరకూ పత్రిక స్వయంపోషకమై వున్నందున ప్రచురణకు అతి ముఖ్యమైన ఆర్థిక వనరుల గురించి కాని, మరే ఇతర విధంగా కాని సమస్యలు ఎదుర్కొనలేదు.

ఇక పంపిణీ విషయానికొస్తే-ఇది కేవలం చందాదారుల పత్రికే గనుక, వారందరికీ తపాలాశాఖ ద్వారా బట్వాడా చేయబడుతుంది. ఈ బట్వాడాలో అప్పుడప్పుడూ, ఏ ఒకరిద్దరికో పత్రిక అందకపోవటం జరుగుతుంది. అలాంటి వారి నుండి కబురందిన వెంటనే వారికి మరొక ప్రతిని పంపడం జరుగుతుంది. ఇలా అప్పుడప్పుడూ ఒకరిద్దరికి అందకపోవడం పెద్దగా పరిగణలోనికి తీసుకొనవలసిన సమస్యగా అనిపించలేదు. ఎందుకంటే సహజంగానే ఆర్డినరి ఉత్తరాలు గమ్యం చేరని సందర్భాలెన్నో మన తపాలా వ్యవస్థలో.



శ్రీ వేంకటేశ్వర నాట్యకళాపరిషత్తు, తిరుపతి స్వర్ణోత్సవాల సందర్భంగా డా॥ దాసరి నారాయణ రావు గారి నుండి జ్ఞాపికను అందుకుంటున్న దృశ్యం 06-06-2005

● *తెలుగు కళారంగంలో కళాదీపిక పత్రిక పాత్ర?*

సమకాలీన కళారంగ ప్రముఖుల ప్రతిభా వ్యుత్పత్తులను, సమకాలీన కళారంగ విశేషాలను వర్ధమాన కళాకారులకు అందించి వారికి కళారంగంలో మార్గదర్శనం చేయుటమేగాక, ముందుతరం కళాకారుల కళాభినివేశాన్ని స్ఫూర్తిదాయకంగా వర్తమాన తరానికి అందించడంలో 'వారధి'గా నిలిచి తన పాత్రను పోషిస్తుంది. మన కళాసంప్రదాయాలను-కళాకారుల కళాజీవిత విశేషాలను అక్షరరూపంలో భద్రపరిచి, మన వారసత్వ

2008 ఏప్రిల్ 16న 'తెలుగు నాటక దినోత్సవ' సందర్భంగా
శ్రీ యం. రవిచంద్ర, ఐ.ఏ.ఎస్., జిల్లా కలెక్టర్,
ఆర్.ఓ. శ్రీమతి టి. జయలక్ష్మి, చిత్తూరు ఎంమ్మెల్యే ఎస్. మనోహర్ సత్కరిస్తున్న దృశ్యం.

సంపదగా భావితరానికి అందించడంలో ప్రధాన పాత్ర వహిస్తుంది.

● *ప్రచురణా రంగంలో వచ్చిన టెక్నాలజీని వాడుకున్న విధం:*

మన ముందు తరాల వారికి లేని ఎన్నో సౌకర్యాలు–సౌలభ్యాలు నేటి ప్రింట్ మీడియా టెక్నాలజీలో అందుబాటులోనికి వచ్చింది. లేఔట్ డిజైనింగ్‌లో, పేజ్‌మేకప్‌లో డి.టి.పి. పాత్ర అమోఘం. ఛాయాచిత్రాలు అప్పటికప్పుడు పేజ్ లేఔట్‌కు అనుగుణంగా ఏ సైజులో కావాలంటే, ఆ సైజులో సెట్ చేసుకునే సదుపాయం, ఆయా శీర్షికలను, వ్యాసాలను, వార్తా విశేషాలను వివిధ రకాల ఫాంట్స్‌తో పాఠకునికి కనువిందుగా సమకూర్చే అవకాశం ఈనాటి ప్రింట్‌మీడియా టెక్నాలజీలో మెండు. రివర్స్, స్క్రీన్‌లతో బ్లాక్ & వైట్ పేజీని సైతం ఆకర్షణీయంగా తీర్చిదిద్దే సౌకర్యం, సి.డి. నుంచి డైరెక్ట్ ప్లేట్ మేకింగ్ పద్ధతితో పత్రికకు సిద్ధించే సొగసు తదితర లేటెస్ట్ ప్రింట్ మీడియా టెక్నాలజీ పత్రికను తక్కువ శ్రమతో ఎంతో అందంగా వెలువరించటానికి వాడుకుంటున్నాము.

● *'కళాదీపిక' ఎడిటర్ & పబ్లిషర్‌గా అనుభవాలు:*

ఏ పనిలోనూ విజయం సాధించాలన్నా, సత్ఫలితాలు పొందాలన్నా ప్రతి వ్యక్తికి కావలసిన ఆభరణాలు పట్టుదల, దీక్ష, నిర్విరామకృషి, లక్ష్యసాధన, కార్యోన్ముఖుడైన వ్యక్తి వీటిని పూర్తిగా అలవరచుకుంటే తాను సాధించాల్సింది సాధిస్తాడు–సత్ఫలితాలను పొందుతాడు. దీనికి 'కళాదీపిక కూడా నిదర్శనంగా నిలుస్తోంది. దీనికి తోడు పత్రికను క్రమం తప్పకుండా, నిర్ణీత సమయంలో పాఠకులకు అందించగలగడం పత్రిక మనుగడకు ఎంతైనా దోహదం చేస్తుంది. 'కళాదీపిక' ఎనిమిదో వసంతంలో అడుగిడటానికి ఇదే ప్రధాన కారణం. పైగా ముఖ్యంగా చిన్న పత్రికలవారు తమ చందాదారులతో స్నేహపూర్వక సంబంధాలు తప్పనిసరిగా కలిగివుండటం వారి సలహాలు–సూచనలు స్వీకరిస్తుండటం ఎంతైనా అవసరం. ఇది పత్రిక పట్ల పాఠకునికి బంధాన్ని – అనుబంధాన్ని ఏర్పరుస్తుంది. 'కళాదీపిక' ఎడిటర్‌గా & పబ్లిషర్‌గా ఇవి నా స్వీయానుభవాలు.

## రాఘవాచారి గురించి...

సాధారణంగా ఒక వ్యక్తి ఏ రంగంలోనైనా విజయం సాధించాడంటే, ఆ వ్యక్తి ఆ రంగంలో ఒక 'వెలుగు' వెలిగాడంటారు. కాని శ్రీరాఘవాచారిగారు నాటకరంగంలో తాను ఒక వెలుగు వెలగడమే కాకుండా రంగస్థలాన్ని, రంగస్థల కళాకారులను తన 'వెలుగు'లతో (టెక్నికల్ ఎఫెక్ట్/రంగోద్దీపనము) ఒక "వెలుగు" వెలిగించారంటే అతిశయోక్తి కాదు. భగవంతుడి సృష్టికి మూలాధారం సూర్యుడి వెలుగు, అనేక రంగస్థల ఉత్తమ ప్రదర్శనలకు మూలాధారం శ్రీ రాఘవాచారి "వెలుగులు". ఈ రంగస్థల 'వెలుగు'ల ప్రస్థానంలో రాఘవాచారి గారిది రాష్ట్రంలోనే అగ్రస్థానం బహుశా ప్రథమస్థానం కావచ్చు. ఆయన "వెలుగు"లతో ఎన్నో సంస్థలకు ఉత్తమ ప్రదర్శన బహుమతులు, ఎంతోమంది కళాకారులకు ఉత్తమ నటనకు బహుమతులు అందించారు. శతాధిక నాటక ప్రదర్శనలకు లైటింగ్ ఎఫెక్ట్స్ అందించిన ఘనత రాఘవాచారి గారిది.

ఆయన రంగస్థలంలోనే కాకుండా సాహిత్య ప్రక్రియలోకూడా బహుముఖ ప్రశంసలందుకుంటు న్నారనడానికి ఆయన మానసపుత్రిక, పత్రిక "కళాదీపిక" ఒక తార్కాణం.

రాఘవాచారిగారు తిరుపతిలో 2-9-1951న వీరవల్లి శేషమ్మ, విద్యావాచస్పతి వీరవల్లి రామానుజాచారి దంపతులకు జన్మించారు. ఆయన విద్యాభ్యాసం తిరుపతిలోనే సాగింది.

పదేళ్లప్రాయంలోనే బడిపంతులు పాత్ర ద్వారా రంగస్థల ప్రవేశం చేశారు. ఆ తర్వాత ఆయన నటించిన, లైటీషియన్‌గా సేవలందించిన, దర్శకత్వం వహించిన నాటికలు, నాటకాలు కోకొల్లలు. అన్నిటినీ ఉదహరించడం కష్టసాధ్యం. కాబట్టి మచ్చుకు కొన్ని.

"ఊరుమ్మడి బతుకులు, ప్రాణం ఖరీదు, చైతన్య



2008 జనవరి 12న గుంటూరు కళాపరిషత్ నాటకోత్సవాల్లో ముఖ్యఅతిధిగా ప్రసంగిస్తున్న దృశ్యం

తరంగం, త్వంజీవశరదశ్శతం, అదాలత్, కుందేటి కొమ్ము, పుటుక్కు జరజర డుబుక్కుమే. కొక్కొరకో, మృగరాజ్యం, గోగ్రహణం, గారడి, తపస్సు, శ్రీనివాస కళ్యాణము, శ్రీకృష్ణ పారిజాతము, అన్నమయ్య కథ".

పందొమ్మిదేళ్ళు నిండకనే "పద్మశ్రీ నాట్యకళా మండలి"ని స్థాపించారు. తన నిర్వహణ ప్రతిభతో అనేక నాటికలు, నాటకాలు ప్రదర్శించి ఆ సంస్థ కీర్తి పతాకాన్ని ఎగురవేసి అటు నటుడిగా, ఇటు నిర్వాహకుడిగా అనేక ప్రముఖుల ప్రశంస లందుకున్నారు. "పద్మశ్రీ" సంస్థ ద్వారా ఎందరో కళాకారుల్ని సన్మానించారు. రాఘవాచారి నటనలో విశిష్టస్థానం వహించేది ఆయన కంచుకంఠం. ఆ కంఠంలో తన నైపుణ్యాన్ని రంగరించి సన్మానపత్ర పఠనంలో ప్రతి మదిలో తనదైన ముద్ర వేయగలిగారు.

తన సన్మానపత్రం చదివిన రాఘవాచారిగారిని "ఇంత చక్కగా చదివిన వారిని నేనింతవరకు చూడలేదయ్యా" అని ప్రశంసల జల్లు కురిపించారు పద్మశ్రీ అల్లురామలింగయ్య.

ఇంతే కాక నాటికల న్యాయనిర్ణేతగా పలు పరిషత్తుల్లో, నంది నాటకోత్సవాలతో సహా, పాల్గొని తన చిత్తశుద్ధితో న్యాయనిర్ణయం చేసి అందరి మన్ననలను పొందారు.

# తెలుగు భాష నేర్వాలంటే...?





బి.ఎం.పి. సింగ్

నేడు ఇంగ్లీషు చదవటానికి వింత అభిమానం!

తెలుగు చదవటానికి ఎంత అవమానం!

మన మాతృభాషా నిర్లక్ష్యానికిదే కొలమానం

నేడు తెలుగు తెలిసిన వాడే తెలుగు తల్లికి తగు బహుమానం

మన మస్తకం తెలుగు వాడిది

మన చేతిలో పుస్తకం తెల్లవాడిది.

మన భాష రాని భవిష్యత్తు మన పిల్లవాడిది.

అందుకే మన తెలుగు తల్లి - తల్లడిల్లేది.



గ్లోబల్ విలేజి వచ్చి- ఇంగ్లీషు పై వింత పిచ్చి

తెలుగుపై పెరిగింది ఎంత కచ్చి

అందుకే తెలుగు పోతోంది చచ్చి

(సత్వరమే దీన్ని బ్రతికించాలి-

మనమందరం- ముందు కొచ్చి

అర్థం కాకపోయినా ఇంగ్లీషు ఘోష

తెల్లవారితే చాలు తెల్లభాష

గుడ్‌మార్నింగ్ నుంచి గుడ్ నైట్ వరకు

....(ఇంగ్లీషు ఛానళ్ళు మిడ్‌నైట్ వరకు)

# టూపీస్

## ఏవిఎమ్

రండి వడ్డించాను !అంటూ గావుకేక వేసింది మానస వంటింట్లోనుంచి

నిన్న "క్రాస్‌రోడ్స్" రెస్టారెంట్లో కూరలన్నీ సూపర్‌గా వున్నాయి లొట్టలేసుకుంటూ

తిన్నాం అన్నారుగా... రండి రుచి చూడండి అన్నది మానస చేతులు తిప్పుకుంటూ...

"ఏంటి అక్కడ పార్శిల్ తెప్పించావా!?" నోటి మీద అరచేయి పెడుతూ... అన్నాడు మహర్షి"

"లేదు...నేనే...వండాను"! "చెమటోడ్చి!"

ఆ కుళ్ళు జోకులెందుకూ తిని చెప్పండి"!!

ఎలా చేశావా! అని!?"

క్రాస్‌రోడ్స్ లేడీ కుక్‌ని బతిమాలి... ఏమేం కావాలో... ఎంతెంత వేయాలో అన్నీ రాసుకొని వచ్చి మరీ వంటచేశా!

"నిజమేననుకో ఎందుకైనా మంచిది అంబులెన్స్‌కి ఫోన్ చేసి తినడం ప్రారంభిస్తా!!"

"పక్కింటివాళ్లను ఎదురింటివాళ్లనీ భోజనాలకు పిలిచాను. మీరూ తిని బావున్నాయంటే ... వాళ్లనీ కేకేస్తా!"

"సరే అలాగే...!! "ఏమో ఎందుకో రాత్రి తిన్నంత రుచిగా లేవు!"

"నిజం చెప్పండి... లేదంటే, ఆ కుక్‌కి ఫోన్‌చేసి అడుగుతా! పాళ్ళు సరిగ్గా చెప్పిందో లేదో..."

"ఈ వంటకాలు చెప్పినందుకు రెండువేలు కొత్తనోట్లు, ఎప్పట్నుంచో నేను దాచుకున్నవి..."

"నా జేబులోంచి సరిచేసినవి' మానస మాటలకు అడ్డొస్తూ మహర్షి..

"ఆం తీశా నేనేగా తీసింది ... ఆ మాత్రం స్వతంత్రం లేదా నాకు!?"

"వుంటే... వుందిగాని... ఆ కుక్‌కి ఫోన్‌చెయ్యి"

"ఆం నేనే మానస గారూ... చెప్పండి! కూరలు, సాంబారు, పచ్చళ్ళు బాగా కుదిరాయా!?"

"లొట్టలేస్తూ తింటున్నారా? మీవారూ... పక్కింటి స్నేహితులూ!"

"ఇంకా అందాకా రాలా!.... రాత్రి మీరు వడ్డించినంత రుచిగా లేవంటున్నారు మా శ్రీవారు..."

"నేను అన్నీ మక్కికి, మక్కి పొల్లుపోకుండా చెప్పా!"

"మరెక్కడ వచ్చిందంటారు తేడా!?"

"నాకు తెలిసినంత వరకూ! ఒకటే తేడా కనిపిస్తోంది"

"అదేంటో త్వరగా చెప్పండి వెంటనే తెప్పించి వేస్తా అన్ని వంటకాల్లో"

"అది బయట తెప్పించి కూరల్లో వేసేది కాదు"

"మరేంటీ!? "మీ డ్రస్సూ!"

"ఆం తెల్లని మెల్లెపూవు లాంటి చీరెకట్టుకునే వున్నా! మీరు నిన్న ఏ డ్రస్సులో వడ్డించారూ?"

"చెబితే బాగోదు"!

"చెప్పండి!... నేనే చెప్పమంటున్నాగా!?"

"అది ... అది...! ఆం స్విమ్మింగ్ డ్రస్సు!"

"ఓస్ అంతేనా! నేను స్మిమ్మింగ్ చేసేటప్పుడు వేసుకునే డ్రస్సు ఇంట్లోనే వుంది"

"అవునా... అది టూపీస్ స్విమ్మింగేనా!"

"ఆం టూపీస్‌లో వుండి వడ్డించారా మీరూ!"

మూర్ఛపోయింది మానస!

సింగిల్ పేజీ కథ

# పగటి వేషాలు- సామాజిక అంశాలు

## బుడబుక్కల వేషం

రచన
ప్రముఖ నటుడు, చిత్రకారుడు
తాతా రమేష్‌బాబు

పగటి కలలు కనొద్దు అంటారు
పగటి వేషాలు వెయ్యొద్దు అని కూడా అంటారు.
వేషం అంటే మారు రూపం
రావణాసురుడు మారు రూపంలో వచ్చి సీతను మాయం చేస్తాడు.

పగటి వేషాలు చూసే కోణంలో వేషం వెనుక అసలు రూపం తెలుసుకోవాలి అవి ఇప్పటికి అన్వయించుకోవచ్చు.

ఈ వేషాల వెనుక ఆనాటి నేపథ్యం ఉంది. పురాణాలు, ఇతిహాసాలు మొదలైన వాటిలోనుంచి వచ్చిన వేషాలు ఆనాటి, ఈనాటి, రేపటి, జీవితాన్ని మనకు చూపిస్తాయి. సామాజిక పరిస్థితులు. మనిషిలోపలి విధ్వంసం గురించి చెప్తాయి. ఒక పరమప్రయోజనం ఆశించి మనిషిలో ఆశను కలిగిస్తాయి. మంచి జీవితానికి దిక్సూచిగా ఉంటాయి.

ఇప్పుడు చెప్పుకోబోయే పగటివేషాలలో కొన్ని అంతరించిపోవచ్చు. కొన్ని పాత్రలు ఆధునిక రూపాలలో మనం చూస్తూనే వున్నాం.

ఈ నాటి రకరకాల పాత్రలకు, వేషాలకు 'పగటి వేషాలే' మూలం.

### బుడబుక్కల వేషం

'బుడ... బుడ... బుడబుడ.... బుడబుక్...'

అనే ఢమరుక శబ్దం మధ్యలో ఘంటా నాదం, గంభీరమయిన కంఠస్వరంతో...

రాగ యుక్త కీర్తనలతో....'

ఆ ప్రదేశం గ్రామమే ! ఆ కాలం సంక్రాంతి కాలమే!

ఆ వచ్చింది బుడబుక్కల వారే!

పండిన పంటలతో గ్రామాలలో ఇళ్ళు కళకళలాడాలని, గ్రామం సుభిక్షంగా వుండాలని, ఆశిస్తారు బుడబుక్కల వారు. అలాగే బుడబుక్కల వారు తమ గ్రామానికి వస్తే శుభప్రదమని భావిస్తారు పల్లెవాసులు.

చేతిలో ఢమరురుకం, నడుముకు ఘంట, భుజాన జోలె, నల్ల కోటు వేసుకుని ఆపై శాలువా ధరించి , ఎర్రని తలపాగా చుట్టుకొని, నల్లటి గొడుగుతో కనిపిస్తారు బుడబుక్కల వారు. తెల్లవారు ఝామునే బిక్షాటన ముగించాలనేది వీరి సాంప్రదాయం.

పల్లెల్లో ఇల్లాళ్లు తెల్లవారు ఝామునే లేచి, వాకిట్లో కళ్లాపి జల్లి, అందమైన ముగ్గులతో అలంకరించే వేళ 'అంబ పల్కు.. జగదంబ పల్కు.' అంటూ వచ్చే బుడబుక్కల వారి ఆశీస్సులు తీసుకుని, బిక్షవేస్తారు. మగవాళ్ళు గేదెల దగ్గర శుభ్రంచేస్తూ, పండిన పంట తాలూకు ఆలోచనలు చేస్తూ చేయబోయే పనుల గురించి ఇంటికి కావలసిన అవసరాల గురించి, కొనబోయే వస్తువుల గురించి, కొత్త అల్లుళ్ళ గురించి... రకరకాల పథకాలు వేస్తూ వుంటారు.

తాము వచ్చిన ప్రదేశంలో ఏ వైపు ఈతి భాధలు వుంటాయో చెప్పి, నివారణ ఉపాయాలు ప్రజలకు తెలియచేసి ధైర్యం చెపుతూ



శ్రీ మిరియాల శేఖర్ బాబు, శ్రీనివాసరావు,రాము, కనక శ్రీను, యవిల్లి రమణారావు, బిళ్ళపాడు

ఈ వేషాన్ని బుడబుడకల వేషం అని పిలుస్తారు. ఈ వేషాన్ని ఇద్దరు, లేక ఐదుగురు ప్రదర్శిస్తారు. అందరికీ సంప్రదాయక వస్త్రాలుంటాయి. పంచే, లాల్చీ, లాయరు కోటు, పైన శాలువా, పెద్ద పెద్ద మీసాలు పెట్టుకుంటారు. నుదుటన పసుపు బొట్లు అడ్డంగా పెట్టి, ఆపైన ఎరుపు బొట్టు రూపాయి బిల్లంత సైజు పెట్టుకొని, గడ్డం మీద నుండి తలపైకి వచ్చేటట్లుగా ఎర్ర రంగు గుడ్డ చుట్టుకుంటారు. మెడలో రుద్రాక్ష, మాలలు, చేతికి కడియాలు, కాలికి గగ్గేరలు తొడుక్కుంటారు. ఇంతకు ముందు గ్రామ పెద్దలు బహుకరించిన సింహ తలాటాలు, మోడల్స్‌తో అలంకరించుకుంటారు. ఘంటాకంకణం, మకరకుండలాలు ధరించి గ్రామంలోకి అడుగు పెడతారు.

ముందుగా ఆ వూరి పోలేరమ్మను, ఆవూరి పెద్దలను అందరిని తలచుకొని, అక్కడ 'వురికట్టు' ఏర్పాటు చేసుకొంటారు. అమ్మవారికి మ్రొక్కి, ప్రార్థించి, కోడిని బలి ఇచ్చి, ఈవేషాన్ని ఊరంతా ప్రదర్శిస్తారు. ఉదయం ఆరు గంటలకు మొదలుపెట్టి మధ్యాహ్నం రెండు గంటల దాకా ప్రదర్శిస్తారు. ఐదుగురు వేషగాళ్ళతో ఒకరు బుడబుక్ వాయిస్తే, ఒకరు చేతిలో గజ్జెలు, ఒకరు గంట, ఒకరు డప్పు, మరొకరి చేతిలో భిక్ష పాత్ర వుంటుంది.

'అంబరావే... జగదంబ రావే... బుడబుక్

కలకత్తా ... కాళి రావే... బుడబుక్'

అయ్యలారా... అమ్మలారా... ఈరోజు వేషం బుడబుక్కలు. బుడబుక్కలు చెప్పే మాటలు దేవతలా ముచ్చట్లు

'కాశి విశాలాక్షి పల్కు... కంచి కామాక్షి పల్కు... బుడబుక్ కంబ కంటిని... కాళి రావే... బుడబుక్'

అయ్యలారా... అమ్మలారా... ఈరోజూ వేషం బుడబుక్కలు. బుడబుక్కలు చెప్పే మాటలు దేవతలా ముచ్చట్లు

కాశి విశాలక్షి పల్కు... కంచి కామాక్షి పల్కు... బుడబుక్

కలకత్తా కాళి పల్కు... మధుర మీనాక్షి పల్కు... బుడబుక్

ఆ కొండపై వెలసిన విజయవాడ దుర్గమ్మ పల్కు..'

మే ఇప్పుడు పుట్టినోల్లం కాదు మారాజా."కృతయుగం లో శ్రీహరి బుడబుక్కల వాని ఏసం ఏసి శివునికి త్రిపురసురల సంహరించే ఉపాయం జోస్యం చెప్పినాడు మారాజ్! త్రేతాయుగంలో డంబికాసురుడనే రాక్షసుడిని చంపి వాని డింభం డోలకడ మరుకం చేసి వాని నరము తాళ్ళుగా, చర్మం మూతలుగ, చేసి బుడబుక్కల వాని వేషంలో వచ్చి, సూర్యవంశం గురించి చెప్పి, దమరుకం వాయించిన మేము ఇప్పుడు ఇల్లిల్లు తిరిగి ముందుకు సాగుతారు బుడబుక్కల వారు. ఇది వీరి కులవృత్తి. వీరి కులం 'బుడబుక్కల' వీరు సంచార జీవులు. ఏగ్రామం వెళితే ఆ గ్రామ కుమ్మరుల ఇళ్ళ దగ్గరే ఉండి. భోజనం కూడా వాళ్ళ దగ్గరే చేస్తారు. సంచార జీవులైన వీరిని ఎస్టీలలో కలపలేదు ప్రభుత్వం.

స్వాతంత్ర్యానికి పూర్వం జమీందార్లు వీరికి భూములు ఇచ్చారు. సంక్రాంతి రోజులలో మూడు నెలలు యాచించగా వచ్చిన ధాన్యంతో జోలె నిండిపోయేది. అలా మూడు నెలల యాచనను, ఎడ్లబండి కెత్తుకుని వెళ్లేవారు. క్రమక్రమంగా రైతు పరిస్థితి దిగజారడంతో, యాచన లేక భుక్తి గడవటం ఇబ్బందిగా ఉండి, కులవృత్తిని పక్కన పెట్టి కూలీలుగా, పాతబట్టలు అమ్మేవారుగా కాలం గడుపుతున్నారు.

మనరాష్ట్రంలో వీరి సమాఖ్య పది లక్షలకు పైగానే వుంది. కానీ వీరికి రాజకీయాలలో ప్రాతినిధ్యంలేదు. అనంతపురం, జహీరాబాద్, ఆమోతల్, కరీంనగర్, వరంగల్ జిల్లాలలో, ఖమ్మం అన్ని మండలాలలో వీరు ఎక్కువగా వున్నారు. 'బుడబుక్కల కబుర్లోద్దు', ఒరే బుడబుక్కలోడా', 'వీడొక బుడబుక్కలోడు' లాంటి పిలుపులతో తక్కువ భావంతో తిట్టుగా మారిన వీరి కులం పేరు మార్చాలని ప్రయత్నం జరుగుతోంది. ఖమ్మం ప్రాంతాల వారు, 'రాజక్షత్రియ', 'జ్ఞానేశ్వర్' అనే పేర్లు సూచించారు. వీరికి ప్రభుత్వం నుంచి అన్ని రకాల సాయాలు అందాలని బుడబుక్కల సంఘం అధ్యక్షుడు, చంద్రశేఖర్, యూత్‌వెల్‌ఫేర్ ప్రెసిడెంట్ రాములు కృషి చేస్తున్నారు.

**పగటి వేషాల వారి ప్రదర్శన**

పగటి వేషాలవారు బుడబుక్కల వేషాన్ని కాడు రమ్యంగా ప్రదర్శిస్తారు. ఢమరుకం 'బుడబుడ...' అంటుంది కాబట్టి వీరు

దీవించి పోతున్నాం మారాజ్" త్రేతాయుగంలో దశరద మహారాజు సంతానం లేకుండా చింతిస్తున్న సమయంలో శ్రీ మహావిష్ణువు, బాగా యాలోచన చేసి రఘువంశం ఇంతటితో ఆగిపోరాదు, దశరధుని నిరాశను ఆశగా చిగురించి చేయాలని ఒక రోజు బుడబుక్కల వాని వేషంలో వచ్చి...'రాజా, రాజాధిరాజ, రాజమార్తండ, రవి కల్ప భోజ, రాజ. నీకు భవిష్యత్తు చాల ఉంది. సంతానం లేదని చింత పడవద్దు. నువ్వు వీరుడివి, శూరిడిని, అమాత్యుడివి, కాబట్టి నీకు పుత్ర సంతానం కావాలనే ఆలోచన వుంది. అందుకు చక్కని పధకం చెబుతాను విను అన్నాడు. అంతవరకు ఎంతో చింతిస్తున్న దశరధుడు నిరస నిస్పృహలను వదిలిపెట్టి, భవిష్యత్తు మీద ఆలోచనతో ఆశతో 'చెప్పండి' అన్నాడు. అప్పుడు శ్రీమహావిష్ణువు 'పుత్రకామేష్ఠి ' యాగాన్ని చేస్తే తప్పకుండా నీకు పుత్రులు జన్మిస్తారు అని చెప్పాడు. అలా పుట్టిన మేము ఇప్పుడు గ్రామాగ్రామాన తిరిగి మంచి విషయాలు, దేవతలా ముచ్చట్లు తెలుపుతూ వుంటాం.

తమ వంటి దాతలు ఉన్నంత కాలం ఈ దేశానికి ఈభూమికి మంచి జరుగుతుంది. ఈ సంవత్సవరం మా సేతు గారికి లక్షల లక్షల లాభం కలిగి, శుభోదయం కలిగి, బుడబుక్కల వారి ఆశీస్సులు కలిగి,... ఎల్లప్పుడూ జయాన్ని పొందాలి... జయీభవ... విజయీ భవ... దిగ్విజయీ భవ...

'అంబ పల్కు... జగదంబ పల్కు... బుడబుక్

బంబర వేణి పల్కు.... బకల ముఖి పల్కు... బుడబుక్

**సామాజిక అంశం:**

వ్యవసాయంలో పంట దిగుబడి తగ్గి బాధపడే రైతులు, అనేక సమస్యలతో నిరాశ చెంది జీవితంపై విరక్తి చెందుతున్నారు.



ఆర్థికంగా, శారీరకంగా, మానసికంగా, బాధలలో ఉన్న వారందరిని నిరాశకు లోను కావద్దు. భవిష్యత్తులో బాగుంటుందని చిగురించే ఆశలు కలిగిస్తున్నారు. ఈ వేషం ద్వారా ప్రస్తుతం బాధల నుండి విముక్తి పొందటానికి చేయవలసిన పనుల గురించి ఆలోచించి, ఆచరణలో పెట్టటమే తక్షణ మార్గం. పరిష్కారమని ప్రజలకు చెప్తారు.

విజయం సాధించాలంటే అసంతృప్తి, అసహనం, మానసిక ఒత్తిడి తగ్గించుకోవాలి. సమాజంలో అన్ని వర్గాలతో సత్సంబంధాలు నెలకొల్పుకోవటం ద్వారా సానుకూల దృక్పధాన్ని అలవర్చుకోవాలి. పరిపరి విధాల పోయే మనసును సానుకూల దృక్పదం వైపుకు మరల్చమని చెప్పేదే ఈ వేషం.

నేడు ప్రజలకు భవిష్యత్ మీద నమ్మకం కలిగించే మాటలు చెప్పటానికి మానసిక వైద్యులు, సానుకూల ఆలోచన తరగతులు నిర్వహించే వారు కృషి చేస్తున్నారు.

*మరొకవేషం గురించి రాబోయే సంచికలో...*



- మాకినీడి సూర్యభాస్కర్

# సంగీత ప్రపంచంలోనే అగ్రగణ్యుడు బాలమురళీకృష్ణ




**సమకాలీన శాస్త్రీయ సంగీత ప్రపంచంలో అత్యున్నత శిఖరాలను అధిరోహించిన కర్ణాటక గాత్ర సంగీత విద్వాంసుడు డాక్టర్ మంగళంపల్లి బాలమురళీకృష్ణ-కవి, పండితుడు, మీదు మిక్కిలి ఆధునిక వాగ్గేయకారుడు. తొమ్మిదవ యేటనే తొలి కచేరితో ఆరంభమైన ఆయన సంగీత ప్రస్థానం గత ఆరున్నర దశాబ్దాలుగా ఆరోహణలతో అలరిస్తూనే ఉంది. గాత్ర సంగీతంతో పాటు వాయులీన, మృదంగ, కంజీరాది వాద్య విశేషాల్లోను విశేష ప్రతిభాపాటవాలు కలవారు బాలమురళి.**

నిజానికి ప్లేబాక్ సింగర్స్‌లో కలపకూడని అపురూప శాస్త్రీయ సంగీత గాన గంధర్వుడు... అనితర సాధ్యమైన సంగీత విషయపరిశోధకుడు... మూర్తీభవించిన సంగీత కళానిధి బాలమురళీకృష్ణ, స్వల్పంగాప్లేబాక్ చేసిన కారణంగాను, కొన్ని సినిమాలకు సంగీత దర్శకత్వం నెరపడం వల్లనూ 'ప్లేబాక్ సింగర్స్' పరంపరలో రాస్తున్నాను కానీ, ఆయన సాధించిన అనితర సాధ్యమైన కళావిజయ పరంపరను ఒకసారి గుర్తుచేసుకునే ఉద్దేశ్యం మాత్రమే ఈ వ్యాసం.

అతులిత దివ్య సంగీత సుధాకరుడైన బాలమురళీకృష్ణ 1930 జూలై 6వ తేదీన తూర్పుగోదావరి జిల్లా రాజోలు తాలూకా శంకర గుప్తం గ్రామంలో జన్మించారు. తొమ్మిదవ యేటనే తొలి కచేరీ చేసి సంగీత పండితప్రకాండుల తలలూపించారాయన. ఆనాడు బాలుడైన మురళీకృష్ణ, 'బాలమురళీకృష్ణ'గా సంబోధింపబడి, నేటికీ ఆ 'బాల' తత్వాన్ని పేరులోనే కాక వ్యక్తిత్వంలోను ఇముడ్చుకుని ఆబాలగోపాలాన్నీ సంగీత రస ప్రవాహంలో సగర్వంగా ఓలలాడిస్తున్నారు. సంగీత రంగంలో ఎన్నో విజయవంతమైన ఆవిష్కరణలు గావించిన మురళీకృష్ణ, నేడు నిస్సందేహంగా 'విజయ' మురళీకృష్ణ.

తండ్రి పట్టాభిరామయ్య త్యాగరాజస్వామి శిష్యగణంలో నాలుగో తరానికి చెందిన వేణుగాన విద్వాంసులు. తల్లి సూర్యకాంతమ్మ అపర వీణాపాణి, మాతామహులు ప్రయాగ రంగదాసు భక్తిపాటలు అనేకం కూర్చి స్వయంగా స్వరపరచిన స్వరకర్త. ఇటువంటి కుటుంబ నేపథ్యంలో పుట్టిన మురళీకృష్ణకు సహజంగానే సంగీత విద్య ఉగ్గుపాలతోనే అబ్బింది. పుట్టిన పదిహేను రోజులకే తల్లిని కోల్పోయిన పసిబాలుడు ఎదుగుతూ సంగీతక్షీరాన్ని గ్రోలి, రాగాలలో అమ్మ అనురాగాన్ని అనుభూతిస్తూ గాంధర్వమాత ఒడిలో తాపసి బాలుడై సంగీత విద్యను అభ్యసించాడు. శిష్యులకు తండ్రి చెప్పే పాఠాలు విని,సంగీతాన్ని వంట బట్టించుకుని మూడో ఏటనే వర్ణాలు పాడి మురిపించాడు బాలమురళీకృష్ణ.

బాలమురళీ 'నలలితరాగ సుధారస' గాత్రం విన్న పారుపల్లి రామకృష్ణయ్య పంతులు ముందు ముందు ఆ గాత్రం చేయబోయే గమక విన్యాసాన్ని గమనించి, గానలాస్యాన్ని కనిపెట్టి తన శిష్యునిగా ఆశీర్వదించారు. రామకృష్ణయ్యతో పాటు మంగళంపల్లి రామయ్య వద్ద కూడా సంగీత శిష్యరికం చేసారు బాలమురళి. ద్వైతగురు శుశ్రూష బాలమురళిని అద్వితీయ సంగీత విద్వాంసునిగా తీర్చిదిద్దింది.




స్వాభావికమైన ధారణాశక్తికి తోడైన ఏకసంధాగ్రాహ్యత్వం బాలమురళిని రసరాగ జీవితంలో ఒక్కో మెట్టు ఎక్కించిందే కాని, ఎప్పుడూ దించలేదు.

సంగీతానికి అంకితమైన బాలమురళీకృష్ణ జీవితం నిత్యప్రాయోజితం. సంగీత రసఘురిలో ఈదులాడుతూ ఎన్నో ఎన్నెన్నో ప్రయోగాలు చేశారు. ప్రయోగమే ఆయన, ఆయనే ప్రయోగంగా పరిశ్రమించి, పరిశోధించి కొత్త కొత్త తాళాలను, రాగాలను పరికల్పించారు. ఎప్పటినుంచో జాతి భేదాలతో రూపొందిన ముప్పై అయిదు తాళాలను నూటడెబ్బై అయిదు వరకు పెంచవచ్చునని సూచించడమే కాకుండా, ఎన్నో కొత్త తాళాలను చవిచూసిన నిలువెత్తు తాళవృక్షం బాలమురలీకృష్ణ. అయిదు స్వరాల రాగాల్ని పాడడం సంప్రదాయం కాగా, కేవలం నాలుగు స్వరాలతోనే ఎన్నెన్నో రాగాలను సృజించారు. లవంగి, మహతి, మనోరమ, మురళీ, ఓంకారి, రోహిణి, మధ్యమావతతి, సర్వశ్రీ, సుముఖం, సుషమ, త్రిశక్తి, జనసమ్మోహిని, వల్లభ వంటి కొత్తరాగాలను గాంధర్వజగతికి అందించిన సంగీత శాస్త్ర వేత్త బాలమురళీ. దాదాపుగా మూడువందల రాగాలకు స్వరకల్పన చేసిన మేధావి.

డెబ్బైరెండు మేళకర్తలలోను తెలుగు, తమిళ, కన్నడ, మళయాళాలతో పాటు హిందీ, సంస్కృత, ఆంగ్లాల్లో కూడ కీర్తనలు రాసి పాడారు. కేవలం ప్రయోగార్ధమో, సిద్ధాంతం కోసమో కాదని నిరూపిస్తూ కచేరీల్లో పాడి వినిపించారు. దక్షిణాత్య సంగీతంలోని 72 మేళకర్త రాగాలు ఏ సంగీతంలోను లేవు. అందువల్ల కర్ణాటక సంగీతంలో నైపుణ్యం సాధిస్తే ఏ (దేశ) సంగీతమైనా ఇట్టే గానం చేయవచ్చునంటారు. అనుభవపూర్వకంగా ఒకసారొక పందెంలో వినిపించిన విదేశీ సంగీతాన్ని వెంటనే పాడి బాలమురళీకృష్ణ శ్రోతలను ఆశ్చర్యచకితులను చేస్తే, ఈయన పాడిన పల్లవినే పందెం కాసినవారు ఏమాత్రం పాడలేకపోయారు.

బాలమురళీకంటే ముందు 72 మేలళకర్త రాగాల్లోనూ కీర్తనలు లేవు కాబట్టే, వాటికి రూపకల్పన చేశారు. ఎలాంటి ప్రత్యేకత లేకుండా, మరో కొత్త రచన దండగని భావించే బాలమురళీకృష్ణ దాదాపుగా 400 దాకా రచనలు చేశారు. వీటిల్లో వర్ణనలు, కీర్తనలు, తిల్లానాలు, జావళీలు మొదలైనవి ఉన్నాయి.

లయప్రధానమైన తాళక్రియల గతులలో వినూత్న

సంప్రదాయాన్ని నెలకొల్పారు బాలమురళి. నిశ్శబ్ద క్రియలను త్రిశ్ర, చతురస్ర, ఖండ, మిశ్ర గతుల్లోను, సశబ్ద క్రియలను ఒకే అక్షరంతోను ప్రయోగాలు చేసి మెప్పించారు, నిత్య ప్రయోగశీలియైన బాలమురళీకృష్ణ. నేటి ప్రయోగమే రేపటి సంప్రదాయమౌతుందని నమ్ముతూ, సంగీతానికి కొత్త సొగసులు, సొబగులు అందించేందుకు అలసట ఎరుగని పరిశ్రమ చేస్తున్నారు. 'సంగీత చికిత్స' గురించి ఎన్నో ప్రయోగాలు చేస్తున్నారు. 1984 –85లో కోమాలోకి పోయిన ఎం.జి. రామ చంద్రన్‌ను తన సంగీతంతో మేల్కొల్పి, చికిత్స కొరకు అమెరికా వెళ్ళేందుకు సమా యత్తపరచగలిగారు బాలమురళీకృష్ణ.



శాస్త్రీయ సంగీతంలో పరిపూర్ణుడైన బాలమురళీకృష్ణ అనుకరయోగ్యం కాని శైలిలో గాన ఝరియై ప్రవహిస్తున్నారు. హిందుస్థానీ, కర్ణాటక సంగీతాలతోపాటు లలిత, వాయులీన సంగీతాలలో కూడ గొప్ప ప్రజ్ఞాశాలి ఆయన, అయితే హిందుస్థానీ, కర్ణాటకమనే భేదం పాటించరు. ఎక్కడికక్కడి దడి కట్టడం సరికాదని, అంతా అఖండమైన భారతీయ సంగీతమే' అంటారు. భావప్రధానమైన లలిత సంగీతాన్ని ఒక విశిష్టమైన బాణీగా భావిస్తారు బాలమురళి.

తొలి కచేరీలోనే తొలి రేడియోగానం కూడ 1938లోనే చేసిన బాలమురళీకృష్ణ ఆకాశవాణి (దక్షిణాది) సంగీత కార్యక్రమాలకు తొలి ప్రొడ్యూసరు. అలాగే ఆకాశవాణిలో 'భక్తిరంజని' ప్రసారాన్ని తొలిసారిగా ప్రారంభించిందీ బాలమురళీయే. అంతేకాకుండా, ఆకాశవాణిలో గాత్ర, వయొలిన్, కర్ణాటక, భక్తి, లలిత సంగీతాలలో అత్యున్నత శ్రేణి సాధించిన ఒకే ఒక విద్వాంసుడు బాలమురళీకృష్ణ.

ఆయన కొచ్చిన బిరుదులు అన్నీ ఇన్నీ కావు. వివిధ సంస్థలచే గాన సుధాకర, గీత కళాభారతి, గాయక శిఖామణి, వాగ్గేయకార వాచస్పతి, గాన సరస్వతి, వ ం ణి బ. ూ ా ష ణ , పుంభావశారద, సంగీత కళాసాగర్, గాంధర్వ గాన వితగార్, స్వరవిలాస, సంగీతమహోపాధ్యాయ, సంగీత సార్వభౌమ, మధురగాన రవళీకృష్ణ, సంగీత భూపతి, నాదబ్రహ్మ, సంగీతకళానిధి, నాద సుధార్ణవ వంటి బిరుదులెన్నో పొందారు. భారత సాంస్కృతిక సంఘ సలహాదారుగా, మద్రాసు తెలుగు అకాడమీ అధ్యక్షునిగా, విజయవాడ సంగీతకళాశాల ప్రిన్సిపాల్‌గా, కొంతకాలం ఆంధ్రప్రదేశ్ ఆస్థాన గాయకునిగా, తమిళనాడు ఆస్థాన గాయకునిగా, ఆంధ్రప్రదేశ్ ప్రో–ఛాన్సలర్‌గా సంగీతకళకు ఆయన ఎన్నో సేవలందించారు.



1953లో బాబు రాజేంద్రప్రసాద్‌నుంచి రాష్ట్రపతి పతకం, ఆ తర్వాత డా॥ సర్వేపల్లి రాధకృష్ణ గురించి నగదు బహుమానం, 1971లో పద్మశ్రీ బిరుదం, 1975లో కేంద్రసంగీత నాటక అకాడమీ రాష్ట్రపతి పురస్కారం, ఆంధ్రప్రదేశ్ సంగీత నాటిక అకాడమీ అవార్డు, బొంబాయి సంగీత పీఠం 'సుర్ సింగార్' అవార్డు, తమిళనాట కస్తూరి రాజారామ్ (తాలి)అవార్డు, వివిధ విశ్వ విద్యాలయాలనుంచి గౌరవ డాక్టరేట్లు, తిరుమల తిరుపతి దేవస్థానం గాయక ఆచార్యత్వం, విజయవాడ మునిసిపల్ కార్పొరేసన్ గౌరవ ప్రథమపౌరుని హెూదా, పద్మవిభూషణ్ బిరుదం, 1991లో లతామంగేష్కర్ అవార్డు, 1992 'మేన్ ఆఫ్ ది ఇయర్'గా విన్‌డమ్ అవార్డు వంటివి ఎన్నో ఆయన పొందారు. 1963-64లో మద్రాసుకు మారే ముందు వరకు విజయవాడ సత్యనారాయణపురంలో ఆయన నివసించిన ఇల్లు ఉన్న వీధికి ఆయనపేరు పెటట్టడం గొప్ప విషయం.

బాలముళీకృష్ణ గుర్తుకు రాగానే 'గుప్పెడు మనసు'లోని "మౌనమె నీ భాష ఓ మూగ మనసా'! అన్న పాట వెంటనే గుర్తు కొస్తుంది. ఆపాటలో అత్యుత్తమ భావసాంద్రతకు మెత్తని స్వరమాధురి మేళవింపబడి, పాటమంద్రంగా ప్రవహించే సెలయేరులా సాగుతుంది.

ఇక ప్లేబాక్ విషయానికొస్తే, తెలుగుతోపాటు కన్నడ, హిందీ. బెంగాలీ, భాషా సినిమాలలో పాడారు. బాలమురళీకృష్ణ, తెలుగులో భక్త ప్రహ్లాద చిత్రంలో నారదుడిగా "కరుణాలోల నారాయణ... శ్రితజన పాలాదీనావనా" అంటూ పాడి అద్భుతంగా నటించారు. 'సందెకెందును సిందూరం' అనే మళయాళ చిత్రంలో కూడా నటించారు. రంగస్థలంపై త్యాగరాజవేషం వేశారు. బాలముళీకృష్ణ గుర్తుకు రాగానే 'గుప్పెడు మనసు'లోని "మౌనమె నీ భాష ఓ మూగ మనసా'! అన్న పాట వెంటనే గుర్తు కొస్తుంది. ఆపాటలో అత్యుత్తమ భావసాంద్రతకు మెత్తని స్వరమాధురి మేళవింపబడి, పాటమంద్రంగా ప్రవహించే సెలయేరులా సాగుతుంది. నర్తనశాల'లో "సలలితరాగ సుధారసగానం"చేశారు. 'కురుణామయీ శారద'ను సాక్షాత్కరింపజేసారు. అందాలరాముడి" పలుకే బంగారమాయె"ననిపించారు. 'హంసగీతే' కన్నడ చిత్రాన్ని, 'ఆది శంకరాచార్య' సంస్కృత చిత్రాన్ని, ఇంకా రామానుజాచార్య, మధ్వాచార్య చిత్రాలకు సంగీతం కూర్చారు. హంసగీతే, మధ్వాచార్య చిత్రాలకు జాతీయ స్థాయి ఉత్తమసంగీత దర్శకునిగా, గాయకుడిగా అవార్డులందుకున్నారు. 1975లో ఉత్తమసినీ నేపథ్యగాయయకునిగాను, ఉత్తమసంగీత దర్శకునిగా, 1971లో కర్ణాటక రాష్ట్రబహుమతి, 1987లో జాతీయ అవార్డు అందుకున్నారు.

అయితే చరిత్రలో ప్లేబాక్ సింగర్‌గానో, సినిమా మ్యూజిక్ డైరెక్టరుగానో మిగలడం బాలమురళీకృష్ణకు సుతరామూ ఇష్టంలేనిది. త్యాగయ్య, అన్నమయ, రామదాసు, క్షేత్రయ్యల సరసన తన పేరు ఉండాలనుకుంటారు. అలా అనుకోవడంలో అసహజమేమీలేదు. వారి సరసన కాకుండా, వారందరి పేర్లకు ముందు చేర్చవలసిన వారు బాలమురళీ. భారతీయ సంగీత ప్రపంచంలోనే కాదు, మొత్తం ప్రపంచంలోనే శాస్త్రీయ సంగీత రంగంలో ఆయన అగ్రగణ్యుడని ఏ అనుమానం లేకుండా చెప్పుకోవచ్చు.



# నాటక రంగానికి త్రోవ చూపిన బళ్ళారి రాఘవ

ఎల్.ఆర్. వెంకటరమణ

**చంద్రగుప్త అనే నాటకాన్ని ప్రదర్శిస్తున్నారు. వేదిక పై చాణక్య పాత్రధారి జీవిస్తున్నాడు. అంతలో ఎక్కడి నుండో వచ్చిన ఒక కుక్క రంగస్థలం పైకి వచ్చింది. మరో నటుడైతే దాన్ని తరమడమో, మరేదో చేసేవాడు. కానీ చాణక్య పాత్రధారి అదే గంభీరంతో కుక్కతో- "ఓ శునక రాజమా! నీకు కూడా నేను లోకువయ్యానా?"అంటూ అన్నాడు. సభికులు ఆశ్చర్యంతో, ఆనందంతో హర్షధ్వానాలు చేశారు. ఆ చాణక్య పాత్రధారి గొప్ప నటులు బళ్ళారి రాఘవ గారు.**




బళ్ళారి రాఘవ 1880వసం॥ ఆగస్టు రెండున నరసింహాచార్యులు, శేషమ్మలకు జన్మించాడు. బళ్ళారి హైస్కూలులో మెట్రిక్ చదివాడు. తరువాత మద్రాసులోని క్రిస్టియన్ కాలేజీలో న్యాయశాస్త్రం చదివాడు. 1905 నుండి న్యాయశాస్త్ర విద్యపూర్తి చేసి, న్యాయవాది వృత్తి చేపట్టాడు. క్రిమినల్ కేసులు వాదించడంలో మంచిపేరు గడించాడు. బ్రిటీషు ప్రభుత్వం ఇతని ప్రతిభకు మెచ్చి "రావు బహుద్దూర్" బిరుదు ఇచ్చారు.

రాఘవ గారికి నాటకాలంటే ప్రాణం. తన వృత్తి, ప్రవృత్తి రెంటిని సమాన దృష్టితో చూసినవాడు. కర్నూలు ప్రాంతానికి చెందిన లక్ష్మణాచారిగారి కుమార్తె కృష్ణమ్మగారితో వివాహం జరిగింది. 12వ ఏట నుండే రాఘవ నాటక రంగ ప్రవేశం చేశాడు. బళ్ళారిలో షేక్స్పియర్ క్లబ్ స్థాపించి, అనేక నాటకాలను ప్రదర్శించారు. రాఘవ మద్రాసులో చదివే సమయంలో - దాదాభాయికత్రి అనే పార్శీ నటుని అభినయం ఎంతో నచ్చింది. అదే అంతరంగంపై చెదరని ముద్రవేసింది.




"రాఘవగారిలో నటునికి కావలసిన కల్పనాశక్తి, సమయస్ఫూర్తి, ఆకర్షణీయ విగ్రహం, సుందర రూపం, విశాలమైన నుదురు, కొనదేలిన ముక్కు, తేజోవంతమైన కన్నులు-కలగలసి అద్భుత నటుల జానమద్ది హనుమచ్ఛాస్త్రి తన పుస్తకంలో పేర్కొంటారు". కళకు గల విలువలకు అత్యధిక ప్రాధాన్యత నిచ్చేవారు రాఘవ. కానీ తను ఎంత ఎదిగినా ఒదిగి ఉండేవాడు.

రాఘవ గారికి చారిత్రక నాటకాలు, సాంఘిక నాటకాలన్నా అమితాశక్తి. కానీ పౌరాణిక నాటకాలు అంతగా ఇష్టపడేవారుకాదు. కానీ "హరిశ్చంద్ర నాటకం"లో నటించారు. కారణం-హరిశ్చంద్ర సత్యము మాట్లాడడమే తీరు, చంద్రమతి ధైర్యం, త్యాగం వీటిని ప్రదర్శించడానికి ఆ పాత్రలో నటించారు. హావభావ ప్రకటనలను చూపడంలోనూ, వాక్యంపలికే తీరులోనూ తనదైన ముద్రవేశారు రాఘవ. విధూషక పాత్ర అయినా, మహారాజు పాత్ర అయినా సమాన ప్రాధాన్యతనిస్తూ అసామాన్య నటనను ప్రదర్శించేవారు. రాఘవ గారి మేనమామ ధర్మవరం కృష్ణమాచార్యులవారు. వీరు రాఘవను ప్రోత్సహించారు. అదేవిధంగా బెంగుళూరులోని కోలాచలం శ్రీనివాసరావు నడిపే "సుమనోహర" సంస్థ నాటకాలలో కూడా రాఘవ ప్రధాన భూమికలు పోషించాడు. తెలుగు, కన్నడ, ఆంగ్లభాషా నాటకాలలో పాత్రలు పోషించాడు.



ఇంగ్లాండు, ఫ్రాన్సు స్విట్జర్లాండ్, జర్మనీ, శ్రీలంక వంటి అనేక దేశాలలో సైతం నాటక ప్రదర్శనలిచ్చారు. మహాత్మాగాంధీ, రవీంద్రనాద్ ఠాగూర్, జార్జి బెర్నార్డ్‌షా వంటి వారు కూడా రాఘవ నటనకు ముగ్ధులైనవారు. రాఘవగారు పండిత తారానాధ్‌గారిని తన గురువుగా భావించి, వారి ఆశీర్వాదాలు పొందినవారు.

నాటి కాలంలో మగవారే స్త్రీ పాత్రధారణ చేసేవారు. ఇది రాఘవగారికి నచ్చేదికాదు. స్త్రీపాత్రను వారే నటించాలని ప్రోత్సహించారు. అలా వచ్చినవారే మాడపాటి సరోజిని, కొమ్మూరి పద్మావతీదేవి, కొప్పరపు సరోజిని, అన్నపూర్ణమ్మ, వరదాబాయి వంటి మహిళామణులు. ఎంతో కీర్తి సాధించారు. ఈ విధంగా నాటక రంగంలో ఒక విప్లవాత్మక మార్పు తేగలిగారు.

ఇక రాఘవగారు నాటక రంగంలో చేసిన మరో ప్రతిపాదన– "పౌరాణిక నాటకాలలో పద్యాల వినియోగం కాస్త తగ్గిస్తూ, సహజ నటనకు ప్రాముఖ్యత ఇవ్వాలన్నది నాటకం సాంఘిక ప్రయోజనం కలిగించేదిగా ఉండాలన్నది రాఘవ గారి ప్రతిపాదన.

ప్రసిద్ధ ఆంగ్లనటులు– లారెన్స్ ఒలివర్, ఛార్లెస్ లాటన్ వంటి వారితో కలిసి నాటక ప్రదర్శనలు ఇచ్చారు. ఇంకా సినిమా రంగంలో కూడా ప్రవేశించి–రైతుబిడ్డ, కన్యాశుల్కం, చండిక, ద్రౌపదీ మాన సంరక్షణము, కన్యాశుల్కం వంటి సినిమాలలో నటించారు.

వయసు మీద పడటంతో రాఘవగారు జోళదరాసి అనే గ్రామాన ఉంటూ యువనటులను ప్రోత్సహిస్తుండేవారు. అలా కీర్తిగడించిన శిష్యులలో తిప్పయ్య ప్రముఖుడు. రాఘవగారు 1946 ఏప్రిల్ 16వ తేదీన హంపీ విరూపాక్ష రథోత్సవ దినాన, రాత్రి 11 గంటల ప్రాంతంలో – ఓం నమ:శివా!; ఓంనమయ:శివా!; అంటూ ప్రాణాలు విడిచారు.

రాఘవగారు తన అధ్యక్షోపన్యాసంలో కళగురించి చెబుతూ "మానవులు తమలో అణచుకున్న నిర్మాణ శక్తులను అనుభవంలోకి తెచ్చుకోవడానికి, వారి కౌశలాలను ప్రదర్శించుకోవడానికి, మానవ స్వభావమందు అణగిఉన్న భావాలను బహిర్గత పరచడానికి చేయబడే గొప్ప ప్రయత్నమే "కళ" అంటారు. ఇదే సూత్రాన్ని రాఘవగారు తన వృత్తి, ప్రవృత్తిని అంకిత భావంతో నెరవేర్చిన కళాపిపాసి, కళా ప్రేమి బళ్ళారి రాఘవ. భారతప్రభుత్వం ఆయన గౌరవార్థం పోస్టల్‌స్టాంపును విడుదలచేసింది. రాష్ట్రప్రభుత్వం, ఆంధ్రనాటకరంగ ప్రభాకరుడు, సముదాత్త నటనా ప్రదీపకుడు' అంటూ ట్యాంకుబండపై ఆయన విగ్రహం ప్రతిష్ఠించి స్మరించుకుంటోంది

venkataramana_lanka @yahoo.com

చిత్రం నిన్నటి చరిత్రకు సాక్ష్యం – రేపటి భవితకు లక్ష్యం.

చిత్రకళ నిన్నను నేడు చూపిస్తుంది. రేపటిని సూచిస్తుంది.

# నా గురించి నేను...

## కుమారి రాగతి పండరి

**స్వగతం-4**

**తొలి తెలుగు మహిళా కార్టూనిస్టుగా గత నాలుగు దశాబ్ధాలుగా పాఠకులను అలరిస్తున్న కుమారి రాగతి పండరి తన జీవన గమనాన్ని - కార్టూనిస్టుగా స్వయంకృషితో ఎదిగిన వైనాన్ని "నా గురించు...నేను" పేరుతో అక్షరీకరణ చేసారు. 64కళలు.కామ్ లో ధారావాహిక రూపంలో నెల-నెలా ...**



కుమారి రాగతి పండరి

*శ్రీ కనకాంబరరాజుగారు పండరీ నువ్వు తప్పక రాజకీయ కార్టూన్లు కూడా వేయగలవు, నాకా నమ్మకం ఉంది... అంటూ నన్ను ఎంక్రేజ్ చేయడమే కాక కొండంత ధైర్యం చెబుతూ లెటర్ రాశారు.*

అప్పటి నుండీ నేను రెండు మూడు న్యూస్‌పేపర్లు రోజూ క్షుణ్ణంగా చదవడం, విషయాలను ఆకలింపు చేసుకోవడం, టీవీలో వార్తలు చూడడం, విషయాలను అర్ధం చేసుకోవడం చేస్తూ అకుంటిత దీక్షతో భూమి వీక్లీలో రాజకీయ 'చెద'రంగం అనే శీర్షికకు వారం వారం రాజకీయ కార్టూన్లు వేయడం ప్రారంభించాను. అందరికీ అర్ధమయ్యే రీతిలో సున్నితంగా వేసే నా రాజకీయ 'చెద'రంగం కార్టూన్లు అచిరకాలంలోనే అశేషాంధ్ర ప్రజల అభిమానాన్ని చూరగొనడం నిజంగా ఒక అదృష్టం. ఈ శీర్షికను ఆంధ్రభూమిలో పదేళ్లకు పైగా కొనసాగించడం నాకు ఒక మరపురాని అనుభూతి. ఈ అవకాశం కలిగించిన సికరాజుగారిని నేనెప్పుడూ మరిచిపోలేను. అలాగే మహిళలకు సంబంధించిన ఏదైనా కార్టూన్ శీర్షిక ప్రారంభిస్తే బావుంటుంది అన్న శ్రీ సికరాజుగారి సూచనపై నేను ఆంధ్రభూమి వీక్లీలో 'శ్రీమతి' అనే కార్టూన్ స్ట్రిప్ ప్రారంభించాను. ఈ శీర్షికను దాదాపు తొమ్మిదేళ్లకు పైగా కొనసాగించాం. మహిళలకు సంబంధించిన టాపిక్స్ మీద అంటే వాళ్ల సమస్యలు, సరదాలు, అలకలు, అప్పడాల కర్రలు, చిలిపి తగాదాలు, చిర్రుబుర్రులు ఇలా ఒకటేమిటి ఎన్నో ఎన్నెన్నో లేడీస్ టాపిక్స్ మీద వారం వారం కార్టూన్లు వేశాను. ఈ శీర్షిక మహిళలను ఎంతగానో ఆకట్టుకుంది అని చెప్పడానికి నాకు, ఆంధ్రభూమికి వచ్చే లెటర్స్ చాలు.




ఈ విధంగా ఆంధ్రభూమి వీక్లీలో రెండు కార్టూన్ శీర్షికలు కంటిన్యూ చేస్తే వారం వారం ఒక ఫుల్‌పేజీ కరంటు టాపిక్స్ మీద కార్టూన్లు వేసి పంపించేదాన్ని. ఇక యువ, జ్యోతిలలో కూడా నా కార్టూన్లు బాగా వస్తుండేవి. మోడ్రన్ కార్టూన్ పురాణ వృక్షం, మోడ్రన్

భారతం, మోడ్రన్ రామాయణం, సీతాకళ్యాణం ఇలా టాపిక్స్ తీసుకొని పురాణాల మీద మోడ్రన్ కార్టూన్లు తెగ వేసేదాన్ని. పాఠకుల ప్రశంసలు, ఎడిటర్ల ఆదరణతో అంచెలంచెలుగా కార్టూన్ రంగంలో ఎదుగుతుండగా ఒక మంచి కార్టూనిస్టుగా పేరు రాసాగింది. రాగతి పండరి అని పేరు చెబితే తెలియని స్థితి నుండి అబ్బ భలే కార్టూన్లు వేస్తారండి అన్న స్థాయికి ఎదగడం నిజంగా నేను జీవితంలో ఊహించని ఆనందం. చాలు జీవితంలో నాకీ ఆనందం అనుకొనేదాన్ని.

దీపావళి పండగ వస్తే నాకు చేతినిండా పనే. యువ, జ్యోతి మంత్లీలు ఎంతో చక్కగా ప్రత్యేక సంచికలుగా వెలువడేవి. దీపావళికి సంబంధించి మంచి కార్టూన్ కథ ఐదారు పేజీలకు పంపమని యువ, జ్యోతి ఎడిటర్లు నాకు లెటర్లు రాసేవారు. ఎల్యా నారాయణరావుగారు కథ రాసి నాకిచ్చేవారు. అది నేను నవగ్రహమ్మ-అనుగ్రహమ్మ అనే ఇద్దరు అమ్మాయిలతో లేక కవయిత్రి-రచయిత్రిలతో లేదా వేరే పాత్రలతో కార్టూన్ కథలుగా వేసి యువ, జ్యోతి, దీపావళి సంచికలకు పంపేదాన్ని. అలాగే ప్రభ, పత్రిక, జ్యోతి, భూమి వీక్లీలకు కూడా దీపావళి కార్టూన్లు, ఫుల్‌పేజీలు, కార్టూన్ కథలు నావి ఎన్నో వచ్చేవి. ఇలాంటి సందర్భాలలో ఎడిటర్లు నాకు ప్రత్యేకంగా లెటర్లు రాసి మరీ కార్టూన్లు వేయించుకొనేవారు.

యువ దీపావళి సంచిక అంటే నాకు ఎంతో ఇష్టంగా ఉండేది. పండగ కళ అంతా అందులోనే ఉండేది. ముఖ్యంగా వడ్డాది పాపయ్యగారు బొమ్మలు కన్నులపండగ చేసేవి. జీవకళ ఉట్టిపడే ఆయన చిత్రాలు ఎంత చూసినా నాకు తనివి తీరేది కాదు. అలాగే అప్పుడు ప్రభ వీక్లీలో సీరియల్స్‌కు శ్రీ బాపుగారు బొమ్మలు వేసేవారు. ఆయన వేసిన బొమ్మలు నాకెంత నచ్చేవో చెప్పలేను. ఆ అందం, చందం, లావణ్యం, మెరుపుతీగల్లాంటి అమ్మాయి, అబ్బాయి ఎంత బావుంటాయో, రాయడానికి నా పరిజ్ఞానం చాలదు. అప్పుడు ప్రభ వీక్లీలో ప్రతీ సీరియల్‌కూ బాపూగారు బొమ్మలు గీసేవారు. గురువులకే గురువు, తెలుగు జాతి కీర్తి కిరీటాలు తెలియజెప్పిన బాపూగారి బొమ్మలు, కార్టూన్లు ఎంతో బాగుంటాయని చెప్పడం... తేనె తీయగా తెలియజెప్పిన బాపూగారి బొమ్మలు, కార్టూన్లు ఎంతో బావుంటాయని చెప్పడం... తేనె తీయగా ఉంటుంది, వెన్నెల చల్లగా ఉంటుంది. భూమి గుండ్రంగా ఉంటుంది అని చెప్పినట్లే ఉంటుంది. శ్రీ బాపూగారు ప్రభలో వేసిన కొన్ని బొమ్మలు కట్‌చేసి దాచుకోనేదాన్ని.

ఒకసారి శ్రీ శంకుగారి ఆధ్వర్యంలో వస్తున్న క్రోక్విల్ మాగజైన్‌లో ఫొటోలతో నా ఇంటర్వ్యూ వేశారు. ఆ ఇంటర్వ్యూ కోరుకొండ సత్యానంద్‌గారు చేశారు. ఆ తర్వాత మహిళ, వనిత లాంటి పుస్తకాల్లో కూడా నా ఇంటర్వ్యూలు వచ్చాయి. ఒకసారి మా విశాఖలో పోలీసువారు నాచేత కార్టూన్లు వేయించారు. అప్పుడు విశాఖ పోలీస్ కమీషనర్‌గా ఉన్న శ్రీకుమావత్‌గారు, శ్రీ రామచంద్రరాజుగారు, ఎసిపి కాంతారావుగారుల కోరికపై నేరాలు ఎలా జరుగుతాయి...? అవి జరక్కుండా ఎలాంటి జాగ్రత్తలు తీసుకోవాలి...? అన్న విషయం మీద చాలా కార్టూన్లు వేసిచ్చాను. ఆ కార్టూన్ల ప్రదర్శన ఏర్పాటు చేశారు. అవి చూడడానికి తప్పక రావాల్సిందిగా వారు జీపు పంపారు. ఇక తప్పనిసరై నేను ఇంట్లో అందరం పోలీసు జీపు ఎక్కి

బయలుదేరాం. మా వీధిలో వాళ్లంతా విషయం తెలియక అందరం పోలీసు జీపు ఎక్కి వెళ్తుంటే విచిత్రంగా చూశారు. ఆనక విషయం తెలిసి సంతోషించారు. కార్టూన్ ప్రదర్శన చాలా చక్కగా జరిగింది. అక్కడ పోలీసులు మమ్మల్ని ఎంతో మర్యాదగా చూసి మళ్లీ వారి జీపులోనే మా ఇంటికి దిగబెట్టారు. ఇదో మరపురాని థ్రిల్.

రోజులు, నెలలు సంవత్సరాలు గడుస్తూనే ఉన్నాయి. కాలంలో ఎన్నో మార్పులు, చేర్పులు, ఎందరితోనో పరిచయాలు, పలకరింపులు, ఉత్తరాలు, ఊసులు, ఆంధ్రభూమి వీక్లీలో నా కార్టూన్ల దండయాత్ర కొనసాగుతూనే ఉంది. గోలిశంకరరావుగారికి ఆంధ్రభూమి వీక్లీలో ఆర్టిస్టుగా జాబ్‌రావడం, ఆయన తెనాలి నుండి హైదరాబాదు వచ్చి జాబ్‌లో జాయిన్ అవ్వడం జరిగింది. కొన్ని కొన్ని నా ఫుల్‌పేజీ కార్టూన్లకు గోలి శంకరరావుగారు చక్కని హెడ్డింగ్స్ రాసేవారు. నేను, ఎల్యా నారాయణరావుగారు పండగలకు, ప్రత్యేక సంచికలకు కార్టూన్ కథలు వేస్తుండేవాళ్లం. పత్రికల వాళ్లు నిర్వహించే కార్టూన్ల పోటీలో చాలాసార్లు నా కార్టూన్లు బహుమతులు గెలుచుకున్నాయి. హైదరాబాదులో ఉన్న అక్కకి ఒక పాప, పేరు రూప, బాబు పేరు రాజేష్, అన్నయ్యకు ముగ్గురు పాపలు పేర్లు శ్రీరేఖ, శిరీష, శ్రీశాంతి. రమక్క ఎంఏ చేస్తూ వీలైనప్పుడల్లా కథలు రాస్తూ ఒక చిన్న రచయితగా పేరు తెచ్చుకొంది. తన కథలు ఆంధ్రభూమి, జ్యోతిలో అప్పుడప్పుడు వస్తుండేవి.

పెద్దక్క కొడుకు శివకుమార్ డిగ్రీ పూర్తిచేసి వాళ్ల నాన్నగారికి సహాయంగా ఉండే నిమిత్తం వాళ్ల ఊరు ఖమ్మం వెళ్లిపోయాడు. ఒకరోజు కలెక్టర్ ఆఫీసు నుండి అక్కడి క్లర్క్ ఒక లెటర్ తీసుకొని వచ్చాడు. రిపబ్లిక్ డే నాడు కలెక్టర్‌గారు నాకు ప్రశంసా పత్రం ఇవ్వబోతున్నారని తెలిపారు. అప్పటికి రిపబ్లిక్ డే ఇంకా రెండురోజులే ఉంది. నేను ఆనందంతో ఉక్కిరిబిక్కిరి అయ్యాను. అవార్డు రావడం నాకు అదే మొదటిసారి. మనలో ఉన్న కళకి అవార్డులే కొలబద్దలు కాకపోయినా అది ఒక మరపురాని సంతోషం, ఎంకరేజ్‌మెంట్, ఇంకా ఇంకా మంచి కార్టూన్లు గీయాలి, పేరు తెచ్చుకోవాలి, ఇలాంటి అవార్డులు మరెన్నో సాధించాలి అనే ఓ తపన.

కళాకారుడికి అవార్డులు అందుకొనేటప్పుడు ఇలాంటి ఉత్సాహం, ఉత్తేజం, ఆనందం, అనుభూతులు కలగడం సహజం. అటువంటి ఆనందమే నాలోనూ కలిగింది. ఉత్సాహం పెల్లుబికింది. ఇంట్లో వారంతా ఎంతో సంతోషపడ్డారు. ఆ అందమైన రోజు రానేవచ్చింది. రిపబ్లిక్ డే నాడు నేను, ఇంట్లో అందరం పోలీసు గ్రౌండ్‌లో ఏర్పాటు చేసిన సంబరానికి వెళ్లాం. మా అందరికీ ప్రత్యేకమైన సీట్లు చూపించారు. అక్కడ పోలీసు విన్యాసాలు, కలెక్టర్ గారు జెండా ఎగురవేయడం అంతా అయ్యాక అందరికీ కలెక్టర్‌గారు అవార్డులు ఇచ్చారు. నాతో పాటు వివిధ రంగాల్లో ప్రతిభ కనబరిచిన వారికి అవార్డులు ఇచ్చారు. రాగతి పండరి కార్టూనిస్టు అని నా పేరు పిలిచారు. నేను లేచి క్రచర్స్‌తో నడిచి వెళ్తుంటే అందరి చూపులూ నామీదే. కొందరు ఆశ్చర్యంగా, మరికొందరు అభిమానంతో, ఇంకొందరు విచిత్రంగా చూస్తున్నారు. ఈ అమ్మాయా... రాగతిపండరి... పత్రికల్లో భలే కార్టూన్లు వేస్తుందిలే. అయ్యో ఇలా అని తెలియదే. వెనుక నుండి, పక్కనుండి మాటలు వినిపిస్తున్నాయి. నాకు చాలా ఇబ్బందిగా అనిపించింది. ఇలాంటి మాటలు వినాల్సి వస్తుందనే కదా... నేనెక్కువగా బయటకు రావడానికి ఇష్టపడను.

కలెక్టర్ శ్రీ దయాచారి గారి చేతులమీదుగా నా మొదటి అవార్డును అందుకొన్నాను. కరతాళ ధ్వనులు మిన్నునంటాయి. అందరికన్నా ఎక్కువగా నాకెంతో ఎంకరేజ్‌మెంటుగా ప్రశంసాపూర్వకంగా అక్కడ అందరూ చప్పట్లు కొడుతుంటే నా హృదయంలో ఆనంద తరంగాలు మారుమ్రోగాయి. కలెక్టరు గారు నాకు శాలువా కప్పి ప్రశంస అవార్డును, పూలబొకే ఇచ్చారు. ఇంటికి వచ్చాక కూడా ఆ సంతోషం అలా నిలిచిపోయింది. మరి అందరికీ పార్టీ ఏది అన్నయ్య. ఇంట్లో అందరికీ స్వీట్లు, ఐస్‌క్రీం తెప్పించాను. ఆ రోజు అలా సంతోషంగా గడిచింది. మర్నాడు అన్ని పేపర్లలో రిపబ్లిక్ డే సంబరాల గురించి, అవార్డులు వచ్చిన వారి గురించి ఫొటోలు



అవి వేశారు. అప్పుడు కొంతమంది అభిమానులు మా ఇంటికి వచ్చి నన్ను ప్రత్యేకంగా అభినందించారు. ఆ తర్వాత ఈనాడు విలేకరి నా ఇంటర్వ్యూ కోసం వచ్చారు. నా ఇంటర్వ్యూ తీసుకొని వెళ్లారు. మరో మూడు నాలుగు రోజుల్లో దాన్ని ఈనాడు మెయిన్ ఎడిషన్‌లో వేశారు. కార్టూన్ సామ్రాజ్య స్వేచ్ఛా విహంగం-రాగతి పండరి అని హెడ్డింగ్ పెట్టి ఇంటర్వ్యూ చాలా చక్కగా రాశారు.

ఆ ఇంటర్వ్యూ చదివి చాలామంది అభిమానులు, కొందరు కార్టూనిస్టులు నాకు లెటర్ రాశారు. నేనొక లేడీ కార్టూనిస్టునన్న విషయం అప్పుడు చాలా మందికి తెలిసింది. తమతో కలం, స్నేహం చేయమని కొందరు. కార్టూన్లు ఎలా వేయాలో నేర్పమని మరికొందరు మిమ్మల్ని కలుసుకోవాలని ఉంది... మీ ఇంటికి రావచ్చాని అని ఇంకొందరు లెటర్స్ రాశారు. కొంతమంది నా అడ్రస్ ఎలాగో తెలుసుకొని రాస్తే, మరికొంతమంది పత్రికల ఆఫీసులకు నా పేర్న రాశారు. ఆ తర్వాత పత్రికల వారు ఆ లెటర్స్ నాకు పంపించారు. మరో విశేషం ఏమంటే కొందరు రాగతి పండరి కార్టూనిస్టు విశాఖపట్నం అని రాసిన లెటర్లు సైతం చక్కగా నాకు అందాయి. అన్ని ఉత్తరాలు అందుకొని అభినందనల పూలమాలతో తడిసిపోయాను.

ఉదయం ఆరుగంటలు అవుతోంది. నేను స్నానం, పూజ కానిచ్చి మెల్లగా పూలకుండీల దగ్గరకి వచ్చాను. బాల భానుడు బద్ధకించి ఇంకా డ్యూటీకి రాలేదు. శీతాకాలం చలి చల్లగా వణికిస్తోంది.. వాతావరణం మసకమసగ్గా ఉంది. ఎర్రగ్రా పూచిన గులాబీ పువ్వు మీద అక్కడక్కడ ఉన్న మంచు బిందువులు చంకీల్లా మెరుస్తున్నాయి. విచ్చుకోవడానికి సిద్ధంగా ఉన్న ముద్ద మందారం మొగ్గ ఎర్రని లిప్‌స్టిక్ వేసిన అమ్మాయి పెదవిలా ముచ్చటగా ఉంది. తెల్లని చామంతులు తమని చూడమన్నట్టుగా తమాషాగా తలలూపుతున్నాయి. ఇంకా మొగ్గలు వేయని మల్లె చెట్టు ఎండాకాలం కోసం ఎదురు చూస్తున్నట్టుంది. కనకాంబరాలు కళకళలాదుతున్నాయి. పూలమొక్కలంటే నాకు చాలా ఇష్టం మేము ఉండేది మేడమీద కాబట్టి పెద్దగా మొక్కలు పెంచడానికి కుదరదు. కుండీలలో క్రోటన్స్‌తో పాటు మల్లి, గులాబీ, మందార, చామంతి, కనకాంబరాలు వేశాం. నేను అప్పుడప్పుడు ఎండిన కాడల ఆకులు తీయడం, గొప్పులు తవ్వడం, కొత్త మొక్కలు ఏమైనా ఉంటే పాతడం చేస్తుంటాను. ఫిబ్రవరి విశ్వ చిత్రకళ కోసం నా గురించి నేను రాయాలి. కార్టూన్లు వేయాలి, బి.ఎస్.రాజుగారు వస్తే ఇవ్వాలి, ఇంకా రచనకు కార్టూన్లు పంపించాలి, ప్రియదత్తకు ఫుల్‌పేజీ గీయాలి, భూమి వీక్లీకి వేయాలి, ఒక కొత్త పత్రిక వాళ్లు కార్టూన్లు వేయమని రాశారు... వారికి నేను ఆలోచించాలి. ఇలా నేను అనుకొంటుండగానే టైం ఏడైంది. అవతల వదినకు వంటలో సాయం చేయాలి అనుకొంటు వంటగదిలోకి దారితీశాను టీ పెట్టడానికి.

ఒకసారి శ్రీజయదేవ్‌గారి తమ ఫ్యామిలీతో పాటు విశాఖలో వారి బంధువుల ఇంటికి వచ్చి నన్ను చూడడానికి మా ఇంటికి వచ్చారు. నేను ఎంతో సంతోష పడిపోయాను. చక్కగా మాట్లాడారు. కొన్ని కార్టూన్లు గీసి చూపించారు. ఇంట్లో అందరం ఆయనతో మాట్లాడాం. మా కోరిక మీద శ్రీ జయదేవ్‌గారు, వారి శ్రీమతి, పిల్లలు మా ఇంట్లో ఆతిథ్యం స్వీకరించి వెళ్లారు. అలాగే ఇంకోసారి విశాఖలో కార్టూన్ ఎగ్జిబిషన్ కండక్ట్ చేసే నిమిత్తం శ్రీ శంకు గారు విశాఖ వచ్చినప్పుడు మా ఇంటికి వచ్చారు. ఆయనను కలుసుకొని మాట్లాడే అవకాశం కలిగినందుకు నాకు చాలా ఆనందం కలిగింది. ఇంకా విశాఖ వచ్చి మా ఇంటికి వచ్చి నన్ను కలుసుకొన్న ప్రముఖుల్లో



# మొదటిసారి నాకే ఇవ్వడం గర్వంగా ఉంది

**రాగతి పండరి – మహిళాకార్టూనిస్టుగా చిరపరిచితురాలయిన ఆమె మొదటి కార్టూన్ 1972లో ఎనిమిదేళ్ల బాలికగా ఉన్నప్పుడు ఆంధ్రజ్యోతి వారపత్రికలో అచ్చయిందట. అప్పటినుంచీ నవ్వుల పువ్వులను వెదజల్లుతూ ఎంతోమంది అభిమానులను మూటగట్టుకున్న ఆమె నేడు 'కళారత్న' అవార్డు అందుకోబోతున్నారు. ఈ సందర్భంగా విశాఖపట్నంలో పుట్టి పెరిగిన రాగతి పండరితో చిన్న ఇంటర్వ్యూ..**




**మీలాగా పేరు తెచ్చుకున్న మహిళా కార్టూనిస్టులు లేరెందుకని?**

కార్టూన్లు వేసే ఆడవాళ్లే అతి తక్కువమంది. అందులోనూ కొందరు కొన్నాళ్లు వేసి మానేస్తుంటారు. ఏదయినా నిలకడగా కొన్నేళ్ల పాటు చేస్తేనే కదా పదిమందికీ తెలిసేది. కనిపించే కొన్ని పేర్లలో కూడా ఆడపేర్లతో వేసే మగవాళ్లే ఉంటారు. అయినా ఇప్పుడు కార్టూన్లకు చోటెక్కడుంది?

**ఒకప్పటికన్నా ఇప్పుడు వార, పక్ష పత్రికల సంఖ్య, సర్క్యులేషన్ పెరిగింది. మరి కార్టూన్లకు చోటు లేదంటూ మీరు బాధపడటం ఏమిటి?**

మీరన్నట్టు సంఖ్య పెరిగిన మాట నిజమే. అయితే కార్టూన్ల జాగాను సినిమా వార్తలు ఆక్రమిస్తున్నాయి. నేను కార్టూన్లు వేయడం మొదలెట్టిన రోజుల్లో వాటికి చాలా ప్రాముఖ్యత ఉండేది. కార్టూన్ కథలు, సింగిల్ పేజీ కార్టూన్లు... ఇలా వేసేవాళ్లు. రాజకీయ'చెద'రంగం, ఇద్దరమ్మాయిలు, చెవిలోపువ్వు వంటి శీర్షికలను నేను ఏళ్లకేళ్లు నడపగలిగానంటే అప్పట్లో ఆదరణ ఉండబట్టేగా. దీపావళి వంటి పండగల ప్రత్యేక సంచికల్లో ప్రతి పేజీలోనూ కార్టూన్లే వేసేవారు. పాఠకులూ వాటికోసమే ఎదురుచూసేవారు. టీవీ వచ్చాక కార్టూన్లకు ఆదరణ తగ్గిందనే అనిపిస్తోంది.

**పండగ వాతావరణాన్ని కార్టూన్లే ఎక్కువ ప్రతిఫలిస్తాయని మీరు గతంలో ఒక ఇంటర్వ్యూలో చెప్పారు. అన్నేళ్లపాటు పండగలకు ప్రత్యేకంగా బొమ్మలు వెయ్యడం బోరనిపించలేదా?**

అవే పండగలు. వాటిని చేసుకునే తీరులోనూ పెద్ద తేడా ఏం ఉండదు. కానీ గమనించి చూస్తే ఏటా ఏదో ఓ మార్పుంటుంది. ఒక ట్రెండుంటుంది. రాష్ట్రంలో, దేశంలో కొన్ని రకాల పరిస్థితులుంటాయి. వాటిని ఒడిసిపట్టుకుని కార్టూన్ వేసినప్పుడు సామాజిక, ఆర్థిక అంశాలన్నీ వాటిలో ప్రతిఫలిస్తాయి. అలాంటివాటిని జాగ్రత్తగా పరిశీలించడంవల్ల నాకెప్పుడూ బోర్ కొట్టలేదు. పైగా పండగలప్పుడు ప్రత్యేకంగా ఏం వెయ్యాలీ అని ఆలోచించడం సరదాగా ఉంటుంది. పండగ పిండివంటలకో ప్రత్యేకత ఉంటుంది కదా..! అలాగే కార్టూన్లు కూడా.

## రాగతి పండరికి నేడు పురస్కారం

**మీరు జయదేవ్‌గారికి ఏకలవ్య శిష్యులయినట్టే, మీకూ శిష్యులున్నారా?**

ఏమో నాకు తెలీదు. ఒకప్పుడు అభిమానులు బోలెడన్ని ఉత్తరాలు రాసేవారు. రచయితలకు కాకుండా కార్టూనిస్టులకు కూడా అంతమంది అభిమానులుంటారని నాకు తెలియని వయసది. అభినందనలు, ప్రశంసలకు ధన్యవాదాలు చెప్పి ఊరుకునేదాన్ని. కొందరు కలం స్నేహాన్ని కోరుకునేవారు. అలాంటివేమీ ఇష్టం లేక కొనసాగించేదాన్ని కాదు. ఇప్పటికీ అంతే. నన్ను చూడాలనుకునేవారు విశాఖపట్నం వచ్చినప్పుడు ఇంటికొస్తారు. నేను గడపదాటి ఎక్కడికైనా వెళ్లడం అరుదు. అంగవైకల్యం వల్ల సభలు సమావేశాలకు దూరంగా ఉంటాను. నావల్ల ఇంకొకరికి ఇబ్బంది కలిగించడం ఎందుకని. నన్ను చూసి నేనెప్పుడూ బాధపడను. ఇంకెవరయినా బాధపడటం లేదా ఆశ్చర్యంగా చూడటం నాకు నచ్చదు. అందుకే ఎక్కడకూ వెళ్లను. నాది నాలుగ్గోడల ప్రపంచం అనుకోండి. ఇప్పుడు టీవీ వచ్చాక సమస్త విషయాలూ ఇంట్లోనే తెలుస్తున్నాయి. యానిమేషన్, కంప్యూటర్ నేర్చుకోలేకపోయాననే వెలితి మాత్రం ఉంది.

**మీ కార్టూన్ల గురించి మీరేమనుకుంటారు?**

ప్రతి ఒక్కరూ హాయిగా నవ్వుకోవాలనే నేను కార్టూన్లు వేస్తాను. వ్యంగ్యంలో హేళన లేకుండా చూసుకుంటా. అదే సమయంలో చూసినవారిలో ఏదైనా ఆలోచన రేకెత్తేలా ఉండాలని, సమాజానికి ఉపయోగపడాలని కోరుకుంటాను. అదే నా ఫిలాసఫీ.

**బాధపడిన సందర్భాలు...**

వ్యక్తిగతంగా ఏమీ లేవు. అయితే సమాజాన్ని పరిశీలిస్తున్నప్పుడు ధరల పెరుగుదల, లక్షల కోట్ల కుంభకోణాలు ఇవన్నీ చూస్తుంటే చాలా బాధగా అనిపిస్తుంది. రాష్ట్రం ఎటుపోతోందీ అనుకుంటాను. అసలు మోసం, లంచగొండితనం లేని చోటు లేనేలేదనిపిస్తోంది. ఇదిగాక యువతీయువకుల తీరు చాలా బాధ కలిగిస్తుంది. ఎవరికి వాళ్లు తమను తాము హీరో హీరోయిన్లం అనుకుంటూ ప్రవర్తించడం వల్లే ఎన్నో దుర్ఘటనలు జరుగుతున్నాయి.

**'కళారత్న' అవార్డు రావడం...**

గొప్ప సంతోషంగా ఉంది. అవార్డులూరివార్డులూ కొత్తని కాదు. కానీ మన ప్రభుత్వం అన్ని రకాల కళాకారుల్నీ గుర్తించిందిగానీ, కార్టూనిస్టులను గుర్తించలేదని బాధగా ఉండేది నాకు. 'కళారత్న'తో అది తీరిపోయింది. పైగా దాన్ని మొదటిసారి నాకే ఇవ్వడం గర్వంగా ఉంది.

● అరుణ పవ్వు,
ఫోటోలు : వై.రామకృష్ణ

**కార్టూనిస్టుగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నుండి కళారత్న అవార్డు అందుకోనున్న రాగతి పండరి గారికి శుభాకాంక్షలు...**

*ఎడిటర్, 64 కళలుడాట్‌కామ్*

శ్రీగోలి శంకరరావు గారు, శ్రీ ఎల్యూనారాయణరావు గారు, శ్రీ ఉత్తమ్, శ్రీ తులసీరామ్, శ్రీ శశిధరణ్ మొదలైన వారు ఉన్నారు. నేనెప్పుడూ కలుసుకోకపోయినా శ్రీ సత్యమూర్తిగారంటే నాకెంతో గౌరవాభిమానాలు.

ఆయన కార్టూన్లు, బొమ్మలు వెరైటీగా ఉండి నాకు నచ్చుతాయి. నాకు కార్టూన్లు వేసే విషయంలో ఏమైనా డౌట్స్ ఉంటే శ్రీ సత్యమూర్తిగారికి లెటర్స్ రాస్తాను. ఆయన ఎంతో చక్కగా జవాబులు రాయడమే కాదు. నాకు దొరకని డ్రాయింగ్ మెటీరియల్స్ కూడా పంపించడం ఆయన గొప్పదనానికి నిదర్శనం. ఆ రోజుల్లో ఒకసారి విశాఖలో ఒక మీటింగ్‌కు హాజరైన సందర్భంలో ఆంధ్రభూమి ఎడిటర్ శ్రీ సికరాజుగారు, ఆయనతో పాటు కార్టూనిస్టు మల్లిక్‌గారు, మరికొందరు రచయితలు మా ఇంటికి వచ్చారు. నన్ను ఎంతో ప్రోత్సహించే సికరాజుగారు మా ఇంటికి రావడం నిజంగా నుకు చెప్పలేనంత ఆనందానుభూతిని కలిగించింది. నన్ను ఆంధ్రభూమి వీక్లీకి ఇంకా ఇంకా కార్టూన్లు పంపమన్నారు. అప్పుడు ఆంధ్రభూమి ఆదివారం డైలీ కూడా ఆయనే చూస్తున్నారు. వారం వారం ఒక స్ట్రిప్ కార్టూన్ వేయమన్నారు. రమక్కని కూడా ఆంధ్రభూమికి కథలు పంపిస్తూ ఉండమన్నారు.

శ్రీ సికరాజుగారి కోరికపై నేను ఆదివారం సంచికకు వారం వారం ఇద్దరమ్మాయిలు అనే స్ట్రిప్ కార్టూన్లను ప్రారంభించాను. పొట్టి అమ్మాయిలతో ప్రారంభమైన ఈ స్ట్రిప్ కార్టూన్ ఫీచర్ దాదాపు ఐదారేళ్లపాటు కొనసాగింది. ఈకార్టూన్లలో ఇద్దరమ్మాయిలు పాఠకుల మనసుల్లో చెరగని ముద్రవేసి భలే పాపులర్ అయ్యారు. అలాగే శ్రీ పురాణంగారి కోరికపై ఆంధ్రజ్యోతి వీక్లీలో కూడా స్ట్రిప్ కార్టూన్ ఫీచర్‌ను నవగ్రహం-అనుగ్రహం, మగాడి చెవిలో పూలు, భలే భలారే ఫీచర్స్ వేశాను. పత్రిక వీక్లీలో కార్టూన్లతో పాటు అడపాదడపా హాస్య కథలకూ బొమ్మలు గీస్తుండేదాన్ని. పత్రిక వీక్లీలో నాకు నచ్చిన కార్టూన్ అనే శీర్షికతో పాటు నా పరిచయం వేశారు. ఆంధ్రభూమి వీక్లీలో తెలుగులో ఏకైక మహిళా కార్టూనిస్టు రాగతిపండరి అంటూ నా ఇంటర్వ్యూ శ్రీ బోనేపల్లి మురళి రాశారు. గుండెలో కొండంత దిగులు రగులుతున్నా, కదలక, కన్నీరొలికించక నవ్వుతూ, నవ్వించే వ్యక్తిని ఏమని పిలవాలో తెలిసే నిఘంటువు ఈ ప్రపంచంలో ఉందా...? లేకపోతే ఆ నిఘంటువులో ఇదిగో ఈ పదాన్ని చేర్చండి- రాగతి పండరి అంటూ ఆంధ్రజ్యోతి డైలీ పేపర్‌లో చిగురంత ఆశ, బతుకంత వెలుగు అన్న హెడ్డింగ్‌తో ఇంటర్వ్యూ వేశారు.

*మిగతా రాబోయే సంచికలో...*

# హాలీవుడ్ నటుడు రిచర్డ్ బర్టన్

- బాలి

అప్పటి వరకూ హాలీవుడ్ నటి ఎలిజ్‌బెత్ టేలర్ గురించి అంతో ఇంతో తెలుసుకానీ, రిచర్డ్ బర్టన్ గురించి పెద్దగా ఏమీ తెలీదు. ఎందరో హాలీవుడ్ నటుల్లో అతనొకడు. అంతవరకే! -1963 సంవత్సరంలో 'క్లియోపాత్ర' సిన్మానిర్మాణదశలోనే ఒకరికొకరు పరిచయమై అది ప్రేమగా మారి పత్రికలద్వారా ఇంకా ఇంకా మషాలా దట్టించబడి జనంలోకి వచ్చేసరికి వీరిద్దరి వ్యక్తిగత జీవితం తెలుసుకోవాలన్న ఆసక్తి యూరప్‌లో మొత్తం పెరిగిపోయింది.

అందులోనూ 'క్లియోపాత్ర' సిన్మాకిచ్చిన పబ్లిసిటీ అంతా ఇంతా కాదు ప్రపంచంలో విడుదలయిన చోటల్లా బ్రహ్మాండంగా ఆడింది.

బర్టన్‌కు ఇది రెండో ఇన్నింగ్స్ శ్రీకారం చుట్టింది. 1963లో వీరి మధ్య ప్రేమకు బీజాలు పడినా 1965 వరకూ వీరి వివాహంకాలేదు. కారణాలు మామూలువే! యూరప్‌లోనూ అటు హాలీవుడ్ సినీ ప్రపంచంలో అవి మామూలు విషయాలే! కారణం టేలర్ అప్పటికే ఎడ్డీఫిషర్‌తో కాపురం చేస్తోంది. అతను పేరున్న నటుడు. ఇటు బర్టన్ సైబల్‌ని పెళ్లి చేసుకొని ఇద్దర అమ్మాయిలకు తండ్రి అయ్యాడు. ఆ తరువాత పెద్దమ్మాయి కేట్ బర్టన్ నటి అయి హాలీవుడ్ సిన్మాల్లో నటించింది. రెండో కుమార్తె పేరు జెస్సికా బర్టన్.

ఎడ్డీఫిషర్‌తో విడాకులు తీసుకున్న తరువాత బర్టన్‌ని వివాహం చేసుకుంది టేలర్. అప్పటికవరకూ ఎంతో విచ్చలవిడిగా జీవితాన్ని గడిపిన బర్టన్‌లో కొంతమార్పు వస్తుందని మిత్రులు ఆశించారు. అయితే టేలర్ అతని జీవితంలోకి ప్రవేశించిన తరువాత ఇంకా ఎక్కువయిపోయింది. సిన్మా అవకాశాలు విరివిగా రావడం మొదలెట్టాయి. విపరీతమయిన గుర్తింపు వచ్చింది. అధిక పారితోషకం తీసుకొనే పదిమంది హాలీవుడ్ నటుల లిస్ట్‌లోకి తనూ చేరిపోయాడు.



రిచర్ట్ బర్టన్ తన జీవితం మొత్తంలో 56 సిన్మాల్లో మాత్రమే నటించాడు. అది హాలివుడ్ సినిమా రంగంలో గొప్ప విషయమే. ఇతని మాతృదేశం ఇంగ్లండు. 1925లో జన్మించాడు. తండ్రి పక్కా తాగుబోతు. ఇంగ్లండ్ వేల్స్‌లో బొగ్గుగని కార్మికుడు. పగలంతా గనిలో గడపడం ఇంటికొస్తూనే తాగడం అతని నిత్యకృత్యం. పిల్లల ఆలనా పాలనా పట్టించు కొనేవాడు కాదు. మొత్తం 13మంది సంతానం. బర్టన్ అందులో 12వ వాడు. తల్లి ఏవో చిన్న చిన్న పనులు చేస్తూ సంసారాన్ని నెట్టుకొచ్చేది. దరిద్రం, అనారోగ్యం ఆమెను పీడించేవి. అయితే బర్టన్ చిన్నప్పట్నించీ బహు హుషారుగా ఉ ండేవాడు.

ఇది అక్క బావగార్ల దృష్టిలోపడింది. చదివిద్దామన్న ఉద్దేశ్యంతో వారి వెంట తీసుకుపోయారు. సహజంగానే ఇతనిలో ఉండే హుషార్, గడుసుదనం ఎక్కువయి నియంత్రణ సన్నగిల్లి 8వ ఏటనే సిగరెట్ల్ కాల్చడం,





గుర్తింపు తెచ్చింది. ఇక ప్రొఫెషనల్‌గా మారితే ఎలా ఉంటుందీ అన్న ఆలోచన వచ్చింది. అంతే ఉన్న ఉద్యోగానికి తిలోదకాలిచ్చి బ్రాడ్వే వంటి చోట్ల నాటకాలాడేడు. ఆ నాటకాల్లో విపరీతంగా డబ్బు రావడం మొదలయ్యింది. దీనితో వ్యసనాలు పెరిగాయి. ఒకదశలో పన్నులు చెల్లించలేక తనకిష్టమయిన దేశమైన స్విట్జర్లాండ్ భార్య సైబల్‌తో వెళ్లిపోయాడు.

ఈమారు ఇంగ్లండ్‌కన్నా హాలీవుడ్‌లో అడుగుపెడితే ఎలా ఉంటుందన్న ఆలోచన వచ్చింది. 1952సంవత్సరమది మిత్రులూ, బంధువులూ చెప్పిన మీదట హాలీవుడ్‌లో అడుగుపెట్టాడు. అయితే హాలీవుడ్ సినీ పరిశ్రమ ఇతడ్ని గొప్పగా ఆహ్వానించలేదు. కొన్ని ఇబ్బందులు ఎదుర్కొన్నాక ఓ సిన్మా ఛాన్స్ దక్కింది. అలా అతని మొదటి సిన్మా "లాస్ట్‌డేస్ ఆఫ్ డాల్విన్."

ప్రపంచ వ్యాప్తంగా అతనికి మంచిపేరు తెచ్చిన సిన్మాల్లో "ఏర్ ఈగన్‌స్డేర్" ఒకటి. స్టార్ ఆఫ్ ది ఇయర్ అని ఒక సంవత్సరం అతను ఎన్నిక కాబడ్డాడు. అదే సంవత్సరం ఆస్కార్ అవార్డ్‌కి నామినేషన్ చేయబడ్డాడు. ఆ సినిమా పేరు "మై కిజిన్‌రేచల్" కాని ఆస్కార్ అతడ్ని వరించలేదు. అలా ఒకసారి కాదు. రెండుసార్లు కాదు. ఏడుసార్లు ఈయనపేరు నామినేట్ చేయబడినా ఆయన ఆస్కార్ బహుమతి అందులేకపోయాడు.

1965లో టేలర్‌ని పెళ్లి చేసుకున్నాడు. ఆ పెళ్లి ఆ సంవత్సరం మార్చి 18న అయింది. వివాహం చేసుకొన్న

పన్నెండవ ఏట కల్లా తాగుడులో ఆరితేరాడు. ఇవి రెండూ దగ్గరలేనపుడు బుద్ధిగా చదువుతున్నా నిలకడలేని అతని మనస్తత్వం ఆటల మీదకు మళ్లింది. అదికొన్నాళ్లే. గొంతు బాగుంది పాటలు పాడడం మొదలెట్టాడు. ఇదో ప్రత్యేక ఆకర్షణ అయ్యింది. పిన్నలూ, పెద్దలూ ప్రోత్సహించారు. ఇతడు సానపట్టని వజ్రంలా ఉన్నాడనుకున్నాడోయేమో ఒక టీచర్ ఇతడ్ని దగ్గరకు చేరతీశాడు. ఆయనపేరు ఫిలప్ బర్టన్. నిజానికి రిచర్డ్ బర్టన్ అసలు పేరు అదికానే కాదు. "రిచర్డ్ వాల్టర్ జుంకిన్స్" ఇదీ అతని తల్లిదండ్రులు పెట్టిన పేరు.

ఈ గురువుగారు శిష్యుడ్ని ఒక క్రమశిక్షణలో పెడుతూ రిచర్డ్ వాల్టర్ జంకిన్‌లోని మొదటి పేరు ఉంచి చివరలో తన ఇంటిపేరు "బర్టన్" ను కలిపాడు. దాంతో ఇతను రిచర్డ్ బర్టన్ రాయల్ ఎయిర్ ఫోర్స్"లో చేరాడు. అక్కడే అతనిలో ఉన్న సృజనాత్మకత బయటపడింది. వీకెండ్ పార్టీలో పాడుతూ, నాటకాల్లో నటించడం మొదలెట్టాడు. ఇది అతనిలో మంచి




దేశం కెనడా. రిసెప్షన్ బోస్టన్‌లో పెట్టుకున్నారు. కొద్దిమంది అభిమానులను, బంధువులనే పిలిచారు. అయితే హొటల్ వారివల్ల ఆవిషయం లీకయి మరికొంత మంది అభిమానులు హాల్లోకి తోసుకువచ్చారు. ఆతోపులాటలో బర్టన్ కోటు చిరిగిపోయింది. ఎలిజ్‌బెత్ టైలర్ చెవిరింగు విరిగిపోయి రక్తం కారడం మొదలెట్టింది.

ఈ పెళ్లి సందర్భంగా టేలర్‌కి ఎన్నో బహుమతులు రిచర్ట్ ఇచ్చాడు. ప్రసిద్ధి చెందిన కార్డియర్ కంపెనీలో కొన్న కార్డియర్ వజ్రమొకటి. అలాగే వేల్స్‌రాణీ ఒకటవ మేరీ వాడిన 50 కారెట్‌ల ముత్యమొకటి. దాన్ని వేలంలో కొని టేలర్‌కి బహుమతిగా ఇచ్చాడు.

వీరిద్దరూ రెండుసార్లు వివాహం చేసుకున్నారు. రెండు సార్లూ విడాకులు తీసుకున్నారు. రెండోసారి విడాకులు తీసుకున్న తరువాతే టేలర్ కార్డియర్ వజ్రాన్ని యాభైలక్షల డాలర్లలకు వేలం వేసి అమ్మగా వచ్చిన డబ్బును ఓ హాస్పిటల్‌కు దానంగా ఇచ్చేసింది.

టేలర్ తన జీవితంలో ఏడుసార్లు పెళ్లిచేసుకుంటే . నాలుగుసార్లు బర్టన్ పెళ్లి చేసుకున్నాడు. మొదటి భార్య సైబల్. ఆ తరువాత రెండుసార్లూ టేలర్. తరువాత ఆమె కోరస్‌పాడే సుసాన్ హంట్. ఈమెతో 1974లో విడాకులు తీసుకొని తిరిగి 1975లో శాలిహేఆనే ఆమెను పెళ్లి చేసుకున్నాడు. ఈమె మేకప్ ఆర్టిస్ట్. అయితే వీరి కాపురం సంవత్సరం కన్నా నిలవలేదు.

ఒక చేతిలో సిగరెట్ ఉంటే మరోచేతిలో ఓడ్కా నింపిన గ్లాసు అతని చేతిలో ఇరవైనాలుగుగంటలూ ఉండవలసిందే. టైలర్ కూడా విపరీతంగా ఓడ్కా తీసుకొనేది. శనివారం వీకెండ్‌పార్టీ చేసుకొని నిద్రపోతే తిరిగి మంగళవారమే పక్క మీంచిలేవడం. ఈ రోజు ఆదివారంకదూ! అని ప్రశ్నించిన నివ్వెరపోవడం చాలసార్లు జరిగింది. అయినా వీరిమధ్య బాంధవ్యం పొసగలేదు. పరిమితిలేని తాగుడు, నిద్రపట్టని రోగం, దీనికితోడు వెన్నునొప్పి గట్టిగా ఐదునిముషాలు నిటారుగా నిలబలేక పోవడం. దాంతో అదుపులేని ఖర్చు ఇవీ ఇతని చివరిరోజుల్లో జరిగిన తంతు. ఒక దశలో అతని పెర్సనల్ సర్జన్ ఇతడ్ని డిసి పరీక్ష చేస్తూ ఇతని వెన్నెముక పూర్తిగా ఓటెడ్ విత్ క్రిస్టలైజ్‌డ్ ఆల్కహాల్" అని సెలవిచ్చాడు.

"బర్టన్‌దిమేన్ బిహైండ్ దిమైత్" అని ఇతడి గురించిన పెన్నీ జూనర్ అనే రచయిత్రి పుస్తకం రాస్తూ ఎన్నో విషయాలు బయటపెట్టింది. ఇతని ఆస్తులతోపాటు, అలవాట్లనూ అమెరికాలో, స్విట్జర్‌లాండ్‌లోనూ అన్ని వసతులతోనూ ఉన్న 5 పెద్ద పెద్ద మహల్స్‌లను కొన్నాడు. ఆరుజట్ ఎయిర్ క్రాఫ్ట్ అతని ప్రయివేట్ ఫాంలో సిద్దంగా ఉండేవి. ఇక దాసదాసీజనం, సెక్రటీల గురించి చెప్పనవసరంలేదు. అతని పరిధిలో ఆయనో నవాబు. 1974 ప్రాంతాల్లో ఇతడ్ని బయోసెక్సువల్ మనిషిగా అమెరికన్ పత్రికలు రాశాయి.

చివరకు 1989 ఆగస్ట్‌లో తలలోని నరాలు చిట్లి తనకిష్టమయిన స్విస్‌దేశంలో మరణించాడు. ఇతని తండ్రి కూడా ఇదే వ్యాధితో మరణించాడని పత్రికలు అప్పట్లో రాశాయి.

# చరిత్ర-చిత్రకళ

వెంటపల్లి సత్యనారాయణ

**సాంఘీక శాస్త్రాల్లో చరిత్ర పరిధి ఎంత విస్తృతమో, లలిత కళారంగాల్లో చిత్రకళా వ్యాసంగం యొక్క పరిధి కూడా అంతే విస్తృతం. అనేక విషయాలలో రెండింటికీ గల సారూప్యత దృష్ట్యా చరిత్రను చిత్రకళతో పోల్చడం ఎంత సబబో, చిత్రకళను చరిత్రతో పోల్చడం కూడా అంతే సబబుగా చెప్పవచ్చు.**



చరిత్ర అంటే సాధారణంగా ఎవరకైనా తొందరగా గుర్తుకువచ్చేది గత కాలంలోని చక్రవర్తులు, రాజులు, రాజ్యాలు, సామంతులు, సైనికులు, దండయాత్రలు, యుద్ధాలు, పరిపాలన, సంస్కరణలు మొదలయిన రాజకీయాలతో ముడిపడియున్న రాజకీయ చరిత్రే గుర్తుకువస్తుంది. కానీ చరిత్ర అంటే కేవలం రాజకీయ చరిత్ర మాత్రమే కాదు. దాని పరిధి చాలా విస్తృతమైంది. నేడు అది అనేక శాఖోపశాఖలుగా విస్తరించింది. ఒక్కమాటలో చెప్పాలి అంటే ఆధునిక యుగంలో మనిషి ఎన్ని రంగాలలో విద్య నభ్యసిస్తున్నాడో అన్ని రంగాలలోనూ అన్ని అంశాలలోనూ నేడు చరిత్ర వుంది. వైద్య శాస్త్రాన్ని అభ్యసిస్తున్న వ్యక్తికి లేదా సాంకేతిక శాస్త్రాన్ని అభ్యసిస్తున్న వ్యక్తికి చరిత్రతో పనేంటి? అసలు దానివలన వాళ్లకు, అలాగే ఇతర శాస్త్రాలకు ఒదిగేదేమిటి? అని చాలా మంది అనుకూంటూ వుంటారు. ఈకారణంగానే అనుకూంటాను ఆటోమొబైల్ ఇండస్ట్రీకి పితామహుడుగా చెప్పుకునే హెన్రీఫోర్డ్ చరిత్ర గురించి వ్యాఖ్యానిస్తూ. అర్ధరహితమైన విషయాని కంటే ఎక్కువాకాదు తక్కువాకాదు" అన్న తరహాలో"History is more or less bank" అన్నాడు. హెన్రీఫోర్డ్‌లాంటి ఎంతో గొప్ప వ్యక్తి చరిత్రగురించి అలా అన్నాడంటే ఇక మామూలు వ్యక్తుల అభిప్రాయాల గురించి ఏమని చెప్పుకోవాలి. ఇక్కడే అందరం పప్పులో కాలేస్తూ వుంటాము.

చరిత్ర అంటే ఇదే అనే ఒక విధమైన అభిప్రాయం ప్రజల్లో స్థిరపడిపోవడం వలన, అసలు దానివలన ఇతర అంశాలకు లేదా శాస్త్రాలకు ఎలాంటి ఉపయోగం లేదు అని కుంటూ వుంటాము. కానీ సక్రమంగా ఆలోచిస్తే అసలు చరిత్రే అన్ని అంశాలకూ మూలాధారంగా చెప్పవచ్చు.ఎందుచేతనంటే ఒక డాక్టర్ రోగికి వైద్యం చేయాలనుకున్నప్పుడు ఆరోగిక సరైన వైద్యం అందజేయాలి అంటే ఆ రోగ లక్షణాలకు సంబంధించిన చరిత్ర డాక్టర్ ముందు తెలుసుకోవాలి. ఒక మందును వాడాలి అంటే ఆమందు ఏఏ సందర్భాల్లో ఎలా పనిచేస్తుందన్న విషయాన్ని ముందు అతడు తెలుసుకోవాలి. అలాగే ఒక మదుపరి తాను సంపాదించిన సొమ్మును బద్రంగా మదుపుచేయడం ద్వారా సొమ్మును పెంచుకోవాలి అని అనుకున్నపుడు దాన్ని ఏ సంస్థలో పెడితే తన సొమ్ము అధికంగా పెరుగుతుంది. ఏ సంస్థ అయితే మోసంలేకుండా ఖచ్చితంగా మన లాభాన్ని మనకు అందజేస్తుంది. అన్న ఆలోచనలు మదిలో మెదులుతాయి. అలాంటి సందర్భంలో సొమ్ము భద్రత మరియు లాభాల కోసం తను మదుపుచేయాలి అనుకుంటే సంస్థయొక్క చరిత్ర వ్యక్తి ముందు తెలుసుకోవాలి. అప్పుడే అతను లాభదాయకమైన వ్యాపారాన్ని చేయగలడు. అలాగే ఒక వకీలు తన వద్దకు వచ్చిన నిందుతునికి సంబందించిన కేసును న్యాయస్థానంతో వాదించాలి అంటే ఖచ్చితంగా ఆ కేసు



పూర్వాపరాల చరిత్రను అతడు తెలుసుకొని వుండాలి. అలాగే ఒక శాస్త్రవేత్త ఒక నూతన ఆవిష్కరణకు పూనుకున్నపుడు అతడు ఆరంగంలో తనకు ముందు శాస్త్రవేత్తలు చేసిన కృషికి సంబందించిన చరిత్రను చదవాలి. ఎలాంటి తప్పులు గతంలో ఈ రంగంలో జరిగాయి. వాటిని ఏవిధంగా పరిష్కరించాలి అన్న కోణంలో చూసినపుడు మాత్రమే అతను చేయబోయే నూతన ఆవిష్కరణ సఫలీకృతం అయ్యేరీతిగా చేయగలుగుతాడు. ఇలా గతానికి సంబంధించిన చరిత్ర ముందు తెలుసుకున్నపుడు మాత్రమే భవిష్యత్తుకు ఏ వ్యక్తైనా సరైన పునాదిని నిర్మించుకోగలుగుతాడు. అందుకే History is key to all aspects అనడం ఏమాత్రం అవాస్తవం కాదేమో...

సాంఘిక శాస్త్రాల్లో చరిత్ర అంటే అందరికీ రాజకీయ చరిత్ర గుర్తుకువచ్చినట్లే, కళావ్యాసంగాల్లోకూడా చిత్రకళ అంటే సాధారణంగా గుర్తుకువచ్చేవి బాహ్య జగత్తులోని ప్రకృతి, మానవరూపాలు, పరిసరాలు పశుపక్ష్యాదులు, లతలు, తీగలు, పుష్పాలు, మొక్కలు,వృక్షాలు మొదలుగాగల వృక్షజాలం, నదులు, సెలయేర్లు, జలపాతాలు, సముద్రాలు మొదలుగాగల నీటివనరులు, నీటివనరుల ఆధారంగా కాలానుగుణంగా ఆకాశంలో మారే రంగులు, మనిషి దైనందిన జీవితంలో ఉపయోగించే గృహోపకరణాలు, పాత్రలు సామాగ్రి మొదలుగా గల నిశ్చల రూపాలు వీటన్నింటినీ చిత్రించడమే చిత్రకళ అని భావించడం జరుగుతూ వుంటుంది. కానీ ప్రకృతిలో ఉన్న వాటిని చిత్రించి సృష్టికి ప్రతిసృష్టి చేయడమే కాక దానికతీతమైన సృజన కూడా చిత్రకళ ముఖ్యలక్షణాలలో ఒకటి. అందుచేతనే లలిత కళారూపాలైన చిత్ర, శిల్ప, సాహిత్య, నృత్య, నాటక కళలోనే గాక విద్యాపరమైన అనేక రంగాలలోకూడా చిత్రకళ యొక్క ఆవశ్యకతను నేడు మనము విస్మరించలేము. ప్రాధమిక స్థాయిలో విద్య, వైద్య, శాస్త్ర, సాంకేతిక రంగాలలో చేస్తున్న వివిధ ప్రయోగాల స్వరూప స్వభావాలు, వాటి భావి ఫలితాలను ప్రస్ఫుటంగా మనకు అర్ధమయ్యే రీతిలో వారు వ్యక్తం చేసే ప్రక్రియలో చిత్రకళారూపమైన యానియేషన్‌ను నేడు ఎంతలా వాడుకుంటున్నామో మనకందరికీ తెలుసు. ఒక్క మాటలో చెప్పాలి అంటే మనిషి దైనందిన జీవితంలో పరిచయమున్న అన్ని రంగాలలోనూ చిత్రకళకు ప్రాధాన్యముంటుంది. శాస్త్ర, సాంకేతిక రంగాలు కూడా ఇందుకు



మినహాయింపేమీ కాదు. నేడు ఈ కళకు ఏర్పడిన విస్తృతి కారణంగానే చిత్రకళాశాలల్లో అది అనేక శాఖోపశాఖలుగా విభజింపబడి విద్యార్థులచే వివిధ ప్రత్యేక విభాగాలుగా అధ్యయనం చేయబడుతుంది.

గతానికి చెందిన ప్రజలయొక్క సాంఘిక, ఆర్థిక, రాజకీయ సాంస్కృతిక జీవన విధానాన్ని ఒక క్రమ పద్దతిలో రాసి భావితరాలకు అందించడం చరిత్రకారుని కర్తవ్యమయితే, గత కాలంనాటి ప్రజల ఆచారవ్యవహారాలు, ప్రజల జీవన విధానాన్ని, అంతరించిపోతున్న మన ప్రాచీన కళలు, సాంప్రదాయ వారసత్వాన్ని భావితరాలకు అందించడం చిత్రకారుని ముఖ్య కర్తవ్యాలలో ఒకటి. ఇక్కడ చిత్రకారుడు, చరిత్రకారుడూ ఇద్దరూ కూడా అద్యయనం చేసేదీ, చెప్పేదీ కూడా ఒక్కటే అంశం. అదీ గతానికి సంబంధించిన యదార్థాల గురించే.

తారాచంద్, మహాజన్, బిపిన్‌చంద్ర, మామిడిపూడి వేంకటరంగయ్య, నంబూ ద్రిపాద్ లాంటి ఎందరో చరిత్రకారులు ఆధునిక భారతదేశ చరిత్ర గురించే రాసారు. వీరంతా రాసింది. ఒకే విషయం అయినా ఎవరిశైలి వారికి ప్రత్యేకంగా వుంటుంది. అలాగే జామినిరాయ్, అంట్యాకుల పైడిరాజు, కాపురాజయ్య, యాసాల బాలయ్య లాంటి ఎందరో చిత్రకారులు చిత్రించింది గ్రామీణ జానపద చిత్రాన్నే కానీ విడివిడిగా చూసినపుడు ఎవరిశైలి వారిదే ప్రత్యేకంగా మనకు కనబడుతుంది. అందుకే ఈ రెండూ కూడా వ్యక్తిత్వ వికాశానికి దోహదపడే అంశాలుగా మనం పేర్కొనవచ్చు.

ప్రఖ్యాత బ్రిటీషు చరిత్ర కారుడు E.H. Car చెప్పినట్లు "History is continuess process between Histarian and his facts, and unending dialogue between present and fast" "చరిత్ర కారుడికి చారిత్రక ఆధారాలకూ మద్య నిరంతరంగా సాగే ప్రక్రియే గాక గతానికి వర్తమానానికి మద్య నిరంతరం సాగే ఒక అనంతమైన సంభాషణ"గా చరిత్రను అతడు పేర్కొన్నాడు. చరిత్రకారుడు ఒక చారిత్రక గ్రంధాన్ని రచించాలి అంటే అందుకు ఆధారాలు కావాలి. వాటికోసం అతడు పరిశోధన చేస్తాడు. ఈ పరిశోధనలో ఒక్కోసారి అతనికి కావల్సిన ఆధారాలు పూర్తిగా లభ్యం కావచ్చు లేదా ఒకోసారి లభ్యం కాకపోవచ్చు. ప్రాచీన చరిత్రలు వ్రాసేటపుడు చరిత్రకారునికి బాగా ఎదురయ్యే సమస్య ఇది. అయితే లభ్యమైన సంఘటనల ఆధారాలను వేటికవి అలా వేరుగా వుంచడం వలన వాటి చరిత్ర మనకు తెలియదు. ప్రాధాన్యతా క్రమంలో వాటిని పేర్చి సంఘటనల ఆధారంగా కార్యకారణాలను పరిశీలన చేసి ఒక క్రమమైన పద్దతిలో పేర్చడం ద్వారా అతడు వాటికి సంబంధించిన చరిత్రను మనకు తెలియజేస్తాడు. ఆధునిక చరిత్ర రాసేటపుడు చరిత్రకారునికి ఆధారాల విషయంలో ఎలాంటి సమస్య ఉత్పన్నంకాదు. కానీ ప్రాచీన చరిత్రలు వ్రాసేటపుడు చరిత్రకారునికి ఒక్కోసారి దానికి సంబంధించిన పూర్తి ఆధారాలు లభ్యంకావడం అనేక కారణాల దృష్ట్యా కష్టమౌతుంది. అలాంటప్పుడు అసమగ్రంగా వున్న ఆధారాలను ప్రాధాన్యతాక్రమంలో పేర్చిన తర్వాత కథనంలో లోపించిన విషయాలను పూరించడానికి వివేచనతో కూడిన తర్కంలో అక్కడి కార్యాకారణాలను ఊహించాలి. అలా చేయడం ద్వారా అతడు చరిత్రకు ఒక సమగ్ర రూపాన్నిస్తాడు.

చిత్రకారుడు ఒక చిత్రాన్ని చిత్రించడానికి కూడా ఆధారాలు కావాలి. అయితే వాటికోసం చరిత్రకారుడు అన్వేషించినరీతికి



భిన్నంగా ఇతని అన్వేషణ వుంటుంది. అంతే కాక తాను చిత్రించి చూసుకున్న చిత్రాన్ని బట్టి కూడా ఇతని అన్వేషణ భిన్నరీతుల్లో వుంటుంది. ఒక చారిత్రక ఘట్టానికి సంబంధించిన చిత్రాన్ని చిత్రించపూనుకున్నపుడు ఆ సంఘటన జరిగిన స్థలం, పరిసరాలు, అందరి వ్యక్తుల కార్యకారణాలు, ఫలితం మొదలయిన విషయాలను అతడు దృష్టిలో వుంచుకోవాలి ఉదా॥కు అశోకుని కళింగయుద్ధ ఘట్టాన్ని ఒక ప్రామాణిక చిత్రంగా చిత్రించాలి అని అనుకున్నపుడు చిత్రకారుడు ఖచ్చితంగా కళింగయుద్ధం జరిగిన స్థలం కాలం, పరిసరాలు, చారిత్రక ఆధారాల ద్వారా అక్కడ గల పాత్రలు, ఫలితం మొదలైన విషయాలను చిత్రకారుడు గమనించాలి. అయితే ఎప్పుడో క్రీస్తుపూర్వం 267లో జరిగిన యుద్ధాన్ని ఆధునిక యుగంలో ఉన్న వ్యక్తి చిత్రించబూనుకున్నపుడు భౌతిక పరిసరాలు మినహా మిగతా విషయాలన్నీ కూడా లభ్యమయిన చారిత్రక ఆధారాల ద్వారా అతడు ఊహించే రూపాన్ని వ్రాయాల్సి వుంటుంది. ఇక్కడ చరిత్రకారుని కంటే చిత్రకారునికే ఊహయొక్క అవసరం అధికంగా వుంటుంది. ప్రాచీన చరిత్రలో అసమగ్రమైన ఆధారాల సమస్య ఏర్పడినపుడే చరిత్రకారునికి ఊహ అవసరం ఏర్పడుతుంది. కానీ చిత్రకారునికి మాత్రం ఆధారాలు పూర్తిగా ఉన్నప్పటికీ ఊహయొక్క అవసరం అధికంగా కావాలి. మరలా చిత్రించేందుకు అతడు ఎంచుకున్న శైలి కూడా దీనిపై ప్రభావాన్ని చూపెడుతుంది. అదే కళింగయుద్ధ దృశ్యాన్ని ఆధునిక పద్ధతిలో చిత్రించాలనుకున్నపుడు చిత్రకారునికి ఆ సంఘటన పట్ల ఒక అవగాహన వుంటే సరిపోతుంది. ఆ అవగాహన సహాయంతో తనదైన శైలిలో ఊహించి ఒక క్రొత్త పద్ధతిలో ఆ దృశ్యానికి రూపాన్నిస్తాడు. అక్కడ అశోకుని రూపం, పరిసరాలు మొ॥ వాటితో అంతగా పని ఉండక పోవచ్చు. చిత్రాన్ని పూర్తిగా ఊహాస్పందనలపైనే చిత్రించడం జరుగుతుంది.

ప్రఖ్యాత చిత్రకారుడు ఆధునిక చిత్రకళా బ్రహ్మగా పేరుగాంచిన పాబ్లోపికాసో అద్భుతమైన సృష్టి "గెర్నికా" చిత్రాన్ని ఇందుకు మంచి ఉదా॥గా తీసుకోవచ్చును. 1937లో హిట్లర్ యొక్క మాజీ సైనికులు పురాతన గుయెర్నికా రాజధాని బాస్కే"ని బాంబులతో నేలమట్టంచేసిన వికృత చర్యకు చలించి కేవలం నలుపు, దూసిర వర్ణాలతో సంజ్ఞల ద్వారా ఎంతో గొప్పగా పికాసో ద్నాన్ని చిత్రించారు. ఇలాంటి చిత్రణ పూర్తిగా ఆ సంఘటనల నేపథ్యంలో చిత్రకారుని భావోద్దీపనల ఆధారంగా చిత్రించదంజరుగుతుంది. అలాకాకుండా ఒక సమగ్రమైన వాస్తవ చిత్రణను ఒక చారిత్రక, లేదా పురాణ ఘట్టానికి ఇవ్వాలి అని అనుకున్నపుడు ఆ సంఘటన తాలూకు ప్రతీ అంశాన్నీ, ప్రతీపాత్రనీ ప్రదేశాలనీ అన్నీ క్షుణ్ణంగా అధ్యయనం చేసి బాగా చేయి తిరిగిన సమర్ధవంతమైన చిత్రకారుని కుంచెనుండి రూపు దిద్దుకున్నపుడు అది అద్భుతమైన ప్రామాణిక చిత్రంగా బాసిల్లుతుంది. ప్రసిద్ధ చిత్రకారులు శ్రీ కొండపల్లి శేషగిరిరావుగారి" శకుంతల అత్తవారింటికి పంపుట" అనే చిత్రాన్ని ఇందుకు ఉదాహరణగా తీసుకోవచ్చు.

చరిత్ర-సంస్కృతి అనేవి రెండూ విడదీయరాని పదాలు. ఏ దేశ చరిత్ర అయినా ఉన్నతం కావాలి అంటే అక్కడ సంస్కృతి ఉన్నతమైంది కావాలి. సంస్కృతి ఉన్నతమైంది కావాలి అంటే అక్కడ కళారంగం ఉన్నతంగా ఉండాలి. అందుకే కళలు లేనిదే సంస్కృతి ఉన్నతం కాదు. సంస్కృతి ఉన్నతమైంది కానపుడు అక్కడి చరిత్రకూడా ఉన్నతమైంది కాలేదు. అందుకే చరిత్ర ఉన్నతికి సంస్కృతి ఆధారమైతే సంస్కృతి ఉన్నతికి కళారంగం ఆధారం. అందుకే...

కళల కాంతిలోనే సంస్కృతి వెలుగొందుతుంది.

సంస్కృతి వెలుగులోనే చరిత్ర దేదీప్యమౌతుంది.

అందుకే...

కళ-సంస్కృతీ-చరిత్ర ఈ మూడూ విడదీయరానివి.





సినీదర్శకుడు వి.ఎన్.ఆదిత్య నుండి అవార్డు అందుకుంటూ..

సమ్'థింక్ స్పెషల్









# అక్షరాలతో ఆకృతులు

కళాకారులలో ఒక్కొక్కరిది ఒక్కో శైలి–ఒక్కో ఆలోచన.

అక్షరాలు అందంగా రాయడం ఒక ఆర్ట్. దీనినే కాలిగ్రఫీ అంటారు. కాలిగ్రఫీ ఆర్ట్‌లో కృషి చేస్తున్న యువ చిత్రకారుడు జైదుర్గ.

వినూత్న ఆలోచనలతో అక్షరాలకు సొగసులు దిద్దుతూ, అక్షరాలతో ఆకృతులు రూపొందిస్తున్నాడు.

హైస్కూల్ స్థాయినుండి చిత్రకళపై ఆసక్తితో కాలిగ్రఫీ ఆర్ట్‌లో కృషి చేస్తూవచ్చాడు. విజయవాడ శారదా కాలేజీలో బి.యస్సీ చదువుకునే రోజుల్లోనే పెయింటింగ్ పోటీల్లో అనేక బహుమతులందుకున్నాడు. ప్రస్తుతం హైద్రాబాద్ జె.ఎన్.టి.యు. కాలేజీలో బి.ఎఫ్.ఏ (యానిమేషన్) రెండవ సంవత్సరం చదువుతూ, కొన్ని సినిమాలకు లోగోలు రూపొందిస్తున్నాడు. ఇక్కడ చూస్తున్న ఎర్ర గులాబీలు లోగో ఇతని సృష్టే. కళాసృజనతోపాటు, సామాజిక స్పృహ కల్గిన జైదుర్గ అనేక సామాజిక కార్యక్రమాలలో పాల్గొంటూ, వేసవి సెలవుల్లో స్కూలు పిల్లలకు డ్రాయింగ్–పెయింటింగ్స్ క్లాసులు నిర్వహిస్తూంటాడు.

టాటూలు వేయడం, ఫొటోగ్రఫీ ఇతని హాబీలు.






64 కళలు.కామ్
www.64kalalu.com
సకల కళల సమాహారం
సంపుటి :1 సంచిక :5 మార్చి 2011



## కృతజ్ఞతలు

64కళలుడాట్‌కామ్ నాలుగు నెలలు పూర్తిచేసుకొని ఐదవ నెలలో ప్రవేశించింది. విశ్వవ్యాప్తంగా 38 దేశాలలో వున్న తెలుగువారు వీక్షిస్తున్న ఈ పత్రికకు రోజురోజుకు ఆదరణ పెరుగుతూనే ఉంది. ఫిబ్రవరి నెలనుండి ప్రారంభించిన పగటివేషాలు-సామాజికాంశాలు శీర్షికకు, కవితలకు పాఠకులనుండి విశేష ఆదరణ లభించింది.

మెనూ గ్యాలరీలో వున్న నాలుగు విభాగాలకు, లైబ్రరీకి కూడా ఎప్పటికప్పుడు కొత్తవి చేర్చడం జరుగుతుంది. గమనించగలరు.

పత్రికలో వ్యాసాలు బాగున్నాయని అభిమానంతో ఇ-మెయిల్స్ ద్వారా అభిప్రాయాలు తెలియజేస్తున్న పాఠక, కళాభిమానులకు కృతజ్ఞతాభివందనాలతో...

కళాసాగర్
ఎడిటర్

ముఖచిత్రం చిత్రకారుడు : **మాకినీడి**



ఏప్రియల్ సంచికలో...

రాజారవివర్మ గురించి ఆర్టిస్టు బాలి చెప్పిన కబుర్లు...

ది హిందూ కార్టూనిస్టు సురేంద్ర అంతరంగాలు..

-వెంటపల్లి సత్యనారాయణ వ్యాసంలో..

# “ముని, మౌని గీచిన మోనాలిసా చిత్రం”

ఎల్.ఆర్. వెంకటరమణ

పునరుజ్జీవన కాలపు విశిష్ట వ్యక్తులలో సుప్రసిద్ధుడు లియోనార్డోడావిన్సీ. అనేక శాస్త్రాలలో తనదైన ముద్రవేసిన శాస్త్రవేత్త, చిత్రకారుడు, తత్త్వవేత్త. “నేర్పరి అయిన చిత్రకారుడు రెండు విషయాలు చిత్రించవలసి ఉంటుంది ఒకటి-బాహ్యరూపం అయితే; రెండవది- అంతర్గత భావన”- ఇది డావిన్సీ సిద్ధాంతం. ఇతని చిత్రాలలో బాహ్యరూపాలే కాకుండా, వాటి యొక్క అంతర్గత మానసిక వైఖరి కూడా కనిపిస్తుంది. భౌతిక వస్తువులు కూడా ప్రకృతిలో మమేకమై కనిపిస్తాయి.

లియోనార్డో ఎప్పుడు తన చుట్టూ కల సజీవ ప్రకృతికి ప్రాధాన్యత ఇచ్చి, వాటి లోతులు తెలుసుకుని, విస్తృత అధ్యయనంతో చిత్రాలు సృష్టించాడు. ఎంత ఎదిగినా తానింకా నేర్వవలసినది చాలా ఉంటుందంటూ నిత్యనూతన విద్యార్ధి వలే కృషి చేశాడు. యదార్ధ చిత్రాల చిత్రణలో కళాకారునిగా స్వేచ్ఛను నిలుపుకుంటూనే, శాస్త్రీయ సత్యాలను అందించాడు. చిత్రంలోని వ్యక్తుల సంచలన శక్తిని ప్రతిఫలించేట్లుగా చిత్రరచన చేశాడు.

డావిన్సీ చిత్రకళ మాత్రమే కాకుండా మరెన్నో శాస్త్రాలను ఔపోసన పట్టినవాడు. అన్నిరంగాలలో కూడా సమాన ప్రతిభ చూపినవాడు, చిత్రకారునిగా ప్రపంచానికి తెలిసినవాడు. డావిన్సీ జీవితం, చిత్రకళ, అతను రాసిన డైరీలు (నోట్‌బుక్స్) అతని జీవితాన్ని విశ్లేషించడానికి ఉపకరిస్తాయి.



సాధారణంగా జీవించి ఉన్నవారిని మాత్రమే మనం విశ్లేషించగలం. కానీ ఎపుడో చనిపోయిన వారిని, మనకు దగ్గరగా లేనివారిని విశ్లేషించడం కష్టంతో కూడిన పని. దీనికై ప్రధానంగా ఉపకరించేవి “వారి ఆవిష్కరణలే”.



వారి ఆవిష్కరణలలో వెలుగు చూసే-వారి భావనలు, వారి సంవేదనలు, వారి ఆనందాలు, వారి అనుభూతులు, సృజన కార్యాలు మొత్తంగా కలగలసి వారి యొక్క జీవితాన్ని విశ్లేషించ కష్టసాధ్యం.

సిగ్మండ్‌ఫ్రాయిడ్ మనో విశ్లేషణా విధానాన్ని కనుగొన్న తరువాత, తనకు సంబంధించి, తనవారికి సంబంధించి, మిత్రులు, రోగుల స్థితిగతులను పరిశీలించినారు తరువాత ఎప్పుడో జీవించి ఉండి. ప్రస్తుతం వారు శారీరకంగా లేకుండా, వారియొక్క ఆవిష్కరణల వలన వారిని అంచనా వేయడానికి ప్రయత్నించాడు. ఇలా "డావిన్సీ" విషయమై పరిశోధించి విలువైన విషయాలను వెల్లడించాడు.

డావిన్సీ డైరీలోని ఒక అంశం గురించి ఫ్రాయిడ్ చెబుతూ "నేను ఉయ్యాలలో ఉన్నపుడు, అంటే నా శైశవాలో ఒక గద్ద నాపై వాలి నన్ను ముద్దాడింది" అనే విషయం వ్రాసుకున్నాడు. ఇదొక స్వైరకల్పన ఇదొక విచిత్రంగా కనిపిస్తుంది. పాలు త్రాగేనాటి విషయాలు సాధారణంగా గుర్తుండవు. ఇది స్మృతి అనుకోవడం కన్నా స్వైర కల్పన అనుకోవడమే సరియైనది.

డావిన్సీ స్వైర కల్పన గురించి వివరాలకు ముందు అతని బాల్యం గురించి కొంత తెలుసుకుందాం. డావిన్సీ 1452లో విన్సీ అనే చిన్న పల్లెలో సర్‌పియరోకు జన్మించాడు. ఇతడొక న్యాయవాది. కెటరినా అనే ఆమెతో ఏర్పడిన అక్రమ సంబంధం ఫలితంగా డావిన్సీ జన్మించాడు. తరువాత ఆమె మరొకరిని వివాహం చేసుకుంది. పియరో మరో ఆమెను వివాహం చేసుకున్నాడు. ఇలాంటి గందరగోళ పరిస్థితులలో డావిన్సీ పెరిగి పెద్దవాడయ్యాడు.

డావిన్సీ స్వైర కల్పన గరించిన విషయానికి వద్దాం- "తల్లి ఒడిలో పాలు త్రాగే పిల్లవాడు" నాటినుండి నేటి వరకు చిత్రకారులు, శిల్పులు, కవులు, కళాకారులందరు తీసుకున్న ప్రధాన వస్తువు. గౌరవ భావంతో ఈ విషయాన్ని ప్రతి కళాకారుడు అందుకున్నవారు. మాతృమూర్తికి ప్రతీకగా నిలచిన ఈ అంశం పవిత్ర దృశ్యం అయింది.

మరి డావిన్సీ కల్పనలో తల్లి స్థానంలో గ్రద్దవచ్చి చేరింది. ఇది తల్లి మమకారం చూడలేక (లేక) పొందలేక ఇలా కల్పనలు చేశాడు. మరో రకపు కారణం- ఈజిప్షియన్ల దేవత "గ్రద్ద" ఈమె "మట్". మాతృమూర్తికి ప్రతీక. సాంస్కృతిక పునరుజ్జీవన కాలంలో ఈజిప్షియన్ల సంస్కృతి ప్రత్యేకంగా అధ్యయనం చేయబడింది. ఈ కాలంనాటి చిత్రకారుడు డావిన్సీ. అందువలన ఇతని మీద కూడా ఈ ప్రభావం పడింది. మత గ్రంథాలు, ప్రకృతి అధ్యయనాలు, వాటి అంచనాలతో నాటి సంస్కృతిని అధ్యయనం చేయబడినది. నాటి తాత్త్విక అంచనాల ప్రకారంగా- "గ్రద్ధలలో మగజాతివి ఉండవని, వాటి అవసరం లేకనే పిల్లలు కలుగుతారనే ఒక కల్పన డావిన్సీ మనసులో తీవ్రప్రభావం చూపింది. తను అలా పుట్టిన నా దినననే అంచనా చేసుకున్నాడు.

ఇది కల్పన అయినా కూడా తల్లిస్థానం గ్రద్ధ ఆక్రమించడం,





తండ్రిలేకపోవడం, తల్లి వద్దనే ఒంటరివాడిగా ఉండడం. మొదటి ఐదు సంవత్సరాలు వరకు తండ్రి ఎవరో తెలియక పోవడం వంటివి జరిగాయి. వ్యక్తి జీవితంలో మొదటి ఐదు సంవత్సరాలు జీవితకాలం నాటి అనుభవాలు జీవితంలో స్థిరపడి ఉంటాయి. అర్ధరహిత బాల్య స్మృతులు, వాటిపై ఆధారపడిన కల్పనలు డావిన్సీ జీవితాంతం వెంటాడాయి.

ఈ కల్పనల ఆధారంగా పరిశీలిస్తే– డావిన్సీ మొదటి ఐదు సంవత్సరాలు ఏకాంతంగా గడపడం, అతని ఆంతరంగిక జీవిత రూపకల్పనకు కూడా ప్రభావితం చేసింది. అతనిలో అన్వేషణ ప్రారంభమైనది. ఆ విధంగా వ్యక్తులు, పరిసరాలు, పక్షులు, జంతువులు, ఇలా ఒకటేమిటి సర్వ విషయాలను పరిశీలనగా చూస్తూ అన్వేషణ చేస్తూ, అధ్యయనం చేశాడు. ప్రతిదాన్నీ క్షుణ్ణంగా పరిశీలించడం మొదలుపెట్టాడు.

డావిన్సీ మేధావి మాత్రమే కాక, నైతికంగా, సామాజికంగా కూడా ఎంతో ఉన్నతుడు. ఎన్నో శాస్త్ర విషయాలు అతని మనస్సు, మస్తిష్కాన్ని క్రిక్కిరిసి ఉంచేవి. అతని భౌతిక జీవితం కన్నా, ఆధ్యాత్మిక జీవితం ప్రాధాన్యత వహిస్తుంది. అతని నైతిక జీవితాన్ని అతని శత్రువులు కూడా వేలెత్తి చూపలేకపోయారు. అంతనిష్ఠతో జీవించాడు. అందుకే విమర్శకులు అతన్ని "ఋషి" అన్నారు.

సార్ధక జీవితానికి, నిజ జీవితంలోని అరిషడ్వార్గాలను అదుపులో ఉంచుకోవాలని ఉద్బోధించిన జ్ఞాని– లియోనార్డో డావిన్సీ.

## సకల భాషల నిఘంటువులు... చిత్రకారుడు గీసిన చిత్రాలు.

బి.ఎం.పి. సింగ్

# చిత్రకళాసూరీడు- సాహితీ భాస్కరుడు- మాకినీడి

అది 1992-94 మధ్య కాలం. కళాశాల విద్య పూర్తయి ఉద్యోగార్థం పోటీపరీక్షల కుస్తీలో భాగంగా గ్రంథాలయాలలో ఎక్కువగా గడుపుతున్న రోజుల్లో మా ఊరు ప్రక్కనే ఉన్న వెల్ల పంచాయితీ గ్రంథాలయానికి వచ్చే "మిసిమి" మాసపత్రిక నన్ను అమితంగా ఆకర్షించేది. ఒక మైకలాంజిలో, రెబ్రాంట్,పాల్‌రూబెన్స్, డావిన్సీ, పికాసో లాంటి ప్రఖ్యాత పాశ్చాత్య చిత్రకారుల కుంచెనుంచి జాలువారిన ఉత్తమ కళాఖండాలో లేక ఒక మొఘల్ మీనియేచర్ లేదా ఒక తంజావూరు చిత్రరాజమో ఏదైనా ప్రఖ్యాత కళాఖండం ఆ పత్రికకు మంచి ముద్రణతో ముఖచిత్రం మరియు వెనుక అట్టలుగా రావడం నా ఆకర్షణకు ఒక కారణమైతే ఒకసంజీవదేవ్, చలసాని ప్రసాద్, వి.ఆర్. నార్ల, ఎన్. ఇన్నయ్య, టి. రవిచంద్ లాంటి ప్రఖ్యాత రచయితల కలం నుండి వచ్చే ఉత్తమ వ్యాసాలు దానిలో ఉండడం నా రెండో కారణం.



వెంటపల్లి సత్యనారాయణ

అలాంటి ఉద్దండ చిత్రకారులు, రచయితల మధ్య అటు చిత్రకళ ఇటు రచనా వ్యాసంగం రెండింటిలోనూ ప్రతిభావంతంగా తన ఉనికిని చాటుకుని నేను అమితంగా ఇష్టపడే డా॥ సంజీవదేవ్ గారి రచనలతోపాటు సమానంగా నన్ను ఆకట్టుకున్న ఒక యువ రచయిత కూడా ఉండేవారు. ఆయనే నేటి ప్రముఖ కవి, రచయిత, చిత్రకారుడు, సాహిత్య చిత్రకళా విమర్శకుడు అయిన మాకినీడి సూర్యభాస్కర్

సౌగంధికా పరిమళాలు వెదజల్లడం పుష్ప స్వభావమైనప్పుడు ఆ పరిమళం తాలూకు స్వభావాన్ని మనం ఆస్వాదించడానికి ఆ పుష్పానికి పరిణితితో పనిలేదు. చిరు ప్రాయంలోనూ ఆ పరిమళ వీచికలు వీస్తూనే ఉంటాయి.

"చిత్రమెన్ని సార్లు చింత్రించి చూచినా
విసుగు యుండదన్న వింత యేమూ
ఏదో నూతనత్వమెప్పుడు కనిపించి
పరవశుడను జేయు పట్టి నను"



15 ఏళ్ళ వయసులో మాకినీడి కలంనుండి వెలువడిన పై పద్యం మనం చూసినట్లయితే చిత్ర లేఖనం మరియు సాహిత్యంపై అతనికి గల మక్కువను ఇట్టే పసిగట్టగలం. సుమ కవితాంజలి, పద్యకవిత ఖండకావ్యంపేరుతో పై పద్యాలన్నీ 1997లో పుస్తక రూపంలోకి తీసుకురావడం జరిగింది.

కవులందరూ చిత్రకారులు కాలేరు. అలాగే చిత్రకారు లందరూ కవులూ కాలేరు. ఒక వేళ కవి చిత్రకారుడైనప్పటికీ చిత్రకళకు సంబంధించి వేరొక పార్శ్వమైన కళావిమర్శ అందరూ

చేయలేరు. అలాగే చిత్రకారుడు కవి అయినప్పటికి, సాహిత్యానికి సంబంధించిన విభిన్న ప్రక్రియలలో కళాన్ని ఝళిపించలేరు.

మాకినీడి కవి, చిత్రకారుడే కాదు. కవిత్వం మరియు చిత్రకళకు సంబంధించి విభిన్న ప్రక్రియలలో కూడా లోతైన అవగాహన ఉన్నటువంటి వ్యక్తి. అందుకే అతడు 1998లో ప్రచురించిన "కళా సాహితీ తోరణం" అన్న గ్రంథంలో అతడు వెలువరించిన కళా సాహిత్య వ్యాసాలు గానీ 2009లో ప్రచురించిన "రామారావు నుండి రామారావు దాకా" గ్రంథంలోని వ్యాసాలు గానీ మనం చదివినట్లయితే పాఠకుని ఎంతో లోతైన అవగాహనను కలుగజేస్తాయి.

చిత్రకారుడిగా మాకినీడు ఇంత వరకూ 50 జలవర్ణ మరియు టెంపరా చిత్రాలు. 25 మినీయేచర్ చిత్రాలు వేసారు. తన పుస్తకాలకు సంభందించి ముఖ చిత్రాలుగానీ, లోపలి బొమ్మలు గానీ తనే స్వయంగా వేసుకోవడం ఆయన కలవాటు అలాగే ఇతర రచయితల పుస్తకాలకు కూడా ఆయన బొమ్మలు వేసారు.

1993, 94, 95 సంవత్సరాలలో కోనసీమ చిత్రకళాపరిషత్ వారి కె.సి.పి. అవార్డ్సుతో పాటు 1997లో దక్షిణ మధ్య విభాగానికి చెందిన సాంస్కృతిక సంస్థ నాగపూరు నుండి కూడా అవార్డులు తీసుకున్నారు. 1998 మరియు 1999లలో వరుసగా మూడుసార్లు వ్యక్తిగత చిత్రకళా ప్రదర్శనలు నిర్వహించారు. ప్రముఖ చిత్రకారులైన దామెర్ల రామారావు పి.ఆర్.రాజు, సంజీవదేవ్, యస్.వి. రామారావు, వెంకటరావు, చలసాని ప్రసాదరావు, మాచిరాజు మొదలైన వారిపై మోనోగ్రాఫ్స్ రచించారు.

శ్రీమతి సరస్వతమ్మ, రంగనాయకులు దంపతులకు 17-8-1962 సం॥లో తూర్పుగోదావరి జిల్లా ద్రాక్షారామంకు సమీపంలో గల యర్రపోతవరం అనే గ్రామంలో జన్మించి ఉద్యోగరీత్యా ఉపాధ్యాయుడిగా పనిచేస్తూ కాకినాడలో స్థిరపడిన మాకినీడికి కళా వారసత్వం తన తల్లిదండ్రులు, పెదనాన్నల నుండే వచ్చింది. వారి తల్లిదండ్రులు మంచి సాహిత్యాభిలాషులైతే వారి పెదనాన్న మాకినీడి ఆంజనేయులు గారు చిత్రకళలో ఎన్నో ప్రయోగాలు చేసి అనేక చిత్రాలు రచించడం జరిగింది. చిత్రకళలో మాకినీడిపై వాళ్ల పెదనాన్న ప్రభావం పడినట్లుగా కనిపిస్తుంది. ఎందుచేతనంటే మాకినీడి చిత్రించిన క్యూబిజంలో గాంధీ, ముక్కంటి, లిటరీ పోట్రయిట్ ఆఫ్ శ్రీశ్రీ, కోరికలే గుర్రాలైతే, నాగస్వరం, రంగుల హొయల Tali-ban-isom తదితర చిత్రాలన్నీ చూసినపుడు ప్రతీదీ ఒక ప్రయోగాత్మకంగానే మనకు కనిపిస్తుంది.

పాల్‌సజాన్ చేతిలో ఊపిరిపోసుకున్న క్యూబిజాన్ని పాబ్లా పికాసో తన విస్తృతమైన చిత్రాల ద్వారా బాగా ప్రాచుర్యంలోనికి తీసుకువచ్చాడు. చిత్రాంశాన్ని క్యూబులుగా విభజించడం వలన రూపం విరూపంగా మారేందుకు అవకాశం ఉన్న ఈ తరహా చిత్రణలో స్థూలంగా విషయ ప్రాధాన్యతాంశాలను చిత్రించి మెప్పించగలమేమో గానీ రూపప్రధానమైన అందునా, ప్రపంచ ప్రసిద్ధి గాంచిన గాంధీజీ రూపాన్ని ఈ ప్రయోగానికి వాడుకోవడం చాలా సాహసంతో కూడుకొన్నపని. కానీ మాకినీడు ఈ ప్రయోగంలో నూటికి నూరుపాళ్లు సఫలీకృతమైనట్లుగా అతడు క్యూబిజంలో చిత్రించిన గాంధీజీ చిత్రాన్ని చూస్తే మనకు తెలుస్తుంది. అలాగే సింబాలిక్ ఎక్స్‌ప్రెషన్‌లో చిత్రించిన ముక్కంటి చిత్రం కూడా.

లయ కారకుడైన శివున్ని తన సహజమైన శాంత స్వభావానికి ప్రతీకలుగా రెండు అర్ధనిమాలిత నేత్రాలను చూపిస్తూనే అదే సమయంలో ప్రళయ కాలంలో శివుని ఉగ్రరూపం బోనబోంతరాలు ఎలా వ్యాపిస్తుందో అని చెప్పడానికి మూడవకన్ను పెద్దగా కాన్వాసంతా వ్యాపించేలా చిత్రించడం ద్వారా ఆత్మానుగతమైన శివస్వరూపాన్ని చక్కగా చూపించగలిగారు.



అరచేతిని అడ్డుగా పెట్టినప్పటికీ ఆ సూర్యకిరణాలు దానిని దాటి బడుగు జనుల చైతన్యానికి దోహదపడుతున్నట్లు ఆయన చిత్రించడం జరిగింది.

ఇక మాకినీడి చిత్రాలపై కళాసమీక్ష చేసి "దృష్టి–సృష్టి" అనే పుస్తక రూపంలోకి తీసుకువచ్చిన ప్రముఖచిత్రకారుడు ఆంధ్రవిశ్వవిద్యాలయంలో ఎక్స్‌టర్నల్ ఎగ్జామినర్‌గా వ్యవహరించిన స్వర్గీయ రావు వెంటరావు గారి మాటల్లో మాకీనీడి" "రంగుల హొయలు" చిత్రం గురించి.



వ్యాస రచయిత తో
చిత్రకారుడు మాకినీడి

పరస్పర విరుద్ధాలయిన ఉష్ణ, శీతల వర్ణాలను 'రంగులహొయలు" అన్న చిత్రంలో మేళవించడమైనది. సీతాకోక చిలుక తన రెండు జతల రెక్కల్లో పైజతకు రెండు ఉష్ణ వర్ణాలయిన ఎరుపు, పసుపులను వాడితే క్రింది జతకు ఒక ఉష్ణవర్ణమైన పసుపును శీతల వర్ణమైన నీలం రంగును వాడడం జరిగింది. పరస్పర విరుద్ధమైన ఈ రెండు వర్ణాల మధ్య ఉండే సహజ అనైక్యత వలన అవి సజాతీయంగా సమ్మేళనం కావు. కానీ మాకినీడి ఈ విషయంలో కృతకృత్యుడయ్యాడు.

అలాగే అరచేతిని అడ్డుపెట్టి అరుణోదయాన్ని ఆపలేరు అన్న అంశం ప్రధానంగా చేసుకొని శ్రీశ్రీ చిత్రాన్ని వేయడం చాలా అబ్బురంగా కనిపిస్తుంది. ఇందులో శ్రీశ్రీ బాహ్యరూపంతోపాటు అంత:రూపాన్ని కూడా చూపించడానికి చిత్రకారుడు ప్రయత్నించాడు. అందుకు ఆలంబనగా రంగులనూ, గుర్తులను వాడుకున్నాడు.

విప్లవాన్ని, అభ్యుదయాన్ని సూచించే ఎరుపు, పసుపు రంగులలోనే చిత్రరచనను చేయడం ద్వారా శ్రీశ్రీ కవితాత్మను వ్యక్తం చేయగా, మేధకు ప్రతిగా భావించే కళ్ళజోడు కాడ పెన్ను పాళీగా అంతమవ్వడంతో కవిగా శ్రీశ్రీ మన స్మృతి పథంలో మెదిలేలా చేశారు. శ్రీశ్రీ కన్నును విప్లవ సూర్యుడిలా చిత్రించడం ఆ సూర్య కిరణాలకు అడ్డంగా బూర్జువా వ్యవస్థకు చిహ్నంగా

***చిత్రకారుడిగా మాకినీడి ఇంత వరకూ 50 జలవర్ణ మరియు టెంపరా చిత్రాలు, 25 మినీయేచర్ చిత్రాలు వేసారు. తన పుస్తకాలకు సంబంధించి ముఖ చిత్రాలుగానీ, లోపలి బొమ్మలు గానీ తనే స్వయంగా వేసుకోవడం ఆయన కలవాటు. అలాగే ఇతర రచయితల పుస్తకాలకు కూడా ముఖ చిత్రాలు, లోపలి బొమ్మలు ఆయన వేసారు.***




మాకినీడి రచనలు

అలాగే అతడు చిత్రించిన జిడ్డు కృష్ణమూర్తి చిత్రం కూడా చాలా సజీవంగా ఉంటుంది.

ఇక మాకినీడి రెండవ పార్శ్వమైన సాహిత్యానికి వచ్చినట్లయితే అది పద్యం కవిత, చిరుకథ, బాలపాండిత్యం, విద్యాపర రచనలు, కళావిమర్శ ఇలా ఆరురకాలుగా అతని సాహితీ ప్రస్థానం అప్రతిహతంగా కొనసాగుతుంది.

చిత్రకళలో లేని సౌలభ్యం సాహిత్యంలో ఉండడం వలన కాబోలు అతనిలోని సాహిత్యకారుడు చిత్రకారున్ని అధిగమించేలా చేస్తున్నాడు. అందుచేతనే ఇటీవల చిత్రరచన తగ్గి సాహితీ రచన మాత్రం మరింత ముందుకు సాగుతుంది. పద్యసాహిత్యంలో ఇంత వరకు 15 పుస్తకాలు రచిస్తే బాలసాహిత్యంలో 13, సాహిత్య విమర్శపై 16, చిత్రకళా విమర్శపై 9, విద్యాపరమైన రచనలు 10 చిన్నకథలు ఒకటి కలిపి మొత్తం (64) పుస్తకాలు ఇంతవరకూ మాకినీడు రచించారు. ఇందులో (32) పుస్తకాలు ఇదివరకే ప్రచురణ కాగా (25) పుస్తకాలు ప్రస్తుతం ప్రచురణలో వుండగా ఏడు పుస్తకాలు మాత్రం ఇంకా ముద్రణ కావాల్సి వున్నవి.

ప్రముఖ కవివరేణ్యులు జ్ఞానపీఠ అవార్డు గ్రహీత డాక్టర్ సి.నారాయణరెడ్డిగారు మాకినీడి పద్యసాహిత్యం గురించి రాస్తూ ఠాగూర్ గీతాంజలి, తొలినాటి భావకవులైన వెంకటపార్వతీశ కవుల ఏకాంత సేవలోనూ ఉన్న సమర్పణ భావన అతని కవితలో కనిపిస్తుంది అని రాస్తే, వేరొక ప్రముఖ కవివర్యుడైన డాక్టర్ నాగభైరవ కోటేశ్వరరావు గారు మాకినీడి పద్య ప్రసూనాలకి చిత్రకారుడు కాబట్టి రంగును అద్దాడు. రుషీత్వం ఆవహించి రుచిని అద్దాడు. వాక్సతీ కటాక్ష వీక్షణాలతో తడిసి వాసననూ రుద్దాడు. అందుకే అతని పద్యాలకు రంగువుంది, రుచివుంది మంచివాసనా కూడా వుంది. నీవు ఒక్క సూర్యుడివి కావు సూర్యద్వయానివి అని ప్రశంసించారు.

అప్రతిహతంగా సాగుతున్న అతని రచనా వ్యాసంగంలో పద్య సాహిత్యానికి గానూ 2010లో ఆంధ్రసారస్వత సమితి మచిలీపట్నం నుండి ఉగాది సాహిత్యపురస్కారం, చిత్రకళలో వైజయంతి అవార్డుని, 2009లో వై.ఎస్. మెమోరియల్ అవార్డుని, 2006లో స్వర్గీయ డాక్టర్ వై.యస్ రాజశేఖరరెడ్డిగారి చేతులమీదుగా తానా సాహితీ పురస్కారం, డా॥ అక్కినేని చేతులమీదుగా టి.ఏ.యం.ఏ సాహితీ పురస్కారం (తెలుగు అసోషియేషన్ ఆఫ్ మెట్రో అట్లాంటా) పురస్కారాన్ని, 2004లో నూరి ఉదయ భాస్కర్ మెమోరియల్ అవార్డు మరియు ఆర్ట్‌మిత్ర తదితరమైన ఎన్నో పురస్కారాలను అందుకున్నారు.



ఇక మాకినీడి చిత్రకళపై స్వర్గీయరావు వెంటరావు "దృష్టి-సృష్టి" పేరుతో పుస్తకం వెలువరిస్తే ద్రావిడ విశ్వ విద్యాలయ మాజీ వైస్ చాన్సలర్ శ్రీ పి.వి. అరుణాచలంగారు మాకినీడి సాహిత్యంపై "మాకినీడి కృతులు తెలుగు సాహిత్యానికి బహుకృతులు" అన్న పేరుతో వేరొక పుస్తకాన్ని రచించారు.

1992లో "మిసిమి" ద్వారా పరోక్ష పరిచయమైన మాకినీడిని ప్రత్యక్షంగా కలుసుకునే అవకాశం దాదాపు 17ఏళ్ల తర్వాత నాకు కలిగింది. కళాసాగర్ "ఆస్కా" తో కలిసి ప్రముఖ సాహితీ సాంస్కృతిక సంస్థ "ఎక్స్‌రే " సంయుక్తంగా నిర్వహించిన రాష్ట్రస్థాయి కార్టూన్ పోటీలలో నేను గెలుపొందిన ప్రథమ బహుమతితో పాటు నాకు బహుకరించిన చిత్రకళకు సంభందించిన కొన్ని విలువైన పుస్తకాలలో మాకినీడి విరచితమైన "రామారావు నుండి రామారావు వరకూ" ఉండడంతో ఆ పుస్తకంపై గల అతని దూరవాణి ఇన్నేళ్లకాలం అపరిచితులుగా ఉన్న మేము సుపరిచితులుగా మారడానికి కారణమయ్యింది. ఫోన్‌చేసిన వెంటనే సాదరంగా ఆహ్వానించడం, మా పెద్దన్న గారబ్బాయి మురళి నేను కలిసి కాకినాడలో మాకినీడి గారింటికి వెల్లడం చిత్రసాహిత్య కళారంగంలో నిర్విరామంగా అతను చేస్తున్న కృషి వెనుక గల రహస్యాన్ని తెలుసుకోవడం జరిగింది.

ఎట్టి పరిస్థితులలోనూ రాత్రి 9గంటలకే నిద్రపోవడం, నిశి రాత్రి 2 గంటలకే నిద్రలేవడం ఎలాంటి అలికిడి లేని ప్రశాంత వాతావరణంలో తన కళా వ్యాసంగానికి ఉపక్రమించడం ప్రతిరోజూ అతడు చేపట్టే దినచర్య. అందువలననే మాకినీడి విరివిగా రచనలు చేయగలుగుతున్నాడు. ఇంతవరకు తెలుగులోనే సాగుతున్న అతని సాహితీ ప్రస్థానం ఆంగ్లభాషకు కూడా వ్యాపించింది. ఆసియన్ అమెరికన్ పొయిట్రి, ఎన్ చాటింగ్ వెర్సెన్, వెల్వేట్ ఇల్యూజన్, ఆల్‌పొయిట్రి లాంటి అంతర్జాల పత్రికలు మరియు అంతర్జాతీయ జర్నల్స్‌లోనూ మాకినీడి ఆంగ్లకవితలు విరివిగా ప్రచురింపబడుతున్నాయి. డిశంబర్21, 2010న గుంటూరులో జరిగిన ఇంటర్‌నేషనల్ పొయిట్రి పెస్టివల్‌లో తన ఆంగ్ల పద్యాలను వినిపించిన మాకినీడి వరల్డ్ పొయిట్ సొసైటీలో సభ్యుడు కూడా.



అప్రతిహతంగా సాగుతున్న అతని కళా యాత్ర వెనుక అతని భార్య శ్రీమతి సుభద్రా మాకినీడి గారి ప్రోత్సాహం మెండుగా వుంది. వారి ఏకైక కుమార్తె సౌమ్య కూడా మాకినీడి బాటలోనే అడుగులు వేయడం ఆనందించదగిన విషయం.

ఇక చివరిగా తెలుగు విశ్వ విద్యాలయంలో మాతృభాషా విభాగానికి చెందిన శ్రీమతి లీలావతి గారి పర్యవేక్షణలో మాకినీడి సాహిత్యంపై పరిశోధన చేస్తున్న శేఖర్ అనే తెలుగు విశ్వవిద్యాలయానికి చెందిన రీసెర్చ్ స్కాలర్ తన రీసెర్చ్ గ్రంథంలో పేర్కొన్నట్లు అతడు ఇరు సూర్యుల (సూర్య, భాస్కర్) ప్రతాపంతో వెలుగొందుతున్నాడు. తేజోవంతమైన ఆ వెలుగులలో చిత్ర, సాహిత్య కళలు మరింత దేదీప్యమానంగా వెలుగొందాలనీ వెలుగొందుతాయని ఆశిద్దాం.



# నా గురించి నేను...

## కుమారి రాగతి పండరి

**స్వగతం-5**

***తొలి తెలుగు మహిళా కార్టూనిస్టుగా గత నాలుగు దశాబ్ధాలుగా పాఠకులను అలరిస్తున్న కుమారి రాగతి పండరి తన జీవన గమనాన్ని - కార్టూనిస్టుగా స్వయంకృషితో ఎదిగిన వైనాన్ని "నా గురించు...నేను" పేరుతో అక్షరీకరణ చేసారు. 64కళలు.కామ్ లో ధారావాహిక రూపంలో నెల-నెలా ...***



కుమారి రాగతి పండరి

అంతకుముందు ఆంధ్రప్రభ వీక్లీలో కూడా నా ఇంటర్వ్యూ వేశారు. ఆ ఇంటర్వ్యూ ప్రముఖ రచయిత శ్రీ అవసరాల రామకృష్ణారావుగారు మా ఇంటికి వచ్చి ప్రత్యేకంగా నా ఇంటర్వ్యూ తీసుకొని మరీ రాశారు. ఆ తర్వాత ఆకాశవాణి విశాఖపట్నం వారు వచ్చి నా ఇంటర్వ్యూ రికార్డు చేసి తీసుకెళ్లారు. అది రేడియోలో ప్రసారం అయింది. నేను క్షణం ఖాళీలేకుండా ఉండేదాన్ని. వివిధ పత్రికల్లో ఫుల్‌పేజి, స్ట్రిప్ కార్టూన్లు గీస్తూ ఉండేదాన్ని. బోరుకొట్టినప్పుడు టీవీ చూడడం, పేపర్లు, పుస్తకాలు, వంటపని వగైరా వగైరా. మేనకోడళ్లతో సరదాగా ఆటపాటలు. మా అన్నయ్య ఆఖరి పాప ప్రశాంతి ఎక్కువగా నాతోనే ఉండేది. నా కార్టూన్లు వేస్తుంటే ఆసక్తిగా చూసేది. తనకు. చిన్నప్పటి నుండీ బొమ్మలంటే చాలా ఇష్టం. ఒకరోజు శ్రీ కూరెళ్ల సోమేశ్వరరావుగారు స్వయంగా మా ఇంటికి వచ్చి కూరెళ్ల ట్రస్టు అవార్డును నాకు ఇవ్వదలచినట్టు చెప్పారు. ఆ అవార్డును అందుకోబోతున్నందుకు నేను ఎంతగానో ఆనందించాను. ఆ తర్వాత పురస్కారాన్ని అందుకొన్నాను. ఒక సారి విశాఖ వేలీ జూనియర్ ఛాంబర్‌వారు వచ్చి విశిష్ట యువ ప్రతిభాశాలిగా సన్మానాలు, సత్కారాలు చేయదలిచామని చెప్పారు. విశాఖ వేలీ జూనియర్ ఛాంబర్ సంస్థ వారు. ప్రతి సంవత్సరం వివిధ రంగాల్లో కృషి చేసిన వారిని వెలికి తెచ్చి సన్మాన, సత్కారాలు అందజేయడమే కాక వారి బయోడేటాను చక్కటి ఆల్బంగా తయారుచేసి హైదరాబాద్ పంపుతారు. అయితే నేను ఆ సన్మానాన్ని సున్నితంగా వారించబోయాను. నాకు సన్మానం లాంటివి అస్సలు ఇష్టం ఉండవని, అటువంటి వాటికి



నేను బయటకు రాలేనని చెప్పాను.

కానీ అప్పటి ఛాంబర్ అధ్యక్షుడు వి.ఎల్.ఎస్.గుప్తగారి రిక్వెస్ట్‌పై నేను ఆ సన్మానానికి ఒప్పుకొని వెళ్లాను. అక్కడ ఛాంబర్ సభ్యులంతా ఎంతో అభిమానంతో నన్ను రిసీవ్ చేసుకొన్నారు. మా ఇంటి దగ్గర నుంచీ వారే తమ కార్లో వచ్చి తీసుకెళ్లారు. అక్కడ ఇంకా వివిధ రంగాల్లో ఔట్ స్టాండింగ్ యంగ్ పర్సన్స్‌ను డెక్కన్ క్రానికల్ జనరల్ మేనేజర్ శ్రీ ఎ.వెంకటేశ్వర్లుగారు సన్మానించారు. ఆ తర్వాత పత్రికలు, పేపర్లలో వచ్చిన నా ఇంటర్వ్యూలు కొన్ని సెలక్ట్ చేసి, కొన్ని కార్టూన్లతో చక్కటి ఆల్బం తయారు చేశారు. ఆ పుస్తకాన్ని జోన్ స్థాయిలో జరిగిన పోటీకి పంపించారు. వివిధ రంగాల్లో నిష్ణాతులైన యువ ప్రతిభాశాలుర మధ్య అక్కడ జరిగిన పోటీలో ఆ పుస్తకం ద్వారా ప్రథమ స్థానం పొందడంతో మరలా రాష్ట్రంలో ప్రప్రథమ, ఏకైక మహిళా కార్టూనిస్టుగా సాంబమూర్తి కళామందిరంలో సన్మానించారు. అప్పుడు వారు చేసి ఇచ్చిన ఆల్బం ఇప్పటికీ ఇంటికి ఎవరైనా వస్తే చూపించేందుకు ఎంతో బావుంటుంది. కొన్నాళ్ల క్రితం అమ్మ కంటికి కాటరాక్టు వచ్చి చూపు మందగించింది.

అన్నయ్య ప్రవేటు ఐ హాస్పిటల్‌కు అమ్మను తీసుకెళ్లి చూపించి ఆపరేషన్ చేయించాడు. అయినా అమ్మకు పుస్తకాలు చదివేటప్పుడు చిన్న క్షరాలు చదవడం కష్టమయ్యేది. పెద్దక్షరాలు ఉంటే చదివేది. నేను రోజూ ఒక గంట అమ్మకోసం పేపర్ చదవడం, ఇంకా పత్రికల్లో ఏమైనా మంచి కథలు, సీరియల్స్ ఉ ంటే చదివి వినిపించడం చేసేదాన్ని. నేను పత్రికల్లో కథలు, సీరియల్స్ చదవను ఎప్పుడో తప్ప. అమ్మకోసం మాత్రమే చదివేదాన్ని. ఇది నా దిన చర్యలో భాగంగా చేసుకొన్నాను. అమ్మంటే నాకు అమితమైన ఇష్టం. ఆమెకు ఎప్పుడైనా వంట్లో బాగుండకపోతే నా మనసు తల్లడిల్లిపోతుంది. లక్షాధికారుల ఇంట పుట్టి లక్షాధికారుల ఇంట మెట్టినా అమ్మకు కష్టాలు తప్పలేదు. పెద్దగా చదువు లేకపోయినా, గొప్ప తెలివితేటలు లేకపోయినా, పెద్దవారి తోడు లేకపోయినా, మా అందరినీ ఎంతో చక్కగా పెంచి తీర్చిదిద్దింది.

అలాగే నాకు మా అన్నయ్య అంటే చాలా అభిమానం, చిన్నప్పటి నుండే పెద్దవాడిగా బాధ్యతల మీద బాధ్యతలు పైబడినా శ్రద్ధగా ఇంజనీరింగ్ చదివి మంచి ఉద్యోగంలో గొప్ప స్థాయికి ఎదిగి, లోన వెన్నలాంటి మనసున్నా, పైకి కఠినంగా కనిపిస్తూ మరలా ఈ ఇంటికి పూర్వ వైభవాన్ని తెచ్చి అందరినీ ఆనంద పరచాలని పట్టుదలతో ప్రయత్నించే అన్నయ్యను తలుచుకొంటే నాకెంతో గర్వంగా అనిపిస్తుంది. అన్నయ్య చేస్తున్న ఎంఇఎస్‌లో ట్రాన్స్‌ఫర్లు ఎక్కువగా ఉంటాయి. చాలా రోజుల క్రితం అన్నయ్యకు గోవా, ఆ తర్వాత బొంబాయిలో వేశారు. అన్నయ్య ఒక్కడే వెళ్లాడు. అమ్మ, వదిన అందరం చాలా బెంగపడ్డాం. అన్నయ్య ఊళ్లో లేనప్పుడు ఒకసారి అమ్మకు ఒంట్లో బాగాలేకపోతే వదిన నర్సింగ్ హోంలో చేర్పించి వారం రోజులు తను కూడా అక్కడే ఉండి అమ్మని కంటికి రెప్పలా చూసుకొంది. మా అందరికీ మరింత ఆత్మీయురాలైపోయింది వదిన. మరి కొన్నాళ్లకు అన్నయ్య ఇక్కడికి ట్రాన్స్‌ఫర్ అయినా కొద్ది రోజులకే మళ్లీ ట్రాన్స్‌ఫర్లు మాత్రం అవుతూనే ఉన్నాయి. అంచేత అన్నయ్య బాగా ఆలోచించి ఆ జాబ్ మానేసి సొంతంగా మా బిల్డింగ్ సెకండ్ ఫ్లోర్‌లో రాగతీస్ కోచింగ్ సెంటర్ అని, వెలక్స్ స్కూల్ అని ప్రారంభించారు. ఫస్ట్ స్టాండర్డ్ నుండి టెన్త్ వరకు ఇంగ్లీష్, తెలుగు మీడియంలో స్కూల్, వివిధ పరీక్షలకు కోచింగ్ తీసుకొనే రాగతీస్ కోచింగ్ సెంటర్ పెట్టడం జరిగింది. చాలా మంది టీచర్స్‌ని, వివిధ పనులకు వర్కర్లను వేసుకోవడంతో కొందరికి ఉపాధి కల్పించినట్టు కూడా అయింది. వీటన్నింటికీ డైరెక్టర్‌గా అన్నయ్య, అన్నయ్యకు సహాయంగా వదిన స్కూల్ నడుపుతూ ఇళ్లే ఒక విద్యాలయంగా తయారు చేశారు.






అభిమానికి లెటర్ రాశాను.

ఎందరో పాఠకుల మనసుల్లో చెదరని ముద్ర వేసిన ఆ ఇద్దరమ్మాయిలు కారెక్టర్స్ అంటే నాకు ఎంతో ఇష్టం ఈ విధంగా పాఠకుల దగ్గర నుండి నాకు కొన్ని తమాషా లెటర్స్ వచ్చేవి. ఇంకొందరు నా వ్యక్తిగత వివరాలు తెలపమంటూ పదేపదే రాసేవారు. కొందరు కార్టూన్లు ఎలా గీయాలో నేర్పమని రాస్తే, మరికొందరు పత్రికల్లో పడాలంటే ఏం చేయాలో తెలుపమని రాసేవారు. మొదటిసారి అందరికీ జవాబు రాసేదాన్ని. నా కార్టూన్లు బావున్నాయని రాసిన వారిలో ఒకరిద్దరు మంచి ఫ్రెండ్స్ కూడా అయ్యారు. వారిలో

నేను వివిధ పత్రికలకు కార్టూన్లు పంపుతూనే ఉన్నాను. రోజురోజుకూ పాఠకులకు నా పేరును గుర్తుంచుకొనే స్థాయికి ఎదిగాను. నాకు ఆ రోజుల్లో అభిమానుల దగ్గర నుండి చాలా ఉత్తరాలు వస్తుండేవి. ఒక అభిమాని నా రాజకీయ చెదరంగం కార్టూన్లు మీద నా పేరు కూడా వచ్చేలా ఇలా రాశాడు. రాజకీయ చెదరంగ జిత్తుల్ని జగతినంతా తెలుపుతూ నీవెంచుకున్న ప్రగతి బాటలో ఉషోదయంలో నుంచి సున్నిత పంచరంగుల ప్రపంచంలోకి అడుగిడి ఢమరుక నాధంతో నిద్రిస్తున్న యువతను హరీయప్ అంటూ నీకున్న విద్యుతో మేల్కొలుపు. ఇది చదివి నాకు ఎంతో ఆనందం కలిగింది. ఆ అభిమానికి లెటర్ రాశాను.

ఆదివారం ఆంధ్రభూమి డెయిలీలో వారం వారం వచ్చే ఇద్దరమ్మాయిలు ఫీచర్ కూడా చాలా హిట్టయింది. నాకొకసారి ఒక అభిమాని ఇలా లెటర్ రాశారు. వారం వారం మీరు వేస్తున్న ఇద్దరమ్మాయిలు చూస్తున్నాను. నాకు ఆ కార్టూన్లు ఎంతగానో నచ్చుతున్నాయి. వారి మాటలకు, చేష్టలకు పొట్టచెక్కలయ్యేలా నవ్వుకొంటున్నాను మేడం. నాది ఒక కోరిక, నిజంగా వారిద్దరమ్మాయిలు ఉన్నారా...? లేక మీ రూపకల్పనా...? ఉంటే మాత్రం వారిని ఒకసారి చూడాలని గొప్ప కోరకగా ఉంది. వాళ్లెక్కడుంటారు...? మీ ఇంట్లోనేనా...? మీ ఇంటికి రావచ్చా...? అంటూ రాశాడతను. అతని ఉత్తరం చదివి నాకు నవ్వాగలేదు. ఇద్దరమ్మాయిలు కేవలం కల్పితమేనని, నిజంగా లేరని ఆ

ముఖ్యులు.. శ్రీ విద్యారణ్య కామ్లేకర ఒకరు. అతను బెంగాలీ అయినా తెలుగు బాగా వచ్చు. అతను తెలుగులో నాకు ఉత్తరాలు చక్కగా రాసేవారు. ఏదో కాలక్షేపానికి కాకుండా లెటర్స్‌లో ఎన్నో మంచి విషయాలు రాసేవారు. వేరే భాషలో ఉన్న గొప్ప గొప్ప కవులు, రచయితల గురించి, వారి రచనల గురించి, అలాగే మంచి మంచి చిత్రకారుల గురించి రాస్తుండేవారు. నా కార్టూన్ల గురించి కూడా అతను నిర్మొహమాటంగా తన అభిప్రాయాలు రాస్తూ ఉండేవారు. ప్రస్తుతం అతను హైదరాబాదులో మిలాప్ హిందీ పత్రికకు స్పెషల్ కరస్పాండెంట్‌గా ఉన్నారు. అంతకుముందు అతను కర్నూల్‌లో ఉండేవారు. నాకు తరచూ లెటర్స్ రాస్తుండేవారు. శ్రీ విద్యారణ్య కామ్లేకర్ ఉత్తరాలు కొన్ని ఈ విధంగా ఉండేవి. రాగతి పండరిగారు... నమస్తే... నిన్న ఉదయం మీ లేక-ఆనందం-ఆలస్యమైనా నేను రాసిన లేఖను జ్ఞాపకం ఉంచుకొని ప్రత్యుత్తరం రాశారు. సంతోషం. మొదట మీ లేఖలోని ఓ విషయాన్ని ప్రస్తావించి ఇతర విషయాలు రాస్తాను. ప్రతీ కార్టూన్లలో కాకపోయినా కొన్నింటిలోనైనా ఒక ప్రయోగాత్మక సందేశం ఉండాలని రాశారు. పండరిగారూ... సందేశాలు వద్దండి... అవి ఏ కారణం వల్లనో కలిగివున్నవారి జీవితాలు జాగ్రత్తగా పరికిస్తే సందేశాలివ్వం. స్వార్థం సమసిపోయి సమత్వం ఉంటే ఇచ్చిన సందేశం ఒక టార్చ్‌లైట్‌లా పనిచేస్తుంది. అలా కాకుండా డైరెక్టుగా సందేశం ఇచ్చారనుకోండి ఏం చేస్తారనుకొంటున్నారు. మానవ మనస్తత్వాన్ని ఒకే విధంగా ఊహించకండి. మనిషి నుండి మనిషికి క్షణక్షణానికీ మారుతూనే ఉంటుంది. మార్పు సహజమే కానీ వికాసం కావాలి. అది

హృదయంలో జరిగే సంగతి.

సందేశమెవరైనా ఇస్తారు. మరి అహాన్ని, అజ్ఞానాన్ని ఎవరు పోగొడతారు...? ఆలోచించండి. సావధానంగా ఆ అజ్ఞానమే తొలగిన నాడు సమత్వం కోసం కళ్లు తెరవడా మనిషి...? కనుక మానవ మేధస్సుకు కొరడా దెబ్బలు కావాలి పండరి గారూ. రాత, గీత సమవుజ్జీగా ఉంటే కార్టూన్లే కొరడా దెబ్బలు వేయగలవు, నేరుగా, బలంగా కవిత వేస్తుందా కొరడా దెబ్బల్ని...? నవ్విస్తూనే వేస్తే కొరడా దెబ్బలు, సీరియస్‌గా వేసే కొరడా దెబ్బలు ఎలా ఉంటాయో మీరే ఊహించండి...

మీరు రాశారే ఒక ప్రయోగాత్మక సందేశమని, అవి కాదు కొరడా దెబ్బలు... ఇదీ నా అభిప్రాయం దీనిపై మీ అభిప్రాయం రాయండి తప్పక. ఎంటి ఖాన్ రాసిన ఒక కవితను మీకు పంపిస్తాను. అది చాలా మంచి కవిత అది మీకు పంపించేదాకా నా మనులో వెలితిగా ఉంటుంది. ప్రజా కవిత్వవే కవిత్వం–రానురాను కవిత్వంలో లాలిత్యం, కళలు తగ్గిపోతున్నాయి. ఇప్పుడు ప్రజా కవితల్లోనే భాష, లాలిత్యం, వీర రసం చొప్పించాల్సిన అవసరం నేటి వర్ధమాన రచయితలపై ఉంది. ఆ బాధ్యతని కొద్దిగానైనా మనం స్వీకరిద్దాం.

మరో ఉత్తరంలో–మీ కార్టూన్ల గురించి నిర్మొహమాటంగా రాయమంటారా...? నేనాశించిన మార్పు కనబడుతోంది. చాలా సూటిగా ఉన్నాయి. ఇంకా కృషి చేయండి. చాలా గొప్ప స్థానాన్ని అందుకోవడమే కాదు. చాలా మందిలో చైతన్యాన్ని కలిగించినవారౌతారు... ఇలా సాగేవి ఆ ఉత్తరాలు.

ఆంధ్రా యూనివర్సిటీ మెడికల్ కాలేజీ స్టూడెంట్స్ కొందరు నన్ను చూసి నా కార్టూన్ల గురించి మాట్లాడాలని మా ఇంటికి వచ్చేవారు. ఎగ్జిబిషన్లలో అడ్రసు తెలుసుకొని కొందరు వస్తే, మరికొందరు నా ఇంటర్వ్యూలు చదివి అడ్రస్ కనుక్కొని వచ్చేవారు. నా కార్టూన్లు చూసి తెగ నవ్వుకొంటున్నామని. ఎలా వేస్తారో చెప్పమని ప్రశ్నల వర్షం కురిపించేవారు. కొందరైతే కార్టూన్లు నేర్పించే కోర్సు ప్రారంభిస్తే తామంతా వచ్చి నేర్చుకొంటామని చెప్పేవారు. అలాంటి ఆలోచన ఏమీ లేదని, కార్టూన్లు ఎలా వేయాలో చెబుతానని, ఆ విధంగా వేసి పత్రికలకు పంపిస్తూ ఉంటే అవే పడతాయని చెప్పేదాన్ని. ఒకసారి హౌస్ సర్జన్ చేస్తున్న యశస్వీ అనే అతను మా ఇంటికి వచ్చారు. అతను నా కార్టూన్ల అభిమాని. కార్టూన్లు వేయాలన్న తపన అతనిలో బోలెడంత ఉంది. ఐడియాలు కూడా ఉన్నాయి. కానీ, కార్టూన్లు గీయడం రావడం లేదని బాధపడ్డారు. ఒకటి రెండు హాస్య కథలు కూడా అతను రాసినవి పత్రికల్లో పడ్డాయని చూపించారు. అతని ఇంట్రస్ట్ చూసి అతను రాసి తెచ్చిన ఐడియాల్లో కొన్ని కార్టూన్లు వేసి పత్రికలకు పంపించాను. ఇద్దరి పేర్లతో అవి ప్రచురించబడ్డాయి. అతని ఆనందానికి అవధులు లేవు. ఆ తర్వాత అతను ఒక మంచి మిత్రునిగా మా ఇంటికి అప్పుడప్పుడూ వస్తూండేవాడు. హౌస్ సర్జన్ పూర్తయ్యాక ఆర్థోపెడిక్‌లో పీజీ చేసి తిరుపతిలో జాబ్‌వస్తే వెళ్లిపోయారు. ఈ విధంగా నా కార్టూన్ల అభిమానులు ఎంతో మందితో పరిచయం కలగడం, కొందరితో మంచి ఫ్రెండ్షిప్ అవ్వడం ఆ తర్వాత ఎవరి లైఫ్‌లో వారు బిజీ అయిపోవడం జరిగేవి.

ఆ రోజుల్లో ఎందరో అభిమానుల దగ్గర నుండి నాకు కుప్పలు తెప్పలుగా ఉత్తరాలు రావడం నన్నెంతో ఆశ్చర్యపరిచింది. ఏదో సినిమావారికి ఇలా అభిమానుల దగ్గర నుండి లెటర్స్ వస్తాయని అంటారు. కానీ, ఒక కార్టూనిస్టునైన నాకేమిటి ఇంతటి అభిమానుల ఆదరణ...? ఈ ఉత్తరాల వెల్లువ...? నిజంగా నా కార్టూన్లు ఇంతమందిని ఆకట్టుకుంటున్నాయా...? అయితే అంతకన్నా నాకు ఆనందదాయకమేముంది. ఈ అభిమానుల అభినందనలే నా కార్టూన్లకు వెలకట్టలేని నిధి నిక్షేపాలు... కొందరు అభిమానుల ఉత్తరాలు మరీ విచిత్రంగా ఉంటాయి. రెండు మూడు



# విశాఖలో అంట్యాకుల, వ.పాల వర్ధంతి !

ప్రముఖ జానపద చిత్రకారుడు కళాప్రపూర్ణ అంట్యాకుల పైడిరాజు, చిత్రకళా తపస్వి వడ్డాది పాపయ్యల వర్ధంతుల్ని విశాఖపట్నంకు చెందిన చిత్రకళాపరిషత్ ఘనంగా నిర్వహించింది. డిశంబర్ 26న పైడిరాజు వర్ధంతి సందర్భంగా విశాఖజిల్లా స్థాయిలో బాలబాలికలకు స్పాట్ పెయింటింగ్‌పోటీల్ని నిర్వహించగా, వివిధ పాఠశాలలకు చెందిన 150 మంది విద్యార్థులు పాల్గొన్నారు. ఈ సందర్భంగా 2010 రాష్ట్రఉత్తమచిత్రకళోపాధ్యాయ అవార్డు గ్రహీత బొడ్డేటి సూర్యనారాయణ చిత్రించిన 50 చిత్రాల్ని ప్రదర్శించారు. ఈ ప్రదర్శనను హిందుస్థాన్ షిప్‌యార్డ్ సీనియర్ పర్సనల్ ఆఫీసర్ జి.కె. విశ్వనాధరాజు ప్రారంభించారు. విశాఖజిల్లా గ్రామీణ ప్రాంతానికి చెందిన గిరిజనుల జీవనవిధానానికి సంబందించిన చిత్రాల్ని సూర్యనారాయణ సహజ సుందరంగా చిత్రించి కళాభిమానుల్ని అలరించారు.



విద్యార్థులు చిత్రించిన చిత్రాల్ని ప్రముఖ చిత్రకారులు బి.సూర్యనారాయణ, శ్రీహరి గణేష్ రామారావు, కార్టూనిస్టు బి.ఎస్. రాజు పరిశీలించి బహుమతుల్ని ఎంపిక చేశారు. విద్యార్థులు సామాజిక అంశాలతోపాటు విశాఖసుందర దృశ్యాల్ని చిత్రించారు.




జనవరి 30న జరిగిన వ.పా వర్ధంతి సమావేశంలో షిప్‌యార్డ్ చీఫ్ మేనేజర్ డాక్టర్ శ్రీ.ఎ.మురలీధర్ ముఖ్యఅతిధిగా హాజరై చిత్రకళోపాధ్యాయుడు బి. సూర్యనారాయణను శాలువాతో సత్కరించి జ్ఞాపిక అందజేశారు. వడ్డాదిపాపయ్య చిత్రకళ, జీవిత విశేషాల్ని చిత్రకళా విమర్శకుడు సుంకరచలపతిరావు వివరించారు. అనంతరం చిత్రకళాపోటీలో విజేతలకు చిత్రకారులు కె.నరసింహాచార్యులు, ప్రముఖ రచయిత గరిమెళ్ల శ్రీనివాస్, తరదితరులు అందజేశారు. ఈ కార్యక్రమంలో పరిషత్ కార్యవర్గ సభ్యులు చెల్లూరి భాస్కరరావు, సురేష్, మహేష్, మనోహర్, ఆడారి భాస్కరరావు, జాన్‌రాజు తదితరులు పాల్గొన్నారు.

**– సుంకరచలపతిరావు**

## స్వగతం-5

పేజీల ఉత్తరాలు రాసేవారు. వారి వివరాల్నీ రాసేవారు. కొందరు వారి ఫొటోలు కూడా లెటర్స్‌తో పాటు జతచేసి పంపేవారు. అప్పటికే దాదాపు అన్ని పత్రికల్లో నా ఇంటర్వ్యూలు వస్తూండేవి. అయినా నా గురించి ఇంకా ఇంకా వివరాలు రాయమని కొందరు, ఫొటో పంపమని కొందరు, కార్టూన్లు ఎలా వేయాలి రాయమని కొందరు, పత్రికల్లో పడేట్టు కూడా మీరు చేయగలరని రాసేవారు. మరికొందరు కలం స్నేహం కోరుతూ రాసేవారు. అందరికీ మొదటి ఉత్తరానికి మాత్రం జవాబు రాసేదాన్ని. ఒకరిద్దరు నా కార్టూన్లలో చిన్నపాటి విమర్శలు కూడా చేసిన వారున్నారు.

ఏమండీ... ఏమండీ... మీ కార్టూన్లలో ఆడ బొమ్మలు అందంగా ఉంటాయి. మగ బొమ్మలు మాత్రం అందంగా వేయరు ఎందుకు అని రాసేవారు. మరొకరు మీ కార్టూన్లలో అమ్మాయిలను అందంగా, మంచి పువ్వుల చీరలతో వేసి, మగ బొమ్మల్ని వికారంగా వేస్తున్నారు. ఏమిటో ఈ పక్షపాతం అంటూ రాసేవారు. కార్టూన్లలో ఆడ బొమ్మలు వేయడం నాకిష్టం. అందుచేత కాస్త శ్రద్ధగా, అందంగా వాటిని వేయడం నిజమేగాని-మగబొమ్మల మీద పక్షపాతం ఎంతమాత్రం లేదు. ఆ పరిస్థితులను బట్టీ కార్టూన్‌లో ఆ బొమ్మలకు అలాంటి ఫీలింగ్ వేయడం జరుగుతుంది. అంతే అంటూ జవాబులు రాశాను కొందరి ఉత్తరాలైతే నాకు గాబరా పుట్టించేవి. నేను వీలుచూసుకొని జవాబురాసేంతలో నాలుగైదు ఉత్తరాలు రాసేవారు జవాబు రాయరేంటి అని. ఆనాటి ఉత్తరాల వెల్లువ తగ్గినా ఈనాటికీ అభిమానుల దగ్గర నుండి నాకు రోజుకు కనీసం ఒకటి రెండైనా ఉత్తరాలు వస్తుంటాయి.

*మిగతా రాబోయే సంచికలో...*

# మదిలో వీణలు మ్రోగించిన స్వరబాల సుశీల



"పాడమని నన్నడుగవలెనా
పరవశించీ పాడనా...
నే పరవశించీ పాడనా," అంటూ మది పులకించే తెలుగు పాటలు పాడిన తేనెల సోన 'పులపాక సుశీల'. బాలగా ఉన్నపుడే తనలో సంగీత పరిమళాలను గుబాళింపజేసుకున్న స్వరబాల. కారణం, ఆమె తల్లిదండ్రులిద్దరూ శాస్త్రీయ సంగీతాభిమానులూ, స్వయంగా వీణావిద్వాంసులు కావడమే. జన్మత: సంక్రమించిన సంగీతాభినివేశాన్ని శాస్త్రీయ సంగీత రంగంలో గిరిశిఖర ప్రమాణంగా పరిణమింపజేయాలని తలిదండ్రులనుకున్నా, లలిత సినీ సంగీతాలనే అమితంగా ఇష్టపడ్డారు, సుశీల. లతామంగేష్కర్, భానుమతి, లీల, జిక్కీల పాటలను కూనిరాగాలు తీస్తూనే ఉండేది బాల సుశీల.

**– మాకినీడి సూర్యభాస్కర్**

ద్వారం వారి సన్నిధిలో విజయనగరం మహరాజా కళాశాలలో ఐదు సంవత్సరాల శిక్షణతో గాత్రంలో డిప్లమో పొంది హైదరాబాద్, విజయవాడ, చిత్తూరు, చెన్నై వంటి నగరాలలో అనేకానేక కచేరీ లిచ్చిన సుశీల, మ్యూజిక్ అకాడమీలో చేరి తన సంగీత జ్ఞానానికి... సమ్మోహన గానానికి మెరుగులు దిద్దుకున్నారు . అప్పటి ప్రిన్సిపాల్ ముసిరి సుబ్రహ్మణ్యయ్యర్ కూడ ఆమెను శాస్త్రీయ సంగీతంలో బాగా ప్రోత్సహించినా, ఆమె సినిమా పాటలనే ఎక్కువగా ఇష్టపడేవారు.

నాలుగు సంవత్సరాల పాటు ఆకాశవాణి 'బాలానందం' (చిన్నపిల్లల కార్యక్రమం) బృందగాన కార్యక్రమంలో విరివిగా పాల్గొన్నారు. 1951వ సంవత్సరంలో

పెండ్యాలకు పదిమంది పాడే అమ్మాయిలు కావాల్సిరాగా, 'రేడియో అన్నయ్య' న్యాపతి రాఘవరావు పంపిన బృందంలో ఒక సభ్యురాలిగా సుశీల సినీరంగ ప్రవేశం చేశారు. అప్పుడు పెండ్యాల 'కన్నతల్లి' చిత్రానికి సంగీత దర్శకులుగా ఉన్నారు. ఆ చిత్రంలో కొందరు ముత్తైదువల బృందగానంలో కోరస్‌గా మొట్టమొదటి సారి పాడారు సుశీల. ఆ విధంగా 'కన్నతల్లి', సినీగాయనిగా సుశీలను 'కన్నతల్లి' అయింది. సుశీల గాత్రానికి ముగ్ధుడైన పెండ్యాల, అదే చిత్రానికి పోతనగారి పద్యం 'సిరికింజెప్పడు...' ను పాడించారు. సింహేంద్ర మధ్యమ విశిష్ట రాగంలో ఆ పద్యాన్ని ప్రతి పద రసాత్మకంగా సుశీల గానం చేశారు. ఆ గానమాధురికి తన్మయం చెందిన పెండ్యాల వెంటనే ఎ.ఎం. రాజాతో 'ఎందుకు పిలిచా వెందుకో...' అనే యుగళ గీతాన్ని పాడించారు. ఆ విధంగా అప్పట్నించి తెలుగు వెండి తెరకు స్వర్ణాభరణమైంది సుశీల పాట

మూడేళ్ళకు కాంట్రాక్టు రాయించుకుని ఏ.వి.ఎం. సంస్థ సినీగీత వృత్తిగాయనిగా పునాది వేసింది. కాంట్రాక్టు పూర్తి కాగానే ముప్పేట విజృంభించారు, సుశీల – తెలుగు, తమిళ, కన్నడ భాషల్లో తిరుగులేని యు'గళ' గాయకి అయిందామె. ఏ.వి.ఎం.కు చండీరాణి, చంద్రహారం

చిత్రాలలో కోరస్ పాడిన సుశీల అన్నపూర్ణావారి 'దొంగ రాముడు' చిత్రంలో రెండో నాయకి అయిన జమునకు నేపథ్యగాన మందించారు. 'తెలిసిందా బాబు ఇప్పుడు', 'భలే తాత మన బాపూజీ...బాలల తాత బాపూజీ', 'అనురాగము విరిసేనా' అన్న పాటలను స్నిగ్ధ మనోహరంగా పాడారు. 'అనురాగము విరిసేనా ఓ రేరాజా... అనుతాపము తీరేనా' అన్న పాటను రికార్డింగ్ అయిన తర్వాత ప్లే చేసి వింటుండగా, చక్రపాణి వినడం తటస్థించి 'మిస్సమ్మ'లో 'బృందావన మది అందరిదీ' అన్న పాటను పాడించారు. ఆ విధంగా 'విజయా'సంస్థ'లో అడుగు పెట్టిన వినయ సుశీల కాస్తా ఒక్కో ముందడుగు వేస్తూ 'విజయ సుశీల'గా మారింది. విజయావారి మాయాబజార్, అప్పు చేసి పప్పు కూడు, గుండమ్మ కథ వంటి గొప్ప చిత్రాలలో మరపురాని పాటలెన్నో పాడారు సుశీల. తెలుగు, తమిళాలలో ఒకేసారిగా నిర్మించిన 'తోడికోడళ్ళు' చిత్రంలో తొలిసారిగా కథానాయికకు(మహానటి సావిత్రికి) నేపథ్యగానం వహించారు సుశీల. అప్పట్నించి ఆమె గళం ఎందరో కథానాయికలకు కలకల స్వరాన్ని అందించింది.



సుశీల పాట లేని తెలుగు సినిమాయే ఉండేది కాదు. అయిదు దశాబ్దాలుగా తెలుగుతో పాటు వివిధ భాషల్లో ఆమె పాడిన పాటలు దాదాపుగ నలభైవేల పైచిలుకు ఉంటాయని అంచనా..

"పాలకడలిపై శేషతల్పమున పవళించేవా దేవా "

"నీవుండేదా కొండపై నా స్వామి...నేనుండే దీ నేలపై..."

"జననీ శివకామినీ...జయ శుభకారిణీ..." వంటి భక్తిగీతాలు,

"నీవేనా నను తలచినది...నీవేనా నను పిలచినది..." వంటి శృంగార గీతాలు,

"ఇది మల్లెల వేళయనీ...ఇది వెన్నెల మాసమనీ..."

"మనసా, కవ్వించకే నన్నిలా" వంటి విషాద గీతికలు,

"పాండవులు పాండవులు తుమ్మెదా...పంచపాండవులోయమ్మ తుమ్మెదా " వంటి జానపద బాణీలు,

"వటపత్రశాయికి వరహాల లాలీ..." వంటి లాలి జోలలు ఎన్నో.



బాల కళాకారులకు ఆమె పాడిన పాటలు మరపు రానివి. లవకుశలో 'రామకథను వినుమయ్యా', 'వినుడు వినుడు రామాయణ గాథ', భక్తప్రహ్లాదలో 'నారాయణ మంత్రం... శ్రీమన్నారాయణ భజనం', యశోదకృష్ణలో 'తారంగం తారంగం తాండవకృష్ణా తారంగం' పాటలు బాలగళ లీలహేలలు. బుల్లి శ్రీదేవికి పాడిన 'బూచాడమ్మా బూచాడు', ఆబాల గోపాలాన్నీ యిప్పటికీ అలరిస్తుంది.

వీణపాటల జాణ సుశీల. తెలుగులో దాదాపుగా అన్ని వీణపాటల్నీ ఆమే పాడారు.

"మనమే నందనవనమౌ కాదా "

"వీణా పాడాలే రాగమయీ "

"నీవు లేక వీణ పలుకలేనన్నదీ..."

"పాడెద నీ నామమె గోపాలా "

"పాడవేల రాధికా...ప్రణయసుధా గీతిక"

"మనసే అందాల బృందావనం"

"మదిలో వీణలు మ్రోగె...ఆశలెన్నొ చెలరేగె"

"ఈ వీణకు శృతి లేదు...ఎందరికో హృదయం లేదు..."

"ఎవరో రావాలి...నీ హృదయం పలికించాలి" అంటూ 'వీణ పలికించే ఎన్ని రాగాలో' ఆలాపించి, శ్రోతల మానసాలలో అన్ని భావాలూ రేకెత్తించారు. 'రాగవీణను తెలుగు హృదయాలలో ' పలికించారు. ఆనాటి పెళ్ళిచూపుల తంతుల్లో అమ్మాయిల నోట పలికిన ఈ వీణ పాటలు ఎందరినో ఏడడుగుల వరకు నడిపించాయంటే అతిశయోక్తి కాదు.

యుగళ గీతాల విషయానికొస్తే – ఏ.ఎం. రాజా, ఘంటసాల, సౌందరాజన్, బాలమురళీకృష్ణ, జేసుదాసు, రామకృష్ణ, బాలు, ఆనంద్ వంటి గాయకులతో అగణితంగా పాడారు సుశీల. ఘంటసాలతో కలిసి పాడిన యుగళగీతాలు రాశిలోను, వాసిలోను మేలిమి బంగరు పోతలు. 'ఫిఫ్టీ ఫిఫ్టీగా...సగం సగం'గా పాడిన ఆ పాటల్లో ఒకరు నాదంగా, ఒకరు గీతంగా... యిద్దరి కలయిక సంగీతంగా ప్రభవించింది.

"ఆడుతు పాడుతు పని చేస్తుంటే అలుపూ సొలుపూ ఉండద"నీ, "మబ్బులు రెండూ భేటీ అయితే మెరుపే వస్తుందీ...మనసులు రెండు పేచీ పెడితే వలపే పుడుతుంద"నీ, ఏనాటి రాగబంధాన్నో పెనవేసి ముడి వేసుకున్నారిద్దరూ...'' ఎవరూ లేని చోట చిన్న మాట"లాడుకుంటూ, 'ఇంకా ఇంకా చేరువ'య్యారు. 'అడగకయిచ్చిన మనసు, అందీఅందని అందాలతో ముద్దుముద్దు'గా 'దాగుడుమూత'లాడారు...'భార్యాభర్తలు' అయినవారందరికీ వీరి యుగళ గీతాలు వినే సమయం....''మధురం మధురం...జీవితమే ఆనందమయం"గా సాగుతుంది.







సినీ నేపథ్యగాయనిగా సుశీల అందుకున్న పురస్కారాలెన్నో. ఉయిరన్దమనిరాన్, సవాని సమాలి అనే తమిళ చిత్రాలు, సిరిసిరిమువ్వ, మేఘసందేశం, ఎమ్మెల్యే ఏడుకొండలు తెలుగు చిత్రాలకు ఉత్తమ గాయనిగా అయిదు సార్లు జాతీయ అవార్డులు అందుకున్నారు సుశీల. రాష్ట్రప్రభుత్వ నంది అవార్డు కూడ ఆమెను అయిదు సార్లు వరించింది. తమిళనాడు ప్రభుత్వం 'కలైమామణి' అవార్డునిస్తే, ఆంధ్ర విశ్వవిద్యాలయం గౌరవ డాక్టరేటు (కళాప్రపూర్ణ) యిచ్చింది. ఆమె తన సంగీత రజతోత్సవం సందర్భంగా 'సంగీత సరస్వతి' బిరుదంతో ఘనంగా సన్మానింపబడ్డారు. తెలుగు సినిమా రంగానికి సంబంధించి అత్యుత్తమ పురస్కారమైన 'రఘుపతి వెంకయ్య' అవార్డును 2002 సంవత్సరానికిగాను అందుకున్నారు.

అయిదున్నర దశాబ్దాలపాటు సినీ నేపథ్య సంగీతంలో తిరుగులేని గాయనిగా పేరు పొందిన సుశీల సాధించగలిగినదంతా సాధించానన్న తృప్తితో, సినీగానానికి ఇంచుమించుగా స్వస్తి పలికి తన దృష్టిని ఆధ్యాత్మిక దిశగా మళ్ళించారు. సాయిబాబా భక్తురాలై భక్తి పాటల క్యాసెట్లను విడుదల చేస్తున్నారామె.

# నకాషి- చిత్రకళ

-గోనె లింగరాజు

**శాస్త్రీయమైన శిక్షణ ఏమీలేకుండా, ఏదో తరతరాల వారసత్వంగా వచ్చే ఒక సంప్రదాయాన్ని అనుసరించి చేసిన కళాసృష్టి నకా(క్కా)షీ చిత్రాలలో, శిల్పాలలో, చేతిపనులలో, అలంకరణలలో ఇది కనపడుతుంది. ఇటువంటి కళా సంప్రదాయం ప్రతిదేశంలో ఏదో ఒక తీరున కానవస్తున్నది. తెలంగాణలో వరంగల్ జిల్లా చేర్యాలలో 'నకాషి' చిత్రకళ కనపడుతుంది. తెలంగాణ జానపద సంస్కృతి చిత్రపటాలలో కనబడుతుంది. ప్రస్తుతం ఒకే కుటుంబం ఈ కళను వారసత్వంగా కొనసాగిస్తున్నది.**

ఈ నకాషీ కుటుంబం గీసే చిత్రాలు, తీసుకున్న అంశాలు అన్నీ తెలంగాణకు సంబంధించిన బతుకమ్మ, బోనాల పండుగతోపాటు-రామాయణం, మహాభారతం, మొదలు కులపురాణాలు కూడ వీరి చిత్రాలలో కనిపిస్తాయి.

ప్రధానంగా ఈ చిత్రపటాలలో ఎరుపురంగును బ్యాక్‌గ్రౌండ్‌గా, పసుపు రంగును బార్డర్‌గా వేస్తారు. కథలకు అనుకూలంగా శరీరాలకు గోధుమ, నీలం, ఎరుపు రంగులను వాడుతారు. మొత్తంగా అన్నింటికీ నల్లరంగుతో సన్నని బ్రష్‌తో అవుట్‌లైన్ ఫినిషింగ్ చేస్తారు. ఈపటాలు 6 అడుగుల ఎత్తు, 36 అడుగుల పొడవు కలిగి ఉంటాయి. 4×36, 3×24 పరిమాణంలో ఈ చిత్రపటాలను తయారు చేస్తారు.

పూర్వం 'నకాషీ' పనిచేయటానికి చిత్రాలను గీసే వారిని చిత్రకారులు అనేవారు. హిందువులకే కాకుండా ముస్లింలకు సంబంధించిన కోన్‌కిస్తి (పళ్లెం)పైన, గంపపైన డిజైన్లు వేసేవారు. హైదరాబాద్ నిజాం కాలంలో ఈ కళకు 'నకాషీ' పనిగా పేరువచ్చింది. హిందీ పదమైన 'నకిషీ' (చెక్కడం) ఉర్దూ పదమే-ఉత్తరోత్తరా 'నకాషీ'గా రూపాంతరం చెందివుంటుంది.

తెలంగాణ ప్రాంతపు సంస్కృతి వీరి పటాల ద్వారా 100 సంవత్సరాల నుండే ప్రదర్శిస్తూ వస్తున్నారు. దేశదేశాలలో కూడా వీరి చిత్రకళ ప్రదర్శించబడుతున్నది. తెలంగాణలోని 10 జిల్లాలో ఈ చిత్రపటాలతో కథలు చెప్పి, వివిధ కులాల వారి దగ్గర కొద్దీ గొప్ప ఆర్జన చేసుకుంటుంటారు.

పూర్వం 'నకాషీ' చిత్రాలను దేవాలయాలలోని గోడలపైన వేసేవారు. దేవాలయంలో వాహనాలు, ఉదా॥కు హంస వాహనం, సింహ వాహనం, గరుడ వాహనం మరియు చెక్క రథాల వంటివి తయారుచేసేవారు. రథాలకు రంగులు కూడా వేస్తారు. నిర్మల్‌లో "ఆటబొమ్మలు" కృష్ణాజిల్లాలో కొండపల్లి బొమ్మలు తయారు చేసేవారు-నకాషి వృత్తి నుండి ఎదిగి వచ్చిన వారే.

ఈ విధంగా తెలంగాణలో జమీందార్లు, వైశ్యులు, బ్రాహ్మణుల వంటి ఇండ్లలో, పడకగదులలోను యితర అలంకరణగా కూడా కృష్ణ లీలలు వంటివి గీసేవారు. వరండాలలో చెట్ల బొమ్మలు వేసేవారు. గోడల చుట్టూ అలంకారంగా లతలు, తదితర గీతలు- బార్డర్లను గీసేవారు.

పిల్లలు ఆడుకోవడానికి ఆటబొమ్మలు కూడ తయారు చేసేవారు. పేడ బొమ్మలు, గొల్లభామలు, ఎడ్లబండి వంటి బొమ్మలు తయారు చేసేవారు బండ్ల కొలది తయారు చేసుకొన్న బొమ్మలను వేములవాడ, యాదగిరి గుట్ట, కొమురవెల్లి వంటి యాత్రా స్థలాల్లో అమ్మేవారు. ఇంతేకాకుండా, గంపల్లో పెట్టుకొని గ్రామాలలో తిరిగి





వాతావరణంగా మారుతుంది. ఈ కార్యక్రమం ముగిసిన తర్వాత తయారైన పటాలను కథ చెప్పే వారు తీసుకొని పోతారు.

ఇట్లా వివిధ కులాలలకు సంబంధించిన కథలకు చిత్రపటాలు తయారవుతుంటాయి. ఈ పటాలు 6/4 అడుగుల (6/36)ఎత్తు, అడుగుల (4/24) (నిలువు /అడ్డం) కలిగి ఉంటాయి.

పటాల తయారీకి తోడ్పడే కథలు/పురాణాలు:

1. మార్కండేయ పురాణం, 2. మహాభారతం. 3. కంఠమేశ్వర పురాణం, 4. మడేలు పురాణం, 5. అద్దపురాణం, 6. కాటమరాజు కథ (పురాణం), 7. గుఱ్ఱం మల్లయ్య పురాణం, 8. ఆదిపురాణం (జాంబపురాణం).

పద్మశాలి వారికి మార్కండేయ పురాణం కూనపులివారు కథ చెబుతారు. ముదిరాజు వారికి మహాభారతం కాకిపడగ, వారు కథ చెబుతారు. గౌండ్ల వారికి కంఠమేశ్వర పురాణం ఏనుటి, జెట్టి వారు కథ చెబుతారు. చాకలి వారికి మడేలు పురాణం పటం వారు కథ చెబుతారు. మంగలి వారికి అద్దపురాణం అద్దపోళ్ళు కథ చెబుతారు. గొల్లవారికి కాటమరాజు కథ పురాణం మందెచ్చువారు కథ చెబుతారు. (వీరికి మాత్రము బొమ్మలు చూపెడతారు). మాల వారికి గుఱ్ఱం మల్లయ్య పురాణం గుఱ్ఱపోళు ్ళ కథ చెబుతారు. మాదిగ వారికి ఆదిపురాణం (జాంబపురాణం) డక్కలివారు కథ చెబుతారు.

వస్త్రాన్ని తయారు చేయు విధానం: మొదట నేయించిన మందపు/ మందపాటి బట్టను తీసుకొని, చింతఅంబలి (చింతగింజలను నానబెట్టి, దంచి, రుబ్బి, ఉడకబెట్టినపుడు వచ్చేగంజి). తిరుమని చెట్టుబంక (నీళ్ళలో వేసి పిసికి వడపోయగా వచ్చిన బంక) / రంగుల్లో మరియు మెంచు (బట్ట)ల్లో కూడా ఉపయోగిస్తారు. గంజి, తెల్లని సుద్దమట్టి పూస్తారు.

**బ్రష్‌లు తయారు చేసుకోవటం:**

**మందపాటి (మందమైన) పెద్ద బ్రష్‌లు : మేక వెంట్రుకలతో తయారు చేస్తారు.**

**సన్నని బ్రష్‌లు: ఉడుతతోక వెంట్రుకలతో తయారు చేస్తారు. (వెదురు పుల్లలకు వెంట్రుకలు అంటగట్టి తయారు**

అమ్ముకునేవారు. అట్లాగే దీపావళి, కార్తీక మాసాల్లో 'కేదారేశ్వరి' వ్రతం చేయుటకు ఇండ్లల్లో తెల్లటి సున్నపు గోడలపైన జాజురంగుతో 'పొప్పెడ' అనే చిత్రాలు గీసేవారు.

ఈ విధంగా ఎల్లమ్మ, మాంకాళమ్మ, మల్లికార్జున స్వామి విగ్రహాలను బురక పేడల మట్టి (ఎర్రలు వదిలిన మలినం), కలిపి విగ్రహాలు తయారు చేస్తారు. తర్వాత చింత అంబలితో బట్టలు అతికించి, బట్టలపైన సుద్దమట్టితో రెండు పూతలు పూసిన తరువాత నీళ్ళరంగులు వేస్తారు. అలంకరణ కోసం కిరీటంలోని ఆభరణాలు ప్రత్యేకంగా కనిపించటం కోసం వర్క్ (మెరుపు) కాగితం అతికిస్తారు.

వివిధ కులాలకు సంబంధించిన కథలకు (కుల పురాణాలకు) చిత్రపటాలను మరియు బొమ్మలను నకాషీ చిత్రకారులు తయారుచేస్తారు. ఈ పటాలు ఒకసారి తయారు చేసుకున్నవి దాదాపు 3,4 తరాల వరకు ఉపయోగపడతాయి. పటానికి సంబంధించిన పురాణాన్ని చెప్పే కులం వారు నాలుగు, ఐదు రోజులు నకాషీ చిత్రకారుల ఇంటి వద్ద ఉండి కథ చెప్పుతారు. కథ వినే సమయంలో చిత్రకారులు నకలు గీసుకుంటారు. ఆ తరువాత ఆ పటం తయారు కావటానికి 6 నెలల నుండి 1 సంవత్సరం వరకు సమయం పడుతుంది. ఈ పటం 6×36 సైజులలో ఉంటుంది. పటం చివర అమ్మవారు గజం సైజు ( 3 అడుగుల)లో పెద్దగా ఉంటుంది. అమ్మవారి ముందు బియ్యం, ఖర్జూర పండ్లు, కుంకుమ, పసుపు, కట్నం (రూపాయలు) పెట్టి కొబ్బరికాయ కొట్టి, ఒక యాటను కోస్తారు ( ఒక జంతువును బలి ఇస్తారు). ఈ తతంగం అంతా పండుగ

చేసుకుంటారు).

**రంగులు తయారు చేసుకోవటం:**

తెల్లరంగు : వాగుల్లో దొరికే శంఖాలతో తెల్లరంగు తయారు చేస్తారు.

నల్లరంగు: కిరోసిన్ దీపంలోని మసి, కాగడ దీపంతో వచ్చిన మసిని నల్లరంగుగా వాడుతారు.

ఎరుపురంగు: ఇంగిలీకం (రాయి)తో తయారు చేస్తారు.

పసుపు: పేవిడిరాళ్ళతో తయారు చేస్తారు.

నీలిరంగు: చైనా బ్లూ, ఇండిగో- చెట్టు ఆకుతో తయారు చేస్తారు. (ఇండిగో-ఆకులను ఉడకబెట్టి, ఆరబెట్టగా ఎండిన గడ్డలను ఉపయోగిస్తారు). వీటితోపాటు జాజు రంగులను కూడ వాడుతారు. ఈ విధంగా తయారుచేసిన రంగులతో ద్వితీయ రంగులను తయారు చేసుకుంటారు.

జాజురంగుతో నకలును, ఎరుపు+పసుపు కలిపి ముఖాలకు, తెలుపు+ఎరుపు కలిపి ఇతర పాత్రల ముఖాలకు, పుసుపు+నీలిరంగు కలిపి ఆకుపచ్చ, తెలుపు+నీలం రంగులను కలిపి ఆకాశానికి సూచనగా రంగులను వాడతారు. ఇప్పటికీ స్వంతంగా వస్త్రాలను, రంగులను తయారు చేసుకొని పటాలు - చిత్రాలు గీస్తారు. ఈ విధంగా తయారు చేసిన పటాలు 3,4 తరాల వరకూ వాడటం గర్వకారణం.

ప్రస్తుతం ఈ 'నకాషీ' కుటుంబాలు గ్లోబలైజేషన్‌లో భాగంగా కొంతమంది బట్టలు కుట్టే దర్జీపని వారిగా, కొందరు వడ్రంగులుగా, మరికొందరు చాలీచాలని ఉద్యోగాలలో చేరేట్టుగా, మిగిలిన వారు కూలిపని చేసుకొనే వారుగా మారటం గమనిస్తాం. ఒకే కుటుంబం వరంగల్ జిల్లా చేర్యాలలో ప్రస్తుతం ఈ కళను కొనసాగిస్తున్నది.

ఈ జానపద కళతో ప్రభావితులైన వారు బెంగాల్‌లోని ప్రసిద్ధ చిత్రకారుడు జెమినీరాయ్ కాగా నకాషీ చిత్రకళ పోకడలతో తెలంగాణలోని సిద్దిపేట నుండి కాపురాజయ్య గారిని పేర్కొనాలి. బెంగాలీ జానపద నకాషీ చిత్రకారులు, రంగోలీ కళాకారులు, బొమ్మలు పనివారినుండి జెమినీరాయ్ ప్రభావితుడైనారు. బెంగాల్‌కు చెందిన పట వర్ణ చిత్రాలు, కాళికాదేవి మట్టి బొమ్మలు కూడ జెమినీరాయ్‌ని అమితంగా ప్రభావితపర్చాయని చెప్పవచ్చు.

కాపు రాజయ్య గారు ఏదో ఏట నకాషీ కళాకారుడు చిత్రించిన ఒక ఏనుగు చిత్రాన్ని చూచి, తాను కూడా ఒక కళాకారుడు కావాలని నిశ్చయించుకున్నాడు. ఆ చిత్రం లాగే వేరొకదానిని గీయాలని ప్రయత్నించారట. నకాషీ జానపద కళాకారుల ఉన్నత శైలుల్లో చిత్రలేఖనాన్ని ఆయన కొనసాగించటానికి చేసిన కాలంలో ఎరుపు, ఆకుపచ్చ రంగులను ప్రధానంగా వాడేవారు. స్త్రీలు, గుర్రాలు, ఏనుగులు, అలంకారిక పలకాలు వంటివి రాజయ్య గారి కళారచనలో ప్రేరణ శక్తిగా ఉపకరించాయి.

జానపద కళల్లో ఆయాదేశాల, ప్రజల సంస్కృతి, అభిరుచులు వ్యక్తమవుతాయి. ఈ కళ పుట్టి పెరిగింది గ్రామాలలో, గ్రామీణులు తమ ఆనందాన్ని, భావాల్ని, భక్తిని, భయాన్ని కేవలం కొద్ది రంగుల్లో ఎట్లా అనిపిస్తే అట్లా వ్యక్తపరిచారు. చిత్రాలలో, బొమ్మలలో, చాలకొద్ది రంగుల్లో ఎన్నో డిజైన్లు, లతలు, పువ్వులు, చిత్రించినారు. ఇటువంటి చిత్రకళా మాధ్యమాలను జెమినీరాయ్, కాపు రాజయ్య వంటి భారతీయ చిత్రికారులు అంతర్జాతీయ ఆర్టుగ్యాలరీలలో ప్రదర్శించటం విశేషం.





సమకాలీన చిత్రకళతోపాటు ఈ సంప్రదాయ చిత్రపటాలను కూడ జగదీష్ మిట్టల్ వంటి వారు ముప్పయి సంవత్సరాలుగా కొనుగోలు చేస్తున్నారంటేనే ఈ కళల మహత్యమేమిటో అర్థమౌతుంది. ప్రొ॥జయధీర్ తిరుమలరావు వంటి వారు ఈ కళల మీద పరిశోధన చేస్తూవస్తున్నారు. అది అభినందనీయమైన కృషి. అయినా రావలసినంత గుర్తింపు రాలేదనే చెప్పాలి.

అంతరించిపోతున్న ఈ సాంప్రదాయ జానపద కళను ఫైన్ఆర్ట్స్ కళాశాలలో ఒక ప్రత్యేకమైన అధ్యయనాంశంగా చేర్చితే, నేటి తరంలో కూడా ఒక జెమినీరాయ్, మరొక కాపు రాజయ్య వంటి అంతర్జాతీయ చిత్రకారులు రూపొందే అవకాశాలు యినుమడిస్తాయి.



**చిత్రకారుని అభిప్రాయం: ధనాళకోట వైకుంఠం**
**నకాషీచిత్రకారుడు, చేర్యాల, వరంగల్**

నేను 35 సం॥గా ఈ నకాషీ చిత్రపటాలు తయారు చేస్తున్నాను. ఇప్పుడు నా వయసు 50 సం॥లు. నకాషీ పని మా నాన్నగారు వెంకటరామయ్య గారి వద్ద, మా అన్నగారి వద్ద నేర్చుకున్నాను. ఈ కళలో 1995లో స్టేట్ అవార్డ్, 1995 ఢిల్లీలో నేషనల్ మెరిట్ సర్టిఫికెట్ పొందాను. 2003 సం॥లో ఎ.పి. టూరిజం ద్వారా కల్చరల్ ఫెస్టివల్‌కు దక్షిణాఫ్రికాలోని 'ఘనా' దేశానికి వెళ్లాను. వివిధ ప్రదేశాలలో నకాషీ కళను ప్రదర్శిస్తూ వస్తున్నాం. డి.సి.హెచ్. (డెవలప్‌మెంట్ హ్యాండీక్రాఫ్ట్) మరియు నాబార్డ్ పక్షాన ఒక నెలరోజులు 15 మందికి శిక్షణ ఇచ్చినాము. ఇప్పుడు గ్రామంలో వారు కొంత నేర్చుకున్నారు. ఈకళను అభివృద్ధి పరచడం కోసం ప్రభుత్వం చొరవ తీసుకొని, మా చిత్రపటాలు వివిధ ప్రదేశాలలో ప్రదర్శించి, ఆర్థికంగా కళాకారులను ప్రోత్సహించాలి. వారానికి ఒక క్లాస్ అయినా నేర్పితే తర్వాతి తరానికి ఈ కళ ఎదుగుతూ, మరుగున పడుకుండా ఉంటుంది.





# తెలుగు భాష నేర్వాలంటే...?

బి.ఎం.పి. సింగ్







తెల్లవాడికి మత్తు మద్యం

తెలుగువాడికి మత్తు పద్యం

తెల్లవాడికి 'కిక్కు' పద్యం

తెలుగువాడికి 'లక్కు' పద్యం

మంత్రాలు మనసొత్తు– సత్తు యంత్రాలు వారి సొత్తు

స్వతంత్రం మనది– కుతంత్రం వారిది

మజ్జిగ మనది– మద్యం వారిది

దున్ని తినటం మన అలవాటు –తన్ని' తినటం వాళ్ళ పొరపాటు

ఆవుని పూజించేది మనం– అవుని ఆవురావురు మని భుజించేది

ఆ జనం (ఆంగ్లేయులు)

మదిని మరులు గొలుపు "విరుల"వంటి భాష తెలుగుభాష

సింగిల్ పేజీ కథ

# మత్స్యావతారం

## ఏవిఎమ్

ఫిష్ టబ్‌ని క్లీన్‌చేసి, అడుగున అక్కడక్కడా గులకరాళ్ళు, గవ్వలూ, నాచూ అందంగా అలంకరించి రెండు గోల్డు రంగు చేపలను వుంచారు మహర్షి. వాటికి ఫిష్‌ఫుడ్‌ను టబ్బంతా చల్లాడు.

బంగారు చేపలు ఆహారం తింటూ అటూ ఇటూ తిరుగుతుంటే ముచ్చటగావుంది. “ఏవోయ్! ఎందుకో ఆ వాయవ్య మూలనే నిలబడిపోయావ్?! ఆహారం అక్కడే ఎక్కువ వుందా ఏం!?” అన్నది సన్నగా వున్న చేప బొద్దుగా వున్న చేపనుద్దేశించి అదికాదు నేను ఈ మూలకు రాగానే నన్ను చూసి దండంపెడుతున్నాడు యజమాని ఇవతలకు రాగానే వూరుకుంటున్నాడు!?” అన్నది బొద్దుగా వున్న చేప అటువేపు వాస్తు బాగున్నట్టుగా వుంది!” తెలివిగా అన్నది సన్నగా వున్న బంగారుచేప అది కాదు గానీ... నీ అతి తెలివి కట్టిపెట్టు!”

“నేను అనుకున్నది కరెక్టు అయితే... ఇంకా కొద్ది నిమిషాల్లో నాకు కొబ్బరికాయ కొట్టి, హారతి ఇస్తాడు మన యజమాని! నేను ఈ వాయవ్య మూలనే వుంటాను కదలకుండా! నువ్వు నోరు తెరుచుకుని చూస్తూవుండు!” సరే! అదీ ...చూస్తా!”




మొబైల్‌ఫోన్లు ద్వారా విషయం క్షణాల్లో విజయవాడలో వాడవాడలా పాకిపోయింది త్రాచుపాములా.

జనాన్ని కంట్రోల్ చెయ్యడానికి పోలీసులు రంగప్రవేశం చేశారు. మీడియా అంతా మహర్షి ఇంట్లోనే వున్నది. లైవ్ టెలీకాస్ట్ చేస్తున్నది.

ఆ చేపల తొట్టి ముందర వేలకువేలు కొబ్బరికాయలు కొట్టారు, కొబ్బరి నీరు ప్రవాహంలా పారింది.

జరిగిందేంటంటే, ఆనాచు ముందరకి బొద్దుచేప రాగానే, ఆనాచు చేప‘నుదురు’ మీద నామాలు లాగా వున్నది. అంతే... మత్స్యావతార రూపంలో విష్ణుమూర్తి వెలిశాడని పుకారు దావానంలా వూరంతా పాకింది క్షణాల్లో. ఈ వింత చూస్తూ ఆ బొద్దుచేప అలాగే నిశ్చలంగా నిలబడింది నీళ్ళల్లో ప్రశాంతంగా.





email: pulipati_
akshara@yahoo.co.in

సమ్‌థింగ్ స్పెషల్

# హాబీల మా"ష్టారు"



సేకరించిన ప్రముఖవ్యక్తుల ఆగటో[గ్రాఫ్‌లు

ప్రతీ వ్యక్తికి ఏవో కొన్ని అభిరుచులుండడం సహజం. అభిరుచి అనేది పెయింటింగ్ కావచ్చు, ఫొటోగ్రఫీ కావచ్చు, రైటింగ్ కావచ్చు... నాణేలు, స్టాంపులు లాంటివీ సేకరణ కావచ్చు. ఇలాంటివి చాలా మంది చేసస్తూంటారు. ఇంతకీ ఈయన స్పెషల్ ఏంటీ అనుకుంటున్నారా? ఈ కలెక్షన్ కింగ్ లిమ్కా బుక్ ఆఫ్ రికార్డ్స్‌లో కూడా స్థానం సంపాదించాడంటే నమ్మగలరా?

ఈ నెల సమ్‌థింగ్ స్పెషల్‌లో పరిచయం కాబోయే పులిపాటి దుర్గారావు గారు పుస్తక ప్రియులు. మార్కెట్‌లోకి కొత్తగా వచ్చిన మేగజైన్లను సేకరించడం వీరి హాబీ. గత 20 యేళ్ళుగా, 350కి పైగా తొలి సంచికలను సేకరించి లిమ్కాబుక్ ఆఫ్ రికార్డ్స్‌లోకి ఎక్కేసారు.

ఆంధ్రజ్యోతి, ఉదయం, పల్లకి, స్రవంతి లాంటి మేగజైన్ల తొలి సంచికలు ఎన్నో అపురూపంగా భద్రపరచిన ఈ పస్తక ప్రేమికుడు ప్రముఖ వ్యక్తుల ఆగటోగ్రాఫ్‌లను సేకరించడం కూడా మరో హాబీ. శంకర్‌దయాళ్‌శర్మ, మదర్‌థెరీస్సా, అబ్దుల్‌కలాం లాంటి సుమారు 2వేల ప్రముఖుల సంతకాలు సేకరించారు. త్వరలో సంతకాల సేకరణలో కూడా మరో రికార్డ్ సాధిస్తారేమో చూడాలి. వృత్తిరీత్యా విజయవాడలో ఉపాధ్యాయులైన వీరు భావిపౌరులను తీర్చిదిద్దడంలోనూ తన సేవకుగాను ఎన్నెన్నో అవార్డులు అందుకున్నారు.

# వెండి తెర వెలుగులో ...
# మాటల మాంత్రికుడు

-పద్మకళ



స్వచ్ఛమైన గంగాప్రవాహాన్ని, గలగల పారే సెలయేరుల్నీ, గోదావరి పరుగుల్నీ, కృష్ణమ్మ పరవళ్ళనీ ఒకేసారి చూడాలనుకుంటున్నారా? కోకిలమ్మ గానానికి, చిరుజల్లులకి పులకించిన నెమలి నాట్యానికి జోడీ కట్టిన అందెల సవ్వడుల్ని ఆస్వాదించాలనుకుంటున్నారా? ఆత్మీయతానురాగాలు, స్నేహ మాధుర్యాలను పదిమందికీ పంచుతూ ప్రశాంతమైన జీవితాన్ని గడపాలనుకుంటున్నారా? ఎటువంటి ఆసరా, ప్రోత్సాహం లేక లక్ష్యాన్ని చేరుకోలేకపోతున్నామన్న దిగులుతో నిస్సారమైన జీవితాన్ని గడుపుతున్నామని దిగులుపడుతున్నారా? అయితే అందరివాడుగా మన్ననలు పొందుతూ తన కంటూ ఏ అండా లేకుండా, ఎదురుదెబ్బల్ని చిరునవ్వుతో సాగనంపుతూ, ఆటుపోట్లను అధిగమిస్తూ స్వశక్తితో అంచెలంచెలుగా ఎదుగుతున్న ఓ యువకుడి కథ చదవండి...

రెయిన్‌బో ఫ్లూట్ వేణువు– ఈ అబ్బాయ్ చాలా మంచోడు అన్న ట్యాగ్‌లైన్‌కు పూర్తిన్యాయం చేసే రేడియోజాకీగా సుప్రసిద్ధుడైన వేణు హైద్రాబాద్ ఆకాశవాణి రెయిన్‌బో ఎఫ్ఫెం నుండి రాష్ట్రమంతటా ఉన్న అభిమానులను అలరిస్తాడు. దాదాపు అన్ని తెలుగుఛానెళ్ళలో చక్కని రూపంతో, స్పష్టమైన ఉచ్చారణతో, సహజమైన నటనతో ప్రేక్షకుల ప్రశంసలను సొంతం చేసుకున్నాడు.

బతుకు పోరులో అలసిసొలసిన మనసుల్ని మనసారా పలకరిస్తూ, తియ్య తియ్యని మాటల తాయిలాల్ని పంచుతూ, ఆత్మీయతానుబంధాలతో మనుషుల్ని కట్టిపడేసే సమ్మోహన గళం అతనిది. పాతికేళ్ళ వయసుకే పరిణతి సాధించిన తాత్విక జీవితం ఆ యువకునిది. ఆధునిక మోజులో ఈతరం ఉగ్రూతలూగిపోతుంటే అతి సర్వత్ర వర్జయేత్ అంటూ హద్దులు మీరే ఆనందాలు వ్యసనాలవుతాయని హెచ్చరిస్తాడు. అందరి మధ్యా మసలుతూనే తనని తానుగా నిలబెట్టుకుంటానంటాడు. పొగిడితే ఉబ్బితబ్బిబ్బై పోతాడు అలాగని పొగడ్తలకోసం ప్రాకులాడడు. విమర్శల్ని సవాలుగా తీసుకుంటాడు అలాగని పొరపాటున కూడా ఎదుటివారిని బాధపెట్టడు. చిన్న-పెద్ద, ఆడ-మగా, పేద-గొప్ప భేదాలు లేకుండా స్వచ్ఛమైన హృదయంతో ప్రతిఒక్కరితో స్నేహం చేయగల సహృదయత అతనిది. హైటెక్ సిటీలో పదేళ్ళుగా ఉంటున్నా, నిత్యం హైటెక్ మనుషులు, టాలీవుడ్, బాలీవుడ్ సంస్కృతుల మధ్య బతుకుతున్నా పక్కా పల్లెటూరి అబ్బాయినని గర్వంగా చెప్పుకుంటాడీ బ్రాహ్మణపల్లి పిల్లవాడు. మాటలు రాని అమ్మ గొంతులోని భావాలను పలికించేందుకు, రెండు హృదయాల సవ్వడులను వినిపించేందుకు ఆ ఇంటికి వసపిట్ట అయ్యాడు. ఓనమాలు దిద్దించిన నాన్న చదువు విషయంలో చండశాసనుడయ్యేసరికి పట్నంలో ఉన్న మామయ్య ఇంట్లో చదువుతానంటూ పయనమయ్యాడు. పల్లెటూరికి మించిన భవిష్యత్తు కోరుకుంటున్నాడులే అని అతని తండ్రి సరే అన్నాడు. అబ్బబ్బ పట్నం... అనుకుంటూ స్నేహితులతో ఆటపాటల కోసం ఖమ్మం పట్నానికి పరుగులు తీసిన ఆ అబ్బాయికి అంతా బాగానే ఉన్నా అక్కడా చుక్కెదురు అయ్యింది. నాన్న లాగే మామయ్య

ఇంట్లోనూ క్రమశిక్షణ పేరుతో ఆ అల్లరి కృష్ణుణ్ణి దారిలో పెట్టేసరికి మూడేళ్ళకి మళ్ళీ కథ మొదటికొచ్చింది. మూడు, నాలుగు, ఐదుతరగతులతో పట్నం చదువుకి టాటా చెప్పేసి బ్యాక్‌టు పెవిలియన్ అంటూ మళ్ళీ అమ్మానాన్నల దగ్గరికి చేరినా ఈ అల్లరి గడుగ్గాయి అక్కడున్నది మరో రెండేళ్ళే. ఎనిమిదో తరగతికి మళ్ళీ చెంగు చెంగున గంతులేసుకుంటూ మామ దగ్గరికి చేరుకున్నాడు. మొదటి నుండీ నాటకాలు, నృత్యాలు అంటూ వేదిక లెక్కడం అంటే బోలెడంత సరదా ఉన్న వేణు చిన్నప్పటి నుండే బోలెడన్ని చప్పట్లు సంపాదించి తన ఖాతాలో జమ చేసుకున్నాడు. నటనపై ఉన్న పిచ్చి ఏడేళ్ళ వయసులో ఈ పిల్లాడిని రోజూ అరకిలో మీటరు దూరం నడిపించి, బుల్లి తెరకు అభిమానిని చేయటంతో పాటు భావి కళా తేజానికి భావ స్ఫూర్తి నిచ్చింది. పదేళ్ళ వయసులోనే పరమానందయ్య వేషంలో బుల్లి నటుడు దర్పంగా సంభాషణలు వల్లిస్తుంటే తెచ్చిపెట్టుకున్న ఆ పెద్దరికాన్ని చూసి ఊరంతా మురిసింది. జతగాళ్ళతో గురువుగారూ... అని పిలిపించుకుంటుంటే, లోలోపల ఉప్పొంగే గర్వం కళాకారునికి మాత్రమే సొంతమైన ఆ గౌరవాన్ని పదిలం చేసుకొమ్మని ప్రోత్సహించింది. పిట్టల దొరగా చెక్క తుపాకీ భుజానేసుకుని వేదికనెక్కి అందరి ముందూ కోతలు కోసిన అల్లరి అబ్బాయి పండించిన హాస్యానికి మోగిన చప్పట్లు ప్రేక్షకుల అభిమానాన్ని రుచి చూపించి, నటనను నరనరాల జీర్ణించుకొమ్మని సందేశమిచ్చాయి.



భలే తండ్రి-కొడుకు టీవీ సీరియల్ లో...

తొలి గురువుగా సైగలతో సంభాషించటాన్ని నేర్పించిన అమ్మ, ఊరు వాడా అంతా ఎంతో మెచ్చినా కళాకారుల జీవన స్థితిగతులపై అవగాహన ఉన్న పోస్ట్ మాస్టర్ నాన్న మాత్రం ముఖానికి రంగులు పూసుకుని రోడ్లమీద పడే జీవితం నీకెందుకని చీవాట్లు పెట్టి బుద్ధిగా చదువుకొమ్మని కాలేజీలో చేర్చాడు. ఇక చాన్నాళ్ళుగా అణచిపెట్టిన కళాకారుడికి ఓ ఊతం దొరికింది. కళాశాల వేదికపై జానపదాల సందడులు చేసాడు. సాగర సంగమంలో కైలాసాన కార్తీకాన శివదీపం... అంటూ సంప్రదాయ నాట్య భంగిమలతో ప్రేక్షకుల అభిమానాన్ని చూరగొన్నాడు. కాలేజీకి వెళ్ళే రోజుల్లో అమాయకమైన పలకరింపుతో బస్సు కండక్టర్ అభిమానాన్ని పొంది అతని ద్వారా సినిమా షూటింగ్ తొలిసారి చూసాడు. డైలాగులు చెప్పలేక అవస్థలు పడుతున్న కుర్రాడితో పోటీపడి సింగిల్‌టేక్‌లో అదరగొట్టి ఔరా అనిపించాడు. అలా మొదటిసారి క్లాప్

సప్తగిరిలో ప్రముఖులను ఇంటర్వ్యూ చేస్తూ...



కొట్టించుకున్న ఇతగాడి పట్టుకో సినిమా పాత్ర ప్రేక్షకుల కళ్ళలో పడుకుండా పట్టుజారిపోయి, తెరపై తన బొమ్మను చూసుకోవాలన్న ఆశను అడియాశ చేసింది. ఎప్పుడు చూసినా పత్రికల్లో సినిమా విషయాలను వెతుక్కుంటూంటే ఎడతెరిపి లేకుండా దాడి చేస్తూ పెద్ద వాళ్ళు పెట్టే చీవాట్లు ఆరునూరైనా సినిమా హీరో అవ్వాల్సిందే నన్న కసిని పెంచాయి. ఆ కసి కల్లే ఓ పత్రికా ప్రకటనను నమ్మి తాతయ్యను బ్రతిమాలి 2500 రూపాయలు పుచ్చుకుని ఓ సంస్థకు సమర్పించుకుని ఖాళీ చేతుల్తో తిరిగివచ్చాడు. ఇంక లాభం లేదని కంప్యూటర్ నేర్చుకుంటూనే ఓ దర్శకుని కార్యాలయంలో కొంతకాలంపాటు బందీ అయ్యాడు. అవకాశాలు ఇక రావని నిర్ధారించుకుని అక్కడి నుండి బయట పడి ప్రభుత్వ పాఠశాలలో విద్యా వాలంటీర్‌గా పనిచేశాడు. అక్కడే దూరవిద్య ద్వారా పీజీ పూర్తి చేశాడు. కొంత కాలానికి ఓ మేకప్ అసిస్టెంట్ చలవతో ఈ టీవీలో విధి సీరియల్‌లో ఓ చిన్న పాత్రలో బుల్లి తెరపై అరంగేట్రం చేశాడు. తర్వాత పద్మవ్యూహం, ఆమె, అలౌకిక, కురుక్షేత్రం, శ్రీవెంకటేశ్వర మహత్యం వంటి వివిధ టీవీ సీరియళ్ళలో చిన్న చిన్న పాత్రలు చేసాడు.

దూరదర్శన్‌లో శిశిర వసంతం, బొమ్మరిల్లు, జెమిని ఛానెల్‌లో చక్రవాకం, మనసులో మాట సీరియళ్ళలో వివిధ పాత్రలు ధరించాడు. మా టీవీలో రాధా-మధు సీరియల్‌లో హీరో స్నేహితునిగా నటించి వేణు తెలుగు ప్రేక్షకులకు మరింత చేరువయ్యాడు. అంతకు ముందే జీ- తెలుగు చానెల్‌లో జస్ట్‌ఫర్ యూ, న్యూమరాలజీ కార్యక్రమాలకు, ఈ -టీవీ సినీరంజని, సిటీ చానెల్‌లో మీపాట-మా పాట కార్యక్రమాలకు యాంకర్‌గా పనిచేసి, ప్రిన్స్ మహేష్‌బాబు ఫిల్మ్ సైనికుడులో యాంకర్ పాత్రను పోషించాడు. ఆ తర్వాత జెమినిచానెల్‌లో ఆమె సీరియల్‌లో హీరోగా నటిస్తుండగా సినిమాల్లో కథానాయకుడిగా తొలిసారి అవకాశం వచ్చింది. నలుగురి ఉద్యోగం- ఇద్దరి పెళ్ళి పేరుతో విడుదలైన ఆ సినిమా తర్వాత కొన్ని చిత్రాలలో పనిచేసినా వాటికి సరైన ప్రచారం లేక శాటిలైజ్ సినిమాలుగా మిగిలిపోయాయి. తర్వాత శుభలగ్నం సీరియల్లో దూరదర్శన్‌లో ఇలా ఎందరో అన్న టెలీ ఫిల్మ్‌లో మన తెలుగు చానెల్‌లో భలే తండ్రి-కొడుకు, ఈ టీవీ- ఎవరికి వారే తదితర మినీ చిత్రాలలో నటించాడు. మూడేళ్ళకు పైబడి ఆకాశవాణి ఆల్ ఇండియా రేడియో వారి రెయిన్‌బో ఎఫ్ఫెంలో తెలుగు రాష్ట్ర ప్రజల అభిమాన రేడియో జాకీగా పేరు గడించాడు. ఎన్నో వేదికలపై తన మాటల మాధుర్యంతో సందడి చేసాడు. ప్రస్తుతం ఎమ్మార్కే ప్రొడక్షన్స్ బ్యానర్‌లో కామెడీ హీరోగా, గౌతమ్ కాన్సెప్ట్ బ్యానర్‌ల్లో హీరోగా పనిచేస్తున్నాడు. ప్రస్తుతం వేణు శ్రావన్‌గా పేరు మార్చుకున్న వేణు ఇప్పటి వరకు ఎందరో చిత్ర ప్రముఖుల్ని ఇంటర్వ్యూ చేసాడు.



*ఓ మేకప్ అసిస్టెంట్ చలవతో ఈ టీవీలో విధి సీరియల్‌లో ఓ చిన్న పాత్రలో బుల్లి తెరపై అరంగేట్రం చేశాడు. తర్వాత పద్మవ్యూహం, ఆమె, అలౌకిక, కురుక్షేత్రం, శ్రీవెంకటేశ్వర మహత్యం వంటి వివిధ టీవీ సీరియళ్ళలో చిన్న చిన్న పాత్రలు చేసాడు.*

పట్టుపట్టరాదు... పట్టి విడువరాదు... అన్న చందాన చిన్న నాటికలలనే జీవితంగా మలచుకుని గెలుపైనా, ఓటమైనా ఆనందంగా స్వీకరిస్తానంటున్నాడు. ఎటువంటి పరిస్థితుల్లోనూ తన లక్ష్యాన్ని విడిచిపెట్టనంటూ, ఎప్పటికైనా గొప్ప నటుడిగా పేరు తెచ్చుకోవాలన్న ఈ అభినవ విక్రమార్కుడి సంకల్పం అతి త్వరతోనే నెరవేరాలని ఆశిద్దాం.

# పగటి వేషాలు- సామాజిక అంశాలు

## గంగిరెద్దుల వేషం

రచన
ప్రముఖ నటుడు, చిత్రకారుడు
**తాతా రమేశ్‌బాబు**
email: rbtata60@gmail.com

**పగటి కలలు కనొద్దు అంటారు
పగటి వేషాలు వెయ్యొద్దు అని కూడా అంటారు.
వేషం అంటే మారు రూపం**



*"బసవన్నా!...
అయ్యగారికి దణ్ణంపెట్టు
అమ్మగారికి దణ్ణం పెట్టు*

ఈ సంవత్సరం అయ్యగారికి లక్షల లక్షల లాభం కలిగి, సుఖసంతోషాలతో జీవించాలని దీవించటానికి బసవన్నలు వచ్చారు....

అనే మాటలకు తోడుగా...

సన్నాయి పాట, డోలు విన్యాసం, శృతి, తాళం, జేగంటలు వినిపిస్తున్నాయంటే...

అది మీ ఇంటికి వచ్చిన గంగిరెద్దుల మేళమే! అది గంగిరెద్దుల ఆటే! ఆ కాలం సంక్రాంతి కాలమే!

ఎద్దు కొమ్ములకి మువ్వలు, మెడలో గంట, కాళ్ళకి గజ్జెలు కట్టి ఎద్దు మీద జరీచీరలు, కండువాలతో సుందరంగా అలంకరించి మీ ఇంటి ముందుకు తీసుకువస్తారు గంగిరెద్దుల వారు.

వివిధ ఆటలు, పాటలు, వాయిద్యాలు వింటుంటే ఇంటిల్లపాది ఆనందమే!

శివుని వాహనమయిన 'ఎద్దు' (నంది) అంటే ఆంధ్రదేశంలో ఎంతో భక్తి, పవిత్రమయినదిగా భావిస్తారు. ప్రతి శివాలయం ప్రవేశ ద్వారంలో, శివునికి ఎదురుగా కొద్దిదూరంలో నంది విగ్రహం కూర్చున్న ఆకారంలో వుంటుంది. స్త్రీలు, శివుని దర్శించుకొన్నాక విభూది బొట్టు పెట్టుకొని, కొంచెం విభూదిని తీసుకు వచ్చి నంది తలపై వేసి అలా కూర్చున్న నంది వృషణాలను తమ ఎడమ అరచేతితో నిమురుతూ కుడిచేతి బొటన చూపుడు వేళ్ళను ఆ ఎద్దు కొమ్ముల కొసలమీద వుంచి, ఆ వ్రేళ్ళ మధ్య నుండి శివుని విగ్రహాన్ని చూస్తారు. ఇది సంప్రదాయంగా వస్తోంది. ఇలా చేయడం వల్ల, శివుని వాహనమైన 'ఎద్దు' సంతోషపడుతుందని, శివుని కృపకు పాత్రులవటానికి, శివునికి రికమండ్ చేస్తుందని ఒక అభిప్రాయంగా భావించవచ్చు.

గంగిరెద్దుల మేళం అతి ప్రాచీన కళారూపం.

*ఒక పురాణకథ చూడండి....*

"గజ ముఖుడయిన గజాననుడు అనే రాక్షసుడు, శివుని గురించి తపస్సు చేసాడట. అతని తపస్సుకు మెచ్చి పరమేశ్వరుడు ప్రత్యక్షమయి ఏమి కావాలో కోరుకొమ్మన్నాడు. అప్పుడా రాక్షసుడు శివుని ప్రార్థించి, 'స్వామి నీవు నా ఉదరమందు నివసించాలి' అన్నాడు, భక్తుని కోరిక కాదనలేక శివుడు గజాననుని ఉదరంలో ప్రవేశించి ఉండిపోయాడు. శివుని భార్య పార్వతి, తన భర్త జాడ తెలియక వెతుకుతూ వెతుకుతూ.... చివరకు గజాననుని ఉదరంలో వున్న వైనం తెలుసుకొన్నది. శ్రీవారిని దక్కించుకొనే ఉపాయం తెలుసుకొనే నెపంతో విష్ణువును ప్రార్థించింది. అపుడు శ్రీహరి బ్రహ్మాది దేవతలను పిలిపించి రౌండ్‌టేబిల్ సమావేశం



ఏర్పాటు చేసాడట. ఆ చర్చలలో గజాసుర సంహారంనకు గంగిరెద్దుల మేళమే సరి అయిన దని నిర్ణయం జరిగిందట. శివుని వాహనమయిన నందీశ్వరుని గంగిరెద్దుగా అలంకరించారు. బ్రహ్మాది దేవతలందరూ తలకొక వాయిద్యం అందుకొన్నారు. చిరుగంటలు, సన్నాయిలను మహావిష్ణువు తీసుకొన్నాడు. సరాసరి గజాసురపురానికి వెళ్లి గంగిరెద్దును జగన్మోహనంగా ఆడిస్తున్నారట. ఈ వైనం గజాసురుడు విని వారిని తన భవనం వద్దకు పిలిపించుకొన్నాడు. గంగిరెద్దును తన ముందు ఆడించవైనం గజాసురుడు విని గంగిరెద్దును తన ముందు ఆడించవలసిందిగా ఆజ్ఞాపించాడు, జగన్నాటక సూత్రధారి అయిన శ్రీహరి చిత్రవిచిత్రంగా గంగిరెద్దును ఆడించాడు. బ్రహ్మాది దేవతలు రసరమ్యంగా వాద్యాలను పలికించారట. గజాసురుడు పరమానంద భరితుడయి ఏమికావాలో కోరుకొండి ఇస్తాను' అన్నాడట. శ్రీహరి గజాననుతో 'ఇది శివుని వాహనమయిన నంది. శివుని జాడకై వచ్చింది. శివుడిని ప్రసాదించమని కోరాడట. గజాసురుడు నివ్వెరపోయి, అడిగినవాడు రాక్షసాంతకుడయిన శ్రీహరి అని గ్రహించాడట. తనకు మరణం తప్పదని, తన గర్భంలో వున్న శివునితో 'స్వామి, నా శిరస్సు త్రిలోక పూజ్యంగా చేసి నా చర్మం నీవు ధరించు' అనిప్రార్ధన చేసాడట. శివుడు ఒప్పుకొన్న తరువాత, తన గర్భంలో వున్న శివుడ్ని తీసుకొమ్మని విష్ణుమూర్తికి అంగీకారం తెలియచేసాడట. అపుడు శ్రీహరి నందిని ప్రేరేపించగా నంది తన వాడి అయిన కొమ్ములతో గజాసురుని ఉదరాన్ని చీల్చి సంహరించాడు.

ఈ కథ ఆధారంగా గంగిరెద్దుల వారి వేషం యొక్క ప్రాచీనత అంచనా వేయవచ్చు.

ప్రాచీన కాలం నుండి వంశపారంపర్యంగా వస్తున్న గంగిరెద్దులాట ప్రత్యేకమయిన వేశం. ఈ వేశం వేసే వారిని గంగిరెద్దుల వారిగా సమాజంలో పిలుస్తారు. వీరు సంచార జాతికి చెందిన వారు. యాదవులలో పెద్దింటి గొల్లలు, పూజగొల్లలు, పాల గొల్లలు... ఇలా కొన్ని తెగలున్నాయి. ఇందులో పునాటి గొల్లలు, ఎర్రగొల్లలు మాత్రమే ఈ గంగిరెద్దుల ఆటను ఆడుతారు. మిగిలిన తెగలలో కొందరు 'గొల్ల బోయుడు, పాములవాడు, మందులవాడు' అనే పగటి వేషాలు వేస్తారు. మరికొందరు వ్యవసాయం మొదలైన పనులు చేస్తారు.

కృష్ణాజిల్లా, హనుమాన్ జంక్షన్ దగ్గర, రేపల్లె నుండి వంద సంవత్సరాల క్రితం, గుడివాడ దగ్గర లింగవరం అనే గ్రామానికి తరలి వచ్చారు కొంతమంది గంగిరెద్దుల కళాకారులూ, వీరి పెద్ద డెబ్బయి ఏళ్లకు పైబడిన 'ఆవల భవగానులు' ఒక గంగిరెద్దుతో



వచ్చి ఇప్పుడు నాలుగు గంగిరెడ్లతో పది కుంటుంబాలుగా విస్తరించి, లింగవరం పెదరెడ్డి బోరు దగ్గర స్వంత ఇల్లు నిర్మించుకొన్నారు. వీరికి గంగిరెడ్లను తిప్పుకొనే పంపకాలలో కైకలూరు, ఆకివీడు, తాడినాడ, ఉప్పుటేరు వరకూ గల గ్రామాలు, పట్టణాలు వచ్చాయి. వీరి లాగే మరి కొన్ని గుంపులుగా రానున్న గూడెం , రేమల్లి, కొత్తూరు, తెంపల్లి, కేసరపల్లి, భీమరం, పెన్నాడ, వీరవాసరం, తాల్లకోడు మొదలైన ప్రదేశాలలో స్థిరనివాసం ఏర్పరచికొన్నారు.

వీరికి పంపకాలలో వచ్చిన ప్రదేశాలలోనే గంగిరెడ్లను తిప్పుకొనే హక్కు ఉండి అయితే ఈ మధ్య ఈ హక్కును సవరించుకొన్నారు. అదేమిటంటే 'ఒక్కొక్కరు సంకురాత్రి నెలలో మాత్రమే ఎవరి ఊర్లలో వారు తిప్పుకొన్నా మిగతా రోజులలో ఎక్కడయినా తిప్పుకోవచ్చు' అని దీని అందరి ఆమోదం లభించింది.

రాత్రిపూట ఏదో ఒక నాలుగు రోడ్ల సెంటర్‌లో గంగిరెడ్ల విన్యాసాలు చేసి, పగలంతా ఆ చుట్టుపక్కల ఇళ్ళ వద్ద తిరుగుతారు.

ఒకరు సన్నాయి, ఒకరు డోలు, వాయిస్తూ ఆడిస్తారు. ప్రత్యేకంగా 'నాగస్వరం' ఆడతారు. వీరి పిల్లలు ఐదు ఆరు తరగతుల వరకూ మాత్రమే చదువుకొని సన్నాయి, డోలు నేర్చుకొంటారు. ఏలూరు దగ్గర దెందులూరులో వున్న 'అర్జునరావు' అనే గురువు దగ్గరకు వీరి పిల్లలను పంపిస్తున్నారు. డోలు వాయిద్యాలను నేర్పుతారు. శిక్షణ సుమారు రెండు మూడు నెలలు వుంటుంది. భోజన పడక ఏర్పాట్లు గురువుగానే చేయిస్తారు. నేర్పినందుకు ఒక్కొక్కరికి ఐదు నుండి పదివేల రూపాయల వరకూ పారితోషికం తీసుకొంటారు.

రాత్రిపూట ఏదో ఒక నాలుగు రోడ్ల సెంటర్‌లో గంగిరెడ్ల సెంటర్‌లో గంగిరెడ్ల విన్యాసాలు చేసి పగలంతా ఆ చూట్టుపక్కల ఇళ్ళ వద్ద తిరుగుతారు. శిక్షణ పూర్తవగానే ఎద్దు యజమానికి వుత్తరం అందుతుంది. అప్పుడు సత్తెనపల్లి వెళ్ళి విద్యలు నేర్చిన గంగిరెద్దు'ను తెచ్చుకొంటారు.

ఉదయాన్నే ఎద్దును, తమను అలంకరించుకొని బయలు దేరిన గంగిరెద్దుల మేళం, సాయంత్రానికి ఏ ప్రదేశానికి చేరుకొంటారో తమ ఇంటి ఆడవాళ్ళకు చెప్పి, అక్కడకు రప్పించుకొంటారు. వీరి ఆడవాళ్ళు, కాయలు, బూరలు, పిన్నీసులు మొ॥ అమ్ముకొంటూ, సాయంత్రానికి మగవాళ్ళు రమ్మన్న ప్రదేశానికి చేరుకొంటారు. అక్కడ వంట చేసి బసచేస్తారు.

"మేము నేర్చిన విద్యలు ఒక దానితో ఒకటి పోటీ పడుతూ ఆడాలండి ఈ ఆంబోతులు, నోరులేని ఈ బసవ దేవుడు ఏ విధంగా చెబితే ఆ విధంగా ఆడితేనే దేవర అయిన 'మహిషం' పేరు పెట్టారండి. ఈ ఆంబోతులో కాలజ్ఞానం, నాదం-గంట ఎటు ఆడితే అటు రావాలి.

మా దొరగారు కంటి చూపు చూస్తా వుంటే, 'రాముడు' అని పిలిస్తే పలకాలండి. నోరున్న మనిషి నోటితో చెబితే నోరులేని ఆంబోతు శిరస్సు ద్వారా చెబుతుంది. వస్త్ర దానమిచ్చినా,



ఓపదిరూపాయలు ఇచ్చిన, ఓ ఇరవైరూపాయలు ఇచ్చిన వందనంలాగా కుడికాలు లేపి చక్కగా చూపిస్తుంది ఈ ఆంబోతు.

మా దొరసానమ్మగారు పూజకు కుంకాలు తెచ్చి, పూవులు తెచ్చిన ఆ ఆంబోతుకు పూజ చేస్తావుంటే కుడి చేయి లాగా కుడికాలు చూపించాలి. ఆ అయ్య, పేద బ్రహ్మల్లు పెళ్ళిల్లు చేసినా, అడుగడుక్కి సత్రాలు కట్టించిన ముందుగా కుడిచేయి వస్తుందండి మా ఆంబోతు వంగి వందానాలు చేస్తుంది. మీకు గంట వాయిస్తే అటెల్లిపోతుంది. "ఏయ్... డింగ్...డింగ్' అని మరలా వాయిస్తూ, బూర వూదితే తిరిగి వచ్చేస్తుంది. మోకాళ్ళ మీద నడుస్తుంది".

అని చెబుతూ ఇళ్ళ ముందు ఆంబోతుని ఆడిస్తారు గంగిరెడ్ల వారు ఎద్దు మీద కండువ మూపురం పెట్టి...' ఆపై బొంత వేసి తాడు కడతారు. ఆపైన బొంతలు కండువాలు వేస్తారు.

'మీరు గొర్రెలు, ఆవులు కాయరా?' అని అడిగితే,' ఒక తల్లికి పుట్టిన లంబాడీలు, మార్వాడీలు వున్నారు. మార్వాడీలు బంగారం వ్యాపారం చేస్తే, లంబాడీలు ఆవులు మేపుతూ బతుకుతారు. అలాగే మాకులంలో ఒక తెగ గొర్రెలు, ఆవులు కాస్తే, మేము గంగిరెడ్లను తిప్పుతాం, ఇది మా తెగ కులవృత్తి అన్నారు. సంక్రాంతి నెల తిరిగితే ఏభైవేలు, దసరా నెల తిరిగితే పాతిక వేలు పైగా వస్తాయి.

ఇంకా వీరు ఎద్దుతో పాటు ఆవును కూడా అలంకరించి తీసుకువస్తారు. ఎద్దును రాముడుగాను, ఆవును సీతమ్మగాను ఎంచి వివాహంచేసే ఆట కడు రమ్యంగా వుంటుంది. సీత అలగటం, రాముడు బతిమాలటం అనే ఆటలు చూడవలసిందే! దీనిని ఆలుమగల అలక సీను అంటారు. ఇంకా చెడుగుడు, పులిగావు మొదలైన ఆటలను ఆడతారు. ఎద్దు రెండు కాళ్ళను తమ గుండెల మీద పట్టించుట, చెక్క స్టూలు మీద రెండు కాళు ళ్ళ పెట్టి, వెనుక కాళ్ళ సాయంతో స్టూలు చుట్టూ తిరగటం లాంటి ప్రదర్శనలు అద్భుతంగా చేస్తారు. ఈ ఆటలన్నింటి వెనుక వీరు చెప్పే సంభాషణలు ప్రేక్షకులను ఆకట్టుకుంటాయి. ఆ సంభాషణలకు అనుగుణంగా ఎద్దు, ఆవులు 'కాదు', 'ఆవును' అన్నట్లు తల ఊపుతూ ప్రదర్శనను రక్తి కట్టిస్తాయి.

గంగిరెద్దు ఆట అంటే దూ... దూ... బసవన్న ఆట.

అందుకే ఎవరూ ఏమీ చెప్పినా తల ఊపుతుంటే, 'ఎందుకురా అలా గంగిరెద్దులా తల ఊపుతావు?' అంటారు.

### పెద్దల పేర్లను పొగడటం

ప్రతి సంవత్సరం, దర్గమ్మ తీర్ధం జాతర వద్ద పెద్దలను



పొగడటం వీరి ప్రత్యేకత. అక్కడ భక్తులు స్నానాలు చేసి మరణించిన పెద్దలను పొగిడింపుచేయించుకొంటారు. పొగిడింపు కొనే వారి ఆర్ధిక స్థోమతను బట్టి ఇరవై నుంచి రెండు వందలవరూ ఇస్తారు.

పొగిడింపు కార్యక్రమంలో డోలు, శృతి, గంట ఉపయోగిస్తారు.

చూడండి....

"ప్రేమగల వాడూ... మిమ్మల్ని కేకేసి పిలిచినం...

నీ పేరు మరువకను తీతల్ని తలచినం...

ఓ...పది మంది జూడగానే మిమ్మఇన్ని తలచినం

పది మంది జూడకయ్యనీ మదిలో వున్నాం పేరు పెట్టిపిలిచినడా...

ఓ... ఏడాదికొక నాడు సొంపుగా పోగిడిమ్చి

మల్లెసరం గుడికాడే... ఆడుమ్దేదాసుల్లు

దాసుల్లో గంగరే దేవర దేవుళ్ళు

వాడండి దాసుల్లో ... నిను మరువకున్నం.

మల్లెపుడు వత్తవ.... మాటడిపోవయ్య వచ్చేవారం నాడు సవివారం పుటా"

ఇలా రాగాయుక్కతంగా పెద్దలను పొగడటం చూడాలే కానీ రాయలేము.

పగటివేషాల ప్రదర్శన

'ఆ... పొద్దున్నే రాముల వారు మీ ఇంటికి వస్తున్నాడు. దీవెలనందుకోండి

డుం...డుం.... గంగిరెద్దు దీవెన లంటే బ్రహ్మ దేవుని దీవనలు గల్గు...డుం.... డం.... డుం....

దర్మం చేసే వాళు ౖ న ం ఖ న ం తో షా ల తో బతుకుతారని...బసవన్నలు దీవించ టానికి వచ్చారు. డుం... డుం...పీ...పీ...

అంటూ, శుభ సూచక మయిన పాటను సన్నాయి తో వాయిస్తూ, అనుగుణమయిన దరువులను డోలు మీద వేస్తూ, శృతితో ఇంటి ముందు నిలబడతారు పగటివేషాల వారు.



చక్కని తలపాగా చుట్టుకొని, నల్లకోటు వేసుకొనిర రంఉ గ రంగుల గుడ్డలు, ముక్కుకు కాడా, నొసటమూడు నామాలు వుండేఅలంకరణతో నలుగురాయిదుగురు పాల్గొంటారు. అలాగే ఎద్దు కొమ్ములకు ఇనుప గొట్టాలు తగిలించి కొసవ కుచ్చులు అమరుస్తారు. మూపురం ఎత్తుగా వుండటానికి టోపీ లాంటిది తగిలించి దాని మీద రంగురంగుల చీరలు వేస్తారు. మువ్వల పట్టేడలో బొద్దు వరకడతారు. మేడలో అందెల పట్టి ముట్టేకు కట్టిన సిగమారపై రంగుల పూలతో కట్టిన తాళ్ళు... ఇలా తోచిన విధంగా అలంకరిస్తారు.

శ్రోతల కోరిక మీద పౌరాణిక సంఘీక నాటకాలలోని పద్యాలూ పాడతారు.

ముందుగా...

"ఒరగారు... మేము గంగిరెడ్ల వారం. ఈ గంగారెద్దు ఇప్పుడే వచ్చింది కదండి. కృత యుగంలో గజాసురుడను రాక్షసుడు,.............అని మొదలు పెట్టి పద్యాలూ, శ్లోకాలు, పాటలతో రసరంజకంగా ఆ వృత్తాంతం చెపుతారు.

ఆ తరువాత ఈ బసవేసునితో ఆట ఆడుతామండి అంటటూ సన్నాయి, డోలు వాయిస్తూ గంగిరెద్దును ఆడిస్తారు. చివరకు నూతన వస్త్రాలు గానీ ద్రవ్యం గానీ దనానం చేయమని అడుగుతారు. ఈ రోజుల్లో డబ్బులే ఎక్కువగా ఇస్తారు కాబట్టి 'డబ్బిచ్చాడు మా సేటుగారు, శుభోజ్జయం కలగాలి సేటు గారికి. సబవన్న దీవెనలు అందుకోండి" అని చెప్పి మరో ఇంటికి వెళ్తారు.

## సామాజిక అంశం

పశువుకు పట్టం కట్టటం, పూజించటం అనే విషయంలోనే 'పశుపోషణ' ఆవశ్యకత తెలుస్తోంది. వ్యవసాయం మన ప్రధాన పంట. పాలు, పెరుగు, వెన్న, నేయి, మన నిత్య భోజన పదార్థాలు. వ్యవసాయంలో ఎద్దులు, పొలం దున్నటానికి బండి కట్టటానికి అవసరం. ఆవుల ద్వారా పాడిపరిశ్రమ అభివృద్ధి చెందుతుంది. పశు సంతతిని అభివృద్ధి కాబట్టి "డబ్బిచ్చాడు మా సేటుగారు, శుభోజ్జయం కలగాలి సేటుగారికి. బసవన్న దీవెనలు అందుకోండి" అని చెప్పి మరో ఇంటికి వెళ్తారు.

అలాగే గంగిరెద్దుల కథ ద్వారా, అందరికి కావలసిన దానిని ఎవరో ఒక్కరే బంధించి ఉంచకూడదని తెలియచేస్తోంది. అలాంటి సందర్భాలలో మిగిలిన వారందరూ ఏకమై ఆ ఒక్కరిని హతమార్చి అయినా బంధవిముక్తం కానించి, అందరికి అందుబాటులో వుంచాలని బోధిస్తోంది.

ప్రజలకు దక్కవలసినవి దక్కకపోతే ఎలా సాధించుకోవాలో 'ప్రేరణ' కలిగిస్తుంది.

సామాన్య ప్రజల కోసం ప్రజలచే ఎన్నుకోబడిన ప్రభుత్వం అనేక పథకాలను రచించి ప్రవేశపెడుతుంది. వాటిని తెలుసుకోవటం, అమలు పరచుకోవడానికి తగిన చైతన్యాన్ని కలిగి వుండటం ప్రజల బాధ్యత కూడా!

అవసరమైతే అధికారులను, రాజకీయ నాయకులను నిలదీసి, తమకు దక్కవలసినదాన్ని దక్కించుకోవాలి ప్రజలు.

64కళలు.కామ్
www.64kalalu.com
సకల కళల సమాహారం

సంపుటి :1 సంచిక :6 ఏప్రిల్ 2011



## శుభాకాంక్షలు...

64కళలుడాట్‌కామ్ ఐదు నెలలు పూర్తిచేసుకొని ఆరవ నెలలో ప్రవేశించింది. మెనూ గ్యాలరీలో వున్న నాలుగు విభాగాలకు, లైబ్రరీకి కూడా ఎప్పటికప్పుడు కొత్తవి చేర్చడం జరుగుతుంది. అలానే ఈ-ట్యూన్స్ కూడా గమనించగలరు. అప్‌డేట్ అయిన పేజీలు కాకుండా పాతపేజీలు కనిపిస్తుంటే మీ కీబోర్డ్‌లోని F5 ప్రెస్ చేయండి. పుస్తకపరిచయం కోరుకొనేవారు తమ పుస్తకాలను రెండు ప్రతులు పంపాలి.

పత్రికలో వ్యాసాలు బాగున్నాయని అభిమానంతో ఇ-మెయిల్స్ ద్వారా అభిప్రాయాలు తెలియజేస్తున్న పాఠక, కళాభిమానులకు కృతజ్ఞతాభివందనాలతో...

పాఠకులకు శ్రీఖరనామ ఉగాది శుభాకాంక్షలు.

**కళాసాగర్**
ఎడిటర్

### నివాళి

*తెలుగు చలనచిత్ర, నాటకరంగ నటుడు*
*శ్రీనూతన్ ప్రసాద్‌గారి మరణానికి 64కళలుడాట్‌కామ్*
*ప్రగాఢ సంతాపాన్ని ప్రకటిస్తోంది*

ముఖచిత్రం చిత్రకారుడు : **రవివర్మ**



### మే సంచిక నుండి...

పముఖ చిత్రకారుడు, కార్టూనిస్టు బాలి గారి కళాయానంలో జరిగిన అనేక విషయాలను నెల,నెలా మనతో పంచుకోనున్నారు. ధారావాహికంగా...

*ఈ సంచిక లోని రచనల్లో ఆయా రచయితలు వెలిబుచ్చిన భావాలు వారి సొంత భావాలు మాత్రమే*

# నా గురించి నేను...



## కుమారి రాగతి పండరి

***తొలి తెలుగు మహిళా కార్టూనిస్టుగా గత నాలుగు దశాబ్దాలుగా పాఠకులను అలరిస్తున్న కుమారి రాగతి పండరి తన జీవన గమనాన్ని - కార్టూనిస్టుగా స్వయంకృషితో ఎదిగిన వైనాన్ని "నా గురించు...నేను" పేరుతో అక్షరీకరణ చేసారు. 64కళలు.కామ్ లో ధారావాహిక రూపంలో నెల-నెలా ...***



కుమారి రాగతి పండరి

శ్రీ జయదేవ్‌గారి కార్టూన్ల బుక్ వచ్చిన విషయం తెలిసి, ఈ సారి షాపింగ్‌కి వెళ్లినప్పుడు కొని తెచ్చుకోవాలనుకొన్నాను. ఈ లోగా శ్రీ బి.ఎస్.రాజుగారు మా ఇంటికి వచ్చినప్పుడు తాను జయదేవ్‌గారి కార్టూన్ బుక్‌పై సమీక్ష రాయబోతున్నానని, 'విశ్వచిత్రకళ' సంపాదకులు శ్రీ చలపతిరావుగారు రాయమన్నారని చెప్పారు. జయదేవ్‌గారి కార్టూన్ బుక్ నన్ను చూడమని ఇచ్చారు. రెండు రోజుల్లో తీసుకువెళ్తానని చెప్పారు. ఆ కార్టూన్ బుక్ ఆనందంతో అందుకొన్నాను. ఇక ఆ రోజంతా ఆయన కార్టూన్ బుక్ చూస్తూ ఉండిపోయాను. ఎంతో నీట్‌గా, ఎంతో భావానుగుణంగా వేశారు. బొమ్మలు. కార్టూన్లంత గజిబిజి కాకుండా రావాల్సినంత వరకే నాజూకైన గీతలతో బొమ్మలు ఎంతబాగా వేస్తారో, కాప్షన్‌లూ అంత ఆనందంగా రాస్తారు జయదేవ్‌గారు. అది నాకు చాలా నచ్చుతుంది. ఆయన నన్ను అభిమాన శిష్యురాలిగా పేర్కొనడం మరపురాని ఆనందం. ఆ కార్టూన్ బుక్‌లో శ్రీ మోహన్‌గారు వేసిన జయదేవ్‌గారి కేరికేచర్స్ ఒక హైలైట్. జయదేవ్‌గారి కార్టూన్ పుస్తకం చూశాక నాకు పిండివంటలతో భోజనం చేసినట్టు కడుపునిండిపోయింది. మంచి రచన చదివాక బాగా భోంచేసినట్టుండాలి అన్న శ్రీ ఆరుద్రగారి సుభాషితం గుర్తొచ్చింది. మార్చినెల విశ్వచిత్రకళలో జయదేవ్‌గారి కార్టూన్ పుస్తకం మీద రాజుగారు చక్కటి సమీక్ష చదివి చాలా ఆనందించాను.

రోజులు, నెలలు, సంవత్సరాలు దొర్లిపోతూనే ఉన్నాయి. ఈ



మధ్యకాలంలో నేను నిర్విరామ కృషితో కార్టూన్ రంగంలో ముందుకు దూసుకుపోతూనే ఉన్నాను. వందలు, వేలుగా నా కార్టూన్లు పత్రికల్లో ప్రచురించబడసాగాయి. రాగతి పండరి అంటే ఒక ప్రముఖ కార్టూనిస్టుగా అటు పత్రికా రంగంలోను, ఇటు పాఠకుల మనసుల్లోను సుస్థిర స్థానం సంపాదించుకోగలరు అని నిరూపించగలిగాను. వివిధ కార్టూన్ పోటీల్లో బహుమతులు గెలుచుకొన్నాను. విశాఖలో ఏదో ఒక సంస్థ వారు సన్మాన సత్కారాలంటూ పిలిచేవారు. వారి అభిమానాన్ని కాదనలేక వెళ్తుండేదాన్ని . అలాగే ఒకసారి అనకాపల్లిలో రోటరీ క్లోబ్ వారు నన్ను ఆహ్వానించి, ఘనంగా సన్మానించి, నా కార్టూన్ల ఎగ్జిబిషన్ పెట్టారు. ఆకాశవాణిలో ఇద్దరమ్మాయిలుతో నేను రాసిన చిన్నచిన్న హాస్య నాటికలు ప్రసారం అయ్యాయి. ఒకటి రెండు హాస్యకథలు నేను రాసినవి, నేనే స్వయంగా రేడియో స్టేషన్‌కు వెళ్లి చదవడం జరరిగింది.




పోలియోతో ఏ అవయవ లోపం వచ్చినా ఆధునికమైన చికిత్సతో వైద్యులు సరిచేసి మామూలు మనుషులతో సరి సమానంగా తమ విధులను నిర్వర్తించుకొనే అవకాశం కల్పిస్తున్నారు. కార్లు, స్కూటర్లు నడపడమే కాదు. రైళ్లు, బస్సులు, విమానాలు సైతం అవలీలగా ఎక్కగలిగే సామర్థ్యం ఈనాడు ఉంది

ఆంధ్రప్రభ వీక్లీలో నేను, ఎల్యూ నారాయణరావు గారి సహకారంతో అయ్యోపాపం అబ్బాయిలు, యవ్వనం పిలిచింది కార్టూన్ కథలు వేశాను. అవి సీరియల్స్‌గా ఒక్కొక్కటీ ఆరు వారాల పాటు వేశారు. ఆ తర్వాత నేను ఎల్యూ నారాయణరావుగారి సహకారంతో దెయ్యాలు ఎక్కడున్నాయి..? అనే మంచి సస్పెన్స్ హాస్య కార్టూన్ కథ ఇద్దరమ్మాయిలతో వేసి పంపించాను. ఆ దెయ్యాలు ఎక్కడున్నాయి...? కార్టూన్ కథ ప్రభ వీక్లీతో 24 వారాలపాటు సీరియల్‌గా వేశారు. ఆ కార్టూన్ సీరియల్ బావుందంటూ ఎంతో మంది ఉత్తరాలు రాశారు. అదికాక యువ, జ్యోతి, ఆంధ్రభూమి, ఆంధ్రజ్యోతి పత్రికల్లో నా కార్టూన్లు, కార్టూన్ కథలు, ఫుల్‌పేజీ కార్టూన్లు కుప్పలు తెప్పలుగా వస్తుండేవి. అదేవిధంగా ఆంధ్రభూమి ఆదివారం డెయిలీలో నేను చాలాకాలం ఇద్దరమ్మాయిలు స్ట్రిప్ కార్టూన్లు వేశాను. తర్వాత కాలేజీ గర్ల్ స్ట్రిప్ కార్టూన్ ఫీచర్ మొదలు పెట్టాను. అది కూడా చాలాకాలం కంటిన్యూ చేశారు. మీరు కాలేజీకి వెళ్లకుండానే అంత బాగా కాలేజీ గర్ల్ కార్టూన్లు ఎలా వేయగలుగుతున్నారు. అని కొందరు నన్ను ప్రశ్నించేవారు. తాగుబోతుగా నటించాలంటే తాగనక్కర్లేదుకదా...? అలాగే దేనికైనా అవగాహన ఉంటే చాలు. ఆ పనిని విజయవంతంగా నిర్వహించగలం అన్నాను.

ఇలా కార్టూన్ ప్రపంచంలో నేను పూర్తిగా మునిగిపోయాను. నడకమీద శ్రద్ధ చూపించలేకపోయాను. అన్ని పత్రికల్లో నా కార్టూన్లు వస్తూ ఉండడంతో ఎప్పటిప్పుడు కొత్త ఐడియాలు ఆలోచించడంతో, అవి వేసి పత్రికలకు పంపించడంలో యమ బిజీగా ఉండేదాన్ని. నడకమీద సాధన, ఇంకా ఇంప్రూవ్ చేసుకొని బయట ప్రపంచంలో కూడా బాగా తిరగాలి అనే కోరిక, ఆశ నాకు ఏమాత్రం ఉండేవి కావు. ఈనాడు వైద్యపరంగా ఎన్నో ఆధునికమైన చికిత్సావిధానాలు, ఆపరేషన్లు ఉన్నాయి. పోలియోతో ఏ అవయవ లోపం వచ్చినా ఆధునికమైన చికిత్సతో వైద్యులు సరిచేసి మామూలు మనుషులతో సరి సమానంగా తమ విధులను నిర్వర్తించుకొనే అవకాశం కల్పిస్తున్నారు. కార్లు, స్కూటర్లు నడపడమే కాదు. రైళ్లు, బస్సులు, విమానాలు సైతం అవలీలగా ఎక్కగలిగే సామర్థ్యం ఈనాడు ఉంది. అయితే సాధన, పట్టుదల, ఆత్మస్థైర్యం ఉండాలి. ఆర్థోపెడిక్ డాక్టర్ ప్రొఫెసర్ కైలాసరావుగారు నాతో అదే అంటారు. నేను నడక మీద పెద్దగా శ్రద్ధ చూపించకపోవడం వలనే అభివృద్ధి సాధించలేక ఇబ్బంది పడుతున్నానని మందలిస్తుండేవారు.

కాలం ఎప్పుడూ ఒకలాగ ఉండదు కదా... ఎన్నో మార్పులు,

చేర్పులు వస్తుంటాయి. రానురాను టీవీ ప్రసారాల ప్రాముఖ్యత పెరిగి పాఠకులు, ప్రేక్షకులు అయిపోసాగారు. పుస్తకాల డిమాండ్ తగ్గింది. నిలదొక్కుకోవడం కష్టమైంది. యువ, జ్యోతి, పత్రిక మొదలై పుస్తకాలు రావడం ఆగిపోయాయి. ఉన్న బుక్స్‌కి సేల్స్ తగ్గిపోయాయి. వస్తున్న పుస్తకాల్లో కార్టూన్ల సంఖ్య తగ్గించి సేల్స్ పెరగడం కోసం సినిమా బిట్స్ పెంచసాగారు. నా కూర్టూన్ల ఉధృతం తగ్గిపోయినా, ఆగిపోలేదు. నేను కార్టూన్లు వేస్తూనే ఉండేదాన్ని. అవి పత్రికల్లో వస్తూనే ఉండేవి. విశాలాంధ్ర పబ్లిషర్స్ మేనేజరుగారు మా ఇంటికి వచ్చి మాట్లాడారు. నేను వేసిన రెండు వందల కార్టూన్లు పుస్తకంగా వేశారు.

"నవ్వుల విందు–కార్టూన్ల పసందు" అన్న పేరుతో, ముఖ చిత్రం నేనే వేశాను. ఇటీవల ఆ కార్టూన్ బుక్‌ను స్కాన్ చేసి వెబ్‌లో ఉంచి ప్రపంచ ప్రజానీకం వారి అవసరాల నిమిత్తం వినియోగించుకోవడానికి నా అనుమతి కోరుతూ పౌరగ్రంథాలయ శాఖ ఎక్స్ అఫిషియో ప్రచురణల రిజిస్ట్రార్, హైదరాబాద్ నుండి లెటర్ రావడం నాకు ఎంతో ఆనందం కలిగించింది. ఆ రోజుల్లో హైదరాబాదు నుండి క్రోక్విల్, హాస్య ప్రియ పత్రికలు వస్తుండేవి. వారి కోరికపై నేను ఆ పత్రికల్లో "అంకాలమ్మ–అడవిలో" అనే కార్టూన్ కథ ఇద్దరమ్మాయిలతో సీరియల్‌గా వేశాను. రమక్క ఎంఏ హిందీ చేసి ఆ తర్వాత తెలుగులో రాచకొండ విశ్వనాథశాస్త్రిగారి కథలు, హిందీలో యశుపాల్‌గారి కథలు తీసుకొని పిహెచ్‌డి చేసి గోల్డ్ మెడల్ సాధించింది. ప్రస్తుతం హిందీ లెక్చరర్‌గా జాబ్ చేస్తూ తన రచనా వ్యాసంగాన్ని కొనసాగిస్తోంది.

కొన్నాళ్ల క్రితం విశాఖలో 'హరి' గారి సారధ్యంలో 'వికాసం' పేరిట కార్టూన్ సమావేశాలు, ప్రదర్శనలు నిర్వహించేవారు. హరి, రాంబాబు గార్లు కలిసి చక్కగా నిర్వహించేవారు. కార్టూన్ల ఎగ్జిబిషన్‌కు నేను కూడా కార్టూన్లు వేసి ఇచ్చేదాన్ని. ఆ తర్వాత హరి హైదరాబాదు వెళ్లడంతో ఆ మీటింగులు అయిపోయాయి. హైదరాబాదులో ఫోరం ఫర్ పొలిటికల్ కార్టూన్స్ వారు నిర్వహించిన కార్టూన్ల పోటీలో రెండు సార్లు నేను ప్రత్యేక బహుమతులు గెలుపొందడం జరిగింది. మద్రాసు తెలుగు అకాడమీ వారు నన్ను ఉగాది పురస్కారానికి ఆహ్వానించినప్పుడు వదిన సహకారంతో మద్రాసు వెళ్లాను అక్కడ మా బంధువుల ఇంట్లో దిగాను. ఆ ప్రయాణం నాకొక మధురమైన జ్ఞాపకం.

చిన్నప్పుడు ఎప్పుడో అమ్మతో అమ్మమ్మ గారి ఊరు వెళ్లినప్పుడు రైలెక్కాను మళ్లీ ఇన్నాళ్లకు రైలు ప్రయాణం చేస్తుంటే చాలా సంతోషంగా మనసు గాలిలో తేలిపోతున్నట్లు అనిపించింది. మద్రాసులో ఉగాది పురస్కార్ ఫంక్షన్ చాలా బాగా జరిగింది. అప్పటి ఆంధ్రప్రదేశ్ గవర్నర్ శ్రీ రంగరాజన్‌గారి చేతుల మీదుగా ఉగాది పురస్కారాన్ని అందుకొన్నాను. చప్పట్లతో హాలు దద్దరిల్లిపోయింది. ఆ తర్వాత గవర్నర్ గారి సతీమణి శ్రీమతి హరిప్రియ రంగరాజన్ గారు స్వయంగా నా దగ్గరకి వచ్చి అభినందించడంతో నాకు చెప్పలేనంత ఆనందం కలిగింది. అక్కడ నా కార్టూన్ల అభిమానులు కొందరు కలిశారు. నాతో మాట్లాడి ఫొటోలు దిగారు. అక్కడ ప్రోగ్రాంలో ఉగాది పురస్కారం నిమిత్తం వచ్చిన సినీ ప్రముఖుల్ని, పెద్దల్ని కలుసుకోవడం, ముఖ్యంగా తనికెళ్ల భరణి, ఎవిఎస్, గుండు హనుమంతరావు తదితరులతో మాట్లాడడం, ఫొటోలు దిగడం, ఆటోగ్రాఫ్‌లు తీసుకోవడం చాలా సరదాగా గడిచింది.

చిన్నప్పుడు ఎప్పుడో అమ్మతో అమ్మమ్మ గారి ఊరు వెళ్లినప్పుడు రైలెక్కాను మళ్లీ ఇన్నాళ్లకు రైలు ప్రయాణం చేస్తుంటే చాలా సంతోషంగా మనసు గాలిలో తేలిపోతున్నట్లు అనిపించింది.




ఈ సందర్భంగా నాకెంతో సహకారం అందించిన వదినకు నేనెంతో కృతజ్ఞురాలిని. అవార్డు అందుకొన్నాక అక్కడ టీవీ వాళ్లు, పత్రికవాళ్లు, నన్ను ఇంటర్వ్యూ చేశారు. నా కార్టూన్లు పత్రికల్లో ఎంత ఉధృతంగా వచ్చేవో, నా గురించి ఇంటర్వ్యూలు, పరిచయాలు, అలానే వస్తుండేవి. ఇటీవల ఈనాడు విశాఖ ఎడిషన్‌లో లైఫ్‌స్టైల్ రాగతిపండరి కార్టూన్లే ఆమె ప్రపంచం అంటూ ఫొటోలతో నా ఇంటర్వ్యూ వచ్చింది. ఆ




కాకపోతే ప్రథమ సంచిక నుండే నా గురించి నేను శీర్షిక రాయమని కోరినప్పుడు మాత్రం చాలా కంగారు పడ్డాను. పత్రికలకు ఇంటర్వ్యూలు ఇవ్వడం అలవాటే కానీ, ఇలా నా గురించి నేను రాసుకోవడం నా వల్ల అయ్యేపని కాదని సున్నితంగా తిరస్కరించబోయాను. కానీ చలపతిరావుగారు వప్పుకోలేదు. మీరు రాయగలరు, రాయాలి అంతే... అంటూ ఎంకరేజ్ చేశారు. వారితో పాటు వచ్చిన బి.ఎస్. రాజుగారు కూడా తప్పక మీరు మీ గురించి అంటు వంత పాడారు. నేను సరేననక తప్పలేదు.

ఈవిధంగా నా గురించి నేను రాయడం ప్రారంభించాను. జరిగిపోయిన రోజుల గురించి నేను కార్టూన్లు మొదలు పెట్టి ఆ మధురమైన జ్ఞాపకాలను మళ్లీ మళ్లీ గుర్తుచేసుకొటూ, ఒక్కొక్క మెట్టూ ఎక్కుతూ కార్టూన్ రంగంలో నేనెలా పైకెక్కిందీ, అందుకు నాకు ఎంతగానో సహాయ సహకారాలు అందించిన హితులు, సన్నిహితులు, అభిమానులు, ఆత్మీయులు, స్నేహితులు, పెద్దలు, సంపాదకులు, పత్రికలు, విలేకరులు, అభిమాన పాఠకులు, అమ్మ, అన్నయ్య, వదిన, అక్కయ్యలు, మేనకోడళ్ళు, ఇలా ఎందరి గురించో కాకుండా నా గురించి నేను చెప్పుకొనే అవకాశం లభించింది. పత్రికల్లో కుప్పలు తెప్పలుగా పడుతున్న నా కార్టూన్లను చూసుకొని ఆనందంతో పొంగిపోయిన ఆ రోజుల్ని మళ్లీ మళ్లీ గుర్తు

తర్వాత, ఆంధ్రజ్యోతిలో కార్టూన్ల రారాణి రాగతి పండరి, అంటూ ఇంటర్వ్యూ ప్రచురించారు. ఆంధ్రప్రభ వేదిక వీర్షికలో నలుగురికీ నవ్వులు పంచే కార్టూనిస్టు రాగతిపండరి అంటూ పరిచయం వేశారు. అధికాక మరలా ఆంధ్రజ్యోతి వారు అపాయింటుమెంటు తీసుకొని ఫొటోగ్రాఫర్‌తో సహా వచ్చి మెయిన్ ఎడిషన్ కోసం నా ఇంటర్వ్యూ తీసుకొని వెళ్లారు. ఈ విధంగా ఎప్పుడూ ఏదో ఒక పత్రికవారు నా ఇంటర్వ్యూ కోసం రావడం, నేను వారికి నా గురించి చెప్పడం అలవాటే కానీ విశ్వచిత్రకళలో ఈ విధంగా నా గురించి నేను రాయడం మాత్రం ఇదే మొదటిసారి. ఒక ఏడాది పాటు నేను ఈ శీర్షికను రాయగలిగానా... అని ఆశ్చర్యం కలిగింది. సరిగ్గా విశ్వచిత్రకళా ప్రారంభానికి ముందు పత్రిక గౌరవ సంపాదకులు చలపతిరావుగారు స్వయంగా మా ఇంటికి వచ్చి చిత్రకళ పత్రికకు కార్టూన్ల కోసం మా ఇంటికి వచ్చి కార్టూనిస్టుల కోసం, చిత్రకారుల కోసం, శిల్పుల కోసం పత్రిక పెడుతున్నామని చెప్పినప్పుడు నేను చాలా ఆనందించాను. వారి ప్రయత్నం విజయవంతం కావాలని మనసారా కోరుకొన్నాను. కార్టూన్ల పరంగా వారికి నా సహకారం పూర్తిగా ఉంటుందని చెప్పాను.



చేసుకోగలిగాను.

నేను కార్టూన్లు ప్రారంభించి రోజులు, నెలలు, సంవత్సరాలు గడిచిపోయాయా... అని ఆశ్చర్యపోతూ–నేను వేసిన కార్టూన్లు పదులు, వందలు, వేలు ఎలా అయ్యాయో అని విస్తుపోతూ నా గురించి నేనులో రాసుకొన్నాను. నేను ఎన్నో ఇంటర్వ్యూల్లో చెప్పని విషయాలు, సంగతులు, సమాచారాలు, సంతోషాలు, సరదాలు ఇందులో రాసుకొన్నాను.

బాల్యం వీడని వయసులో కార్టూన్ కలం పట్టిన ఆ రోజులు తిరిగొచ్చి నాలో మరింత పట్టుదల పెంచిన కార్టూన్లు మొదటి కార్టూన్ పడినప్పుడు కలిగిన ఆనందం రెమ్యూనరేషన్ మొదటిసారిగా తీసుకొన్నప్పుడు నాలో కలిగిన ఆశ్చర్యం అభిమానుల ఉత్తరాల సందడి అవార్డులు అందుకొంటున్నప్పుడు కలిగిన అనుభూతి–ఇలా ఎన్నో ఎన్నెన్నో విషయాలు ఈ శీర్షికలలో చెప్పుకోగలిగాను. ఇంత గొప్ప అవకాశం కల్పించిన చలపతిరావుగారికి నా హృదయపూర్వక ధన్యవాదాలు తెలియజేసుకొంటున్నాను. అలాగే ప్రతీ నెలా నేను రాసే ఈ శీర్షికను చదివి తన అభిప్రాయాన్ని నిర్మొహమాటంగా చెప్పే మిత్రులు శ్రీ బి.ఎన్. రాజుగారికి ధన్యవాదాలు తెలియజేసుకొంటున్నాను. అంతేకాక పత్రిక ఎడిటర్ కళాసాగర్ గారికి, నా గురించి నేను చదివి తమతమ అభిప్రాయాలు తెలిపిన మిత్రులు, కార్టూనిస్టులు అందరికి నా ధన్యవాదాలు తెలియజేసుకొంటున్నాను.

నిజానికి నా మనసు ఒక తెరవని పుస్తకం. నా మనసులో భావాలు, బాధలు, ఆలోచనలు, ఆనందాలు, ఎవరికీ చెప్పడం నాకిష్టం వుండదు. నా గురించి నేనులో చాల వరకు నా గురించి రాస్తూ నా మనసు విప్పిచెప్పడం జరిగింది. కష్టాలు అనేవి ప్రతివారికీ వుంటాయి. జీవితంలో సుఖదు:ఖాలు లాగే నవ్వు, ఏడుపులు మనిషి జీవితంలో ముఖ్యం. అసలు కష్టాలు, కన్నీళ్లు లేని జీవితం సారంలేని చెరుకురసం లాంటిదని నా అభిప్రాయం. విచారాన్ని చవిచూసినప్పుడే కదా ఆనందం విలువ తెలిసేది. కాకపోతే ఆ విచారాన్ని పక్కకు నెట్టి నిండుగా నవ్వగలిగితే ఆ మనిషి సాధించలేనిది ఏదీలేదు. 'ఈసురోమని మనుషులుంటే దేశమే గతి బాగుపడునోయ్' అన్నారు మహాకవి గురజాడ. విధివశాత్తు శారీరక లోపాలకు గురై బాధపడేవారికి నాదో చిన్నమాట తాము బాధపడుతూ ఇతరులను బాధపెట్టే బదులు ఆసక్తి ఉన్నరంగంలో ప్రతిభను పెంచుకొని ముందుకు సాగాలి. అప్పుడే ఏ విచారం దరిచేరదు. నాకీ జీవితంలో ఎనలేని ఆనందాన్ని ఇచ్చింది కర్టూన్ కళ. కార్టూన్ల ద్వారా ఆర్థికపరంగా సంతృప్తి కలగకపోయినా... పేరు ప్రఖ్యాతులు ద్వారా, వెలకట్టలేని అభిమానుల అభిమానం ద్వారా ఎంతో ఆనందానుభూతుల్ని పొందగలిగాను.

*చివరి భాగం రాబోయే సంచికలో...*



# స్నేహం మలచిన చిత్రకారుడు - సురేన్ద్ర



అక్షరరూపం దాల్చిన ఒకే ఒక్క సిరాచుక్క లక్ష మెదళ్ళకు మేత" అన్నాడు కాళోజి. అక్షరం యొక్క శక్తిని పేర్కొంటూ... మరి ఆ అక్షరానికి వ్యంగ్యంతో పాటు చురుకైన చిత్రకారుని రేఖలు కూడా తోడైతే!... అదే వ్యంగ్య చిత్రం. ఆంగ్లంలో కార్టూన్. వేయిపదాలు రాసి మెప్పించలేని గొప్ప భావాన్ని ఒక్క రేఖా చిత్రంతో ప్రేక్షకుల్ని మెప్పించగల సత్తా కార్టూన్‌కుంది. అందుకే అది ఈసురోమని ముక్కి మూలుగు ముఖాలను సైతం పక్కున నవ్వించి వేయి విద్యుత్ వాట్‌ల వెలుగులను తెప్పించడమే కాదు, అవసరమైతే అదే స్థాయిలో కారుచీకట్లు కూడా కమ్మించగలదు. వ్యవస్థలోని లోపాలను చూపించగలదు. సమాజాన్ని చైతన్యవంతము చేయగలదు.

వెంటపల్లి సత్యనారాయణ

అందుకే కార్టూన్‌లకు పత్రికలు ఒక ప్రత్యేక స్థానాన్ని కల్పిస్తున్నాయి. వార్తా ప్రపంచంలో ప్రముఖ స్థానాన్ని ఆక్రమిస్తున్న దినపత్రికలలో ప్రాంతీయ, జిల్లా రాష్ట్రస్థాయి కాక, జాతీయ స్థాయిలో, ఆ మేరకు వస్తే ఇతర దేశాలలో భారతీయ దినపత్రికలను గూర్చి మాట్లాడదలిస్తే ముందుగా ఏ దిన పత్రిక గురించి చెప్పుకుంటామో అట్లాంటి చారిత్రాత్మకమైన ఆంగ్ల దిన పత్రిక "ది హిందూ"లో దాదాపు 15 సంవత్సరాలుగా తన వ్యంగ్య బాణాలతో భారతీయులను అలరిస్తూ ఆలోచింపజేస్తున్న కార్టూనిస్ట్ మన తెలుగువాడు కావడం మనకు గర్వకారణం అతనే "సురేన్ద్ర"గా పేరు మార్చుకున్న సురేంద్రనాధ రెడ్డి.

పరిమితికి లోబడిన వ్యంగ్యం పదునైన అస్త్రంలా పనిచేస్తే అవధులు దాటిన వ్యంగ్యం వికృతంగా మారుతుంది. అది సమస్య తీవ్రతను తెలియజేయకపోగా అదనపు దుష్పరిణామాలకు కారణమయ్యేలా చేస్తుంది. అందుకే కార్టూనిస్టు తన రేఖా చిత్రణలోగానీ, భావ వ్యక్తీకరణలో గానీ చాలా సమన్వయంతో వ్యవహరించి సున్నితంగా విషయాన్ని పాఠకుని హృదయానికి హత్తుకునేలా వేయవల్సి వుంటుంది. ఈ విషయంలో అత్యంత సమర్థుడు సురేన్ద్ర.

అసలే పోటీ అంశం "రన్నింగ్‌రేస్" ఎప్పుడు స్టార్ట్ అంటారా! అమాంతం ఫినిషింగ్ పాయింట్‌కి చేరుకుని గోల్డ్ మెడల్‌ని సొంతం చేసుకోవాలా అని ప్రపంచంలోని వివిధ దేశాల నుండి వచ్చిన ప్రముఖ రన్నర్స్ ఊపిరి బిగబట్టి స్టార్టర్ విజిల్ కోసం ఆతృతతో రన్నింగ్ ట్రాక్‌పై సిద్ధంగా ఉన్నారు. ఇంతలో మైదానంలో ఎదురుగా కొద్దిదూరంలో "Men At Work Go Slow" అన్న బోర్డ్ కనిపిస్తే అక్కడ ట్రాక్‌పై దూసుకుపోవడానికి సిద్ధంగా వున్న ఆ అంతర్జాతీయ పరుగు పందెగాళ్ళ






తమిళనాడులో కూడా ఎక్కువగా ఆడతారు. "జల్లికట్టు" ఆటగా అక్కడ బాగా ప్రాచుర్యం పొందిన ఆ విచక్షణా రహితమైన క్రీడతో UPA ప్రభుత్వంలోని అడ్డూ ,అదుపులేకుండా నిరంతరం జరిగే పెట్రోలు ధరల పెంపును సూచించడానికి ఇంతకంటే గొప్ప ఉదాహరణ ఏం కావాలి?

మరొక కార్టూన్‌లో ఒక మహిళ చేత్తో కాగితం పట్టుకుని పార్లమెంట్ భవనం యొక్క అనేక గుమ్మాలలో ఒక గుమ్మం గుండా లోపలికి వెళ్తుంది తర్వాత వేరొక గుమ్మం గుండా బయటకు వస్తుంది. మరలా ఇంకొక గుమ్మం ద్వారా లోపలికి వెళ్తుంది తిరిగి వేరొక గుమ్మం ద్వారా బయటకు వస్తుంది. ఇలా గుండ్రంగా ఉన్న పార్లమెంటు భవన

మనోగతం ఎలా వుంటుంది? అక్కడ నరాలు తెగే ఉత్కంఠతతో ఆయా దేశాల రన్నర్స్ గెలుపుకోసం పోటీ దార్లకు మించి ఊపిరిబిగబట్టి గేలరీలో కూర్చుని చూస్తున్న ప్రేక్షకుల మనోభావాలు ఆ బోర్డ్ చూసినపుడు ఏవిధంగా మారిపోతాయి?

ఇటీవల మనదేశం నిర్వహించిన కామన్‌వెల్త్ క్రీడల నిర్వహణలోని లోపాలను ఎత్తిచూపడానికి ఈ ఒక్క కార్టూన్ సరిపోదా?

సూక్ష్మంలో మోక్షం అనేది ప్రామాణికతకు చిహ్నం. తక్కువగీతలతో ఎక్కువ భావాన్ని వ్యక్తం చేయడం కార్టూన్‌కున్న గొప్ప లక్షణం. నిరాడంబరత, సచ్ఛీలతలకు మారుపేరుగా నిల్చిన మన ప్రధాని డాక్టర్ మన్‌మోహన్‌సింగ్‌ను సైతం ఇటీవల దేశంలో భారీ కుంభకోణంగా పేరుగాంచిన "2జి స్పెక్ట్రమ్‌లో ఎలా ఇరుక్కునేలా చేసిందో అని చెప్పడానికి "2జి' అనే రెండు అక్షరాలను పార్లమెంటు మరియు బేడీలుగా మార్చి

గుమ్మాల గుండా లోపలికి వెళ్లడం, మరొక గుమ్మం గుండా బయటకు రావడం ఇలా తిరుగుతూనే వుంటుంది. మరి ఎంతకాలం ఇలా తిరుగుతుందో ఆమె! ఈ కార్టూన్‌ని చూస్తే మన దేశ పార్లమెంట్‌లో ఎంతో కాలంగా నానుతున్న మహిళా బిల్లు యొక్క దుస్థితి మనకు గుర్తుకురావడం లేదూ!

మనిషి జీవితాన్ని ప్రభావితం చేసే అంశాల్లో మానవ సంబంధాలు చాలా ముఖ్యమైనవి. వీటిలో మనసుతో కాక మనీతో ముడిపడిన సంబంధాలు ఎక్కువ కాలం ఉండకపోవచ్చు. కానీ మనీరహితమైన, మనస్సహితమైన సంబంధాలు మాత్రం శాశ్వతంగా వుంటాయి. వాటికి వ్యక్తుల మధ్య వయస్సు తదితర అంశాలతో పనిలేదు. కేవలం భావసారూప్యత చాలు అవి మనగలగడానికి లేకుంటే ఎక్కడో కడప జిల్లా హనుమనగుత్తికి చెందిన సురేంద్రకు ఖమ్మంలో స్థిరపడి తనకంటే

దానిలో మన్‌మోహన్‌సింగ్ కాలు ఇరుక్కుపోయేలా చిత్రించడం ద్వారా ఎలాంటి పదాల సహాయం అవసరం లేకుండానే సూటిగా, చాలా సున్నితంగా కార్టూన్‌లోని భావాన్ని ప్రేక్షకుని హృదయానికి తాకేలా చేసారు.

సామాజిక పరమైన సమస్యలను, సమాజంలో జరిగే సంఘటనలతో ముడిపెట్టి చిత్రరచన చేసినపుడు అది సులభంగా ప్రేక్షకుని హృదయానికి తాకేలా చేస్తుంది. ప్రతిభావంతుడైన కళాకారుడు దీనిని సమర్థవంతంగా వినియోగించుకుంటాడు. అడ్డూ, అదుపులేని ధౌర్జన్యానికి ప్రతీక ఎద్దు. అలాంటి ఎద్దులను రెచ్చగొట్టి వాటితో ఆడే వికృతమైన రాక్షసక్రీడ ఒక్క స్పెయిన్‌దేశంలోనే కాదు మన ప్రక్కన





## సురేన్ద్ర కార్టూన్ ప్రదర్శన

గత మార్చినెల 19వ తేదీనుండి ఏప్రిల్ 2, 2011వరకు ఇండియన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ కార్టూనిస్టు, బెంగుళూరువారి ఆధ్వర్యంలో ఇండియన్ కార్టూన్ గాలరీ బెంగుళూరులో రెండు వారాలపాటు విజయవంతంగా తన కార్టూన్లను ప్రదర్శించి కార్టూన్ ఇష్టులను అలరించారు, ఆలోచింపజేసారు.

12 ఏళ్ళు పెద్దయిన ప్రఖ్యాత చిత్రకారుడు 'కాళ్ళతోను మరియు ఆంగ్లాంధ్ర సాహిత్యాలలో మంచిపట్టున్న తన కంటే మూడేళ్ళు పెద్దయిన శ్రీనివాస్‌ప్రసాద్‌లతో స్నేహం కుదరడమేమిటి? ఆ స్నేహం మూడు దశాబ్దాలు దాటినా అంతే గాఢంగా ఇంకా అలాగే కొనసాగడమేమిటి? "పుట్టుమచ్చ" ఖాదర్ మొహియుద్దీన్ లాంటి వారిచే 1980 ఆ ప్రాంతంలో పవిత్రకూటమిగా పిలిపించుకున్న ఈ ముగ్గరి ముచ్చట్లను వినడానికి విజయవాడ వీధులన్నీ చెవులురిక్కించి మరీ ఉండేవట. సాధారణంగా సినిమాలు, షికార్లు, సరదాలతో కాలక్షేపం చేసే వయసులో వున్న సురేన్ద్రకు కేవలం వయసులోనే కాక కళ, సారస్వత, సాంస్కృతిక మరియు ప్రాపంచిక విషయాలతో కూడా అనుభవజ్ఞులైన కాళ్ళ మరియు శ్రీనివాస్‌ప్రసాద్‌ల సాహచర్యం సురేన్ద్రను ఆ కాలంలో చదివే ఇతర కళాశాల విద్యార్థులకు అతీతున్ని చేసింది. అందుకే తొలిసారిగా 1979లో విజయవాడలో కాళ్ళ మరియు శ్రీనివాస్‌ప్రసాద్‌ల కలయిక తనకి టర్నింగ్‌పాయింట్‌గా చెప్పుకుంటాడు సురేన్ద్ర. కాళ్ళ ప్రఖ్యాత చిత్రకారుడిగా ఖమ్మంలో స్థిరపడగా మరొక మిత్రుడు శ్రీనివాస్‌ప్రసాద్ ప్రస్తుతం పశ్చిమగోదావరి జిల్లా తణుకు ప్రభుత్వ కళాశాల ప్రిన్సిపల్‌గా పనిచేస్తున్నారు. సురేంద్ర అని రాయడానికి బదులుగా సురేన్ద్ర అని తన లేఖలలో సంబోధించే శ్రీనివాస్‌ప్రసాద్ యొక్క శైలినే సురేంద్ర తన తెలుగు సంతకంగా మార్చుకున్నాడు. అందుకే సురేంద్ర తన తెలుగు సంతకాన్ని " సురేన్ద్ర"గానే చేస్తాడు.



మిత్రులు శ్రీనివాస్ ప్రసాద్, కాళ్ళలతో సురేన్ద్ర

పెన్నేటి కథలు కథా సంపుటి ద్వారా ప్రాచుర్యం పొందిన శ్రీరామకృష్ణా రెడ్డి చిన్నమ్మ దంపతులకు 1962లో జన్మించిన సురేన్ద్ర కార్టూనిస్ట్‌గా మారడం అన్నది యాదృచ్ఛికంగా జరిగింది. అప్పట్లో రావిశాస్త్రిగారి కథలపై శ్రీరామకృష్ణారెడ్డిగారు రాసిన విమర్శనా వ్యాసాన్ని చదివి ముగ్ధుడైన శ్రీపురాణం సుబ్రహ్మణ్యశర్మగారు శ్రీరామకృష్ణారెడ్డిలోని ప్రతిభను గుర్తించి ఆంధ్రజ్యోతి వారపత్రికకు సబ్‌ఎడిటర్‌గా ఉద్యోగం ఇవ్వడంతో సురేన్ద్ర తండ్రి శ్రీరామకృష్ణారెడ్డి తన కుటుంబాన్ని 1978లో కడపనుండి విజయవాడకు తరలించారు. అప్పటికి ఇంటర్మీడియట్ చదువుతున్న సురేన్ద్రకు మామూలు పాఠ్యాంశాల కంటే పాఠ్యేతర విషయాలపైనే ఎక్కువగా దృష్టి వుండేది. తన తండ్రి రామకృష్ణారెడ్డి మంచి రచయితే కాక ఆంధ్రజ్యోతి వారపత్రికకు సబ్‌ఎడిటర్ కూడా కావడంతో విజయవాడలోని వారింటికి చాసో, పెద్దిబొట్ల సుబ్బరామయ్య, వేగుంట మోహన ప్రసాద్ ఇత్యాది ప్రఖ్యాతకవులు, సాహితీవేత్తలు వస్తుండడంతో వారిని చూడడమే కాక వారి యొక్క సంభాషణలను వినే అవకాశం కూడా సురేన్ద్ర కు కలిగింది. అంతేకాక శేఖర్, అరుణ్, రామకృష్ణ, తలసీరాం, శంకు, బాలి, రవిశంకర్, రాగతిపండరి వంటి వారి కార్టూనిస్టుల కార్టూన్లను సురేన్ద్ర తండ్రిగారైన శ్రీరామకృష్ణారెడ్డి సెలక్ట్ చేస్తూ వుండడంతో ప్రత్యక్షంగా వివిధ కార్టూనిస్ట్‌ల యొక్క ఒరిజనల్ కార్టూన్‌లను చూసే అవకాశం కూడా కలగడంతో క్రమక్రమంగా సురేన్ద్రకు కార్టూన్‌లపై దృష్టి ఏర్పడింది.

ఆ కాలంలోనే నేటి ప్రముఖ చిత్రకళా మేధావి, కార్టూనిస్ట్, యానిమేటర్ అయిన మోహన్ విశాలాంధ్ర దినపత్రికలో సబ్‌ఎడిటర్‌గానే




కాక ఆర్టిస్ట్‌గా కూడా పనిచేసేవారు. ఆర్టిస్ట్‌గా విశాలాంధ్ర పుస్తకాలకు ఆయన వేసిన ముఖచిత్రాలు గానీ, అతను రాసే ఒక ప్రత్యేకమైన రాతగానీ సురేన్ద్రను విస్తుపోయేలా చేసేవి. అందుకేనేమో సురేన్ద్ర కార్టూనిస్ట్‌గా కెరీర్ ప్రారంభించిన తొలినాళ్ళలో వేసిన కార్టూన్‌లపై మోహన్ ప్రభావం బాగా కనిపిస్తుంది. కానీ కాలక్రమంలో సురేన్ద్ర నదైన సొంతశైలిని ఏర్పర్చుకున్నారు. అలాగే ఆరోజుల్లో విజయవాడ ఆంధ్రజ్యోతి కార్యాలయానికి ఎదురుగా ఉన్న మైత్రి బుక్ హౌస్‌లో మంచి మంచి రంగుల బొమ్మలతో ఉండే చైనీస్ పుస్తకాలు సురేంద్రను బాగా ఆకట్టుకునేవి. అందుచేతనే సురేన్ద్ర ఎక్కువగా ఆ మైత్రి బుక్‌హౌస్‌లో ఉండేవారు. మైత్రి యజమాని శ్రీ విశ్వేశ్వరరావుగారు సురేన్ద్రను తన పెట్టే ప్రతి బుక్ఎగ్జిబిషన్‌కూ తీసుకువెళ్లడమే గాక సురేన్ద్రలోని బొమ్మలపట్ల ఆసక్తిని గమనించి "బాలకుంచె" అనిపేరు పెట్టి బాగా ప్రోత్సహించారు. మొదట్లో తండ్రి రామకృష్ణారెడ్డి ఆలోచనలు ఇస్తే వాటి ఆధారంగా వివిధ కార్టూనిస్ట్‌ల గీతల ప్రభావంతో కార్టూన్‌లు వేసేందుకు ప్రయత్నం చేసేవాడు సురేన్ద్ర. కాలక్రమంగా స్వంతంగా వేయడం, తన మొదటి కార్టూన్ ఆంధ్రభూమి వారపత్రికలో ప్రచురించడం జరిగింది. ఆ తర్వాత ఆంధ్రజ్యోతి తదితర పత్రికలలో తన కార్టూన్‌లు ప్రచురింపబడుతూ ఉండేవి.

జీవితంలో కొందరి మంచి మిత్రుల పరిచయాలు, సహవాసాలు మనిషి ఉన్నతికి ఎంతలా దోహదపడతాయో చెప్పడానికి గొప్ప ఉదాహరణ సురేన్ద్ర జీవితం.

సురేంద్ర తొలిసారిగా తన ఉద్యోగ ప్రస్తావాన్ని తన మిత్రుడు శ్రీనివాస్‌ప్రసాద్‌కి స్వయానా బావగారు మరియు ప్రస్తుత సూర్యదినపత్రిక ఎడిటర్ అయిన శ్రీ నిజం శ్రీరామూర్తిగారి సిపారస్‌పై లేఅవుట్ ఆర్టిస్ట్‌గా నెలకు రూ. 250/-జీతంపై హైదరాబాద్‌లోని శ్రీవినుకొండ నాగరాజు గారి "కమెండో" అన్న పత్రికలో ఉద్యోగం ప్రారంభించారు. హైదరాబద్‌లో నివాసం, చాలీచాలని జీతం. ఈ సమయంలోనే పవిత్ర కూటమిలో ఒకరైన కాళ్ళ సురేన్ద్రను తన మరో మిత్రుడైన గులాంగౌస్ వద్దకు పంపించారు. కమెండోలో పనిచేసిన నాలుగునెలల కాలం గులాంగౌస్ దగ్గర గడిపితే ఆ తర్వాత ఉద్యోగం లేక ఖాళీగా ఉన్న సురేన్ద్రను హైదరాబాద్‌లో అప్పటికే ఫ్రీలాన్సర్‌గా పనిచేస్తున్న శ్రీ కె. లక్ష్మారెడ్డికి పరిచయం చేసి పనిదొరికేలా చేసింది ప్రఖ్యాత చిత్రకారుడు, కార్టూనిస్ట్ అయిన మోహన్. 1983లో సురేంద్ర ఆదివారం, బాలచంద్రిక వారపత్రికలకు బొమ్మలు, కార్టూన్‌లు వేసేవారు. అదే కాలంలో బాలల అకాడమీ బాలచంద్రికకు సంబంధించిన చొక్కాపు వెంకటరమణ పరిచయం. ఆదివారం వారపత్రిక అనంతరం 1984లో ఆంధ్రభూమికి సురేన్ద్రను పరిచయం చేసిన వ్యక్తి చొక్కాపు వెంకటరమణ. ఆంధ్రభూమిలో సురేన్ద్ర 1984 నుండి 1990 వరకూ పనిచేసారు. ఆ కాలంలో గజ్జెల మల్లారెడ్డి రాజకీయ వ్యంగోక్తులుగా అల్లన కవితలకు సురేంద్ర వేసిన బొమ్మలు బాగా ఆదరణను పొందాయి. ఆ తర్వాత కాలంలో "అక్షింతలు" పేరుతో ఈ వ్యంగ్యోక్తులన్నీ పుస్తక రూపంలోకి రావడం జరిగింది. 1990 నుండి 1995 వరకూ "ఉదయం" దిన పత్రికలో పనిచేసారు. అనంతరం 1995 నుండి జూన్ 1996 వరకూ మరలా ఫ్రీలాన్సర్ గానే వుంటూ తెలుగు, హిందీ, ఇంగ్లీషు పత్రికలయిన ఆంధ్రప్రభ, హిందీ మిలాప్, మరియు సిటిజన్స్ ఈవినింగ్ అనే ఆంగ్లపత్రిక ఈ మూడింటికీ ఏకకాలంలో పనిచేసిన ఘనతను దక్కించుకున్నారు.

1996 జూన్ నుండి "దిహిందూ" ఆంగ్ల దినపత్రికలో పనిచేస్తూ చెన్నైలో స్థిరపడిన సురేన్ద్ర ఇటీవల తన మిత్రుడు "కాళ్ళను" కలిసేందుకు

వ్యాసరచయితతో సురేంద్ర, మధ్యలో చిత్రకారుడు కాళ్ళ



## సురేంద్ర గురించి...

పూర్తిపేరు : సురేంద్రనాద్ రెడ్డి

పుట్టింది : 1962, హనుమనగుత్తి, కడపజిల్లా

చదువు : బియస్సీ

తొలి ఉద్యోగం : కమెండో పత్రికలో లేఅవుట్ ఆర్టిస్టుగా (1983)

కార్టూనిస్టుగా : ఆంధ్రభూమి డైలీ (1984), ఉదయండైలీ (1990–95), ది. హిందూ డైలీ (1996నుండి)



ఖమ్మం వస్తున్న సందర్భంలో చిత్రకారుడు కాళ్ళ నాకు ఫోన్ చేసి రమ్మనడం, అంతవరకూ కాళ్ళ ద్వారా పరోక్షపరిచయం కలిగిన నాకు సురేంద్రను ప్రత్యక్షంగా కలుసుకునే అవకాశం కలిగింది. 6–2–2011 ఆదివారం నేను నా మిత్రుడు బీర శ్రీనివాస్ కలిసి కాళ్ళ ఇంట్లో, కాళ్ళ ఇచ్చిన ఆత్మీయ ఆతిధ్యంతో ఆ రోజంతా సురేంద్రతో గడిపాం. మాటల సందర్భంలో సురేంద్ర చెప్పిన విషయాలు మరొక్కసారి.

"కాళ్ళ, శ్రీనివాస్ ప్రసాద్‌ల స్నేహం నా జీవితానికి ఒక టర్నింగ్ పాయింట్. అయితే పదిశాతంగా ఉన్న నాలోని ప్రతిభను తొంభైశాతంగా మార్చింది మాత్రం వీళ్ల సహకారంతో నా జీవితంలో ఎదురుపడ్డ మరికొందరు మంచి మిత్రుల వల్ల.

ఆ సాయంకాలం కాళ్ళకు వీడ్కోలు చెప్పి సురేంద్ర తిరిగి చెన్నైకు మేము చర్లకు వెళ్లడానికి బస్టాండ్‌కు బయలు దేరుతూ మనసులో అనుకున్నాను.

"పవిత్రకూటమి–జిందాబాద్
పవిత్రస్నేహం వర్థిల్లాలని".




email: snventapalli@gmail.com

# ప్రింటింగ్ కూడా ఒక ఆర్టే

సృజనాత్మకతను ప్రదర్శించడానికి అవకాశం ఉన్న రంగం ప్రింట్ మీడియా. అక్షరాలు, ఫొటోల అమరికతో రంగులలో తయారుకాబడే డిజైన్లలో చూపరులను ఆకర్షించేవి, ఆహ్లాదపరిచేవి క్రియేటివ్ డిజైన్లే. ఇలా డిజైన్ చేయడం కూడా ఒక కళే. అందుకే వీళ్లను గ్రాఫిక్ ఆర్టిస్టులు అంటారు.

మేగజైన్లు, పోస్టర్స్, ఇన్విటేషన్స్, బేనర్స్... ఇలా ఒకటేమిటి... విజిటింగ్‌కార్డ్‌ను సైతం కళాత్మకంగా కోరుకొనే వారెందరో. కంప్యూటర్, లేజర్‌కలర్ ప్రింటర్స్ అందుబాటులోకి వచ్చాక కలర్‌ప్రింటింగ్ సామాన్యులకు కూడా దగ్గరయ్యింది. నిత్యజీవితంలో ఒక భాగమయింది.

వ్యవస్థాపక నిర్వాహకులు కృష్ణపుల్లయ్య




గూటెన్‌బర్గ్ ఆవిష్కరించిన ముద్రణాయంత్రం -ప్రపంచ చరిత్రలో ఓ మైలురాయి. పెరుగుతున్న సాంకేతికను తనలో ఇముడ్చుకుని ఎన్నో మార్పులు చెంది, నేడు కంప్యూటర్ సాయంతో పనిచేసే అధునాతన ముద్రణాయంత్రాలతో అద్భుతాలు సృష్టిస్తున్నారు. ముఖ్యంగా మన ఆంధ్రప్రదేశ్‌లో హైదరాబాద్ ప్రగతి ప్రింటర్స్, గుంటూరు శాంతి ఆర్ట్స్ (స్క్రీన్ ప్రింటింగ్) వారు అంతర్జాతీయ స్థాయిలో ఎన్నో అవార్డులందుకొని ముద్రణారంగంలో ప్రపంచ దేశాలతో పోటీ పడుతున్నారు.

ప్రింటింగ్ రంగంలో ఘన చరిత్ర కలిగిన విజయవాడలో గత మూడుదశాబ్దాలుగా క్రియేటివ్ డిజైనర్స్‌గా, క్వాలిటీ స్క్రీన్‌ప్రింటర్స్‌గా మరియు ఆఫ్‌సెట్ ప్రింటింగ్‌లో తమదైన శైలిలో సేవలందిస్తూ, కస్టమర్స్‌ను సంతృప్తి పరచడమే ధ్యేయంగా దినదినాభివృద్ధి చెందుతున్న సంస్థలు క్రిపు (KRIPU) మరియు ప్రింట్ అండ్ ప్రింట్స్. అప్లైడ్ ఆర్ట్‌లో డిప్లొమా చేసిన కృష్ణపుల్లయ్యగారు దీని నిర్వాహకులు. ముంబయి, చెన్నై నగరాలకు ధీటుగా విజయవాడలో కూడా ఒక మంచి డిజైనింగ్ సంస్థను అభివృద్ధి చేయాలన్న ఆలోచనతో ఒంటరిగా ప్రారంభమయిన వీరి ప్రయాణం మధ్యలో ఎన్నో ఆటుపోట్లను ఎదుర్కొని, నేడు నగరం నడిబొడ్డులో పదిమందికి పైగా ఉద్యోగులతో ముందుకు సాగుతుంది.

నిత్యం ప్రింటింగ్ అవసరాలకు వారి వద్దకు వచ్చేవారిని నవ్వుతూ ఆహ్వానించి, వారికి ఆలోచనలను, అవసరాలను ఇట్టే గ్రహించి-తన స్వీయపర్యవేక్షణలో డిజైనింగ్ ప్రింటింగ్ పూర్తిచేసి కస్టమర్‌ను సంతృప్తి పరుస్తారు. "అన్ని కళలలోకి గొప్పదైన కళ అందమైన నడవడి" అని నమ్మడమే కాకుండా దానిని ఆచరించి చూపుతున్న కృష్ణపుల్లయ్యగారి విజయం వెనుక కథను వారి మాటల్లో తెలుసుకుందాం.

⏭ అప్లైడ్ ఆర్ట్‌లో డిప్లొమా చేసిన మీరు ప్రింటింగ్ రంగంలో ప్రవేశించడానికి కారణం?

చిత్రకారుడు మాత్రమే కళాకారుడని కాదు. ప్రతి ఒక్కరూ తమ తమ వ్యాపకాల్లో కళాకారులే. అందుకే కదా మనకు 64 కళలు. "నేను కళగానే బ్రతుకుతున్నాను" అనాలి కళాకారుడు ఎందుకంటే అతనికి కళే నేస్తం, ప్రాణం, సర్వస్వం. ఆ కళామతల్లే తనను ఆదుకుంటుంది అన్న ధీమా.

1978 లో ఆర్టిస్టు 'క్రిపు'గా పరిచయమైన నా పేరు కె. కృష్ణ పుల్లయ్య. దావనగేరె (కర్నాటక) స్కూల్ ఆఫ్ ఆర్ట్ అండ్ క్రాఫ్ట్‌లో 5 సం॥లు అప్లైడ్ ఆర్ట్స్ కోర్సు చేశాను. వ్యాపారాలకు, పరిశ్రమలకు ఉపయోగపడే కళే అప్లైడ్ ఆర్ట్స్ కాబట్టి డిజైనర్‌గా, ప్రింటర్‌గా విజయవాడలో వ్యాపారాన్ని సాగిస్తున్నాను. సృజనాత్మకత, ప్రచార నిమిత్తమైన ఆర్ట్ వర్క్స్ చేస్తున్నందున Kriative Publicities/ Krishna Pullaiah రెండూ కలిసి వచ్చేటట్లు 'KRIPU' అనే నామంతో ఆర్ట్ వర్క్స్ చేయటం మొదలయింది.

⏭ KRIPU మరియు Print & Prints ఆవిర్భావం ఎలా జరిగింది?



నాడు మాన్యుల్ డిజైనింగ్



అప్పట్లో టీవీలు లేవు కాబట్టి ఎక్కువగా న్యూస్ పేపర్ యాడ్స్, పోస్టర్స్, పాంప్లెట్స్, బ్రోచర్స్ ద్వారా ప్రచారాన్ని సాగించేవారు. క్రియేటివ్‌గా డిజైన్స్ చేసే వారికి పుష్కలంగా వర్క్ వుండేది. ఈరోజు చేసిన డిజైన్స్ మరుసటి రోజు ఉదయమే పేపర్లలో ఎలా వచ్చాయెూ ఆత్రుతగా చూసుకునేవాళ్ళం. గోడలమీద పోస్టర్లు ఎలా కనువిందు చేస్తున్నాయో గమనించేవాళ్లం.

ఆర్ట్ కాలేజీలో చదువుకొచ్చిన ఆర్టిస్టులు ఆ రోజుల్లో విజయవాడలో లేరు. ఎక్కువగా గురుశిష్యబంధంతో నేర్చుకున్న విద్యతో డిజైన్స్ చేసేవారు. కొందరు ఎంతో నైపుణ్యత కనబర్చేవారు. ఎక్కువగా సినిమా పబ్లిసిటీ డిజైన్‌వర్క్ జరుగుచుండేది. బ్లాకులు చేసి ప్రింట్ చేయిస్తున్న రోజులు. బ్లాక్ సరిగ్గా రాకపోతే చక్కటి ఆర్ట్ వర్క్ కూడా బాగా ప్రింట్ అయ్యేది కాదు. ఆఫ్‌సెట్ అయితే బాగా వచ్చేవి.

వ్యాపారాలకు, పరిశ్రమలకు అనువైన డిజైన్స్ అన్నీ హైదరాబాద్, మద్రాస్, ముంబయిలనుండి వచ్చేవి. ఆ క్వాలిటీకి దగ్గర్లో లోకల్‌గా డిజైన్స్ చేసే వాళ్లకోసం అన్వేషిస్తున్న కొందరికి



నేడు కంప్యూటర్ డిజైనింగ్

నేను కూడా పరవాలేదనిపించాను. నేను చేసిన కొన్ని డిజైన్స్ వాళ్లకు బాగా నచ్చాయి. దానివల్ల వారికి కూడా సమయము, డబ్బు ఆదా అయ్యేది. వర్క్ పెరగటం వల్ల మరికొందరు ఆర్టిస్టులు నాతో కలిసి పనిచేశారు. లోగోస్, విజిటింగ్ కార్డ్స్, లెటర్‌పేడ్స్, లేబుల్స్, ప్యాకింగ్ డిజైన్స్, ఇన్విటేషన్స్, వెడ్డింగ్ కార్డ్స్, గ్రీటింగ్‌కార్డ్స్, పోస్టర్స్, బేనర్స్ ఇలా అన్ని రకాల డిజైన్స్ చేసేవాళ్లం. అలా డిజైన్ చేసిన ఆర్ట్‌వర్క్‌లను ప్రింట్‌రూపంలో స్వీయ ఆధ్వర్యంలో చూసుకోవాలనే ఇష్టమే "ప్రింట్ అండ్ ప్రింట్స్" ఆవిర్భావం.



*⏭ సుమారు ముప్పైయేళ్ళుగా ప్రింటింగ్ రంగంలో ఉన్నారు కదా, ముఖ్యంగా కంప్యూటర్ ప్రవేశించిన తర్వాత Printing & Designing లో వచ్చిన మార్పులు గురించి తెలియజేయండి?*

ఇప్పుడు కంప్యూటర్స్ వచ్చి వర్క్ తేలికయ్యింది. కానీ ఆ రోజుల్లో ట్రెడిల్ ప్రెస్‌లో 24 లేక మరో పెద్ద పాయింట్‌లో కంపోజ్ చేయించి ప్రింట్ తీసుకొని వాటిని లిథ్ ఫిలింపై ఎక్స్‌పోజ్ చేసి ఆ నెగెటివ్‌ని ఎన్‌లార్జర్‌తో డార్క్‌రూంలో కావలసిన సైజులో మ్యాటిబ్రొమైడ్ (ఫొటో) ప్రింట్స్ తీసుకుని వాటితో ఆర్ట్ వర్క్స్




తయారుచేసుకునేవాళ్ళం. కస్టమర్ చిన్న మార్పు చెబితే మరలా ప్రాసస్ మొదలయ్యేది. ఇలాంటి ఇబ్బందులలో వర్క్ చేసుకుంటున్నప్పుడే లెటర్ ట్రాన్స్‌ఫర్ షీట్స్ (లెటరాసేట్) రకరకాల ఫాంట్స్‌లలో వచ్చాయి. లైట్‌గా పెన్సిల్‌తో గీతలు కొట్టుకొని సరిగ్గా అదే లైన్‌మీదే ఎగుడుదిగుడు రాకుండా జాగ్రత్తగా ఒక్కో లెటర్‌ని పెన్సిల్‌తో రుద్దుతూ ట్రాన్స్‌ఫర్ చేసేవాళ్లం. వాటిని నెటెటివ్ తీసి ఫొటోప్రింట్స్ వేసుకుని కట్‌చేసి పేస్ట్ చేసుకుంటూ డిజైన్స్ చేసేవాళ్లం. ఒక్కోసారి డైరెక్ట్‌గా కావలసిన సైజు ఫాంట్స్ వాడి డిజైన్స్ చేసుకునేవాళ్లం. కొంతమెరుగే కాని వర్క్ స్లోగా జరిగేది. ఇలాంటి పత్తిల్ల మధ్య వుండగా ఆంధ్రపత్రిక, ఆంధ్రజ్యోతివారు ఫొటో టైప్ సెట్టింగ్ మెషిన్స్ తెచ్చారు. వారిని బ్రతిమాలితే ఫొటో టైప్ సెట్టింగ్ జాబ్ వర్క్ కింద చేసి ఇచ్చేవారు. 20 పాయింట్‌లోపు వర్డ్‌కి 50 పైసలు, 20 పాయింట్ నుంచి 30 పాయింట్ వరకు వర్డ్‌కి రూపాయి తీసుకునేవారు(It is a Cat ఇవి నాలుగు వర్డ్స్) వర్క్‌ను ఇంకాస్త తొందరగా ఇవ్వగలిగేవాళ్లం.

1990 ప్రాంతంలో ప్రింటింగ్ రంగంలో కంప్యూటర్ ప్రవేశంతో డెస్క్‌టాప్ పబ్లిషింగ్ అందుబాటులోకి వచ్చింది. డి.టి.పి వచ్చిన తర్వాత తక్కువ ఖర్చుతో, తక్కువ సమయంలో ఎక్కువ వర్కు క్వాలిటీగా చేయగలుగుతున్నాము. 1993లో అను ఫాంట్స్‌ప్రవేశంతో తెలుగు అక్షరాలతో ఆకర్షణీయంగా డిజైన్స్ చేసుకోవడం సులువైంది. అంతేకాకుండా స్వతహాగా కంప్యూటర్స్, స్కానర్, ప్రింటర్ వంటివి ఏర్పాటు చేసుకోగలిగాము. అయితే అప్పటి

*లెటర్ ట్రాన్స్‌ఫర్ షీట్స్ (లెటరాసేట్) రకరకాల ఫాంట్స్‌లలో*


బేబి ఆఫ్‌సెట్ మెషిన్



*మీ కుటుంబం గురించి తెలియజేయండి?*

నాకు తోడునీడైన నా సహధర్మచారిణి 'పద్మజ'. మాకు ఇద్దరబ్బాయిలు. పెద్దబ్బాయి 'రవికృష్ణ' బార్న్‌మాత్ యూనివర్శిటీ, యూకేలో MDE (Master in Digital Effects) చేస్తున్నాడు. చిన్నబ్బాయి 'సాయికృష్ణ' JNTU వారు సర్టిఫై చేయు నాలుగేళ్ళ బ్యాచిలర్ ఆఫ్ మల్టీమీడియా కోర్సు IACG (Hyd)లో గేమ్ డెవలప్‌మెంట్ స్పెషలైజేషన్‌తో చేస్తున్నాడు.



వరకు పనిచేస్తున్న మాన్యువల్ ఆర్టిస్టులకు చేతిపని బాగా తగ్గింది. వారిలో కొందరు కంప్యూటర్ ఆపరేటింగ్ నేర్చుకొని డిజైనర్స్‌గా రాణిస్తున్నారు. ఆర్టిస్టులే కంప్యూటర్‌ని ఆపరేట్ చేసిన చోట నాణ్యత, క్రియేటివిటీ బావుంటుంది. ప్రస్తుతం డి.టి.పి నేర్పే సంస్థలు సాఫ్ట్‌వేర్ హేండ్లింగ్ నేర్పుతున్నారేగాని, డిజైనింగ్‌లోగాని, కలర్స్ గురించి గాని సరియైన శిక్షణ ఇవ్వలేకపోతున్నారు. చిత్రకళలో ప్రవేశం, సృజనాత్మకత వున్నవారు డి.టి.పి. నేర్చుకొంటే మంచి డిజైనర్‌గా రాణించగలరు.

*KRIPU అంటే ముఖ్యంగా స్క్రీన్ ప్రింటింగ్‌కు ప్రఖ్యాతి (విజయవాడలో) కదా, ప్రస్తుతం స్క్రీన్‌ప్రింటింగ్‌కు ఆధరణ ఉందా?*

పదేళ్ల క్రితం వరకు స్క్రీన్‌ప్రింటింగ్‌కు బాగా డిమాండ్ వుండేది. కంప్యూటర్ ప్రవేశంతో ఆఫ్‌సెట్ ప్రింటింగ్‌లో క్వాలిటీ పెరిగింది. బేబి ఆఫ్‌సెట్ మెషిన్‌ల ప్రవేశంతో స్క్రీన్‌ప్రింటింగ్‌కు కొంత ఆధరణ తగ్గిందనే చెప్పాలి. నేటికీ మా వద్ద స్క్రీన్‌ప్రింటింగ్ వర్క్ జరుగుతూనే ఉంది. వెడ్డింగ్ కార్డ్స్, ఇన్విటేషన్స్, విజిటింగ్‌కార్డ్స్ లాంటివి స్క్రీన్‌ప్రింటింగ్ ద్వారా చేస్తాము.

స్క్రీన్‌ప్రింటింగ్ చేస్తున్న యూనిట్ సభ్యులు,





*⏭ ఇంటర్‌నెట్ అందుబాటులోకి వచ్చిన తరువాత కమ్యూనికేషన్ సులువైనది కదా, దీనిని మీరు ఏవిధంగా ఉపయోగించుకుంటున్నారు?*

బయట ప్రదేశాల నుండి మా వద్దకు డిజైనింగ్ కోసం వచ్చేవారికి శాంపిల్ డిజైన్‌లను మెయిల్‌ద్వారా పంపించడం జరుగుతుంది. వాటిల్లో మార్పులు, చేర్పులను కస్టమర్ ఫోన్ ద్వారా చెబితే మేము కరెక్ట్ చేసి ప్రింట్ చేస్తున్నాము.

కొన్ని జాబ్‌వర్క్‌ ఇతర దేశాల వారివి కూడా ఆన్‌లైన్ ద్వారా చేయడం మాకెంతో గర్వకారణం. ఎందుకంటే కొన్ని ఫారిన్ దేశాలతో పోల్చితే ఇండియాలో ప్రింటింగ్ చాలా చౌక.



KRIPU మరియు Print & Prints భవనం

*⏭ మీ దగ్గరకు వచ్చిన కస్టమరును ఏవిధంగా సంతృప్తి పరుస్తున్నారు?*

మాదగ్గరకు వచ్చిన కస్టమర్స్‌కు డిజైన్స్ మరియు ప్రింటింగ్ ఎలా ఉంటే బాగుంటుందో చెబుతాము. వినేవారికి సలహాలు, సూచనలు ఇస్తాము. కాని నిర్ణీత భావాలతో వచ్చే కస్టమర్లకు వారు చేయమన్నదే చేస్తాము. మనం ఇష్టపడేది చేస్తే వారికి నచ్చదు. వారు చేయమన్నదాన్ని ఇష్టపడి చెయ్యాలి. దీన్నే వ్యాపారాత్మక కళ, బ్రతకడానికి తోడ్పడే కళ అంటారు . మార్కెటింగ్ స్కిల్స్ తెలిసినవారే కళ వలన బాగుపడుతున్నారు. కమర్షియల్ ఆర్ట్‌లో ఆలోచిస్తూ ఉంటే సరిపోదు. సమయం మించిపోక ముందే ఆచరణలోకి దిగి సమయానికి అందివ్వాలి. డిజైన్స్ కాలానుగుణంగా మారుతున్న అభిరుచులకు తగ్గట్టుగా మారాలి. కంప్యూటర్ సాంకేతికతకు సృజనతోడయితే అద్భుతాలే.



KRIPU creative designs

ఒక్కో డిజైన్ చేయుటకు ఎంతో ప్రసవవేదన అనుభవించాల్సి వస్తుంది. అది సరిగ్గా ప్రింట్ అయ్యి కస్టమర్ సంతోషపడితే పడ్డ కష్టం పటాపంచలవుతుంది. మంచి డిజైనర్ అని పేరు తెచ్చుకోవడం ఒక ఎత్తు. దాన్ని నిలబెట్టుకోవడం మరో ఎత్తు. నిత్యం అప్‌డేట్ అవుతూ ఉండాలి. కళాకారులెప్పుడూ పరిపూర్ణత సాధించామని అనుకోకూడదు. ఆర్ట్‌వర్క్‌ చేస్తున్నప్పుడు ఓర్పు సహనానికి పెద్ద పీట వెయ్యాలి.

అన్నిటికంటే ముఖ్య విషయం “అన్ని కళలలోకి గొప్పదైన కళ అందమైన నడవడి” అన్నది మరిచిపోకూడదు. అది మనకుంటే కస్టమర్ మనతోనే ఉంటాడు.

మాసంస్థ పురోగతిలో మా కుటుంబ సభ్యుల్లాంటి ఉద్యోగులు, మిత్రులు, కస్టమర్ల సహకారం ఉంది. ఇది ఒక టీమ్ వర్కు కాబట్టి, ప్రతీ ఒక్కరు ఈ విజయంలో భాగస్వాములే.

# కేరళ కిరణం రాజారవివర్మ

-బాలి

ప్రసిద్ధ చిత్రకారుడు రాజారవివర్మ గురించి ఇందిరావర్మ అనే రచయిత్రి రాస్తూ ఇలా అంది. "కేరళ రాష్ట్రం భారతదేశానికి అందించిన ముగ్గురు ముద్దుబిడ్డలలో మొదటివారు, ఆదిశంకరాచార్య అయితే రెండవ వారు అద్వైతమత స్థాపకుడు, గేయకారుడు పరమపూజ్య స్వాతితిరునాళ్. మూడవవారు ప్రఖ్యాత చిత్రకారుడు రాజారవివర్మ". పైగా ఆమెఇలా రాసింది. "రియలిజంలో మహాదిట్ట, మార్గదర్శకులం అనుకొనే బెంగాల్ చిత్రకారులను, తలలుదించుకొనేట్టు చేశారు" అని. ఈ మాటముమ్మాటికీ నిజం.



ఏప్రిల్ 29 న రాజారవి వర్మ జన్మదిన సందర్భంగా ప్రత్యేక వ్యాసం

ఇళ్ళల్లో దేవతావిగ్రహాలు అలంకరించుకొందుకుగానీ, పూజించుకోనేందుగాని రూపకల్పనలులేని రోజుల్లో పురాణాల్లో ఉన్న వర్ణనలు తీసుకొని, పరిసరాలు ఎన్నుకొని ముగ్ధమనోహరంగా, నునుపైన బుగ్గలు ఖరీదైన నగలతో అలంకరించి, ఆరుగజాల చీరతో నిండుగా మనిషి నిలబడినట్టే దేవతామూర్తులను చిత్రిస్తే ఎవరూ నమస్కరించకమానలేరు. ఆరోజుల్లో ఆయన చిత్రించిన లక్ష్మి, సరస్వతీ, సైరంధ్రీ మేనక ఎంతో ప్రాచుర్యాలు. ప్రతి ఇళ్లల్లోనూ గోడలకు అలంకరించబడి పూజించబడేవి. ఇలాగే ఉండేవారు కాబోలు దేవతలు అని ఆలోచింపచేసేవి.

రాజారవి వర్మ 1948 ఏప్రియల్ 29వ తేదీన కేరళరాష్ట్రానికి చెందిన రాజవంశంలో "కిల్‌మానూర్" అనే ఊరిలో జన్మించాడు. అది త్రివేంద్రానికి 24 మైళ్ళదూరంలో ఉంది. ఆ వూరు వారి పూర్వీకులకు తిరువాన్కూర్ మహారాజులు ధారాధత్తం చేసిన గ్రామం.

అంటే ఆ వూరి మొత్తంపెత్తనం వారిదే. భుక్తికి లోటులేదు, రవివర్మలో సరిగ్గా ఊహ తెలియనప్పట్నించే బొమ్మలు గీయాలన్న తహతహ ఉండేది. అందువల్ల తెల్లటి సుద్దముక్క దొరికినా, నల్లటి బొగ్గుముక్క దొరికినా, నేల మీద చుట్టూ ఉన్న గోడల మీద ఏవేవో బొమ్మలు గీసేవాడు.

అయితే ఇంట్లో పెద్దవారికిది ఇష్టంలేదు. గోడల్నీ, నేలనూ పాడు చేస్తున్నాడని ఇతనికి చీవాట్లు తప్పనిసరి. అయినా రవివర్మలో వీసమెత్తయినా మార్పురాకపోవడం దైవసంకల్పం. ఇవి ఇలా ఉండగా అతనికి 14వ ఏడు వచ్చేసరికి ఆ పిచ్చిగీతల్లోనే ఓఅందం, ఓ సొగసు సంతరించుకోవడం మొదలయ్యింది. ఆ రేఖలు ఓ పరిపక్వతను పొందడంలోనే కొంచెం ధైర్యంతో రెండు మూడు మీనియేచర్లు తయారుచేసి అప్పటి తిరువాన్కూర్ మహారాజావారు 'అయిలియాం తిరునాల్' అనే వారికి బహుమతిగా ఇచ్చాడు. ఆ రాజావారు చిత్రకళాపిపాసి. అంతచిన్న వయస్సులో అతని ప్రతిభను గమనించి ప్రోత్సహించాలన్న సరదాతో, ఓ పెద్దగదిని అతనికి స్టూడియోగా కేటాయించడమే కాకుండా అన్ని సౌకర్యాలూ అప్పటికపుడు ఏర్పాటు చేయించి ఓపెట్టెనిండా నీటిరంగులూ బ్రష్‌లు, చిత్రకళకు సంబంధించిన పుస్తకాల బీరువాతో ఆ గదిని నింపాడట.



'కసేర్‌గోడే'. అయితే వీళ్లనే గమనిస్తున్న దొంగలు కొందరు వీరి దగ్గరున్న విలువైన వస్తువులు దోచేశారు. మిత్రులతో పాటు రవివర్మా బిక్క ముఖం వెయ్యక తప్పలేదు. వీరి పరిస్థితి గమనించి ఊరిచివర దేవాలయంలో అర్చకుడొకడు వీళ్లకు వసతి కల్పించాడు.

అయితే ఆ పూజారిగారింట్లో మరో గొడవుంది. ఆపూజారిగారికో కూతురుంది. ఆమెకు దెయ్యం పట్టిందన్నారందరూ. మానసికంగా, అనారోగ్యంగా ఉ ందామె. నయంచేయించాలని బోల్డు డబ్బు ఖర్చుపెట్టానని ఆ పూజారి గొల్లుమన్నాడు. అప్పటికే దేవీనూకాంబికను ఉపాసించిన రవివర్మ మంత్రం వేసి ఆరోగ్యవంతురాలిగా చెయ్యవచ్చన్నాడు. ప్రయత్నంచేసాడు. మిత్రులు సహకరించారు. అంతే ఆ అమ్మాయిలో కొన్ని గంటల్లోనే మార్పు రావడం మొదలయ్యింది. అంతే ఆ విషయం 'దివ్యశక్తులున్న వ్యక్తి మన వూరు వచ్చాడని ఊరందరికీ తెలిసిపోయి పొలోమని కొంతమంది రోగులు పూజారిగారి ఇంటి చుట్టూ దడికట్టారు. ఇది గమనించిన రవివర్మ, అతని మిత్రులూ కంగారుపడిపోయి రెండోరోజు రాత్రికి రాత్రే పలాయనం చిత్తగించారు.

రవివర్మ వివాహం అతని 17వ ఏటే జరిగింది. ఆయన భార్య పేరు 'పూరోపట్టామ్' ఆమె 'మావికెక్కార'కు చెందిన రాజకుమార్తె. చక్కటి అందగత్తె. అప్పటికే ఆయనకు పోర్ట్రయిట్ చిత్రకారుడిగా పేరు రావడం వల్ల పెండ్లి అనంతరం ఇంకా అవకాశాలు కొల్లలుగా రావడం మొదలెట్టాయి. అవి మామూలు వ్యక్తులనుండి కాదు. ఎన్నో సంస్థానాల నుండి ప్రభువుల పిలుపులు, అలా ఆయన వెళ్లి నెలలతరబడి ఇంటికి రావడం కుదిరేదికాదు. ఆ

అది ఆ వయస్సులో రవివర్మకు గొప్ప థ్రిల్ అనిపించాయి. ఇంట్లో పెద్దవారూ అడ్డుచెప్పలేకపోయారు. బొమ్మలు గీయడం, మిత్రులతో కాలక్షేపం, విశాలమైన గది, అందుకు తగ్గ ఏర్పాట్లు అతని పని బాగానే ఉంది. ఇలా ఉండగా కొంతమంది మిత్రుల ప్రోత్సాహంతో దక్షిణ కెనరాలో ఉన్న దేవీ నూకాంబిక దేవాలయానికి వెళ్లి దేవిని దర్శించుకోవాలన్న తలంపు కలిగింది. రవివర్మ అనుకున్నదే తడవుగా మిత్రులతో బయలుదేరాడు. ఒకటి రెండు రోజుల్లో తిరిగి వద్దామని బయలుదేరిన వారు, ఆ దేవీని ఉపాసిస్తే సిద్ధులు కలుగుతాయి అని ఎవరో చెప్పగానే 41రోజులు అక్కడే ఉ ండిపోయారు. మనసులో ఓ రకమయిన సంతృప్తి కలగగానే ఇంటి ముఖం పట్టి కొంత దూరం రాగానే వర్షాకాలం మొదలయ్యి, విపరీతమయిన వర్షాలతో సరియైన మార్గం లేక ఒక ఊరిలో రెండు రోజులు తలదాచుకుందామని ప్రయత్నించారు. ఆ ఊరిపేరు

రోజుల్లోనే ఆయనకో చిత్రమైన అనుభవం కలిగింది. ఈ విషయాన్ని ఆయన తమ్ముడు రాజ రాజ వర్మ బయటపెట్టాడు. రవివర్మ ఇలాగే ఒకసారి ఆర్ట్‌వర్క్ మీద ఏదో సంస్థానానికి వెళ్లిపోయాడు. ఆయన భార్య పురోపట్టామ్‌కు కోపం వచ్చింది. అయితే అది మనసులోనే దాచుకొని సమయం కోసం ఎదురుచూస్తోంది. కొన్ని నెలల తరువాత రవివర్మ పనిముగించుకొని దేశంలోకి కొత్తగా దిగిన క్రొవ్వొత్తు బాండియర్‌ను కొనిచ్చి భార్యకు సర్‌ప్రయిజ్ చేద్దామని హాల్లో ఉన్న బల్లమీద పెట్టించి, ఈ విషయం పనివాళ్లెవరూ చెప్పవద్దని చెప్పి పనిమీద పక్కనే ఉన్న తన చిన్న తమ్ముడు ఇంటికి వెళ్లాడు.

'పురోపట్టామ్' వచ్చింది. బల్లమీదున్న బాండియర్‌ను చూసి అదెక్కడిదని పనివాళ్లను అడిగింది. వాళ్లు ఏదో చెప్పారు ఆ సమాధానం ఆమెకు నచ్చలేదు. అదిసరైన సమాధానంకాదు. ఆమెకు

కోపం వచ్చింది. హాలు కిటికీగుండా రోడ్డుమీదకు దాన్ని విసిరేసింది. తన గదిలోకిపోయి తలుపు బిడాయించుకుంది. కాసేపటికి రవివర్మ వచ్చాడు. జరిగిన సంగతి పనివాళ్లు చెప్పారు. అతనికీ కోపం వచ్చింది భార్యవున్న గది తలుపుతట్టాడు. ఆమె తీయలేదు. ఇంకా రెచ్చిపోయికేకలు వేశాడు. అయినా తలుపులు తెరవలేదు. ఎప్పటికోతెరిచి నన్ను మరిచిపోయారుకదూ! అని కన్నీళ్లతో ఆయన పాదాలపై పడింది. ఆయన మనసూ కరిగిపోయింది. ఈయన తమ్ముడు రాజ రాజ వర్మా చిత్రకారుడే! తనకుమారుడు రామవర్మా చిత్రకారుడే! అయితే వారు రవివర్మంత చేయితిరిగిన వారు కాదు.



రవివర్మకు ఉత్తరప్రదేశ్‌లో ఉండే ఓ రాజునుండి ఆహ్వానం అందింది. సారాంశమేమంటే వారి ఫామిలీ మెంబర్స్ నందరి పోర్ట్రయిట్లు గీయాలన్నది. రవివర్మ అంగీకరించి వెళ్లాడు. అలా ఆహ్వానించిన రాజా వారికి ఓ మేనకోడలుంది. ఆమెఎంత అందగత్తె అంటే చూసిన వారు కళ్లుతిప్పుకోలేకపోయేవారట. ఆమె రవివర్మ దృష్టిలోపడింది. రాజావారి ఫామిలీ పోర్ట్రయిట్‌లు అన్నీ గీసిన తరువాత రవివర్మ రాజావార్ని కలిసి తన ఆలోచనను బయటపెట్టాడు. ఏమంటే ఆ అందగత్తెలో 'కృష్ణునికై ఎదురుచూసే రాధ బొమ్మ' కోసం ఆమెను మోడల్‌గా పెట్టుకుంటానని. రాజావారు అంగీకరించారు. ఆ అమ్మాయికూడా సరదాపడింది. రవివర్మ చెప్పిన భంగిమలో కూర్చుని ముఖకవళికలు ప్రదర్శించింది. ఇలా రెండు మూడు సిట్టింగ్‌లు అయిపోయాయి. అప్పటికే వయస్సులో ఉన్న రవివర్మను ఆమెను ప్రేమించడం మొదలెట్టింది. తిన్నగా మేనమామ వద్దకుపోయి రవివర్మతో పెళ్లి చేయించమని కోరింది. రవివర్మదీ



రాజవంశమే కాబట్టీ ఆ రాజాగారు సూత్రప్రాయంగా రవివర్మకు ఆ విషయం తెలియచేశారు.

రవివర్మ అంగీకరంచలేదు. తనకు అప్పటికే పెళ్లి అయిపోయిందని, రాధగా ఆమె బొమ్మగీయలని తలంపేగాని మరోఉద్దేశ్యంలేదని చెప్పారు. ఆమె ఇక సిట్టింగ్‌లు ఇవ్వలేదు. ఆ బొమ్మ మధ్యలో ఆగిపోయింది.

రవివర్మపేరు భారతదేశంలోనే కాక విదేశాల్లో తెలిసిన రోజుల్లో ఓ పార్టీకి తప్పకరావాలని గవర్నమెంట్ హౌస్ ఆఫ్ బొంబాయి నుండి ఆయనకో ఆహ్వానం అందింది. అది అప్పటి బ్రిటీష్ పాలకుల స్థాయిలో గొప్ప ఆహ్వానం. అంగీకరించిన రవివర్మ తన ముఖ్య సేవకుడితో బొంబాయి చేరుకున్నాడు. అయితే ఆ పార్టీ సాయంత్రం జరుగుతుందనగా తన ముఖ్య సేవకుడికి ఏదో అనుకోని విపత్తు కలిగి అతడ్ని తొందరగా హాస్పిటల్‌లో చేర్చవలసిన అగత్యం ఏర్పడింది. పార్టీ కన్నా తన ముఖ్య సేవకుడిని ఆరోగ్యమే ముఖ్యమని ఆయన అతడ్ని కనిపెట్టుకుంటూ హాస్పిటల్‌లో గడిపాడు. ఇది ఆ పార్టీ యాజమాన్యానికి కోపంవచ్చి సంజాయిషీ అడిగారు. ఏది ఏమైనా నా సేవకుడే ముఖ్యమని చిన్న కాయితం మీద రాసి వారి ముఖాన్న పడేసివచ్చేరు రాజారవివర్మ.



అవుతున్నట్లు ఆమె గ్రహించింది. సేవకులు పళ్లేలతో పదార్థాలు ఆ గదిలోనికి తీసుకెళ్లడం రావడం చేస్తున్నారు. 'రవివర్మ ఆ గదితలుపులు కొద్దిగా తెరచి ఆమెను ఆహ్వానించాడు. ఆ గదిలో అప్పటికే ఇంకో కొంతమంది ఉన్నట్లు ఆమె గ్రహించింది! అబ్బో మీరు చాలమందిని ఆహ్వానించారే! అంటూ ఆమె కుర్చీని లాక్కుని బల్లదగ్గరగా జరిగింది.

రవివర్మ నవ్వాడు–

అప్పుడు ఆమె గ్రహించింది. వాళ్లంతా మనుషులు కారు. వివిధ భంగిమల్లో కూచున్నారు నిజంగా భోజనాల బల్లదగ్గర కూచున్నట్టే ఆమె కుర్చీలాక్కున్నది బల్ల దగ్గరికి కాదు. పెయింటింగ్ దగ్గరకి ఆమెకు మొదట ఆశ్చర్యం, తరువాత విపరీతంగా నవ్వు వచ్చింది. రవివర్మ పూర్తిగా తలుపుతెరిచాడు అదొక పెద్దపెయింటింగ్, రవివర్మా నవ్వాడు.

'టిట్ ఫర్ టాట్' అంటే అదే! ఇద్దరూ పగలబడినవ్వుకున్నారు.

రవివర్మ తన పెయింటింగ్‌ల్లో మోడల్‌గా తన పెద్ద కుమార్తెనే తీసుకొనేవాడు. ఆమె ఎన్నో దేవతా చిత్రాలకు మోడల్‌గా పనిచేసింది. అందగత్తె. ముఖంలో అద్భుతమైన కొలతలతో పాటు ముగ్ధత్వంకలది. 1873లో చికాగోలో జరిగిన 'రియలిస్టిక్' పెయింటింగ్ పోటీల్లో ఆయన మొదటి బహుమతి బంగారు మెడల్‌ను గెలుచుకున్నాడు. ఇక ఆ తరువాత ఆయనలో షుగర్‌వ్యాధి ముదిరి ఇబ్బందిపెట్టడం

ఆసేవకుని ఆరోగ్యం కోసం బొంబాయిలో ఉన్న రోజుల్లోనే ఆయన అక్కడే ఉన్నాడని తెలిసి ఓ యూరోపియన్ స్త్రీ తమ ఇంటికి భోజనానికి రమ్మని ఆహ్వానించింది. ఆ రోజున విపరీతమయిన వర్షం, సాయంకాలం వేళ. ఇతని రాకనుగమనించి ఆమె గేటు వరకూ గొడుగులో వచ్చిలోపలికి తీసుకెళ్లింది. ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ భోజనాలు ముగించారు. ఇంకా కాసేపున్నా వర్షం తగ్గలేదు. ఇక తాను వెళ్తానని ఇందాకటి గొడుగు ఇస్తే రేపు తిప్పి పంపుతానని చెప్పాడు రవివర్మ పక్కనున్న గది తలుపు కొద్దిగా తెరచి లోన కనిపిస్తున్న గొడుగు తీసుకోమంది ఆమె రవివర్మలోపలికి వెళ్లి ఆ గొడుగును అందుకుందామని చేయిలేపితే ఆ గొడుగు చేతికి వస్తేకదా! అదొక పెయింటింగ్. అందులో నిజంగా గొడుగు మేకుకు వేలాడుతున్నట్టే ఉంది. మొదట ఆశ్చర్యపోయి తరువాత నవ్వడం అతనివంతయింది. ఇక ఆమె అయితే చెప్పనవసరంలేదు. నవ్వులే నవ్వులు... ఇంటికి వచ్చిన రవివర్మలో ఏదో ఆలోచన మొదలయ్యింది. తానెక్కువ తినలేదు. ఆచరణలో పెట్టాలనుకున్నాడు. కొద్దిరోజులు తరువాత ఈయునా ఆమెను భోజనానికి ఆహ్వానించాడు... వచ్చింది. ఓ మూల గదిలో భోజనాల ఏర్పాట్లు

మొదలెట్టింది. 1905లో షష్ఠిపూర్తి జరిగింది. ఆ సందర్భంలో ఆయన తన బంధువులనందర్నీ రప్పించుకొన్నాడు. అందర్నీ కనులారచూసి తాను సన్యసిస్తున్నట్టు ప్రకటన చేశాడు. ఆశ్రమ నిర్మాణము జరిగింది. ఏదో కొద్ది రోజులు అందులో గడిపినా షుగర్‌వ్యాధి ముదిరి అతని పరిస్థితే సీరియస్‌గా మారింది. ఇది తెలిసి ప్రపంచం నలుమూలలనుండి ఆయనకోలు కావాలని ఆయన అభిమానులు వందలాది ఉత్తరాలు , టెలిగ్రాంలు పంపేవారట, చివరకు అక్టోబర్ 2, 1906న ఆయన చనిపోతాడని గట్టిగా నమ్మకమొచ్చి, తనకొడుకు రామవర్మను పిలిచి ఏదో చెప్పారు ఆకుర్రవానికి తండ్రికి ఏంకావాలో ముందు బోధపడలేదు. మాటలో స్పష్టతలేదు. అతి కష్టం మీద తండ్రి చేసిన సౌంజ్ఞలు అర్థం చేసుకుని 'దేవీభగవతీదేవి' బొమ్మను అప్పటికప్పుడు పెయింట్ చేసి తండ్రి చేతికిచ్చాడు రామవర్మ. దాన్ని అలాగే పట్టుకొని తదేక దృష్టితో చూస్తూ కన్నీరు ఉబికి వస్తోంటే అంతిమ శ్వాసవదిలారాయన.

కళాప్రపంచం

# పాప్ తుఫాన్ మైఖేల్ జాక్సన్

**ప్రపంచ వ్యాప్తంగా ఎందరో ఏకలవ్య శిష్యులు కల సంగీతజ్ఞుడు. మనిషిలో అణువణువూ సంగీత, నృత్యాలకే అంకితం చేసినవాడు. వివాదాల సుడిగుండాలలో కూరుకుపోయినా కూడా జనాన్ని సమ్మోహితులు చేయగలిగినవాడు. ఇలా చెబుతూ పోతే అనేకానేక విషయాల , వాస్తవాల కేంద్ర బిందువు "మైఖేల్ జాక్సన్". పాప్ స్టార్ ఆఫ్ ది మిలేనియమ్ అని కీర్తించబడినవాడు.**

**ఎల్.ఆర్. వెంకటరమణ**

మైఖేల్ జాక్సన్ ఆగస్టు 29, 1958న చికాగోలో గేరీ అనే ప్రాంతంలో జన్మించాడు. తండ్రి-జోసెఫ్ వాల్టర్, తల్లి కాథరీన్ ఎస్తెర్. తొమ్మిది మంది సంతానంలో జాక్సన్ ఏడవవాడు. జాక్సన్ తండ్రి స్టీలు మిల్లులో కార్మికుడు. సాధారణ నల్లజాతి కుటుంబాల వలే దుర్భర దారిద్ర్యం అనుభవించేది. చిన్నతనంలోనే జాక్సన్ పాటలు పాడి మెప్పించాడు. మెప్పించడానికి ప్రయత్నించాడు. ఎన్నో హృదయాలను కదిలించాడు.

చిన్నతనంలోనే పాటలు రిహార్సిల్ చేస్తున్నప్పుడు ఏ చిన్న తప్పుచేసినా, తండ్రిచేత బెల్టుదెబ్బలు బహుమతిగా లభించేవి. ఎన్నో నిద్రలేని రాత్రులు, లేదా కన్నీళ్లతో నిద్రలోకి జారుకోవడం ఇది జాక్సన్ బాల్యం. తన తరువాతి జీవితానికి ఇవన్నీ ప్రేరణలు. తండ్రిని చూసి అమితంగా భయపడినట్లు చెప్పుకొస్తాడు. భయాలు, హృదయవేదనలు, అంతర్మధనాలు అన్నీ "పాట"లో పడి కొట్టుకు పోయేవి. పాట ప్రాణమైంది. మైఖేల్ ఆరేళ్ళ నాడే స్టేజి షోలు చేయగలిగాడు. మరీ చెబితే తండ్రి ఇతని శక్తి గుర్తించి స్టేజి పైకి నెట్టాడు. "జాక్సన్ బ్రదర్స్" పాటల బృందంలో ప్రధాన గాయకుడు జాక్సన్. మనసు గాయాలతో, హృదయ గీతాలతో, నరనరాలతో శరీరం అణువణువు స్టేజీపై నర్తించింది. జనాల గుండెల్లో చోటు సంపాదించింది.

1966-68 మధ్యకాలంలో జాక్సన్ బృందం మిడ్‌వెస్ట్ ప్రాంతంలో అనేక ప్రదర్శనలు ఇచ్చారు. ఇవన్నీ కూడా క్లబ్‌లలోనే జరిగాయి. "జాక్సన్ బ్రదర్స్"అనే బృందం "జాక్సన్-5"గా పేరు





"ప్రతి పదాన్ని సరిగ్గా ఉచ్చరించాలని, భావాలను సరైన రీతిలో వ్యక్తం చేయాలన్నది జాక్సన్ వాదన. దీంతో క్విన్సీ జోన్స్‌కు మరింత దగ్గర కాగలిగాడు. జాక్సన్ సోలో ఆల్బమ్ "ఆఫ్ ది వాల్" నిర్మాణానికి క్విన్సీజోన్స్ ఒప్పుకున్నాడు. "డోన్ట్‌స్టాప్ టిల్ యు గెట్ ఇనఫ్" పాట అన్నీ రికార్డులను బద్దలు కొట్టగలిగింది. జాక్సన్‌పై అవార్డుల వర్షం కురిసింది. 20 మిలియన్ల కాపీలు అమ్ముడయ్యాయి.

జాక్సన్ స్టీఫెన్ స్పీల్ బర్గ్ సినిమా "ఇ.టి." (ఎక్స్‌ట్రా టెరెస్ట్రియల్)లో "సమ్‌వన్ ఇన్ ది డార్క్" అనే పాట పాడాడు. ఈ పాటకు గ్రామీ అవార్డు అందుకున్నాడు. జాక్సన్ బాల్య చాపల్యాన్ని సంతృప్తి పరచిన పాట ఇది. తాను కోల్పోయిన బాల్యాన్ని అతడు గుర్తు చేసుకున్న పాట ఇది. ఈ పాటతో మరింత గుర్తింపును పొందగలిగాడు.

జాక్సన్ క్విన్సీజోన్స్‌తో కలిసి "థ్రిల్లర్" అల్బమ్‌ను రూపొందించారు. ఈ ఆల్బమ్ ప్రపంచవ్యాప్తంగా 50 మిలియన్ కాపీలు అమ్ముడయ్యాయి. బిల్లీజాన్ పాట ప్రదర్శన కోసం మైఖేల్ జాక్సన్ నృత్యశైలి ప్రపంచం వేనోళ్ళ పొగిడింది. పాటపాడుతూ,

*"డోన్ట్‌స్టాప్ టిల్ యు గెట్ ఇనఫ్" పాట అన్నీ రికార్డులను బద్దలు కొట్టగలిగింది. జాక్సన్‌పై అవార్డుల వర్షం కురిసింది. 20 మిలియన్ల కాపీలు అమ్ముడయ్యాయి.*

మారి ప్రదర్శనలు ఇచ్చింది. పాటలు పాడడం, నృత్యం రెండూ చేయడం, ఇలా అనతి కాలంలోనే మంచి పేరు సంపాదించగలిగాడు. 1968 నాటి రోలింగ్ స్టోన్ అనే పత్రిక జాక్సన్‌ను ప్రశంసలతో ముంచెత్తింది. 1972-73 ప్రాంతంలో జాక్సన్ సోలో ఆల్బమ్స్ విడుదలయి జనాల గుండెలను తాకాయి.

1975లో "జాక్సన్-5" అన్నపేరు "ది జాక్సన్స్" అనే పేరుగా మార్పు చెందింది. 1976-1984 మధ్య కాలంలో ప్రపంచ వ్యాప్తంగా విస్తృత పర్యటనలు చేస్తూ, ఆరు ఆల్బమ్స్ విడుదల చేయగలిగాడు. "షేక్ యువర్ బాదీ" "దిస్ ప్లేస్ హొటల్", "కెన్‌యు ఫీల్ ఇట్" ఇవన్నీ ఎంతో ప్రజాదరణ పొందాయి. వీటిని రచించినది జాక్సన్. 1978 లో విడుదలైన "ది విజ్" సంగీత భరిత చిత్రంలో మైఖేల్ జాక్సన్ పాటలు పాడే "దిష్టిబొమ్మ" పాత్రలో నటించాడు. ఈ సినిమా సంగీత దర్శకుడు క్విన్సీజోన్స్. ఇతనితో పరిచయం జాక్సన్ జీవితాన్ని మలుపుతిప్పింది.



హఠాత్తుగా తలపై టోపీపెట్టుకుంటూ, ఒక కాలు వంచి,చెయ్యి టోపీపై ఉంచడం. తరువాత ప్రపంచం కనీ, వినీ ఎరుగనట్టి "నృత్యనడక"తో స్టేజీపై నడిచాడు. క్రిందనున్న నేల జారుతున్నట్లు భ్రమ కలిగించే విధంగా, ఉన్నచోటు నుండే నిలబడి నడచినట్లు భ్రమ కలిగించాడు. చూస్తున్న వారి కళ్ళు మెరిసాయి. నేటికీ ఈ పాట నృత్యశిక్షణ చేస్తున్న వారి కందరికినీ ఒక సిలబస్ వంటిదే. నల్లవారి పాటలు ప్రదర్శించబోమని "ఎమ్‌టీవి" అంతవరకు నిబంధన విధించుకున్నది. కానీ మైఖేల్ జాక్సన్ కున్న ఆదరణతో వారి నిబంధనలు తొలిగించుకుని జాక్సన్ పాటలు ప్రసారంచేసి "ఎమ్‌టీవి" కూడా ప్రథమస్థానం పొందగలిగింది.

"థ్రిల్లర్" ఆల్బం తెచ్చిన పేరుతో జాక్సన్ తను మరింత సంగీత శక్తివంతునిగా మారడానికి ప్రయత్నించాడు. అదే కాలంలో నల్ల, తెల్ల జాతి అనే బేధం లేకుండా మానవ జాతి మనస్ఫూర్తిగా జాక్సన్ పాటలను ఆదరించారు. అతని టోపీ, చేతికివాడే గ్లౌస్, అతని వస్త్రధారణ ప్రజలు అనుకరించారు. అలా మైఖేల్ బ్రాండున్న ఏవస్తువు అయినా విశేషంగా అమ్ముడయ్యేది. ఎన్నో వ్యాపార సంస్థలు ఇలా ప్రపంచవ్యాప్తంగా సొమ్ముచేసుకోగలిగాయి.





కూతురు, కొడుకులతో జాక్సన్

పర్వతం ఒక వైపు నుండి పైకి శిఖరారోహణం చేస్తాం. అనంతరం దిగడమే కదా. ఇలా శిఖరోహణ తరువాత పతనం కూడా జాక్సన్ జీవితం చవిచూసింది. ప్రపంచం ఆదరించినా, చిన్ననాటి అనుభవాలు, తండ్రి బెదిరింపులు, ఏదో తెలియని భయాన్ని అంతర్మథనంలో తొలచివేశాయి. తను నల్లవాడుగా ఉండిపోకూడదనుకొని ప్లాస్టిక్ సర్జరీ వైపు మొగ్గుచూపడం ఇవన్నీ పతనానికి నాందీగా చెప్పుకోవచ్చు.

తను ఉండే నివాసం చుట్టూ కోట గోడ నిర్మించుకున్నాడు. 'నెవర్‌ల్యాండ్' లా తన సామ్రాజ్యాన్ని ఏర్పరచుకున్నాడు. బాల్యంలో తను పొందలేని అనుభవాలు పొందడానికి అంటూ మానసిక శాస్త్రవేత్తలు విశ్లేషించారు. పాత పద్ధతులలోనే రొమాంటిక్ పాటలు పాడడానికి శరీరం సహకరించదు. అందుకే 1991లో విడుదలైన "డేంజరస్"ఆల్బమ్‌జాక్సన్ సందిగ్ధానికి ఒక నిదర్శనం. ఈ అల్బమ్ అంత ఆదరణ పొందలేదు. ఇదే కాలంలో బాలలను లైంగికంగా వేదిస్తున్నాడన్న ఆరోపణలు ఎదుర్కొన్నాడు. ఎల్విస్ ప్రిస్లీ కూతురును వివాహం చేసుకున్నాడు.

1995లో "హిస్టరీ, పాస్ట్, ప్రెజెంట్ అండ్ ఫ్యూచర్". విడుదలైంది. ఇది ఎలాంటి సంచలనాలు సృష్టించలేకపోయింది. 1988లో జాక్సన్ తన తొలి ఆటోబయోగ్రఫీ "మూన్ వాక్" విడదలచేశాడు. దీన్ని రూపొందించడానికి నాలుగు సంవత్సరాలు పట్టింది. ఇందులో తన్న చిన్ననాటి పీడకల లాంటి అనుభవాలు వివరించాడు. జాక్సన్‌కు "కింగ్ఆఫ్ పాఫ్" అనే బిరుదు కూడా దక్కింది.

1995లో జాక్సన్ లీసామేరీని వివాహమాడాడు. ఓ ఏడాది కలిసి ఉన్నాడు. తరువాత విడిపోయారు. 1996లో డెబీ రోవెను పెళ్ళిచేసుకున్నాడు. ఈ వివాహం మూడేళ్ళు వరకు కొనసాగింది. జాక్సన్ జూనియర్, పరిస్ మైఖేల్ కత్రినాలు పుట్టారు. వీరిని జాక్సన్‌కే వదిలి విడాకులు తీసుకుంది డెబీరోవె. 1999 జాక్సన్ వివిధ సేవాకార్యక్రమాలలో పాల్గొన్నాడు. 2006లో జాక్సన్‌కు ఆర్థిక ఇబ్బందులు చుట్టుముట్టాయి. నెవర్‌ల్యాండ్ రాంచ్ ఖాళీ చేయవలసి వచ్చింది. 270 మిలియన్ డాలర్ల అప్పుతీర్చలేకపోవడం. దీంతో షరతులతో సోనీ కంపెనీ ముందుకు వచ్చింది.

తన 50వ ఏట జూన్ 25, 2009న హఠాత్తుగా గుండె ఆగి జాక్సన్ మరణించాడు. ఇది కూడా ఒక సంచలనం. ఎన్నో సందేహాలు, అనుమానాలకు దారి తీసింది. సముద్రం ఎంతో



గంభీరమైనది. ఎన్నిటినో తనలో కలుపుకోగలదు. ఎన్నిటినో ఇవ్వగలదు. జనసముద్రంలో కూడా ఎన్నో ఆటు, పోటులు, అలజడలు, ఆశ్చర్యాలు, అవమానాలు, ఇలా ఎన్నో చూసి భరించి వెళ్ళిన ఒక వ్యక్తిగా జాక్సన్‌ను చెప్పుకోవచ్చు.సంగీత ప్రపంచానికి ఇతనొక తుఫాన్.



# స్వర శ్రీనివా(యి)స్ పి.బి. శ్రీనివాస్



శ్రీ ప్రతివాద భయంకరాచారి పేరు వినగానే కాకినాడ బాంబు కేసు గుర్తుకు వస్తుందెవరికైనా. కానీ సినీగీతాలను ఇష్టపడేవారికి పి.బి. శ్రీనివాస్ గుర్తుకు వస్తారు. ప్రతివాద భయంకర శ్రీనివాసాచార్యులు కాస్తా గాత్రంలో ఏ మాత్రమూ లేని భయ భీభత్సాలను పేరులోనూ లేకుండా చేసుకుని పి.బి. శ్రీనివాస్‌గా వ్యవహృతులయ్యారాయన.

\- మాకినీడి సూర్యభాస్కర్

సినీ నేపథ్యగానం చేయాలన్నది ఆయన బాల్య స్వప్నం. విద్యార్థి దశనుంచే సినిమా రంగంలోనికి వెళ్ళాలని ఉవ్విళ్ళూరేవారు. నాల్గవ యేటనుంచీ లతామంగేష్కర్ పాటల్ని పాడుకుంటూ ఉండేవారు బాల శ్రీనివాస్. అప్పట్లో ఆయన గొంతు సన్నగా అమ్మాయి గొంతులా ఉండేది. అందువల్ల రావు బాల సరస్వతిని కూడా ఎక్కువగా అనుకరిస్తూ ఉండేవారు నాలుగేళ్ళ శ్రీనివాస్. తరువాత విద్యార్థి దశలో ఘంటసాల పాటలు పాడి ఎన్నో బహుమతులు పొందారు.

ఆయన సినీరంగ ప్రవేశానికి తండ్రి ప్రతివాద భయంకర ఫణీంద్ర స్వామి ఎంతమాత్రమూ అంగీకరించేవారు కాదు. మొదట చదువు పూర్తి కావాలన్నది ఆయన కోరిక. బి.కాం. పూర్తి చేసాకా, కొడుకు వత్తిడికి తట్టుకోలేక తన స్నేహితుడు, సుప్రసిద్ధ వైణికుడు అయిన ఈమని శంకర శాస్త్రికి శ్రీనివాస్‌ను 1951లో అప్పగించారు తండ్రి. శంకర శాస్త్రి అప్పట్లో జెమినీ సంస్థలో పని చేస్తూండేవారు.




హిందీ చిత్రం 'మిస్టర్ సంపత్ 'లో ఒక దోహాను మొట్టమొదటగా పాడారు పి.బి. అది విన్న జెమినీ వాసన్‌గారు "నీ పాటతో రాళ్ళు కరుగుతా"యని ఎంతగానో మెచ్చుకున్నారు. ఆ విధంగా తన 21వ యేట సినీ నేపథ్య రంగంలో ప్రవేశించారు శ్రీనివాస్. వెంటనేతెలుగులో రెండు పాటలు పాడే అవకాశం ఇచ్చారు నిర్మాత నాగేంద్ర. 'జాతక ఫలం' సినిమా శ్రీనివాస్ జాతక ఫలాన్ని మార్చింది. "ఏలాదిగులేలా బాలా", 'లోకులు కాకులే ' అన్న పాటల్ని ఆ సినిమాలో పాడారాయన. 'భలే రాముడు' చిత్రంలోని 'భయమేలా ఓ మనసా...ఇదంతా భగవంతుని లీల' పాటతో ఆయనకు మంచి పేరు వచ్చింది. దాంతో భయం లేని మనసుతో సినీ నేపథ్య రంగంలో స్థిరపడిపోయారాయన.

అక్కినేని, నందమూరిలతోపాటు తెలుగులో అందరి హీరోలకు, ఎక్కువగా కాంతారావు, హరనాథ్‌లకు పాడారాయన. వారితో పాటు హాస్యనటుడు రేలంగికీ, అపూర్వ నటులు నాగయ్య,

జగ్గయ్యలకు కూడా పాడారాయన. పి.బి.శ్రీనివాస్ పేరు గుర్తుకు రాగానే మనసులో మెదిలే పాటలెన్నో. 'చిగురాకుల ఊయలలో ఇల మరచిన' చిలుకను, 'అందాల ఓ చిలుకా!' అంటూ అందుకోమని లేఖ రాశారు. 'వెన్నెల రేయి ఎంతో చలి చలి...వెచ్చనిదానా రావే నా చెలి' అంటూ, ఆమె 'నీలి కన్నుల నీడలలోన' దాగున్నారు. 'ఓహో గులాబి బాల' అంటూ, 'చిన్నారి పొన్నారి పువ్వు'ని పలకరించారు. ఇంకా, 'నీ అందాల చేతులు కందేను పాపం, సాయం వలదా?', 'ఎవరికి ఎవరూ కాపలా', 'ఊరు మారినా ఉనికి మారునా?' అన్న పాటలు కూడ వెంటనే గుర్తుకొస్తాయి.



పి.బి పాడిన భక్తి పాటలకు అంతే లేదు. 'శ్రీరఘురాం జయరఘురాం' అంటూ సకలజన మనోభిరామంగా పాడారు. పోతనకుఆయన పాడిన పాటల్లో ఆ పాత్రకు తగిన సౌశీల్య వినయ సంపదనీ, భక్తి పారవశ్యాన్నీ బాగా పలికించారు. "కాటుక కంటినీరు చనుకట్టు పయింబడ ఏల ఏడ్చెదో" వంటి పద్యాల ఆలాపనతో పోతనను పోత పోసి అజరామరం చేశారు.

యుగళ గీతాలను ఇంచుమించుగా అందరి గాయనిలతోను కలిసి పాడారు. తెలుగులో భానుమతి, సుశీల, జానకి, జిక్కి, లీల,ఎస్. వరలక్ష్మి, ఎల్లారీశ్వరి, జమునారాణి, వసంత మొదలైనవారితో



పాడారు. హిందీలో లతామంగేష్కర్, ఆశాభోంస్లే, షంశాద్ బేగం, గీతారాయ్, మన్నాడే,సుధామల్హో త్రాలతో పాడారు. 'మైఖీ లడకీ హూం'చిత్రంలో 'చందాసే ప్యారా' యుగళ గీతాన్ని తననెంతో ప్రభావితంచేసిన లతామంగేష్కర్‌తో కలిసి పాడటం తనకెంతో తృప్తి కలిగించిందంటా రాయన.

ఒక్క తెలుగులోనే కాదు, హిందీతోపాటు కన్నడ, తమిళ, తుళు, మళయాళ, కొంకణీ, బెంగాలీ, సౌరాష్ట్ర, ఉర్దూ, సంస్కృత భాషల్లోను, ఆంగ్ల, జపనీ అంతర్జాతీయ భాషల్లోను వేలాది పాటలు పాడారు. 1960లో 'భక్త కనకదాస్'తో ప్రారంభించి రెండున్నర దశాబ్దాలపాటు 'కన్నడ కంఠీరవ' రాజ్‌కుమార్ పాటలన్నీ పి.బి.యే పాడారు. తమిళంలో జమినీ గణేశన్,జయశంకర్‌లకు పాడారు. ఆయా భాషల్లోపాడే అవకాశం రావడంవల్ల ఆ భాషల నుడికారాన్ని పట్టుకోవాలనే తపనతో క్రమంగా ఆ భాషలన్నీ నేర్చుకున్నారు శ్రీనివాస్. అందుకే ఆయన ఏ భాషలో పాడినా ఆ భాషకు చెందిన గాయకుడే అనిపించారు. బి.కాం.తో పాటు హిందీ విశారద చేసిన శ్రీనివాస్, ఉర్దూ భాషలో మంచి కవిత్వముందని తెలుసుకుని, దాన్ని చదవడం కోసం ఉర్దూ నేర్చుకున్నారు.

పాడిన భాషలను నేర్చుకోవడమే కాదు, నేర్చిన భాషల్లో రాయడం కూడా చేశారు శ్రీనివాస్. చిన్నతనంలో సినిమా పాటల హమ్మింగ్‌తో పాటు ప్రియాంక, ప్రియ భాషి, విశ్వసాక్షి, త్రిలోక



పాటలతో ప్రారంభించి, వివిధ భాషల్లో పాటలు, భజనలు రాసి ఎన్నో ప్రైవేటు రికార్డులిస్తున్నారు.

అయితే, పి.బి. శాస్త్రీయ సంగీతంలో సరళీ స్వరాలను కూడా నేర్చుకోలేదు. వినికిడితోనే స్వర జ్ఞానాన్ని పదిలపరచుకున్నారు. ఇప్పుడు స్వరం రాసుకునే పాడతారు. సంగీత శాస్త్రంలో సైతం కృషి చేశారు, పి.బి. 'నవనీత సుమ సుధ' అనే స్వీయ రాగ జనితాన్ని కూర్చారు. ప్రముఖ సంగీత విద్వాంసురాలు, పద్మభూషణ్ డి.కె. పట్టమ్మాళ్ దానిని ఆశీర్వదించారు. డెబ్బై రెండు మేళకర్త రాగాలను వివరించే విధంగా గణిత సూత్రీకరణ చేసి దానికి "వజ్రపు తాళం చెవి "గా నామకరణం చేశారు. దీని సహాయంతో సంగీత జ్ఞానం లేని సామాన్యుడు కూడా మేళ కర్తల వైవిధ్యాన్ని తెలిపే రహస్యాలను తెరువగలుగుతాడు.

ప్రస్తుతం తమిళనాడు ప్రభుత్వ సంగీత పాఠశాలకు 'సలహాదారు'గానున్న పి.బి. పైన, సినీ నేపథ్య రంగంలో ఆయన చేసిన కృషిపైన పదిహేను ఎపిసోడ్‌ల సీరియల్‌ను కన్నడ టీవీ ప్రసారం చేసింది.

ప్రస్తుతం తమిళనాడు ప్రభుత్వ సంగీత పాఠశాలకు 'సలహాదారు'గానున్న పి.బి. పైన, సినీ నేపథ్య రంగంలో ఆయన చేసిన కృషిపైన పదిహేను ఎపిసోడ్‌ల సీరియల్‌ను కన్నడ టీవీ ప్రసారం చేసింది.

నేటి నేపథ్యగానం గురించి చెబుతూ, ట్రెండ్ మారడంవల్ల మెలోడీ లోపిస్తోందనీ, మ్యూ.జిక్‌లో 'ఎం' ఎగిరిపోయి, 'యూసిక్' మిగిలిందనీ ('ఎం' ఫర్ మెలోడీ) నర్మగర్భంగా అంటారు పి.బి. రసజ్ఞత లేకపోతే ఏ కళకైనా ప్రయోజనం శూన్యమనీ, అన్ని రంగాల వలె, సినీ నేపథ్య గానానికి కూడా అధ్యయనం, అవగాహన, విశ్లేషణ అవసరమనీ, సాధన చేస్తే ఎవరైనా సినిమాల్లో పాడవచ్చుననీ అంటారు, పి.బి.శ్రీనివా(యి)స్!

సంచారి వంటి కలం పేర్లతో చేసిన రచనలు అప్పటి వివిధ పత్రికలలో ప్రచురింపబడ్డాయి. ఈ మధ్యనే ఆయన లతామంగేష్కర్ జీవిత చరిత్రను రాశారు. వచన రచనలతో పాటు, పద్యరచన కూడ చేశారు. శ్రీనివాస వృత్తం, గాయత్రీ వృత్తం వంటి ఛందోప్రయోగాలు చేశారు. ఉర్దూ సాహిత్యంలోని గజల్ ప్రక్రియకు ముగ్ధులై ఉర్దూతోపాటు, ఎనిమిది భాషల్లో ఎన్నో గజళ్ళు రాశారు. గాయకుడే కనుక పాడారు. గజళ్ళను శాస్త్రీయంగాను, లలితంగాను, కొంచెం అటూ ఇటూగా పాడవచ్చుగాని, 'గజల్ తనం' పోకూడదంటారు. 'గజల్‌కు పాశ్చాత్య సంగీతమూ, బాణీలూ ఎంత మాత్రం సరిపడవంటారు. ఉర్దూలో 'గజ్‌రా' అనే నూతన ప్రక్రియకు పురుడు పోసారు. ఇంగ్లీషులో 'లవ్లీ లవ్ సాంగ్స్'ను ప్రచురించారు. సంస్కృతాంగ్లాంధ్ర కన్నడ తమిళ మళయాళ హిందీ ఉర్దూలలో లక్షలకొద్దీ కవితలు రాశారు. చంద్ర మండలంపై నీల్ ఆర్మ్ స్ట్రాంగ్ పాదం మోపిన సందర్భాన్ని పురస్కరించుకుని ప్రయోగాత్మకంగా ఒక రచన చేసి, సంగీతం కూర్చి రికార్డు చేశారు.

'మేథోగమనంలో తలపుల మెరుపులు మెరవగా హృదయ పుస్తకంలో ' వాటిని పాటలు, కవితలు, గజళ్ళుగా భద్రపరుస్తున్నారు పి.బి. 'ఆడుతూ పాడుతూ' అన్నది భాషాప్రయోగం. కాని శ్రీనివాస్ దాన్ని 'రాస్తూ ,పాడుతూ' అని మార్చివేసారు. ప్రస్తుతం సినీ నేపథ్యగానం మానేసినా, ఒక్క క్షణమూ తీరిక లేనితనంతో నిరంతరం 'రాస్తూ... పాడుతూ' ఉన్నారాయన. 'మంచి రోజు' సినిమాలోని

email: makineedibhaskar@gmail.com

ప్రొఫైల్

# చిత్రకళా( స్నేహ) జీవి మురళీధర్





మురళీధర్.



**కళాకారులలో భిన్న మనస్తత్వాలు కలవారుంటారు. తాము నేర్చుకున్న కళలు ఇతరులకు పంచడానికి ఇష్టపడనివారు కొందరైతే, తాము నేర్చుకున్న కళను తోటివారికి కూడా నేర్పించేవారు కొందరు. ఏకళకైనా సరియైన శిక్షణతోపాటు, మార్గనిర్దేశకత్వము అవసరం. అప్పుడే ఆయా కళలలో రాణించగలరు. హైదరాబాద్‌కు చెందిన మురళీధర్ గారు మంచి చిత్రకారులు మాత్రమేకాదు, కళాభిమానులు కూడా. కళాకారులను ప్రోత్సహించడంలోను, వారిక సహాయ, సహకారాలు అందించడంలోనూ ముందుంటారు. ఎందరో కళాకారులతో మైత్రీ బంధాన్ని కొనసాగిస్తూ చిన్న,పెద్ద అన్న తేడా లేకుండా రాష్ట్రంలోని ఎందరో చిత్రకారులను, శిల్పులను ప్రత్యక్షంగా కలుసుకొని, ప్రతిభ వున్న కళాకారులను ప్రోత్సహిస్తారు.**

భారత మాజీ రాష్ట్రపతి వి.వి.గిరి, మాజీ ప్రధాని మంత్రి ఇందిరాగాంధీ, రాష్ట్ర మాజీ ముఖ్యమంత్రి మర్రి చెన్నారెడ్డి, అమితాబ్ బచ్చన్‌ల పోట్రయిట్ చిత్రాలను వేసి... వారి నుంచి అభినందనలు పొందిన కళాకారుడు మురళీధర్. నాయకుల చిత్రాలనే కాకుండా ప్రకృతి అందాలు, జలపాతాలు, పక్షులను గీయడంలో పేరుగాంచారు. 1950లో అనంతపురం జిల్లా, పామిడిలో జన్మించిన మురళీధర్‌కు చిన్న నాటి నుంచి డ్రాయింగ్, పెయింటింగ్‌లు వేయడం అలవాటు. కర్నూలు ఉస్మానియా కళాశాలలో చదివే సమయంలో

ఆర్ట్, పెయింటింగ్, డ్రాయింగ్‌లో ప్రథమ బహుమతి లభించింది. నాటి నుంచి నేటి వరకు ఎన్నో రకాల వర్ణచిత్రాలు, జీవన చిత్రాలు, పక్షులు, జంతువుల చిత్రాలు అద్భుతంగా గీశారు. 1976లో అనంతపురం జిల్లాలో వాణిజ్య పన్నులశాఖలో ఉద్యోగం వచ్చింది. ఆర్ట్ మాస్టార్లు ఎం.లక్ష్మిదేవమ్మ, జి. వెంకటరమణాచారి, సి. చంద్రమునయ్య, సి. వెంకటేశ్వర్లుతో కలిసి అనేక ప్రదర్శనలలో పాల్గొన్నారు. ఏ.సి.టి.ఓ.గా పదవీ విరమణ చేసిన తరువాత ఔత్సాహిక కళాకారులకు శిక్షణ ఇచ్చి డ్రాయింగ్ లోయర్, హయ్యర్. టిటిసి చేసేందుకు తోడ్పడుతున్నారు. 2003లో ఆంధ్రప్రదేశ్ తెలుగు భాషాఉద్యమం జిల్లా సదస్సులో వీరు చిత్రించిన తెలుగు వర్ణ చిత్రాలకు అప్పటి జిల్లా కలెక్టర్ సోమేష్ కుమార్ నుండి ప్రశంసాపూర్వకమైన అభినందనలందుకొన్నారు.



**పుస్తక ప్రియులు**

# పగటి వేషాలు- సామాజిక అంశాలు

## ఫకీరు సాయిబు వేషం

రచన
ప్రముఖ నటుడు, చిత్రకారుడు
తాతా రమేశ్‌బాబు
email: rbtata60@gmail.com

పగటి కలలు కనొద్దు అంటారు
పగటి వేషాలు వెయ్యొద్దు అని కూడా అంటారు.
వేషం అంటే మారు రూపం

### ఫకీరు సాయిబు వేషం

"రోజ్ దారో సహారా కి టైం అదాహ్ రహిహై"

(ఉపవాసం వుండే వారికి సమయమయినది లేవండి)

అంటూ తెల్లవారు ఝామున 4 గంటలకు వినపడ్డాయి అంటే ఖచ్చితంగా అది ముస్లింల పవిత్ర రంజాన్ మాసం అయి వుంటుంది. పై మాటలు ఫకీర్ సాయిబు పలుకులు అయి వుంటాయి.

'లా ఇలాహ ఇల్లల్లా, మూరే మెహంమాద్ సులేల్లా"

(ముత్యాలతో వుంటాడు దేవుడు)

అనే గానం వినపడితే, అది 'మొహర్రం పండుగే!

మసీద్ నుండి జెండా లేపుతూ,

"ఆవో అల్లాహం జెండా ఉతారహిహై

యా అల్లా హబ్ సబ్ మందిర్ మే గీత గాయే"

అంటూ గానం చేసేది కూడా ఫకీర్ సాయిబులే!

పవిత్ర రంజన్ నెలలో ప్రతి రోజూ తెల్లవారు ఝామున 4 గంటలకు అల్లా భక్తులను మేలు కోల్పుతూ ఉంటాడు. మిగతా రోజులలో ప్రతి శుక్రవారం ఉదయం 9 గం.ల నుండి 11 గం.ల వరకూ మరియు సాయంత్రం 4 గం.ల నుండి 6 గ.ల వరకూ అల్లాని ప్రార్ధిస్తూ గడప, గడపకు తిరుగుతాడు ఫకీర్ అజ్మీర్ దర్గా నుండి సాధారణ దర్గాల వరకూ అల్లాని ప్రార్ధిస్తూ జీవిస్తూంటారు ఫకీర్‌లు.

ప్రతి సం. మార్చినెలలో కృష్ణాజిల్లా, గుడివాడలో 'గౌస్‌లాజం దస్తగీర్ పేరు మీద 'గారెమి' ఉత్సవాలు జరుగుతాయి నెలపొడుపు తరువాత 11వ రోజు నుండి నెలలోపు ఈ పండుగ ఎంతో భక్తి శ్రద్ధలతో నిర్వహిస్తారు. 'వలిఅల్లా' అంటే దేవుని భక్తుని మీద పండుగ చేస్తారు. ఎక్కడ వున్నా, ఎంత ఉన్నత స్థితిలో ఉన్నా, ఇలాంటి పండుగలకు హాజరవుతారు నమ్మకస్తులు. స్వర మాంత్రికుడు, ఆస్కార్ అవార్డు గ్రహీత ఎ.ఆర్ రెహమాన్ గత మూడు సం॥లుగా నెల్లూర్ జిల్లా వెంకటాచల మండలం, కనుమూరు మస్తాన్ వలీ దర్గాను దర్శించుకొని, 'గందోత్సవం'లో పాల్గొంటున్నాడు.

ప్రజలు తమ కోరికలు చెప్పి వలీ అల్లాకు మొక్కుతారు. ఈ పండగలో ఆ మొక్కును తీర్చుకోవటానికి జెండాలు తీస్తారు. కొన్ని వందల జెండాలు వుంటాయి. ఇక్కడ గ్యారామిలో గ్యా అంటే 11. వలీ అల్లా పేరు మీద 11రోజులు ఉత్సవాలు జరుపుతారు. కోరికలు చెప్పుకొని మొక్కిన వారి కోరికలు తీర్చటానికి వలీ అల్లాలలో పెద్దవాడయిన 'గౌస లాజం దస్తగీర్' ముస్తుమ్మాడని ప్రతీతి. గుంటూరు



మస్తాన్ వలీ, పెదకాకాని బాజీ వహీర్ బాబా అజ్మీర్‌లో ఖాజా గరీబ్ నవాజ్, నెల్లూరు దగ్గర హజరత్ ఖాజా రహ్మతుల్లా, రహ్మితున్నిసా... ఇలా ముస్లింలలో ముక్కోటి 'వలీఅల్లా'లు ఉంటారు.

ముఖ్యంగా ఈ ఉత్సవాలలో గందం తీస్తారు. ఒక గుర్రం మీద ఈ గంధం బిందెను పట్టుకున్న మనిషిని ఊరేగిస్తారు. ఊరేగింపు ముందుగా జెండాలు నడుస్తాయి. ఈ జెండాకి పూలు అలంకరిస్తారు. అనంతరం రోగాలతో బాధపడుతున్న వారికి కావలసిన వారికి ఈ గంధం పంచుతారు. గంధం ఒంటి మీద రాసుకుంటే సర్వరోగాలు తగ్గుతాయని నమ్ముతారు.



కడప పకీర్ల బాబా గీతాల ఆలాపనలు.

ఇక్కడ పకీర్లు మేళాగా, వలీ అల్లాను పొగుడుతూ పాడతారు. ఇందుకుగాను భక్తులు వీరికి బియ్యం, డబ్బులు ఇస్తుంటారు. ఆ సంపాదన అంతా మళ్లీ ప్రజలకే ఉపయోగిస్తారు ఫకీర్‌లు.

"బరాటను తిప్పుతూ ఉర్దూ యాసతో తెలుగు మాట్లాడతారు. తన్వుకి ప్రాణాంకి అబ్బాబందం హై సాబ్. ఓక్ దాన్కి బాద్ వస్తే రెండ్ దాన్కి వస్తాది. అడ్విక బోయి జిల్కన్ దేస్తం. పన్జరంలో పెట్టి అచ్చాగా తినిపిస్తాం. అలవాటు అయిందని పన్జరం తెర్చామా, చెప్పకుండా దౌడ్ తీస్తాది. దేహం అనే పన్జరం నుంచి జీవం అనే జిల్క ఎగిరి పోద్ది సాబ్. మాదీ మాటా వింటే , ధర్మం చేస్తే మీది జిల్కపోదు. అల్లాచూస్తాడ్ సబ్".

ఇలా సాగుతుంది ఫకీర్ సంభాషణ

'ఫకీర్'అంటే ఎవరు?

'సై' అంటే ఆకలి దప్పులతో వుండాలి. 'కాఫ్' అంటే దైవ ధ్యానాన్ని లీనమై చేయాలి. ఖినాత్ వుండాలి. ఏ యాద్ ఎ ఇలాహి అంటే ఎప్పుడూ పడుకున్నాలేచినా 24 గంటలు దైవాన్ని స్మరిస్తూ వుండాలి. 'రియాజ్' అంటే తపస్సు చేయాలి. దైవాన్ని, దైవత్వాన్ని అధ్యయనం చేస్తుండాలి.

*ఈ నాలుగు ఉత్తమ గుణాలున్న వాడూ 'ఫకీర్'.*

ముస్లింజాతిలో రుషి లాంటివాడు ఫకీర్. ఫకీర్‌గా మారటానికి అన్నీ త్యాగం చేయాలి. వీరు అల్లాకి పుత్రులుగా గౌరవింపబడతారు.

ఫకీర్‌గా మారాలనుకుంటే మారాలనుకున్న వ్యక్తికి గడ్డం, మీసాలుతో సహా అతని శరీరం మీద ఏ రకమైన వెంట్రుకలు ఉండకుండా తీయాలి. ఆ తరువాత వారికి 'కఫన్' అంటే మరణించిన వారికి తొడిగే తెల్లని గుడ్డతో అలంకరిస్తారు. శాస్త్ర యుక్తంగా, ఇతను మానవుడు కాదు, ఫకీర్లో కలిసి పోయావు అనే అర్థం వచ్చే మంత్రాలు చదువుతూ ఒక గొయ్యి తీసి అందులో పడుకోబెడతారు. ఆ గోతిని కప్పుతారు. గాలి పీల్చుకుని బతకడం కోసం ఆ గోతి ఉపరితలంపై కొన్ని రంధ్రాలు వుంచుతారు. ఇలా మంత్రాలతో శుద్ధి చేసి. నిష్ఠా గరిష్టుడను చేసిన తరువాత మూడురోజుల అనంతరం ఆ గోతినుండి బయటకు తీస్తారు.

ఇప్పుడు పరిశుభ్రంగా స్నానం చేయించి ఆకు పచ్చని రంగులో వున్న పైజామాను ధరింపచేస్తారు. 'దప్' అంటే డప్పుచేతికి ఇస్తారు. 'కంజరి' అని అంటారు డప్పుని. 'దప్'పైన ఒకటి లేదా రెండు దెబ్బలే వేయాలి. అలాంటి దరువులే వుపయోగించాలి పడేటప్పుడు ఫకీర్. ఇప్పుడు మామూలు మనిషి ఉద్రేకించబడిన 'ఫకీర్' అయినట్లే.

ఆ తరువాత ఫకీర్ ఇహలోకం గురించి పట్టించుకోడు, మాట్లాడడు. మరణించిన తరువాత విషయాల గురించి పై లోకం గురించి మాత్రమే చర్చిస్తాడు.

18 గజాలున్న గుడ్డను ఇస్తారు. దీనితో 'పట్కా' అనే తలపాగా చుట్టుకుంటాడు.

*ఫకీర్‌లలో నాలుగు రకాలు వుంటారు.*

మొదటివాడు 'ఖలందర్'అంటే, 'జబర్దస్తి' చేస్తాడు. సాహసం కలవాడు. ఇతరుల దగ్గరకు వెళ్లినప్పుడు వారు ఇవ్వగలిగింది అంచనా వేసి అడుగుతాడు. ఇవ్వకపోయినా 'జా ఏ ఒ' అన్నా అక్కడే క్రింద పడి ప్రాణాలు వదలటానికయిన సిద్ధపడతాడు.

రెండవవాడు 'దర్వేష్' అంటే జాలి గుండె కలవాడు. ఏమిచ్చినా తీసుకుంటాడు.

మూడవవాడు 'రహేనుమా' అంటే మార్గదర్శకుడు. నైతిక మార్గం చెప్పి మార్గ దర్శనం చేస్తాడు. దైవత్వం వైపుకు వెళ్లాడు.

నాలుగవ వాడు 'గోపనషి' అంటే అజ్ఞాతంలో వుంటారు. ఎవరితో కలవరు. దైవంలో లీనమైపోతారు. 'పాసబ్ జరా జాయిం' అంటారు. కోపం తెప్పించరు.

పై నాలుగు ఫకీర్‌లకు సన్మార్గం చూపెట్టటమే జీవలక్షణం. వీరిని 'సూపియక్రం' అంటారు. ఎవరికీ హాని చేయరు. మేలు చేస్తారు. సాధు జంతువులు, పర్యటనలు చేస్తారు. 'సయ్యా' అంటే పర్యాటకుడు. అందుకే వీరిని 'సాయి' అంటారు. ఎక్కడికి వెళ్లాటానికయినా ఎవరూ అభ్యంతరం చెప్పరు వీరికి.

రవాణా సౌకర్యాలు లేని రోజులలో ఇతర చోట్ల వున్న బంధువుల ఉనికిని తెలియచేసేవారు.

చిట్కా వైద్యం చేస్తారు. పసిపిల్లవాడికి నీరుడు బంద్ అయితే సుద్దని నీటితో కలిపిన మిశ్రమాన్ని, ఆ పిల్లవాడి బొడ్డుమీద రాస్తే నీరుడు వచ్చేది ఇదో చిట్కా.

ఫకీర్లు ఎక్కడ బసచేస్తున్నారో తెలుసుకొని ప్రజలు అక్కడికి వెళ్లి ధాన్యము వగైరాలు ఇచ్చేవాళ్ళు. ఆ వచ్చిన ధనమంతా 'గంగర్‌ఖానా' అనే ఉచిత భోజనశాలలో భోజనం పెట్టటానికి ఉపయోగిస్తారు.

కొంతమంది ఫకీర్‌లు గుండ్రంగా నుంచుని భజన చేస్తారు. దీనిని 'సుమా' అంటారు. లా ఇలాహా ఇల్లల్లా అంటే దేవుడు తప్ప ఎవరూ పూజ్యులు కాదు అని చెప్పే మూలమంత్రం నుండి అణువుగా వుండే కీర్తనలతో భజన చేస్తారు. 17వ శతాబ్ధంలో రాజులకి సీక్రెట్ ఏజెంట్స్‌గా పనిచేసేవారు. ఆలిం మాలిక్ రాజ్యాలను జయించి పెట్టారు.

*పగటి వేష ప్రదర్శన*

*"ఏ దంకా కహా భరోసా, అల్లా సబిర్ కేలో తమాషా*

*మహమ్మద్ కి అల్లాహై తూ, యహ నికల్ రహ హై"*

(అల్లా, నబిర్‌లు తమాషా చెయ్యండి. ఈ డప్పు నాకు భరోషా ఉండి. మహమ్మదీయుల అల్లా నువ్వు ఇక్కడ వున్నావు) అని పాడుతూ, అనుగుణంగా డప్పు వాయిస్తూ వస్తారు. సుమారు 6 నుండి 8 మంది వరకూ వుంటారు మెడలో తావీజు, కళ్ళకు సుర్మ పెట్టుకుంటారు. పచ్చని, నారింజ, తెలుపు రంగు పూసల దండలు మెడలో వుంటాయి. పెద్ద చొక్కా, గల్లలుంగీ కట్టుకుంటారు. తలకు చిలక పచ్చని పాగా చుట్టుకుంటారు.

*ఒకరిచేతిలో గిరిక*

*ఒకరిచేతిలో ఫకీరు చెప్పు (భిక్షపాత్ర)*

*మిగిలిన వారు కంజరి పట్టుకుంటారు.*



"ఆవులల్లాకి బేటా, ఫకీరు సాయిబులం" అనుకుంటూ వస్తారు. బాజీర్, అక్షయపాత్ర, లైటు తీసుకుని బయలు దేరతారు. హిందూ ముస్లిం బేధం లేకుండా అందరి ఇళ్ళకు వస్తారు. గజిల్స్ పాడుతూ వాటి అర్థాన్ని తెలుగులో చెపుతూ ప్రతి ఇంటి వద్ద దీవెనలు చెప్తారు.

"అల్లాకి పుత్రులం మనం. అల్లా అంటే భగవంతుడు. భగవంతుడు మనకు అనేక రకాలుగా వున్నాడు. మనం వయసులో వున్నపుడు పెంచిన కండల్ని, సంపదని చూసుకుని బంధుమిత్రులను చూసుకుని గర్వపడుతూ సాటి వాడిని బాధ పెడతాం. సాటి వాడికి హాని చేస్తే అల్లా క్షమించదు.

ఈ ప్రాణ మనేది ఒక చిలుక లాంటిది. ఆ చిలుకను తెచ్చి దేహమనే పంజరంలో బంధించారు. కాని ఈ పంజరం తలుపులు ఎప్పుడు తీస్తే అప్పుడు ప్రాణమనే చిలుక పారి పోతుంది. ఈ ప్రాణం అనే చిలుకను ఎంత దాచిపెట్టినా అది పారి పోవాలనే చూస్తుంది. కాబట్టి చిలుక ఉన్నంత వరకే ఈ ప్రాణం చిలుక వున్నంతవరకే ఆ పంజరం. చిలుక పోయాక ఆ పంజరాన్ని పాత సామానుల వాడికి ఇస్తాం. ఈ దేహాన్ని ఖర్చుపెట్టి పూడుస్తాం ఖననం చేస్తాం.

ఒక ఏనుగు చనిపోతే దాని అంకుశం మిగులుతుంది.

ఒక గుర్రం చనిపోతే దాని వీపుమీద వేసే 'జీనుగ' మిగిలిపోతుంది

ఒక దేటా చనిపోతే అతని పేరు మిగిలిపోతుంది.

కాబట్టి మనిషికి ఉదారత్వం కావాలి. అందర్నీ గౌరవించాలి, పూజించాలి, అల్లాని ధ్యానించాలి.

ఈ శరీరాన్ని చూసి మోసపోవద్దు. శరీరం అనేది కేవలం తొమ్మిది రంధ్రాల తోలుబొమ్మ. కాబట్టి ఈ కడుపులో ఎన్నో దుర్గంధ పదార్థాలు వున్నాయి. సుఘంధ పరిమళాలతో పోషించినా, చనిపోయిన తరువాత ఆత్మ ఎక్కడికి వెళ్తుంది?

ఆత్మ వెళ్ళిన దేహం అగ్ని హెూత్రుని పాలు

కఠిన శల్యములు గంగపాలు

మీద కప్పిన దుప్పటి చాకలి పాలు

కొడుకు పెట్టిన కూడు కాకుల పాలు

దాచి పెట్టిన ధనము ధనుడిపాలు

భ్రష్ట పెళ్లమేమో పరుల పాలు

అందుకే ఏది, ఎవరకీ తోడు రావు కాబట్టి ఈ ఆత్మ చాల గొప్పది. పరమాత్మ ఇంకా గొప్పది.

ఆత్మ, పరమాత్మ ఒక్కటైతే మానవుడు సాధించేది చాలా ఉంది. పంజరం దాటి చిలుక అడవిలోకి వెళ్ళిపోతుంది. కాబట్టి అడవి అనే లోకంలో చిలకలాగ జీవించాలి. పంజరాన్ని కాపాడుకోవాలి. చిలకపలుకులు పలకాలి.

"లాల్లకి రూప్ హమరే సాత్ రహే తక్ హం జీ సక్తే

నహి నహితో హం నహిజి సక్తే"

(దేవుడు మనతో ఉన్నంత వరకే మనం బతగగలం. లేకపోతే బతకలేం).

మనం ఇహలోకంలో పడే సుఖ, దు:ఖాలను విడిచి దేవుడ్ని ప్రార్థించాలి. అలా నిష్ఠతో ప్రార్థించే వాడే స్వర్గానికి వెళ్తాడు.

"ఆద్మీ సుక్ దుక్ సే లోక్ కర్ అల్లాకే ప్యార్ కరనేసే

మహి ఆత్మా జన్నత్‌కు జాతాహై"

(అలాగే సాటి మనిషిని హింసించి బాధపెట్టే వాళ్ళు "జోజక్ పహంచ్ త హై" నరకానికి వెళ్తాడు. దుష్టులకు కనువిప్పు కలిగిస్తూ, దుర్మార్గులని సన్మార్గులుగా నడిపిస్తూ సాగుతుంది ఈవేశం. బిక్షను తీసుకుని చివరిగా దీవిస్తారు...

"ఆవులిల్లకా ఆ బాదర్ కి బేటా బేతి సుఖనందర్ కే

ఆవు లైం లాక్ మేర బాస జీతే రామ్"

(అల్లా పిల్లలయిన మీరందరు సుఖంగా, ఆనందంగా జీవించండి) అంటారు.

హిందు మతస్తులకు, ముస్లిం మతదేవుడిని పరిచయంచేసి ఏ దేవుడైనా ఆకాంక్షించేది ఒక్కటే అనే ధర్మాన్ని తెలియచేస్తారు.

సామాజిక అంశం:

వేషభాషలు వేరైనా మనిషి సాధించవలసిన ధర్మాలు అన్ని చోట్ల ఒకటిగానే ఉంటాయి. మానవత్వంతో బతకమనేదే ఏ మతానికైనా సారాంశం.

భౌతికంగా, ఆధ్యాత్మికంగా 'మనసు' పోషించే పాత్ర ప్రధానమైనది. మనసు స్వచ్ఛంగా, నిర్మలంగా ఉంటే మంచి పనులు చేస్తాం. సత్యానికి, ధర్మానికి, న్యాయానికి ప్రాధాన్యం ఇష్టం. అదే మనసు చేదు వైపు మళ్ళితే ....అమ్మో... దురాలవాట్లు, దౌర్జన్యాలు, వికృతానికి ఆవాసంగా మారుతుంది జీవితం... అందుకే ఆధ్యాత్మిక చింతన అవసరం చాలా ఉంది.

కళ్ళు, చెవులు, మనస్సు అల్లా ప్రసాదితం. వీటికి పదును పెట్టి సత్యాన్ని అన్వేషించి తన జీవితాన్ని, తన చుట్టూ ఉన్న జీవితాలను వెలుగుతో నింపాలి. ఇలాంటి సద్బోధనలు ప్రచారం చేస్తూ మానవులు జీవన విధానంలో మార్పును తీసుకురావటానికి దోహదపడాలి.

ఇలాంటి సామాజిక అంశమే ఫకీర్ వేషంలో జరుగుతుంది. ముస్లిం మత గ్రంథం 'ఖురాన్'లోని విషయాలను బోధిస్తూ వుంటారు ఫకీర్‌లు. ప్రభుత్వం కూడా 'వక్ఫ్ బోర్డ్' లాంటి సంస్థలను ఏర్పాటు చేసి ముస్లిం మతస్థులను అన్ని విధాలా ఎదిగేందుకు చేయూత అందిస్తోంది.

ఏతావాత ఆరోగ్యకరమైన సమాజాన్ని నిర్మించేందుకు తోడ్పాటు నందిస్తోంది ఈ వేషం.

# తెలుగు వారి ఆది పండుగ - ఉగాది



**మనకు అనేక పండుగలున్నాయి. ప్రతి పండుగకు ఒక విశేషం. ఒక అర్ధం, పరమార్ధం ఉంది. అందుకనే హిందువులు జరుపుకొనే ప్రతి పండుగలో ఏదో ఒక ప్రత్యేకత ఉంటుంది. అటువంటి ఎన్నో ప్రత్యేకతలున్న పండుగల్లో తొలి పండుగగా చెప్పుకొనబడే పండుగ "ఉగాది" దీనినే మనం తెలుగు సంవత్సరాది అని కూడా అంటాం.**

ప్రపంచం మొత్తం కొత్త సంవత్సరం అంటే ఇంగ్లీషు నెలల ప్రకారం జనవరి నెలతో ప్రారంభవుతుంది. దీన్ని మనం ఇంగ్లీషు సంవత్సరాది అంటారు. సూర్య సిద్ధాంతం అనే జ్యోతిష గ్రంథంలో చెప్పిన విధంగా సృష్టి కర్త అయిన బ్రహ్మ తన సృష్టిని బ్రహ్మకల్పం ప్రారంభమయ్యే మొదటి యుగాదిలో అంటే తెలుగుసంవత్సరాలలో మొదటి సంవత్సరం అయిన (ప్రభవ) మొదటి మాసం చైత్రమాసం మొదటి ఋతువైన వసంత ఋతువులో మొదటి పాడ్యమినాడు మొదటి నక్షత్రం అయిన అశ్వని నక్షత్రంలో ఈ సృష్టి ప్రారంబించాడని అర్ధం. అన్నిటికి ఆది అయిన పండుగను "యుగాది"గా వ్యహరిస్తారు. ఇలా ప్రతి పనిని మొదటగా ప్రాంభింపచేయుటం వలన ఈ పండుగ నూతన సంవత్సర పండుగగా (ఉగాది) మారింది.

ఉగాది నాడు మొదటి బ్రహ్మీ ముహూర్తంలో నిద్రలేచి, కాలకృత్యములు తీర్చుకొని, సూర్యోదయానికి ముందే నువ్వుల నూనెతో తలంటుకొని, సున్నిపిండితో నలుగు పెట్టుకొని, కుంకుడికాయలతో, గోరువెచ్చని నీటితో అభ్యంగన స్నానంచేయాలి. తరువాత నుదుట తిలకము ధరించి, నూతన వస్త్రములు ధరించి ఇష్టదైవ ప్రార్ధన చేయాలి అనంతరం ఇంటిలోని పెద్దలకు పాదాభివందనం చేసుకోవాలి. తర్వాత సమీపములోని శివాలయమునకు గాని మరేదైన దేవాలయమునకు వెళ్లి దైవదర్శనము చేసుకొని తీర్ధ, ప్రసాదాలు స్వీకరించాలి.

తదుపరి ఉగాది పచ్చడిని తయారుచేసుకోవాలి. కొత్త చింతపండు, లేత మామిడిచిగుళ్ళు, అశోక వృక్ష చిగుళ్ళు, కొత్త బెల్లము, వేపపూత, మామిడి, చెరుకుముక్కలు జీలకర్రలతో ఉగాది పచ్చడిని తయారుచేసుకోవాలి. ఈ విధంగా తయారుచేసిన ఉగాది పచ్చడిని పరగడుపున తీసుకోవాలి. ఇలా పరగడుపున తీసుకోవటం ఆరోగ్యానికి ఎంతో మంచిది. ఈ ఉగాది పచ్చడిని వసంత కాలంలో పుచ్చుకోవటం వలన ఈ మాసంలో వచ్చే అనారోగ్యాలకు గొప్ప ఔషదం వలే పనిచేస్తుంది. ఆరోగ్య శాస్త్రప్రకారం ఉగాది పచ్చడి ఉపయోగం ఇది.



# రసభరితం వసంతం

ఆద్యంతం రసభరితం ఆదిబుుతువు వసంతం

ఇక సుఖసంతోషాలు మీ సొంతం

కాగలదు ఖర నామ సంవత్సరం

సకల శుభప్రదమై సుఖాంతం



64కళలు.కామ్ తెలుగు పాఠక జనానికి ఖరనామ సంవత్సర తెలుగు ఉగాది శుభాకాంక్షలు తెలియజేస్తూ...



బి.యం.పి. సింగ్

ఇక ఉగాది పచ్చది తినటం వల్ల తీపి, చేదు, వగరు వంటి అనేక రుచులు మనం అనుభవిస్తాం. అంటే మనిషి జీవితంలో కష్టం, సుఖం, బాధలు, ఇన్ని రకాలు ఉంటాయని. వీటిని సమంగా స్వీకరించి జీవితంలో ముందుకు సాగాలని తెలియజేసేదే ఈ పచ్చడి ఉద్దేశ్యంగా చెప్పబడుతోంది.

ఈ పండుగరోజు పూర్ణకుంభ దానం చేస్తారు. అంటే రాగితోగాని, పంచలోహాలతోగాని తయారుచేసిన చెంబును తీసుకొని కలశంగా అలంకరించి కలశపూజ చేసి దానిలో జలము పోసి పుష్పాలు, అక్షింతలతో ఆవాహన చేసి, ఒక పళ్లంలో బియ్యం పోసి దానిని అందులో నిలబెట్టి దానికి కొత్త వస్త్రము చుట్టి కొబ్బరి బొండాన్ని ఉంచి గురువుగాని, సత్‌బ్రాహ్మణునికిగాని దానం చేయాలి. స్తోమతను బట్టి నూతన వస్త్రములతో దక్షిణలతో సత్కరించాలి.

ఈ ఉగాది పర్వదినాన పంచాంగ శ్రవణంచేయాలి. పంచాంగ శ్రవణం వల్ల తిది, వార, నక్షత్ర, యోగము, కరణముల ఫలితములను తెలుసుకోవటం వలన పంచాంగ శ్రవణఫలం లభిస్తుంది. పంచాంగ శ్రవణం వలన ఆ సవత్సరంలో గ్రహబలములు వారికి ఆ సంవత్సరఫలితములు ,ఆదాయ-వ్యయాలు, కష్ట-నష్టములు, గ్రహము పుష్కరాలు వంటి అనేక విషయములు తెలుసుకొంటారు. ఆ సంవత్సరం గ్రహములలో ఏదైన దోషములు ఉంటే శాంతిజపం వంటివి చేయించుకోవాలి.

స్థూలంగా ఉగాది నాడు మనంచేయవలసిన విధివిధానములు ఇవి. వీటిని తప్పక మనం ఆచరించినచో ఆ సంవత్సరంలోని ఎటువంటి దోషాలనైనా నివారించుకోవచ్చు. శ్రీఖరనామ సంవత్సరం (ఏప్రియల్‌నెలలో) వస్తున్నందున మనందరం భక్తిశ్రద్ధలతో ఉగాదిని జరుపుకొని సంవత్సరం మొత్తం సుఖసంతోషాలతో, ఆయురారోగ్యాలతో ఉండాలని ఆ పరమేశ్వరుని ప్రార్థిద్దాం.

**- విష్ణుబొట్ల రామకృష్ణ**

# పెళ్ళి కూతురి ముందు చూపు!

రండి,, రండి పంతులుగారూ అని పెళ్ళిళ్ళ పేరయ్యకు కుర్చీవేసి, మంచి నీళ్ళిచ్చి మర్యాద చేశాడు రఘునందన.

ఏవిఎమ్

"మీ అపర్ణకు మంచి వరుణ్ణి చూశానండీ!"

వివరాలు అన్నీ చూశాడు రఘునందన, అన్నీ బాగానే వున్నాయి. మంచి ఉద్యోగం వుంది. జాతకాలు కూడా కలిసాయి. లోపల అపర్ణకూ తన భార్యకూ వివరాలన్నీ చెప్పి వస్తానంటూ, ఈ లోగా టీ.వీ. చూస్తూ వుండండీ అని టీ.వి. ఆన్‌చేసి లోపలికి వచ్చాడు రఘునందన.

"అబ్బాయి నచ్చాడండీ, కానీ ఉద్యోగం నచ్చలేదు అమ్మాయికి!" అన్నది భార్య నమ్రత.

'ఉద్యోగానికేం? మంచి కంపెనీలో పనిచేస్తున్నాడు అయిదంకెల జీతం!"

"జీతం గురించి కాదండీ, ప్రభుత్వ ఉద్యోగి అయితేనయం అంటోంది!"

"అక్కడికన్నా, ఇక్కడే ఎక్కువ జీతం తెల్సా!"

"సరే...ప్రభుత్వ ఉద్యోగం చేస్తున్న వాడే కావాలని ఏంటి అంత కోరిక!"?

"మీరే... అడగండీ! నాకు చెబితే ఇంకేం, మీరు అన్ని విషయాలూ నాకేమన్నా చెబుతున్నారా అదీ మీ కూతురేగా"?




"నాన్నా!"

"ఆం చెప్పు తల్లీ!"

"చెప్పు కాదు నాన్నా!"

"కుళ్ళు జోకులాపి మనస్సులో మాట చెప్పు!"

"ప్రభుత్వ ఉద్యోగంలో వుంటే...

అతనికి పొరపాటున ప్రమాదం జరిగితే...?

"పోతే, అతని ఉద్యోగం, అతని భార్యకుగాని, అతని పిల్లలకు గాని ఇస్తారూ... ఆ విషయం ఇప్పుడెందుకూ!"?

"వార్నీ!... మరీ అంత ముందు చూపా!" అని నోరు నొక్కుకుంటూ, తలుపు చాటున వుండి వింటున్న పెళ్ళిళ్ళ పేరయ్య అమాంతంగా రోడ్డు మీదికి లంఘించాడు.

సింగిల్ పేజీ కథ

64 కళలు.కామ్
www.64kalalu.com
సకల కళల సమాహారం

సంపుటి :1 సంచిక :7 మే 2011



## కృతజ్ఞతలు

64కళలుడాట్‌కామ్ ఆరు నెలలు పూర్తిచేసుకొని ఏడవ నెలలో ప్రవేశించింది. విశ్వవ్యాప్తంగా 38 దేశాలలో వున్న తెలుగువారు వీక్షిస్తున్న ఈ పత్రికకు రోజురోజుకు ఆదరణ పెరుగుతూనే ఉంది. ఫిబ్రవరి నెలనుండి ప్రారంభించిన పగటివేషాలు-సామాజికాంశాలు శీర్షికకు, కవితలకు పాఠకులనుండి విశేష ఆదరణ లభించింది.

మెనూ గ్యాలరీలో వున్న నాలుగు విభాగాలకు, లైబ్రరీకి కూడా ఎప్పటికప్పుడు కొత్తవి చేర్చడం జరుగుతుంది. గమనించగలరు.

పత్రికలో వ్యాసాలు బాగున్నాయని అభిమానంతో ఇ-మెయిల్స్ ద్వారా అభిప్రాయాలు తెలియజేస్తున్న పాఠక, కళాభిమానులకు కృతజ్ఞతాభివందనాలతో...

కళాసాగర్
ఎడిటర్

ముఖచిత్రం చిత్రకారుడు : **వేముల**



# నా గురించి నేను...

## కుమారి రాగతి పండరి





***తొలి తెలుగు మహిళా కార్టూనిస్టుగా గత నాలుగు దశాబ్ధాలుగా పాఠకులను అలరిస్తున్న కుమారి రాగతి పండరి తన జీవన గమనాన్ని - కార్టూనిస్టుగా స్వయంకృషితో ఎదిగిన వైనాన్ని "నా గురించి...నేను" పేరుతో అక్షరీకరణ చేసారు. 64కళలు.కామ్ లో ధారావాహిక రూపంలో గత ఆరు నెలలుగా విశేష పాఠకాదరణ పొందింది. ఈ నెలతో ముగియనుంది....***

స్త్రీలు చాలా తక్కువగా ప్రవేశించే ఈ కార్టూన్ రంగంలో మగవారికి ధీటుగా నాకంటూ ఒక ప్రత్యేక స్థానాన్ని సృష్టించుకోవడమేగాక, అత్యధిక కార్టూన్లు వేసిన మహిళగా పేరు తెచ్చుకోగలిగాను. ఈ కార్టూన్ కళ అనేది అనంతమైంది, అద్భుతమైంది, మహా సముద్రం లాంటిది. ఇందులో నేను సాధించింది చాలా తక్కువ, నేర్చుకోవాల్సింది ఎక్కువ. ఈ రంగంలో నేనింకా విద్యార్థినేననుకొంటున్నాను. గొప్ప గొప్ప కార్టూనిస్టుల కోవకి చేరుకోవాలంటే ఇంకెంతో కృషి, సాధన, పట్టుదల అవసరం. గొప్ప గొప్ప కార్టూనిస్టుల కోవకి చేరుకోవాలంటే ఇంకెంతో కృషి, సాధన, పట్టుదల అవసరం. నన్ను చాలా మంది అడిగే ప్రశ్న ఒకటుంది. మీరు బయట ప్రపంచంలో తిరిగినంత మాత్రాన, ఇంట్లోనే ఉన్నంత మాత్రాన ఏదీ సాధించలేం అనుకోవడం పొరపాటు. మనసుంటే మార్గం ఉంటుంది. అందుబాటులో ఉన్న విషయాల నుండి ఐడియాలను వెదకి పట్టుకొని ఆహ్లాదకరమైన కార్టూన్లు పండించడం నా అభిమతం.

కార్టూన్లు వేయాలంటే మగాళ్లకైనా, ఆడాళ్లకైనా ఆసక్తి అవసరం, సాధన ముఖ్యం. ఇవి లేకుండా ఎవరూ కూడా కార్టూన్లు గీయలేరు.



బొమ్మలు నేర్చుకోవాలనే పట్టుదల, కార్టూన్లు గీయాలనే కోరిక ఉంటే బుర్రలో ఐడియాలు అవే తళుక్కున మెరుస్తాయి. దేనినైనా స్వయంకృషితో సాధించవచ్చు. ఆడవాళ్లకి ఇంటి వాతావరణంలో బోలెడన్ని ఐడియాలు తడతాయి. అలాగే నేను లేడీస్ సబ్జెక్ట్ మీద వేసిన శ్రీమతి, ఇద్దరమ్మాయిలు, కాలేజీ గర్ల్స్ ఫీచర్లు పాఠకుల అభిమానంతో ఎన్నో ఏళ్లు పత్రికల్లో కొనసాగాయి. నేను వేసిన అన్ని ఫీచర్సులోనూ ఏకధాటిగా ఆంధ్రభూమి వీక్లీలో దాదాపు పన్నెండేళ్ల పాటు కొనసాగిన రాజకీయ



'చెద'రంగం అంటే నాకు చాలా ఇష్టం. ఇది ఎందరో పాఠకుల ప్రశంసలు పొందిన ఫీచర్. ఆ తర్వాత ఇద్దరమ్మాయిలు ఫీచర్ అన్నా కూడా నాకు మక్కువ ఎక్కువ. నా కార్టూన్ కెరీర్‌లో నాకెంతో సంతృప్తినిచ్చినవి ఈ రెండు ఫీచర్‌లు. ఇంతవరకు నేను పన్నెండు వేలకు పైగా కార్టూన్లను వివిధ పత్రికల్లో వేశాను. సామాజిక, రాజకీయ, దైనందిన సమస్యలపై కార్టూన్లు గీయడం జరిగింది. కార్టూన్ల మొదటి లక్ష్యం పాఠకులకు నవ్వుపుట్టించడం. రెండో లక్ష్యం తన కార్టూన్ ద్వారా సమాజ పరిస్థితిని అర్థం చేసుకొని స్పందింపజేయడం. ఈ రంగంలో నాకు ప్రత్యక్షంగా, పరోక్షంగా సహాయపడి నన్ను ఈ స్థితిలో నిలబెట్టిన ఎందరో మహానుభావులు అందరికీ నా ధన్యవాదాలు. ఇలాగే ఇంట్లో ఎంతో ప్రోత్సాహపు అనురాగాలు పంచి ఇచ్చే అమ్మ, అన్నయ్య , వదిన, రమక్క మేనకోడళ్లు శ్రీరేఖ, శిరీష, శ్రీశాంతిలకు నా కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను. ఇక పోతే నా జీవితంలో ఒక చిన్న కోరిక ఎప్పటికైనా ఒక్కసారి తెలుగుతల్లి ముద్దుబిడ్డ, ఆంధ్రులకే గర్వకారణం, అద్భుత చిత్రాల, అపురూప కార్టూన్ల సృష్టకర్త శ్రీ బాపు గారిని కలుసుకొని మాట్లాడాలని. ఈ కోరిక తీరాలని మనసారా దేవుణ్ణి కోరుకొంటున్నాను.

పాఠకుల మనసుల్లో రాగతి పండరి ఎప్పుడూ గుర్తుండేలా కలకాలం నా కార్టూన్లతో నవ్వుల పువ్వులు పండించాలన్నదే నా ఆశయం. నా గురించిన నేనులో ఇవన్నీ రాసుకొనే అవకాశం కల్పించిన శ్రీ సంకర చలపతిరావుగారికి, మరొకసారి నా ధన్యవాదాలు తెలుపు కొంటూ నాగురించి నేను రాయడం ముగించాను. ఎఫ్ఎం ఆన్‌చేసి మెల్లగా కిటికీ తలుపులు తెరిచాను-చల్లనిగాలి రివ్వుమని వీచింది-దానితో పాటు చిరుజల్లు మెల్లమెల్లగా ముఖాన్ని తాకింది-మనసు హాయిగా, ప్రశాంతంగా వుంది-ఆకాశంలో మబ్బులు హుషారుగా కదులుతున్నాయి-వాతావరణం ఆహ్లాదకరంగా ఉంది-రేడియోలో నవ్వుతూ బతకాలిరా తమ్ముడూ అని పాట వినపడుతోంది.




విశ్వ చిత్రకళలో మే 2002న ప్రారంభించిన నా గురించి నేను జూలై 2003 సంచికతో ముగిసింది. ఆనక ఈ ప్రయాణంలో కష్టాలు సుఖాలు, ఆనందాలూ, ఆలోచనలూ, ఆరాటాలూ... ఒకే రోజు... ప్రతి ఆర్టిస్టూ



ప్రతికార్టూనిస్టుల  హృదయాల్లో అపురూపమైన స్థానం సంపాదించుకున్న అందమైన బొమ్మల కొంటినవ్వుల కార్టూన్స్ సృష్టికర్త శ్రీ బాపుగారి నుండి లెటర్ అందుకున్నాను.

అది నాకు మరపురాని ఆనందాన్ని ఇచ్చిన ఏడాది. రచన మాసపత్రిక 2005 సెప్టెంబర్ సంచికలో ప్రచురించబడిన నా వినాయక చవితి కార్టూన్‌ని మెచ్చుకుంటూ నా కార్టూన్లుకు తమ అమూల్యమైన సూచనలూ, సలహాలూ, ఆశీసులతో లెటర్ వ్రాస్తూ నా కార్టూన్స్‌కి శ్రీ బాపుగారు బొమ్మ కూడా గీసి... ఆర్.కె. లక్ష్మణ్, గోపుల గార్ల కార్టూన్స్ బుక్స్ జతచేసి మరీపంపించారు. నిజంగా ఇది నేనే ఊహించని ఆనందం... అనుకోని అద్భుతం. ఇన్నాళ్ల నా కార్టూన్ కళ కృషికి ఇంత కన్నా ఏం వరాలు కావాలి?. శ్రీ బాపుగారికి నచ్చిన కార్టూన్ వేయగలిగినందుకు ఏ అవార్డులూ, ఏ రివార్డులూ ఇవ్వలేనంత ఆనందం కలిగింది. శ్రీబాపు గారికి నా ఆనందాన్ని తెలియజేస్తూ జవాబు రాయాలని ఇప్పటికి ఎన్ని సార్లు ప్రయత్నించానో, కానీ ఆ మహనీయునికి ఏమని ధన్యవాదాలు తెలుపుతూ జవాబు రాయాలో తెలియటం లేదు...

ఆయనతో కలిసి నవ్య వార పత్రికలో రంగుల కార్టూన్లు వేసే అపురూప అవకాశం రావడం ఎంతో సంతోషాన్ని నింపింది. అలాగే ... ప్రముఖ చిత్రకారులు శ్రీ బాలీ గారు విశాఖ వచ్చిన సందర్భంలో ... ఎంతో అభిమానంతో నన్ను చూడటానికి మా ఇంటికి రావడం ఆయన మంచి తనానికి నిదర్శనం. శ్రీ బాలీ గారు ఎంత యాక్టీవ్‌గా ఉంటారో ఆయన బొమ్మలూ, కార్టూన్లూ కూడా అంత యాక్టీవ్‌గా ఉంటాయి. ఈసురోమని కూర్చున్న వాళ్లు సైతం ఆయనతో ఐదారునిమిషాలు మాట్లాడితే హుషారుగా లేచి పని ప్రారంభిస్తారు. ఆయన్ని కలుసుకోవడం బొమ్మల గురించి ఎన్నో చక్కటి విషయాలు తెలుసుకోవటం ఒక మరిచిపోలేని ఆనందం.

మధ్య తరగతి పిల్లల కోసం తక్కువ ఫీజులతో ఇంగ్లీషు మీడియంలో ఫస్ట్ స్టాండర్డ్ నుంచి టెంత్ వరకు స్థాపించిన 'వెలక్స్' స్కూల్ అన్నయ్య రామరాజు వదిన రత్నకుమారిల కృషి దినదినాభివృద్ధి చెందుతూ ఉంది. ఇల్లే ఒక విద్యాలయంగా మారింది. నన్నుఎంతో ఆత్మ విశ్వాసంతో పెంచి అప్పటి నుంచి ఇప్పటి వరకు నన్ను నిరంతరం కార్టూన్లు గీయమని చెప్పే






అమ్మా... నా బాధను తన బాధగా నా ఆనందాన్ని తన ఆనందంగా నిరంతరం నా గురించి ఆలోచించే అమ్మ అంటే నాకు అమితమైన ఇష్టం. అమ్మ ఆరోగ్యం బాగుండాలని ఎప్పుడూ నా ఇష్ట దైవం శ్రీ వెంకటేశ్వరుడిని ప్రార్థిస్తూ ఉంటాను. విశ్వచిత్రకళలో 'నా గురించి నేను' రాయించటమే కాక అది ఒక పుస్తకంగా రావటానికి కృషి చేసిన శ్రీ సుంకరచలపతిరావు గారికి నేను ఎంతో కృతజ్ఞురాలిని. అలాగే ఈ విషయంలో నన్ను ఎప్పుడూ ఉత్సాహ పరుస్తూ తన వంతు కృషి చేసిన మిత్రులు శ్రీ బి.ఎస్.రాజుగారికి నా ధన్యవాదాలు తెలుపుకుంటున్నాను.

ఈ కార్టూన్ కళలో నేను ఎప్పుడూ విద్యార్థినే అనుకుంటాను. నేను నేర్చుకున్నది చాలా తక్కువే. ఇంకా నేర్చుకోవలసింది చాలా ఉంది. అందుకు పెద్దల సలహాలూ, సూచనలూ ఇప్పటికీ నాకో వరంగా భావిస్తాను జీవితంలో మన లక్ష్యాలను సాధించేందుకు నిరంతరం కృషి అనే ప్రయత్నం చేస్తూనే ఉండాలి అన్నదే నా నమ్మకం. అదే నా ప్రయత్నం. ఈ నాలుగేళ్ళలో తెలుగు వార పత్రికల్లో కొన్ని వందల కార్టూన్లు వేసి ఉంటాను. నా వ్యంగ్యాస్త్రాల నవ్వుల యుద్ధాన్ని కొనసాగిస్తూనే ఉన్నాను... ఇంతలో ట్రింగ్.... ట్రింగ్ మని ఫోన్ మోగింది. ఎత్తి హలో అన్నాను రాగతీ పండరి గారేనా అన్నారు. అవతల నుంచి! అవును... చెప్పండి అన్నాను. పండరి గారు మేము కొత్త పత్రిక పెట్టబోతున్నామండి దానికి మీ కార్టూన్ల సహకారం కోరుకుంటున్నాం... ప్లీజ్ అన్నారు ఆ కొత్త పత్రిక సంపాదకులు. ఓకే ఓకే తప్పకుండా అన్నాను. నవ్వుతూ...

...........• • •..............

# చిత్రకళా కురువృద్ధుడు వేముల కామేశ్వరావు



–పద్మకళ

సృష్టికి ప్రతి సృష్టి చేసే శక్తి కలవాడు కళాకారుడు రంగుల ప్రపంచాన్ని సృష్టించే కళాకారుని కుంచె అతని చేతిలోని అద్భుతం. అలనాటి రవివర్మ నుంచి నేటి బాపు వరకు ఎందరో కళాకారులు తరతరాలుగా తమ కుంచెపట్టుతో మదిలో ఉప్పొంగే బావుకతకు ప్రాణం పోసి, ఊహలకు రూపమిచ్చి చరిత్రలో చెరగని కళకు ప్రతిరూపాలయ్యారు. అయితే అసంఖ్యాకమైన కళారూపాలను తనలో దాచుకున్న కాలం ముందు మాత్రం ఎంత గొప్ప కళాకారుడైనా సమాధానపడక తప్పదు. మనసులో మెదిలే ఊహలకు అందమైన రూపాన్నిచ్చేందుకు కళాకారునికి వృద్ధాప్యం అడ్డుగోడగా మారుతుంది. వయసు రీత్యా ఎదురయ్యే పలు సమస్యల వల్ల చిత్రకారుడికి చేతివేళ్ళ మధ్య సహకారం కష్టమవుతుంది. ఇలాంటి తరుణంలో పట్టుదల ఉంటే పట్టు చిక్కకపోదంటూ, కళకు వృద్ధాప్యం అవాంతరం కాదంటూ రుజువుచేస్తున్న తొమ్మిది పదుల కళాకారుడు వేముల కామేశ్వరరావు.



1917 సం॥ విజయవాడలో పుట్టిన ఈ కళాకారుడు ఇప్పటికీ కళాఖండాలను సృష్టిస్తూ, చిత్రలేఖనంతోనే తన జీవితాన్ని కొనసాగిస్తున్నారు. డ్రాయింగ్ మాష్టారుగా నెలకు పదహారు రూపాయలతో ప్రారంభమైన ఆయన కళాసావాసం డబ్భైఏళ్ళు దాటినా కొనసాగుతుంది...

బొమ్మలు బువ్వలు పెడ్తాయుట్రా అంటూ చదువు సంధ్యల్లేకుండా బొమ్మలు గీసుకుంటూ కాలం గడిపే పిల్లాడ్ని చూసి పెదవి విరిచేది ఓతల్లి ఆనాడు... నీ డ్రాయింగ్ క్లాసులకి,పెయింటింగ్ రంగులకి బోల్డంత ఖర్చు పెట్టాను. డ్రాయింగ్ కాంపిటేషన్‌లో ఎలాగైనా సరే ప్రైజు తేవాలి అంటూ కళ్ళెర్ర జేస్తోంది మరో తల్లి నేడు. ఆనాటి తల్లికి తెలియదు తన పిల్లాడిలో ఓ మంచి కళాకారుడున్నాడని. నేటి తల్లికి తెలియదు అర్థం పర్థం లేని ఒత్తిడుల మధ్య నలిగే కళ రాణించదని. మారుతున్న కాలంతోపాటు చిత్రకారులు, చిత్రకళ నేర్చుకునే విధ్యార్థుల ఆలోచనా విధానం కూడా మారిపోతుందనీ, కమర్షియల్ పోకడల వల్ల చిత్రకళలో సహజత్వం కనుమరు గవుతోందని ఆవేదన చెందుతుంటారాయన.

డ్రాయింగ్ నేర్చుకోవాలన్న ఆసక్తి కంటే, ఈ రోజుల్లో పెద్ద ఆర్టిస్టు అయిపోయి, పేరు ప్రఖ్యాతులు, డబ్బు సంపాదించేయాలని తపించేవారి సంఖ్య పెరిగిపోతోందని అంటారాయన. జన్మతహా ఉన్న ప్రతిభకు ఓర్పు, కఠోర పరిశ్రమ, పట్టుదల ఉంటేనే ఏ కళ అయినా రాణిస్తుందని కామేశ్వరరావు వాదిస్తారు.



సనాతన ధర్మ చారిటబుల్ ట్రస్ట్, విశాఖపట్టణం వారి ప్రతిభా పురస్కారం (రూ॥ 25వేలు నగదు) ఏప్రియల్ 12, 2011న సికింద్రాబాద్‌లో అందుకొన్నప్పటి చిత్రం.

తొంభై ఏళ్ళు గడచినప్పటికీ ఆ కుంచె విరామాన్ని కోరుకోదు. ఒకసారి బొమ్మగీయాలని అనుకుంటే ఇక వచ్చేవారు, పోయేవారు ఎవరైనా ఆయనకి అనవసరం. ఏకాగ్రత పనికి ప్రాణమని నమ్మే వ్యక్తి ఆయన. తాను ఒక మంచి కళాకారుడిని మాత్రమే. పెద్ద కళాకారుడిని కాదు. గొప్పవాడిని కానే కాదు. బొమ్మల్నే నమ్ముకున్నాను, వాటితోనే బ్రతుకుతున్నాను, నేను ఉన్నంత కాలం బొమ్మలు గీస్తూనే ఉంటా... అంటారాయన.

ఈయన గీసిన బొమ్మల్లో జీవకళ ఉట్టిపడుతూ ఉంటుంది. తిరుపతిలో 40 ఏళ్ళక్రితం శ్రీవేంకటేశ్వర స్వామి, అలిమేలు మంగతాయారు వర్ణ చిత్రం గీసి ఇచ్చే అరుదైన అవకాశం తనకు దక్కిందని చెబుతుంటారు.



ఇప్పటికీ తాను బొమ్మలు గీయటమే కాక రానున్న తరాలకు తన విద్యను పెంచడానికి సిద్ధమేననీ, అయితే అందుకు తగ్గ లక్షణాలు కల విద్యార్థులు కావాలనీ అంటారు. అలాంటి వాద్యార్థి ఎదురు పడితే ఉచితంగానైనా విద్య నేర్పుతానంటారు.

వృద్ధాప్యాన్ని చేరుకున్న చిత్రకారుడి కుంచెకు చేతి వేళ్ల సహకారం లభించడం సామాన్యమైన విషయం కాదు. వృద్ధాప్యం తనలోని కళకు ఏ మాత్రం ప్రతిబంధకం కాదంటూ, కాలంతో





శాంతి కళాకేంద్రం, వేముల కామేశ్వరరావు గారి శిష్యుడు నడింపల్లి శంకరాచారి గారి ఆధ్వర్యంలో ఆయన శిష్యబృందం గురుపూజోత్సవం పేరుతో విజయవాడలో ఘనంగా సత్కరించారు. ఆ సందర్భంగా కామేశ్వరరావు గార్ని సత్కరిస్తున్న 64 కళలు.కామ్ ఎడిటర్ కళాసాగర్.

రాజీ సమస్యేలేదంటూ, పట్టిన పట్టు విడవనంటున్న తొమ్మిది పదుల కళాకారుడాయన. ఇప్పటికీ చక్కటి కళారూపాలను సృష్టిస్తూ చిత్రకళాభిమానులను ఆశ్చర్యపరుస్తున్నారు. మీరో పెద్ద కళాకారుడట కదా... అని ఎవరైనా అడిగితే అదేమీ నాకు తెలియదు కానీ... ఇప్పుడున్న కళాకారులందరిలోనూ పెద్దవాణ్ణి నేనే అంటూ ఓ బోసి నవ్వు విసిరేస్తారాయన. నగరంలోని హిందూ హైస్కూల్‌లో విద్యాభ్యాసం తర్వాత 1936లో ఆంధ్ర జాతీయ కళాశాలలో చిత్రలేఖనంలో డిప్లమో చేశారు. తర్వాత బరోడాలోని ఒక స్టూడియోలో కొంతకాలంపాటు పనిచేశారు. బ్లాక్ అండ్ వైట్ ఫొటోలకి రంగులు వేయడం అనేది ట్రెండ్‌గా ఉన్న రోజుల్లో ఆ పనిని ఎంతో ఆస్వాదించారాయన. ఆ తరువాత డ్రాయింగ్ టీచర్‌గా రిటైర్ అయ్యి, 94 ఏళ్ళ వయసులో కూడా అడిగిన వారికి బొమ్మలు గీసే ఓ ఆర్టిస్టుగా చిత్రకళాజీవితాన్ని సార్థకం చేసుకుంటున్నారు.

ఈ రోజుల్లో కళాకారుడు చేసే ప్రయత్నాలను బట్టి గుర్తింపు వస్తుందే కానీ నిజమైన కళకు గుర్తింపు రావడం చాలా అరుదుగా మారింది. చిత్రకారుడు పైకి రావాలంటే విస్తృతంగా ఆర్టు గ్యాలరీలు దర్శించి, ప్రదర్శనలు నిర్వహించాలన్నారు. ఆర్థిక పరిస్థితి సహాకరించని కళాకారుడు వీటివల్ల అప్పులపాలవుతున్నాడు. ప్రజలు, స్వచ్ఛందసంస్థలు, కళాభిమానులు, పోషకులు చితికిపోతున్న చిత్రకారుల జీవితాలకు బాసటనివ్వాలి అని అభిప్రాయపడ్డారు.

సామాన్యుడు జీవి- చిత్రకారుడు చిరంజీవి.

బహు భాషల సమ్మేళనం చిత్రలేఖనం.

- బి.ఎం.పి. సింగ్

# "జయహో... మహాన్... రెహమాన్"

ఎల్.ఆర్. వెంకటరమణ

కళాప్రపంచం

భారతీయ సంగీతానికి, అందునా దక్షిణాది సంగీతానికి విశ్వఖ్యాతి అందించిన మహాన్ వ్యక్తి- ఏ. ఆర్. రెహమాన్. సంగీత సునామీ. రెహమాన్ సంగీతానికి జయహో అని మనమన్నాము. జయహో సినీ గీతానికి విశ్వఖ్యాతి ఆస్కార్ రూపంలో అందింది. జయహో...భారత్... అని ప్రపంచం పొగడగలిగింది. సినీ సంగీత స్వర మాంత్రికుడు స్వర పరచిన గీతం జయహో... ఆస్కార్‌కు ముందే గోల్డెన్ గ్లోబ్ అవార్డు పొందగలిగింది. ఇలా రెహమాన్ సంగీత ప్రస్థానం జయహో ... మహాన్ అనిపించకమానదు.

ఏ.ఆర్. రెహమాన్ జనవరి 6వ తేదీన 1966సం॥లో జన్మించాడు. ఇతని పూర్వపు పేరు దిలీప్‌కుమార్. తల్లిదండ్రులు కస్తూరి-శేఖర్. తండ్రి మ్యూజిక్ కంపోజర్. దిలీప్ మూడవ సంవత్సరంలోనే హార్మోనియం వాయించగలిగాడు. ఇతని పెద్దక్క కాంచన, సంగీతంలో ప్రావీణ్యం కలది. ఇలా కుటుంబం మొత్తం సంగీత కుటుంబం అనవచ్చు. 1989లో దిలీప్ మతం మారి ఏ.ఆర్. రెహమాన్ అయ్యాడు.

రెహమాన్ 11వ ఏట నుండి మాస్టర్ ధన్‌రాజ్ వద్ద సంగీత శిక్షణ ప్రారంభించాడు. చిన్ననాటి మిత్రులు శివమణి, జాన్ ఆంథోని, రాజాలతో కలిసి ఒక మ్యూజిక్ బ్యాండ్ ఏర్పాటు చేశాడు. పేరు "రూట్స్". రెహమాన్ తన సంగీత ఫలవృక్షానికి ఆనాడే ఇలా పునాది వేర్లు సిద్ధం చేసుకున్నాడు. చెన్నైలో రాక్ గ్రూప్‌గా పేరొందిన ఈ బ్యాండ్ రెహమాన్ కీబోర్డు ప్లేయర్‌గా ఉండేవాడు. ఇంకా ఇతనికి అనేక వాయిద్యాలతో పరిచయం ఉంది. రాగాలు సృజించడంలో అభినివేశం... అనుభవం రెండు కాలిసి అవలీలగా గీతం సృష్టించబడేది. జన హృదయాలలో స్థానం సంపాధించేది సంగీతంలో శిఖరాగ్రాన ఉన్న ఎందరితోనో పరిచయభాగ్యం కలిగింది. జాకీర్ హుస్సేన్, కనుక్కుది వైద్యనాథన్, ఎల్.శంకర్, మహదేవన్, రమేష్‌నాయుడు ఎమ్.ఎస్. విశ్వనాధం... ఇంకా ఎందరెందరో ప్రముఖుల సాహచర్యంతో సంగీతానుభవం సాధించాడు. మ్యూజిక్ మాస్ట్రో ఇళయరాజా వద్ద కీబోర్డు ప్లేయర్‌గా



ప్రతిభా పాటవాలు ప్రదర్శించాడు. రెహమాన్ తన మ్యూజిక్ టీచర్ జాన్‌జాకోబ్ ప్రేరణతో ఆక్స్‌ఫర్డ్‌లోని ట్రినిటీ కాలేజీయం సంగీతం కోర్సులో స్కాలర్‌షిప్ కూడా అందుకున్నాడు.

రెహమాన్ తన పంచాతన్ రికార్డు ఇన్ పేరిట తన స్వంత స్టూడియో ఏర్పాటు చేసుకున్నాడు. సంగీత సృష్టికి, అధ్యయనానికి ఇదొక ప్రదేశం. శిల్పి ఎలా శిల్పాన్నీ మలుస్తాడో అలా రెహమాన్ బాణీలు కడ్తూ, మిక్సింగ్ చేస్తూ... అలా... అలా...గీతం సృష్టించేవాడు. అందుకే అతని సంగీతంలో రిథం క్రంట్రోల్ అద్భుతమని సంగీత పండితుల అభిప్రాయం. ఎన్నీ వాయిద్యాలు వాడినా ప్రతివాయిద్యం యొక్క ధ్వని స్పష్టంగా... వినసొంపుగా ఉండడం అన్నది రెహమాన్ సృష్టి. ఇలా రెహమాన్ సంగీతకారులకు వాయిద్య సమకారం... ప్రకటనలకు జింగిల్స్... టెలివిజన్ కార్యక్రమాలు... సంగీత అవసరాలకు తగ్గట్టుగా వచ్చిన ప్రతి అవకాశాన్ని చక్కగా వినియోగించుకున్నాడు.



ఇలా సంగీత ప్రస్థానంలో మరో మలుపుగా రెహమాన్, మణిరత్నం పరిచయం చెప్పవచ్చు. రెహమాన్ సృష్టించిన జింగిల్స్‌కు ముగ్ధుడైన మణిరత్నం తన "రోజా" సినిమాకు సంగీత దర్శకుని అవకాశం రూపంతో వరించింది. "రోజా" సినిమాలో రెహమాన్ దశ తిరిగింది. సంగీతంలో హెచ్చుతగ్గులు సరైన రిథమ్‌తో జనాకర్షిదుడైనాడు. స్వరకల్పనలో అద్భుత మెలోడీ... వాయిద్య వినియోగంలో విభిన్నత, శబ్ద నియంత్రణలో వైవిధ్యం ఆ సినిమా సంగీతాన్ని... తద్వారా రెహమాన్‌ను అగ్రస్థానానా నిలిపాయి. నేటికి మనం ఆ చిత్రంలోని పాటలు తలుచుకున్నా పాటలలోని సంగీత స్వరాలు కూడా మన హృదయ తంత్రువులను మీటుతాయి. "రోజా" చిత్రంలోని "చిన్ని చిన్ని ఆశ.. చిన్నదాని ఆశ..." ఈ పాటలోని సున్నిత, శృతి



మెత్తని సంగీత ధ్వనులు మన మనస్సుల నుండి, చెదిరిపోవు. జాతీయ స్థాయి అవార్డు అందుకున్న చిత్రమిది. బొంబాయి, దొంగ దొంగ, ఇద్దరు, అమృత చిత్రాలకు సంగీతం కూర్చాడు.

రెహమాన్ సంగీత బాణీలు మురిపించిన మరో జెంటిల్‌మెన్ దర్శకుడు శంకర్. ప్రేమికుడు, భారతీయుడు, జీన్స్, అపరిచితుడు, శివాజీ చిత్రాలు సంగీత బాణీలు కూర్చాడు. రెహమాన్ సంగీత సునామీ దక్షణభారతాన ఉధృతి చూపింది. ఇదే క్రమంలో ఉత్తర భారతదేశాన కూడా రాంగోపాల్‌వర్మ రంగీతాలతో అనంతరం-నాయక్, లగాన్, స్వదేశ్, తాళ్, గురు, మంగల్‌పాండే రంగ్‌దే బసంతి, ఇలా ఎన్నెన్ని... ఇంకా "జోధాఅక్బర్"లో "ఆజా మేరీ




ఆజా... సూఫీ రీతిలో సాగే గీతం మనలను పులకరింపచేస్తుంది.

ప్రఖ్యాత మ్యాగజైన్ రెహమాన్‌ను అసూయలేని సంగీతజ్ఞుడుగా పేర్కొనడం ఓ విశేషం. తమిళనాడులో శ్రీనివాసరామానుజన్ తరువాత అంతకీర్తి అందుకున్న సంగీతజ్ఞుడు రెహమాన్. తన హృదిలో, మదిలో సంగీతం తప్ప మరో విషయం ఉండదు. క్రొంగొత్త సంగీత బాణిలకై నిరంతరం అన్వేషిస్తుండేవాడు.

మాండరిన్ భాషా చిత్రం"వారియర్స్ ఆఫ్ హెవన్ అండ్ ఎర్త్" రెహమాన్ ఖ్యాతి ప్రపంచవ్యాప్తం చేసింది. 'వందేమాతరం' ఆల్బం సృష్టి. "భారతబాల" "జనగణమన" ఆల్బమ్‌లు ఎంతో ఖ్యాతి గడించాయి. మైఖేల్‌జాక్సన్‌తో కలిసి రెహమాన్, శోభన, ప్రభుదేవా, సుందరం మాస్టర్‌లు కలిసి జర్మనీలోని మ్యూనిచ్‌లో సంగీత విభావరి జరిగింది. లార్డ్ ఆఫ్ రింగ్స్‌లో మ్యాజిక్, రాగాస్ డ్యాన్స్ సంగీతంలో కొత్త పుంతలు తొక్కాయి.

రెహమాన్ సంగీతకారుడే కాదు సేవాతత్పరుడు కూడా కుష్టువ్యాధి నివారణకై ప్రపంచరాయబారిగా నియమించడినాడు. "సేవ్ ది చిల్డ్రన్ సంస్థకు" సేవలందిస్తున్నాడు. ఇండియన్ ఓషన్‌లో పాటల ద్వారా వచ్చిన డబ్బుతో సునామీ బాధితులకు సేవలందించాడు.

ప్రపంచ సినీరంగంలో ఎవరకేని సాధించాలనుకునే అవార్డు "ఆస్కార్ అవార్డు. తమ జీవిత కాలంలో కనీసం ఒక్కసారి అయిన ఆ యోధుని ప్రతిమ ఆస్కార్ అందుకోవాలనే తపన సినిమావాసులకుంటుంది. రెహమాన్ విషయంలో అది కూడా తీరింది. భారతీయ ఇతివృత్తం ఆధారంగా డాన్ బోయిలే దర్శకత్వంలో రూపొందిన "స్లమ్‌డాగ్ మిలియనీర్" చిత్రానికి గాను ఉత్తమ సంగీతం, ఉత్తమ గీతం విభాగాలలో రెహమాన్ అవార్డు అందుకున్నాడు. పది నామినేషన్లలో ఎనిమిది అవార్డులు అందుకున్న చిత్రమిది. రెహమాన్‌కు ఆస్కార్ రావడం అతనికి మాత్రమే కాదు భారతీయులందరికీ భారతీయ, ప్రపంచ సంగీత ప్రియులందరికీ అదొక అపూర్వ కానుక. "జయహో" గీతం ఉత్తమగీతం... భారతావని పులకరించింది. అత్యున్నత ఆస్కార్ పురస్కారం లభించడం భారతీయ చిత్రానికి లభించిన గౌరవం. అపురూప సన్నివేశం. జయహో... సంగీతమహాన్...రెహమాన్.

# సృష్టి - దృష్టి



## వెంటపల్లి సత్యనారాయణ

ఇదే చిత్రకారుని విషయానికొస్తే అతనిలోని కళాసాధన బాగా పరిణతి చెందిన కొలదీ అతని చిత్రాలపై కూడా ఆ ప్రభావం కనిపిస్తుంది. ఈ ప్రభావం ఏ మేరకు ఉంటుంది అనేది అతనికి ఒక ఆలోచన జనించిన పిదప దానికి అతడు ఎంతగా స్పందించాడో, ఆ భావోద్దీపనను అతడు ఎంత సమర్ధవంతంగా వ్యక్తం చేయాలని ఊహించాడో, ఆ ఊహా రూపం అతని మనస్సులో ఏర్పడడానికి ఎంత బాగా ఆలోచించాడో ఆ ఆలోచనకు ప్రతి రూపంగానే అతని చిత్రం రూపు దిద్దుకుంటుంది. ఆ మేరకు ఆ చిత్రం ప్రామాణికతను సంతరించుకుంటుంది.

ఈ ఆలోచన చేసే సమయంలోనే చిత్రకారుడు తాను చెప్పదలచుకున్న భావాన్ని వ్యక్తం చేయడానికి అవసరమైతే ఒక్కోసారి అతడు బాహ్యలోకాన్ని అధిగమించి ఊహాలోకంలో విహరిస్తాడు.

ఈ విహారంలోనే అతని భావానికి సంబంధించిన వివిధ ఆకారాలు, వింత వింత రూపాలు(గుర్తులు) అతనికి కనిపిస్తుంటాయి. చిత్రకారుడు దర్శించిన ఆ రూపాలు ఒక్కోసారి బాహ్య ప్రపంచానికి సంబంధించినవి కావచ్చు లేదా వాస్తవ ప్రపంచానికి అసలు సంబంధంలేని వికృతమైన వింత రూపాలూ కావచ్చు.

వీటిలో ఏఏ రూపాలు అతని భావాల సమర్ధనకు తోడ్పడతాయని భావిస్తాడో ఆయా రూపాలను అతని చిత్రంలో ప్రస్ఫుటింపజేస్తాడు. ఫలితంగా అతను చిత్రించదలచుకున్న శైలి కూడా అతడు నిర్ణయించుకోవడం జరుగుతుంది. బాగా చేయి తిరిగిన చిత్రకారునికి ఒక పురాణ ఘట్ట దృశ్యాన్ని లేదా ఒక కావ్య దృశ్యాన్ని లేదా ఒక చారిత్రక నేపద్యానికి సంబంధించిన విషయాన్ని మామూలుగా అనగా సాంప్రదాయ శైలిలో చిత్రించడం పెద్ద కష్టతరం కాకపోవచ్చు. కానీ దానిలో కూడా చిత్రానికి ప్రామాణికత అనేది ఆ చిత్రకారుని ఊహా కృషి మరియు సామర్ధ్యం మీదే ఆధారపడి వుంటుంది. అయితే ఇందులో రూపాలకు అతడు బాహ్య ప్రపంచాన్ని అధిగమించి వెళ్లవల్సిన అవసరం ఉండదు. సృష్టిలోని స్త్రీ పురుష మానవ మూర్తులను, పశు, పక్ష్య, కీటక మొదలుగా గల జంతు జాలాన్ని , లతలు, పుష్పాలు, పొదలు,

తీగలు, చెట్లు మొదలుగా గల వృక్ష జాలాన్ని, కొండలు, గుహలు, పర్వతాలు, మైదానాలు, సెలయేర్లు, సరోవరాలు మొదలయిన భౌగోళిక ప్రదేశాలను, ఆకాశంలో కాలానుగుణంగా మారే రంగులు, ప్రకృతిపై వాటి ప్రభావాన్ని, ఇంకా చారిత్రక ఘట్టాలలో అయితే ఆయా స్థలానికి గల ప్రాధాన్యత, అక్కడ భౌగోళిక పరిసరాలు మొదలైన వాటిని బాగా క్షుణంగా అవగాహన చేసుకొని, దానికి సమర్ధవంతమైన చిత్రణ ఇవ్వడం ద్వారా ఆ చిత్రానికి ఒక ప్రామాణికతను చేకూర్చవచ్చు. అయితే ఇదంతా నేపధ్యానికి సంబంధించిన విషయం.



"నేపథ్యంలో సంగీతాన్ని ఎంత బాగా వాయించినప్పటికీ భావయుక్తంగా గానం చేయకపోతే ఎంత గొప్ప సాహిత్యంలో ఉన్న పాటైనా అంతగా రక్తి కట్టదు"

అలాగే ఒక దృశ్య చిత్రీకరణలో నేపధ్యానికి సంబంధించిన ప్రకృతిని ఎంత రమ్యముగా చిత్రించినప్పటికీ దానిలో చిత్రకారుడు ప్రధానంగా చూపించదలచుకున్న భావాన్ని అందుకు ఉద్దేశించిన రూపాల్లో జనింపచేయపోతే ఆ చిత్రం ఉత్తమ చిత్రం అనిపించుకోదు. అందుకే ఈ తరహా చిత్రాల్లో భావ ప్రకటనకు ప్రధాన కారకులైన మానవ రూపాల్లో, వారి హావ భావాల్లో ఆయా రసాలను (శాంత, కరుణ, జాలి, రౌద్రం, హాస్య, విషాద మొ॥) ప్రతిభావంతంగా చిత్రించాలంటే దానికి ఎంతో పరిణతి అవసరం. ఏచిత్రకారునికైనా అభ్యాసం చేసే కొలదీ చేయి తిరిగి పరిణతిని సాధించడం ద్వారా అది సలుభసాధ్యమౌతుంది.



ఇంత పరిణతిని సాధించిన చిత్రకారుడు ఇలాంటి చిత్రాలను సమర్ధవంతంగా చిత్రించి ప్రజల మన్ననలను పొందగలడు. అయితే ఇదంతా సాంప్రదాయ శైలి చిత్రాలను గూర్చి చెప్పటం జరిగింది. ఇందులో అతడు ప్రకృతిని అధిగమించి చేసిందేమీ లేదు. దృశ్య జగత్తులోని రూపాలనే తన భావాల రూపకల్పనకు వినియోగించుకోవడం జరిగింది. కానీ చిత్రకారుని "దృష్టి అంతటితో ఆగిపోదు. కళాకారుడు స్వేచ్ఛాజీవి. సాధించిన దానితో తృప్తి చెందకుండా ఇంకా ఏవేవో సాధించడానికి ప్రయత్నం చేయడం కళాపిపాసికున్న విశిష్ఠ లక్షణం. అందుకే అతడు నిరంతరం అతని కళారంగంలో కొత్త కొత్త ప్రయోగాలు చేయడానికి ప్రయత్నిస్తాడు. అందవలన అతడు కేవలం దృశ్య జగత్తులోనే ఆగిపోదు. దాన్ని అధిగమించడానికి నిరంతరం అన్వేషిస్తూ ఉంటాడు. ఈ అన్వేషణలో అతనికి ఒక్కొక్కసారి సామాన్యుల ఊహలకందని భావాలు తళుక్కున మెరుస్తూ ఉంటాయి. చిత్రకారుడు మెరుపులాంటి ఆ భావాన్ని బయటికి లాగి చిత్రరూపంలో వ్యక్తం చేయడానికి ప్రయత్నం చేస్తాడు. అందుకు మరలా దాన్ని ఏవిధంగా వ్యక్తం చేయాలి? ఏ రూపంలో

చిత్రిస్తే ఆ భావాన్ని రసజ్ఞుని హృదయానికి సూటిగా తాకేలా చేయవచ్చు అన్నదానికి అతడు మరలా శోధన చేస్తాడు. తానూహించిన భావాన్ని ఎవరూ ఊహించని రీతిలో చిత్రించడానికి ఆలోచిస్తాడు. ఆ ఆలోచనలోనే మరలా తన భావానికి సంబంధించిన కొన్ని రూపాలు అతని మనోరూపంలో దర్శనమౌతాయి. ఈ రూపాలు ఏ విధంగా ఉంటాయీ అన్నది అతను చెప్పదలచుకున్న భావ సామర్థ్యంపై ఆధారపడి ఉంటాయి.



భావం సున్నితమైనదైతే అందుకు తాను ఊహించిన రూపం కూడా సున్నితంగానే ఉంటుంది. అలా కాకుండా ఒక గంభీరమైన భావాన్ని వ్యక్తం చేయాలని పూనుకున్నప్పుడు అందుకు తానూహించిన చిత్రరూపం కూడా ఆ స్థాయిలోనే గంభీరతను సంతరించుకుని ఉంటుంది. అలా ఒక గంభీరమైన, ఉన్నతమైన భావాన్ని ఇముడ్చుకున్న చిత్రాన్ని సామాన్య దృష్టితో చూసినపుడు అది ప్రేక్షకున్ని ఏమాత్రం ఆకట్టుకోలేకపోవచ్చు. ఎందుచేతనంటే చిత్రకారుడు ఆ చిత్రంలో ప్రధానంగా చూపించదలచుకున్నది ఒక ప్రధానమైన భావాన్ని కానీ రూపాన్ని కాదు. ఒక ఉన్నతమైన భావాన్ని చిత్రించాలనుకున్నప్పుడు అతడు దానిలో ఆ భావ వ్యక్తీకరణకే అధిక ప్రాధాన్యత నీయడం జరుగుతుంది. రూపానికి అక్కడ అంత ప్రాధాన్యత ఉండదు.

“మనిషి వ్యక్తిత్వం వికసించిన కొలదీ మనిషి రూపానికి ప్రాధాన్యత తగ్గుతుంది. అంటే బాహ్యంగా ఉండే రూపంతో నిమిత్తం లేకుండా అంతరంగికమైన వ్యక్తిత్వమే అతనికి రూపాన్ని మించిన విలువ మరియు అందాన్ని తెస్తుంది. అలాగే ఒక మహోన్నతమైన భావాల్ని నింపుకున్న ఈ తరహా చిత్రాల్లోని భావాల్ని గుర్తించలేనపుడు అవి కేవలం అర్థం లేని బొమ్మలే అవుతాయి. కానీ అంతర్లీనంగా ఉండే భావాన్ని అర్థంచేసుకున్నపుడు ఎంతో రూప విన్యాసంతో కూడుకున్న చిత్రాలకంటే ఎక్కువ ప్రాధాన్యత ఈ చిత్రాలకే ఈయడం జరుగుతుంది. అయితే దాన్ని గుర్తించడమే అందరికీ సాధ్యం కాదు.

బాహ్యంగా ఉండే అందాల్ని ఎవరైనా చూసి ఆనందించగలరు. కానీ అంతర్లీనంగా ఉండే అందాన్ని ఎంతమంది ఆస్వాదించగలరు? బహుకొద్ది మంది రసజ్ఞులకే ఆ నైపుణ్యం ఉంటుంది. అందుకే ఒక గొప్ప చిత్రకారుని రస సృష్టిని చూసి సరిగ్గా ఆనందించాలంటే ఆ రసజ్ఞుడు ముందుగా దాన్ని చిత్రించిన చిత్రకారున్ని చదవాలి. అతడు ఏ పరిస్థితుల్లో చిత్రించాడు? ఏ భావాన్ని వ్యక్తం చేయబూనుకున్నాడు? మొదలయిన విషయాల దృష్ట్యా ఆ చిత్రాలను పరిశీలిస్తే దాంట్లో అంతర్లీనంగా దాగి ఉన్న అందాన్ని, భావాలను ప్రేక్షకుడు ఆస్వాధించగలడు మరియు ఆనందించగలడు.

email: snventapalli@gmail.com

బుర్రకథ పితామహుడు

# పద్మశ్రీ నాజర్

బుర్రకథ కళారూపానికి ఒక గుర్తింపును...గౌరవాన్ని తెచ్చిన స్రష్ట... ద్రష్ట...నాజరు. ప్రజలచేత... ప్రజలవలన... ప్రజలకొరకు కవిత్వం వ్రాసే కవి కలకాలం అజరామరుడని నమ్మిన నాజర్ కలం పట్టింది మొదలు కన్ను మూసే వరకూ ఆ నిబద్ధతతోనే బుర్రకథలు వ్రాశాడు... పాడాడు... ఆడాడు.

గుంటూరుకు ఉత్తర దిశగా వున్న పొన్నెకల్లు గ్రామంలో 1920 ఫిబ్రవరి 5న షేక్ మస్తాన్, బీబాబీ దంపతులకు జన్మించిన నాజర్ బుడిబుడి నడకలు వేసే సమయంలో సంగీతం పట్ల ఆకర్షితులయ్యారు. నిరుపేద ఇంటిలో పుట్టిన నాజర్ కపిలవాయి రికార్డులు విని 'కోరి భజింతు గోవిందు నామది' అనే పాటను వీధుల్లో పాడుకొంటూ బడికి వెళుతున్నప్పుడు ఆ గానమాధుర్యానికి మెచ్చిన పలువురు కోరికోరి పాడించుకొని పప్పు, బెల్లాలను బహుమతిగా ఇచ్చేవారు. తండ్రితో పాటు పీర్ల పండుగలో వీధి భాగవతాలలో ఆడి పాడేవారు. స్కూలు వార్షికోత్సవంలో ద్రోణం విజయం నాటికలో ద్రోణుని పాత్ర ధరించి తన్నులు తిన్న గురువు చేతనే పుస్తకాలు, పెన్సిల్‌ను బహుమతిగా పొందారు. శ్రీరామనవమి పందిళ్లలో, కనకతార నాటకంలో నటించి పలువురి దృష్టిని ఆకర్షించారు. హార్మోనిస్టు ఖాదర్ నాజర్‌లోని ప్రతిభను గుర్తించి పెద్దరామూరులోని బాలరత్న సభ నాటక సమాజంలో చేర్చారు. రామదాసు, తులాభారం, శ్రీకృష్ణలీల, రాధాకృష్ణ నాటకాలలో స్త్రీ పాత్రలను అత్యద్భుతంగా పోషించారు. రామదాసు నాటకంలో చాందిని పాత్ర పోషణకు తెనాలిలో కళావంతుల వద్ద రెండు నెలలు నాట్యం అభ్యసించారు. పెన్నెండేళ్ళ వయస్సులోనే తెనాలి, విజయవాడ, రాజమండ్రి, నెల్లూరు, గూడూరు వంటి పట్టణాలలో



నాటకాలను ప్రదర్శించి వెండి, బంగారు మెడల్స్‌ను బహుమతిగా పొందారు.

నాజర్‌లోని గాత్ర మాధుర్యానికి మరింత మెరుగులు దిద్దిన మంగళంపల్లి గాయకుడు నర్సరావుపేటకు చెందిన మురుగుళ్ల సీతారామయ్య. ఆయన వద్ద సంగీతం నేర్చుకుంటూ కడుపు నింపుకోవడానికి ఇంటింటికీ తిరిగి యాచన చేశాడు. తండ్రి మరణంతో చిన్న వయసులోనే బరువు బాధ్యతలను నెత్తిమీదకు ఎత్తుకొన్న నాజర్ వ్యవసాయ కూలీగా, పొగాకు కంపెనీలో ముఠామేస్త్రీగా పనిచేసి కుటుంబాన్ని పోషించారు. పొన్నెల్లులో కుట్టుమిషన్ కుడుతూ గ్రామంలోని యువకులతో పాదుకా పట్టాభిషేకం, ఖల్జీరాజ్యపతనం నాటకాలను ప్రదర్శించారు. తుళ్ళూరులో జరిగిన కమ్యూనిస్టుల సభల పాటల పోటీలలో పాల్గొన్న సంఘటన నాజర్ కళాప్రస్థానాన్ని ఊహించని మలుపులు తిప్పింది. వేయలపల్లి శ్రీకృష్ణ, కొంపనేని బలరామ్ ప్రోత్సాహంతో



ప్రముఖులందరూ హాజరయ్యారు. ప్రదర్శనను చూసిన సినీనటులు గోవిందరాజుల సుబ్బారావు ప్రదర్శన అనంతరం నాజర్‌ను కౌగిలించుకొని 'ఇది గుంటూరు గోంగూర దెబ్బ' అని ప్రశంసించారు. ఈ కథను విన్న ప్రముఖ సినీ దర్శకులు గూడవల్లి రామబ్రహ్మం తాను సినీమా కోసం సేకరించిన పల్నాటి చరిత్ర స్క్రిప్టును నాజర్‌కు బహుకరించి బుర్రకథగా రచించి ప్రదర్శించమని ఆశీర్వదించారు.

నాజర్ కళారంగ జీవితంలో పల్నాటి వీరచరిత్ర ఒక మైలు రాయిగా నిలిచిపోయింది. నాలుగు గంటల కథను అసాంతం ఉత్కంఠగా.. ఉద్వేగంగా చెప్పే తీరు ప్రేక్షకులను మరో లోకంలో విహరింపజేసేది. బుర్రకథ చెప్పే సమయంలో వీర, కరుణరసాల ఆవిష్కరణను భారతీయ కళారంగంలో నాజర్ తర్వాత మరొక కళాకారుని చెప్పవలసి వుంటుంది. 1945లో బాపట్ల హైస్కూలు ఆవరణలో బెంగాల్ కరువు కథను నాజర్ చెప్పే సమయంలో ఆ ప్రదర్శనకు వచ్చిన బళ్ళారి రాఘవ ఉబికి వచ్చే దు:ఖాన్ని ఆపుకొంటూ రంగస్థలం పైకి వచ్చి నాజర్‌ను కౌగిలించుకొని బావురమని ఏడ్చారట.

1948లో ప్రజా నాట్యమండలిని మద్రాసు ప్రభుత్వం నిషేదించింది. నిరుపేద ప్రజలను సాయుధ పోరాటానికి పురిగొల్పుతున్నది. భారత కమ్యూనిస్టుపార్టీ అని, ఆ పార్టీ దేశమంతటా వ్యాప్తి చెందడానికి నాజర్ బుర్రకథలే కారణమని ప్రభుత్వం ప్రకటించిందంటే పాలకుల గుండెల్లో నాజర్ బుర్రకథ

నాజర్‌తో రామకోటి, పురుషోత్తం ఒక బృందంగా కలిసి బుర్రకథను నేర్చుకున్నారు. బుర్రకథ ప్రక్రియలో తనకు ఎన్నో సలహాలను ఇచ్చి తన ఉన్నతికి ముఖ్య కారకుడు రామకోటి అని నాజర్ ఆజన్మాంతం సందర్భానుసారం పేర్కొనడం విశేషం. కాకుమారు సుబ్బారావు రచించిన సోవియట్ వీరవనిత టాన్యాకథను బుర్రకథగా మొదట గుంటూరు జిల్లాలోని పలు గ్రామాలలో చెప్పారు. రెంటపాళ్ల గుడ్డిజంగం కోటి వీరయ్య, జంగం కథ నాజర్ బుర్రకథ ప్రక్రియకు సరికొత్త జవాన్ని జీవాన్ని కలిగించింది. సముద్రమథనం సమయంలో గిరగిర గిరగిర కవ్వము త్రిప్పుచు కేకలు వేయుచు పటపట పళ్లు కొరుకుచు ఎటు తిరిగెదవేగ' అనే రగడలను స్వల్ప మార్పులతో నాజర్ తన బుర్రకథలో చొప్పించాడు.

కాకుమాను సుబ్బారావు లక్ష్మీకాంత మోహన్, రామకోటి, పురుషోత్తం, నాజర్, మోటూరి ఉదయం కలిసి గుంటూరు జిల్లా ప్రజా నాట్యమండలి దళం ఏర్పడింది. రాష్ట్రదళ దర్శకుడైన గరికపాటి, నాజర్, పురుషోత్తం, రామకోటి రాష్ట్రదళంలో సభ్యులుగా తీసుకొన్నారు. రాష్ట్ర దళం ప్రదర్శించిన మాభూమి నాటకంలో దేశ్‌ముఖ్ జగన్నాథరెడ్డి, క్రిప్సురాయబారం వీధిభాగవతంలో భూపాల్ నవాబు పాత్రను నాజర్ అత్యద్భుతంగా పోషించారు. అహమ్మదాబాద్‌లో జరిగిన ఇప్టా సభల్లో జానపద కళల విభాగంలో నాజర్ దళానికిప్రథమ బహుమతి లభించింది. మద్రాసు ఆంధ్ర మహాసభలో ఏర్పాటు చేసిన బెంగాల్ కరువు బుర్రకథకు సినీ, నాటకరంగ



ఎంత శక్తివంతమైన శతఘ్నులను పేల్చిందో తేటతెల్లమవుతుంది. ఈ నిషేధ సమయంలో నాజర్‌ను పట్టుకోవడానికి ఒకవైపు కాంగ్రెస్ పార్టీ నాయకులు, ఒకవైపు పోలీసులు అణువణువునా గాలించారు. నాజర్ కర్లపూడి, నిడుముక్కల, పొన్నెకల్లు గ్రామాలలోని కొండ గుహల్లో అజ్ఞాతవాసం చేశారు. చివరకు కుటుంబ సభ్యులపై పోలీసుల అరాచకారాన్ని తట్టుకోలేక మంగళగిరి క్యాంపులో లొంగిపోయారు. దాదాపు ఆరునెలలు జైలులో మగ్గిపోయారు. 1949లో జైలునుండి విడుదలైన అనంతరం పార్టీతో సంబంధాలను తగ్గించుకొని స్వతంత్రంగా సాంస్కృతిక పయనం సాగించారు. సుంకర సత్యనారాయణ రచించిన అల్లూరి సీతారామరాజు, కష్టజీవి కథలను వందలాది గ్రామాలలో చెప్పి ప్రజలను ఉర్రూతలూగించారు. డాక్టర్ రాజారావు నిర్మించిన పుట్టిల్లు చిత్రంలో సుంకర రచించిన రాణిరుద్రమ్మ బుర్రకథను వీరరసస్ఫోరకంగా చెప్పి మెప్పులను పొందారు. ఈ సమయంలో 'ఆసామి' నాటకాన్ని నాజర్ రచించారు. విజయవాడ ఆంధ్ర ఆర్ట్సు సమాజం మాచినేని వెంకటేశ్వరరావు దర్శకత్వంలో 'ఆసామి' నాటకాన్ని ప్రదర్శించారు. ఈ నాటకంలో విన్నకోట రామన్నపంతులు, కొప్పరపు సరోజిని, కొమ్మినేని హైమావతి, రాఘవాపురం అప్పారావు, తమ్మిన రామారావు, కాకర్లపూడి వెంకటరాజు ప్రభృతులు నటించారు. బి.గోపాల సంగీతాన్ని అందించగా నాజర్ దళం నాటకంలో అంతర్భాగమైన బుర్రకథను చెప్పారు. ఆసామి నాటకానికి ఉత్తమ ప్రదర్శనతోపాటు ఎనిమిది బహుమతులు లభించాయి.

నాజర్ రాయలసీమ కరువు, బొబ్బిలి యుద్ధం, వీరాభిమన్యు' అనే బుర్రకథలను, పిట్టలదొర, నాచేతిమాత్ర అనే ఏకపాత్రను రచించారు. బొబ్బిలియుద్ధం కథను తొలిసారిగా విజయనగరంలో చెప్పే సమయంలో ప్రేక్షకులు తీవ్రంగా ప్రతిఘటించారు. బొబ్బిలి వారి గొప్పలు విజయనగరం వారిమి వినం అంటూ గొడవ చేయడంతో నేను కటష్టపడి సేకరించి వ్రాసిన కథలో ఏవైనా తప్పులుంటే మీరేమైనా దండన విధించండి అని బ్రతిమిలాడి కథను చెప్పారు. బొబ్బిలి, విజయనగర రాజులకు పోరు కోడిపోరు కాదని, పంట పొలాలకు నీరు పెట్టే విషయంలో ప్రారంభమైన ఘర్షణ అని కథలో చెప్పారు. ఈ చారిత్రక సత్యాలతో తొలిసారిగా బొబ్బిలి కథను విజయనగరంలో చెప్పిన తొలి బుర్రకథకునిగా చరిత్ర కెక్కారు.

అగ్గిరాముడు, భలేబావ, నిలువుదోపిడీ, పెత్తందార్లు, సగటు మనిషి చిత్రాలలో బుర్రకథను చెప్పారు. బుర్రకథ కళారూపం ఇంత గొప్పగా వుంటుందనీ నాకు తెలియదు. ఇలాంటి ప్రదర్శన నా జన్మలో చూడలేదని సినీనటి భానుమతి నాజర్‌ను వేనోళ్ళ కొనియాడారు. నాజర్ బుర్రకథల్లో సామాన్య ప్రజల నుడికారాలు, సామెతలు, జాతీయాలను పొందుపరిచారు. అంత్యప్రాసలతో కూడిన హాస్యోక్తులతో నవ్వుల జల్లును కురిపించారు. వారు బుర్రకథకు నాజర్ జీవం పోశారు. కథకుని వేషం, దుస్తులు, రంగులు, నిర్ణయాలు నాజర్ సొంతమని, ఇప్పుడు బుర్రకథలో నాజర్ యుగం నడుస్తుందని శ్రీనివాస చక్రవర్తి ఆంధ్రదర్శిని గ్రంథంలో పేర్కొన్నారు.

కాకినాడలో రథానికి డెబ్భైజతల ఎడ్లను కట్టి పురవీధుల్లో ఊరేగించి స్వర్ణగండపెండెరాన్ని బహూకరించారు. బుర్రకథా సామ్రాట్ అనే బిరుదును ప్రదానం చేశారు. ఢిల్లీ ఆంధ్రసంఘం ఆహ్వానంపై ప్రదర్శనలిచ్చారు. ఆగ్రా, బొంబాయి, అహ్మదాబాద్, కలకత్తా, టాటానగర్‌లలో బుర్రకథలు చెప్పి మెప్పించారు. 'ఎప్పుడూ జనాన్ని నమ్ముకోవాలి. పెద్దలు, ప్రభుత్వాలు అవన్నీ నీ కళకు చెక్క అవార్డులు ఇవ్వడానికి పనికి వస్తారు. కళాకారునికి పట్టెడన్నం పెట్టేది జనం' అనే ఆత్మవిశ్వాసంతో బ్రతికిన నాజర్‌కు శిష్యురాలైన జమున ఆధ్వర్యంలో ఘన సన్మానం జరిగింది. మర్రిచెన్నారెడ్డి, భవనం వెంకట్రామ్



ముఖ్యమంత్రులుగా నాజర్‌ను ఘనంగా సన్మానించారు.

1981లో ఉగాది వేడుకల్లో సన్మానానికి ముఖ్యమంత్రి టి. అంజయ్య ఆహ్వానించగా నాజర్ వ్రాసిన లేఖ నాజర్ ఆత్మాభిమానానికి అద్దంపట్టింది. 'పూజనీయ పేదల బాధలెరిగిన ముఖ్యమంత్రికి కళాభివందనాలు. మహాశయా! మొదటిసారిగా ప్రభుత్వం వేదిక మీదుగా ఆహ్వానించి శ్రీ కాసు సన్మానించి ఓ చిన్న కానుక ఇచ్చారు. అది మెమెంటో అట. నేను లోనికి రాగానే పేరు రాసిస్తానని పట్టుకెళ్లారు. మళ్లీ ఇచ్చిన పాపాన పోలేదు. ఆ తరువాత జలగం వారు చాటంత రేకిచ్చారు. అది తామ్రపత్రమట. ఆ తర్వాత మర్రిమారేడు చెక్క ఇచ్చారు. అది మెమెంటో అట. అయ్యా! దేశంలో కడుపునిండకనే కీర్తి చాలా పోగౌంది. ఇప్పుడు నాకు 51 సంవత్సరాలు వచ్చినా ఇంకా నెలకు రెండు, మూడు కథలు చెబితే తప్ప ఇల్లు గడవదు. ఉగాది రోజున బళ్లారి వద్ద పల్లెలో కథ చెప్పడానికి అడ్వాన్స్ తీసుకొన్నాను. అవకాశం వచ్చినప్పుడు వస్తాను' అంటూ ఉత్తరం వ్రాశారు. 1986 రిపబ్లిక్ దినోత్సవాలలో అప్పటి రాష్ట్రపతి జ్ఞానీ జైల్‌సింగ్ చేతులమీదుగా పద్మశ్రీ పురస్కారాన్ని అందుకొన్నారు. 1986లోనే కేంద్ర సంగీత నాటక అకాడమీ పురస్కారాన్ని ఉపరాష్ట్రపతి ఆర్. వెంకట్రామన్ ద్వారా అందుకొన్నారు. 1987 ఉగాది సందర్భంగా ముఖ్యమంత్రి ఎన్.టి.ఆర్.నాజర్‌కు స్వంత ధనం రూ. 5వేలను బహూకరించారు. ముఖ్యమంత్రి హోదాలో గుంటూరు పర్యటనకు వచ్చిన ఎన్.టి.ఆర్.ను నాజర్ కుటుంబసభ్యులు కలిసి మేము మీ అభిమానులము అని చెప్పారు. దీనికి ఎన్.టి.ఆర్. పూర్వ స్మృతులలోకి వెళ్లి నేను నాజర్‌గారి ఫ్యాన్‌నమ్మా అని చెప్పడం అక్కడ ఉన్న అధికారులు, ప్రజలను ఆశ్చర్యచకితులను చేసింది. నాజర్‌నృత్య గీతాల పరిణామదశను విశ్లేషిస్తూ వ్రాసిన జాతి జీవితం కళాపరిణామం అనే గ్రంథం ప్రామాణికంగా నిలిచింది. వరంగల్లులో నాజర్ కథను విన్నకాళోజి బంగారు నక్షత్రాన్ని బహూకరించి తలపాగాకు అలంకరించారు. అవసాన దశలో తీవ్ర అస్వస్థతకు గురైన నాజర్‌కు ఆపరేషన్ నిమిత్తం వైద్యులు రూ. 30/-వేలు డిమాండ్ చేయగా ప్రముఖ వైద్యులు డాక్టర్ కె. సదాశివరావు ఉచితంగా ఆపరేషన్ చేసి మానవత్వాన్ని చాటుకొన్నారు.

పల్లీయుల కథలను, గాథలను చెప్పి నరనరాన ఉత్తేజాన్ని నింపి పరవళ్లు తొక్కించిన నాజర్ తీవ్ర రక్తపోటుతో 1997 ఫిబ్రవరి 22న గుంటూరు అమరావతి రోడ్‌లోని స్వగృహంలో కన్నుమూశారు. 'పద్మశ్రీలు, ప్రభుత్వ పురస్కారాలు అన్నీ కలిపి జనం వేసే ఒక్క ఈలతో సమానం కాదు' అని చెప్పిన నాజర్‌కలం...గళం... పేదల బాధలు ఉన్నంతకాలం గాలికెరటాలలో లీలగా వినిపిస్తూనే ఉంటుంది.



# పగటి వేషాలు- సామాజిక అంశాలు

## సోది వేషం

రచన
ప్రముఖ నటుడు, చిత్రకారుడు
తాతా రమేశ్‌బాబు
email: rbtata60@gmail.com

**పగటి కలలు కనొద్దు అంటారు**
**పగటి వేషాలు వెయ్యొద్దు అని కూడా అంటారు.**
**వేషం అంటే మారు రూపం**

*"సోది చెపుతానమ్మ సోది... ఓ...సోది*
*జరిగింది చెపుతా... జరగబోయేది చెపుతా..."*

అని రాగా యుక్తంగా అరుచుకూంటూ వీధులలో తిరుగుతుంది సోదమ్మ. ఒక చేతిలో కర్ర. మరో చేతిలో తీగలు కట్టిన బుర్రపట్టుకుని తీగలు మీటుతూ వస్తుంది సోది చెప్పే అమ్మాయి సాధారణంగా సోదిని ఆడవాళ్లే ఆడవాళ్లకు చెపుతారు.

సోది చెప్పించుకొనే వాళ్ళ జీవితంలో జరిగినవి, జరగబోయేవి ఊహించి కల్పనాచాతుర్యంతో, చమత్కారాలు జోడించి రాగయుక్తంగా వచనాన్ని పాడుతూ చెపుతారు.

ఈ సోది వేషంకి చాలా పూర్వ చరిత్ర ఉంది. త్రిపురాసుర సంహారంలో ఈశ్వరునికి సముద్ర మదన రహస్యాన్ని, విష్ణుమూర్తికి సృష్టి రహస్యాన్ని బ్రహ్మకి సోది ద్వారానే చెప్పబడినట్లు కథలున్నాయి. త్రేతాయుగంలో శ్రీ వెంకటేశ్వరస్వామి, పద్మావతిని వివాహమాడు కోరికతో సోది చెప్పే ఎరుకల సాని' వేషం వేసుకొని పద్మావతి తండ్రి అయిన ఆకాశరాజు అంత:పురానికి వెళ్ళాడు. అంతకు ముందే శ్రీ వెంకటేశ్వరుని ఒక సందర్భంలో రాజోధ్యాన వనంలో చూచిన పద్మావతి మనోవేదనతో విచారంగా ఉంది. రాజకుమారి పద్మావతి మనోవేధన తగ్గిస్తానని చెప్పి చెలికత్తెను ఒప్పించి ప్రవేశించిన సోది వేషంలో వున్న శ్రీ వెంకటేశ్వరుని మాటలు విశ్వసించలేదు పద్మావతి. చివరికి చెలికత్తెల చొరవతో సోది చెప్పించుకోవటానికి అంగీకరించింది పద్మావతి. ఆమె అరచేతిలో వున్న రేఖలను చూచి రాజోద్యానంలో చూచిన వ్యక్తి వెంకటేశ్వరస్వామి అని తెలియచేస్తుంది. అలా తన వివాహానికి మధ్యవర్తిగా తానే సోది వేషములో వ్యవహరించాడు.

పూర్వం రాజులూ ఈ వేషాన్ని అంతరింగికులతో వేయించి శత్రు రాజుల కదలికలను తెలుసుకునేవారు.

జంగాల, ఎరుకల, యానాది, పెరిగే మొక్కల జాతులకు సంబంధించిన స్త్రీలు ఎక్కువగా ఈ సోది చెప్పేవారు. వీరు కాళీ



సమయాలలో బుట్టలు అల్లుతారు. పూసల దండలు తయారు చేస్తారు. వీటిని అమ్మగా వచ్చిన ఆదాయంతో జీవన యానం సాగిస్తారు.

వీరి ఇళ్ళలోని ఆడపిల్లలకు 12, 13 సంవత్సరాలు వయసు వచ్చిన తరువాత సోది' చెప్పటం నేర్పిస్తారు. భద్రాచల, కాకాని మొదలైన ఊర్లలో వుండే గురువుల వద్దకు వీరి పిల్లలను పంపుతారు. ఈ పిల్లలకు 41 రోజులపాటు పూజ, 5 రోజులు పసర పోసి సోది చెప్పటం నేర్పుతారు. గురువులకు ఇందుకు కొంత రొక్కం ముట్ట చెపుతారు.

ఇంతకు ముందు రోజుల్లో ఒక స్త్రీకి సోది చెపితే చుట్టుప్రక్కల అమ్మలక్కలు పదిమంది చేరేవారు. ఇప్పుడు రహస్యంగా ఒక్కరే గుట్టుచప్పుదు కాకుండా సోది చెప్పించుకొంటున్నారు. ఈ విషయాన్ని గుడివాడకు చెందిన బండి తిరుపతమ్మ తెలియచేసింది.

ఇంకా డబ్బులు అవసరం అయినప్పుడు పట్టణాలలో తిరుగుతామని, బియ్యం అవసరమైతే పల్లెలలో తిరుగుతామని అంటున్నారు. వినేవారిని బట్టి చెప్పే సమయం పెంచుతామని సమయం పెరిగితే సంభావనలు అధికంగా ఉంటుందని చెప్పారు.

ఆంధ్రదేశమంతటా సోది చెప్పే వాళ్ళు వున్నా కృష్ణాజిల్లాలోనే ఎక్కువ సమాఖ్యలో వున్నట్టుగా తెలుస్తోంది. వెనుక బడిన జాతులుగా ప్రభుత్వ సాయాలు అంది పుచ్చుకొనే చొరవ తక్కువ.

మనలో ఎవరైనా ఎక్కువ మాట్లాడుతుంటే సోది చెపుతున్నాడు అని అంటుంటారు.

**పగటి వేష ప్రదర్శన**



**సామాజిక అంశం:**

# 'చిత్ర'మైన జీవితం

**Part-1**





***ప్రముఖచిత్రకారుడు, కార్టూనిస్టు, కథారచయిత బాలిగారు 64కళలుడాట్‌కాం పాఠకులకోసం తన కళాజీవిత విశేషాలను, బాల్యస్మృతులను, పరిచయాలను ధారావాహిక రూపంలో అందించనున్నారు. నెల నెలా చిత్రమైన జీవితంలో...***

నేను అనకాపల్లి (విశాఖపట్నం జిల్లా దగ్గరున్న ఓ పల్లెటూరిలో పుట్టాను. ప్రస్తుతం ఆ వూరు విశాఖపట్నం స్టీలుప్లాంట్‌లో మిగిలిన చుట్టుప్రక్కలనున్న పల్లెల్లాగే జేరి మాయమయిపోయింది. విశాఖపట్నం–అనకాపల్లిల మధ్యదూరం 21 మైళ్లు అని చిన్నప్పుడు వినేవాడిని. అయితే ఇపుడు అంతదూరంలేదు. నేను పెరగడం అంతా అనకాపల్లిలోనే జరిగింది. మా అమ్మ పేరు అన్నపూర్ణ, నాన్నగారి పేరు లక్ష్మణరావు. మా అమ్మ అందంగా ముగ్గులు వెయ్యడం, అల్లికలూ, కుట్లు చాలా బాగా చేసేది. చదివింది నాలుగో క్లాసయినా ఎన్నో పుస్తకాలు చదివేది. కతిపీటతో పెన్సిల్ ములుకు చెక్కుకుని విదేశాల్లో ఉన్న మానాన్నగార్కి ఉత్తరాలు రాయడం చేసేది. ఆ పెన్సిల్‌ను వచ్చిన ఉత్తరాలను తెల్లకాయితాలను తన ముగ్గుల పుస్తకంలో పెట్టి మాకంద కుండా జాగ్రత్తగా దాచుకొనేది. పక్కింట్లోనే మా వేనమామగారు ఉండేవారు. ఆయన దగ్గర వాళ్లనాన్నగారుండేవారు. అంటే మా తాతయ్యగారు. అవసరమయితే తండ్రితో మాట్లాడేది. మరో పక్క మేముంటున్న కాంపౌండ్‌లోనే మా అమ్మ తాలూకా, కజిన్ బ్రదర్ నరసింగరావుగారుండేవారు. ఆయన మా అమ్మకన్నా చిన్నవాడు. మా అమ్మకు అన్ని విధాలాసాయంగా ఉండేవారు.

మా అమ్మ చాలా బాగా పాడేది. సంగీతం నేర్చుకున్నట్టులేదు. మంచి కంఠం, పాడటం సరదాగా ఉండడం వల్లే పాటలు ఎలాగో తెలుసుకున్నానని చెప్పేది. ఆమె చిన్నతనమంతా బొబ్బిలిలో గడిచింది. అక్కడ తన ఫ్రెండ్సందరూ బాగా పాడేవారనీ, పాటలకోసమే వేణుగోపాలస్వామి ఆలయానికి వెళ్లేదాననినీ చెప్పేది. అక్కడ ఉదయం, సాయంత్రం ఆర్చన కొస్తూ భోగం స్త్రీలు పాటలు పాడేవారట! ఆరోజుల్లోనే అనకాపల్లి కన్యకాపరమేశ్వరీ కోవెలకు పాటకచ్చేరీ చేద్దామని టంగుటూరి సూర్యకుమారి వస్తే సరదాగా వెళ్లిచూసిందట. మా తెలుగుతల్లికీ మల్లెపూదండ..." పాటలు ఆమె చక్కగా పాడిందని ఓ సందర్భంలో నాతో అన్నది. ఈవిడకొచ్చిన పాటలో ఓపుస్తకంలో రాసుకుంది. ఎప్పుడయినా మధ్యాహ్నం పూట తాను పాడుతూ నాచేత పాడించేది. రాత్రిపూట నన్ను, మాచెల్లినీ జో కొడుతూ ఆంజనేయ దండకం మొత్తం చదివి "ఇక పడుకొండి. మనకేంపరవాలేదు దెయ్యంవచ్చినా, దొంగోడొచ్చినా వాళ్లని తన్ని తరిమేస్తాడు" అనేది మేం హాయిగా నిద్రపోయేవాళ్లం. తెల్లవారు లేస్తూనే మా అమ్మను అడిగేవాడిని "రాత్రి ఆంజనేయస్వామి వచ్చాడా! ఈ సారి రాగానే అతడ్ని నాకు చూపించమని" "అలాగే చూపిస్తాను, ఆయనతో మాట్లాడుదువులే అనేది. మళ్లీ మామూలే!

ఆరోజుల్లో కరెంట్ డబ్బున్న వాళ్ల ఇళ్లల్లో తప్ప మరెక్కడా కనపడేవి కాదు. అదీ దీపపు బుడ్డి అంత వెలుతురు మాత్రమే! మా వీధి అంతటికీ దయాకరంగారి ఇంట్లోనే ఉండేది. వీధిలైట్లు అయితే చెప్పనవసరంలేదు. ఆకాశాన్న వేలాడే దీపపు బుడ్లులా ఉండేవి. ఆ తరువాత ఎప్పుడో దయాకరంగారింట్లో ట్యూబ్‌లైట్ వెలిగితే వీధి వీధంతా ఆ ఇంటికి పోయి చూసి వచ్చారు.

ఈ ఆంజనేయస్వామి విషయంలోనే కాదు. ఆరోజుల్లో నాకు మరో అనుమానమూ ఉండేది. మనుసులు ఎలా ఎదుగుతారాని మా అమ్మ, మా నరసింగరావు మామయ్య –వీధి చివర్లో ఉండే గుర్రాల గురువులు (అతనికి గుర్రపుబండ్లు ఉండేవి) అందరూ ఎత్తుగా కనపడేవారు. నాకు ఎంతో ఆశ్చర్యంగా ఉండేది. పిచ్చిపిచ్చి ప్రశ్నలతో మా అమ్మ ప్రాణాలు తోడ్డం ఇష్టం. కానీ ఆవిడ ఓపిగ్గా, మరింత రసవత్తరంగా అల్లి సమాధానాలు ఇచ్చేది. "నేనెప్పుడు ఎదుగుతానమ్మా!" ఇదినా ప్రశ్న. మా అమ్మ సమాధానం ఇలా ఉంది, "మనం రాత్రిపూట మంచాలు ఎక్కి పడుకుంటాం గదా! సరిగ్గా



బాలి గారి తల్లిదండ్రులు లక్ష్మణరావు, అన్నపూర్ణ

నమ్మకం కుదిరింది–నేనూ ఎదుగుతున్నందుకు సంతోషం కలిగింది.

మా తాతగారి పేరు మేడిశెట్టి మహాలక్ష్మినాయుడు, ఆయన ఎలా ఉండేవారో నాకు తెలీదు– ఇంట్లో ఫొటోలు లేవు. మా అమ్మ ఆయన్ని (మామగార్ని తాతయ్య గారూ అని పిలిచేదట) ఫొటో తీయించుకోమంటే ఆ ఆయుష్షు కరిగిపోతుందని, వంటి కళను అది దెబ్బ తీస్తుందని చెప్పేవారట– మా అమ్మ మరేం చెప్పలేకపోయింది. ఇంతేకాదు ఒకమారు మా అమ్మను పిలిచి బంగారంతో నీకేం వస్తువులు కావాలని అడిగితే "గాజులు" కావాలందట. ముసలాయన గొల్లుమన్నాడట. విధవలే బంగారంతో గాజులు చేయించుకుంటారని మెడలో ఏమన్నా చేయించుకోమని సలహా ఇచ్చాడట. ఆయనకు చదువురాదు మా అమ్మచదువుకున్న కోడలని మురిసిపోయేవాడట. ఈవిడ ముందు పాత ఆయుర్వేదిక్ వైద్య గ్రంథాలు పడేస్తే అవన్నీ ఆయనకు చదివి వినిపించేది. అయితే ఆయనకు అనుభవం ఎక్కువ. సంస్కారం, సభ్యతా ఎక్కువే! ఆయన ఆయుర్వేద వైద్యం చేసేవాడట మా అమ్మ చదువుతూ చెప్తున్నా ఆయనకున్న అనుభవంవల్ల కొన్ని, కొన్ని విషయాలు మా దేవి వరంగా ఆయన చెప్పేవారని మా అమ్మ చెప్పింది. ప్రతి ఆకు, ప్రతి వేరూ తాలూకా గుణగణాలు ఏమిటో– అవి ఏవిధంగా, రోగానికి పనికివస్తాయో కొన్ని లోహాలతో ద్రవాలులో ఎన్నిసార్లు పుటంపెట్టాలో వివరించేవారట. ఇంటినిండా కల్వంరాళ్ళూ, వాటిల్లో మందులు వేసి నూరేవాళ్ళూ, పుటం పెట్టే పనివారూ ఇక దూరంగా పాకల్లో, చావిళ్లలో రోగులు వారిని కనిపెట్టుకొని ఉండే మనుషులతో సందడిగా ఉండేదట ఇక వంటల విషయం చెప్పనవసరం లేదు. తెల్లారు జాము నాలుగ్గంటలకు పొయ్యి రాజేస్తే రాత్రి పది గంటలకే ఆర్పటం. రోగులకు పథ్యపుకూళ్ళూ, వారివెంట ఉన్న వారికి భోజనాలూ అన్నీ ఇక్కడే!

నాకో అన్నయ్య ఉండేవాడు. అతని పేరు మాతాతగారి పేరే –మహాలక్ష్మినాయుడు. చిన్న తనంలోనే చనిపోయాడు. అతడ్ని మా అమ్మ బాబూరావ్! అనిపిలిచేది అతనితో నాకో చిత్రమైన అనుభవం ఉంది. అది నేను మరచిపోలేదు. మానాన్నగారు అప్పటికే మిలటరీలో ఉన్నారు. రెండవ ప్రపంచయుద్ధం నడుస్తోంది. మా అమ్మ మా

అప్పుడే దేవుడు వస్తాడు. ఆయన చేతిలోపెద్ద డబ్బా ఉంటుంది. దానిలో ఏదో ముద్దలాంటి మందు ఉంటుంది. మన కాళ్లదగ్గర కూచుని, మన పాదాలకు ఆ మందు రాస్తాడు. రోజూ కొంచెం కొంచె రాస్తాడు, అప్పుడు మనం మనకు తెలీకుండానే ఎదిగిపోతాం".

"నిజంగానా! మరి ఆంజనేయస్వామి ఏంచేస్తాడు?!!

"ఆపక్కనే నిలబడిచూస్తాడు"

నాకీ సమాధానం ఎంతో నచ్చింది. రెండు పాదాలూ దుప్పటిలో పెట్టకుండా, పైనే ఉంచేవాడిని. దోమతెరలు కట్టినా రెండు కాళ్లు బయటే పెట్టేవాడ్ని "ఏమో? దేవుడు మర్చిపోయి నా కాళ్లకు ఆ ముద్ద రాయకుండా వెళ్లిపోతే

ఉదయం లేచిన తరువాత రెండు పాదాలు జాగ్రత్తగా చూసుకొనేవాడిని. తడి ఆరక ఆ ముద్ద నేలకు అంటుకుపోతే–ఏమిటి గతి?

ఇలా చూసుకుంటున్నా– నా కాళ్లూ, పాదాలూ మామూలుగానే ఉండేవి. ఐతే కనపడలేదు. వెంటనే మా అమ్మను అడిగాను "దేవుడు మందు రాస్తున్నాడా? లేదా మరిచిపోయడా? అని.

మా అమ్మ అన్నది. లేదు రాస్తున్నాడు– అది తొందరగా ఆరిపోతుంది. నువ్వు ఎదుగుతున్నావు. ఆ గోడ మీద నువ్వెంత పొడవున్నావో (ఎత్తు) ఓ సారి గీతగీసి చూసుకో, కొన్ని రోజులుపోయినాక చూసుకో– తేడా తెలుస్తుంది అన్నది.

అలాగే చేశాను– ఎదిగాను.

చెల్లిని పక్కలో వేసుకని పక్క మంచం మీద పడుకొనేది. దానికి ఆనుకుని ఉన్న మరో మంచంలో నేనూ, మా అన్నయ్యా పడుకొనే వాళ్లం. అప్పటికే మా అన్నయ్యకు కామెర్ల వ్యాధి ముదిరి జబ్బుగా ఉన్నాడు. ఓ రాత్రి వేల నల్లగా ఉన్న వ్యక్తి ఆవ్యక్తి నాకు పరిచయం ఉన్న మనిషిలాగే కనిపిస్తున్నాడు. నాకు వరుసకు పెదనాన్న అయిన వాడూ మా మేనత్త అల్లుడూ అయినతో తోట సాంబమూర్తినాయుడు ఆకారంలో ఉన్నవాడు వచ్చి మా అన్నయ్యను రెండు చేతుల్లోకీ తీసుకున్నాడు. అది కల లాంటి నిజం. నేను ఆ వ్యక్తిని స్పష్టంగా చూస్తున్నట్టే కనిపిస్తోంది. తెల్లారేసరికి మా అన్నయ్య చనిపోయాడు. మా అమ్మ దు:ఖం ఇంతింత కాదు. ఆ తరువాత ఎపుడయినా ఆ తోట సాంబమూర్తి నాయుడు గారు మా ఇంటికి వచ్చి నన్ను దగ్గరకు రమ్మనమని చేయి చాపితే వెళ్లేవాడ్నికాదు. నువ్వే మా అన్నయ్యను తీసుకుపోయావని ఏడ్చేవాడిని. దేనితోనైనా మొద్దుదామన్నంత కోపంగా ఉండేది. దూరంగా పోయి వేలు జాడిస్తూ "నువ్వే మా అన్నయ్యను ఎత్తుకుపోయావ్" అనేవాడిని. ఆయన బిత్తరపోయేవాడు. మా అమ్మ సముదాయించినా నా కోపం చల్లారేది కాదు.

ఈయన నల్లగా ఉండేవాడు నోట్లో ఓపక్క బంగారం పన్ను తెగమెరిసేది. చెరుకుతోటలూ, మామిడితోటలూ ఆయనకున్నాయి. ఆయన ఊరు అనకాపల్లికి దగ్గర్లో ఉన్న శంకరం ఆ ఊరికి దగ్గరలోనే బొజ్జన్న కొండుంది. దానికి పూర్వ నామం బుద్ధినికొండ. కాలంతోపాటు పేర్లలోనూ మార్పులొచ్చాయి. కొంచెం జ్ఞానం వచ్చాక ఏదో ఆధ్యాత్మిక గ్రంథంలో చదివాను. పరమాత్మ మన కుటుంబంలోని మనిషిలాగే వచ్చి కష్టసుఖాలు కలిగిస్తాడని. గీతలోనే ఉంది కదా! దైవం మానుష రూపేణా అని...ఈ అనుభవమూ అంతేనేమో!

రెండవ ప్రపంచ యద్ధం జరగుతోంది. అప్పటిలో పేపర్లూ, టీవీలూ లేవు మా చిన్న మామయ్య ఏవేవో న్యూస్ సేకరించి మా అమ్మకి వినిపించేవాడు. నాకేం అర్థం కాకపోయినా అతని నోట జర్మన్, జపాన్ అనే మాటలు తెగవచ్చేవి. ఇండియాలో రేషన్, జనం దగ్గర డబ్బులున్నా తిండి గింజలు దొరికేవి కాదట!

విశాఖపట్నంమీద బాంబులు పడతాయని ప్రచారం జరిగి విశాఖపట్నాన్ని జనం ఖాళీ చేస్తున్నారు. దొరికిన బళ్లను పట్టుకొని పక్క, పక్క పల్లెటూర్లకి జనం తరలిపోతున్నారు. ఎవరినోట విన్నా యుద్ధం కబుర్లే. మా మామయ్య తాలూకా ఆఫీస్‌లో పని చేస్తుండడం వల్ల ఓ పూట అన్నం, రాత్రిపూట రొట్టెలూ తినేవాళ్లం కిరోసిన్ దొరికేది కాదు, మా అమ్మమ్మ వాళ్లకి పొలాలూ ఉన్నాయి కాబట్టి మంచి నూనె, ఆముదం పంపేవారు. వాటితోనే రాత్రిపూట దీపాలు



పెట్టుకోవడం, భోజనాలు కాగానే రాత్రి 8 గంటలకల్లా ఆర్పేయడం, విశాఖపట్నం మీద పడతాయనుకున్న బాంబులు, అనకాపల్లికి దగ్గర్లో ఉన్న తుమ్మపాల షుగర్‌ఫ్యాక్టరీ మద పడ్డాయి. అయితే అవి అదృష్టవశాత్తూ పక్కనున్న పొలంలో పడ్డాయి. పెద్ద గొయ్యి పడింది. ఇక జనంలో భయం ధైర్యంగా వెళ్లి దాన్ని చూసిన వారు, తమపైత్యాన్ని జోడించి వర్ణించి అతిశయంగా చెప్పడం, మా అమ్మకు మానాన్న గురించి భయం... ఏదన్నా ఉత్తరం మానాన్న నుండి వస్తే మా అమ్మకు సంతోషం అలా ఉత్తరం వచ్చిన రోజున మా వీధివారంతా మా ఇంటిముందు దడికట్టి నిలబడడం తమాషాగా ఉండేది. ఎందుకంటే ఆ ఉత్తరం కనీసం పదిపేజీలుకు తగ్గకుండా ఉండేది. అందులో జపాన్, జర్మన్ మాటలు, సింగపూర్ విశేషాలు వారి పటాలం కదలడం, బాంబులు వేసిన ప్రదేశాలు అన్నీ ఉండేవి. మా అమ్మ చదివి వినిపించేది. రేడియోలో ప్రపంచ వార్తలు వింటున్నట్టు వాళ్లువినేవారు. కొన్నాళ్లకు యుద్ధం అయిపోయింది.

ఇంకా వుంది...

email: balisankar@gmail.com

# 'పగలే వెన్నెల' కురిపించగల గాయని జానకి

శ్రోతల ఆశలను ఆడియాస చేయని మణిపూస... 'పగలే వెన్నెల' కురిపించిన రాతిరిలో జాబిలి... 'నీలిమేఘాలలో గాలి కెరటాలలో తాను పాడిన పాటనే వేళైనా వినిపించిన 'కిలకిల'కోకిల స్వరం శ్రీమతి ఎస్.జానకి. ఆమె గొంతు వింటూ కోకిల చిన్న బుచ్చుకుంటుందంటే అతిశయోక్తి కాదు.

– మాకినీడి సూర్యభాస్కర్



నాదస్వరమే ఆమె గొంతు. అనునాద స్వరమే పోటీ పడలేకపోయింది. 'కొంజుం సలంగై' అన్న తమిళ చిత్రంలో 'సింగార వేలనే దేవా' పాటకు కురుచ్చి అరుణాచలం అందించిన నాదస్వర సహకారానికి ధీటుగా తన గాత్ర సహకారాన్ని నాదస్వరం రేంజిలో అందించి మెప్పించిన గాయకమణి శిష్టా జానకి. తన సంగీత సారథ్యంలో సుబ్బయ్యనాయుడు, ఆ పాటలో నాదస్వరంతో మానవ స్వరాన్ని జత చేయగలగడం ఒక అసాధ్యమైన, అపూర్వమైన సంఘటన. దానిని సాధ్యం చేయడానికి ఆయన పడిన శ్రమ గొప్పది. మొదట ఆ పాటలో వినబడే నాదస్వర భాగాలన్నీ జాగాలుంచి రికార్డుచేసి, ఆ తర్వాత దానితో పాటూ కంఠాన్ని కలిపి రికార్డు చేయాలన్నది ఆయన చేయదలచిన ప్రయోగం. నాదస్వర శ్రుతితో శ్రుతి కలిపి పాడగల కంఠం మద్రాసులో వినబడకపోయేసరికి, బొంబాయి వెళ్ళి, అక్కడా (విన) కనబడకపోయేసరికి నిరాశతో తిరగి మద్రాసు చేరి... యింకా ఆరా తీస్తున్న సమయంలో... " నాదస్వరం రేంజిలో గాత్రాన్ని విననపించగల గాయని జానకి ఒక్కరే"నని పి.లీల ఇచ్చిన సలహా మేరకు ఆయనకు జానకి కనబడింది... చిన్న రికార్డింగు ధియేటరులో టెస్టుకోసం ఆ పాటగా వినబడింది. చివరికి "ఓ.కె" అనిపించి, తమిల శ్రోతలందరికీ వినబడింది.

అదే చిత్రాన్ని తెలుగులో 'మురిపించే మువ్వలు'గా డబ్ చేసినప్పుడూ అదే తీరులో "నీ లీల పాడెద దేవా" అంటూ పాడి, 'సరిలేరు తనకెవ్వరూ' అనిపించారు జానకి. అలాగే కన్నడ చిత్రం 'హేమావతి'లో 'శివ శివ యన్నదా' అంటూ వాయులీన స్వరంతో పోటీ పడ్డారు. అయితే ఆ పాట తననెంతో శ్రమకు గురిచేసిందంటారు, జానకి. వైద్యనాథన్ సంగీత దర్శకత్వంలో పాడిన ఆ పాట అభోగికి తోడైన తోడి



రాగం. లైను లైనుకీ రాగం మారే తీరులో స్వరపరచబడిన ఆ పాటను ఏ అపస్వరానికీ (సంకర స్వరం) తావివ్వకుండా పాడటమే గొప్పయితే, పాట చివరలో స్వరాలు పలకడం ఒక పరీక్ష అయిందంటారామె. ఈ పాటలో మృదంగంతో కూడా పోటీ పడ్డారు జానకి. ఆ విధంగా వాద్య స్వరంతో మానవ స్వరాన్ని మేళవించి చరిత్ర సృష్టించిన అపురూప నిరుపమాన గాయని జానకి. బిస్మిల్లాఖాన్ షెహనాయితో పోటీ పడుతూ 'సనది అప్పన్న' కన్నడ చిత్రంలోను, హరిప్రసాద్ చౌరాసియా వేణునాదానికి ధీటుగా ఆమె ఎన్నో పాటలు పాడారు.




23-4-1938న స్వగ్రామమైన గుంటూరు జిల్లా రేపల్లె తాలూకా పల్లపట్లలో ఆయుర్వేద వైద్యులు శిష్టా శ్రీరామమూర్తి నాలుగవ కూతురుగా పుట్టిన జానకి, చిన్నప్పట్నించి చదువుపైశ్రద్ధ చూపలేదు. రాజమండ్రిలో ఉన్నప్పుడు తల్లి ప్రోత్సాహంతో బలవంతంగా నాదస్వర విద్వాన్ గాడేసల్లి పైడిస్వామి వద్ద శాస్త్రీయ సంగీత శిక్షణ నొక సంవత్సరకాలం అభ్యసించారు జానకి. సంగతులు వదిలేసి నేరుగా 'నగుమోము' కీర్తలనతో ఆమె శిక్షణను ఆంభించారు పైడిస్వామి. ఆయన వద్దకు వచ్చే పెద్ద శిష్యులకు చెబుతన్నప్పుడు ఒకసారి విని పాడేసేది పదేళ్ల చిన్నారి జానకి. తన గురువుగారి ఆశీస్సుతో పాటు, ఆయన నాదస్వర విద్య ప్రభావం వల్లనే నాదస్వరంతో సమానంగా పాడగలిగానేమో అనే జానకి బహునిగర్వి. శాస్త్రీయ సంగీత విద్వాంసులు వంకరగా , యాసగా సాగదీస్తూ పాడతారనే ఉద్దేశ్యంతో సంగీతాభ్యాసానికి సంవత్సరకాలం పాటు స్వస్తి చెప్పారు జానకి. అంతంత మాత్రంగా నేర్చుకున్న సంగీతంలోనే ఆమె మధురాతి మధురమైన పాటలెన్నో పాడగలిగారు.

మామగారు (అప్పటికింకా కాదుగానీ) ఫన్ డా॥ చంద్రశేఖర్ గారి ఉత్తరం ద్వారా ఎ.వి.ఎం. స్టూడియోనుంచి అడిషన్‌కు రమ్మంటూ పిలుపొచ్చింది. టెస్టుకోసం లతా మంగేష్కర్ పాడిన 'రాసక్ బల్యా' పాటను పాడి మెప్పించి, స్టాఫ్ ఆర్టిస్టుగా నెల జీతానికి కుదరుకున్నారు జానకి. అయితే ఎ.వి.ఎం.లో పాడడానికి ముందే టి. చలపతిరావు దర్శకత్వంలో ( 1957, ఏప్రిల్ 4న ) 'విధియన్ విళైయట్టి' అనే తమిళ చిత్రంలో 'పేరై ఎన్ ఆసై పాళన దేనో' అన్న విసాదగీతాన్ని ఆలపించారు జానకి. ఆ మరుసటి రోజే ఎం.ఎల్.ఏ. చిత్రం కోసం ఘంటసాలతో కలిసి తెలుగులో మొట్టమొదటి గీతం కూడా శోక గీతమే కావడం చెప్పుకోదగిన విషయమైతే, ఏ.వి.ఎం. వారి కోసం సింహళంలో పాడిన పాట కూడా అంతే.

విషాద గీతాలతో ప్రారంభించినా, 'శోకంలో శ్లోకం'లాగా విషాదంలో నిషాదాన్ని స్వరపరచుకుని స్వరవాద్యాలను గాత్ర నాదపరంగా.. పరమంగా పరిణమింపజేశారు జానకి.

తెలుగు, తమిళ, కన్నడ, మళయాళ, హిందీ, పంజాబీ, ఒరియా, తుళ, కొంకణి, సంస్కృతం వంటి దేశీయ భాషలతో పాటు, ఆంగ్లం, జర్మన్, జపానీ వంటి విదేశీయ భాషలతో కలిపి మొత్తం పదిహేడు వేల దాకా పాటలు పాడారు జానకి. అయితే ఏ భాషలో పాడినా ఆ భాష నేటివిటీని ఒడిసి పట్టి పాడగలగడం ఆమె ప్రత్యేకత. అందుకే ఆమె పాటను భాషా భేదం లేకుండా శ్రోతలందరూ ఆస్వాదించారు.

తెలుగులో జానకి పాడిన పాట 'నీలి మేఘాలలో... గాలి కెరటాలతో' అలా అలా అలలా సాగి విచ్చి ప్రేక్షక 'జగమే ఊయల'లూగేలా చేసింది. ఎంతటి ధీరుణ్ణైనా ఓడించగల 'ఆడదాని ఓర చూపు'లా జన మానసాలను లోగొంది ఆమె పాట. పదహారేళ్ల వయసు సిరమల్లె పువ్వుల్ని అలరించింది. దుర్యోధన, దుశ్శాసనుల దుర్నీతిని ఎండగట్టింది. ఆఖరికి 'నడిరేయి ఏజాములో 'నో స్వామిని తిరుమల శిఖరాలు దింపింది.

ఆమె పాడిన ప్రతి పాట ఆమె గొంతులోనుంచి రాబట్టే అపురూపంగా ఉందనిపించేలా పాడారు జానకి. ఇంచుమించు ఆమె



ప్రతి పాటలోను అనితర సాధ్యమైన ముద్రతో పాటు, ప్రయోగశీలత కూడా ఉంటుంది. పాట మధ్యలో నవ్వడం, పదుతూ నవ్వడం, నవ్వుతూ పాడడం లాంటి గమ్మత్తులు జానకి తప్ప మరెవరూ చేయలేకపోయారు. 'సిరిమల్లె పువ్వల్లె నవ్వు... చిన్నారి పాపల్లె నవ్వు' అన్న పాటను ఆసాంతమూ నవ్వు సంగీతంతో... నవ్వ రాగంతో ఆమె పాడిన తీరు అద్భుతం. అలాగే చిన్న పిల్లలకు పాడడంలో కూడ జానకి తర్వాతే ఎవరైనా. 'గోవుల్ల తెల్లన... గోపయ్య నల్లన' అని పాడుతుంటే అచ్చం పాలేరు పిల్లాడే వినిపిస్తాడు. అదే గొంతలో బొంగురు ఛాయను కలిపి 'పాప పేరు మల్లి... నా ఊరు కొత్త ఢిల్లీ' అని పాడుతుంటే నవ్వు రాక మానదు. పదహారేళ్ల ' సిరమల్లె పువ్వు' నుంచి 'అలకపానుపు నెక్కెను చిలిపి గోరింకా' అంటూ, పండు ముసలవ్వలా పాడగలగడం కూడా ఆమెకే సుసాధ్యం. ఆమె గానం వైవిధ్య భరితం.

భక్తి పాటైనా, రక్తి పాటైనా భావానురక్తి జనకంగానే ఆమె పాడారు. నవ్వు పాటలైనా, నవ్వించే పాటలైనా... ఏడ్పు పాటలైనా, ఏడ్పించే పాటలైనా ఒకే రకంగా ఆమె గొంతులో జాలువారాయి. పైగా మాతృభాష అయిన తెలుగులోనే కాకుండా, ఇతర స్వదేశీ భాషల్లో కూడా అంత సాధికారంగానూ పాడి మెప్పించగలిగారు జానకి.

'చందమామరావె', జడ్జిమెంట్ చిత్రాల్లో బేబి సుజితకు డబ్బింగూ, 'మౌనపోరాటం' చిత్రానికి సంగీత సారధ్యం వహించినా, ఎక్కువగా పాడడానికే అంకితమయ్యారు జానకి. అయితే స్వయంగా సంగీతం కూర్చుకుని 'కృష్ణ రవళి', 'నాదప్రవాహం', 'తెలుగులో భక్తి గీతాలు' వంటి ప్రైవేటు కాసెట్లను రూపొందిచారు. ఇంకా 'అయ్యప్ప గీతికాష్టకం', 'శ్రీ వేంకటేశ్వర సుప్రభాతం', ' శ్రీ షర్దీసాయి గీతమాలిక' వంటి క్యాసెట్లను కూడ ఆమె పాడారు. ఎస్.పి బాలసుబ్రహ్మణ్యంతో కలిసి పాడిన వక్కలంక లక్ష్మీపతిరావు గారి 'ఆంధ్రపుణ్యక్షేత్రాలు' రికార్డు ఆమె గాన మకుటంలో కలికితురాయి. నిరంతర ప్రవాహంగా పాడడాన్నే జీవితంగా మలచుకున్న

జానకి, శ్రీకృష్ణ, సాయిబాబాలపై పాటలు కూడా రాశారు. ఆమె చిత్రకారిణి కూడా, ఎక్కువగా శ్రీకృష్ణుడి చిత్రాలు గీసారామె.



అవార్డుల విషయానికొస్తే, ఆకాశవాణి పాటల పోటీల్లో ద్వితీయ బహుమానాన్ని అప్పటి రాష్ట్రపతి డా॥ బాబూ రజేంద్రప్రసాద్ చేతులమీదుగా 1956లో అందుకున్న దారంభంగా ఎన్నో పురస్కారాలు, అవార్డులు గెలుచుకున్నారు, జానకి. 'కర్ణాటక చలన చిత్ర రసిక సంఘం', 'లావణ్య' వార్తాపత్రికలు ఉత్తమ నేపధ్య గాయనిగా జానకిని అభినందించాయి.

ఆమె పాడిన 'పదునారు వయిదినివే' తమిళ చిత్రంలోని పాటకు మొదటిసారిగా జాతీయ అవార్డు వచ్చింది. 'ఓపోళ్' (మళయాళ) చిత్రంలో పాటకు రెండో సారి 'సితార' (తెలుగు) చిత్రంలో 'వెన్నెల్లో గోదారి అందం' పాటకు ముచ్చటగా మూడోసారితో 'హ్యాట్రిక్కు' సాధించి, 'దేవర మగన్' (తమిళం) చిత్రంలో పాటకు నాలుగో సారి ఆమె జాతీయ అవార్డు అందుకున్నారు. కేరళ ఫిలింఫాన్స్ అసోసియేషన్ 'ఆలింగనం' చిత్రంలో పాడిన పాటకు నేపథ్యగాయనిగా సత్కరించింది.



సినిమా సంగీతానికి స్వర్ణయుగ మనదగిన కాలంలో తాను నేపద్య గాయనిగా ఉండడం తన అదృష్ట మంటారు జానకి. తన జీవితంలో పాడలేని రోజే రాదని విశ్వసనీయంగా చెప్పగల జానకి, పాడుతూనే పోవాలన్నది తన ఆశగా చెబుతారు. జీవితాన్ని పాటగా మలచుకున్న గాయకురాలి విషయంలో ఇది అత్యాశ కాదు... కాకూడదు.

కార్టూన్

# కార్టూన్‌తో నాలుగు దశాబ్ధాల అనుబంధం...



**వంద మాటలు చెప్పలేని విషయాన్ని ఒక్క బొమ్మ చెప్తే, వంద బొమ్మలు చెప్పలేని విషయాన్ని చిన్న కార్టూన్ చెబుతుంది. కార్టూన్ కూడా ఓ రకం బొమ్మే అయినప్పటికీ దానిలోని సౌందర్యపోషణ కన్నా యదార్ధ జీవిత చిత్రీకరణ, ఓ ప్రశ్న, ఎత్తి పొడుపు, సందేశం, హెచ్చరిక, వ్యంగం, చమత్కారం వంటి అంశాలు అదనపు ఆకర్షణలుగా ఉంటాయి. అయితే, సమాజంలో కార్టూనిస్టుల సంఖ్య మాత్రం అతి తక్కువ. వారిలో విజయవాడకు చెందిన ఏవీ మోహనగుప్తా (ఏవీఎం) కూడా ఒకరు.**

వృత్తిరీత్యా వ్యాపారి అయినప్పటికీ కార్టూనిస్టు ఏవీఎంగానే ఆయన ఎక్కువ పేరు గడించారు. అతి తక్కువ మంది తెలుగు సీనియర్ కార్టూనిస్టులలో ఏవీఎం ఒకరు. పాఠశాల వయసులో పాఠ్య పుస్తకాల్లోని బొమ్మల్ని ప్రింటింగ్ సైజులోనే వేయడాన్ని ఒక చాలెంజ్‌గా తీసుకొని బొమ్మలు గీశారు. ఓ పక్క చిత్రకళలో ఓనమాలు చేర్చుకుంటూనే పీయూసీ వరకూ చదివి, వ్యాపార రంగానికి మళ్లారు. మద్రాసులో లైన్‌డ్రాయింగ్ హయ్యర్ పూర్తిచేశారు. తనలోని చిత్రకళాభిమానాన్ని పదిలంగా కాపాడుకుంటూ వచ్చిన ఆయన ప్రముఖ చిత్రకారుడు వేణగోపాలరావు గారి వద్ద లైన్ డ్రాయింగ్ నేర్చుకున్నారు. వడ్డాది పాపయ్య, బాపు గారి చిత్రాలు, కార్టూన్లు చూసి ఎంతగానో ప్రభావితమయ్యారు. ఆయన గీసిన మొదటి చిత్రం 'నారీనారీ నడుమ మురారీ' అంటే ఇప్పటికీ ఆయనకు ఎంతో ప్రేమ. నాలుగు దశాబ్దాలకు పైబడి కార్టూన్లు గీస్తున్న ఏవీఎం అనేక పత్రికలలో వెయ్యికి పైబడి కథలకు బొమ్మలు గీశారంటే అతిశయోక్తికాదు. ప్రతి పురుషుడి విజయం వెనుక ఓ స్త్రీ ఉందన్న మాటకు నిలువెత్తు నిదర్శనంగా ఆయన శ్రీమతి రత్నప్రభ అందిస్తున్న తోడ్పాటు ప్రశంసనీయం.



ఏవీఎం తో వ్యాసరచయిత పద్మకళ

### కార్టూన్ అంటే...

కార్టూన్ గీతల్లోనే భావం వచ్చేయాలనీ, మాటలు చదవకుండా చూడగానే నవ్వించగలిగేదే అసలైన కార్టూన్ అని, ప్రపంచాన్ని ఎంత ఎక్కువ పరిశీలిస్తే అంత మంచి కార్టూన్లు తయారవుతాయని ఏవీఎం అభిప్రాయపడుతున్నారు. చదువుకున్న వారితో పాటు చదువుకోని వారు కూడా కార్టూన్ చూడగానే ఆనందించడంతో పాటు ఆలోచించాలని చెబుతున్నారు.



ఏవీఎం గీసిన చిత్రం

### ఆసక్తిని బతికించుకోవాలి

తాను చేస్తున్న వ్యాపారం తన హాబీకి ఏమాత్రం అడ్డంకి కాదంటున్నారు ఏవీఎం. ఒక్కో సారి పనిలో ఉన్నప్పుడు మంచి ఆలోచన రాగానే తక్షణమే ఓ చిన్న కాగితంపై రాసుకుని , ఆ భావాన్ని డబ్బుల కంటే భద్రంగా తన జేబులో దాచుకుంటానని, ఆ భావానలన్నిటికీ ఆదివారం రూపమిస్తానని చెబుతున్నారు. తాను చదివిన పుస్తకాలలో మనసు కదిలించే వివిధ నవలలు, కథలకు ప్రభావితుడై వాటికి ప్రతిరూపంగా తన మనసులోని భావనలను కార్టూన్లుగా మార్చుకుని వదిలం చేసుకుంటారాయన.



ఆస్కా - విశిష్టపురస్కారం(2002 సం॥లో) అందుకుంటున్న ఏవీఎం

### కార్టూనిస్టుల మనుగడకు ముప్పు

ప్రస్తుత ఆధునిక ప్రపంచంలో కార్టూనిస్టుల మనుగడకు ముప్పువాటిల్లింది. కార్టూన్లను పెంచి పోషించాల్సిన పత్రికల్లో చాలావరకూ ప్రసిద్ధిపొందిన వారికే ప్రాధాన్యతనివ్వడంతో చిన్నచిన్నకళాకారులు అవస్థలు పడుతున్నారు. కార్టూన్లు గీయడమంటే ఆసక్తి ఉన్న వారు కేవలం 4,5 నెలల్లో ఈ విద్యను నేర్చుకోవచ్చని, పేరొందిన కార్టూనిస్టుల చిత్రాలు దగ్గర పెట్టుకొని అభ్యాసం చేసి మంచి గురువును అన్వేషించి రంగులద్దడం, ఇతర నైపుణ్యాలు నేర్చుకోవచ్చని ఏవీఎం తెలిపారు. కార్టూన్లపై బాగా పట్టు సాదించిన వారికి యానిమేషన్ రంగంలో ఉపాధి అవకాశాలు మెండుగా ఉన్నాయని ఆయన చెప్పారు.



వరల్డ్ కార్టూనిస్టులదినోత్సవం ప్రతేకసంచిక ఆవిష్కరణ సభలో



పద్మశ్రీ పి. శ్రీపతి చేతుల మీదుగా సత్కారం అందుకుంటున్న ఏవీఎం దంపతులు

పదిహేను వేలకుపైగా కార్టూన్లు గీసిన ఏవిఎం, స్వాతి, మల్లెతీగ, హాస్యానందం వంటి పత్రికలలో వందలాది కథలకు బొమ్మలు గీసారు. తనుగీసే కార్టూన్లో వైవిధ్యం కోసం నిరంతరం తపిస్తూ, నిత్యవిద్యార్థిగా కృషిచేసే ఏవిఎం. కంప్యూటర్ ద్వారా తను గీసిన కార్టూన్లకు తనే కలరింగ్ చేసుకుంటారు.

### ఏవీఎం అవార్డులు-పురస్కారాలు

పుస్తకాలు: ఏవీఎం కార్టూన్లు (3 సంపుటాలు), రన్నింగ్ కామెంట్రీ, చిచ్చర పిడుగు (2 సంపుటాలు)

అవార్డులు: కార్టూన్ రంగంలో చేసిన కృషికి గుర్తింపుగా 2000వ సంవత్సరంలో ఆస్కా విశిష్ట పురస్కారం, కోనసీమ చిత్రకళా పరిషత్ వారిచే చిత్రకళావైజయంతి పురస్కారాలు అందుకున్నారు. సన్మానాలు, బిరుదలకు దూరంగా ఉండే ఈయనను శారదా కళా సమితి, ఎక్స్‌రే, సత్యనారాయణపురం వర్తక సంఘం వంటి సంస్థలు సత్కరించాయి.

ప్రస్తుతం '64కళలు డాట్ కామ్' అనే వెబ్ మాస పత్రికకు సంపాదక సభ్యులుగాఉన్న ఏవీఎం రెండు వందలకు పైగా సింగిల్ పేజీ కథలు రాసారు. వీరికి జ్యోతిష్యశాస్త్రంలో కూడా ప్రవేశం ఉంది.


నే చెబితే విన్నారా! కాళ్ళకూ, చేతులకూ ఇన్సూరెన్సు చేయించుకోండీ అంటే! గుండెకు మాత్రం చేయించుకున్నారు!
AVM

AVM toons


మనవాళ్ళు గెలిచారా! అతే ఈసారి అఖిలంగా మ్యాచ్ ఫిక్సింగ్ చేసట్లే!!
AVM


ఏ ఆశ్రమంలో వుంటారో అడ్రసు ఇచ్చి వెళ్ళండీ! డబ్బు అవసరమవగానే కబురు చేస్తా!!
AVM

కామెడి కథ

# ఒక ఐడియా జీవితాన్నే మార్చేస్తుంది!

– బీవీ

***కల వచ్చిందేమో–రాఘవకు రాత్రి పడుకొన్నాక 3.30కి మెలుకువ వచ్చింది. బాత్రూంకి వెళ్లివచ్చాడు. అపుడే గమనించాడు. తనపై పళ్ళుకిందిపళ్లని నొక్కేస్తున్నాయి. పళ్ళుదూరంచేసి చూసాడు. పళ్ళులో ఏదో తీపుగా వుంది. పరీక్షగా గమనించాడు. కాసేపటికి దవడల్లో నొప్పి అనిపించింది. నిద్రసరిగ్గా రాలేదు. దిండులో తలదూర్చి, దుప్పటి పైకి లాక్కున్నాడు. చికాకు పడుతున్నాడు. 'రాత్రి బాగానే వున్నాడుగా–ఏమైంది' పక్కలో కదలసాగాడు. రాఘవ అర్థాంగి రేవతి 'ఏమిటండీ' అంటూ లేచింది.***

అపుడు టైం 4.15 అయ్యింది. పలకలేదు రాఘవ. రెట్టించి అడిగింది. ఏమిటండీ! బాగోలేదా?

'ఏదో బాగోలేదే'

'ఏమైందండీ!

పళ్ళు నొక్కేసుకొంటున్నాయి. దవడల్లో, చిగుళ్లలో, వీపులో నొప్పిగా వున్నట్లుంది...' కాసేపు నిద్రపొండి, అదే తగ్గిపోతుంది."

"దేనికీ" నిద్రాపుకోలేకుండా ఆవులిస్తూ అడిగింది రేవతి.

"వేకువనే వీపులో నొప్పి వస్తే. హార్ట్ఎటాక్ వస్తుందట. అది చాలా డేంజరస్‌కూడా! చిగుళ్ళలో నొప్పిని




ఎపుడు నెగ్లెక్ట్ చేయకూడదు. మా తమ్ముడు చెప్పాడు".

రాఘవ తమ్ముడు రవి. 'సుఖీభవ' వంటి ప్రోగ్రాంలు, ఆరోగ్య సూత్రాలూ, యోగా అన్నీ భలే ఫాలో అవుతూంటాడు. అతనొక నడిచే లైబ్రరీగా పొగుడుతుంటారు అంతా...

అతడి సూక్తులు ఎపుడూ వింటూ 'ఓహో' అంటుంటాడు రాఘవ.

అప్పటిదాకా పట్టించుకోని రేవతి, "హార్ట్ఎటాక్" అనేమాట వినగానే ఉలిక్కిపడి లేచి కూచుంది.

"ఏవండీ! దీనంగా అనింది.

'ఉండవే... మొదట తమ్ముడికి ఫోన్ చేయి...

ఇంకో పదినిముషాలు ఆగండి: 6.00 అన్నా కాకుండా ఎలా చేసేది అనింది. కాదే ప్రాణంపోతే– ముందు చెయ్యవే–చెయ్!"

ఇక రవికి ఫోన్ చేసింది. రవి హైదరాబాద్‌లో వుంటాడు.

"రాఘవ వూం! చెప్పు" యింత తెల్లారే చేశాడేంటా అనుకొంటూనే రవి.

రాఘవ పరిస్థితి వివరించాడు. దుప్పట్లో దూరుకొనే మాట్లాడుతున్నాడు.

అన్నయా, అల్లాగైతే ఆలస్యం చేయకు. మనూళ్ళో యమ్.డి., డి.ఎమ్‌కి చూపించు. ఈసీజీ తీయించు, అవసరమైతే ఎకో కూడా. రిపోర్టు వచ్చాక ఫోన్ చేయి. భయపడకు. చూపించుకోడం మంచిది. అంతగా ఐతే స్టెంటో, బైపాసో చేస్తారు 45 దాటాం కదా సహజం.

ఇక్కడ హైద్రబాద్‌లో అయితే లక్షా ఇరవైవేలే. ఫైదేస్ ప్యాకేజీ. ఆరోరోజు డిస్‌ఛార్జ్ చేస్తారు. అక్కడ చేయించకు. ఇక్కడ అన్ని వసతూలూ వుంటాయి. నేనూ పార్వతీ చూసుకొంటాం. ఒకేనా?

భయపడకు. ఒకసారి ఫోన్ ఒదినకు యివ్వు!" అన్నాడు రవి.

"వదినా– వెంటనే టాక్సీ పిలు. డా॥ శేషు హాస్పిటల్ మీ వూర్లో బెస్ట్. ఈసీజీ తీయించు. లేదా 108ని పిలు. వుంటా. అవసరమైతే ఫోన్ చేయి." ఫోన్ పెట్టేశాడు.

108 అనేసరికి రేవతికి ఖంగారెత్తింది. జాగ్రత్త మంచిదేగా. లాండ్‌లైన్‌నుంచి ఎవరకీ వినపడుకుండా ఫోన్‌చేసింది.

108కి ఫోన్ చేశా–కంగారు పడద్దని రాఘవకు చెప్పిందే కానీ–కళతప్పింది. పిల్లవెధలు చిన్నవాళ్ళాయె. అంచేత పక్కింటి అన్నయ్య గార్ని పిలిచింది.

"ఫిజిషన్ చెప్తే శేషు డాక్టరేమన్నా ఏదైనా మాత్ర సజెస్ట్ చేస్తారేమో!" డా॥శేషు నెంబరు తెస్తూ పక్కింటి ఆయన ఉవాచ.

అలికిడికి పిల్లలు లేచారు. కూతురు రాధ ఏకంగా తండ్రి కాళ్ల వద్ద చేరింది. ఏడుపు లంకించుకొంది. నీకేమైనా ఐతే ఎలా నాన్న! నా ఎంసెట్ ఏం కానూ...

ఇంట్లో అలికిడీ రొద, బయట చెప్పులూ చూసి మార్నింగ్ వాక్ చేసి తిరిగి వస్తున్న రాఘవ తండ్రి కృష్ణయ్యకు ఏమైందో అంతుచిక్కలేదు.

రాఘవ పడుకొన్న గదిలోకి వచ్చాడు. అందరూ గమ్మునైపోయారు.

ఏమైంది ఎవరూ పలకలేదని గద్దించాడు.

ఆయనకు పళ్ళు నొక్కేస్తున్నాయి. చిగుళ్ళు, దవడల్లో నొప్పి. ఏదోగా వుంది. మరిదికి ఫోన్‌చేస్తే వెంటనే డాక్టర్ దగ్గరకు తీసుకెళ్ళమన్నాడు. 108 పిలిచానండీ. అంది రేవతి. మూతికి ఏమిటి అడ్డంపెట్టుకొనింది– వచ్చే ఏడుపు ఆపుకొంటూ!

కృష్ణయ్య చేతిలో కర్ర పక్కన పెట్టి, గిర్రుర్రున తిరుగుతున్న ఫ్యాన్ ఆపాడు. రెండు నిముషాల్లో వేడెక్కింది.

రాఘవ దుప్పటి విసిరి చక్కగా లేచి కూచున్నాడు.

రాత్రి 2నుండి 4 దాకా బాగా వర్షం పడింది. వాతావరణం చల్లబడింది. పైన ఫ్యాన్‌కి రెగ్యులేటర్ లేదు. అంచేత –పళ్ళు, చిగుళ్ళ వణికాయి. తీపులు పుట్టాయి. వీపులో కూడా ఛలి...

సైరన్ కూస్తూ బయట 108 ఆగింది. ఎక్కడి దొంగలు అక్కడనే గప్‌చుప్!!



64 కళలు.కామ్
www.64kalalu.com
సకల కళల సమాహారం
సంపుటి :1 సంచిక :8 జూన్ 2011



## బొమ్మల కొలువు

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రసాంస్కృతిక మండలి సౌజన్యంతో హైదరాబద్, స్టేట్ ఆర్ట్ గ్యాలరీలో జూన్ 4,5 మరియు 6 తేదీలలో బాపు గారి ఒరిజనల్ చిత్రాలను ప్రదర్శించనున్నారు. తెలుగుదనానికి, తెలుగువారికి గర్వకారణమైన చిత్రకారుడు బాపు, వారి చిత్రప్రదర్శనతో పాటు వివిధ రంగాలకు చెందిన ప్రముఖులు పాల్గొనే 'బొమ్మలకొలువు'లో 'కళాక్షేపం' కార్యక్రమాలు మూడు రోజులపాటు జరుగనున్నాయి.

పత్రికలో వ్యాసాలు బాగున్నాయని అభిమానంతో ఇ-మెయిల్స్ ద్వారా అభిప్రాయాలు తెలియజేస్తున్న పాఠక, కళాభిమానులకు కృతజ్ఞతాభివందనాలతో...

కళాసాగర్
ఎడిటర్

ముఖచిత్రం చిత్రకారుడు : ఆడెపు ముత్యాలరావు

- వెంటపల్లి సత్యనారాయణ

# అడవి అందాలకు రంగులద్దిన చిత్రకారుడు-ముత్యాలరావు





అరణ్యం ఆ ప్రాంతం. అభివృద్ధికి ఆమడ దూరమే గానీ అందాలు చిందించే అడవికి తోడు, పావన గౌతమీ నది ప్రవాహ ప్రాంతం వల్లనో ఏమో అక్కడ కళామతల్లి స్వేచ్ఛగా తన రూపాలను పలు విదాలుగా ప్రదర్శించేందుకు ఉవ్విళ్లూరుతుంది. అందుకే అక్కడ లేత సొగసరి పండు ముదుసలి అనే బేదాభిప్రాయం లేదు. అందరూ స్వేచ్ఛగా తమ కళారూపాల్ని ప్రదర్శిస్తూ వుంటారు. సంగీత, సాహిత్య, నృత్య, నాటక, కళలతో పాటు చిత్రకళ కూడా అక్కడ రెట్టించిన ఉత్సాహంతో పురివిప్పి నాట్యమాడే నెమలి హొయలను తలపిస్తుంది. ఆ రంగుల హొయలకు, ఆ గీతల లయల కోసం రెక్కలు కట్టుకుని వస్తాయి. ఎక్కడినుండో ఎన్నో పుస్తకాలు, తమని అందంగా అలంకరించమని, ఇక్కడ గల ఆ నలుగురు చిత్రకారుల కుంచె విన్యాసాలతో ఎందరో రచయితల పుస్తకాలు అందంగా ఆవిష్కృతమౌతూవుంటాయి. అలాంటి కళల కాణాచియే జిల్లా కేంద్రస్థానమైన ఖమ్మంకు దాదాపు 180 కి.మీ దూరాన మారుమూల ప్రాంతంలో వున్న చర్ల గ్రామం. అక్కడ రంగుల ప్రపంచాన్ని ఆవిష్కరిస్తున్న ఆ నలుగురు చిత్రకారులే ఆడెపు ముత్యాలరావు, బీర శ్రీనివాస్, ఎస్.ఎన్. వెంటపల్లి మరియు అన్వేష్‌లు. వీరిలో అరణ్యాన్ని నేపథ్యంగా చేసుకుని అటవిక అమాయక గిరిజన జన జీవన విధానాన్ని తన చిత్రాలకు వస్తువుగా ఎంచుకున్న అరుదైన చిత్రకారుడు ఆడెపు ముత్యాలరావు.

అసలు కళ అంటే ఏమిటి? దేనికోసం కళ? అని మనం ప్రశ్నించుకున్నప్పుడు "వ్యక్తి తనలో కలిగిన భావోద్దీపనలను బయటకు వ్యక్తం చేయడం ద్వారా తన తోటి వారిని రంజింపజేయడానికి చేసిన ప్రయత్నమే కళ" అని భావించినట్లైతే రంజింపజేయడంతో పాటు ఒక సంస్కృతిని, ఒక జీవితాన్ని ఆవిష్కరించడం తద్వారా ఆలోచింపజేయడం అన్నది ఉత్తమ కళ అవుతుంది. అలాంటి కోవకు చెందిన అపురూప చిత్రకారుడే ఆడెపు ముత్యాలరావు. కారణం అతని చిత్రాల్లో ఒక జీవితం వుంది. తరతరాలుగా అభివృద్ధికి నోచుకోని అనాగరిక, అమాయక గిరిజన జీవన విధానం ఉంది. కూటికోసం వేటకెల్లే నాటు మనుషులు, పచ్చని అడవులలో ఆడుకొనే ఆటవిక పిల్లలు, మనుగడకోసం కావిడిబద్దకు సంసారాన్ని, సొరకాయ బుర్రను తగిలించుకొని వలసపోయే గిరిపుత్రులు, అటవీ అందాలను ఆస్వాదించే స్వచ్ఛమైన అచ్చమైన ఆటవిక అమ్మాయిలు, అడవిదేవతలు, గిరిజన సంతలు, పంచాయితీలు, పండుగలు, ఇలా వారి జీవన విధానంలోని విభిన్న కోణాలను అతను తన చిత్రాల్లో ఆవిష్కరించడం జరిగింది.

సహజంగా గిరిజనులు అధికంగా ఉండే ప్రాంతమే గాక చర్లగ్రామంలో ప్రతీ ఆదివారమూ పెద్ద సైజులో జరిగే సంతకు సమీపంలో గల చత్తీస్‌గడ్ ప్రాంతం నుండి కట్టెలు, కుంకుల్లు, చీపుర్లు, జిగురు, తేనె, తునికిపళ్లు తదితర అటవీ వస్తువులు అమ్ముకోవడానికి గుంపులు గుంపులుగా వచ్చే గొత్తికోయలు, తదితర గిరిజన ప్రజలు అతని చిత్రాలకు ప్రేరణగా నిలిచాయి.

శ్రీమతి మల్లమ్మ, సమ్మయ్య దంపతులకు 28-10-1963న ఖమ్మం జిల్లా చర్ల గ్రామంలో జన్మించిన ముత్యాలరావుకు చిన్నతనం నుండే చిత్రకళపై మక్కువ ఏర్పడింది. అతనిలోని ఆశక్తిని గమనించిన అప్పటి చర్ల ప్రభుత్వ ఉన్నత పాఠశాల డ్రాయింగ్ టీచర్ శ్రీవీరాచారి చిత్రకళకు సంబంధించి మోడల్ ఆబ్జెక్టు డ్రాయింగులతో పాటు స్పాట్ పెయింటింగ్‌లు కూడా వేయించడం ద్వారా చిత్రకళలో ప్రాధమిక సూత్రాలు మెలకువలను నేర్పి అతనిలోని కళకు మెరుగులు దిద్దాడు. ఆ తర్వాత చిత్రకళకు సంబంధించి డ్రాయింగ్ లోయర్, హయ్యర్ పరీక్షలు రాసి ఉత్తీర్ణుడయ్యాడు. మొదట్లో మామూలుగా పత్రికలలో వచ్చే వడ్డాదిపాపయ్య, బాపు, బాలి, చంద్ర, కరుణాకర్ లాంటి చిత్రాకారుల బొమ్మలను రోజూ ప్రాక్టీస్ చేస్తుండడం ద్వారా అనాటమీపై మంచి పట్టును సాధించాడు. బి.యస్.సి చదివి లెప్రసి ఇన్‌స్పెక్టర్ ట్రైనింగ్ కూడా పూర్తిచేసిన అతనికి అప్పుడు వచ్చి న





NMA ఉద్యోగం (ఇప్పుడుAPMO) అతని ప్రవృత్తికి బాగా ఉపకరించింది. వృత్తి రీత్యా వేకువఝామునే అనగా గ్రామస్థులు పనులకుపోయే ఉదయం 10 గంటలలోపే సమీప తండాలకు, గ్రామాలకు వెళ్లి అక్కడ ప్రజల్లో లెప్రసీకి సంబంధించిన జాడను కనుగొని పై అధికారులకు రిపోర్ట్ చేయడం అతని డ్యూటీలో భాగం. ఇదంతా ఉదయం 10 గంటలలోపు జరిగిపోవాల్సిన కార్యక్రమం కావడంతో మిగిలిన సమయాన్ని ప్రవృత్తిని సంతృప్తి పరుచుకొనే దిశగా ఎక్కువగా బొమ్మలపై తన దృష్టంతా కేంద్రీకరించడంతో లైన్ మీదే కాకుండా రంగులపైనా కూడా పట్టు బాగా సంపాదించాడు.

ముదురునీలం, ఆకుపచ్చ, ఎరుపు, కొద్దిగా పసుపు రంగులను ఎక్కువగా ఉపయోగించే ముత్యాలరావు యొక్క కొన్ని చిత్రాలలోని రంగులు చూపరులకు అంత ప్రకాశవంతంగా కనిపించవు. రంగుల్లో ఒకవిధమైన ప్రకాశహీనత గోచరిస్తుంది. అతడు చిత్రాలకు ఎంచుకున్న వస్తువు నవనాగరికతకు ఇంకా ఎంతో దూరంలో వున్న అమాయక ఆటవిక గిరిజనులు కావడం, సాంఘికంగానూ, వేషధారణలోనూ, జీవన విధానంలోనూ కూడా వారి యొక్క దైన్య స్థితిని తెలియజేయడానికా! అన్నట్లు ఆ రంగులు కూడా ఒకవిధంగా నిష్ ప్రకాశంగా కనిపిస్తాయి.

ప్రవృత్తికి ఏమాత్రం సంబంధంలేని ఉద్యోగంలో వుంటూ తన దైనందిన విధులు నిర్వహిస్తూనే ఒక వృత్తిపరమైన చిత్రకారుడు వేసే స్థాయిలో బొమ్మలు వేయడమన్నది మామూలు విషయం

కాదు. తనలోని ప్రతిభా పాటవాలను తను ఉద్యోగ విధులు నిర్వహిస్తున్న వైద్య ఆరోగ్య శాఖ వారికి తెలియకపోవచ్చేమోగానీ రాష్ట్ర నలుమూలలల్లో గల అనేకమంది కవులు, రచయితలకు మాత్రం తెలుసు అందుకే ఖమ్మం, కరీంనగర్, వరంగల్, హైదరాబాద్ మొదలయిన ప్రాంతాలకు చెందిన కవులు మాల్యశ్రీ, శిరంశెట్టి కాంతారావు, ఈగ హనుమాన్, మంచాల వెంకటేశ్వర్లు, పి. విద్యాసాగర్, లక్ష్మణరావ్ పతంగే, ఎన్.సి.హెచ్. చక్రవర్తి మొదలయిన వారి పుస్తకాలకు ముత్యాలరావు ఎన్నో ముఖ చిత్రాలు వేశారు.

తెలుగు కథానిక పుట్టి 100 ఏళ్లు అయిన ఈ సందర్భంలో జరిగిన వివిధ కథాపోటీలలో వరుసగా తన కథలకు రాష్ట్రస్థాయిలో పది బహుమతులు సొంతం చేసుకుని ప్రముఖ కథా రచయితగా పేరు గాంచిన శ్రీ శిరంశెట్టి కాంతారావు గారి “కంచిమేకలు”, మట్టి తాళ్లవల, కథాసంపుటాలకు ముఖ చిత్రాలు లోపలి బొమ్మలు వేసింది ముత్యాలరావే. పైరెండింటితో పాటు పోలవరం ప్రాజెక్టు నిర్మాణానికి వ్యతిరేఖంగా విద్యాసాగర్ రచించినటువంటి “ముంపు” పుస్తకానికి వేసిన లోపలి బొమ్మలు కూడా చాలా భావయుక్తంగా వుంటాయి. ఎంతో పరిశ్రమతో రేఖపై మంచి పట్టు సాధించిన ముత్యాలరావు ఇలస్ట్రేషన్స్ వేసే సమయంలో ఎక్కువ శ్రమ పెట్టడేమో అని అన్పిస్తుంది లేకుంటే అతని చిత్రాలు మరింత బావుండడానికి ఆస్కారముంటుంది. ప్రఖ్యాత చిత్రకారుడు, కార్టూనిస్ట్ అయిన మోహన్ చేతులమీదుగా ఎప్పుడూ రూపుదిద్దుకునే ప్రజానాట్యమండలి వారి ‘జనగానం’ కేలండర్ 2009ను రూపొందించే అవకాశం







ముత్యాలరావు గీసిన రేఖా చిత్రాలు

ముత్యాలరావును వరించడం అతని ప్రతిభకు తార్కాణం. ఒకానొక సందర్భంలో ముత్యాలరావు చిత్రాలను చూసిన ప్రముఖ బెంగాలీ చిత్రకారుడు "సుబ్రతారాయ్ చౌదరి వాటి గురించి స్పందిస్తూ" గిరిపుత్రుల జీవన విధానంలో గల స్వచ్ఛమైన అచ్చమైన మట్టితనం అతని చిత్రాల్లో చూడవచ్చని పేర్కొన్నాడు.

కేవలం చిత్రకారునిగానే గాక కార్టూనిస్ట్‌గా కూడా ముత్యాలరావు అందరికీ సుపరిచితుడే, భావతరంగిణి, స్మైల్‌ప్లీజ్, హాస్యానందం, వికాసవిద్య, మల్లెతీగ మొ॥న పత్రికలలో ఎన్నో కార్టూన్‌లు అతనివి ప్రచురింపబడడమే గాక రాష్ట్రస్థాయి కార్టూన్ పోటీల్లో రెండు సార్లు ప్రథమబహుతులతోపాటు ప్రత్యేక ప్రశంసా బహుమతులను కూడా తీసుకున్నారు. చిత్రకారుడిగా ముత్యాలరావు ఇంతవరకు ఖమ్మంజిల్లా పాల్వంచలో ఒక వ్యక్తిగత చిత్రకళా ప్రదర్శనను నిర్వహించగా రెండుసార్లు ఈవ్యాసరచయిత, చిత్రకారుడు మరియు కార్టూనిస్టు అయిన ఎస్.ఎన్. వెంటపల్లి, మరియు బీర శ్రీనివాస్, అన్వేష్ డాక్టర్ ప్రతిభలతో కలిసి 2008 మరియు 2011సం॥లలో రెండు సార్లు చర్లలో సామాజిక చిత్రకళా ప్రదర్శనలు చిర్వహించారు. అలాగే ఎస్.ఎన్ వెంటపల్లితో కలిసి రెండు సార్లు కార్టూన్ ప్రదర్శనలో కూడా పాల్గొన్నారు. విశాఖపట్నంలో జరిగిన జాతీయ చిత్రకళా పోటీలలోనూ మరియు నర్సీపట్నం అడపా చిత్రకళాపరిషత్ రాష్ట్రస్థాయి పోటీలలోనూ ప్రత్యేక ప్రశంసా బహుమతులందుకున్నారు.

పుట్టిన ప్రతిమనిషికి ఏవో కొన్ని ఆశలు, ఆశయాలు, ఆలోచనలూ ఉండడం సహజం. అందులో

సృజన శీలమైన ఆలోచనలు మాత్రమే కళాసృష్టి కాగలవు

సృజన రహితమైన ఏ ఆలోచనా కళాసృష్టి కానట్లే.

ప్రోత్సాహరహితమైన ఏ కళా కూడా పురోగామి కాలేదు... అందుకే

కళల ఆవిర్భావానికి సృజన ఆధారమైనట్లే

కళల అభివృద్ధికి ప్రోత్సాహం ఆధారం. అవుతుంది. అందుకే ఏ కళాకారుడైనా ప్రోత్సాహాన్ని కోరుకుంటాడు. ముత్యాలరావు కూడా అలాంటి ప్రోత్సాహాన్నే సమాజం నుండి ఆశిస్తున్నాడు. అతని ఆశయం నెరవేరాలని, రెట్టించిన ఉత్సాహంతో మరిన్ని మంచి చిత్రాలు వేసి సమాజానికి అందించాలని, అందిస్తాడని ఆశిద్ధాం.

email: snventapalli@gmail.com

వ్యాసరచయితతో చిత్రకారులు ముత్యాలరావు, బీర శ్రీనివాస్

కళాప్రపంచం

# "విశ్వకవి, కళారవి ఠాగూర్"

150 వ జయంతి

ఎల్.ఆర్. వెంకటరమణ

**వ్యక్తికి, సమాజానికి స్వేచ్ఛ ఉండాలన్న భావంతో రచనలు చేసిన వ్యక్తి. విశాల మానవతా వాదమే అతన్ని విశిష్ట వ్యక్తిగా నిలిపింది. విఖ్యాత కవిగానే కాక సాంస్కృతిక రాయబారిగా కూడా నీరాజనాలర్పించారు. ప్రపంచంలో కళలుంటాయి కానీ ఈ వ్యక్తిలోనే కళా ప్రపంచం ఒదిగిపోయింది. ఎంచుకున్న ప్రతిరంగంలోనూ తనదైన, తనదే అనిపించుకునే ముద్రవేయగలిగిన విశిష్ట, మహోన్నత మానవతావాది రవీంద్రనాథ్ ఠాగూర్.**

ఠాగూర్ 1861 మే 7వ తేదీన కలకత్తాలో జన్మించాడు. తండ్రి దేవేంద్రనాథ్ ఠాగూర్. తల్లి శారదాదేవి. వీరి 14వ సంతానంగా రవీంద్రుడు జన్మించాడు. చిన్ననాటి నుండే తనలోని భావ ప్రపంచం మేల్కొంది. చిన్ననాడే సంగీతాన్ని అభ్యసించాడు. కవిగా కవితలల్లాడు. నాటకాలు రచించాడు, పద్నాలుగుఏళ్లకే తల్లి మరణం కుంగదీసినా, కళలనే తల్లిగా భావించి ముందుకెళ్లాడు.

కవిత్వం, కథలు నాటకాలు, నవలలు ఇలా అన్ని ప్రక్రియలును అనుసరించారు. ఇంకా చిత్రలేఖనం, నృత్యం, సంగీతం ఇలా అన్నీ అతనిలో ఒదిగిపోయాయి. చిన్ననాటి కట్టుబాట్లు, సర్దుబాట్లు రవీంద్రుడు జ్ఞానార్జనలోనూ, భావనలోనూ సాగించిన స్వైర విహారం వల్ల ఎంతో జ్ఞానాన్ని సముపార్జించగలిగాడు.

రవీంద్రుడు 1891లో మొట్టమొదటి సారిగా కథలు రాయడం మొదలు పెట్టాడు. దాదాపు వందకు పైగా కథలు రచించాడు. ప్రపంచ భాషలన్నిటా ఇవి అనువదించబడినాయి. ఇందులో ప్రఖ్యాతి గడించినది 'కాబూలీవాలా" ఠాగూర్ కథలలో ఇతివృత్తం దాదాపుగా మధ్యతరగతి బెంగాలీలు. వీరి రోజువారి జీవితాలు, వారి అనుభవాలు, తన జ్ఞాపకాలు ఇలా వాటిలో చరిత్ర తాలూకు సంఘటనలు వెరసి ప్రపంచప్రసిద్ధ కథా రచనలు. "కాబూలీవాలా" కథలో మినీ అనే అమ్మాయి, రెహమత్ అనే కాబూలీవాలా మధ్యగల అనుబంధం. ఇతను ఎండు ద్రాక్ష, ఖర్జూరం, బాదంపప్పు వంటివి సంచిలో వేసుకొని ఇల్లిల్లు తిరిగి అమ్ముతుంటాడు. మినీతో అభిమానంతో మాట్లాడుతుంటాడు. ఈ క్రమంలో ఆమె పెరిగి పెద్దదవడం, పెళ్లి కుమార్తెగా ఒకరోజు అలంకరించుకుంటుంది. ఆరోజు ఆమె పెళ్లి. జైలు నుండి వచ్చిన కాబూలీవాలా ఆమెను చూడాలనుకుంటాడు. ఆమె మునిపటిలా మాట్లాడదు. సిగ్గుతో తలదించుకుంటుంది. ఈ కథ అనేక భాషల్లో అనువదించబడింది.

రవీంద్రుడు రచించిన నవలల విషయానికొస్తే దాదాపుగా 12 నవలలు రచించాడు. అందులో "గోరా" నవల 500 పేజీల నిడివిగలది, సంక్లిష్టమైనది. ఈ నవల 1910లో రాశాడు. "గోరా" గౌరీ మోహన్ అన్నది పూర్తి పేరు. నమ్మినదాన్ని ఆచరించిన వ్యక్తి. నిజాయితీపరుడు. అసంఖ్యాక పాత్రలతో సాగుతుందీ నవల. నాటి సామాజిక స్థితిగతులకు అద్దంపడుతుంది. లోతైన విశ్లేషణలతో సాగుతుంది. ఠాగూర్ పరిశీలనా శక్తికి ఈ నవల నిదర్శనం.



చాలా చిరుప్రాయంలో రవీంద్రుడు "వాల్మీకి ప్రతిభ" అనే నాటకం రచించాడు. "చండాలిక" అన్న నృత్య నాటకంలో సమాజ స్థితిగతులను చెబుతుంది. దాదాపుగా రెండు డజన్ల నాటకాలను రచించాడు.

రవీంద్రుని గీతాంజలి 1913లో నోబుల్ బహుమతి అందుకుంది. ఈ కావ్యానికి దాదాపుగా తెలుగులో 18 అనువాదాలు వచ్చాయి. చలం, కొంగర జగ్గయ్య, మొదలు ఎందరో తెలుగువారి మనసు దోచుకున్న కావ్యమిది. 2009లో భూషిక్రృష్ణదాసు తాజాగా గీతాంజలి అనువాదం తెచ్చారు. గీతాంజలి కావ్యం. సౌందర్య రసాత్మకత, అవధులెరుగని సృజనకు, స్వప్నాలకు, స్వేచ్ఛకు ప్రతిరూపం. కరడుగట్టిన హృదయాలకు, చైతన్యంతో తడపడానికి, జీవన మాధుర్యానికి ప్రతిరూపం. జీవిక పరిమళ సుగంధాలతో మనలను మెంచెత్తేది... గీతాంజలి. "Where the mid is without fear" అంటూ తలవంచనీయని ధైర్యాన్ని నూరిపోస్తుంది.

ఠాగూర్ గురించి చెబితేనే గీతాంజలి గర్తుకు వస్తుంది. అనంతరం "శాంతినికేతన్" గుర్తుకు వస్తుంది. ప్రత్యామ్నాయ విద్యావిధానాన్ని ప్రపంచానికి అందివ్వడానికి స్థాపించినది శాంతినికేతన్. విశ్వభారతి

సంగీత పరంగా రవీంద్రుని సేవలు అనన్యమైనవి. దాదాపుగా 60 సంవత్సరాలు సంగీత ప్రపంచంలో సేవలందించాడు. 1881 నుండి 1900 మధ్య కాలంలో భారతీయ శాస్త్రీయ సంగీతాన్ని అనువదించి చేసిన రచనలు ప్రధానమైనవి. 1900 నుండి 1920 మధ్య కాలంలో సంగీత ప్రయోగాలు చేయబడిన కాలం. 1905 నాటి బెంగాల్ విభజన కాలంలో అనేక దేశభక్తి గీతాలను వెలువరించాడు. 1912లో "జనగణమన" జాతీయగీత సృష్టి కూడా జరిగింది. 1920 నుండి 1941 మధ్యకాలంలో రవీంద్రుడు సంగీత పరంగా విప్లవాన్ని తెచ్చిన కాలం.

భారతీయ సంగీత చరిత్రలో రవీంద్రుని సృష్టిగా చెప్పబడు ఆరు కొత్త తాళాలు: ఝుంపక, షష్ఠి, రూపకా, నబతాళ్, ఏకాదళి, నబపంచ. రవీంద్రుడు సంగీత ప్రజాజీవన ప్రవాహ ఝరిలో ఓలలాడాడు. పంజాబీ, మహారాష్ట్ర, గుజరాతీ, తమిళాంధ్ర కర్ణాటక సంగీత విద్వాంసుల సంగీతాన్ని విని ఆనందించడమే కాక, ఆ పద్ధతిలోనే బెంగాలీ గీతాలు రచించాడు. ప్రసిద్ధ ఆంధ్రప్రాంత వాసి తుమరాడు సంగమేశ్వర శాస్త్రిగారు రవీంద్రునితో సంగీత సహచర్యం చేసినవారు.

జాతీయగీతం "జనగణమన" గురించిన కొంత వివరాలు పరిశీలిద్దాం. ఈ గీతాన్ని చిత్తూరు జిల్లా మదనపల్లిలో గల థియోసాఫికల్ కాలేజీలోనే పురుడు పోసుకుంది. నాటి కాలేజీ ప్రిన్సిపాల్ జేమ్స్‌కుషన్స్ ఆహ్వానంపై ఠాగూర్ అక్కడికి వచ్చారు. అపుడు చేసిన సృష్టి "జనగణమన". ఒక జాతియొక్క ప్రాధాన్యతను ఆ జాతికి సంగీత రూపంలో అద్ది అందించినదే ఈ గీతం. అదే విధంగా బంగ్లాదేశ్ జాతీయ గీతం "అమర్ సోనార్ బంగ్లా" కూడా రవీంద్రుడే రచించాడు.





విద్యాలయంగా రూపుదిద్దుకుంది. ఈ విద్యాలయం ఎందరో ప్రముఖులను తయారుచేసింది. నవబెంగాల్ శైలికి చెందిన చిత్రకారులు వచ్చారు. జగదీశ్ మిట్టల్, కొండపల్లి శేషగిరిరావు, వి.ఆర్. చిత్రా, వేలూరి రాధాకృష్ణ, కుమారి స్వామి, సుబ్బారావు, మొదలైనవారు. బందరు జాతీయ కళాశాల చిత్రకళను అభ్యసించినవారు అడవి బాపిరాజు, కౌతావారు, రామమోహన్, ఆనందమోహన్, గుర్రం మల్లయ్య, తేజోమూర్తుల కేశవరావు, వేముల కామేశ్వరరావు, నడిపల్లి శంకరాచార్య, అంకాల వెంకటసుబ్బారావు, వేలూరి రామమూర్తి మొదలైన ఆంధ్రప్రాంత చిత్రకారులు.

చివరగా రవీంద్రుని చిత్రకళ గురించి చెప్పుకుందాం. ఠాగూర్ తన సృజనాత్మక జీవన పయనంలో చివరి మజలీగా చిత్రకళను ఎంచుకున్నాడు. చిత్రకళతో ప్రత్యక్ష పరిచయం లేకపోయిన సాంస్కృతికంగా ఉన్నత స్థానాలందుకున్నవాడు కావడం చిత్రకళలో విజయం సాధించగలిగింది. రవీంద్రుని సోదరుడు జ్యోతిరారింద్ర ఠాగూర్ మంచి చిత్రకారుడు. "ఇతర అన్నీ ప్రక్రియల కన్నా చిత్రకళ శాశ్వతమైనది" అన్నది రవీంద్రుని అభిప్రాయం. సాహిత్యం కన్నా సంగీతం ఈ రెంటికన్నా 'చిత్రకళ' పూర్తి శాశ్వతత్వం కలప్రక్రియ అన్నది రవీంద్రుని భావన.

రవీంద్రుడు దాదాపుగా మూడు వేల చిత్రాలు సృజించాడు. ఎన్నోప్రక్రియలలో చిత్రకళా సాధన చేశాడు. ఇంక్, వాటర్‌కలర్స్, పేస్టల్స్ ఇలా రకరకాల మీడియంలలో చిత్ర రచన చేశాడు. కవితలు రాస్తూ చెరిపినపుడు ఆ ముద్ర చిత్రంగా మలచేవాడు. అలా చెరిపిన గీతలు తరువాత కాలంలో చిత్రకళకు పునాదులయ్యాయి. రవీంద్రుడు తన చివరి రోజులలో "నాగరికతా సంక్షోభం" అన్న వ్యాసాన్ని రాసాడు. అందులో సామ్రాజ్య వాద విస్తరణ మానవత్వాన్ని సమాధి చేస్తోందంటాడు. రవీంద్రుడు . మానవతావాద ప్రతీక, శాంతి పతాక, సాహిత్య సృజన తార.

(విశ్వకవి రవీంద్రుని 150 వ జయంతి సంవత్సర సందర్భంగా ప్రత్యేక వ్యాసం)






# 'చిత్ర' మైన జీవితం

Part-2

**ప్రముఖచిత్రకారుడు, కార్టూనిస్టు, కథారచయిత బాలిగారు 64కళలుడాట్‌కాం పాఠకులకోసం తన కళాజీవిత విశేషాలను, బాల్యస్మృతులను, పరిచయాలను ధారావాహిక రూపంలో అందించనున్నారు. నెల నెలా చిత్రమైన జీవితంలో...**





**బిడ్డవచ్చినా పురిటివాసన పోనట్లు రేషన్ గొడవ పోలేదు. ఇండియన్ ఆర్మీని ముఖ్యంగా సౌత్ ఇండియా ఆర్మీని నీలగిరి (ఉదకమండలం)లో స్థిరంగా ఉంచబోతున్నారని, అలా స్థిరమయితే ఫ్యామిలీని తెచ్చుకోవచ్చని మా అమ్మకు మా నాన్న నుండి ఉత్తరం వచ్చింది. మా అమ్మ ఆనందం చెప్పనవసరంలేదు.**

మరో నెల తరువాత మరో ఉత్తరం వచ్చింది. గవర్నమెంట్ వారి ఆర్డర్ కన్‌ఫర్మ్ అయ్యిందనీ తనకు సబ్ మేజర్‌గా ప్రమోషన్ వచ్చిందని ఇల్లు వగైరా ఇస్తున్నారని ఫలానా తేదీకి నీలగిరి (వెల్లింగ్‌టన్, ఉదకమండలం) వెళ్లడానికి సిద్ధంగా ఉండమని.

మా నాన్న మా ఇంటికి వచ్చే తేదీ ఏమిటో మా అమ్మ గోడమీద పెన్సిల్‌తో వేయించింది నాతో. అది ఒక రకంగా నాకు అంకెలు నేర్పడమన్నమాట. మరో రకంగా తన సంతోషం అలా వెలిబుచ్చుకోవడం. ఉదయాన్నే నన్ను నిద్రలేపడం అయ్యో మరో వారం రోజుల్లో మీనాన్న వచ్చేస్తున్నారు, నీ కోసం నిన్న తారీఖెంత? పదికదా! ఇవాళ ఎంతంటావ్, పదకొండు, వెళ్లి గోడమీదవెయ్. అనేది. అలాగే అని నిన్నటి పది అంకె పక్కన పదకొండు అని రెండు గీతలు వంకర టింకరగా నా చిన్న వేళ్లతో ఎలాగో వేసి చూపిస్తే ఇంకా శుభ్రంగా, అందంగా వేయాలనేది. నాతో ఇలా ప్రతిరోజు వేయించడం, తాను మురిసిపోవడం అదో తమాషా...తనఆనందాన్నిఅలా నాతో పంచుకోవడమన్నమాట. ఇంకో రెండు రోజుల్లో మా నాన్న వస్తారు అంటే "మీ నాన్న నీలగిరి కొండలకు వచ్చేసి ఉంటారు. ఇల్లు కూడా చూసే వుంటారు. మీనాన్న బయలుదేరారేమో చూడు అనేది. అప్పటిలో మేము ఉడ్‌పేట, బాలాజీదాస్ వీధిలో ఉండేవాళ్లం. మా వీధి చివర ఒక కల్వర్ట్ ఉండేది. ఆ కల్వర్ట్‌మీదకు ఎక్కి పడమటి వైపు చూస్తే ఏడాకుల కొండ" అనేపేరు గల కొండ కనిపిస్తుంది. ఆ చిన్న తనంలో అదే నీలగిరికొండ అనుకొనేవాడ్ని. అక్కడే మా నాన్న ఉంటారన్న భ్రాంతి. నేను ఆ కల్వర్ట్ ఎక్కి, కాసేపు అటే చూసి తిరిగి, మా అమ్మ దగ్గరకెళ్లి" అమ్మా! నేను చూశాను కొండవేపు. నాన్నగారు కొండదిగివస్తున్నారు. నాన్నగారి ముందు చాలా మంది ఉన్నారు. అందరి దగ్గరా తుపాకులున్నాయి. అంతా మిలటరీ వారు. ఇపుడు రైలెక్కి రేపటికి వచ్చేస్తారు. నిజంగా చూశాను".

ఇది పెద్ద అబద్ధం.

అయినా మా అమ్మ ఆనందానికి హద్దు లేదు.

బాల వాక్కు బ్రహ్మ వాక్కు.

"అవునూ మీ నాన్న గారి దగ్గర ఏవన్నా సామాన్లున్నాయా?" "ఉన్నాయి, చాలమంది సామాన్లు మోస్తున్నారు. కొంతమంది తెల్లటిబట్టల్లో ఉన్నారు".

అయితే రేపీపాటికి వచ్చేస్తారన్నమాట! సామాన్లతో బయలు దేరారన్నమాట!! రేపు నువ్వూ, చెల్లీ పెందరాడే తయారయి గుమ్మంలో నిలబడండి. నాన్నగారు మిమ్మల్ని చూసి సరదా పడతారు".

ఇలా ఉండేది ఆరోజుల్లో ముచ్చట్లు.

అప్పటికే నా వయసు నాలుగున్నరేళ్లు ఉండవచ్చు. అప్పట్లోనే మరో ముచ్చట జరిగింది ఇది నాకు ఇప్పటి వరకూ ఎంతో స్పష్టంగా గుర్తుండిపోయింది. దీన్ని కొందరు నమ్మవచ్చు. కొందరు ట్రాష్ అని కొట్టి పారేయనూ వచ్చు. అయితే జరిగినదేమంటే రెండు రోజులు ముందు మా అమ్మ ఏదో సినీమాకు తీసుకెళ్లింది. అందులో కత్తులతో ఫైటింగ్ ఉంది. ప్రస్తుతం కొబ్బరిపుల్లలతో ఫైటింగ్



అన్నమాట. కాంపౌండ్‌వాల్ లోపలున్న మా ఇంటి అరుగుమీద ఫైటింగ్. ఆ అరుగు రెండున్నర అడుగుల ఎత్తు ఉండవచ్చు. ప్రేక్షకుల్ని కింద నేలమీద చాపలు పరిస్తే కూచున్నారు. లోపల మా అమ్మ నిద్రపోతోంది. సమయం మధ్యాహ్నం రెండుగంటల ప్రాంతమయ్యింటుంది. అది మామిడిచెట్టు, దబ్బచెట్ల నీడ, మీసాలు మెలేసి కొబ్బరిపుల్లలతో మొన్న చూసిన సిన్మాలోలా నా ఫ్రెండ్ కృష్ణారావు, నేనూ ఫైటింగ్ చేస్తున్నాం. ఎమోషన్ ఏమయ్యిందో ఏమోగాని ఆ అరుగుమీద నుండి నేను కింద ప్రేక్షకుల మీద పడ్డాను ప్రేక్షకులు పారిపోయారు. నేను స్పృహ తప్పిపోయాను.

ఇంతలో ఎవరు చెప్పారో ఏమోగానీ మా అమ్మ వచ్చి ముఖం మీద నీళ్లు చల్లి వడిలోకి తీసుకుంది. నాకు తెలివి వచ్చింది. మంచి నీళ్లు తాగించింది. నీళ్లు తాగిన తరువాత కొంచెం తెప్పరిల్లి నేనడిగిన మొదటిప్రశ్న "ఇక్కడెందుకున్నాను?" అమ్మ వాళ్లు ఏరీ?". మా అమ్మ కంగారుపడింది. దెయ్యం పట్టిందనుకుని. అయితే...

"ఆ కొద్ది క్షణాల్లో జరిగిందేమిటంటే నా మైండ్‌లో ఓషాక్ లాంటిది వచ్చింది. పూర్వ జన్మ స్మృతులు మెదడులో ఆవహించాయి. నా పూర్వ జన్మ ఎక్కడిదో తెలియదు. అయితే అది ఇలా ఉంది. నా పక్కనున్న మనుషులు నాకు గుర్తులేదు. అయితే ఎవరో ఉన్నారు. అ వీధి ఓ ఇంటి పెరడివేపు ప్రాంతం. దానికి ప్రహారిగోడ లేదు. ఎండ బాగా కాస్తోంది, బయట, మేంచెట్లనీడలో ఉన్నా ఆ చెట్లు ఏవో పూల చెట్లు, కిందంతా వాడిన పూలు పడి ఉన్నాయి. ఆ పూలు నేనూ, నాతో ఉన్న పిల్లలు కేక ఆకారాలు పడుతున్నాం. ఎండపడుతున్న ప్రాంతం నీడలా ఉంది. పిట్టమనిషి లేరు. మమ్మల్ని కనిపెట్టుకొని ఆయా ఉంది. ఆమె గోడపక్క బల్లమీద కూచుంది. ఇంట్లోంచి మా మా ఓలు వినిపిస్తున్నాయి. నాకు మూడు లేక నాలుగేళ్ల వయస్సుంటుంది అప్పటికి, ఆడపిల్లను వంటి మీద అల్లికలతోకూడిన తెల్లటి పూలగౌను ఉంది.

ఎదురుగా ఉన్న బీడు మధ్యనుండి సన్నటి కాలువ పారుతోంది. ఆ కాలువ మా ఇంటి పక్కనుంచే వెళుతుంది. ఆ కాలువదాటి దానికి చిన్న ఆకుపచ్చని రంగు వేసిన చెక్కబ్రిడ్జీ ఉంది. పెద్దవారు నాలుగు అంగల్లో దానిని దాటివేయవచ్చు. అది మధ్యలో ఎత్తుగా ఆ చివర ఈ చివరా పల్లంగా ఉంటుంది. నేను బ్రిడ్జీ మీదనుండి కాలవలోకి ఏరిన పూలను వేస్తున్నాను. అయితే ఏమయ్యిందో తెలియదు. కాలు జారిపోయి నీళ్లల్లో పడిపోయాను... అందులో పడి చనిపోయి ఉంటాను.

గత జన్మ స్మృతి ఇది.

ముఖంలోని నా అఉమానాన్ని విడగొడుతూ నన్ను దగ్గరికి తీసుకొని దెయ్యాలూ, దేవతలూ అంటూ ఏదో హడావుడి చేసింది మా అమ్మ. కానీ ఈ సంఘటన నాలోనే ఉండిపోయింది. ఎపుడు గుర్తొచ్చినా నిన్నే జరిగినట్లుంటుంది.

కొన్ని రోజులకు మా నాన్నగారు మమ్మల్నందర్నీ నీలగిరిలో ఆయన పనిచేస్తున్న వెల్లింగ్‌టన్‌కు తీసుకెళ్లిపోయారు. వెళ్లిన మరో ఎనిమిది నెలలకు అపెండిసైటిస్ వచ్చి చనిపోయారు. మా అమ్మ మమ్మల్ని తీసుకొని అనకాపల్లిలో ఉన్న మా మేనమామ గారింటికి తీసుకొచ్చేసింది. అప్పటికే మా అమ్మ గర్భవతి. మరో మూడు నెలలకు మా తమ్ముడు పుట్టాడు. నేను ఆ ఇంటికి రోడ్డు అవతల ఉన్న ఉడ్‌పేట ఎలిమెంటరీ స్కూలులో చదివాను. అన్ని క్లాసులలోకి డ్రాయింగ్ క్లాసంటే ఇష్టంగా ఉండేది. ఆ డ్రాయింగ్ మాషారెవరో గుర్తులేదుగానీ ఆయన బోర్డుమీద ఏవేవో గీతలు గీసి కుండకు ఒక పక్క అరసున్న గీసి మిగిలిన ఆకారాన్ని పూర్తి చేయమనేవారు. ఎలాగో కష్టపడేవాడ్ని. అయినా ఆ యనకు సంతృప్తి లేదు ఆడ్రాయింగ్ పుస్తకాన్ని మా మీదకు విసిరేవాడు. దాంతో మనసు గిలగిలాడేది.

ఇల్లుమారడం

ప్రస్తుతం ఉంటున్న ఈ చిన్న రెండు ఇళ్లు సరిపోవని ఒకటే పెద్ద ఇల్లు తీసుకొంటే బావుంటుందని మా మేనమామగారు తలచారు. మేం మా మేనమామగారింటికి చేరాం కాబట్టే ఇది తప్పనిసరి. అయితే అది అదృష్టవశాత్తూ మా ముందు వీధిలో ఉన్న పెద్ద ఇల్లు దొరికింది దానిలోకి మారిపోయం. దాన్నే బియ్యేపంతులుగారి వీధి అనేవారు. రెండు మూడో తప్ప అన్నీ బ్రాహ్మణుల ఇళ్లులే. అయితే ఒకరితో ఒకరికి పడి చావదు. శాఖాభేదం, ఆర్థిక వ్యత్యాసం. ఈ వీధిలో ఓ ఎనిమిది సంవత్సరాలు ఉండి ఉంటాం. ఈ వీధిలో నా ఈడు పిల్లలంతా నా మిత్రులే! కూచినవాడు, ఉవిగొండం గాడు. జిక్కిన పిల్లవాడు ఇలా కొంతమందికి నాలాగే తండ్రిలేని వారూ మేనమాల పంచన చేరినవారూనూ.... మాలో మాకు భేధాలు లేవు. ఇళ్లల్లో కలిసి తిరగడాలూ కలిసి మింగడాలూ అన్నీనూ. అప్పుడే నేను శాఖవీధిలో ఉన్న సంస్కృతం క్లాసుకూ వెళ్లాను ఓ సంవత్సరం. జగన్నాథ ఆచార్యుల వారు మా గురువుగారు పదాలను స్పష్టంగా పలకడం, ఉచ్ఛరించం నేర్పేవారు.



బహుమతి పొందిన కార్టూన్




రంగుల కంపెనీ ప్రకటన కోసం వేసిన కార్టూన్

ఓ మాదిరి లేతవయస్సేమో! ఆ వీధిలో జరిగిన సంఘటనలూ , అలవాట్లూ , వ్యక్తుల ప్రవర్తనా నామైండులో స్టాంపయిపోయాయి.

ఇప్పుడు నా కథల్లో అవే సంఘటనలూ, వ్యక్తులూ దొర్లుతుంటారు. సోదెమ్మగారని సరిగ్గా మా ఇంటి ఎదురుగా ఉండేవారు. వాళ్లమనవడు రమణా నేనూ స్నేహితులం. కేరమ్స్‌బల్లవారికుండేది. దానిమీద ఆడేవాళ్లం. అయితే సోదెమ్మ చాదస్తపురాలు, మహామడిచేసేది. ఇంకా మేం చిన్న పిల్లలం అనుకొనేది. ఓ రోజువారి నాలుగిళ్ళవాకిట్లో కేరమ్స్ ఆడుతున్నాం ఆవిడ వంటి మీద బట్టలు దూరంగా పడేసి స్థంబానికి అజంతా పెయింటింగ్‌ల ఓ కాలు మడిచి స్థంభానికి వేసి, చేటలో బియ్యం ఏరుతోంది. గుండెల మీద పుస్తెలు తప్ప మరేం లేదు. నాకు చిత్రంగా అనిపించి ఆడడం మాని అటే చూస్తున్నాను. అప్పటికి ఆమె వయస్సు నలభైపైమాటే! రమణగాడికి అలాంటి దృశ్యాలు కొత్త కావు కాబట్టి వాడిలో ఏకదలికా లేదు.

ఆమె నన్ను గమనించింది కాబోలు

"ఏమిటి వెధవా! ఆడు కోడం మానేసి నా వేపుగుడ్లప్పగించి చూస్తావ్!! నా వంటి మీద ఏవో గుడ్లున్నట్టు" అంది రమణగాడు తేరుకున్నాడు. "అదంతేలే! మడిలో ఉంది. రా! ఇపుడు నువ్వ స్ట్రయికర్ చెయ్యాలి" అన్నాడు ముఖం తిప్పుకున్నాను అప్పుడు.



ఆరోజుల్లోనే మరో విశేషం జరిగింది ఈ వూళ్లోనే గాంధీనగరం చివరి వీధిలో రామాలయం ఉంది. చుట్టూ పెద్ద ఖాళీస్థలం. ఎనుక దూరంగా మామిడితోట– ఆతోట దాటితే శారదా నదీ ఉండేవి. ఆలయంలో యజ్ఞం జరుగుతోందని ఊరంతా గుప్పుమంది. యజ్ఞం జరుగుతోంది కాబట్టి ఊళ్లోని దాతలు మధాశక్తి తృణమో, ఫణమో ఇచ్చి వారి వారి భక్తిని ప్రదర్శించుకొనేవారు. మా వీధిలో అలజడిరేగింది. పాలోమని మా వీధి బ్రాహ్మణుల కుటుంబాలు అక్కడికే చేరేవి. మా స్కూలు టీచర్లలో చాలమంది స్కూలుకి డుమ్మా కొట్టేసి అటే వెళ్తున్నారు కాబట్టి మాకు పాఠాలు జరగడం లేదు.

వెళ్లే వారు, వచ్చేవారు ఆరోజు యజ్ఞశాలలో జరుగుతున్న లేక జరగబోవు కార్యక్రమాలు గురించి చర్చించుకుంటున్నవారే. ఒకటే సందడి. మా మిత్ర బృందానికి ఉత్సాహం, ఉరకలు వేసింది. మేము బయలుదేరాం.

అనకాపల్లి ఉడ్‌పేట స్కూలులోనే నా చదువు అవుతోంది. అనంతయ్య మాస్టారు మా క్లాసు టీచర్. సబ్జెక్టులు మారినా సాయం కాలంవరకూ టీచర్ మాత్రం మారేవారు కాదు. పీరియడ్ గంటలు మారితేనే ఇక్కడ సబ్జెక్టులు మారేవి. ఇప్పుడు తెలుగు పుస్తకాలు తీయండి. ఇప్పుడు లెఖ్ఖలు తియ్యండి అని అరిచేవాడు. ఆటలూ, డ్రాయింగ్ తప్ప అన్నీ ఆయనే. సాయంకాలం వరకూ ఆయన ముఖం మేము, మా ముఖాలు ఆయనా చూడవలసిందే! హైస్కూలుకి వెళ్తే, సబ్జెక్ట్‌కి ఓ టీచర్ వస్తాడట. ఆశ్చర్యంగా చెప్పుకొనే వాళ్లం!! ఎప్పుడు హైస్కూల్‌కి వెళతామా అని మహా కుతూహలంగా ఉండేది.

ఇలా సాయంకాలం వరకూ పాఠాలు చెప్పీ, చెప్పీ సాయంకాలం అయ్యేసరికి అనంతయ్య గారికి అలసట వచ్చేది కాబోలు కొత్త ఎత్తు ఎత్తేవాడు. పిల్లలను బడి వదిలే వరకూ అల్లరిచేయకుండా ఉంచడం నిజంగా బ్రహ్మ ప్రళయం! ఎక్కడయినా అంతే!!

మా క్లాస్‌లో బెల్లాం ఆదిలక్ష్మి అనే అమ్మాయి ఉండేది. పొట్టిదే గాని వయస్సులో మా అందరికన్నా పెద్దదే అయ్యింటుంది. ప్రతి




అటువేపు వెళ్లకుండా అనంతయ్యగారు నేలమీద గీత గీసేవారు మేం అందరం వీలయినంత దగ్గరగా దానిపాట వినాలని గీతకు దగ్గరగా జరిగేవాళ్లం. ఒక వేళ అలా ఆ గీత దాటితే అనంతయ్యగారి చేతి బెత్తం దెబ్బలు కన్నా, ఆదిలక్ష్మి మగపిల్లలు జుట్టు అందుకొని ఠంగ్, ఠంగ్‌మని ఇచ్చిన మొట్టికాయలు ఘనంగా ఉండేవి. ఆ జుట్టుకు నూనె ఎక్కువయి దాని చేతులుగాని జారిపోతే, దానికి కసి ఇంకా ఎక్కువయిపోయి "ఎంత నూనె రాశాడో వెధవ, చేతులు జారిపోతున్నాయమ్మా అని వీపు వంచి నాలుగు గుద్దులు పడేసేది.

ఇంతా చేసి రెండే రెండు పాటలు పాడేది అప్పటిలో అవి హిట్ సాంగ్స్. గుణసుందరి సిన్మాలోనివి గాయని "లీల" పాడినవి అని తరువాత తెలిసింది. "అమ్మా తులసీ, కావరా దమ్మా... " అన్నది ఒకటి " శ్రీతులసి, ప్రియతులసి జయమ్ము నీయవే..." అన్నది మరొకటి. రెండూ తులసి మొక్కలమీద పాటలే ఏమాత్రం సిగ్గుపడకుండా, భయపడకుండా పాడడం నాకెంతో థ్రిల్‌గా ఉండేది. ఆ తరువాత చరణాలు గుర్తుపెట్టుకోవడమూ గొప్పే!! అప్పటికే నేనెంతో సిగ్గుమంతుడ్ని. భయం ఎక్కువ. మా క్లాసులోని పిల్లలందరికీ అది పాడే తీరు ఇష్టం. అనంతయ్య గారికీ ఇష్టమే!! చక్కగా పాడావమ్మా అని అభినందించేవారు. ఇంతలో లాంగ్‌బెల్ అయిపోయేది. క్లాసులోని మిగిలిన ఆడపిల్లలందరూ దాని చెలికత్తెలే కాబట్టి వారితో కలసి ఇంటికి బయలుదేరేది.

చేయికి ఆరేసి వేళ్లుంటాయి. రెండు చేతులతోనూ రాసేది. ఆ చేయినొప్పి పెడితే ఇది. ఈ చేయి నొప్పిపెడితే అది. బాగా పాడేది. పెద్దశృతి. అనంతయ్యగారు ఏమ్మా! ఆదిలక్ష్మీ ఏదన్నా పాటపాడమ్మా అనేవారు. అందరం నిశ్శబ్ధం అయిపోయే వాళ్లం. తనకీ పాడ్డం ఇష్టమేగానీ ఈరోజు గొంతు బాగోలేదనీ, జలుబు చేసిందనీ, లేకపోతో ఒంట్లో నీరసంగా ఉందనీ చెప్పేది ఇవన్నీ కాకపోతే మంచినీళ్లు కావాలని అది పాడితే ఆనందమే! నలుగురూ మంచినీళ్ల గ్లాసులు పుచ్చుకొని బయలుదేరేవారు. క్లాసంతా నిశ్శబ్ధం అయిపోయేది. 0"మాష్టారు పాడతాను ఈ మగ గుంటలందరూ నాముందుకు తోసుకువస్తారు. అలా అయితే పాడను. నేల మీద సుద్ద ముక్కలతో గీత గియ్యండి అక్కడితో ఆగిపోతారు" అనేది.

*ఇకనా బొమ్మలు గురించి... రాబోయే సంచికలో.*

email: balisankar@gmail.com



# జీవన రాగం ఆలపించే స్వరచక్రవర్తి జేసుదాస్

- మాకినీడి సూర్యభాస్కర్

*"సాగర తీర సమీపాన*
*తరగని కావ్య సుధామధురం*
*కాల చరిత్రకు సంకేతం*
*కరుణకు చెదరని ప్రతిరూపం"*

*ఆ సాగర తీరం అరేబియా సముద్రతీరం... ఆ తరగని స్వరకావ్య సుధామధురిమ, 'స్వర రాగ గంగాప్రవాహం'... వర్తమాన గాన చరిత్రకు సంకేతంగా భాసింపజేస్తూ చెదరని మత సామరస్య కారుణ్యాభావాన్ని పలికించే నిలువెత్తు గానామృతమయ ప్రతిరూపం... కాటశ్శేరి జోసఫ్ ఏసుదాసు - ఇటు సినీ సంగీతానికీ, అటు శాస్త్రీయ సంగీతానికి అపురూప మేళకర్త... నిరుపమాన కర్త.*

కేరళలోని ఫోర్ట్ కొచ్చిలో 1940 జనవరి 10వ తేదీన అతి సాధారణ కుటుంబంలో అగస్టీన్ జోసఫ్, ఎలిజబెత్ ఎలియాస్ అలిక్కుట్టి జోసఫ్ దంపతులకు జ్యేష్ఠ కుమారునిగా జన్మించారు ఏసుదాసు. అగస్టీన్ నట గాయకుడు. నాటకాలలో పాడి వేషాలు వేస్తూ కుటుంబాన్ని పోషించేవారు. మళయాళ సినీ రంగంలో అవకాశాలొచ్చినా, అవి ఆర్థికంగా పుష్టిని చేకూర్చకపోవడంతో రంగస్థలానికే పరిమితమైపోయారాయన.

సినీ నేపథ్య సంగీతానికి దర్శకత్వం కూడా వహించారాయన. 'అయే బహార్... జాయే బహార్'- పంకజ్ మల్లిక్ చేత పాడించడానికి ముందు హార్మోనియం మెట్లకు అనుగుణంగా ఆయన గొంతెత్తి పాడుతున్నారు. పల్లకి ముగించి, చరణంలోనికి వెళ్తుండగా హార్మోని యంత్రశుతికి అనుగుణంగా ఒక లేలేత సమ్మోహన స్వరం వినిపించింది. - "ఆయే బహార్... జాయేబహార్..." చూస్తే ఒళ్ళో కూర్చున్న నాలుగేళ్ల కొడుకు తన ముఖంలోకి చూస్తూ "ఊ:పాడూ" అంటున్నాడు. ఆ తండ్రి ఆనందానికి హద్దే లేకపోయింది. కొడుకుని అదే పనిగా ముద్దులాడారు.

ఆ రకంగా నాలుగో యేటనే సంగీత స్వరంతో కరచాలనం చేసి... బాల్యమంతా కష్టాల గమకాలు పలికీ పలికీ, రాటుదేరి... అమృతోపమానమైన సంగీతంతో రసజ్ఞ మానసాలను యేలుతున్నారు. ఏసుదాసు.

ఎప్పుడూ అంతంత మాత్రంగానే ఉంటూన్న కుటుంబ ఆర్థిక పరిస్థితి సన్నగిల్లుతూ రావడంతో కొడుకుకు మంచి సంగీత శిక్షణ ఇప్పించాలన్న అగస్టీన్ కోరికకు అవరోధమేర్పడింది. చదువుకుంటూ



పాటల పోటీల్లో బహుమతులు పొందుతున్నవాడికి ఎలాగైనా సంగీత శిక్షణను యిప్పించడం తన బాధ్యతగా భావించి తిరుపుణిత్తురయణి ఆర్.ఎస్.వి సంగీత కళాశాలలో చేర్పించారు. ఆ కళాశాలలో ప్రధముడిగా 1960లో ఉత్తీర్ణుడైన కొడుకును తిరువనంతపురంలోని "స్వాతి తిరువళ్ సంగీత అకాడమీ"కి తన పరిస్థితి ఎంత గడ్డుగా ఉన్నా పంపించారు. అగస్టీన్. అకాడమీ ప్రిన్సిపాల్ శెమ్మంగుడి శ్రీనివాసయ్యర్ ఏసుదాసు గాత్ర ప్రతిభను గుర్తించి ఆశీర్వదించినా, విధి వక్రించింది. తండ్రి హఠాత్తుగా మంచం పడితే. ఏసుదాసు ఊరు ముఖం పట్టారు. ఇల్లు గడపడానికేవో పనులు చేస్తున్నా, మనసు మాత్రం పాట మీదే. ఆ సమయంలో అదృష్టవశాత్తు మద్రాసు నుంచి అవకాశం రెక్కలు కట్టుకుని ఉత్తర రూపంలో వాలింది.

1961 నవంబరు 14 బాలల దినోత్సవం. బాల్యం వీడి కౌమారంలోకి ప్రవేశించిన ఏసుదాసు, భరణీ రికార్డింగ్ థియేటర్లో 'కాల్ పాదుకల్' అనే తత్త్వ గీతాన్ని ఎం.బి. శ్రీనివాస్ సంగీత దర్శకత్వంలో మొట్టమొదటగా పాడారు. ఏసుదాసును ప్రశంసిస్తూ ఎం.బి. ''నువ్వు నేపథ్య గాయకుడిగా స్థిరపడే రోజులొచ్చా"యన్నారు. చిత్రదర్శకుడు కె.యస్. ఆంథోనీ అవకాశమిచ్చారు.



యేసుదాసు మొదట పాడిన పాట 'కాల్ పాదుకల్'... "ఒకే మతం... ఒకే జాతి... ఒకే దైవం..." అంటూ సాగుతుంది. సామాజిక సామరస్యత ఉండాలనే సందేశంలో నారాయణ గురు రచించిన ఆ పాటలను యాదృచ్ఛికంగానే పాడినా, ఆ పాటలోని భావం ఏసుదాసుకు సరిగ్గా అతుకుతుంది. హిందూ, క్రైస్తవ, ఇస్లాం మతాలకు చెందిన ఎన్నో ఆధ్యాత్మిక గీతాలను ఆలపించారు. తాను క్రిస్టియన్ అయినా అయ్యప్ప దీక్ష బూనారు ఏసుదాసు. కుల కుడ్యం, మత మౌఢ్యం కారణంగా 'గురవాయూరప్ప'ను సందర్శించలేకపోవడం నేటికీ ఆయనకు ఆవేదనను కలిగిస్తుంది. అయ్యప్ప పాటలంటే ఏసుదాసువే. భగవద్గీత అనగానే ఘంటసాల, వెంకటేశ్వర సుప్రభాతం అనుకోగానే ఎం.ఎస్. సుబ్బలక్ష్మి గుర్తుకొచ్చినట్టుగా అయ్యప్ప పాటలనగానే ఏసుదాసే గుర్తుకొస్తారు. ప్రతిరోజు శబరిమలలో అయ్యప్ప ఆలయం మూసివేసే సమయంలో "హరిహరాసనం"అంటూ ఆయన పాడిన పాటే వినిపిస్తుంటుంది. భక్తి గీతం పాడుతున్నప్పుడు ఎంత ఆర్తి ఉంటుందో, విషాదగీతంలో అంత భావోద్వేగమూ అలవోకగా అమరుతుంది ఏసుదాసు గొంతులో. మనసు బాగోనప్పుడు ఏసుదాసు పాట విన్నారా? గడ్డ కట్టిన దిగులునంతా ఓ చిన్ని కన్నీటి చుక్కగా మార్చి, చెక్కిలి నుంచి జారుతూ మన దిగులునూ మనసు నుంచి బయటకు జార్చేస్తుంది. అదే ఏసుదాసు స్వర మాయాజాలం.

మళయాళ చిత్ర రంగంలో నెమ్మదిగా స్థిరపడ్డారు ఏసుదాసు. 'పొలాట్టుకోయన్', 'శ్రీరామ పట్టాభిషేకం', 'కణ్ణుం కరణం' చిత్రాల్లో పాడిన పాటలు జనామోదంపొందాయి. ఆ తర్వాత చిత్రాల్లో కూడా ఆయనకు అవకాశాలు వచ్చాయి. తెలుగులో ఎస్.పి. కోదండపాణి సంగీత దర్శకత్వంలో 'మదన కామరాజు కథ'లో, "ఓ నిండు చందమామా... నిగనిగ భామా" అనే పాటను మొట్టమొదటగా పాడారు ఏసుదాసు. 'మంచి కుటుంబం'లోని "ప్రేమించటం పిల్లల వంతు... దీవించుట పెద్దల వంతు" పాటతో ఆయన తెలుగు పిల్లల ప్రేమకు, తెలుగు పెద్దల దీవెనలకు పాత్రులయ్యారు. అప్పట్నుంచీ నింపాదిగా, "స్టాప్...లుక్... లవ్ అండ్ గో..." అంటూ, తెలుగు చిత్రసీమలో పెద్దగా అవకాశాలు రాకపోయినా, వచ్చిన అవకాశాలను చేజార్చుకోకుండా ఆగి, చూసుకుంటూ లఫ్లీగా సాగుతూనే వచ్చారు. ఏసుదాసు.

"దేవుడే ఇచ్చాడు పాట ఒకటి" అంటూ తెలుగులో గానముద్రలు వేస్తున్న ఆ తరుణంలో 'మేఘ సందేశం' ఏసుదాసు గానామృతాన్ని తెలుగిళ్ళ చషకాలలో కురియజేసింది. ఆ సినిమాలోని పాటలన్నీ మారుమ్రోగిపోయాయి. "ఓ బాటసారీ... ఇది జీవిత రహదారి" అంటూ సినీ సంగీత రహదారిని పట్టి, 'దారి చూపిన దేవత'ల తోడుగా 'ఇదేలే తరతరాల చరితం' అంటూ ఆలపించారు ఏసుదాసు. "ముద్దబంతిపువ్వులో మూగబాసలు" వినిపించారు. 'అందమైన వెన్నెలలోన' ఆడుకునే ఆడపిల్లలే ఏసుదాసు పాటలు.



అందుకున్న అవార్డులు, రివార్డులకు అంతే లేదు. 1965లో సోవియట్ (అవిచ్ఛిన్న) రష్యాలో వివిధ నగరాలలో సంగీత కార్యక్రమాలు నిర్వహించేందుకుగాను సోవియట్ ప్రభుత్వ ఆహ్వానం అందుకున్నారు. 1970 నుంచీ కేరళ రాష్ట్ర నేపథ్య గాయకుడి అవార్డును పదహారుసార్లు పొంది, షోడశ కళాప్రపూర్ణుడైన ఏసుదాసు 1973లో 'పద్మశ్రీ' అయ్యారు. 1988లో ఆంధ్ర, తమిళ రాష్ట్రాల ఉత్తమ నేపథ్య గాయకుడిగా అవార్డులు అందుకున్నారు. 1989లో అన్నామలై విశ్వవిద్యాలయం నుంచి 'గౌరవ డాక్టరేటు'ను పొందారు. 1992లో మధ్యప్రదేశ్‌ప్రభుత్వం "లతామంగేష్కర్ అవార్డు"ను ఇవ్వగా, తమిళనాడు ప్రభుత్వం మరోసారి ఉత్తమ నేపథ్య గాయకుణ్ణి చేసింది. 1991లో వచ్చిన జాతీయ ఉత్తమగాయకుడి అవార్డుతో కలుపుకుని ఆయన ఆరుసార్లు జాతీయ స్థాయి అవార్డులు అందుకున్నవారయ్యారు. సంగీత రంగంలో చేసిన విశేష కృషికి 1994లో ప్రతిష్ఠాత్మకమైన 'నేషనల్ సిటిజన్' అవార్డు ఆయనకు దక్కింది. 2002లో 'పద్మభూషణు'లయ్యారు ఏసుదాసు. తాను దైవసమానుడిగా భావించే తన గురుదేవులైన చెంబైవైద్యనాథ్ భాగవతార్ గారి చేతులమీదుగా బంగారు శాలువాను కప్పించుకోవడం తాను పొందిన అవార్డులన్నిటినీ మించిన రివార్డుగా భావిస్తారాయన.

మనిషిలోని ప్రతిభకు కులం, మతం అడ్డం కాకూడదన్నది ఏసుదాసు అభిమతం. అన్ని మతాలనూ ఆరాదించడమే ఆయనకు సమ్మతం. కుల మతాల సంకుచిత ధోరణిని విడనాడి అందరూ కలిసి మెలిసి ఉండే రోజు కోసం ఎదురు చూస్తున్నానంటారాయన. "సరిహద్దులు లేనిది సంగీతం... అది అందరిదీ" అనే ఏసుదాసు, "గానం గాయకుడి ప్రాణం"గా భావిస్తారు. పాడలేకపోవడం మరణ సదృశమే అయినా, వయసు మీరి గాత్రం తొట్రుపడితే దానిని దేవుడి నిర్ణయంగా భావించి పాడడం మానుకోవాలంటారు. పాడలేని స్థితి వచ్చాకా, అపశ్రుతులతోను, అపస్వరాలతోను పాడడం వాగ్దేవిని అవమానించడంగా ఆయన భావిస్తారు. "ఇక నేను పాడడం ఆపివేయవచ్చు" నన్న సంగతి గాయకుడికి దానంతటదే తెలుస్తుందనీ, ఆరోజు వస్తే తాఉ పాడడం మానేస్తాననీ అంటారాయన.

'జానెమన్... జానె మన్ తేరేలో నయన్' పాటతో ఉత్తరాదిని ఉ ర్రూతలూగించడం మొదలు పెట్టి, "గోరీ తేరా గావ్ బడా ప్యారా", "జల్‌దీప్ జలే ఆనా", "కహా సె ఆయా గాజరా", "క్యా కరూ సజనీ" వంటి పాటలు పాడి జనాల 'దిల్ కే టుకదదే'లను గెలుచుకున్నారు. వేలకొద్దీ భారతీయ చిత్రాల్లో అనేకానేక భాషల్లో నలభై వేల దాకా పాటలు పాడారు ఏసుదాసు.. అస్సామీ, కాశ్మీరీ మినహా భారతీయ భాషలన్నిటిలోనూ ఆయన తీయగా ఆలాపించారు. ఆంగ్లం, రష్యన్, అరబిక్, లాటిన్ వంటి విదేశీ భాషలోనూ పాడారు.

'సంగీత రాజ', 'సంగీత చక్రవర్తి' వంటి బిరుదులతోపాటు కేరళ ప్రభుత్వ ఆస్థాన గాయక పదవి ఏసుదాసును వరించింది. ఆయన



కుటుంబ సభ్యులతో...

"స్వరం బాగున్నప్పుడే పాట ఆపాలి. అప్పుడే శ్రోతల హృదయాల్లో కలకాలం నిలిచిపోగల"మన్న ఏసుదాసు అభిప్రాయం ఎంతైనా సత్యం.

కళాకారునికి తన వారసత్వం నిలబడితే అంతకు మించిన ఆనందం ఉండదు. ముగ్గురు మగ సంతానంలో రెండోవాడైన 'విజయ్' తండ్రి ప్రతిభను అందిపుచ్చుకున్నాడు. 'విజయ్ జేసుదాస్' పేర కొన్ని ఆల్బమ్‌లు కూడా విడుదల చేశారు. అది తనకెంతో సంతోషాన్ని, సంతృప్తినీ కలిగించే విసయమంటారు ఏసుదాసు.

సమభావం. రిషీత్వం, గాంభీర్యం, మానవత్వం, అనే సరిగమలను–పరిపక్వత, దత్తభక్తి, నిరాడంబరత, సహృదయత లనే పదనిసలను 'జీవన రాగం'గా ఆలాపిస్తున్న స్వర చక్రవర్తి ఏసుదాసు.

email: makineedibhaskar@gmail.com

# తెలుగు పత్రికలు - సంపాదకులు

**పుస్తకాలు, పత్రికలు లేని ప్రపంచాన్ని నేడు ఊహించుకోలేం. ఈ ప్రపంచంలో పుస్తకం ఓ అద్భుతం. ఎందరెందరో భాషాభిమానం, దేశాభిమానం, సమాజశ్రేయస్సు, ఉద్యమస్ఫూర్తితో పత్రికలు స్థాపించి పాఠకులకు అందుబాటులోకి తెస్తున్నారు. లెక్కకు మిక్కిలిగా వెలువడుతున్న పత్రికలలో చిరకాలం నడిచేవి-పాఠకాభిమానం పొందేవి కొన్నే. పత్రికలను పాఠకాభిమానం పొందేలా సారథ్యం వహించేవాడు సంపాదకుడు. అలాంటి సంపాదకులను 64కళలు.కామ్‌లో నెల-నెలా పరిచయం చేసే శీర్షికే తెలుగుపత్రికలు-సంపాదకులు.**

వ్యాస రచయితగా, కవిగా, కార్టూనిస్టుగా మరియు సంపాదకునిగా బహుముఖ రంగాలలో రాణిస్తూ గత ఎనిమిది సంవత్సరాలుగా 'రమ్యభారతి' త్రైమాసిక పత్రికను విజయవంతంగా ప్రచురిస్తూ, పత్రికను పాఠకాదరణ పొందేలా చేస్తున్న కృషి గురించి ఎడిటర్ చలపాక ప్రకాష్‌గారి మాటల్లో....



ఎడిటర్ చలపాక ప్రకాష్













● 'రమ్యభారతి' మాసపత్రికను ఎప్పుడు స్థాపించారు?

2004లో 'రమ్యభారతి'ని ప్రారంభించాము. గతంలో 'భారతి' ఉన్నతమైన సాహితీ విలువలతో వెలువడేది. కాని అది ఆగిపోయింది. దీనికి కారణం, ఆర్థిక వనరులే కాదు-పత్రిక ఈ తరానికి చెందని 'పాతవాసన' వస్తుందని ప్రచారం జరగటమే. అందుకే 'రమ్యభారతి'ని నేటి తరానికి, పాతతరానికి మధ్య వారధిగా నిత్యం 'రమ్యం'గా తేవాలన్నదే 'రమ్యభారతి' అని పేరు ఎన్నుకోవడానికి కారణమైంది.

● 'రమ్యభారతి' పేరునే ఎంచుకోవటానికి కారణం?

మొదట్లో పత్రికను సీరియస్/కామెడి సమానంగా ఇవ్వాలని 'బైలా'లో రాసుకున్నాము. కాని సరైన హాస్య రచనలు రాకపోవటం వలన, హాస్యానికి/సీరియస్‌కి పొంతన కుదరకపోవటం వలన, పత్రికను సాహిత్య పత్రికగానే తీసుకువస్తున్నాము. అప్పుడప్పుడు హాస్య సంచికలు ప్రత్యేకంగా వెలువరించే ప్రయత్నాలు చేస్తూనే వున్నాము. ఇక ఈ పత్రిక స్థాపించడానికి ప్రధాన కారణం, చాలా పత్రికలు సాహిత్య రంగంలో ప్రముఖులు రచనలకే ఎక్కువ ప్రాధాన్యతనిస్తున్నాయి. కొత్త వారికి సరైన అవకాశం, వేదికలు లేకుండాపోతున్నాయి అన్న అపవాదులను, కొరతను తీర్చేందుకు 'రమ్యభారతి' పాత/ కొత్త రచయితలకు మధ్య 'వారధి'గా వేదికగా నెలకొల్పాము. అది ఇప్పటికి కొనసాగిస్తున్నాము.




▶ 2004 సం॥లో
'రమ్యభారతి'
సాహిత్య త్రైమాస పత్రికను ఆవిష్కరిస్తున్న కె.జె.ఎన్. ప్రసాద్, సోమేపల్లి వెంకట సుబ్బయ్య, చింతాడ విశ్వనాధశాస్త్రి.

● పత్రికా ప్రచురణలో పంపిణీలో సాధక బాధకాలు గురించి తెలియజేయండి?

పత్రికా ప్రచురణలో సాధకబాదకాలు అన్ని పత్రికలు ఎదుర్కొంటున్నవే. కాని 'రమ్యభారతి'కి రచయితల సహకారం పుష్కలంగా లభించటం వలన, పత్రిక రెగ్యులర్‌గా రావడానికి ఎటువంటి ఒడుదుడుకులు ఎదుర్కొనే సమస్య రానే లేదు. ఇక ఆర్ధిక పరమైన ఇబ్బందులు ఉన్నప్పటికీ, సాహితీ మిత్రులు సహకారం (ప్రకటనలు/ వార్షిక చందాలు/ జీవిత చందాల) వలన పత్రిక ఆ ఇబ్బంది నుండి బైటపడుతూ వస్తోంది. జీవిత చందాల కారణంగా ఒక నిర్ధిష్ట లక్ష్యానికి చేరుకునే విధంగా రూపకల్పన చేసుకోవటంతో పత్రికను రెగ్యులర్‌గా తేవడానికి కారణమైంది. అదీ కాక పత్రికను కేవలం, చందాదారులకే (రాష్ట్ర, రాష్ట్రేతర ప్రాంతాలకు) పోస్టు ద్వారానే చేర్చటం, పత్రికపుటలు ఒక నిర్ధిష్ట సంఖ్యకే పరిమితం చేసుకోవటం, పత్రిక మాసపత్రికగా మార్చి రెగ్యులర్‌గా తేవటంతో ఇబ్బందులు పడకుండా త్రైమాసపత్రికగానే కొనసాగించటం వలన, పత్రిక ఠంచనుగా తీసుకురావటంలో సఫలం చెందామని భావిస్తున్నాము.

● తెలుగు కవిత్వంలో 'రమ్యభారతి' పత్రిక పాత్ర?

అది మా పాఠకులను, రచయితలను అడిగి తెలుసుకోవాలి. ఎందుకంటే రమ్యభారతి ద్వారా ఎందరో కొత్త కవులు పుట్టుకొచ్చిన మాట వాస్తవం, సంఖ్యను, విషయాన్ని పక్కనపెడితే అనుకున్నంత ప్రమాణిక స్థాయిలో లేకున్నా కవులను తీర్చిదిద్దటంలో ఒక వేదికగా 'రమ్యభారతి' నిలబడింది.

● 'రమ్యభారతి' మాసపత్రికపై ప్రముఖుల స్పందన:

మొదట్లో పత్రిక ప్రారంభించినప్పుడు పెద్ద రచయితల నుండి రచనలు ఆహ్వానిస్తూ మేము రాసిన లేఖలకు స్పందిస్తూ "పత్రిక రెగ్యులర్‌గా రానివ్వండి అప్పుడు చూద్దాం"అని చాలామంది ముఖం చాటేసుకున్నారు. ఈనాడు పత్రిక రెగ్యులర్‌గా రావడంతోపాటు సాహితీవేత్తలనుండి, కాలేజీ విద్యార్థులనుండి, సాధారణ పాఠకుల నుండి మంచి స్పందన రావటం వలన అదే పెద్ద తలకాయలు 'రమ్యభారతి' లో తమ ప్రత్యేక పరిచయ సంచికలు తెచ్చుకోవడానికి ఇష్టపడుతున్నారు.. దీనికి ఉదాహరణే ఇంతవరకు వచ్చిన సంచికలలో రెండు సాహితీ వేత్తల ప్రత్యేకంగా వెలువరించిన సంచికలు ఇది చాలదా పత్రికపై ప్రముఖులకున్న అభిప్రాయం ఎటువంటిదో!



రచయితగా, కార్టూనిస్ట్‌గా, కవిగా, లేఖారచయితగా, సాహిత్యరంగంలో అడుగుపెట్టి 31 సం॥ల అనుభవ సారమే ఈ పత్రికకు సంపాదకుడుగా నన్ను నిలబెట్టింది. ఇందుకు సహకరించిన అందరికీ కృతజ్ఞుడ్ని.

● ప్రచురణా రంగంలో వచ్చిన టెక్నాలజీని ఏవిధంగా వాడుకుంటున్నారు ?

పత్రిక ముఖచిత్రాలు ప్రారంభంలో సింగిల్‌కలర్‌లో ప్రచురించేవాళ్లం. గత రెండేళ్లుగా రంగుల్లో ముద్రిస్తున్నాం కొందరి మిత్రుల సహకారంతో. అలాగే లోపలి పేజీలు 32 నుండి ఒక్కోసారి 44 పేజీలు వేస్తున్నాం. అయితే మాకున్న పరిమిత ఆర్ధిక వనరుల దృష్ట్యా లోపలి పేజీలు బేబీ ఆఫ్‌సెట్లో ముద్రిస్తున్నాం. భవిష్యత్తులో పత్రికారంగంలో వస్తున్న విప్లవాత్మక టెక్నాలజీని మాకున్న శక్తి మేరకు వాడుకొని, పత్రికను మరింత పాఠకాధరణ పొందే విధంగా తీసుకువచ్చే ప్రయత్నం చేయగలం.

# పగటి వేషాలు- సామాజిక అంశాలు

## పిట్టలదొర వేషం

రచన
ప్రముఖ నటుడు, చిత్రకారుడు
**తాతా రమేశ్‌బాబు**
email: rbtata60@gmail.com

పగటి కలలు కనొద్దు అంటారు
పగటి వేషాలు వెయ్యొద్దు అని కూడా అంటారు.
వేషం అంటే మారు రూపం

## పిట్టలదొర వేషం

**"ఒరేయ్, మా తాతకి మునుగీత బాగా వచ్చు. ఒక సారి నీళ్లలో మునిగి గంటదాకా బయటకు రాలేదు".**

**"ఓస్ ఇంతేనా! మా తాత నీళ్లలో మునిగి ఈత కొట్టడంలో బంగారు పతకం పొందాడు. నీళ్లలో మునిగితే ఆరు గంటల దాక బయటకు రాకుండా ఉండగలడు తెలుసా"?**

"ఓసోస్, చెప్పొచ్చార్ లేరా బడాయి. గంటకి, ఆరుగంటలకి ఎచ్చులు పోతున్నారు"

"ఎచ్చులా... ఏం నమ్మలేవా"?

"నమ్మకం లేక కాదు. నిజం చెపుతున్నాను, నమ్ముతారో లేదో మీ ఇష్టం. మా తాతకు మునుగీత కొటట్టటం వెన్నతో పెట్టిన విద్య. నేను చూస్తుండగానే మాతాత నీళ్లలో మునిగి ఐదు సం॥లు అయింది. ఈరోజు వరకూ మునుగీత కొడుతూనే వున్నాడు. ఇప్పటి వరకూ బయటకు రాలేదు".

"ఆం..."

వీటినే ప్రగల్భాలు అంటారు. బడాయి మాటలు, ఎచ్చుమాటలు, మెహర్బాని, డాంబికాలు ... ఇలా ఎన్నో రకాలుగా పిలుస్తారు. పునాది లేకుండా గాలిలో మేడలు కట్టేవారు, ఎదుటవారిని హేళన చేద్దామని వారే హేళనకు గురి అవుతారు.

ప్రగల్భాలు పలికే వాళ్లకి బుద్ధి వచ్చేలా రూపొందినది ఈ వేషం. ఈ వేషం కేవలం కల్పితం. సమయోచితంగా వాక్చాతుర్యం ప్రదర్శించే వాళ్లు ఈ వేషానికి అర్హులు.

పోలీసులు ఇంటికి వస్తే అశుభం, అపశకునంగా భావిస్తారు. గ్రామాల్లోనయితే పోలీసులను చూసి ఇళ్లల్లో దూరి తలుపులు



వేసుకునేవారు ఒకప్పుడు. చిన్న పిల్లలు అన్నం తిననని మొరాయిస్తే తల్లులు 'అదుగో పోలీసు ఎత్తుకు పోతాడు తిను' అని బెదిరించి తినిపించేవారు. పోలీసు అంటే అంత భయం ఆనాడు! అక్రమ కేసుల్లో ఇరికించటం, డబ్బు దండుకోవటం ఇంకా అనేకమైన నీచపనులు చేసే కొంతమంది పోలీసులంటే ఇప్పటికీ భయమే! రక్షక భటుడు కాదు, భక్షక భటుడు అంటారు కసిగా కొందరు.

తుపాకీ పట్టుకొన్న మనిషిని చూస్తే మనిషికే భయం కలుగుతుంది. ఎప్పుడు ఎక్కడ మనల్ని పేల్చేస్తాడోనని.

దొరలు మనదేశాన్ని పరిపాలిస్తున్నప్పుడు వ్యాహ్యాలికోసం అడవుల్లోకి వెళ్లి పిట్టలను కాల్చి తెచ్చుకొని వాటి మాంసాన్ని వండించుకుని తినేవారు. ఆరోజుల్లో తలపై హ్యాటు, చేతిలో నాటు తుపాకీ మోకాళ్ళ వరకూ వుండే లాగు వేసుకొని చూడటానికి చిత్రంగా కనిపించే వేషంలో పిట్టలను కొట్టటానికి వెళ్లేవారు దొరలు. వీళ్ళ ఆహార్యాన్ని చూసి, పిట్టలను కాల్చటాన్ని చూసి 'పిట్టలదొర'గా పిలిచేవారు. అందువల్ల ప్రగల్భాలు పలికే వాళ్లని పిట్టల దొర అని పిలిచేవారు.

పిట్టలదొర ఆహార్యాన్ని జతచేసి ఈ వేషం కల్పించారు. పగటి వేషదారులు కడుపు వుబ్బ నవ్వించే పాత్రగా సృష్టించారు.

ఒక పిట్టల దొర వేషగాడు, ఇద్దరు వంట పిట్టలదొరల మాటలు చూడండి...

"హలో, గుడ్ మార్నింగ్ సార్... హలో వణక్కం సార్... హలో నమస్కారమండి... హలో సాలమలేకుం...."

అంటూ లెఫ్టరైట్ కొడుతూ వస్తారు. దొర టోపి తలపై పెట్టుకొని కాకి చొక్కా కాకి నిక్కరు ధరిస్తారు. చేతిలో కత్తి, తుపాకీ వుంటుంది. అద్దాలు లేని కళ్లజోడు చంకలో సంచి, చార్లీచాప్లిన్ మీసాలు వుంటాయి.

"ఆ. మా దొరగారొస్తున్నారు..."

"దొరగారు నేల మీద వస్తున్నారా? సైకిల్ ఎక్కి వస్తున్నారా? విమానం ఎక్కి వస్తున్నారా? హెలికాప్టర్ ఎక్కి వస్తున్నారా?"

"లేదు. ఇప్పుడు మా దొరగారు రెండు కాళ్ల బండి మీద వస్తున్నారు. లెఫ్టరైట్ అంటున్నారు కూడా... పక్కకి తప్పుకోండి... పక్కకి తప్పుకోండి"

"లెఫ్టరైట్ అంటూ ముందుకు వచ్చి) అటెన్షన్"

"ఆ... నమస్కారం సార్ అయ్యా వందనాలండి, ఆ.. ఆదాబర్సే సాబ్, ఆ.. వణక్కం అప్ప, ఆ.. మీరేమిటండి అలా చూస్తున్నారు. నేనండి పిట్టలదొరను. ఆం.. పిట్టల దొరని నేనే! ఇప్పుడే ఇంట్లో ఈసారాలు ఈపారాలు కలహించుకొంటుంటే, నాపరాళ్లకింద పునాది వేసి వస్తున్నా సార్. ఇప్పుడు మీకందరికీ అప్పుకావాలంటే చెప్పండి. మా డబ్బులేని మారాజు దగ్గర డబ్బులిప్పిస్తాను సార్. వడ్డీ ఎంతో కాదు పావలాకి రూపాయే! మీరు డబ్బు ఎగ్గొట్టి ఎంగొట్టేద్దామని. మనవూరి సర్పంచ్ గారి తలని తనఖా పెడదాం. మనవూరి కరణం గారిని హామీగా రాసిస్తాం. అంతెందుకు సార్ మీకు హైదరాబాద్‌లో సచివాలయాన్ని రాసిస్తాం. ఎన్టీఆర్ స్టేడియం కూడా రాసిస్తాం. ఇందులో తప్పేమీ లేదుసార్ నమ్మండి."

"అవును సార్. మా దొరగారు నిఖార్సయిన మనిషి"

"దేశం కోసం యుద్ధాలు కూడా చేసి వచ్చిన దేశభక్తుడు అన్నట్టు సార్" నేనీమధ్య యుద్ధానికి వెళ్లాను, అటు పక్క ఆఫ్ఘనిస్తాన్, ఇటుపక్క



పాకిస్తాన్ శత్రుసైనికులు గుండెలు దడదడ లాడించే మంచి సైనికుడు కావాలని, అతన్ని ఇండియా బార్డర్ దగ్గర వుంచాలని దేశమంతా గాలించి నన్ను రిక్రూట్ చేసి పంపారు. నేను వెళ్లి నా తుపాకిని ఎక్కుపెట్టాను".

"తుపాకిని విల్లులా వంచారు మా దొరగారు"

"కాదురా. విల్లు నుండి వదిలే బాణంలా తూటాను గురిపెట్టారు"

"తుపాకిలో రెండు గుల్లే వున్నాయి పైగా తుప్పుపట్టి వున్నాయి. సరే తుప్పుపట్టిన తూపాకీ గుల్లతోనే మన భారతదేశానికి మంచి పరువు ప్రతిష్ట తీసుకురావాలని ఎక్కుపెట్టాను. ఎదురుగా నలుగురు శత్రు సైనికులు వున్నారు. ఏం చేద్దామ అని బాగా ఆలోచించి తలవైపు నరికేద్దామంటే కుదరదని నా దగ్గరున్న రెండు గుల్ల తుపాకిని పక్కన పెట్టాను".

"ఎనక్కి తిరిగి చూడకుండా పరిగెత్తటానికి అనుకున్నారా?"

"మా దొరబాబు మడం తిప్పే మడిసి అనుకున్నారా? మీరు చెప్పండి దొరగారు".

"తుపాకీ ముందుండే కత్తిని తీసుకుని వాళ్ల వెనుకగా వెళ్లి కాళు నరికేసాను."

"అవునండి. మీరు కాళ్లు ఎందుకు నరికారు. తలకాయ నరకవచ్చుకదా?"

"ఒరేయ్. నువ్వు మోకాల్లో మెదడు పెట్టి ప్రశ్నించారా?"

"ఒరేయ్, వాడన్నది నిజమే కానీ, నా కన్నా ముందు వచ్చినవాడు తలకాయ నరుక్కుపోతే నేనేం నరకాలిరా? అందుకే తలలేని మొండానికి కాళ్లు నరికి నా దేశభక్తిని చాటుకున్న"

"నాక్కూడా దేశభక్తి ఉంది దొరగారు"



"ఓహో, అయితే నీ దేశభక్తిని ఎలా చాటావో చెప్పు"

"మా తాతలు కూడా దేశభక్తిని చాటారు. అసలు మా రక్తంలోనే ఉంది దేశభక్తి"

"మా తాతలు మిలటరీలో పనిచేసారు"

"మీ తాత పేరేమిటి?"

"మా తాత పేరా... వారి పేరు చెపితే దిశలు తెల్లారతాయ్యి"

"సరే , మిలటరీలో పనిచేసి ఏంచేసారు?"

మా తాతలు మిలటరీలో పనిచేసి శత్రువుల పీకలు పరపర కోసేసారు రా"

మరి నువ్వు ఏం చేస్తున్నావు? "నేను కూడా పని చేస్తున్నాను"

"ఎక్కడ"

"మిలటరీ హెూటల్‌లో"

మీతాతలు మిలటరీలో చేస్తే, నువ్వు మిలటరీ హెూటల్లో చేస్తున్నావా? మరి మీ తాతలు శత్రువుల తలలు పరపర కోస్తే..."

"నేనూ కోస్తున్నానను,కోడి పీకలు, పరపర..."

"మీ తాతలు చేసింది దేశసేవ"

"నేనూ చేసేది ప్రజాసేవ"

"చూడు నాయనా ఏ సేవ చేయాలన్నా వాస్తు బాగుండాలి కదా! అందుకే... మారాజా ... మారాజా.... ఇక్కడ చాలా ఇబ్బందిగా ఉంది మారాజా. ఈ దేశాన్ని ముందుకి మూడు అడుగులు వెనక్కి ఏడు అడుగులు పక్కకి పదడుగులు జరపాలి".

అంటూ ఈ వేషం ద్వారా ఊర్లో ప్రవేశించి, హడావిడి చేసి చివరకు 'మేం పిట్టల దొరలం" అంటూ నవ్విస్తారు.

**సామాజికాంశం**



# లైన్‌స్క్రిప్ట్ లెజెండ్



**రహస్యలిపి సృష్టికారి–డా॥ చింతపట్ల వెంకటాచారి**

న్యూ'తన'త్వమే తన లక్ష్యం.

ఈయన సృష్టించిన రహస్యలిపి దీనికి అక్షరసాక్ష్యం.

తాను చేసే ప్రతిపనిలో నూ'తన'త్వమే తన తత్వంగా తన వ్యక్తిత్వాన్ని మలచుకొని, వరల్డ్ ఈజ్ ఫర్ ది వర్డ్ పీపుల్ అన్నట్లు తాను సృష్టించిన రహస్యలిపి సహాయంతో, తాను రచించిన హిందూ, ముస్లిం, క్రిస్టియన్ మత గ్రంథాల రచనల ద్వారాను అటల్ బిహారీ వాజ్‌పేయి, శంకర్ దయాళ్ శర్మ వంటి మహామహుల మన్ననలు అందుకొని గిన్నీస్ బుక్ సర్టిఫికెట్, అర్ హెచ్ ఆర్ వరల్డ్ రికార్డ్స్, మోస్ట్ ఎమేజింగ్ రికార్డ్స్ (యుకె), యుఆర్‌డిబి వరల్డ్ రికార్డ్స్ (ఎన్‌వై), గ్లోబల్ వరల్డ్ రికార్డ్స్, ఎమేజింగ్ వరల్డ్ రికార్డ్స్, ఆన్ లైన్ వరల్డ్ రికార్డ్స్, వరల్డ్ బ్రేకింగ్ రికార్డ్స్, వండర్ రికార్డ్స్ వంటి జాతీయ, అంతర్జాతీయ రికార్డులలో స్థానం సంపాదించుకొని వెలుగుతున్న మన తెలుగువాడు, అఖండ భూమండలానికే నూ'తన' అక్షరాన్ని నేర్పిన భారతీయుడు ఈ చింతపట్ల వెంకటాచారి ఇక నూతన అక్షర బ్రహ్మగా వెలుగొందుతున్నాడు.

ఆయన మాటల్లోనే లైన్ స్క్రిప్ట్ ఉపయోగాలు "ఈ రహస్యలిపి పలుచోట్ల ఉపయోగించవచ్చు–మిలటరీ రహస్య సమాచారాన్ని గోప్యంగా ఒక చోట నుంచి మరో చోటికి పంపే విధానాన్ని ఈ రహస్య లిపి ద్వారా ఉపయోగించవచ్చు. అంతేకాక ఈ లిపిని రహదారులు పైన కాషన్ కోడ్‌గాను ఫర్లాంగు దూరంలో వచ్చే వాహనానికి ముందే తెలియజేసే ఈ రహస్యలిపి ప్రమాదాలను అరికడుతుంది. ఈ లిపిని ఇప్పటికే క్రికెట్ గ్రౌండ్‌లో ఉపయోగిస్తున్నారు. ఈ లిపిని ఫన్నీ గ్రీటింగ్స్‌గా కూడా వాడొచ్చు."



"వరల్డ్ ఈజ్ ఫర్ వర్డీ పీపుల్" అన్నట్లు తాను సృష్టించిన రహస్యలిపి ద్వారాను, తాను రచించిన హిందూ, ముస్లిం, క్రిస్టియన్ మత గ్రంథాల రచనల ద్వారాను అటల్ బిహారీ వాజ్‌పేయి, శంకర్ దయాళ్ శర్మ వంటి మహామహుల మన్ననలను అందుకొని ప్రపంచంలోనే తొలి నూతన అక్షర బ్రహ్మగా వెలుగొందుతున్నాడీయన.

"ఫైన్ హార్ట్స్ లవ్ ఫైన్ ఆర్ట్స్" అనేమాటకు అక్షరసాక్ష్యంగా చింతపట్లకు సాహిత్యంపట్ల వున్న లక్ష్య నిలుస్తుంది. ఇంగ్లీషు, హిందీ, తెలుగు, పంజాబీ, కన్నడ, మళయాళం, ఉర్దూ, అరబిక్ వంటి భాషలకు వాటి వాటికి వున్న లిపితో అదనంగా రహస్యలిపిని కలిపి ఓ నూతన లిపి శకానికి శ్రీకారం చుట్టాడీయన.

అందరినీ ప్రపంచస్థాయికి ఎదగాలని ఆశించే విశ్వపాత్రుడు.

పరిచయం వున్న వారందరికీ మంచి స్నేహితుడు అయిన ఆచారి విశ్వమానవాళికి రహస్యలిపిని సృష్టించి ఇచ్చిన అపరవిశ్వకర్మగా నిలిచాడు.

లిపిరత్న, బెస్ట్ ఆర్టిస్ట్ కళామణి వంటి ఎన్నో బిరుదులు, సత్కారాలు వెంకటాచారిని వరించి, తరించాయి. తాను చేసే పనిపట్ల గౌరవాన్ని ప్రదర్శించడం చింతపట్ల ఎదుగుదలకు ప్రధాన కారణంగా



చెప్పుకోవాలి. హిందూపురాణాలైన రామాయణ, మహాభారతాలతో పాటు ఇతర మత గ్రంథాలైన బైబిల్, ఖురాన్‌లను కూడా రహస్యలిపిలో రచించిన ఆచారి విశాల దృక్పథానికి ప్రతీకగా చెప్పుకోవాలి. పత్రికల్లో వెలువడిన వీరి రచనా వ్యాసంగం సామాజిక స్పృహ కలిగిన మంచి రచయితగా కూడా వీరి మరో పార్శ్వానికి దర్పణం. ఆధ్యాత్మికత, ఆధునికతల కలబోత ఈ వెంకటాచారి సాధించిన ఘనతగా పరిగణించాలి. సాహిత్యంతో సాన్నిహిత్యం పెంచుకొని, ఓ నవీన కోణంలో చదవడానికి వీలైన ఈ రహస్యలిపిని కనిపెట్టి ఆచారి తనకు, మనకు ప్రపంచాన ఘనకీర్తిని ఆర్జించిపెట్టినట్లయింది. ప్రపంచ రికార్డులు ఎన్ని సాధించినా, ఎంత ఎదిగినా ఒదిగి వుండి చిన్నా, పెద్ద అందరితో ఆత్మీయంగా మెలిగే సదాచారి వెంకటాచారి.

రహస్యలిపి ద్వారా భారతీయ మేధో సంపత్తిని మరోమారు బహిర్గతం చేసిన తెలంగాణా తెలుగుబిడ్డ వెంకటాచారి ప్రతిభకు పట్టం కట్టడానికి దేశవిదేశ సంస్థలెన్నో ముందుకు వచ్చాయి. ఇదే వరుసలో నేడు (24-5-2011) తాజాగా అమెరికాలోని బర్కెలీ యూనివర్సిటీకి అనుబంధ సంస్థగా పనిచేస్తున్న థియోలాజికల్ రీసెర్చ్ యూనివర్సిటీ వారిచ్చిన గౌరవ డాక్టరేటు ఈయన కీర్తి కిరీటంలో మరో కలికితురాయిగా నిలిచింది. చింతపట్ల వెంకటాచారి అంటే...

హీ ఈజ్ లైన్ స్క్రిప్ట్ లయన్

ఈక్షేత్రంలో హి ఈజ్ సెకండ్ టు నన్

అందుకే హీ ఈజ్ ఓన్లీ వన్!

నవసాహితీ ప్రేమికుడు, భారతజాతీయ నావికలో నావికుడు.

ఈయన రహస్యలిపిలో పలు భాషలలో అనేక పురాణేతిహాసాలు, రాజశేఖరరెడ్డి వంటి రాజకీయ నాయకుల జీవిత చరిత్రలు రచించిన ఆదర్శ ఋషిపుంగవుడు.

ప్రపంచ భాషా క్షేత్రంలో రహస్య అక్షరాలను పండించిన ఆధునిక అక్షర కృషీవలుడు.

ఈయన ప్రస్తుతం గ్లోబల్ వరల్డ్ రికార్డ్స్‌కి దక్షిణ భారతదేశ చీఫ్ కో- ఆర్డినేటర్‌గా, ఏసియా, ఇండియా బుక్ ఆఫ్ రికార్డ్స్‌కి ఆంధ్రప్రదేశ్ తరపున కరస్పాండెంట్‌గా, యానిమేషన్ గురు మ్యాగజైన్‌కి ఆంధ్రపప్రదేశ్ తరపున కరస్పాండెంట్‌గా, వండర్ రికార్డ్స్, ఎమేజింగ్ వరల్డ్ రికార్డ్స్ సంస్థలకు డైరెక్టర్ ఇన్ చీఫ్‌గా కొనసాగుతున్న ఈయన కేవలం మన తెలుగుజాతికే గర్వకారణం కాకుండా, యావత్ భారతజాతికే గర్వకారణంగా చెప్పుకోవాలి.




రహస్యలిపి సూత్రధారి

అహంకారం, ఆడంబరాలెరుగని నిర్వికారి

దేశ విదేశీ రికార్డు సంస్థలలో పాత్రధారి

ఎదుటివారిని ఆకట్టుకొనే మంచి మాటకారి

శుద్ధశాకాహారి

అభివృద్ధి బాటలో పాదచారి చింతపట్ల వెంకటాచారి.

రికార్డుస్థాయిలో మరిన్ని రికార్డులు స్థాపించి, ప్రపంచానికి ఓ ఆదర్శం కావాలనీ, నేటి యువతకు మార్గదర్శకుడు కావాలని ఆకాంక్షిస్తూ...

**-బి.యం.పి.సింగ్.**

Life is short - Art is long

# 64కళలు.కామ్

www.64kalalu.com

సకల కళల సమాహారం

జూలై 2011



చిత్రకళాతపస్వి మాదేటి రాజాజీ

ఇండియన్ పికాసో - హుస్సేన్

చిత్రమైన జీవితం - బాలి

64కళలు.కామ్
www.64kalalu.com
సకల కళల సమాహారం

సంపుటి :1 సంచిక :9 జూలై 2011



## నివాళి

జూన్ నెలలో ఇద్దరు కళాకారులను కోల్పోయాం. ఒకరు ప్రఖ్యాత నాట్యాచార్యులు నటరాజ రామకృష్ణ, మరొకరు ప్రఖ్యాత చిత్రకారుడు యం.ఎఫ్. హుస్సేన్. వీరి మృతికి 64కళలుడాట్‌కాం ప్రగాఢ సంతాపాన్ని తెలియజేస్తుంది.

పత్రికలో వ్యాసాలు బాగున్నాయని అభిమానంతో ఇ-మెయిల్స్ ద్వారా అభిప్రాయాలు తెలియజేస్తున్న పాఠక, కళాభిమానులకు కృతజ్ఞతాభివందనాలతో...

కళాసాగర్
ఎడిటర్

ముఖచిత్రం చిత్రకారుడు : **మాదేటి రారాజీ**



నటరాజ రామకృష్ణ    యం.ఎఫ్. హుస్సేన్

- వెంటపల్లి సత్యనారాయణ

# చిత్రకళాతపస్వి మాదేటి రాజాజీ





**అక్టోబర్ 2...** గొప్పతనం తేదీ వల్లనా?... లేదా మనుషుల వల్లనా? అన్న విషయం ప్రక్కనపెడితే ఈ దేశానికి అఖండ ఖ్యాతి వచ్చింది ఇద్దరు మహనీయుల జననం వలన... రవి అస్తమించని బ్రిటిషుసామ్రాజ్యాన్ని సత్యం, అహింస మార్గాల ద్వారా ప్రపంచ చరిత్రలో ఏదేశ స్వాతంత్ర్య పోరుకూ లేని ఒక ప్రత్యేక గుర్తింపు మనదేశానికి తీసుకురావడమే కాక అసలు ఇలాంటి మనిషి రక్తమాంసాలతో ఈ భువిపై జీవించాడా! అని ప్రఖ్యాత శాస్త్రవేత్త ఆల్బర్ట్ ఐనిస్టయిన్‌ను సైతం ఆశ్చర్యపరిచేలా చేసిన మహాత్మగాంధీ వారిలో ఒకరైతే, అఖండ భారతదేశానికి ప్రధాని అయ్యుండి కూడా పదవి ద్వారా వచ్చిన భోగాలను ఏమాత్రం ఆశించకుండా అత్యంత నిరాడంబర జీవనం గడిపి అందరికీ ఆదర్శంగా నిలిచిన మన రెండవ ప్రధాని లాల్ బహుదూర్ శాస్త్రి ఇంకొకరు.

అది యాదృశ్చికమో ఏమో గాని అదే నిబద్ధత, నిస్వార్ధసేవాతత్పరత, విశిష్టమైన తనలోని కళాప్రజ్ఞ ప్రఖ్యాత బాలీవుడ్ చిత్రదర్శకులు శ్రీ శాంతారామ్‌ని ముగ్ధున్ని చేయడమే కాదు, బాలీవుడ్ చిత్రాలకు కళాదర్శకునిగా రావల్సిందిగా ఆహ్వానం పలికేలా చేసింది. బొంబాయి హ్యాండ్‌లూమ్ హౌస్‌లో 'ఆర్ట్ డిజైనర్‌గా భారతప్రభుత్వం మంచి ఉద్యోగ అవకాశం కల్పించింది. అంతే కాదు లండన్‌లో ఒక ప్రఖ్యాత సంస్థ లక్షలు పోసే ఉద్యోగ అవకాశాన్ని కూడా ఇచ్చింది. కానీ జాతీయ స్ఫూర్తికి దూరం కాలేకపోయిన ఆ వ్యక్తి ఆ గొప్ప విదేశీ అవకాశాన్ని సైతం తృణప్రాయంగా వదిలి తన వారసునిగా వచ్చి ఆర్ట్‌గ్యాలరీ బాధ్యతలు నిర్వహించనున్న తన గురువు మాటను మన్నించి ఆంధ్ర ప్రాంతంలో ఎందరో కళాకారుల్ని తయారుచేస్తూ అజరామమైన కళాదీప్తుల్ని ప్రసరింపజేసిన ఆ మనిషి కూడా అక్టోబర్ 2వ తేదీనే జన్మించారు. అతనే చిత్రకళలో దేశీయ, జానపద, తాంత్రిక ఆబ్‌స్ట్రాక్ట్ మరియు అకడమిక్ శైలులలో కూడా అత్యంత ప్రతిభా పాటవాలను కనబరిచిన అపురూప చిత్రకారుడు మాదేటి రాజాజీ.

అది 02-10-1992వ తేది. స్వర్గీయ రాజాజీగారి 55వ జన్మదినము సందర్భంగా చిత్రకళాపరిషత్ వారు రాజమండ్రిలో రాజాజీ చిత్రకళా ప్రదర్శనను ఏర్పాటు చేశారు. చిత్రకళయందు అమితాసక్తుడను మరియు రాజాజీ గారి శిష్యుల ప్రతిభా పాఠవాలను మా రామచంద్రపురం వి.యస్.యమ్ కళాశాలలో ప్రత్యక్షంగా చూసిన నాకు ఎలాగైనా ఆ మహా చిత్రకారుని చిత్రాలు చూడాలని రాజమండ్రి వెళ్లాను. ఒక గొప్ప చిత్రకారుని కృషిని ప్రత్యక్షంగా

చూడడం నాకదే మొదటిసారి. ప్రదర్శనలో ఒక్కొక్క చిత్రాన్నీ చూసుకుంటూ వస్తున్నాను. కానీ ఏ చిత్రమూ నన్ను ముందుకు కదలనీయడం లేదు. కారణం అక్కడ నేను వీక్షిస్తున్నది ఒక్కొక్కటి ఒక్కొక్క ప్రత్యేకతను సంతరించుకున్న చిత్రాలే. పసిడి వెన్నెల బాల్యంనుండి పండు ముదుసలి వరకూ బ్రతుకుపోరులోని వైయుక్తిక ఆనందాలు, సామూహిక సంబరాలు మాత్రమే కాదు, మనిషి జీవన యానంలోని దుర్భర దయనీయ సమయాలను కూడా ఆయన తన చిత్రాల్లో ఎంతో గొప్పగా రంగుల్లో ఆవిష్కరించారు.

ఒక నడిరోడ్డు, పండు ముసలి జంట, నడవలేని అవ్వను నలుచక్రాల ట్రాలీపై  కూర్చోబెట్టి వంగిపోయిన నడుముతో తోసుకుంటూ బిక్షాటన చేస్తున్న యాచకుడు, ఆ దుర్భర వయోభారానికి అదనపు భారంగా ఓ అనాధ శిశువును ఓ చిత్రంలో వేస్తే, జవసత్వాలు నశించి తాను పరుండిన మంచంపై నుండి లేవడానికి శాయశక్తులా ప్రయత్నిస్తున్న ఓ వృద్ధమహిళ వెనుక నేపధ్యంలో రాలిపోతున్న ఓ పండుటాకును మరో చిత్రంలో వేశారు. అలాగే చీకటి గదిలో గుడ్డి లాంతరు వెలుగులో కుంపటి ఎదురుగా కూర్చుండి చలినుండి కాపాడుకుంటున్న ఓ వృద్ధ మహిళ లాంటి చిత్రాలు ఎన్నో వాష్ టెక్నిక్‌లో అద్భుతంగా చిత్రిస్తే....

ఒకనాడు సమాజానికి ఆనందానుభూతులను పంచిన సామూహిక సంబరాల కళారూపాలైన కోలాటం, గరగాటలు, గారడీలు, దప్పువాయిద్యాలు తప్పెట గుళ్ళు, మహిళా ఉత్సవాలు, పండుగలు లాంటి సామూహిక దృశ్య చిత్రాలు కొన్నింట్లో ఇక ప్రకృతి రమణీయతను చాటి చెప్పే లాండ్‌స్కేప్‌లు కొన్నైతే, ఉమర్ ఖయ్యాం, మొఘుల్‌వైభవం లాంటి తరతరాల సంస్కృతిని చాటి చెప్పే అద్భుత చిత్రరాజాలు కొన్ని  ఇక చిత్రకారుని సామర్ధ్యం పనితనానికి మచ్చుతునకగా చెప్పుకునే వ్యక్తుల రూపచిత్రాలు ఇంకొన్ని ఇలా





చిత్రకళకు సంబంధించి అన్ని విభాగాలలో, అన్ని విషయాలపై, అన్ని మాధ్యమాలు, శైలులలో ఆయన చిత్ర రచన చేయడం జరిగింది. ఇలాంటి చిత్రాలు చూస్తున్న ఏ ప్రేక్షకుడైనా తొందరగా ఎలా ముందుకు సాగగలడు.

శ్రీమతి అన్నపూర్ణమ్మ, సూర్యప్రకాశం దంపతులకు నాల్గవ సంతానంగా 1937 అక్టోబర్ 2 వ తేదీన జన్మించిన రాజాజీ యొక్క ప్రాధమిక విద్యాభ్యాసం రాజమండ్రి ట్రైనింగ్ కళాశాలలో జరిగింది. బాల్యంనుండి చిత్రకళ పట్ల అమితమైన ఆశక్తిని కనబరుస్తున్న రాజాజీని గమనించిన ప్రఖ్యాత చిత్రకారుడు శ్రీ వరదా వెంకటరత్నం రాజాజీకి తొలుత చిత్రకళా మర్మాలను నేర్పించడమే కాక అతన్ని పరిపూర్ణమైన చిత్రకారునిగా తీర్చిదిద్దాలనే సంకల్పంతో



భువన విజయం - నన్నయ్య . మహాభారతాన్ని రాజరాజనరేంద్రుడికి అంకితమిస్తున్న దృశ్యం. చిత్రకారులు స్వర్గీయ శ్రీ మాదేటి రాజాజీ (1937-1990)

1953లో బొంబాయిలోని ప్రఖ్యాత చిత్రకళాశాల సర్ జె.జె.స్కూల్ ఆఫ్ ఆర్ట్స్‌లో చేర్పించారు. 1958లో చిత్రకళాపట్టాను, మరలా 1959వసం॥లో మ్యూరల్ కళలో స్పెషలైజేషన్‌తో వేరొక పట్టాను రాజాజీ ఆ విశ్వవిద్యాలయము నుండి పొందారు. అక్కడ విద్య నభ్యసిస్తూనే దేశ, విదేశీ చిత్రకళారీతుల గురించి అధ్యయనం చేస్తూ చిత్రకళపై పత్రికలలో వ్యాసాలు రాస్తూవుండేవారు. ఆ రోజుల్లో రాజాజీ నివసిస్తూ వుండే G.R. Hotel, 418, kalaba devi Road. Bombay-2 అన్న చిరునామాకు అనేక ఉత్తరాలు పరంపర నడిచేది. కేరళలలోని త్రివేండ్రమ్ నుండి ప్రఖ్యాత చిత్రకళా విమర్శకుడు శ్రీ పద్మనాభ టెంపే ప్రముఖ చిత్రకారులు అంట్యాకుల పైడిరాజు, మొక్కపాటి కృష్ణమూర్తి, హెచ్.వి.రామ్. గోపాల్, నేటి ప్రముఖ జానపద చిత్రకారులు డాక్టర్ కాపురాజయ్య తదితరులు రాజాజీ ఆర్టికల్స్‌పై రాజాజీతో తరచుగా ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతూ ఉండేవారు.

ది. 13.8. 1957న కాపురాజయ్యగారు బొంబాయిలో ఉండే రాజాజీకి లేఖరాస్తూ "ఆధునిక చిత్రకళపై మీరు రాసిన వ్యాసం 10-8-57న ఆంధ్రప్రభలో చూసి ఎంతో సంతోషించితిని. ఆంధ్ర చిత్రకారుల గురించి "దేశ విదేశాలలో పరిచయం చేసేవారు ఎవరూ లేరే అని బాధపడుచుండేవాడిని. కానీ ఆ పనిని మీరు నిర్వర్తిస్తున్నందుకు కృతజ్ఞతలు" అని రాస్తే 13-1-1958 న ప్రఖ్యాత చిత్రకారుడు శ్రీ అంట్యాకుల పైడిరాజు "మీరు రాస్తున్న వ్యాసాలు నన్ను ముగ్ధున్ని చేస్తున్నాయి" అని రాశారు. మరొక ప్రముఖ చిత్రకారుడు మొక్కపాటి కృష్ణమూర్తి ఒక లేఖలో Dear Sri Rajaji Iam really greatfull to you for writing it. There is much need for such ariticles అని ఆంగ్లంలో రాసారు. ఇలా రాజాజీకి వచ్చిన ఉత్తరాల కట్టను చూసి నిజంగా నాకు ఆశ్చర్యం కలిగింది. బహుశా ఈ స్ఫూర్తి ప్రభావంతోనే అనుకుంటా ఆయన రాజమండ్రిలో దామెర్ల రామారావు చిత్రకళాశాల ప్రిన్సిపాల్ బాధ్యతలు స్వీకరించిన తర్వాత చిత్రకళా సారస్వతం జాడే లేని ఆ రోజుల్లో 1964 నుండి 1966 వరకూ ప్రపంచ చిత్రకళారీతులు, చిత్రకారులు వారి ప్రదర్శనలు, తదితర సమాచారంతో సచిత్ర చిత్రకళా మాసపత్రిక "తూలిక"ను ఒక్క తెలుగులోనే కాక ఆంగ్ల భాషలో కూడా ప్రచురించి మనదేశంతో పాటు అమెరికా, రష్యా, జపాన్, ఇటలీ, బ్రిటన్ తదితర దేశాలకు పంపిస్తూ మన చిత్రకళను ఇతర దేశాలకు తెలియజేయడం ద్వారా చిత్రకళా చరిత్రలో రాజాజీ తనదైన ఒక ప్రత్యేక స్థానాన్ని సొంతం చేసుకున్నారు.

పద్మనాభటెంపే, డా॥ సంజీవదేవ్, వేలూరి రాధాకృష్ణ, చలసాని ప్రసాదరావు, వి.పతంజలి, ఆర్బీ తదితరులు తూలిక పత్రికలో చిత్రకళపై వ్యాసాలు రాస్తూ వుండేవారు. క్రీ.శే. శ్రీ చలసాని ప్రసాదరావుగారి సంపాదకత్వంలో "కళ" పేరుతో వెలువడిన ఆరు ప్రత్యేక సంచికలతో పోల్చదగిన రీతిలో ఆంగ్లాంధ్రభాషలలో "కళ" పత్రికలోలా కేవలం సచిత్ర చిత్రకళావ్యాసాలే కాకుండా చిత్రకళకు సంబంధించిన ప్రపంచవ్యాప్తంగా ఉన్న వివిధ చిత్రకారులు, వారి ప్రదర్శనలు, తదితర సమాచారంతో ఎప్పటిప్పుడు వెలువడే రాజాజీ "తూలిక" మాసపత్రికలు అభ్యుదయ చిత్రకారులకు ఎంతో ఉ



పాదుకలు తీసుకువెళ్లుట' వంటి చిత్రాలకు అనేకుల ప్రశంసలు లభించాయి. ఇంకా వీరి చిత్రాలు హైదరాబాద్ ఆర్ట్ సొసైటీ. ఆంధ్రప్రదేశ్ లలిత కళా అకాడమీ, బొంబాయి, కలకత్తా, న్యూఢిల్లీ, అమృతసర్, త్రివేండ్రమ్ మద్రాస్, మైసూర్, జమ్ము-కాశ్మీర్, గ్వాలియర్, రాజమండ్రి, సాలార్‌జంగ్ మ్యూజియం ఇంకా పెర్తు, ఆస్ట్రేలియా, రష్యా వంటి విదేశాలలో రాజాజీ చిత్రాలు అలంకరింపబడి వున్నాయి.

1994 మార్చినెలలో రాజమండ్రి దామెర్ల చిత్రకళాశాలలో ఏర్పాటైన అఖిల భారత చిత్రకళావర్క్‌షాపుకు విచ్చేసిన పలువురు జాతీయ చిత్రకారులలో ఒకరైన గౌరీశంకర్ రాజాజీ చిత్రాలను సందర్శించి మాట్లాడుతూ "ఫిగరేటివ్ వాష్ టెక్నిక్‌లో వేసిన చిత్రాలుఅద్భుతమని, ప్రపంచస్థాయికి ఎన్నదగిన రీతిలో రాజాజీ గొప్ప కళాఖండాలు సృష్టించారని, ఆయన చిత్రాలను ప్రభుత్వమే కొనుగోలు చేసి ఆయనకు ఒక ప్రత్యేక గ్యాలరీ నిర్మించాలనీ లేదా కనీసం దామెర్ల గ్యాలరీలో ఒక ప్రత్యేక విభాగాన్నైనా ఏర్పాటు చేయాలని ఆయన కోరారు".

జీవితాంతం నిస్వార్థంగా కళాసృజన, మరియు కళాసేవకే అంకితం చేసిన ఆ కళామూర్తికి కర్మడికి ఎదురైన శాపాల్లా ఎన్నో అవాంతరాలు. 1986లో వచ్చిన గోదావరి వరదలలో రాజమండ్రి వీరభద్రారంలో గల తన స్వగృహం ముంపునకు గురికావడంతో దశాబ్దాల తరబడి చిత్రించిన వందలాది చిత్రాలు తడిసి వర్ణ విహీనమై తను సృష్టించిన కళాసంపదంతా సర్వనాశనమైంది. అయినప్పటికీ

పయుక్తాలు. అంతేకాక ఆయన ఆధునిక ఆంధ్రచిత్రకళకు ఆద్యుడైన స్వర్గీయ దామెర్ల రామారావుపై "సిద్ధహస్తుడు దామెర్ల రామారావు-జీవితం కళాకృషి" పేరుతో వెలువరించిన పుస్తకంలో రాజాజీ దామెర్ల రామారావు గారి జీవితాన్ని అతని కృషిని కళ్లకు కట్టినట్లుగా ఎంతో హృద్యంగా ఆవిష్కరించారు. 1973 ఫిబ్రవరి 1వ తేదీన రాజాజీ ఫైనార్ట్స్‌పై ఆంగ్లంలో రాసిన వ్యాసాలకు లండన్ కేంబ్రిడ్జ్ వారు ఒక ప్రత్యేక యోగ్యతా పత్రాన్ని ఇచ్చి సత్కరించారు.

దాదాపు రెండు వేలకు పైగా చిత్రాలను చిత్రించిన రాజాజీ ఉజ్జయినీ, అమృతసర్, రాజమండ్రి, హైదరాబాద్, కొచ్చిన్, మైసూర్ మొదలగు జాతీయ చిత్రకళాప్రదర్శనలలో వివిధ బంగారు, వెండి నగదు బహుమతులతో పాటు అనేక ప్రశంసాపత్రాలను పొందారు. 1958లో రాజమండ్రిలోనూ, 1959లో ఎలియన్స్ ప్రావిన్స్ గ్యాలరీ బొంబాయిలోను, అకాడమీ ఆఫ్ ఫైన్ ఆర్ట్స్ కలకత్తా వారి ఆధ్వర్యంలో 1969లో కలకత్తాలోను రాజాజీ వ్యక్తిగత చిత్రకళాప్రదర్శనలు నిర్వహించి అనేక చిత్రకళాకోవిదుల విమర్శకుల యొక్క ప్రశంసలు పొందారు.

1975లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నిర్వహించిన మొదటి ప్రపంచ తెలుగు మహా సభలకోసం అతిపెద్ద సైజులో రాజాజీ వేసిన చిత్రరాజం "భువనవిజయం" ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సన్మానాన్ని పొందేలా చేసింది. విజయవాడ ఆంధ్రార్ట్స్ అకాడమీ వారిచే 1989లో అత్యుత్తమ బహుమతి పొందిన "మొఘల్‌వైభవం" చిత్రంతో పాటు, దిఉమెన్, హుక్కా, భరతుడు రాముని








బాధతో కృంగిపోకుండా తనకళాకృషిని తిరిగి కొనసాగించారు. 1969 నుండి 1990 వరకూ దామెర్ల గ్యాలరీ ఇన్‌చార్జిగా వ్యవహరిస్తూ ఆయన చేసిన కృషి ఫలితంగా 1987లో దానికి ప్రభుత్వ గుర్తింపును సాధించినప్పటికీ ప్రభుత్వం నుండి రావల్సిన ఎలాంటి ప్రతిఫలాన్ని పొందకుండానే 1990 జూలై 10న ఆ మహా చిత్రకారుడు చివరి వరకూ తాను విహరించిన ఆ రంగుల లోకంలో కలిసిపోయారు. ఆయన చిత్రించిన ఎన్నో చిత్రాలు చాలా మటుకు రాజాజీ మిత్రుల వద్ద, బంధువుల వద్ద, వివిధ గ్యాలరీలలోనూ ఉ ండగా వాటిని సేకరించి ఒక చోట భద్రపరిచి భావితరాలకు ఆ కళాసంపదను అందించాలనే లక్ష్యంతో రాజాజీ అన్నగారబ్బాయి శ్రీ మాదేటి రవిప్రకాష్ ఎంతో కృషి చేసి రాష్ట్ర నలుమూలాలనుండి 60 చిత్రాల వరకూ సేకరించగలిగారు. ఇటీవలనే రాజాజీ గారి చిత్రాల గురించి ప్రఖ్యాత ప్రకృతి చిత్రకారుడు స్వర్గీయ వి.వి. భగీరధి మనుమరాలు, చిత్రకారిణి అయిన శ్రీమతి ఎస్.వి.పి.యస్.యస్ లక్ష్మిగారితో వాకబు చేయగా ఆమె శ్రీ మాదేటి రవిప్రకాష్ గారి ఫోన్ నెంబర్ ఇవ్వడంతో నేను ఫోన్ చేయడం, రవిప్రకాష్ సాధరంగా ఆహ్వానించడంతో 2011 జనవరిలో నేను మా మురళి కలిసి రవిప్రకాష్ గారింటికి వెళ్లాము. అక్కడ వారు నివసిస్తున్న ఆ చిన్న ఇంట్లో అంత పెద్ద కళాసంపదను చూసి ఆశ్చర్యపోయాం. రవిప్రకాష్ ఎంతో ఓపికగా తాను సేకరించిన రాజాజీ చిత్రాలన్నీ చూపించారు. చిత్రాలకు సరైన భద్రత కరువై ఎంతో విలువైన పెద్ద సైజులో వేసిన చిత్రాలు దుమ్ము, ధూళి పేరుకుపోయి వుండడం మా హృదయాలను కలిచివేసింది. నీటి రంగుల్లో ఉన్న చిన్న చిత్రాలు మాత్రం ఒకపెట్టెలో భద్రపరిచారు. సంవత్సరాల తరబడి ఎంతో శ్రమకోర్చి తాను సేకరించిన చిత్రాలను ఇప్పుడైనా ప్రభుత్వం సేకరించి దామెర్ల గ్యాలరీ మాదిరిగా ఒక ఒక ప్రత్యేక గ్యాలరీలో భద్రపరిచి మనకు గర్వకారణమైన ఆ కళాసంపదను భావితరాలకు అందించే ఏర్పాటును ప్రభుత్వం ఏర్పాటుచేయాలని, చేస్తుందని రవిప్రకాష్ యొక్క ఆశయం నెరవేరాలని, నెరవేరుతుందని ఆశిద్ధాం.

email: snventapalli@gmail.com






# కళాప్రపంచం

# ఇండియన్ పికాసో హుస్సేన్

ఎల్.ఆర్. వెంకటరమణ

"ప్రతిచిన్న పిల్లవాడు ఒక విశిష్ట కళాకారుడు. వయసు పెరుగుతున్నకొద్దీ ఆ కళాకారుణ్ణి ఆ పిల్లవానిలో అలానే నిలిపి ఉంచగలగడం అన్నది అసలు విషయము" అంటాడు పికాసో. కళ అన్నది ప్రతి ఒక్కరిలోనూ ఒక సహజాతం అన్పిస్తుంది. అదే విధంగా కళకు పసితనానికి సంబంధాన్ని చూపాడు పికాసో. ఆ కోవకు చెందిన చిత్రకారుడు, సదా బాలకుడు హుస్సేన్ సాబ్. 95 ఏళ్ల పసితనంలో కళాసంపదను మనకు వదిలి మనకు అందనంత దూరం వెళ్లిపోయాడు. కళ అనే అమృత్వాన్ని స్వర్గంలో అందివ్వడానికి అక్కడికే పయనమై పోయాడు.

భారతీయ నాగరికతా, సంస్కృతి సింధూ నాగరికత మొదలు నిన్న మొన్నటి చరిత్ర వరకు దృశ్యరూపంలో దృశ్యకావ్యంలా మలచిన వాడు హుస్సేన్ సాబ్. చిత్రకారునిగా విలక్షణుడు, అంతే వివాద గ్రస్థుడు. జీవిత మలి సంధ్యలో మాతృదేశానికి దూరమైన దు:ఖితుడు కూడా.

మహారాష్ట్రలోని పండరీపురంలో జన్మించిన హుస్సేన్. ఈదేశ సంస్కృతి భాగంగానే ఎదిగాడు. 1935లో ముంబై చేరుకొని జె.జె. స్కూల్ ఆఫ్ ఆర్ట్‌లో ఒక సంవత్సరం చిత్రకళాభ్యాసం చేశాడు. సినిమా హోర్డింగులు వేస్తు జీవిక పోషించాడు.. 1941లో ఫజైలాతో వివాహం జరిగింది. 1947లో సౌజా నాయకత్వంలో గల ప్రగతిశీల కళాకారుల బృందంలో చేరాడు. నాటి బెంగాల్ కళాసంప్రదాయం ఒక్కటే చిత్రకళారంగాన్ని ఏలుతోంది. ఈ సంప్రదాయం నుండి బయట పడి క్రొత్త సంప్రదాయాన్ని తేవాలన్నది వీరి ఆరాటం. 1952లోనే ముంబైలో మొదటి సోలో ప్రదర్శన నిర్వహించడం అదే సం॥లోనే అంతర్జాతీయ స్థాయిలో జ్యూరిచ్‌లోనూ వ్యక్తిగత ప్రదర్శనను నిర్వహించగలిగాడు. 1954లో లలిత కళా అకాడమీకి ఎన్నిక కాగలిగారు. 1955లో పద్మశ్రీ పొందారు.

అదే విధంగా 1973లో పద్మభూషణ్, 1991లో పద్మవిభూషణ్ అందుకున్నారు. కొంతకాలం రాజ్యసభ సభ్యునిగా







కూడా ఉన్నారు. 1971లో బైబిల్‌లో గల సావో పౌలోలో జరిగిన ప్రదర్శనలో పికాసోతో కలిసి పాల్గొనే అవకాశం లంభించింది.

1967లోనే సినిమా నిర్మాణంలో అడుగుపెట్టిన హుస్సేన్‌జీ తీసిన "Though the eyes of a painter" అన్న చిత్రానికి బెర్లిన్ ఫిల్మ్ ఫెస్టివల్‌లో గోల్డెన్ బేర్ అవార్డు అందుకున్నారు. అదేవిధంగా హుస్సేన్ తీసిన "గజగామిని", "మీనాక్షి-ఏటేల్ ఆఫ్ త్రీసిటీస్". అన్న సినిమాలు కూడా అతని యొక్క ఆసక్తి. ఆర్తిని తెలియచేస్తాయి.

కళాభివ్యక్తితో భిన్నరీతులలో ప్రయోగాలు చేస్తున్నప్పుడు ఎపుడో ఒకసారి వివాదాలు సుడిగుండాలలో పడడం సామాన్య విషయం. అదేవిధంగా హుస్సేన్ సాబ్ కూడా వివాదా గ్రస్తుడయ్యాడు. భారతీయ పుణ్యనీయ దేవతలను నగ్నంగా చిత్రించాడని చాల వివాదమే జరిగింది. 1996లో హిందీ మాసపత్రిక "విచార్ మీమాంస"లో ఈ విషయాన్ని పతాక శీర్షికలతో ప్రచురిస్తూ "M.F. Husain: A Painter or Butcher". హుస్సేన్ సాబ్‌పై దాదాపుగా ఎనిమిది క్రిమినల్ కేసులు నమోదయ్యాయి. 1998లో ముంబైలోని తన ఇంటిపై దాడి జరిగి చిత్రకళాసంపద నాశనమైనది. 1970లో గీచిన భరతమాత చిత్రం మరోమారు 2006లో తిరిగి ప్రచురించబడింది. దీంతో మరోసారి హుస్సేన్ సాబ్‌పై దాడికి పురికొల్పాయి. చివరకు హుస్సేన్‌జీ భారత్‌నే వదిలి వెళ్లిపోవాల్సి వచ్చింది.



కష్టకాలంలో చిత్రకళా లోకం నైతిక స్థైర్యాన్ని అందించగలిగింది. చివరకు లండన్‌లో గల రాయల్ బ్రాంప్టన్ ఆసుపత్రిలో 2011 సం॥ జూన్ నెల 9వ తేదీన తుదిశ్వాస వదిలారు హుస్సేన్‌జీ.

"చదువులేని అమాయకుల అజ్ఞానాన్ని క్షమించవచ్చు. కానీ చదువుకున్న వారి అజ్ఞానం చాల ప్రమాదకరం. అలాంటి అధికార, రాజకీయ, మతనాయకుల వల్లనే బాధపడుతున్నాను. నా ఆత్మ భారతదేశంలో కాక మరెక్కడ ఉంటుందటాడు" హుస్సేన్‌సాబ్.






హుస్సేన్‌సాబ్ ప్రసిద్ధ పుణ్యక్షేత్రంలో అయిన పండరీపురంలో 1915 సెప్టెంబర్ 17న జన్మించారు. చాలా చిన్న తనంలోనే తల్లిని పోగొట్టుకున్నారు. తండ్రి మరో పెళ్లి చేసుకున్నాడు. ఇండోర్ వెళ్లిపోయాడు. హుస్సేన్‌జీ ప్రాథమిక విద్య ఇండోర్‌లో పూర్తయింది. అనంతరం ఇరవై ఏళ్లవయస్సులో తిరిగీ ముంబై చేరుకున్నారు. సుదీర్ఘ ప్రస్థానానంతరం 2011 జూన్ 9వ తేదీన లండన్‌లో చివరి శ్వాస వదిలారు. చివరి కోరిక మేరకు లండన్‌లోనే ఆయన నివాసంలోనే అంత్యక్రియలు నిర్వహించారు. ఖతార్ పౌరసత్వం పొందిన హుస్సేన్ లండన్‌లో ఖతార్ పౌరునిగా తనువు చాలించాడు.

హుస్సేన్ జీ కవి కూడా కడుపునొప్పితో బాధపడుతూ ఆసుపత్రిలో చేరినపుడు ఒక దీర్ఘ కవిత రాశాడు. "హుస్సేన్‌కీ కహానీ, ఉన్‌కీ జుబానీ" సాబ్ రాసిన పుస్తకం. కవి ముక్తి బోద్ చనిపోయినపుడు, అంతిమ సంస్కారాలపుడు, తిరిగి వచ్చేటపుడు కాళ్లకు చెప్పులు వేసుకోలేదు. తన అనుభూతి అలా తెలిపాడు.

భారత్‌ను వదిలి వెళ్లిపోయారని విలేఖరుల ప్రశ్నకు హుస్సేన్ జీ ఇలా సమాధానమిచ్చారు. "నేనెక్కడికి వెళ్లిపోలేదు. మొదటి నుండి నేను వివిధ ప్రాంతాలలో గడిపిన వాణ్ణి, నేనొక జానపద చిత్రకారుని వంటి వాడను. ఎక్కడ అవకాశం దొరికితే అక్కడ కాన్వాస్ పెట్టుకోవడం... బొమ్మలేసుకోవడం.. వెళ్లిపోవడం... అంతే" అంటారు.



# 'చిత్ర' మైన జీవితం

**Part-3**

***ప్రముఖచిత్రకారుడు, కార్టూనిస్టు, కథారచయిత బాలిగారు 64కళలుడాట్‌కాం పాఠకులకోసం తన కళాజీవిత విశేషాలను, బాల్యస్మృతులను, పరిచయాలను ధారావాహిక రూపంలో అందించనున్నారు. నెల నెలా చిత్రమైన జీవితంలో...***





ఆరోజుల్లో శేఖరమంత్రి సన్యాసిరావు అనే నా క్లాస్‌మేట్ ఉండేవాడు. అతడి దస్తూరి బాగుండేది. వాళ్లన్నయ్య మురళీ మాకన్నా ఓక్లాసు ఎక్కువ చదివేవాడు. వాడికి కథలు, బొమ్మల సరదా ఉండేది. మేం ముగ్గురం రాత పత్రిక మొదలెట్టాం. సెలవుల్లో మొదలెట్టడం, బడులు తెరవగానే మూసెయ్యడం. ఇదీ దాని స్టయిల్ ఆఫ్ పబ్లికేషన్. ఇలా రెండు సంవత్సరాలు చేసినట్టున్నాం. అందులోని బొమ్మలన్నీ నావే! కొల్లూరి వారనీ మా ఇంటికి ఎదురుగా కొత్తగా మరొకరు పెరిగారు. వారు ఈ అనకాపల్లి వైపు వారేగానీ వాళ్లనాన్న ఛత్రపురం, బరంపురాల్లో (ఒరిస్సా) స్కూలు టీచర్‌గా పనిచేశారు. ఆయన రిటైర్ అయ్యి ఆయన కుటుంబంతో అనకాపల్లికి మకాం మార్చారు. ఆయనకు ఐదుగురు మగపిల్లలు ఓ ఆడపిల్ల. మగపిల్లల్లో ఒకడు నా మిత్రుడు. అప్పాజీ, నా ఈడువాడే! ప్రస్తుతం ఎలక్ట్రికల్ ఇంజనీర్‌గా పనిచేసి రిటైర్ అయి విశాఖపట్నంలో సెటిల్ అయ్యాడు. ఇతనికి కవిత్వం అంటే ఇష్టం. తీరిక దొరికితే చాలు కాయితం మీద కవిత్వం ఒలకపోసేవాడు.

*నూతికి పళ్లెం, తలుపుకి గొళ్లెం...*
*ఉండాలోయ్ ఉండాలి*
*గుర్రానికి కళ్లెం- మగాడికి పెళ్లాం...*
*ఉండాలోయ్ ఉండాలి.*
*వంటికి బట్ట... నోట్లో చుట్ట*
*ఉండాలోయ్ ఉండాలి....*

*సుందరీ నీ చెక్కిలి నునుపు...*
*గులాబీరెక్క మెరుపు*
*నీ నడకల నాజూకుతనంలో*
*హంసలు సిగ్గులు పడవూ*
*ఇసుక బయళూలూ, చల్లగాలులూ*
*నీ ముంగురుల సొగసులు*
*నీ నవ్వుల మొలకల్లో పలువరసల మెరుపులు*
*ఆగవే చెలీ... నీ అడుగుల మలుపులలో నలిగిన*
*ఇసుకరేణువునన్నా కానని*
*నా మనసులో సన్నని బాధ... ఏల...*

# సఫలమూ... రాగ సుధాభరితమూ జిక్కీ జీవితం



– మాకినీడి సూర్యభాస్కర్

'హాయి హాయిగా ఆమని'లా సాగే 'జాణ' పదాల స్వరం–పులకించని మదులను సైతం పులకింపజేసే భా–స్వరం. జిక్కీ ఆమె గుర్తుకు రాగానే శృంగార జానపద బాణీలు మదిలో మెదులుతాయి. 'రాజశేఖరా, నీపై మోజు తీరలేదురా' అనే విరహ శృంగారం, 'రాక రాక వచ్చావు చందమామ'... 'అంద చందాల సొగసరి వాడే' వంటి శుద్ధ శృంగారం ఆమె స్వరంలో సింగారాలు పోయింది. పోలీసెంకట సామిని మరవలేని మనసూ... బంగారిమామని పిలిచే పిలుపూ ఆమె పాటలో మిళితమై, జానపదీయమై ప్రదీప్తమానమైంది.

పుట్టిందీ, పెరిగిందీ మద్రాసులోనే అయినా, జిక్కీ పదహారణాల తెలుగింటి ఆడపడుచు. సొంత ఊరు చంద్రగిరి, అసలు పేరు కృష్ణ వేణి. ఇంటిపేరు 'పిల్ల', తండ్రి పేరు 'గజపతి నాయుడు' ముందు కలిసి, పూర్తిపేరు పి.జి.కృష్ణవేణి అయింది. చిన్నతనంలో రూలు బొమ్మతో ఆడుకొంటూండగా తండ్రి ముద్దుగా 'జిక్కు జిక్కు' అని పిలిచిన పేరు కాస్తా 'జిక్కీగా మారి, అలానే పాపులర్ అయింది.

రెండో తరగతి మాత్రమే చదువుకున్న జిక్కీ, తన ఆరవ యేట నుంచీ రేడియోలో వినిపించే లతామంగేస్కర్, ఎం.ఎస్.సుబ్బులక్ష్మి, పట్టమ్మాళ్, సైగల్, పంకజ్ మల్లిక్‌ల పాటలను విని అనుకరిస్తూ పాడేవారు. పెదతండ్రి ధనుంజయ నాయుడు రంగస్థల రంగంలో గబ్బి వీరన్న డ్రామా కంపెనీలో మ్యూజిక్ కంపోజర్‌గా ఉండేవారు. ఆయనతో పాటు రిహార్సల్స్‌కు వెళ్లే జిక్కీ ఆయన పెద్ద హార్మోనియాన్ని కాళ్ళతో తొక్కుతూ వాయిస్తూంటే ఎంతో అబ్బురంగా చూస్తూండేది. ఆవిధంగా పాటపట్ల ఆమెకున్న మమకారం ఇంకా వికసించింది.

మేనమామ చిట్టిబాబు నాయుడు జెమినీ స్టూడియోలో అసిస్టెంటు డైరెక్టరుగా పనిచేసేవారు. ఆయనతో పాటు స్టూడియోకు తీసుకువెళ్లి ఆరేళ్ల చిన్నారి జిక్కీ చేత పాటలు పాడించి అందరికీ వినిపించేవారు. ఒకసారి గూడవల్లి రామబ్రహ్మం అడగగా, జిక్కీ పాడి వినిపించారు. ఎంతో మెచ్చుకుని, ఆయన తీసిన 'పంతులమ్మ' చిత్రంలో వేషం ఇచ్చారాయన. జిక్కీ వయసు అప్పుడు పదేళ్ళు. అప్పట్లో నటించేవారే సినిమాలో పాడే ఆనవాయితీ. సినిమాలో పాడవచ్చు కదాని, నటనంటే ఇష్టం లేకపోయినా అంగీకరించారు. జిక్కీ 'పంతులమ్మ'గా వేసిన లక్ష్మీరాజ్యం, శిష్యురాలైన జిక్కీకి నేర్పుతున్నట్లుగా పాట... ఆమె నేర్చుకున్న పాట– "ఏ తీరని నెన్నెరిగి పలుకగా నా తరమా జగదేక కారణా..." అనే పల్లవితో సాగుతుంది. ఆ తీరుగా మొదలైన ఆమె పాట, ఆట కలిసిన నటగాయకత్వం మరికొన్ని చిత్రాల్లో కొనసాగింది. 'మంగళ సూత్రం' చిత్రంలో పల్లెటూరి అమ్మాయి పాత్రలో చిన్న పరికిణీ, చిన్న రవిక ధరించి "అందగాడె... భలే సోగ్గాడే... ఏమవుతాడమ్మ, నీ కేమవుతాడే" అని పాడుతూ, నాట్యం చేస్తూ ఆట పట్టిస్తుంది. నాయికా నాయకులిద్దరూ ఒక గ్రామం చేరి ఆ అమ్మాయిని మంచినీళ్ళు అడిగితే, ఇవ్వడానికి ముందు జరిగిన తతంగ మిదంతా, అదే సినిమాలో పిఠాపురం నాగేశ్వరరావుతో కొన్ని హాస్యగీతాలు కూడా పాడారు. తరువాత 'గొల్లభామ' చిత్రంలో కోయపిల్లగా నటించి రక్తి కట్టించారు జిక్కీ.

ఎన్.టి.ఆర్ మొదటి చిత్రం 'మనదేశం'లో సురభి బాలసరస్వతికి "మావ నందయ్య మావ అందుకో నన్నందుకో" మంటూ పాడారు. పోలీసు ఇనస్పెక్టరు వేషం వేసిన రామారావు

నుద్దేశించి, జానపద బాణీలో "నిను నేను మరువలేనురా... వాలు కన్నుల మువ్వల వెంకటస్వామి..." అంటూ పాడిన జిక్కీ వయసు కేవలం పదకొండేళ్ళు. చిత్తూరు వి. నాగయ్య నటించిన 'త్యాగయ్య'లో "రారే రారే పిల్లల్లారా... బొమ్మల పెళ్లి చేద్దా"మంటూ పెళ్లికొడుకు తల్లి వేషంలో పాడారు. ఆ తర్వాత 'వాల్మీకి' చిత్రంలోను చిన్న వేషం వేశారు.

పాడే అవకాశం కోసం మాత్రమే నటించిన జిక్కీ వయసు పెరిగాకా, (అప్పట్లో పదకొండో యేడేపెద్ద వయసు) నటనను వదిలేసి పాటకే పరిమితమయ్యారు. అయితే చెప్పుకోవలసిన ముఖ్య విషయం ఏమంటే, ఎప్పుడూ, ఎక్కడా, ఎవరి దగ్గరా సంగీతం నేర్చుకోలేదు. వినికిడి జ్ఞానంతోనే సంగీత మబ్బింది జిక్కీకి. రెండో తరగతి వరకు చదివిన జిక్కీ, తెలుగు చదవలేదు, రాయలేదు. తమిళం అంతంత మాత్రంగా చదివినా, రాయలేదు. అందువల్ల ఆమె పాట రాసుకుని పాడేవారు కాదు. ఒక్కసారి పాటవింటే మరి మరిచిపోయేవారు కాదు జిక్కీ.

ప్రసిద్ధ నేపథ్య గాయకుడు ఎ.ఎం. రాజా జిక్కీని ఇష్టపడి ప్రేమించి వివాహమాడారు. 1958లో వారి వివాహం మద్రాసులో జరిగింది. నిజంగా ప్రేమికులు... దంపతులు అయిన ఈ జంట పాడిన యుగళగీతాలు శ్రోతల నెందరినో అలరించాయి. మిస్సమ్మ, పెళ్ళికానుక చిత్రాలోని పాటలన్నీ హిట్టయ్యాయి. అప్పట్నించీ చిత్రసీమలో వీరిద్దరినీ 'హిట్ పెయిర్'గా పిలిచేవారు. ఈ హిట్ పెయిర్‌కి ఆరుగురు సంతానం –నలుగురాడ, ఇద్దరు మగపిల్లలు.

పదహారేళ్ల ప్రాయం వచ్చేసరికి జిక్కీ స్వరం యౌవన శోభతో వెండి తెరకు పసిడి జిలుగులు అద్దింది. రాజ్‌కపూర్ హిందీ చిత్రం 'ఆహ్'కు అనువాద చిత్రమైన 'ప్రేమలేఖలు'లో తమిళాంధ్ర భాషలు రెంటిలోను పాడి, 'దక్షిణాది లతామంగేష్కర్'గా పేరు తెచ్చుకున్నారు జిక్కీ. ఆహ్‌లో లత కన్నా జిక్కీయే బాగా పాడిందని చిత్రసీమలో అనుకున్నా రప్పట్లో. జిక్కీ గొంతులో 'ఘల్లు ఘల్లు ఘల్లు గజ్జెల సంగీతం' మ్రోగింది. మరపు రాని ఆమె పాటలు – ఏకాంతము... సాయంత్రమూ', 'నీపేరు విన్నా... నీరూపు కన్నా', ఓ దేవదా చదువూ యిదేనా', 'కం కం కం కంగారు నీకేలనే', 'ఓహెూ బస్తీ దొరసానీ', పడుచుదనం రైలు బండి పోతోంది', 'చిలుకా గోరింక కులుకే పకాపకా', 'అందాల సీమలో చందమామ' వంటివెన్నో. నేటికీ పెళ్లి పందిళ్లలోను, వీడియో క్యాసెట్లలోను వినబడే 'పందిట్లో పెళ్లవుతున్నది... కనువిందవుతున్నది', అనార్కలి' చిత్రంలోని 'రాజశేఖరా నీపై మోజు తీరలేదురా', 'జీవితమే సఫలమూ... రాగ సుధాభరితమూ' పాటలు సంగీత రస ప్రవాహాలు. ఇక జానపదం



వెల్లివిరిసిన 'ఏరువాకా సాగాలోయ్ రన్నో చిన్నన్నా', టౌను పక్క కళ్ళొద్దురో డింగరీ', 'రావోయి మా యింటికీ, ఓ మావా మాటున్నది... మంచి మాటున్నది', 'ఛాంగురే బంగారు రాజా' వంటి పాటలు ఎప్పటికీ గిలిగింతలు పెడతాయి.

ఎంతో వైవిధ్యంతో తమిళాంధ్ర, కన్నడ మళయాళ, హిందీ సింహళ భాషల్లో పదివేల పాటలు పైగా పాడారు జిక్కీ. 'మిస్టర్ సంపత్' హిందీ చిత్రంలో రెండు పాటలు పాడారు. గులేబకావళి తమిళచిత్రంలోను, హిందీ డబ్బింగ్ చిత్రాల్లో తలత్ మహమ్మద్‌తో కలిసి పాడారు 'మొగల్ ఏ ఆజమ్' తమిళ చిత్రంలో మధుబాలకు నౌషద్ సంగీతంలో పాడారు. సుమారుగా రెండు వందల గ్రామఫోను రికార్డులు, తెలుగు తమిళాల్లో క్రిస్టియన్ పాటలు ప్రైవేటుగా రికార్డయ్యాయి.

జిక్కీ ఇష్టాలకు, కష్టాలకు వస్తే– సితార అంటే ప్రాణం. ఎం.ఎస్. సుబ్బలక్ష్మి, జి.ఎస్.బీలు ఆమెకు ఆరాధ్య గాయకులు. ప్లేబాక్ విషయానికొస్తే, భర్త ఏ.ఎం. రాజా, మహ్మద్ రఫీ, ఘంటసాల, సుశీల, జానకిల పాటలంటే బాగా ఇష్టం. తాను పాడిన పాటల్లో 'అన్న ఈ ఇష్టమైనవే' అయినా, రాజశేఖరా, జీవితమే సఫలమూ, ఏరువకాక సాగాలోయ్ పాటలు మరీ ఇష్టమంటారు. ఏ.ఎం.రాజా సంగీత దర్శకత్వంలో 'పెళ్లికానుక' చిత్రంలో పాడిన 'పులకించని మది పులకించు... వినిపించని కథ వినిపించు' పాటంటే మరీ మరీ ఇష్టమంటారు. అన్ని పాటలూ ఎంతో అలవోకగా, సునాయాసంగానే పాడిన జిక్కీ, 'సువర్ణ సుందరి'లో ఘంటసాలతో కలిసి పాడిన 'హాయి హాయిగా ఆమని సాగే' అన్న పాట తనను కొంతకష్ట పెట్టిందంటారు. గురువు లేకుండా సంగీతం నేర్చుకున్న ఆమె ఆ పాటను ఆరు రాగాల్లో పాడానని గర్వంగా చెబుతారు.



పుణికి పుచ్చుకుని బాగా పాడేవారే అయినా, తండ్రి ఏ.ఎం. రాజా ఎందుకనో ఆయన్ను చిత్రరంగంలోకి తీసుకురావడానికి ఇష్టపడలేదు.

2001లో కాన్సర్ రోగ గ్రస్తులయ్యారు జిక్కీ. అయితే మొదటి దశలోనే గుర్తించబట్టి సరిపోయింది. మద్రాసు అపోలోలో జరిగిన శస్త్ర చికిత్సకు అవసరమైన మూడు లక్షల్లో రెండు లక్షలు అప్పటి ముఖ్యమంత్రి నారా చంద్రబాబు నాయుడు, మిగిలిన లక్ష తమిళనాడు ముఖ్యమంత్రిణి జయలలిత మంజూరు చేసి సర్దుబాటు చేయబట్టి అప్పుడు బ్రతికి బట్ట కట్టగలిగారు జిక్కీ.

**'ఆదిత్య 369'లో ఆమె పాడిన 'జాణవులే... వర వీణవులే' అన్న పాట ఎంతో హిట్టయింది. అలనాటి ఆమె గొంతును నేటి తరాలు ఆశ్చర్యంతో వింటే, పాత తరాల వారు తమ తీపి జ్ఞాపకాలను కలబోసుకున్నారు.**

తన సంపాదనంతా పుట్టింటికి వదిలేసి, కట్టు బట్టలతో జీవితం పంచుకోడానికి రాజాతో చేరిన జిక్కీ, భర్తతో కలిసి వందలకొద్దీ కచేరీలు చేశారు. హఠాత్తుగా రైలు ప్రమాదంలో భర్తమరణిస్తే, ఆమెకు కలిగిన కష్టం అంతా ఇంతా కాదు. ఎన్నో కచేరీలకు ఒప్పందం కుదుర్చుకున్న నిర్వాహకులు రాజా మరణంతో తీసుకున్న అడ్వాన్సుల వాపసు చేయవలసిందిగా ఎంతో ఒత్తిడి తెచ్చారు. వారి కెలాగో నచ్చజెప్పి, ఒక సంవత్సరం తర్వాత పిల్లలతో కలిసి ఆ కార్యక్రమాలన్నింటినీ విజయవంతం చేశారు జిక్కీ.

ఇద్దరబ్బాయిలూ కచేరీలో జిక్కీతో పాటు పాల్గొన్నారు. పెద్దబ్బాయి చంద్రశేఖర్, ఏ.ఎం. రాజా స్థానంలో ఆయన పాటలు పాడుతారు. అడ్వకేట్ అయిన ఆయన 'పెళ్లంటే నూరేళ్లపంట', 'పోలీస్ లాకప్' చిత్రాల్లో ప్లేబాక్ పాడారు. చిన్నబ్బాయి మహేష్ తర్వాత కూడా జిక్కీతో పాటు బయట ప్రోగ్రాముల్లో పాల్గొన్నారు. లండన్, దుబాయి మలేసియా, సిలోన్, అమెరికాల్లో తమ వారసత్వాన్ని

'ఆదిత్య 369'లో ఆమె పాడిన 'జాణవులే... వర వీణవులే' అన్న పాట ఎంతో హిట్టయింది. అలనాటి ఆమె గొంతును నేటి తరాలు ఆశ్చర్యంతో వింటే, పాత తరాల వారు తమ తీపి జ్ఞాపకాలను కలబోసుకున్నారు. సీతారామయ్యగారి మనవరాలు, జీవనచదరంగం, ఆరోప్రాణం, నిన్నే పెళ్ళాడుతా, ఆహ్వానం, అమ్మకొడుకు చిత్రాల్లో మళ్ళీ పాడి ఔననిపించుకున్నారు. జిక్కీ అవకాశమిస్తే ఎప్పటికీ పాడగలనని నిరూపించుకున్నారు.

సినీ సంగీత రంగంలోని సేవలకుగాను జిక్కీకి తమిళనాడు ప్రభుత్వం 'కళైమామని' బహుమతి ప్రధానం చేసింది. తరువాత 'భారత దాసన్' స్టేట్ అవార్డు కూడా పొందారామె. 'తానా' ప్రత్యేకాహ్వానంపై అమెరికా వెళ్ళి, పద్దెనిమిది ప్రోగ్రాములిచ్చారు.

జిక్కీ గొంతులో ఒక ప్రత్యేకత ఉంది. స్వరం మధ్య మధ్య నొక్కబడుతూ, ఒక్కసారిగా తీవ్ర శ్రుతిలోకి వస్తుంది. అందువల్ల పాట నడకలో ఒక విధమైన లయ దానంతట అదే వస్తుంది. ఆ గానలయ సాహిత్యపు లయతో జత కూర్చుకుని గమ్మత్తైన హాయిని వీనుల కందిస్తుంది. హెచ్చుస్థాయిలో సైతం అవలీలగా పాడగలిగిన గొప్ప గాత్రం ఆమె అదృష్టం.

ఏమైనా జిక్కీ 'జీవితమే సఫలము... రాగ సుధాభరితము', ఆమె పాటను ప్రేమించగలగడం మధురం, మధురం!

# తెలుగు పత్రికలు - సంపాదకులు

పుస్తకాలు, పత్రికలు లేని ప్రపంచాన్ని నేడు ఊహించుకోలేం. ఈ ప్రపంచంలో పుస్తకం ఓ అద్భుతం. ఎందరెందరో భాషాభిమానం, దేశాభిమానం, సమాజశ్రేయస్సు, ఉద్యమస్ఫూర్తితో పత్రికలు స్థాపించి పాఠకులకు అందుబాటులోకి తెస్తున్నారు. లెక్కకు మిక్కిలిగా వెలువడుతున్న పత్రికలలో చిరకాలం నడిచేవి-పాఠకాభిమానం పొందేవి కొన్నే. పత్రికలను పాఠకాభిమానం పొందేలా సారథ్యం వహించేవాడు సంపాదకుడు. అలాంటి సంపాదకులను 64కళలు.కామ్‌లో నెల-నెలా పరిచయం చేసే శీర్షికే తెలుగుపత్రికలు-సంపాదకులు.

తెలుగులో ఆధ్యాత్మిక పత్రికలు బహు తక్కువ. సమాజానికి ఉపయోగపడే హిందూ ధర్మాలను, మన సంస్కృతీ సంప్రదాయాలను తెలియజేస్తూ పాఠకులను సన్మార్గంలో నడిపించే ఉద్దేశ్యంతో ప్రారంభించిన భక్తి పత్రిక 'వసుధ' ఆధ్యాత్మిక మాసపత్రిక గత నాలుగు సంవత్సరాలుగా వ్యవస్థాపక-సంపాదకులుగా పత్రికకు సారథ్యం వహిస్తున్న వాసిరాజు రంగారావుగారి మనోభావాలు... వారి మాటల్లో...



వాసిరాజు రంగారావు

● వసుధ ఆధ్యాత్మిక మాసపత్రికను ఎప్పుడు స్థాపించారు?

ఏప్రిల్ 2007 సం॥లో ప్రారంభించాం.

● స్థాపన ముఖ్యోద్దేశం?

సంక్లిష్టమైన ఆధ్యాత్మిక అంశాలను సరళంగా పాఠకులకు అందివ్వటం-

పాఠకులలో భక్తి చింతనను పెంపొందించటం-

భారతీయ సనాతన ధర్మం ప్రజలలో ఒక అవగాహన కలిగించటం-

'వసుధ' ఉన్న ఇంట వరాలపంట' కావాలి- అన్నదే లక్ష్యం.

● పత్రికలో ప్రచురించే విషయాలు, శీర్షికలు గురించి తెలియజేస్తారా?

ప్రస్తుతం ప్రచురితమవుతున్న ధారావాహికలు...

1. శ్రీమద్రామయణం (రచయిత- వాసిరాజు రంగారావు)
2. శివపురాణం (డా. టి.వి.ఎ.ఎస్. శర్మ)
3. శ్రీలలితోపాఖ్యానము (శ్రీ కప్పగంతు సుబ్బరామ సోమయాజులు)
4. శ్రీ వెంకటేశ్వర అష్టోత్తర శతనామ కథామృతం ( శ్రీపరాశరం వేంకటరమణాచార్యులు)



2007 వసుధ ఆవిష్కరణోత్సవ సభ

ఇదివరలో ప్రచురితమైనవి

1. శ్రీ శివరామకృష్ణ మారుతీదత్తరూప సద్గురుసాయినాధ చరిత్ర

2. ఆముక్తమాల్యద (శ్రీకృష్ణదేవరాయులవారి ప్రౌఢ కావ్యానికి సరళ వచనానువాదం-రచన డా॥ కాసల నాగభూషణం)

3. శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరంగరామానుజ జీయర్ స్వామి వారు అనుగ్రహించిన రండి! మన జీవిత లక్ష్యం ఆవిష్కరించుకుందాం? (వేదాలు, ఆధునిక సైన్సు మేళవించి అందించిన ఉపన్యాస వ్యాస ధారావాహిక)

4. తిరుపతి కాలినడక ద్వియచరిత్ర (రచన: శ్రీతిమ్మరాజు విశ్వపతి రామకృష్ణమూర్తి గారు)

5. శ్రీ వెంకటేశ్వర వైభవం (రచన: శ్రీ తిమ్మరాజు విశ్వపతి రామకృష్ణమూర్తిగారు)

6. మానస సరోవర యాత్ర (రచన: ధర్మపురుష యాబలూరి లోకనాధ శర్మ)



7. యాత్రానుభూతి: (పశ్చిమ ఉత్తర దేశ యాత్రలు చేసిన శ్రీమతి గిరిజాకృష్ణగారి ఆధ్యాత్మిక అనుభవాలు)

శీర్షికలు:

ప్రతినెల రెండు మూడు ఆయా మాసాల్లోని పండుగల గురించి ప్రత్యేక వ్యాసాలు-

రెండు మూడు ఆలయాలు, క్షేత్రములు.

సవివరంగా అర్ధతాత్పర్యములతో స్తోత్రములు-ధర్మసందేహాలు-

రెండు మూడు ఆధ్మాత్మిక కథలు.

ప్రతినెల ఒక అన్నమయ్య సంకీర్తన (వ్యాఖ్యానము- వెంకట్ గరికపాటి)

ఆయుర్వేదం గురించి డా॥ నిష్టేశ్వర్ గారి రచన. గ్రంథసమీక్షల శీర్షికలో ప్రతినెలా ఆధ్యాత్మిక గ్రంథాల పరిచయం.

● వసుధ పత్రికపై ప్రముఖుల స్పందన...

వసు అంటే బంగారం- ధ అంటే ధరించినది- బంగారాన్ని ధరించిన పత్రిక వసుధ- డా॥ సి.నా.రె. (విశిష్ట పురస్కార ప్రదానోత్సవ సభలో)

ఆధ్యాత్మిక వ్యాప్తికి కృషి చేస్తున్న అద్భుతమైన మాసపత్రిక-

ధర్మపురుష శ్రీ విద్యోపాసకులు శ్రీయాబలూరి లోకనాధశర్మ (2009 నవరాత్రి ప్రత్యేక సంచిక ఆవిష్కరణోత్సవ సభలో) ప్రజలను సన్మార్గంలో నడిపించటానికి వసుధ వంటి పత్రికల ఆవశ్యకత ఎంతైనా వుంది- మల్లాది విష్ణు ఎం.ఎల్.ఎ (2007 వసుధ ఆవిష్కరణోత్సవ సభలో)

# పగటి వేషాలు- సామాజిక అంశాలు

## పిట్టలదొర వేషం

రచన
ప్రముఖ నటుడు, చిత్రకారుడు
తాతా రమేశ్‌బాబు
email: rbtata60@gmail.com

పగటి కలలు కనొద్దు అంటారు
పగటి వేషాలు వెయ్యొద్దు అని కూడా అంటారు.
వేషం అంటే మారు రూపం



## పిట్టలదొర వేషం

"ఒరేయ్, మా తాతకి మునుగీత బాగా వచ్చు. ఒక సారి నీళ్లలో మునిగి గంటదాకా బయటకు రాలేదు".

"ఓస్ ఇంతేనా! మా తాత నీళ్లలో మునిగి ఈత కొట్టడంలో బంగారు పతకం పొందాడు. నీళ్లలో మునిగితే ఆరు గంటల దాక బయటకు రాకుండా ఉండగలడు తెలుసా"?

# పేరులో నేముంది?!

- అమ్మిన శ్రీనివాసరాజు

మనిషిని, జంతువును వేరు చేసేది భాష. అంతటి గొప్ప భావ వ్యక్తీకరణ శక్తిగల మానవునికున్న మరో ప్రత్యేకత "పేరు" సాధారణంగా మానవులకు పేర్లు మొదట స్వభావాన్ని బట్టి ఏర్పాటు చేసినా ఆ పిదప కృతజ్ఞతకు. అభిమానాలకు చిహ్నాలుగా పేర్లు పెట్టుకోవడం సరిపాటి అయ్యింది. క్రమేణా అసలు పేర్లకు, మనుషులకు సంబంధం లేకుండాపోతుంది.

ఏది ఏమైనా పేరుకు మనిషికి సంబంధం లేకుండా వుండదు అదో అవినాభావ సంబంధం. నేటి సమాజంలో కొందరు పేరున్న ప్రముఖులు అసలు పేరు కన్నా కొసరు పేరుతోనే ప్రాచుర్యంలో వున్నారు. అసలు పేరుతో సంబోధిస్తే వారెవరు అనే ప్రమాదం వుంది.

అందుకే 'అరవైనాలుగు కళలు' అంతర్జాల మాసపత్రిక వీక్షక పాఠకుల కోసం ప్రతి మాసం కొందరు ప్రముఖుల అసలు పేర్లు పరిచయం చేయడమే ఈ ప్రయత్న నేపథ్యం...

| ప్రాచూర్యపు పేరు | అసలుపేరు | రంగం |
|---|---|---|
| సోనియాగాంధీ | | |
| | | |
| | | |
| | | |
| | | |
| | | |











'మా తెలుగుతల్లికి మల్లెపూదండ' గీతరచయిత

# శంకరంబాడి సుందరాచారి

తెలుగుతల్లికి మల్లెపూదండ వేసి మంగళారతులిచ్చి, తెలుగుజాతి తెలుగు భాష ఔన్నత్యం చరిత్ర, సంస్కృతి పూర్వ వైభవాలను గురించి ఎంతో ఉత్తేజంతో తన గేయంలో చాటిచెప్పి ఆ తల్లి పాటలు పాడి, ఆటలే ఆడుదామని కమ్మనైన తేనెకన్న తియ్యనైన రాష్ట్రగీతాన్ని మనకు అందించారు శంకరంబాడి సుందరాచారి.


శంకరంబాడి సుందరాచారి

- పరుచూరి శ్రీనివాసరావు

# రసమయభాష – మన తెలుగు భాష

'అ'మ్మ–'ఆ'వు –'ఇ'ల్లు– 'ఈ'శ్వరుడు– 'ఉ'గ్గు– 'ఊ'యల...

అంటూ తెలుగుభాషను ఉగ్గుపాలలో రంగరించి

తెలుగుభాషను మన శ్వాసలో ఊదేస్తుంది మన ప్రతీ తెలుగుతల్లి

'గూటి'నుండి 'కాటి' వరకూ మనకడ 'కడ'వరకూ

తోడుండేటి తల్లి... మన తెలుగుతల్లి

తల్లికట్టిన 'చద్దిమూట' తింటేనే... తెలుగువాడి కడుపునిండేది

తల్లినేర్పిన 'తెలుగేమాట' వింటేనే వీడి మనసునిండేది.

నోరు తియ్యబడాలంటే అందరిలా కాదు...

ఆంధ్రుడికి పటిక బెల్లం పంచదార పలుకుల 'చప్పరించ' పనిలేదు

రెండు తెలుగు పలుకులు 'చప్పరించి'నా చాలు! నోరు తీయనవుతుంది.

తెలుగుపద్యమే తెలుగుజాతి నేపధ్యం– పద్యం తెలుగుతల్లికి ఇష్టమైన నైవేద్యం

తొల్లి మన తెలుగుతల్లి నన్నయాదులకు పూర్వమే అపూర్వ వైభవాన్ని గన్నతల్లి

'కవిత్రయాన్ని' కన్నతల్లి మన తెలుగుతల్లి, అష్టదిగ్గజాలను ఆశీర్వదించిన తల్లి

క్షేత్రయ్య, త్యాగయ్య, అన్నమయ్య, రామదాసులకు పదాలు, పద్యాలు, పాటలు నేర్పిన తల్లి తెలుగుతల్లి

వే'మన'కు తేటతెలుగు 'పద్యమై'... చిన్నయ్యకు అచ్చతెలుగు 'గద్య'మై

విశ్వనాధునికి... వేయిపడగలై వెలసిల్లినది తెలుగుతల్లి

చదువుల రాణి 'వాణి' చేతి వీణలోని

'బంగారు తీగ' మన తెలుగుతల్లి!

భాషల సాగర మధనంలో ఉద్భవించిన

'అమృతభాండం' మన తెలుగుతల్లి

ఏ'యాస'లో విన్నా బాగుండెడి భాష తెలుగుభాష

ఏ చోటనున్నా వెలుగొందెడి భాష మన తెలుగు'తల్లి భాష

'రసాయన'మయ భాష ఆంగ్లభాష – ఇది మనలను మాయం చేయు భాష

అస్తమానం ఈ ఆంగ్లభాష తెలుగుతల్లికి తలవంపుల భాష

అందరికీ అందుబాటులో వుండు భాష తెలుగుభాష

తెలుగు రైతన్నలభాష

తెలుగు కవి'తల'భాష, 'కవితల'భాష –పల్లె వనితల భాష

మనసున్న భాష మన భాష

తెలుగుతల్లికి శ్రీశ్రీ ఆకలిమంటలు తెలుసు

వేటూరి వలపు పంటలూ తెలుసు

ఆత్రేయ మనసు తెలుసు– సినీ సిరివెన్నెలలు తెలుసు

కృష్ణశాస్త్రి 'సొగసు' తెలుసు

రోకటి పాట తెలుసు–జానపదం తెలుసు

జ్ఞానపదం తెలుసు– ఇంకా ఎన్నో తెలుసు

అయినా నేడు మన తెలుగువారందరికీ

ఆంగ్లమోజులోపడి తెలుగుతల్లి బాగా 'అలుసు'

తెలుగుభాష నేడు అందరికీ కంట్లో నలుసు

ఆంధ్రుల అజ్ఞానానికి తెలుగుతల్లి నేడు ఎంత బాధపడుతుందో ఎవరికి తెలుసు?

కనుకనే తన సొంతబిడ్డలున్న ఆంధ్రగడ్డపై

తన సొంత ఇంట్లోనే ఛీదరింపులు, నిరాదరణలు తాళలేక

నివాసాంధ్రులను వీడి...తనను ఆదరించిన

అభిమానిస్తున్న ప్రవాసాంధ్రుల పంచ "తానా"లో

తన తల దాచుకుంటున్నది... ఇలానే మనం మన తెలుగుతల్లిని వదిలేస్తే...

ఆ తల్లి మనకు శాశ్వతంగా దూరం అవుతుంది

మరలిరా మాయమ్మా– మా తెలుగుతల్లీ

ఆదరింతుము ఆంధ్రులము నిన్ను అనునిత్యము ప్రణమిల్లి... అని

ప్రతి తెలుగువాడు తెలుగుతల్లిని బ్రతిమాలి బామాలి తోడుకొని రావాలి

తెలుగుతల్లిని కాదన్నవాడు తెలుగువాడు కాదు... వాడు 'తెల్ల'వాడు

సేద్యంచేసి కడుపునింపుకొనేవాడు

పద్యంపాడి మనసు నింపుకునేవాడు అసలైన ఆంధ్రుడు!

– బి.యం.పి.సింగ్

ప్రొఫైల్

# సినిమా పోస్టర్ బతికే ఉంటుంది


ఈశ్వర్

బంగారపు పళ్లానికైనా గోడ చేర్పు అవసరమన్నట్లు... ఎంత గొప్ప వస్తువుకైనా మార్కెట్‌లో ప్రచారం అవసరం. సినీ రంగానికి ఆయువుపట్టులాంటి పబ్లిసిటీలో వాల్‌పోస్టర్‌దే ప్రధానపాత్ర. మాస్ ప్రేక్షకులను ఆకర్షించేది వాల్‌పోస్టర్లే. ఈ పోస్టర్ల రూపకల్పనలో ప్రత్యేక ఒరవడిని సృష్టించిన నాలుగున్నర దశాబ్ధాల అనుభవశాలి పబ్లిసిటీ డిజైనర్ కొసన ఈశ్వర్. పబ్లిసిటీ రంగంలో ఆయనో శిఖరాగ్రం. కంప్యూటర్ మేజిక్కులు.. గ్రాఫిక్ జిమ్మిక్కులు లేని ఆరోజుల్లో సినీపబ్లిసిటీ రంగంపై చెరగని సంతకం ఈశ్వర్. ఇటీవల జరిగిన సన్మాన సభలో పాల్గొనడానికి విజయవాడ విచ్చేసిన వారితో ప్రత్యేక ఇంటర్వ్యూ...

మీ సొంత ఊరు... ఏం చదువుకున్నారు?

సొంతూరు పశ్చిమగోదావరి జిల్లా పాలకొల్లులో ఎస్‌ఎస్‌సీ చదివి కాకినాడ ఆంధ్రా పాలిటెక్నిక్‌లో మూడేళ్ల ఎలక్ట్రికల్ ఇంజనీర్ డిప్లొమో కోర్సులో చేరాను. కానీ ఫైనలియర్ పరీక్షలకు 25 రోజుల ముందు అమ్మ చనిపోయింది. పరీక్షలు తర్వాత రాస్తానంటే ప్రిన్సిపాల్ ఒప్పుకోలేదు. మళ్లీ మొదట్నుంచి చదవాలన్నారు. మరో మూడేళ్లు చదివే ఆర్థిక స్తోమత లేక ఆపేశాను.

సినీ రంగానికి ఎలా వచ్చారు?

మానాన్న బుచ్చియాచార్య శిల్పి. మా ఆరుగురు అన్నదమ్ముల్లో ఆయన విద్య కాస్త నాకు అబ్బింది. బొమ్మలు బాగా వేసేవాడిని. 1960లో మద్రాస్ వెళ్లిపోయి, రెండేళ్లు నానా కష్టాలూ పడ్డాను. మా ఊరికి దగ్గర వాడైన ఆర్టిస్ట్ కేతాను కలిసి నాన్న పేరు చెప్పాను. తన దగ్గరే ఉండిపొమ్మన్నారు. ఐదేళ్లు ఆయనదగ్గర పనచేశాను.










ఈశ్వర్ కుంచె నుంచి రూపుదిద్దుకున్న పోస్టర్లు

పబ్లిసిటీ డిజైనర్ గా మీ మొదటి సినిమా ?

ఈశ్వర్: బాపు 1967లో 'సాక్షి' చిత్రం కోసం నన్ను పబ్లిసిటీ డిజైనర్‌గా పిలిపించారు. ఆయనకూ, నాకూ అదే మొదటి చిత్రం. చిత్రకారుడైన బాపు నాకు అవకాశం ఇవ్వడంతో కష్టపడి డిజైన్లు చేశాను. చిన్న చిన్న కరెక్షన్లతో బాపు వాటిని ఓకే చేశారు.

ఆ తరువాత...అవకాశాలు ఎలా వచ్చాయి ?

ఆ డిజైన్లు ఆసియాలోనే అతి పెద్దదైన నాగిరెడ్డి (ప్రముఖనిర్మాత) ప్రసాద్ పోస్టర్స్ ప్రెస్‌కు వెళ్లాయి. అవి చూసి 'రామ్ ఔర్‌శ్యామ్' హిందీ చిత్ర నిర్మాతలు నాకు కబురు చేశారు. దిలీప్‌కుమార్, వహీదా రెహ్మాన్ ఫొటోలు తీసుకుని రెండోరోజు డిజైన్లు చేసిచ్చాను. అదే నా సినీ ప్రస్థానంలో టర్నింగ్ పాయింట్.

మీకు లభించిన ప్రోత్సాహం...?

నా పనితనం నచ్చిన ప్రసాద్ పోస్టర్స్ వారే నన్ను జెమిని, ఏవీఎం, భరణీ వంటి నిర్మాణ సంస్థలకు, బొంబాయిలోని పెద్ద కంపెనీలకు రికమెండ్ చేశారు. రెండు మూడేళ్లల్లో దాదాపు అన్ని ప్రముఖ సినిమా కంపెనీలకు పబ్లిసిటీ డిజైనర్ అయ్యా.

ఎన్ని భాషలలో, ఎన్ని చిత్రాలకు చేశారు?

తెలుగు, తమిళ, కన్నడ, మలయాళ, హిందీ, ఒరియ, బెంగాలీ, అసోం భాషలలో 2000 సంవత్సరం వరకు 2,500 చిత్రాలకు డిజైనర్‌గా చేశాను. ఇదొక రికార్డు. ఇప్పట్లో బ్రేక్ కాకపోవచ్చు.

ఈ రంగంలో మీరు చూసిన మార్పులేంటి?

ఈశ్వర్: పూర్వం సినిమా ఆర్ట్ డైరెక్టరే రెండు మూడు డిజైన్లు చేసేవారు. తర్వాత దానికి ఓ ప్రత్యేక విభాగం ఏర్పడింది. అయినా ఒక్కో భాషకు ఒకరిద్దరు ఉండేవారు. కంప్యూటర్ పరిజ్ఞానం వచ్చాక 40 మంది దాకా ఉన్నారు. అన్ని భాషలలో చేసింది నేను, గంగాధర్ మాత్రమే. ఇపుడు ప్రొడక్షన్ ఆఫీస్‌లో బాయ్, అసిస్టెంట్ డైరక్టర్లు కూడా ఫొటోషాపిలో డిజైన్లు చేసేస్తున్నారు.



శివాజీగణేశన్ నుండి అవార్డు అందుకుంటూ

రేఖా చిత్రాలతో పోస్టర్ డిజైన్




యన్టీఆర్



ఈశ్వర్.: నాకు ఇద్దరమ్మాయిలు, ఇద్దరబ్బాయిలు. ఆడపిల్లలిద్దరూ అమెరికాలో ఉంటున్నారు. పెద్దబ్బాయి విజయకుమార్ మద్రాస్‌లోనే తమిళ చిత్రాలకు డిజైనర్‌గా చేస్తున్నాడు. చిన్నబ్బాయి శశికుమార్ మద్రాస్‌లోనే సాఫ్ట్‌వేర్ ఇంజినీర్.

**నటీ నటులతో మీ అనుబంధం ఎలా ఉండేది?**

ఎన్టీఆర్, ఏఎన్నార్, కృష్ణ, భానుమతి, అంజలి, సావిత్రి, షావుకారు జానకి వంటి ప్రముఖుల చిత్రాల్లో ఎక్కువ భాగం నేనే చేశాను. శోభన్‌బాబు అయితే తన అగ్రిమెంట్ సమయంలో నా పేరు కూడా దాన్లో రాసేవారు.

**పోస్టర్ సినిమా విజయానికి ఎంత వరకు ఉపయోగపడతాయి?**

ప్రేక్షకుడిని థియేటర్ దగ్గరకు తీసుకెళ్లేది పోస్టరే. ఊగిసలాడే సినిమాలను నిలబెట్టేది పోస్టరే. పోస్టర్ ఇంకా బతికే ఉంది. బతికే ఉంటుంది కూడా.

**విజయవాడ నగరంతో మీ అనుబంధం...**

చాలా ఉంది. డిస్ట్రిబ్యూటర్లు సినిమాలకు ఫైనాన్స్ చేసే రోజుల్లో అందరూ పబ్లిసిటీ డిజైనర్‌గా నా పేరే చెప్పేవారు. వారితో ఆత్మీయత బాగా పెరిగి తరచూ ఇక్కడికి వచ్చేవాడిని. సొంత మనిషిలా చూసుకునేవారు. హైదరాబాద్‌లో మనుషులన్నా ఆత్మీయత లేదు.

**మీకు వృత్తిలో మిగిలిన గొప్ప అనుభూతి...?**

తమిళులకు ఆరాధ్యదైవమైన అన్నాదురై చిత్రానికి మాజీ ముఖ్యమంత్రి కరుణానిధి నాతో చేయించటం. ఆ సందర్భంగా అప్పటి ప్రధాని ఇందిరాగాంధీ నన్ను సత్కరించి తమిళంలో సంతకం చేసిన ప్రశంసాపత్రాన్ని ఇచ్చారు. అలాగే నేను ఒక సినిమాకి గీసిన చిత్రాన్ని ప్రముఖ నటుడు శివాజీ గణేశన్ తన ఇంట్లో పెట్టుకున్నారు.

**ఇప్పుడు మీరేం చేస్తున్నారు?**

చెన్నైలో నా 50 ఏళ్ల సినీ ప్రస్థానంలోని అనుభవాలను 'సినిమా పోస్టర్' పేరుతో పుస్తకం రాస్తున్నాను. దానిలో పోస్టర్ పుట్టు పూర్వోత్తరాలు, పబ్లిసిటీ డిజైనర్ల జీవిత చరిత్రలు కూడా ఉంటాయి. కొన్ని పేజీలు నా వర్క్‌తో 'ఆర్ట్‌గ్యాలరీ'కి కేటాయించాను. విజయ పబ్లికేషన్స్ విశ్వనాథరెడ్డి ప్రచురిస్తున్న ఈ పుస్తకాన్ని ఆగస్ట్, సెప్టెంబర్‌లో దర్శక, నిర్మాత దాసరి నారాయణరావు హైదరాబాద్‌లో ఆవిష్కరిస్తారు.

64 కళలు.కామ్
www.64kalalu.com
సకల కళల సమాహారం

సంపుటి :1 సంచిక :10 ఆగస్ట్ 2011



## నివాళి

సుమధుర కళానికేతన్, విజయవాడ వారు 64కళలుడాట్‌కాం మీడియా పార్టనర్‌గా నిర్వహించిన కార్టూన్ పోటీలకు అనూహ్య స్పందన వచ్చింది. విజేతలను ప్రకటించడం, బహుమతులు అందజేయడం జరిగింది.

64కళలుడాట్‌కాం పత్రిక ప్రతీనెలా 1 మరియు 2 తేదీలలో అప్‌డేట్ చేస్తున్నాం, పాఠకులు గమనించగలరు. ఈ నెలలో విజయవాడలో జరగబోయే ప్రపంచ తెలుగు రచయితల మహాసభల విశేషాలు కూడా తెలియజేస్తాం.

పత్రికలో వ్యాసాలు బాగున్నాయని అభిమానంతో ఇ-మెయిల్స్ ద్వారా అభిప్రాయాలు తెలియజేస్తున్న పాఠక, కళాభిమానులకు కృతజ్ఞతాభివందనాలతో...

కళాసాగర్
ఎడిటర్

ముఖచిత్రం చిత్రకారుడు : ఎల్లా సుబ్బారావు



నటరాజ రామకృష్ణ..
నీరాజనం లో...



యువ కళామర్మజ్ఞుడు - రాఫేల్
కళాప్రపంచం లో....

ఈ సంచిక లోని రచనల్లో ఆయా రచయితలు వెలిబుచ్చిన భావాలు వారి సొంత భావాలు మాత్రమే

# యువ కళామర్మజ్ఞుడు - రాఫేల్



సాంస్కృతిక పునరుజ్జీవన కాలపు చిత్రకారులలో రాఫేల్ ప్రముఖుడు. ఇతని చిత్రాలలో స్వచ్ఛత, సరళత, సౌమ్యత కనిపిస్తాయి. చిత్రాలలో స్వేచ్ఛారాగాలు వినిపిస్తాయి. చిత్రంలోని పాత్రల సరళత, సున్నితత్వం, కాంతిమయ పరిసరాలలో చల్లని కాంతివలే కనిపిస్తాయి. ఇదొక విధాన పారదర్శకత అనవచ్చు. చిత్రంలోని వ్యక్తుల వదనాలలోనే కాక అంతర్గత మనస్సులలోను, వారిచుట్టూ ఆవరించిన భౌతిక వస్తు సముదాయంలో కూడా పారదర్శకతను చూడవచ్చు.

ఎల్.ఆర్. వెంకటరమణ

చిత్రంలో ఏ భాగంలో ఎంతరంగు, ఎంత మోతాదులో వాడితే కాంతి, చలనం వస్తుందో దానిని "టోనల్ వాల్యూ" అంటారు. ఈ విధానానికి ఆధ్యుడు రాఫేల్. ఇతని చిత్రాలలో వర్ణమిశ్రమం కానీ, వర్ణ సంకరణం కానీ, వర్ణ వైచిత్రి కానీ చిత్రానికే వన్నె తెస్తాయి. వర్ణానికి క్రమశీలత చిత్రాలలో చూపుతాడు. చీకటి వెలుగుల



సమ్మిళితంతో ఒక కాంతి పుంజం ఆవిష్కరించి, నాటకీయతను ప్రదర్శిస్తుంది. వెలుగు, నీడలను అప్పటి వరకు గల చిత్రకారులు "లోతు" చూపడానికి వాడుకున్నారు. కానీ దీన్ని భావాల అభివ్యక్తికి కూడా రాఫేల్ వినియోగించగలిగాడు. రాఫేల్ చిత్రాల యొక్క సౌకుమార్యం, వర్ణవైచిత్రం, చిత్రశోభను పెంచడమే కాక చూపరులను ఇట్టే కట్టి పడేస్తాయి. అందుకే నాటి చిత్రకళా దిగ్గజాలైన లియోనార్డో డావిన్సీ, మైఖలాంజిలో సరసన రాఫేల్ చిత్రాలు కూడా స్థానం సంపాదించి, సాంస్కృతిక పునరుజ్జీవన కాలపు త్రిమూర్తులుగా వీరు పేరుపొందారు.

రాఫేల్ 1483 ఏప్రిల్ 6వ తేదీన అర్బినోలో జన్మించాడు. తండ్రి గియొవాన్నిశాంతి అర్బినో నగర ఆస్థాన చిత్రకారుడు. ఇలా వారసత్వంగా రాఫేల్ చిత్రకళను పొందాడు. చిన్ననాటి నుండే తన పరిసరాల స్ఫూర్తితో భావ చిత్రాలనే కాక, మనోవికాసాన్ని కూడా పొందగలిగాడు. తండ్రి వద్ద శిష్యరికంతో చిత్రకళలో తొలి అడుగులు వేశాడు.

పిరోడెల్లా ఫ్రాన్సిస్కో చిత్రకళా స్రవంతిని రాఫేల్ అందుకొని ముందుకు తీసుకెళ్లగలిగాడు తన సొంత శైలికి ఎంతో తపించాడు. కానీ ఫ్రాన్సిస్కో ప్రభావం నుండి తప్పుకోలేకపోయాడు. చిత్రాలతో "చిత్రకళా మర్మజ్ఞత"ను చూపగలిగాడు. రాఫేల్ చిత్రాలలో ప్రధానంగా చెప్పబడేది "పిక్టోరియల్ స్పేస్". రాఫేల్ చిత్రకళా మర్మజ్ఞతకు ఇదొక చిహ్నం. చిత్రంలో ఒక ఆవరణం ఉంటుంది. బయట ఒక ఆవరణం ఉంటుంది. బాహ్యావరణాన్ని చిత్రంలో

School of Athens

అంతరింగిక ఆవరణంలా ఎలా రూపుదిద్దుకుంటుందో, అది ఏ రకపు ఆవరణను ఆవరిస్తుందో దాని ప్రాముఖ్యతను చెప్పేదే "పిక్టోరియల్ స్పేస్". ఇదే కళామర్మజ్ఞత.

రాఫేల్ పదకొండవ ఏట అతని తండ్రి మరణించాడు. తండ్రిగానే కాక, చిత్రకళా తొలి గురువు కూడా. ఈ విషయం రాఫేల్‌ను కొంతకాలంపాటు కళకు దూరం చేసింది. చివరికి ఆర్చినో నగరాన్ని వదలి, పెరూగియాకు చేరుకున్నాడు. అక్కడ పెట్రో పెమాజినో అనే చిత్రకారుని వద్ద శిష్యునిగా చేరాడు. 17వ ఏట నుండి ప్రతిభావంతుడైన శిష్యునిగా, గురువుని మించిన శిష్యునిగా పేరు పొందాడు.

యుక్త వయస్సుల ఉత్సాహం, ఆరాటం, సాటి సహచర చిత్రకారుల భావాలు, రాఫేల్ ఆలోచనా శక్తికి పదును పెట్టాయి. రాఫేల్ మత సంబంధ చిత్రాలు ఎన్నిటినో చిత్రించాడు. మేరీమాత, బాల జీసస్ చిత్రాన్ని ప్రతిభావంతంగా చిత్రించాడు. 'ది అన్సిడై మడోన్నా', "సిస్టైన్ మడోన్నా", "మడోన్నా డెల్ గ్రాండుకా" అన్నవి వరుస చిత్రాలు.

ఎంతటి క్లిష్టమైన వస్తు నిర్దిష్టత ఉన్నప్పటికినీ చూపరులను తొలిచూపుతోనే ఆకట్టుకొనే విధంగా చిత్రించగలిగేవాడు. ఇతని చిత్రాలలో అనేక మంది ఉన్నప్పటికీ, ప్రతిఒక్కరి యొక్క వ్యక్తిత్వం, వారి స్వీయ భావ వ్యక్తీకరణను చిత్రంలో చూపగలిగాడు.



ఇతని చిత్రాలలో మాతృమూర్తి సౌందర్యం, బిడ్డల ముద్దు, మురిపాలను, దేవతా భావంతో సౌందర్యదృష్టి మిళితం చేసి చిత్రాలకు అజరామరత్వం కల్పించాడు. ఇతని చిత్రాలలో మొదటగా చెప్పుకోవల్సినది "సిస్టైన్ మడోన్నా" చిత్రం గురించి ఇందులో శరీర సౌష్టవ భావం, సజీవ సౌందర్యరేఖ వల్ల మొత్తం ప్రపంచ ప్రసిద్ధ చిత్రాలలో ఇదొకటిగా చెప్పబడుతోంది. ఇందులో మేరీమాత, బాల జీసస్ చిత్రించాడు. చిన్నపిల్లవానికి రాజసం ఉట్టిపడుతుంటుంది. తల్లి లాలనగా జీసస్‌ను ఎత్తిపట్టుకుని ఉంటుంది. తెల్లని మబ్బుల వంటి ప్రదేశం చిత్రమంతా ఆవిరించబడి ఉంటుంది. ఈ భాగం వలన మేరీమాత, బాలజీసస్ దైవత్వాన్నీ ఆపాదిస్తుంది. దేవతామూర్తులు వలే గాలిలో తేలినట్లుంటుంది. దేవదూతలు విస్మయంతో చూస్తుంటారు. చిత్రంలో తెల్లని కాంతి పరచుకొని కళామర్మజ్ఞతను తెలుపుతుంది. పిక్టోరియల్ స్పేస్ అంటే ఇది. దైవత్వాన్నీ చెప్పే శాంతి సందేశం ఈ చిత్రం.



రాఫేల్ చిత్రాలు ఎన్ని ఉన్నప్పటికి "దిస్కూల్ ఆఫ్ ఎథెన్స్" అన్న చిత్రం రాఫేల్ కళాదృష్టికి ఒక నిదర్శనం. ఇందులో అందమైన అతిపెద్ద భవంతి, అలంకరణలు తర్కబద్ధంగా ఉండు నిర్మాణం. వాస్తు వాస్తవికతకు ఇదొక నిదర్శనం. ప్లాటో, అరిస్టాటిల్ చర్చలు జరుపుతుంటారు. చుట్టూ ఇతర సభ్యులు, ఇతర శిష్యులు ఆసక్తితో గమనిస్తుంటారు. వ్యక్తులు, వారి వదనాలు, వారి వస్త్రధారణ, వ్యక్తుల హావభావాలు, వారి అంతర్గత మనోవైజ్ఞానికతను తెలుపుతుంటాయి. వ్యక్తుల చుట్టూ గల వస్తువులు, గోడ, భవన అలంకరణలు "పిక్టోరియల్‌స్పేస్"ను తెలుపుతుంది. చిత్రంలోని వ్యక్తులను గమనిస్తే ప్లాటో తెల్లని గడ్డంతో చిత్రం మధ్య భాగాన ఉంటాడు. ఇతనిని మోడల్‌గా లియోనార్డో డావిన్సీని ఊహించి చిత్రించాడు. ఇతని ప్రక్కనున్న అరిస్టాటిల్, అతని చేతి భంగిమ, భూమ్యాకాశాల మధ్య సయోధ్యగా చెప్పబడుతంది. భవంతి మెట్ల గల మరో వ్యక్తి హిరాక్లాటిస్ దీర్ఘముద్రలో కూచోని ఉంటాడు. ఇతని మాతృకగా మైఖలాంజిలోను తీసుకున్నాడు. విచారవదనంతో కాస్త మొరటుగా ఉంటాడు. రాతి దిమ్మపై చేయి పెట్టి దీర్ఘంగా ఆలోచిస్తూ కూచోని ఉంటాడు. ఇది మైఖలాంజిలో స్వీయముద్రతోనే చిత్రించాడు.

ఈ చిత్రంలో గల అంతర్గతాంశం రాఫేల్‌కు లియోనార్డో పట్ల గల భక్తి భావం, ఆరాధన, మైఖలాంజిలో పట్ల వైరం, చిత్రంలో సింబాలిక్‌గా చూపాడు. ఈ చిత్రంలో భవంతి, గోడల అలంకరణలు చిత్రానికి వన్నెతెస్తాయి.

చాలా చిన్న వయస్సులోనే అంటే 37 ఏళ్లకే రాఫేల్ మరణించాడు. తానుపుట్టిన రోజునాడే మరణించాడు. డావిన్సీ, మైఖలాంజిలలో జీవితకాలంతో పోలిస్తే సగభాగం జీవితం మాత్రమే గడిపిన వారి చిత్రాల సరసన నిలుపదగ్గ చిత్రాలు గీచిన యువ కళామర్మజ్ఞుడు రాఫేల్.

# పేరిణి నటరాజ రామకృష్ణ

- విష్ణుభొట్ల రామకృష్ణ



రాలిపోయింది నటరాజ పాదహుమరజం ఆగిపోయింది. సిరిమువ్వల నాదం నేల రాలింది ఓ కళా దిగ్గజం. నాట్యానికి నిలువెత్తు దర్పణం తెలుగువారి ప్రాచీన కళారీతులకు జీవం పోసి, ఆ కళను దేశవిదేశాల్లో వ్యాపింపజేసిన ఘనుడు భారత కళాప్రపూర్ణ, పద్మశ్రీ డాక్టరు "నటరాజ రామకృష్ణ".

ఆయన పేరులోనే నటరాజు కొలుతీరి ఉన్నాడు. ఆయన పేరిణి శివతాండవ నృత్యం చేశాడంటే ఆ పరమశివుడే భువిపై తాండవం చేసినట్లే. అందువల్లనే పేరిణి శివతాండవం, ఆంధ్ర నాట్యం పేర్లు విన్న వెంటనే మనకు గుర్తుకు వచ్చే పేరు నటరాజ రామకృష్ణ.

రాంమోహన్ రావు, దమయంతి దంపతులకు 1923 మార్చి 21వ తేదీన బాలి ద్వీపంలో జన్మించారు. రామకృష్ణ పూర్వీకులు కోనసీమ ప్రాంతంవారు అప్పట్లో ఇండోనేషియాకు వలస వెళ్లిపోయారు తల్లిగారిది నల్గొండ జిల్లా ఆతేరు మండలం ఆయన చిన్నతనంలోనే ఆమె కాలం చేశారు. తర్వాత ఇండోనేషియా నుండి చెన్నైకు వచ్చేశారు. రామకృష్ణకు చిన్న తనంనుండి నాట్యకళమీద మక్కువ ఎక్కువగా ఉండేది. ఆయన కాలికి గజ్జెలు కొనుక్కోలేని స్థితి. అటువంటి పరిస్థితులో నాట్యం మీద మక్కువతో ఎండిన తుమ్మకాయలు కాళ్ళకు కట్టుకొని నాట్యం అభ్యసించేవారు. సోదరుని సహాయంతో భరతనాట్యం మొదలుకొని ఎన్నో నృత్యరీతులు నేర్చుకొన్నారు. జీవితాన్ని నాట్యానికే అంకితం చేసిన ఆయన "ఆజన్మ బ్రహ్మచారిగా" ఉండిపోయారు. అద్దాలమేడలో భోగాలతో గడిపి భోగి అయిన ఆయన నాట్యానికి జీవితాన్ని అంకితం చేసి తన సర్వస్వాన్ని నాట్యానికి ధారపోసి తనకంటూ ఏమీ మిగుల్చుకోని యోగిగా మారారు.

దేవదాసీ చట్టం అమల్లోకి రావటంతో దేవదాసీలు కనుమరుగయ్యారు. దానితో వారు చేసే నృత్యం ఆగిపోయింది. అలా ఆగిపోయిన నృత్యరీతులను రామకృష్ణ






తిరిగి ఊపిరిపోయాలనే సంకల్పంతో ఊరూర తిరిగి నృత్య కళారీతులను సంఘటిత పరచి, సాంప్రదాయ నృత్య రీతులను అధ్యయనం చేసి "ఆంధ్రనాట్యం" పేరుతో ప్రత్యేకశైలిని తెలుగునాట స్థిరపరిచారు. ఇది కాక స్వయంగా నృత్య నాటకాలను రచిస్తూ ఆయన నృత్యంలోనే ఆనంద జీవితాన్ని గడిపారు. ఆయన సృష్టించిన అద్భుతమైన నాట్య ప్రక్రియలో 'నవజనార్ధన పారిజాతం' విశేష జనాదరణ పొందింది.

నటరాజ రామకృష్ణ నృత్యాన్నే నమ్ముకొని, నృత్యంలోనే జీవించటం వల్ల ఆయన్ను అనేక గౌరవాలు, పురస్కారాలు వెతుక్కుంటూ వచ్చాయి. అటువంటి వాటిలో మహరాష్ట్రలోని బందారసంస్థానం రాజాగణపతి పాండ్య 'నటరాజ' అనే బిరుదుతో రామకృష్ణను సత్కరించారు. అప్పటినుండి ఆ బిరుదే ఇంటిపేరుగా మారిపోయి నటరాజ రామకృష్ణగా పేరు ప్రఖ్యాతులు గడించారు. అప్పటికి ఆయన వయస్సు 18 సంవత్సరాలు.



పేరుకు తగ్గట్టే ఆయన దాదాపు 700 సంవత్సరాల క్రితం మరుగున పడిన కాకతీయుల కాలం నాటి "పేరిణి శివతాండవం" నృత్యాన్ని వెలుగులోకి తెచ్చారు. ఏ ప్రభుత్వాలు, ఎవరూ చేయలేని పనిని ఆయన చేయటం వలన పేరిణి శివ తాండవ నృత్యానికి ప్రపంచ వ్యాప్తంగా వెలుగులోకి వచ్చింది. ఈ పేరిణి శివతాండవ నృత్యానికి ఒక ప్రత్యేకత ఉంది. అదేమిటంటే ఈ నృత్యాన్ని మగవారు మాత్రమే చేస్తారు. ఈ నృత్యాన్ని నృత్య రత్నావళి గ్రంధం ద్వారా తెలుసుకొని దానికి ప్రపంచవ్యాప్తంగా విశేష ప్రాచుర్యం తీసుకురావటం ఒక్క నటరాజ రామకృష్ణ వలన మాత్రమే జరిగింది. ఆంధ్రనృత్యం, పేరిణి నృత్యం పురోగతి కోసం లక్షా యాభై వేలు రూపాయలతో ఆంధ్రనాట్య సంస్థను స్థాపించారు. ఆయన స్ఫూర్తితో ఆ తర్వాత అనేక మంది మగపిల్లలు కాలికి గజ్జెలు కట్టి పేరిణి నృత్యం నేర్చుకొని ఈ నాడు రంగస్థలంపై పేరు ప్రఖ్యాతలు తెచ్చుకున్నారు అనటంలో అతిశయోక్తి లేదు. దానికి కారణం అంతరించిన పేరిణి నృత్యాన్ని నటరాజ రామకృష్ణ నేర్చుకొని భావితరాల వారికి అందించటమే. ఇప్పుడు ఆయన శిష్యులు దేశవిదేశాల్లో వేలాదిమంది ఉన్నారు. ఈ కళను కొనసాగిస్తూనే ఉన్నారు.

1968వ సంవత్సరం ఆంధ్రప్రదేశ్ సంగీత అకాడమీ భారతకళాప్రపూర్ణ బిరుదుతో గౌరవించింది. 1980వ సంవత్సరం శ్రీశైలం దేవస్థానం నాట్యాచారునిగా నియమించింది. ఆ సంవత్సరమే రాష్ట్రప్రభుత్వం నాట్యాచారునిగా నియమించింది. 1984వ సంవత్సరం కేంద్రనాటక అకాడమీ, దక్షిణ భారత ఉత్తమనాట్యాచారుడిగా బిరుదుపొందారు. వీరు అనేక విశ్వవిద్యాలయాలనుండి గౌరవ డాక్టరేట్లు పొందారు. కేంద్ర ప్రభుత్వం ప్రతి సంవత్సరం ఇచ్చే ప్రతిష్ఠాత్మక 'పద్మ' అవార్డును 1992లో పొందారు. ఇవికాక మరెన్నో అవార్డులు, సత్కారాలు పొందారు.

నటరాజు నర్తిస్తే ఎలా ఉంటుందో మనకు తెలియదు. కాని నటరాజ రామకృష్ణ పేరిణి నృత్యం శివుని తాండవాన్ని మన కళ్ళకు కడుతుంది. అందువల్లనే ఆయన నృత్యాన్ని వీక్షించిన వారు ఆ నటరాజే నృత్యం చేస్తున్నాడా? అని ఆశ్చర్యపోయేవారు అతటి మహానుభావుడు 2011 జూన్ 7వ తేది మంగళవారం నాడు హైదరాబాద్‌లోని నిమ్స్ హాస్పటల్‌నందు తన తుది శ్వాస విడిచి ఆ నటరాజ సన్నిధికి చేరారు. ఆయన చనిపోయినప్పటికి ఆయన వయస్సు 88 సం॥లు

మరణం ఆయన శరీరానికే కాని కళకు కాదు. ఆయన మనముందు సజీవంగా లేకున్నా, ఆయన నేర్పిన పేరిణి నృత్యం ఎందరి వద్దో సజీవంగా ఉంది. వాళ్లు నర్తిస్తునంతకాలం ఆయన మన మధ్య ఉంటారు. వారి నృత్యంలో వారి పాద మువ్వలసవ్వడిలో సజీవంగా ఉంటారు.

- మాకినీడి సూర్యభాస్కర్

# నాగమల్లిలా విరిసిన జానపద బాణీ జమునారాణి



'నాగమల్లి కోన'లో చిక్కిన 'వయ్యారి గాలి పటం', ఆకాశ వీధిలో హంస నడక'లా సాగే స్వరం...'ముక్కు మీద కోపాన్ని' సైతం ముఖానికే అందంగా అమరించగల చమత్కారం...'మావ మావా మావా' అంటూ మగాళ్ళ గుండెల్లో గుబులు పుట్టించగల గళ గాంధర్వం వెరసి జమునారాణి.

1938, మే 17న మద్రాసు నగరంలో శ్రీమతి ద్రౌపది, వరదరాజుల నాయుడు దంపతులకు పుట్టిన కోకా జమునారాణి పాటను ఆనువంశికంగా అంది పుచ్చుకున్న గాయని. ఆమె తల్లి ప్రొ॥ సాంబమూర్తి ఆర్కెస్ట్రాలో వీణ వాయించేవారు. అప్పుడప్పుడు రేడియోలోనూ పాడేవారు. తల్లి ఎక్కడకు వెళ్ళినా, చిన్నారి జమున కూడా వెళ్తుండేది. కచ్చేరీలలో మెలకువలను ఆకళింపు చేసుకునేది. తల్లి వద్దనే సంగీతం నేర్చుకున్న జమునారాణి, అతి చిన్నప్పుడే స్వరజ్ఞానాన్ని కరతలామలకంచేసుకొంది.

ఏడు సంవత్సరాల వయస్సులోనే తాశిల్దార్ చిత్రంలో(1944) 'అహ ఏమందునే చిన వదినా' అని పాడిన జమునారాణి గొంతు వెండి తెర మీద వినిపించినా, ఆమె పేరు మాత్రం తెర వెనుకే ఉండిపోయింది. అప్పట్లో నటులే ఎవరి పాటలు వారు పాడుకునే సంప్రదాయం. ఆ సంప్రదాయానుసారం తెర మీద బేబీ కమలకుమారి పేరే కనబడింది. జమునారాణి అనామకంగా మిగిలిపోయింది. తరువాత చిత్తూరు వి.నాగయ్యగారి త్యాగయ్య సినిమాలో 'మధురానగరిలో' అనే జావళి,భరణీవారి తొలి చిత్రం, 'రత్నమాల'లో 'పోయిరా మా తల్లి', రక్త కన్నీరు సీత నాట్యానికి 'వగలాడి నిను చేరనా'అనే నృత్యగీతి కూడా అనామకంగానే పాడారామె.అప్పట్లో చిత్రనాయికలైన శాంతకుమారి, పుష్పవల్లి, ఎస్. వరలక్ష్మి, జి. వరలక్ష్మి, బెజవాడ రాజారత్నం, కమలాదేవి మొదలైన వారంతా సొంతంగానే పాడుకునేవారు. అందువల్ల ప్లేబాక్ గాత్రానికంత అవకాశం ఉండేది కాదు. 'శివగంగ' చిత్రం కోసం పెండ్యాల సంగీత సారధ్యంలో మంచి పాటలు పాడారు జమునారాణికానీ దురదృష్టం ఆ చిత్రమూ, ఆ పాటలూ విడుదలకు నోచుకోలేదు.

1948లో వచ్చిన 'స్వతంత్ర' వారి 'ద్రోహి' చిత్రంలో నాయికకు పాడారు జమునారాణి. ఆ చిత్రనాయిక లక్ష్మీరాజ్యం తన పాటలు తానే పాడుకున్నా, గొంతు దెబ్బతినడంతో పాట సరిగా





రాకపోయేసరికి షూటింగ్ ఆగిపోవడం, అర్జంటుగా ఎవరితోనైనా పాడించాలనుకోవడంతోనూ, ఆ సమయంలో జయమునారాణి అందుబాటులో ఉండడంతోను ఆ చిత్రంలో పాటలు పాడే అవకాశం దక్కిందామెకు. ఆ సినిమాలో మూడు పాటలు పాడారామె. మొట్టమొదటిదైన 'ఆలకించండి బాబూ,ఆదరించండి' పాటను విని తెలుగు శ్రోతలు ఆమెను నిజంగానే ఆలకించి ఆదరించారు. 'ఆశలే నిరాశలాయెనే' అంటూ సాగే రెండోపాట కూడా నిజమే అయింది. ద్రోహి పాటలు బాగా ప్రాచుర్యం పొందినా, తెలుగులో ఆ తర్వాత ఎందుకనో ఆమెకు అవకాశాలు అంతగా రాలేదు. మూడో పాట 'ఇదియేనా నీ న్యాయము'అన్నది ఆమె తెలుగు శ్రోతలను, పరిశ్రమను నిలేసి అడిగినట్లే అనిపిస్తుంది. 1953లో వచ్చిన 'వినోదా'వారి దేవదాసు చిత్రంలోని 'ఓ దేవదా చదువూ ఇదేనా...పలుమారు బడి మాని అసలూ దొరల్లే సూటూ బూటా' అన్న పాట మంచి వినోదాన్నే అందించింది. 'అంతా భ్రాంతియేనా! జీవితాన వెలుగింతేనా?'అంటూ మహానేత్రి సావిత్రికి పాడిన పాట అంత విషాదాన్నీ కలిగించింది. దేవదాసు నాటికి జమునారాణి వయసు కేవలం పదిహేనేళ్ళు. అప్పటికీ ఆమె పేరు తెర వెనుకే ఉండిపోయింది.

1962లో వచ్చిన 'మంచి మనసులు' చిత్రంలో ఘంటసాలతో పాడిన 'మావ మావా మావా' అన్న పాట జానపద బాణీలో గొప్ప హిట్టయ్యింది. వాసంతికి ప్లేబాక్అయిన ఆ పాటతో జమునారాణి పేరు పరిశ్రమకు బాగా పరిచయమైంది. అదే పాటను తమిళంలో 'కుముదం' చిత్రం కోసం, సౌందరాజన్‌తో పాడారామె. తెలుగు కంటే ముందు తమిళ చిత్రమే విడుదలై తమిళ చిత్ర రంగంలో జమునారాణి స్వరానికి మంచి గిరాకీ ఏర్పడింది. తరువాత తెలుగులోను అదే రీతిగా ఆమెకు అవకాశాలు అంది వచ్చాయి. ఆమె స్వరానికి అతికినట్లు సరిపోయే జానపద బాణీ పాటలు అప్పట్నించీ ఆమెకు రాసాగాయి. మంచి మనసులు లోని 'ఎంత టక్కరివాడు నా రాజు', అనురాగంగ లోని 'పూసలోళ్ళ రాజమ్మ' వంటి జానపద ఛాయలతో కూడిన పాటలు ఆమెకు మంచి పేరు తెచ్చాయి. పల్లె పదాలనిసర్గ భావన ఆమె గొంతులో మధురిమ లలికింది. కొంటె మాటల తుంటరి చురకలు ఆమె పాటలో సహజంగా ఇమిడిపోయి శ్రోతల మానసాలను మంత్రముగ్ధం చేసాయి. ముక్కుతో పలికే స్వరం మధ్య మధ్య నొక్కబడి బలే గమ్మత్తుగా జానపదానికి నప్పి శ్రోతలను మత్త చిత్తులుగా చేసింది. 'హైల హైలో హైలేసా హంస కదా నా పడవ' అన్న పాట ఆమె జానపద, 'జాణ'పద గాత్ర మాధుర్యానికి నిదర్శనం. నీటి మీద ఈదుతూ, తెప్పలా అటూ ఇటూ తల తిప్పి చూసే 'హంస నడక'లానే అచ్చం ఆమె పాట సాగుతుంది. అలాగే 'నాగమల్లి కోన లోన నక్కింది లేడి కూన' అని పాడితే, దాన్ని వెతుక్కుంటూ వెళ్తుంది లేడికూనలా మన మనస్సు కూడా.

**ఆమె పాడిన 'సరదా సరదా సిగరెట్టు', 'రావె రావే బాలా', 'హలో డార్లింగ్ మాట్లాడవా!', 'ఏమయ్యో మావయ్యా', వంటి పాటల్లో హాస్యరసం తొణికిస లాడుతూ ఆహ్లాదపరుస్తుంది.**

ఆమె పాడిన 'సరదా సరదా సిగరెట్టు', 'రావె రావే బాలా', 'హలో డార్లింగ్ మాట్లాడవా!', 'ఏమయ్యో మావయ్యా', 'నాజూకైన గాడిద' వంటి పాటల్లో హాస్యరసం తొణికిస లాడుతూ ఆహ్లాదపరుస్తుంది. 'అద్దాల మేడ ఉంది', 'పద పదవె వయ్యారి గాలి పటమా' 'అందానికి అందము నేనే' పాటలు ఇప్పటికీ రేడియోలో వినబడి, 'పాటకు సాటి జమునే' అనిపిస్తాయి. అప్పట్లో తిరుగు లేని గాయనిగా పేరు తెచ్చుకుని ఎన్నెన్నో అవకాశాలు అంది పుచ్చుకున్న జిక్కి, ఎ.ఎం రాజాను వివాహమాడి, పరిశ్రమకు దూరం కావడంతో 'జిక్కి మార్కు' పాటలు జమునారాణికి వచ్చాయి. ఆ పాటలకు ఆమె న్యాయం చేశారు. 'తిరుపతి వేంకటేశ్వరా', 'తలచిన




తలపులు', 'ఓ వన్నెల వయ్యారి', 'వన్నెలు కురిసే' మొదలైన పాటలు ఇప్పటికీ వినాలనిపిస్తాయి

తమిళ, తెలుగు, మళయాళ, సింహళ భాషల్లో ఆరువేల దాకా పాటలు పాడారు జమునారాణి. ప్రతి భాష శ్రోతలూ, ఆమెను తమ భాషాగాయనిగానే అభిమానించారు. అయితే ఆమె పాడిన సుమారు ఆరువేల పాటల్లోను దాదాపు నాలుగువేల అయిదు వందల దాకా తమిళంలోనివే.అదే విధంగా ఆమె పొందిన సత్కారాలుకూడా తమిళంలోనే అధికం. 1990లో తమిళనాడు ఉగాది పురస్కారం, తమిళనాడు ప్రభుత్వం ఏటేటా కళాకారులకిచ్చే 'కలైమామణి' అవార్డు, 'అభినందన' వారి ఘన సన్మానం, ఘంటసాల అవార్డు, వంశీ ఆర్ట్స్‌వారి మహానటి సావిత్రి అవార్డు, ఇంకా ఎన్నో పురస్కారాలు అందుకున్నారు జమునారాణి. తనను తమిళ ప్రభుత్వం గుర్తించింది కాని, మన ప్రభుత్వం గుర్తించలేదనే బాధను వ్యక్తం చేస్తుంటారామె.

1970 ప్రాంతాలకే జమునారాణికి అవకాశాలు తగ్గుతూ వచ్చాయి. 'కలెక్టర్ జానకి'లో పాడిన 'నేనన్నది నీవనుకున్నది', ఇంచుమించు ఆఖరు పాట. అయితే ఆ తర్వాత సుమారు రెండు దశాబ్దాలకు 'నాయగన్' చిత్రంలో 'నాన్ సిరిచ్చి దీపావళి' పాట పాడే అవకాశం చిక్కింది. తమిళనాట మార్మోగిన ఆ పాటను తెలుగులో'నా నవ్వే దీపావళి' అంటూ పాడినప్పుడు ఎంతో హిట్టయినా, తరువాత అవకాశాలు మృగ్యమే అయ్యాయి. సినిమాల్లో పాడకపోయినా, విదేశాల్లో సైతం కచ్చేరీలుచేస్తూ ఇప్పటికీ పాడుతూనే ఉన్నారు జమునారాణి. స్తబ్దుగా ఉండే తత్త్వం ఆమెది కాదు.ఎప్పుడూ తన పాటలోనూ, నిజ జీవితంలోనూ చలాకీగా ఉండే జమునారాణిది భావాన్ని పరుగెత్తించే అదుద్దైన గాత్రం. జానపదానికి సరిపోయే వగరునూ, పొగరునూ నింపుకున్న ఆ గాత్రంలో కదలాడే చలాకీ చమత్కారపు మెరుపుల కొరడా శ్రోతల మనసుల్ని మైమరపిస్తుంది...ఝుళిపిస్తుంది...విశృంఖలంగా గంతులు వేయిస్తుంది. ఆమె పాటే దీపావళి.

email: makineedibhaskar@gmail.com





# సుమధుర కళానికేతన్ కార్టూన్ పోటీ ఫలితాలు - విశ్లేషణ

సుమధుర కళానికేతన్ 38వ వార్షికోత్సవం సందర్భంగా 64కళలుడాట్‌కాం మీడియా పార్టనర్‌గా నిర్వహించిన రాష్ట్రస్థాయి కార్టూన్ల పోటీల్లో సుమారు 36 మంది కార్టూనిస్టులు నుండి 180 కార్టూన్లు వచ్చాయి. ప్రముఖ కార్టూనిస్టు శ్రీబాబు, 64కళలు డాట్‌కాం ఎడిటర్ శ్రీ కళాసాగర్ న్యాయనిర్ణేతలుగా వ్యవహరించారు.

**ఈ పోటీలో విజేతలుగా మొదటి బహుమతి రూ. 2000/- కృష్ణ, (హైదరాబాద్),**

**ద్వితీయ బహుమతి రూ.1500/-లు ఎస్. ఎస్. వెంటపల్లి (చర్ల),**

**తృతీయ బహుమతి రూ.1000/- వినోద్, (సఖినేటిపల్లి) నిలిచారు.**

**బాచి, హైదరాబాద్, నాగిశెట్టి విజయవాడ, ఆదినారాయణ, విజయవాడ కార్టూనిస్టులు**

**ప్రోత్సాహక బహుమతులుగా ఒక్కొక్కరు రూ. 500/-లు పొందారు.**

బహుమతి పొందిన వాటితో పాటు, 50 ఉత్తమ కార్టూన్లను ఎంపిక చేసి జూలై 30, మరియు 31వ తేదీల్లో రెండు రోజుల పాటు విజయవాడ తుమ్మలపల్లి వారి కళాక్షేత్రంలో కార్టూన్ల ప్రదర్శన నిర్వహించారు.

సుమధుర హాస్య నాటికల ముగింపు సభలో సినీనటులు చంద్రమోహన్ చేతులమీదులుగా కార్టూన్లపోటీ విజతలకు బహుమతులు అందజేసారు.

అతి తక్కువ కాలంలో కార్టూనిస్టులను ప్రోత్సహించే ఉద్దేశ్యంతో నిర్వహించిన ఈ పోటీలలో అనేక సమస్యలపై కార్టూనిస్టులు తమ కార్టూన్లను సందించారు. మొదటి బహుమతి పొందిన కృష్ణ కలానికి కాలం చెల్లిపోవడానికి కంప్యూటరేనని తన కార్టూన్ ద్వారా చూపితే, ఎస్.ఎన్. వెంటపల్లి. తెలుగుభాషకు తగ్గుతున్న ఆదరణను తన కారూన్లో చూపించారు. తృతీయబహుమతి పొందిన వినోద్ ఎలక్ట్రానిక్ మీడియాకు మనిషి ఎంత బానిసగా మారుతున్నాడో తెలియజేస్తూ మంచి కార్టూన్ గీసారు. ఇలా అనేక సమస్యలను ఇతివృత్తాలుగా తీసుకొని గీసిన కార్టూన్ల ప్రదర్శన సందర్శకులను నవ్వించడమేకాదు ఆలోచింపజేసింది. మోహనరాంప్రసాద్, ప్రకాష్‌గార్లు ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు. కార్టూన్ ప్రదర్శనకు సంబంధించిన ఫొటోలు గ్యాలరీలో చూడగలరు.






మొదటి బహుమతి - కృష్ణ,






ద్వితీయ బహుమతి - ఎస్. ఎస్. వెంటపల్లి





తృతీయ బహుమతి - వినోద్






ప్రోత్సాహక బహుమతి – ఆదినారాయణ







**పోటీల్లో పాల్గొన్న కార్టూనిస్టులు:**

1 ఆదినారాయణ
2. శర్మ
3. పి.పి.నాయుడు
4. కృష్ణ
5. భువన్
6. రాజమౌళి
7. చలపాకప్రకాష్
8. బాచి
9. ఏ.ఎస్.ఆర్. భగవాన్
10. నాగిశెట్టి
11. హరికృష్ణ
12. సంబంగి
13. శేఖర్
14. జి.వి. సాగర్
15. భాను
16. వినోద్
17. ముత్యాలరావు
18. మోటూరిశ్రీ
19. నవీన్
20. విజయ్
21 నగేష్ కుమార్
22. వడ్డేపల్లి
23. కామేష్
24. బోలెం
25. రాంప్రసాద్
26. బి.వి.ప్రసాద్
27. వి. నాగరాజ్
28. అర్జున్
29. వి. రామకృష్ణ
30. రామశేషు
31. జి. శ్రీనివాస్
32. విజయశ్రీ
33. పుష్ప
33. కందికట్ల

సినిమా

# జంధ్యామారుతం




ముద్దమందారం', 'నాలుగు స్తంభాలాట' చిత్రాలతో జంధ్యాల పట్ల యువతరం ప్రేక్షకుల్లో ప్రత్యేక ఆరాధనాభావం ఏర్పడింది. ఆ నేపథ్యంలో యువతరం కోసం జంధ్యాల ప్రత్యేకంగా రూపొందించిన చిత్రం 'రెండు జెళ్ళసీత'.

- పులగం చిన్నారాయణ



జంధ్యాలకి కె.విశ్వనాధ్ అంటే ఎంతటి గౌరవాభిమానాలున్నాయో, బాపు-రమణలంటే కూడా అంతే!. ముళ్ళపూడి వెంకటరమణ మాటల్లో హాస్యాన్ని అందంగా పొదిగిస్తే, మాటల్ని హాస్య రసంలో ముంచి తేల్చిన ఘనత జంధ్యాలది. ముళ్ళపూడి వెంకటరమణ 'బుడుగు'భాషలో సృష్టించిన కాయినింగే 'రెండు జెళ్ళ సీత', బోలెడంత అందంగా, కాస్తంత అమాయకంగా ఉండే అమ్మాయిని... అబ్బాయిలంతా రెండు జెళ్ళసీత' అనేసుకునేవారు. అలాంటి కుర్రకారు డ్రీమ్ గర్ల్ అయిన 'రెండు జెళ్ళసీత'ని తనదైన హాస్యపంథాలో తెరకెక్కించారు జంధ్యాల.

నలుగురు కుర్రాళ్ళు ఓ అమ్మాయిని ప్రేమిస్తారు. ఆ అమ్మాయి అప్పటికే వేరే అబ్బాయిని ప్రేమించి కట్నపిశాచి దురాగతం వల్ల అతనికి దూరమైపోతుంది. ఈ నలుగురు కుర్రాళ్ళు ఆ అబ్బాయిని సంస్కరించి ఇద్దరి పెళ్ళి జరిపిస్తారు. ఇదే ఈ చిత్ర మూలకథాంశం. ప్రథమార్థం క్రేజీగానూ, ద్వితీయార్థం కొంచెం సెంటిమెంట్‌తోనూ నడుస్తుంది.

ఇందులో నలుగురు కుర్రాళ్ళుగా నరేశ్, ప్రదీప్, రాజేశ్, శుభాకర్‌లు నటించారు. ఈ నలుగురూ ఒకరకంగా తెలుగు తెరకి కొత్తవాళ్ళే. ఇదే ప్రదీప్ ఆఖరిచిత్రం. ఈ సినిమా తర్వాత ప్రదీప్ ఏ సినిమా చేయలేదు. చదువుకే తొలి ప్రాధాన్యమిచ్చిన ప్రదీప్, అటుపై బుల్లితెరపై అగ్రపీఠాన్ని అలంకరించారు. శ్రీలక్ష్మి సోదరుడైన రాజేష్‌ని 'నెలవంక' సినిమాతో జంధ్యాల హీరోని చేసారు. ఆ తర్వాత రాజేష్ నటించిన సినిమా ఇది. తరువాత రోజుల్లో 'మయూరి' శుభాకర్‌గా పేరు తెచ్చుకున్న శుభాకర్‌కి ఈ చిత్రం మంచి గుర్తింపును తీసుకువచ్చింది.

హీరోయిన్ మహాలక్ష్మి ప్రేమికుడిగా సినిమాలో కనిపించిన అబ్బాయి పేరు కమలాకర్. ఇతగాడు ఓ సినిమాలో హీరోగా కూడా చేసాడు.

'రాము' సినిమా గుర్తుంది కదూ. అందులో ఎన్.టి.ఆర్.తో కలిసి 'పచ్చని చిలుకలు రెండు' పాటలో నటించినావిడ పేరు పుష్పలత. అలా తెలుగు ప్రేక్షకులకు సుపరిచితురాలైన పుష్పలత కూతురు మహాలక్ష్మిని ఈ చిత్రంలో హీరోయిన్‌గా ఎంపిక చేశారు జంధ్యాల. కన్నడంలో కొన్ని సినిమాల్లో నటించిన మహాలక్ష్మికి తెలుగులో మాత్రం ఇదే తొలి ప్రయత్నం. పుష్పలత కూడా ఇందులో నటించారు. అది కూడా మహాలక్ష్మికి తల్లిగానే...




ఇక్కడో తమాషా విషయం చెప్పుకోవాలి. ఈ సినిమాలో కథానాయికగా నటించాలని సెలక్షన్స్‌కు వచ్చినవారిలో విజయశాంతి, భానుప్రియ, శోభన తదితరులున్నారు. వాళ్లను కాదని జంధ్యాల మహాలక్ష్మిని ఎంపిక చేశారు. విధి వైచిత్రి ఏమిటంటే మహాలక్ష్మి కొన్ని సినిమాలతోనే వెనుతిరగ్గా, ఆ ముగ్గురూ మాత్రం హీరోయిన్లుగా టాప్‌పొజిషన్‌కు చేరుకున్నారు.

అమాయకపు ఇల్లాలి పాత్రలకు పెట్టింది పేరుగా భాసిల్లిన శ్రీలక్ష్మికి హాస్యనటిగా మంచి ముద్రవేసిన చిత్రం 'రెండు జెళ్ళ సీత.' 1954లో వచ్చిన 'అమర సందేశం' వంటి చిత్రాల్లో హీరోగా నటించిన అమరనాథ్ కూతురే ఈ 'శ్రీలక్ష్మి'. తమిళంలో, మలయాళంలో కొన్ని సినిమాల్లో కథానాయికగా నటించిన శ్రీలక్ష్మి 'నివురు గప్పిన నిప్పు' సినిమాలో తొలిసారిగా హాస్యపాత్ర చేశారు. ఆమె కెరీర్‌కి 'రెండు జెళ్ళసీత' మంచి ఊతాన్నిచ్చింది. ఈ చిత్రంలో తాను ఎంపికైన విధానాన్ని శ్రీలక్ష్మి వివరిస్తూ " ఈ చిత్ర నిర్మాణ నిర్వాహకులు జయకృష్ణ మా నాన్నగారికి పర్సనల్ మేకప్‌మేన్‌గా పనిచేసేవారు. అప్పటి నుంచీ ఆయన మాకు మంచి ఫ్యామిలీ ఫ్రెండ్. ఆయన నాకు ఇందులో అతిథి పాత్ర ఉందని చెప్పారు. 'హీరోయిన్‌గా చేస్తున్నావ్ కదా, ఇలాంటి గెస్ట్ క్యారెక్టర్స్ వద్దని మా తమ్ముడు రాజేష్ వారించాడు. వచ్చిన అవకాశం వదులుకోకూడదనే పద్ధతిలో నేను సినిమా చేయడానికి సిద్ధమైపోయాను. తీరా రెండు రోజులు వేషం అనుకున్నది కాస్తా ఫుల్ లెంగ్త్ క్యారెక్టర్ అయిపోయింది. అమాయకత్వం, మూగ భాష మాట్లాడే తీరు వల్ల ఆ పాత్ర అందరినీ ఆకట్టుకుంది. ఇందులో నా పాత్ర పేరు అనసూయ, ఈ పాత్రే నేను హాస్య నటిగా మారడానికి బలమైన పునాది వేసింది. నేను హాస్యరసంలో ఏ మాత్రమైనా పేరు తెచ్చుకున్నానంటే అదంతా జంధ్యాల గారి చలవే. రెండు జెళ్ల సీతలోని నా పాత్రకు ఉత్తమ హాస్యనటిగా కళాసాగర్ అవార్డు లభించింది. ఆ తరువాత పదమూడేళ్లు ఏకధాటిగా ఆ అవార్డునందుకున్నాను అని చెప్పారు.

### తెర వెనుక

| | | |
|---|---|---|
| చిత్ర నిర్మాణ సంస్థ | : | శ్రీ భ్రమరాంబికా ఫిలింస్ |
| సంగీతం | : | రమేశ్‌నాయుడు |
| పాటలు | : | వేటూరి, ఇంద్రగంటి శ్రీకాంతశర్మ |
| నేపథ్యగానం | : | ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం ఎస్. జానకి |
| ఎడిటింగ్ | : | గౌతంరాజు |
| ఆర్ట్ | : | తోటతరణి |
| స్టంట్స్ | : | రాజు |
| నృత్యం | : | శివ-సుబ్రహ్మణ్యం |
| అసోసియేట్ డైరెక్టర్స్ | : | ఇ.వి.వి. సత్యనారాయణ, వి.యస్. నిష్టల |
| కో-డైరెక్టర్ | : | యు.వి.పాణి |
| డైరెక్టర్ ఆఫ్ ఫొటోగ్రఫీ | : | యస్.గోపాలరెడ్డి |
| కెమెరామెన్ | : | ఎం.వి. రఘు |
| నిర్వహణ | : | జయకృష్ణ |

వైజాగ్ కనకమహాలక్ష్మి కోవెలలో 4 అక్టోబర్, 1982 నాడు షూటింగ్ ప్రారంభమైంది. వైజాగ్, చుట్టుపక్కల ప్రాంతాల్లో సుమారు 45 రోజుల పాటు ఈ చిత్రం షూటింగ్ జరిగింది. వైజాగ్ రామకృష్ణ బీచ్ ఎదురుగా ఓ బిల్డింగ్‌ని అద్దెకు తీసుకుని, దాన్నే ఈ చిత్రంలోని కథానాయకుల నివాసంగా తెరమీద చూపించారు.

నరేష్, ప్రదీప్, రాజేశ్, శుభాకర్, కమలాకర్, శుభలేఖ సుధాకర్, మహాలక్ష్మి, శ్రీలక్ష్మి వీరందరిదీ ఇంచుమించు ఒకటే వయసు. ఈ ఎనమండుగురూ ఓ టీమ్‌లా కలిసి మెలిసి ఉండేవారు. షూటింగ్ పూర్తికాగానే వీళ్ళంతా నాలుగు బైక్స్ మీద షికారుకి బయలుదేరిపోయేవారు. "ఈ సినిమా షూటింగ్‌ని చాలా బాగా ఎంజాయ్ చేసాం. ఓరకంగా మేం కోతిగోల చేసేవాళ్ళం"' అన్నారు ప్రదీప్ ఆనాటి సంఘటనలను తలుచుకుని ముసిముసిగా నవ్వుతూ.

నిర్మాత : కె. కేశవరావు

కథ-మాటలు, దర్శకత్వం : జంధ్యాల

## కథా సంగ్రహం

గోపి-కృష్ణ-మోహన్-మూర్తి నలుగురు కుర్రాళ్ళు. ఒకే కాలేజీ-ఒకే మాట- ఒకే బాట-ఒకే లవర్ అన్నట్టుగా వుంటారు. వీళ్ళు వుంటున్న ఇంట్లోకి 'సీత' అనే అందమైన అమ్మాయి తన తల్లితండ్రులతో కలిసి అద్దెకు దిగుతుంది. అక్కణ్ణుంచే ఆ నలుగురి మధ్యనా పోటీ మొదలవుతుంది. ఈ పోటీ ముందరి నలుగురూ డబ్బులిచ్చి ఒకే రౌడీతో దెబ్బలు తినాల్సి వస్తుంది. దాంతో వీళ్లు ఓ నిర్ణయానికి వచ్చి కలిసికట్టుగా, 'సీత' దగ్గరికి వెళ్లి తమలో ఎవరిని ప్రేమిస్తున్నావని అడుగుతారు. అప్పుడు సీత తన గతాన్ని చెబుతుంది. మధు, సీతలు ప్రేమించుకుంటారు. మధు తండ్రి గండభేరుండం వీళ్ళు పెళ్లికి రెండులక్షల కట్నం అడుగుతాడు. బడిపంతులైన సూర్యనారాయణ అన్నింటికీ ఒప్పుకుంటాడు. పెళ్లికి అంతా సిద్ధమవుతుండగా సీత మీద నింద మోపి పెళ్ళి కేన్సిల్ అయ్యేట్టు చేస్తాడు గండభేరుండం. ఆమె గతం విని కరిగిపోయిన ఈ నలుగురు కుర్రాళ్లు మధు మనసు మార్చి ఈ పెళ్లి జరిపిస్తామని హామీ ఇస్తారు. విజయనగరం వెళ్లి గండభేరుండం కూతురు కాత్యాయని, కామేశ్వరరావు అనే కుర్రాడితో ప్రేమలో పడేలా చేస్తారు. మధు, సీతలను విడగొట్టడం కోసం గండభేరుండం, ఫొటోల్లో తలలు మార్పించి సీతకు వేరే కుర్రాడితో సంబంధం ఉందని అబద్ధమాడతాడు. ఈ నలుగురూ అదే తరహాలో కాత్యాయని మీద అపనింద మోపుతారు. దాంతో గండభేరుండం తను చేసిన తప్పు ఒప్పుకుంటాడు. ఇలా ఆ నలుగురు మధును, సీతను కలుపుతారు.

BSA Falcon అనే 100 సి.సి. మోటార్ బైక్స్ అప్పుడే మార్కెట్లోకి వచ్చాయి. షూటింగ్ నిమిత్తం ఓ నాలుగు బైక్స్‌ని తీసుకున్నారు. రిజిస్ట్రేషన్ నెంబర్లు వేరేలా వున్నా గానీ, సినిమాలో తమాషాగా కనిపించాలనే ఉద్దేశ్యంతో 1111, 2222, 3333, 4444 అని ఏర్పాటు చేశారు.

ఓ రోజు ఈ ఎనమండుగురు బైక్స్ మీద షికారు చేస్తూంటే పోలీసులు ఆపారు. 'ఇవేవో దొంగ నెంబర్‌లా వున్నాయే' అని సందేహపడి వీళ్ళని బైక్స్‌తోసహా పోలీస్ స్టేషన్‌కు తరలిస్తే జంధ్యాల వచ్చి విడిపించారట. ఈ విషయం ప్రదీపే స్వయంగా చెప్పారు.

సినిమాలో నలుగురు హీరోల ఇంట్రడక్షన్ కూడా కొత్తగా అనిపిస్తుంది. 'హాయ్' అంటూ ఆడియన్స్ వైపు ఓ చూపు విసిరి, క్లాస్‌రూమ్‌లోకి... (అసలు కథలోకి) ఎంటరౌతారు. హీరోలు ఇలా గ్రీట్ చేస్తుండగా వారి టైటిల్ కార్డ్స్‌ని ప్రదర్శించడం ఓ తమాషా థాట్. మిగిలిన టైటిల్స్ అన్నా క్యారికేచర్లతో ప్రెజెంట్ చేయడం అప్పట్లో అందరూ కొత్తగా ఫీలయ్యారు.

చిత్రం చివర్న- తాము ప్రేమించిన అమ్మాయిని ఆమె ఇష్టపడిన అబ్బాయితో తమ చేతుల మీదుగా పెళ్ళిచేస్తూ ఓ పక్క ఆనందబాష్పాలు, మరోపక్క దు:ఖాశ్రువులు చిందిస్తూ ఈ నలుగురూ చేసిన అభినయం హార్ట్ టచింగ్‌గా వుంటుంది.

హీరోయిన్ ఇంట్రడక్షన్ కూడా భలే తమాషాగా తీశారు జంధ్యాల. హీరోయిన్ ఈ సినిమాలో ఆటో నుంచి దిగి తొలిసారిగా కనిపిస్తుందామె. ఆ ఆటో మీద 'బాపు- ముళ్ళపూడి వెంకటరమణ' అని రాసి వుంటుంది. అయితే ఇది షూటింగ్ కోసం ప్రత్యేకంగా రాయించలేదు. ఆ ఆటో కుర్రాడే బాపు-రమణల మీద అభిమానంతో రాయించుకున్నాడు. ఇదికాస్తా జంధ్యాల స్నేహితుడు, వైజాగ్‌లో వీళ్ళ షూటింగ్ వ్యవహారాలన్నింటినీ సమన్వయ పరిచే బాబన్న దృష్టిలో పడింది. ఈ విషయం జంధ్యాలకు చెబితే, ఆయన వెంటనే అతణ్ణి పిలిపించి ఈ సీన్ షూట్ చేయడం జరిగింది. అసలు 'రెండు జెళ్ళ సీత'ను ఆంధ్రప్రదేశ్‌లో పాపులర్ చేసింది బాపు -రమణేకదా. ప్రేక్షకులకీ విధంగా 'రెండు జెళ్ల సీత' అసలు సృష్టికర్తలను గుర్తు చేయడం సముచితంగా అనిపిస్తుంది.

ఇందులో హీరోయిన్ పేరు సీత. కుందనపు బొమ్మలా వుంటుంది. ఒక జడ వేస్తే మరీ దిష్టి కొట్టేస్తారని వాళ్ళమ్మ పట్టుపట్టి రెండు జడలు వేస్తుంది. అలా రెండు జెళ్ళ సీత అయ్యిందన్న మాట. దానిక్కూడా సినిమాలో ఓ డైలాగ్ ప్రత్యేకంగా పెట్టారు జంధ్యాల. కమలాకర్, మహాలక్ష్మిల మధ్య ప్రేమ సందేశాలకు క్షేత్రయ్య పదాలను ఉపయోగించడం జంధ్యాలలోని అభిరుచికి, స్పార్క్‌కి ఓ మచ్చుతనక.

రిటైర్డ్ మేజర్ మంగపతి పాత్రలో వీరభద్రరావు ఉన్నంతలో మంచి మోతాదులో హాస్యాన్ని నింపారు. జారుడు బల్లమీద జారడం, 'సీ-సా' ఆట ఆడటం లాంటి విచిత్రమైన పనులు చేయడమే గాక, 'నేను రెండుసార్లు పిచ్చాసుపత్రి నుంచి పారిపోయి వచ్చాను తెలుసా' అంటూ కొసమెరుపు 'మెరిపించి అందర్నీ ఘొల్లుమనిపిస్తారాయన. అసలు ఆయన ఎంట్రెన్సే సుత్తితో కొడుతూ కనిపిస్తుంది-'నేను సుత్తితో పాపులర్ అయిన వాణ్ణి సుమా' అన్నట్టు... దటీజ్ జంధ్యాల.

ఇందులో అల్లురామలింగయ్య పాత్ర పేరు 'గండభేరుండం'. ఈయన గారికి ఉత్తర భారత దేశమన్నా హిందీ అన్నా చాల ఇష్టం. ఆ వెర్రితోనే పిచ్చి హిందీలో తెగ మాట్లాడేస్తుంటారు.

విజయనగరం వెళ్లి–సీత ప్రేమించిన మధు మనసు మార్చడానికి ఏం చేయాలా అని ప్లాన్ చేస్తుంటారు ఈ నలుగురు. వీరికి డుంబు అనే కుర్రాడు సాయం చేస్తుంటాడు. ఆ కుర్రాడి అసలు పేరు చక్రవర్తి. ప్రముఖ రచయిత డాక్టర్ తంబు గారబ్బాయ్. ఈ కుర్రాడే ఇటీవల కృష్ణ వంశీ 'శ్రీఆంజనేయం' సినిమాకి గ్రాఫిక్స్ సమకూర్చాడు.

'రెండు జెళ్ళ సీత' విజయవంతంగా శతదినోత్సవం జరుపుకుంది గానీ, ఫంక్షన్ మాత్రం చేయలేదు.

ఇదే సినిమాని 'దేవి–శ్రీదేవి'గా తమిళంలో వేరేవాళ్లు రీమేక్ చేశారు. శ్రీలక్ష్మి అందులో కూడా నటించారు.

తొలుత మేకప్‌మన్‌గా పేరు తెచ్చుకుని ఆ తరువాత ప్రముఖ దర్శకులతో తన అభిరుచికి తగ్గట్టుగా ఎన్నెన్నో ఉత్తమ చిత్రాలను నిర్మించారు జయకృష్ణ. 'శంకరాభరణం' విడుదల తరువాత జంధ్యాలతో జయకృష్ణకు పరిచయం ఏర్పడింది. అటుపై వాళ్లిద్దరూ తరచూ కలుసుకుంటుండేవారు. జంధ్యాల దర్శకుడైన తరువాత ఆయన షూటింగ్‌లకు రెగ్యులర్‌గా వెళ్తుండేవారు జయకృష్ణ. డిస్ట్రిబ్యూషన్ సంస్థను ఏర్పాటు చేసుకున్నారు. ఇందులో హీరో కృష్ణ, దర్శకుడు దాసరి కూడా భాగస్వాములు. సినిమా నిర్మాణం మీద మక్కువ ఉన్న కేశవరావు తన అభిప్రాయాన్ని జయకృష్ణకు చెప్పి అండగా ఉండమని కోరారు. ఈ సందర్భంలో జంధ్యాల తనకు చెప్పిన ఓ స్టోరీ లైన్ గురించి వివరించారు జయకృష్ణ. అలా 'రెండు జెళ్ల సీత' మొదలయింది. ఆ తరువాత ఇదే బ్యానర్‌లో 'రావూ–గోపాలరావూ' చిత్రం కూడా రూపొందింది. జంధ్యాల, జయకృష్ణల అనుబంధం జంధ్యాల మృతి చెందేవరకూ కొనసాగింది. వీళ్లిద్దరి కాంబినేషన్‌లో 'ముద్దుల మనవరాలు', 'రాగలీల', 'వివాహ భోజనంబు', 'నీకు నాకు పెళ్లంట' చిత్రాలు రూపొందాయి. 'శుభం' అనే చిత్రానికి ప్లానింగ్ జరుగుతున్న సమయంలోనే జంధ్యాల అకస్మికంగా కన్నుమూశారు.

సంగీత దర్శకునిగా రమేశ్‌నాయుడు చేసిన సరిగమల సరసాలు ప్రేక్షకుల్ని కొబ్బరి నీళ్ళలో జలకాలాడించాయి. తెలుగు వారి వంటకాలు, రుచుల మీద మహా మక్కువున్న జంధ్యాల చాల ఇష్టపడి 'మాగాయే మహాపచ్చడి–పెరుగేస్తే మహత్తరి–అది వేస్తే అడ్డవిస్తరి–మానిన్యా మహాసుందరి' అంటూ వేటూరితో ఊరగాయపద్యంలా అనిపించే ఓ రాలుగాయి పద్యాన్ని రాయించుకున్నారు. ద్వైతా గోపాలం రాసిన 'శ్రీకాకుళే మహాక్షేత్ర, గుండేరే మహానదీ...' పద్యం వరుసలో ఈ పాట రాశానని వేటూరి చెప్పుకున్నారు.

అంతేకాదు ఆకాశవాణిలో పనిచేసే ప్రసిద్ధ సాహితీవేత్త ఇంద్రగంటి శ్రీకాంత శర్మ చేత వరకట్న సమస్యమీద క్లైమాక్స్‌లో వచ్చే 'పురుషులలో పుణ్య పురుషుల వేరు' అనే పాటను రాయించారు.

అప్పుడు శ్రీకాంతశర్మ విజయవాడ ఆకాశవాణి కేంద్రంలో పనిచేస్తూండేవారు. 'కృష్ణావతారం' సినిమా కోసం బాపు ఆయనతో 'చిన్నారి నవ్వు–చిట్టి తామరపువ్వు' అనే పాటను రాయించుకున్నారు. శ్రీకాంత శర్మ రాసిన తొలి సినిమా పాట అదే. జంధ్యాల, శ్రీకాంత శర్మ మంచి స్నేహితులు. 'కృష్ణావతారం'లో పాట రాశారని తెలుసుకుని చాలా ఆనందపడి పోయారు జంధ్యాల. ఆ ఉత్సాహంతోనే రాయించుకున్నారు. ఆ తర్వాత 'రెండు జెళ్ళసీత' కోసం 'పురుషులలో పుణ్యపురుషులు వేరు' పాట రాయించుకున్నారు.

"నేను మద్రాసు వెళ్లినపుడు ఈ పాట సందర్భం చెప్పారు జంధ్యాల. మర్నాడు నిర్మాత జయకృష్ణ ఇంట్లో కూర్చొని ఈ పాట రాశాను. రాస్తున్నప్పుడు సంగీత దర్శకుడు రమేశ్‌నాయుడు, జంధ్యాల కూడా అక్కడే ఉన్నారు. పాట పూర్తయ్యాక రమేష్‌నాయుడు బాణీ కట్టారు. సాధరణంగా పాటల రికార్డింగ్ సమయంలో రచయిత తప్పనిసరిగ ఉండాలి. కానీ, రేడియో పనుల బిజీ వల్ల నేను పాల్గొనలేకపోయాను" అని ఆ పాట రాసిన సందర్భాన్ని గుర్తుకు తెచ్చుకున్నారు శ్రీకాంతశర్మ.

పాటలు తీయడంలో కూడా జంధ్యాల కొత్త స్కీమ్ కనబరిచారు. 'రెండు జెళ్ళ సీత', 'సరిసరిపదపదనీ', 'మందారంల ఘుమఘుమలై' పాటల చిత్రీకరణలో షాట్ డివిజన్ అద్భుతంగా కుదిరింది. 'సరిసరిపదపదనీ' పాటలో 'భీతహరిణనేత్రిని నేనూ' అన్నప్పుడు కథానాయిక వదనంపై లేడి పరుగు పెడుతున్నట్టుగా షాట్ వేయడం ఆయన అభిరుచికి ఓ నిదర్శనం. అలాగే నలుగురు హీరోల మీద చిత్రీకరించిన 'రెండు జెళ్ళ సీత... తీపి గుండె కోత' పాట సాహిత్యంలో – కథాపరంగా ఆ నలుగురు హీరోల పర్సనల్ టేస్ట్‌ల ప్రకారం–స్పోర్ట్స్ ఐటమ్స్‌ని నరేశ్‌కి, ఫుడ్‌ని శుశాకర్‌కి, డాన్స్‌ని రాజేష్‌కి, బుక్స్‌ని ప్రదీప్‌కి వాడుకోవడం చాలా కొత్తగా అనిపిస్తుంది.

'పురుషులలో పుణ్యపురుషులు వేరు' పాటలో గోపాలరెడ్డి ఫొటోగ్రఫీ పనితనం కొత్త పుంతలు తొక్కింది. బ్యాండ్‌మేళం వాయిస్తున్న నలుగురు హీరోల షాడోలని ఆడ్ యాంగిల్స్‌లో చిత్రీకరించి తోలుబొమ్మలు గెంతుతున్నట్టుగా భ్రమింపజెయ్యడం ఓ ప్రయోగంగా చెప్పుకోవాలి.

వరకట్నం లాంటి అనాచారం మీద ఈ చిత్రం ఒక రకంగా పోరాటం. సమస్యను మరీ సీరియస్‌గా కాకుండా హాస్యమనే పంచదార అద్ది ప్రేక్షకులందరికీ మింగుడుపడే ఓ గుళికలా అందించారు జంధ్యాల.



- వెంటపల్లి సత్యనారాయణ

# చిత్రప్రవృత్తికి చెరగని చిరునామా -ఎల్లా సుబ్బారావు



చాలా ఏళ్ల క్రితం ఒక కవివర్యుడైన ఉపాధ్యాయుడు చిత్రకారుడైన తన శిష్యునికి ఆటోగ్రాఫ్ ఇస్తూ ఇలా రాసాడు.

"కళ ఒక వరం. అది ఆనంద రసాస్వాదనా సారం. పుణ్యకర్మల ఫలం. అది నిన్ను వరించడం అదృష్టం అని"... కళ అనే బీజం ఏర్పడడమే ఒక అదృష్టం అయితే ఆ బీజం ఒక సారవంతమైన సుక్షేత్రంలో పడితే అది ఇంకెంత అదృష్టం! సారవంతమైన ఆ క్షేత్రంలో మొలిచిన ఆ మొలక అసమాన ప్రతిభావంతుడైన గురువు సంరక్షణలో పెరిగితే మరెంతో అదృష్టం కాదా? అలాంటి అదృష్ట వాతావరణంలో చిగురించిన ఆ మొలక పెద్దదై ఫలవంతమైన పుష్పాలను, ఫలాలనూ ఈయక నిస్సారమైన వాటిని ఎలా అందిస్తుంది?

కూర్మ్లే, దామెర్ల, వరదా వెంకటరత్నం, భగీరధి, బుచ్చికృష్ణమ్మ, సత్యవాణి మొదలయిన లబ్ధప్రతిష్ఠులయిన చిత్రకారుల కుంచె విన్యాసాలతో పునీతమైన ఆ కళాక్షేత్రం పవిత్ర గోదావరీ తీరమైన రాజమహేంద్రవరమైతే వారి అనంతరం ఆ కళాక్షేత్రాన్ని దాదాపు (25) ఏళ్ళపాటు ఏలి ఎందరో ప్రతిభావంతులయిన చిత్రకారులను తయారుచేసి ఆంధ్రచిత్రకళారంగాన్ని మరింత ముందుకు తీసుకెళ్లిన అసమాన ప్రతిభావంతుడైన స్వర్గీయ మాదేటి రాజాజీ ఆ గురువైతే అంతటి గొప్ప గురువు సంరక్షణలో చిత్రకళా విద్య నేర్చి కొంతకాలం ఆ చిత్రకాళాశాలకే ఇన్‌స్ట్రక్టర్‌గా పనిచేసి ఎన్నో మంచి చిత్రాలను మనకు అందించిన మరో మంచి చిత్రకారుడు శ్రీ ఎల్లా సుబ్బారావు.

సాధారణంగా రాజమండ్రి ప్రాంతపు చిత్రకారుల కుంచెనుండి వెలువడిన చిత్రాలు ఒక సాంప్రదాయ వొరవడిలో వుంటాయి అనేది ఒకనానుడి. ఆ సాంప్రదాయాన్ని పాటిస్తూనే చిత్రాలకు ఆధునికతను, సామాజిక కోణాన్ని జోడించి ఒక నూతన వొరవడిన ప్రవేశపెట్టిన వ్యక్తి స్వర్గీయ రాజాజీ గారైతే ఆయనను అమితంగా ప్రేమించిన శిష్యుడయిన శ్రీ సుబ్బారావు గారి చిత్రాల్లో ఆ ప్రభావం లేకుండా ఎలా వుంటుంది?

శ్రీ సుబ్బారావు గారి చిత్రాలయిన సింబల్ ఆఫ్ లైఫ్, కార్తీకపౌర్ణమి, స్టేషన్, వ్యాహ్యాళి, గ్రీన్, స్పేస్, దాహం తదితర చిత్రాలు చూసినట్లయితే సాంప్రదాయం ఆధునికతల కలబోత మనకు కనిపిస్తుంది.

కన్ను తెరిస్తే జనం, కన్ను మూస్తే మరణం, తెరపు మూతల మధ్య కాలం మనిషి జీవితం అని ఒక ప్రసిద్ధ కవి అంటే, మనిషి



మదిలో రేకెత్తేలా చేశారు. ఇక తన ఉద్యోగ ప్రస్థానానికి ముందు రాజమండ్రిలో దామెర్ల చిత్రకళాశాలలో పనిచేస్తుండగా ఆయన వేసిన 'దక్షయజ్ఞ విధ్యంసం' చిత్రం ఆయన చిత్రాల్లో కెల్లా అద్భుతమైనదిగా చెప్పుకోవచ్చు. కానీ ఉద్యోగరీత్యా తన మకాం రాజమండ్రినుండి ఖమ్మంజిల్లా మోతుగూడెంకు మార్చే క్రమంలో సరైన భద్రత తీసుకోకపోవడంతో ఆ చిత్రం పాడయ్యి కేవలం ఫొటో మాత్రం మిగలడం బాధాకరం.

కులవృత్తి తప్ప మరే ఇతర రసగంధాలు అంతవరకూ ఎరుగని కుటుంబంలో శ్రీమతి సత్యవతి, సత్యనారాయణ దంపతులకు 1948, జూన్ 15వ తేదీన రాజమండ్రిలో ఒక సాధారణ కుటుంబంలో జన్మించిన సుబ్బారావుకు చిన్నతనం నుంచే చిత్రకళపై ఆసక్తి ఏర్పడింది. తాను రాజమండ్రిలో 6,7 తరగతులు చదువుతున్న కాలంలో అక్కడ మతిస్థిమితం లేని ఒక పిచ్చివాడు బొగ్గుతో రాజమండ్రి రోడ్లపైనా, ఇంటి గోడలపైనా అలవోకగా ఏవేవో బొమ్మలు గీసుకుంటూ పోతూ వుంటుంటే ఆశ్చర్యంగా చూస్తూ వుండే వాడినని అవే తనలో మొదట చిత్రకారునిగా ప్రేరణ కలిగించాయని శ్రీ సుబ్బారావు చెప్తారు.

1964లో తాను SSLC లో ఉండగానే దామెర్ల రామారావు ప్రభుత్వ చిత్రకళాశాల రాజమండ్రిలో చిత్రకళాభ్యాసం కోసం చేరడం

జీవితం అల్పమని దాన్ని గాజు బొమ్మతో పోల్చాడు మరో కవి. మృత్యువు ఏ క్షణాన ఏ వయసులో ఎలా మనిషిని ఆవహిస్తుందో చెప్పలేము, ఇదే భావాన్ని శ్రీ సుబ్బారావు తన చిత్రం " Symble of Lifte" ద్వారా చూపించారు. దానిలో ఒక పెద్ద వయస్కురాలైన స్త్రీ ఒక చేతిలో బొమ్మను పట్టుకుని చూపిస్తూ ఏదో చెబుతూ వుంటుంటే ఆమె చుట్టూ చేరిన వివిధ వయో భేదాలున్న (Different age groups) స్త్రీలు వివిధ భావాలతో ఆశ్చర్యంగా చూస్తూ వింటున్నట్లు కనిపిస్తుంది.

కార్తీక పౌర్ణమి చిత్రంలో వేకువ ఝామున కార్తక దీపాలను వదిలేందుకు నదీతీరానికి వచ్చిన మహిళలను చూసినట్లయితే శైలిలో భేదమున్నప్పటికి మన దామెర్ల రామారావు గారి చిత్రాలు గుర్తుకు వస్తాయి. "స్టేషన్" అన్న చిత్రంలో బస్సు లేదా రైలు కోసం నిరీక్షిస్తూ అలసిపోయిన ప్రయాణీకులు అది వచ్చే లోపు బడలిక తీర్చుకునేందుకు అక్కడ సరైన స్థలం లేకున్నప్పటికీ అక్కడికక్కడే విశ్రాంతికుపక్రమించే ప్రయాణీకుల యొక్క పాట్లు మనకు కనిపిస్తాయి. బ్రతుకంతా సమస్యలతో నలిగిపోతూ ఈ భువిపై నిలువ నీడే లేని నిర్భాగ్యులకు ఇక శూన్యమే శరణ్యమా అన్నట్లుగా జీవన్మరణస్థితిలో ఉన్న మనిషిని అటు నేల ఇటు నింగీ కాని ఒక విధమైన శూన్యస్థితిలో చిత్రించడం ద్వారా మనిషి దౌర్భాగ్యస్థితిని "స్పేస్" అన్న చిత్రంలో చూపించారు. అలాగే వికృతంగా మారిన మనిషి ప్రకృతిలోని పచ్చదనాన్ని ఎలా నాశనం చేస్తున్నాడో చూపడానికి ఇద్దరి మానవ రూపాలను నీలం, ఊదారంగుల్లో వికృతాకారాల్లో చూపి ప్రకృతిలోని పచ్చదనాన్ని హరిస్తుండగా పైన పచ్చని చిలుక ఆక్రందనను చిత్రించడం ద్వారా ప్రకృతి విలాపాన్ని ప్రేక్షకునికి అర్థమయ్యేలా చేశారు. మరొక చిత్రం డ్యాన్స్‌లో సంతోషాన్ని వ్యక్తం చేయడానికి ఇద్దరి నృత్య భంగిమలను చిత్రించి, ఆ భావాన్ని స్ఫురింపజేయడానికి చిత్రాల్లో వాడే పసుపు లేదా నారింజ రంగులను కాకుండా అందుకు విరుద్ధమైన భావాన్ని స్ఫురింపజేయడానికి వాడే వర్ణాయిన నీలం, వంగపండు రంగులతో ఆ చిత్రాన్ని వేయడం ద్వారా సంతోషం సరసనే బాధలు, కష్టాలు వుంటాయనే భావాన్ని ప్రేక్షకుడి



జరిగింది. దేశీయ, జానపద అబ్‌స్ట్రాక్, అకడమిక్ శైలులలో ప్రతిభావంతుడైన సర్గీయ మాదేటి రాజాజీ గారు ఆ చిత్రకళాశాలకు ప్రిన్సిపల్‌గా వుండగా 1964 నుండి 1969 వరకూ ఆయన వద్ద చిత్రకళాభ్యాసం చేసి దామెర్ల చిత్రకళాశాల నుండి డిప్లమో తీసుకున్నారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంకేతిక విద్యాశాఖ వారు నిర్వహించే డ్రాయింగ్ హయ్యర్ మరియు పెయింటింగ్ పరీక్షలను 1967, 1968లలో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు. 1973లో మద్రాస్ స్టేట్ టెక్నికల్ బోర్డునుండి ఫ్రీహేండ్ అండ్ అవుట్‌లైన్, మోడల్ డ్రాయింగులలో కూడా ఉత్తీర్ణులయ్యారు.




1958నుండి 1973 వరకూ రాజమండ్రి కళా ప్రపంచంలో మెలిగిన శ్రీ సుబ్బారావు గారికి 1974లో ఆంధ్రప్రదేశ్ విద్యుత్ సంస్థవారి ఖమ్మం మోతుగూడెం పవర్‌ప్రాజెక్టు హైస్కూల్‌లో ఆర్ట్‌టీచర్‌గా ఉద్యోగం రావడం వలన తన మకాం రాజమండ్రి నుండి మోతుగూడెంకు మార్చడంతో తాను అంతవరకూ విహరించిన కళాప్రపంచపు ఆనంద వాతావరణానికి దూరమయ్యారు. పట్టణ వాతావరణమైన రాజమండ్రికి అది ఎంతో దూరమే గాక ఆ రోజుల్లో రవాణా సౌకర్యాలు ఏమాత్రంలేని అటవీ ప్రాంతంలో వుండే. మోతుగూడెంకు ఉద్యోగరీత్యా వెల్లడం. చిత్రకళకు సంబంధించిన సామాగ్రి ఏమీ అందుబాటులో లేకపోవడం. ఒక వేళ తన వద్ద వున్న వాటితో వేసినా అవి బయటకు పంపే మార్గాలు సరిగా లేని ఒక అననుకూల పరిస్థితులలో ఆయన ఉద్యోగబాధ్యతలు నిర్వహించడంతో 1974నుండి 2006 వరకూ దాదాపు 32 సం॥లు కళాపరంగా ఆయనకు నిస్తేజంగా గడిచింది. ఈకాలంలో అక్కడ స్కూలు పిల్లలకు డ్రాయింగ్ పాఠాలు చెప్పడం, లైన్ డ్రాయింగులు వేయడం తప్ప ప్రవృత్తికి సంబంధించిన వృత్తినే నిర్వర్తిస్తున్నప్పటికీ అక్కడ గల ఆ ప్రతికూల వాతావరణం కళా పరంగా ఆయనను ప్రగతి నిరోధకంగా మార్చింది. అందుకే తన కళా ప్రస్థానంలో తనను వరించిన అవార్డులు, బహుమతులు అన్నీ తన ఉద్యోగ ప్రవేశానికి ముందుగానే కనిపిస్తాయి.

1966లో చిత్రకళా పోటీలలో సిల్వర్‌కప్ అందుకుంటే, 1967లో హైలీకమెండెడ్ సర్టిఫికెట్ పొందారు. 1968లో దామెర్ల రామారావు గ్యాలరీ వార్షిక పోటీల్లో ప్రథమ బహుమతి గెల్చుకున్నారు. 1973లో అంకాలా ఆర్ట్ అకాడమీ భీమవరం వారు నిర్వహించిన పోటీల్లో "బెస్ట్ ఎగ్జిబిట్" అవార్డు అందుకోగా మరలా అదే సంవత్సరం అఖిలభారత చిత్రకళా పోటీల్లో బెస్ట్‌స్టడీ అవార్డును సొంతం చేసుకున్నారు. 1974లో చిత్రకళా సంసద్ మచిలీపట్నం వారు నిర్వహించిన పోటీల్లో బెస్ట్ ఎగ్జిబిట్ అవార్డును అందుకున్నారు. 1974లో ఉద్యోగంలో చేరిన తదుపరి ఈ చిత్రకారుడి గ్రాఫ్ వెలితిగా కనిపిస్తుంది.

"ప్రతికూల స్థితిలో వొడలిన మొలకకు కాస్త జీవం చాలు మరల చిగురించడానికి. అలాగే నిస్తేజమైన కళకు కాస్త అనుకూల స్థితి చాలు మరలా ద్విగుణీకృతం కావడానికి".

దాదాపు 32సంవత్సరాలు ప్రతికూల వాతావరణంలో కుంటుబడిన తన చిత్రకళా వ్యాసంగానికి మరలా జీవం పోసింది తన పదవీవిరమణ. 30-6-2006న మోతుగూడెం పవర్ ప్రోజెక్ట్ హైస్కూల్ ఆర్ట్‌టీచర్‌గా ఉద్యోగ విరమణ పొందిన అనంతరం శ్రీ సుబ్బారావు తన స్వంతప్రాంతమైన రాజమండ్రి తిరిగి రావడంతో అంతకాలం నిస్తేజంగా మారిన తన కళకు మరల పునర్జీవనం ఏర్పడింది. విశ్రాంతి కాలాన్ని పూర్తిగా చిత్రలేఖనంతో గడుపుతున్నారు. ఆయన ఇటీవల బేలూరు సందర్శించిన సందర్భంగా అక్కడ చూసిన శిల్పసంపదను అంతా పెన్ అండ్ ఇండియన్ ఇంక్ డ్రాయింగ్స్‌గా వేసారు. ఇంకా వాటర్, ఆయిల్ మరియు ఏక్రిలిక్ మాధ్యమాలతో విరివిగా బొమ్మలు వేస్తుండడమే గాక తన గురువర్యులైన శ్రీ మాదేటి రాజాజీ గారి పేరు మీదుగా రాజాజీ స్కూల్ ఆఫ్ పెయింటింగ్స్ అన్న చిత్రకళాశాలను నిర్వహిస్తూ ఎందరో విద్యార్థులకు చిత్రకళాపాఠాలు నేర్పిస్తూ జీవనం సాగిస్తున్నారు.

అసంఖ్యాకమైన చిత్రాలను వేస్తూ, వందలాది మంచి శిష్యులను తయారు చేస్తూ స్వర్గీయ రాజాజీ వలె చిత్రకళా చరిత్రలో తనదైన ప్రత్యేక స్థానాన్ని ఏర్పరచుకోవాలని ఆశిద్దాం.



# పేరులో నేముంది?!

2

**- అమ్మిన శ్రీనివాసరాజు**

మనిషిని, జంతువును వేరు చేసేది భాష. అంతటి గొప్ప భావ వ్యక్తీకరణ శక్తిగల మానవునికున్న మరో ప్రత్యేకత "పేరు" సాధారణంగా మానవులకు పేర్లు మొదట స్వభావాన్ని బట్టి ఏర్పాటు చేసినా ఆ పిదప కృతజ్ఞతకు. అభిమానాలకు చిహ్నాలుగా పేర్లు పెట్టుకోవడం సరిపాటి అయ్యింది. క్రమేణా అసలు పేర్లకు, మనుషులకు సంబంధం లేకుండాపోతుంది.

ఏది ఏమైనా పేరుకు మనిషికి సంబంధం లేకుండా వుండదు అదో అవినాభావ సంబంధం. నేటి సమాజంలో కొందరు పేరున్న ప్రముఖులు అసలు పేరు కన్నా కొసరు పేరుతోనే ప్రాచుర్యంలో వున్నారు. అసలు పేరుతో సంబోధిస్తే వారెవరు అనే ప్రమాదం వుంది.

అందుకే 'అరవైనాలుగు కళలు' అంతర్జాల మాసపత్రిక వీక్షక పాఠకుల కోసం ప్రతి మాసం కొందరు ప్రముఖుల అసలు పేర్లు పరిచయం చేయడమే ఈ ప్రయత్న నేపద్యం...







| | | |
|---|---|---|
| పి.చిదంబరం | పళినియప్పన్ చిదంబరం | మాజీ కేంద్ర ఆర్థికమంత్రి |
| ఐ.వెంకట్రావు | ఇనగంటి వెంకట్రావు | పత్రికారచయిత |
| కె.బి. గోపాలం | కారంచేడు బుచ్చిగోపాలం | సినీరచయిత |
| యం. వెంకయ్య నాయుడు | ముప్పవరపు వెంకయ్యనాయుడు | బి.జె.పి.నేత |
| పి. భానుమతి | పాలువాయి భానుమతి | సినీనటి |
| వడ్డెర చండీదాస్ | చెరుకూరి సుబ్రహ్మణ్యేశ్వరరావు | తెలుగు నవలారచయిత |
| జె.వి. సోమయాజులు | జొన్నలగడ్డ వెంకట సుబ్రహ్మణ్య సోమయాజులు | సినీనటులు |





| | | |
|---|---|---|
| బి.యన్. రెడ్డి | బొమ్మిరెడ్డి నరసింహారెడ్డి | సినీనిర్మాత |
| బి.ఆర్. అంబేద్కర్ | భీమ్‌రావ్ రామ్‌జీ అంబేద్కర్ | రాజ్యాంగనిర్మాత |
| సి.యస్. ఆర్. ఆంజనేయులు | చిలకలపూడి సీతారామాంజనేయులు | రంగస్థల నటులు |
| రాళ్ళపల్లి | రాళ్లపల్లి వెంకట నరసింహారావు | సినీ హాస్యనటుడు |
| జింబో | మంగరి రాజేందర్ | కవి |

| | | |
|---|---|---|
| గుడిపాటి | గుడిపాటి వెంకటేశ్వర్లు | రచయిత |
| హెచ్. డి. దేవగౌడ | హర్దనహళ్లి దొడ్డిగౌడ దేవగౌడ | మాజీ ప్రధాని |
| హెచ్.యం.రెడ్డి | హనుమంత మునిదుప్పరెడ్డి | తొలి సినీ దర్శకుడు |
| టి.యల్. కాంతారావు | తాడేపల్లి లక్ష్మీకాంతారావు | సినీ నటుడు |
| సాక్షి రంగారావు | రంగావఝుల రంగారావు | సినీ నటుడు |
| సి.యం.త్రివేది | చందూలాల్ మాధవ త్రివేది | ఎ.సి. తొలి గవర్నర్ |
| కె.ఆర్. సురేస్ రెడ్డి | కేతిరెడ్డి సురేష్ రెడ్డి | మాజీ అసెంబ్లీ స్పీకర్ |







# పేరులో నేముంది?!





| | | |
|---|---|---|
| జె.కె. భారవి | జయశ్రీ కుమార భారవి | సినీ రచయిత |
| ఎ.బి.కె. ప్రసాద్ | అన్నే భవాని కోటేశ్వరప్రసాద్ | పత్రికా సంపాదకులు |
| యస్.వి. కృష్ణారెడ్డి | సత్తి వెంకటకృష్ణారెడ్డి | సినీ దర్శకులు |
| రాంషా | దర్భా వెంకటరామశాస్త్రి | సాహితీవేత్త |
| పాల్‌రాజ్ | సోమరౌతు మల్లికార్జునరావు | క్రైస్తవమత పెద్ద |
| శశాంక | ఓలేటి వెంకట సుబ్బారావు | సాహితీ వేత్త |

# 'చిత్ర' మైన జీవితం

Part-4

**ప్రముఖచిత్రకారుడు, కార్టూనిస్టు, కథారచయిత బాలిగారు 64కళలుడాట్‌కాం పాఠకులకోసం తన కళాజీవిత విశేషాలను, బాల్యస్మృతులను, పరిచయాలను ధారావాహిక రూపంలో అందించనున్నారు. నెల నెలా చిత్రమైన జీవితంలో...**





email: balisankar@gmail.com

ఎస్.ఎస్.ఎల్.సి. పాసయ్యాను

కాలేజీలో చేరాను. పి.యూ.సీ కూడా అయిపోయింది. డిగ్రీలో చేరాలి. మా మేనమామ ఓ అప్లికేషన్ ఫారమ్ తెచ్చి నాకందచేస్తూ దాన్ని నింపి ఇవ్వమన్నాడు. అది సెకండరీ గ్రేడ్ బేసిక్ ట్రయినింగ్ కోసం. అంటే స్కూలు టీచర్‌గా వెళ్లడానికి గల ముందు ట్రయినింగ్ అన్నమాట. ఎవరో ఆయనకు చెప్పారట. టీచర్‌గా వెళ్తే మీ వాడికి కావలసినంత తీరిక ఉండి బొమ్మలూ అవీ హాయిగా వేసుకోగలుతాడనీ.

ఆయన మాట శిరోధార్యం. కాకుంటే అగ్గిరాముడవుతాడు. అప్లయ్ చేశాను. ఇంటర్వ్యూకి వెళ్లాను చాలా పోటీగా ఉంది. ఏదన్నా స్పెషల్ ఏక్టివిటీ ఉన్న వారినే సెలక్ట్ చేస్తున్నారు. నాకు సీటు రాదనుకున్నాను రావద్దని మొక్కుకున్నాను కూడా. అక్కడున్న సీనియర్లను అడిగితే ఈ ట్రయినింగ్ చాల కష్టమయినదే, నువ్వు చూస్తే అర్భకంగా ఉన్నావు అన్నారు. అయితే జరిగింది మరొకటి. నా బొమ్మలు వల్ల నన్ను సెలక్టు చేశారు. నాకున్న స్పెషల్ ఏక్టివిటీ అదొక్కటే. స్టయిఫండ్ ఇవ్వడం మొదలెట్టారు. తప్పదు అన్నట్లు జాయిన్ అయ్యాను. ఆ వూరు 'కోడిఊరట్ల' విశాఖజిల్లా నర్సీపట్నం దగ్గర. అయితే ఆ సీనియర్లన్నంత భయంలేదు. కొత్త కొత్త మిత్రులతో ఆ



రెండు సంవత్సరాలూ బాగానే గడిచిపోయింది. అయితే... అక్కడా ఓ డ్రాయింగ్ మాష్టారున్నాడు. ఆయన మాకు బొమ్మలు నేర్పి ఛార్టు తయారుచేయించి, స్కూలులో పిల్లలకు వాటి ద్వారా భోదన చేయించడానికి. అయితే ఆయనకు సిలబస్ తెలుసుగానీ ఫ్రీహేండ్ రాదు. నేను పత్రికల్లో బొమ్మలు గీస్తానని తెలిసి బిగిసిపోయాడు. కొన్ని బొమ్మలు పత్రికలకు పంపాడు. అవి తిరిగి వచ్చాయి ఫలితంగా నా మీద ద్వేషం పెంచుకున్నాడు. కిటుకు ఏమిటో చెప్పమంటాడు. అందంగా, సున్నితమైన రేఖలతో గీయలేదు. చెప్పి, చెప్పి విసుగొచ్చింది. నాతో మాట్లాడ్డంమానేశాడు. తలనొప్పి తగ్గింది.

టీచర్ ట్రయినింగ్ రెండు సంవత్సరాలూ అయిపోయింది. దానివల్ల నాకు లాభించింది ఏమిటయ్యా అంటే నన్ను అభిమానించే ఇద్దరు, ముగ్గురు మిత్రులు ఏర్పడ్డారు. నలుగురిలోనూ కలిసిమెలిసి తిరగడం అలవాటయ్యింది. అక్కడి ఆరోగ్యకరమైన వాతావరణం వల్ల

బరువు పెరిగాను. ట్రయినింగ్ అయిన తరువాత ఓ ఆరునెలలు స్కూలు టీచర్‌గా పనిచేశాను. ఇంతలో ఇంతకు ముందే సర్వీస్ కమీషన్ పరీక్షకు వెళ్లడం వల్ల అది పాసయినట్టు తెలిసి పబ్లిక్ వర్క్ డిపార్ట్‌మెంట్‌లో గుమస్తాగా చేరమని ఆర్డర్స్ వచ్చాయి. ఫలితంగా నన్ను అప్పటి శ్రీకాకుళంజిల్లా పార్వతీపురం వెళ్లా అందులో జాయిన్ అవుతూనే అందులో పనిచేస్తున్న ఓ వ్యక్తిని అడిగాను. దీనికి స్కూల్‌లో వలె సమ్మర్ సెలవులు ఉంటాయా? అని. దానికి వాడో వెర్రి నవ్వు గట్టిగా నవ్వి " వెర్రోడా!! దీనికి సెలవేంటి? స్టేట్ గవర్నమెంట్ జాబులంటే గాడిద చాకిరీ. రెవన్యూలూ ఈ పి.డబ్లు. డీ, అన్నీ అంతే . ఈ గాడితలకు రాత్రింబవళ్లు ఒకటే చాకరీ. అదిగో ఆ గుమ్మాలను పట్టుకొని ఏడవాలి". అన్నాడు. నా గుండె గుభేలుమంది.




నాతో అన్ని అబద్ధాలు చెప్పి ఇందులోకి నెట్టింది మా మేనమామ. టీచర్ ఉద్యోగం కంటే ఇది ఎంతో బాగుంటుందన్నాడు. అది వదిలి వాచ్చాను.

ఇక బొమ్మలకూ, ఆ రకమయిన ఆలోచనలకూ దూరం అయిపోయాను. రాత్రింబవళ్లూ ఒకటే చాకరీ. గాడిద చాకిరీ. పార్వతీపురంలో 3నెలలు ట్రయినింగ్ అయిన తరువాత విజయనగరం డివిజన్ ఆఫీసుకు వెళ్లమన్నారు. అక్కడా రెండు సంవత్సరాలు చేశాను. ఆఫీస్‌లోనే రికార్డ్ అసిస్టెంట్‌గా శ్రీ రావికొండలరావు గారి బావమరిది హరనాథ్ పనిచేసేవాడు. ఓ ఆదివారం సాయంకాలంపూట ఓ రోడ్డు మీద నిలబడి ఈరోడ్డెక్కడకెళుతుందీ అనుకుంటూ చాల దూరం వెళ్లిపోయాను. అయితే అక్కడతో ఆ రోడ్డు వంకర్లు తిరిగి ఇళ్ల మధ్య నుండి వెళ్లిపోతోంది. నాకు ఇక నడిచే ఓపిక లేక ,రాళ్ల గుట్టలు, మేకలు, చింతచెట్లు ఉన్న వేపు వెళ్లాను. అక్కడ రాళ్ల గుట్టల మధ్య తెల్లగా సున్నం వేసిన సమాధి కనడింది. దాని చుట్టూ దాని మీదా మేకలు గెంతుతున్నాయి. ఆ సమాధి మీద నల్లని అక్షారాలున్నాయి. చదివితే "కళావరి రింగ్" సమాధి అది. విజయనగరం గురించి పూర్తిగా తెలుసకోవాలంటే ఆమెకో రెండు పేజీలు ఆమె గురించి వివరించి ఉంటాయి. ఆమె గొప్ప నాట్యకళాకారిణి. పచ్చికుండమీద నేర్పుగా నృత్యంచేసే విద్యత్తు కలది. ఎన్నో పాటలు, పద్యాలు రికార్టులుగా ఇచ్చినామె. ఇవన్నీ ఆమె గురించి చదివాను ఎక్కడో!! ఇంతలో నన్ను చూసి ఓ వ్యక్తి పరుగున వచ్చాడు. ఆమె తన బంధువు అన్నాడు. "సంతోషం" అన్నాను. కాసేపట్లో దీని చాటుగా సారా అమ్ముతామనీ, సీసా ట్యూబులూ పట్టుకొని మరికొంతమంది వస్తారని, మీరూ తాగడానికి అలా వచ్చారేమోనని కనుక్కుందామని వచ్చానన్నాడు.

ఈ విజయనగరం తరువాత చోడవరం ట్రాన్స్‌ఫర్ అయ్యింది. అది సబ్ డివిజన్‌ఆఫీస్ మెయిన్‌ఆఫీస్ విజయనగరంలో ఉంటుంది. నేనూ, ఓ హెడ్ క్లర్క్ ఇద్దరు అటెండర్లు, అసిస్టెంట్ ఇంజనీరుగారు మాత్రమే ఉండే ఆఫీసన్న మాట. వర్క్.... వర్క్... వర్క్ ఒత్తిడి ఎక్కువన్న మాట. అక్కడున్నప్పుడే పెళ్లి జరిగింది.

రాత్రి 8 గంటల తరువాతే ఇంటికి వెళ్లడం. రాత్రి ఒంటి గంట తరువాత ఇంటిముఖం పట్టిన రోజులు ఎన్నో ఉన్నాయి. పెళ్లయిన కొత్తల్లో రాత్రి 9 గం॥లకు ఇంటికి వెళితే మా ఆవిడ సరదాపడి రెండో ఆట సిన్మాకి వెళదామంది. ఇద్దరం సినిమాకు బయలు దేరాం. మా ఆఫీసు ముందు నుండే ఆ హాలుకి వెళ్లాలి. అంటెండర్ నా కోసం వస్తున్నాడు. 'అయ్యగారు మిమ్మల్ని పిలుస్తున్నారండి, మీ ఇంటికే వస్తున్నాను. ఏదో అర్జంట్ పని ఉందట' అన్నాడు.

మా ఆవిడకు కోపం వచ్చింది. "ఇలాంటి ఉద్యోగాలు చేసే బదులు నాలుగిళ్లల్లో ప్రయివేట్‌లు చెప్పుకోవడం మేలు" అంది విసుగ్గా.

"సరే" అని నేను ఆమెను ఇంటికి దిగ బెట్టి తిరిగి ఆఫీసుకు వెళ్లాను. అన్ని పనులూ చేసే సరికి రాత్రి రెండు గంటలు దాటింది.

నా బొమ్మలూ, వాటి గురించి ఆలోచనలూ ఓ మూలనపడ్డాయి. ఏ రెండు నెలలకో చిన్న గీత గీయడం గగనమయిపోయింది. ఆ

రోజులలోనే ఆంధ్రజ్యోతి వారపత్రిక విజయవాడ నుండి వెలువడడం చూశాను. "ఆంధ్రపత్రిక" "ఆంధ్రప్రభ"ల తరువాత మరో చక్కటి వారపత్రిక వస్తోందనిపించింది. అందులో నన్ను ఆకర్షించింది. 'బాలజ్యోతి'.

చిన్న పిల్ల సెక్షన్. ఏదన్నా కథరాసి దానికి నేనే బొమ్మలు వేసి పంపితే ఎలా ఉంటుంది? అని అనిపించింది. ఆలోచించాను! మా అమ్మ తరుపు బంధువు, చింతపల్లి అడవులోల కిన్నెర్ల అనే ప్రాంతంలో ఫారెస్ట్ రేంజర్‌గా ఉండేవాడు. ఆయన పేరు శెట్టి అప్పారావుగారు. గిరిజనుల సంక్షేమ నిమిత్తం వారి ఉపాధి కల్పన కోసం కాఫీ గింజల నర్సరీ గవర్నమెంట్ మొదలుపెట్టింది. గింజలు మొలకెత్తేట్టు చెయ్యడం, పెద్దపెద్ద చెట్లనీడన నీటిపారుదల ఉన్న ప్రదేశం చూసుకొని గోతులు త్రవ్వి మొక్కలు నాటేయడం ఆ మొక్క పెరిగి పెద్దయ్యే వరకు వేళ్ళు, దుప్పులు మొదలగు అడవిజంతువులు తినకుండా చెయ్యడం ఈతని ఆధ్వర్యంలోని పనులు. వాటికోసం ఆ కొండల్లో కొన్ని మైళ్ళు కేటాయించబడ్డాయి. ఓ వేసవి రమ్మంటే వాళ్లింటికి వెళ్లాం. ఈ చింతపల్లి విశాఖజిల్లాలో నర్సీపట్నానికి కొంతదూరంలో ఉన్నకొండల్లో ఉంది. కిన్నెర్ల పోవాలంటే చింతపల్లి వరకూ వెళ్లకుండా ఆ కొండల్లోనే చిన్న టర్నింగ్ వేపు తిరిగి ఓ పదిహేను మైళ్లున లోపలికి వెళ్తే ఈ ప్రాంతం కనిపించింది. అదంతా చిక్కటి అడవిప్రాంతం. అంత వేసవిలోనూ సాయంత్రం ఐదుగంటలయ్యేసరికి విపరీతమయిన చలి. నెగళ్లు వేసుకుంటేనే గాని నిద్రరాదు. వారి దగ్గర ఆఫీస్ ట్రక్కు ఉండేది. దాని డ్రైవర్ అహమ్మద్, అతని ట్రక్కులోనే ఆ కొండల్లో రాకపోకలు కాఫీగింజలు మరోచోటుకి చేరెయ్యాలన్నా రేషన్ కిందనుండి అక్కడున్నవారికి అందించాలన్నా అప్పారావుగారి కుటుంబ



సభ్యులు మరో ఊరు వెళ్లాలన్నా ఆ ట్రక్కు కిందకు అంటే నర్సీపట్నం వచ్చేరోజునే ప్రయాణం పెట్టుకొనేవారు. ఇతనితో గిరిజనులు ఎక్కువగా పొగాకు, ఉప్పు తెప్పించుకొనేవారు.

అప్పారావుగారి ఫ్యామిలీ ఉండేది ఇల్లు కాదు. పెద్ద పాక. అయితే ఆ పాకను వంటగదిలా హాలులా వెదుళ్లతో ఏర్పాటు చేసుకున్నారు. పండిన కాఫీ గింజలను జాగ్రత్తచెయ్యడం కోసం మాత్రమే రెండు సిమ్మెంటు గదులు ఉన్నాయి. వెదుళ్లతో గదులు వేసుకొని గిరిజనులూ, కొంతమంది గుమస్తాలూ ఉండేవారు. పాలు, పెరుగు కోసం రెండు గేదెలను పెంచుతున్నారు. వాటిని రాత్రిపూట ఉంచడానికి చుట్టూ పాకల వంటివి వెదుళ్లలో బలంగా కట్టారు. లోపలికి గాలి కూడా చొరబడనంత గట్టిగా ఆ చుట్టూ పాకలను కట్టేరు. అయినా ఏదో ఒక రాత్రపుడు వాటి వాసనకు పులులు ఆ పాకలను ఎక్కి గోళ్లతో గీరడం, శబ్దం చెయ్యడం చేసేవి. అలా శబ్దమయితే వీళ్లంతా కేకలు వెయ్యడం, డబ్బాలతో శబ్దం చెయ్యడం చేసేవారు. పగలయితే ఈ వర్కర్లందరూ గుంపు గుంపులుగా తిరుగుతుండేవారు.

ఆ ఇంటికి కొంచెం దూరంలో పల్లపు ప్రదేశం ఉంది. దానికో పక్కన విపరీతమయిన శబ్ధంతో ప్రవహించే కాలువ ఉంది. ఆ కాలువ నీళ్లే వీళ్లు తాగడం. కావాలనుకున్నప్పుడు వెదురు తడికలు అడ్డుపెట్టి చేపలు పట్టడం చేసేవారు.

అప్పారావుగారికి ఇద్దరమ్మాయిల్లో రెండో అమ్మాయి పేరు గిరిజ. గిరి అని పిలిచేవారు. ఆమెకు డిటెక్టివ్ పుస్తకాలంటే పిచ్చి. ఇంట్లో ఉంటే ఏదన్నా పనిచేయబడుతుందని లేక ఇల్లు అనే పాక ఇరుకుగా ఉందనీ ఆ పుస్తకాన్ని పట్టుకొని ఆ కొండల్లో, డొంకల్లోంచి చెట్ల గుబురులోంచి కొంచెం విశాలంగా ఉన్న ప్రాంతంలో ఉన్న బండరాయి మీద పడుకొని నవల చదువుకొనేది. ఆ రాయికి అటూ ఇటూ నీళు గల గలమని ప్రవహించేవి. నాకు వరుసకు చెల్లెవుతుంది. నన్నోమారు తీసుకెళ్లింది. ఆ రాయి దగ్గరికి. ప్రశాంతంగా ఉంది కానీ మధ్య మధ్యలో జంతువుల అరుపులు వినిపిస్తున్నాయి. ఏ అడవి జంతువన్నా మీదపడితే ఏంటి గతి? అదే అడిగాను.

నవ్వి అంది "అంత భయంలేదు. నాకు అలవాటయిపోయింది చిన్నప్పట్నుంచీ కొండల్లో పెరగడం. ఓమారు ఇలాగే పుస్తకం చదువుకుంటోందట. ఎందుకో దృష్టి మరల్చి పక్కన నీళ్ల వేపు చూస్తే ఏదో జంతువు తిన్న మరో జంతువు ఎముకల గూడు, రక్తంతో మాంసంతో కొట్టుకువస్తే కాళితో నీళ్లల్లోకి నెట్టి తిరిగి చదువులో పడ్డానంది నాకు భయం. ఏ జంతువన్నా మీద పడితే ఆ గుట్టలు, రాళ్లు ఎక్కి తప్పించుకోలేం సరియైన దారి లేదు.

ఇప్పుడా అమ్మాయికి పెళ్లయి, ఇద్దరు పిల్లల తల్లయి విశాఖపట్నంలో ఉంది.

అయితే ఆ ఇంట్లో మేం ఉండగానే డ్రయివర్ అహమ్మద్ దారిలో రోడ్డుమీద దొరికిందంటూ ఓ ఎలుగు బంటి పిల్లను తెచ్చాడు దాని వయసెంతో తెలియదు. నల్లగా తెల్లని గోళ్లతో ఉండేది. గోడ పక్క మబ్బుగా పడుకొనేది. ఓ కన్ను ఎత్తి చూడ్డం, కోపం లాంటిది వస్తే పైపెదవి ఎత్తి కోరపళ్లు లాంటివి చూపేది. గుర్, గుర్ మన్న శబ్ధం తప్ప మరో అరుపులేదు. దానికి చేపముక్కలు పెట్టడం, పాలు పట్టడం చేసినా పెద్దగా శ్రద్ధ చూపలేదు. దాన్ని చూస్తోంటే భయంగా అందరి వేపూ చూస్తున్నట్టు అనిపించింది. ఇదంతా అప్పారావు గారు గమనించారు. ఓ వారం రోజులు తరువాత అహమ్మద్‌ని పిలిచి అది ఎక్కడదొరికిందో అదే ప్రాంతంలో రోడ్డు పక్క దాన్ని వదిలేయమని చెప్పారు. అతడు అలాగే చేస్తే దాని సన్నని అరుపులకు మరో పదినిముషాల్లో దాని తల్లి వచ్చి పక్కనున్న చెట్ల మధ్యకు తీసుకెళ్లిందని చెప్పాడు. ఆ తల్లి దగ్గర ఇంకో పిల్ల కూడా ఉందట.

ఆ పది రోజుల్లోనే దీని అలవాట్లను, దాని వెనకపడ్డ ఆ ఇంట్లోని చిన్న పిల్లల హడావుడినీ గమనించి సరదాగా చిన్న కథ రాసి దానికి నేనే బొమ్మలు వేసి "అమ్మేకావాలి" అనే టైటిల్ పెట్టి పురాణంగారికి పంపాను. దాన్ని ప్రచురణకు స్వీకరిస్తూ శర్మగారు జవాబు రాశారు. బొమ్మలూ మీరే, కథా మీరే రాస్తే రెమ్యూనరేషన్ తక్కువ వస్తుంది కాబట్టి మరో ఉపాయం ఆలోచించండని రాశారు. ఆ కథను నా శ్రీమతి రాసినట్టు ఆమెపేరు "ధనం" అని రాశాను. శర్మగారు దానికి అంగీకరించి "రచన ధనం-బొమ్మలు బాలి" అని ప్రచురించారు. ఆంధ్రజ్యోతిలో ఐదారువారాలు చిన్న పిల్లల బాలజ్యోతి శీర్షికలో సీరియల్‌గా వచ్చింది. దాన్నే తరువాత న్యూస్టూడెంట్స్ వారు పుస్తకంగా వేశారు.

అయితే దీనివల్ల మా మధ్య ( పురాణం గారికీ, నాకూ) పరిచయాలు పెరిగాయి. నా మీదో సదాభిప్రాయం వచ్చినట్టుంది. అయితే ఇదంతా తరువాత తెలిసిందనుకోండి. అప్పటికి ఆయన దగ్గరకు ఆయన మిత్రులయిన "భమిటిపాటి రామగోపాలం"మసూనా" గార్లు తమ తమ ఉద్యోగాలకు కొన్నాళ్లు



తుర్లపాటి, ఆర్టిస్టు ఈ.వి.ఆర్., పురాణం గార్లతో బాలి

సెలవు పెట్టి ఆంధ్రజ్యోతిలో ఆయనకింద పనిచేస్తుండేవారట. "మసూనా"గారు విజయవాడ ఎండలకు తట్టుకోలేక మూడు నెలలకు తిరగి వైజాగ్ చేరుకున్నారట. రామగోపాలంగారు చాన్నాళ్లు ఉన్నట్టున్నారు. అయితే వీరిద్దరూ నా బొమ్మలు చూశారు కాబోలు. రామగోపాలంగారి కజిన్ బ్రదర్ ఒకరు మా అనకాపల్లిలో ఉన్నారు ఆయన ద్వారా ఇంటికి కబురుపెట్టారు. అది నాకో పెద్ద టర్నింగ్‌పాయింట్.

''శ్రీ పురాణంగారు విజయవాడ నుండి మీకు బొమ్మల నిమిత్తమూ కథలు పంపుతారట. మీరు వేస్తారా? సకాలానికి పంపుతారా అని"

నేను "ఓ.కే " అన్నాను.

మరో వారం రోజుల్లో కొన్ని కథలు- రామగోపాలంగారూ పురాణంగారూ రాసిన ఉత్తరాలు తో పాటు వచ్చాయి. (అప్పటికన్నా పెర్మనెంట్ చిరునామా అనకాపల్లే అయిన చోడవరంలో ఉద్యోగం). ఈ రెండింటి మధ్యా దూరం పది పన్నెండు మైళ్లు ఉండవచ్చు.

ఇక చోడవరంలోని మా ఇంటికి పురాణంగారు కథలూ నవలలూ పంపడం మొదలెట్టారు. అలా వచ్చిన మొదటి కథ "అచ్చమ్మా కాఫీ హొటల్"

అయితే నాకో కొత్త సమస్య వచ్చింది. "పొలం నుండి ఇంటికి" "పండుగ నాడు" ఇలాంటి రేఖా చిత్రాలు వెయ్యడానికీ కథలకు బొమ్మలు గీయడానికే చాల వ్యత్యాసం ఉంది. కథల బొమ్మలు కథలో సెంట్రల్‌ఐడియాను. కేరక్టర్స్ స్పష్టంగా లేక సజెస్టివ్‌గా చెప్పగలగాలి. కావాలంటే ఆబ్‌స్ట్రాక్ట్ ఉపయోగించుకోవచ్చు. ఇవన్నీ నాకు తెలియవు ముందు. తెలిసినవి రేఖా చిత్రాలే! పైగా కథ బొమ్మ (ఇలస్ట్రేషన్) ఎంత గీస్తే రిడక్షన్‌లో లైన్లుపోకుండా, ఎంత వస్తుందనేది అసలు తెలియదు.

ఇక టైటిల్ అక్షరాలు,రచయితల పేర్లు అయితే మరీ ఘోరం దానికి తగ్గ కలాలు నా వద్ద లేవు.

భయపడిపోయాను.

ఏదో గీసి ( ఓ ఆదివారమంతా కష్టపడి) పంపాను.

పత్రికలో వచ్చింది. అయితే నాలోనే తృప్తిలేదు.

శర్మగారు కథలు పంపుతూనే ఉన్నారు. నా బొమ్మలు ఎలాగున్నాయో ఆయన అభిప్రాయమేమిటో తెలియదు ఇలా కథలు పంపుతున్నారు నేను బొమ్మలు వేస్తూనే ఉన్నాను కాబట్టి ఆయనకు నా బొమ్మలు నచ్చుతున్నాయనే అనుకోవాలి).

నేర్చుకొనేవాడెప్పుడూ విద్యార్థే "కాబట్టి నాలో పరిశోధన ఎక్కువయ్యింది. ఎలా వేస్తే ఇంకా బాగుంటుంది అన్న తపన.

మా తమ్ముడ్ని కుర్చీలో కూర్చోపెట్టి కొన్ని స్కెచ్‌లు గీసేవాడ్ని మా ఆవిడ హావభావాలు, చాపమీద పడుకొని నిద్రపోతున్న మా అమ్మ తీరు తెన్నులు- పక్కింట్లోని లావుపాటి గున్నమ్మగారు మెట్లమీద కూచున్నతీరు- ఎదురింటి అరుగుమీద చొక్కాలేకుండా ఇంత కుంకుమ నుదుట పూసుకొని, కుండంత బొజ్జతో బొడ్డుదాకా రుద్రాక్షలూ, స్ఫటిపపూసలూ, వాటిమధ్య రాగిచిల్లుకానీలు వేలాడేసుకున్న వడ్లమాని పంతులుగార్ని- ఇలా ఎన్నెన్నో ఎన్నో స్కెచ్‌లు- ఎవరన్నా భిన్నంగా కనిపిస్తే స్కెచ్ గీసుకోవాలనిపించేది. లేక మనసులోనన్నా నాటుకుపోయేది. అవసరమయినపుడు గుర్తుకు తెచ్చుకొనేవాడిని.

**మా తమ్ముడ్ని కుర్చీలో కూర్చోపెట్టి కొన్ని స్కెచ్‌లు గీసేవాడ్ని మా ఆవిడ హావభావాలు, చాపమీద పడుకొని నిద్రపోతున్న మా అమ్మ తీరు తెన్నులు- పక్కింట్లోని లావుపాటి గున్నమ్మగారు మెట్లమీద కూచున్నతీరు ఇలా ఎన్నెన్నో ఎన్నో స్కెచ్‌లు**

మనుషులూ వారి హావభావాలే కాదు కట్టడాలూ నాకు చిత్రంగా ఉండేవి. విశాఖట్నం, డాబా గార్డెన్స్‌లో ఉన్న ఆడపిల్లల స్కూలు, విశాఖపట్నం కలెక్టర్ ఆఫీసు అనకాపల్లిలో నేను చదివిన హైస్కూలులో రెండు వేపుల మెట్లుండే మేడమీదకు పోయే మార్గమూ ఇవన్నీ బ్రిటిష్‌వారు కట్టించినవి దూరదృష్టి గలవి.

వందేల్లు దాటినా చెక్కు చెదరకుండా-ఇంకా నివాసయోగ్యంగా, అనువుగా ఉంటాయి స్కెచ్‌లు వేసుకోవచ్చు.

ఏవేవో కథలకు బొమ్మలు గీస్తున్నానే గానీ కుదురు కనపడ్డంలేదు. ఖచ్చితమైన అందం అక్షరాలలో బ్యాలన్స్ కుదరడంలేదన్న మాట. నా వద్ద సరియైన పేపర్లూ, బ్రష్‌లూ లేవని శర్మగారికి ఉత్తరంలో తెలియచేశాను. మరో వారం రోజుల్లో పెద్ద పేపర్లకట్టా, బ్రష్‌లూ ఇవన్నీ పోస్ట్‌లో పంపారు. సంతోషమయ్యింది.

ఈ చిత్రకళారంగంలో నాకు గురువంటూ ఎవరూలేరు. పోనీ అందుబాటులో పత్రికలూ లేవు ఇలా గీస్తే తప్పయితే ఇంకోలా గీసి ఓహొ ఇది బాగుంది అని తెలుసుకొనేందుకు పడుతూ లేస్తూ ప్రయాణమే.

# ఫస్ట్ కిస్



– అబ్దుల్ ఖుద్దూస్

"ఉరేయ్ సుందరం నువ్వొట్టి దద్దమ్మలా వున్నావురా! కాబోయే భార్యని కళ్ళముందుంచుకుని ఓ సినిమా, షికారు లేకుండా, ఓ ముద్దు ముచ్చట లేకుండా ఎలా గడుపుతున్నావురా? మొదటి ముద్దులోని మజా, పెళ్ళికాక ముందు ప్రియురాలితో సరసం పెళ్ళయిన తర్వాత పొందలేవురా బడుద్దాయి!"

ఆఫీసు ఫైలు తిరగేస్తున్నా, అంతకు ముందు రోజు సుబ్బారావు చెప్పిన మాటలే చెవుల్లో మార్మోగుతున్నాయి సుందరానికి.

మరో రెండు నెలల్లో సుందరానికి సుధకి పెళ్ళి తేది నిశ్చయమయిపోయింది. అసలు ప్రియురాల్నైనా, పెళ్ళాన్నైనా ఎందుకు ముద్దు పెట్టుకోవాలి. అతడికి అనుమానమొచ్చింది. పక్క సీట్లో వున్న సీనియర్ క్లర్క్ గుర్నాధాన్ని అడిగాడు.

"గురూగారూ! పెళ్ళయినా తర్వాత భార్యని ముద్దు పెట్టుకోక తప్పదంటారా?

"భలే అడిగావే? తప్పదయ్యా బాబు! పెళ్ళాన్ని తప్పకుండా ముద్దు పెట్టుకుని తీరాల్సిందే!" ఖరాకండిగా చెప్పాడు.

"ఎందుకు సార్?" అమాయకంగా అడిగాడు.

"మిగతా వాళ్లు ఎందుకు పెడ్తారో కాని, నేనెందుకు ముద్దు పెడ్తానో చెప్తాను. ఇలా దగ్గిరకురా" అని పెళ్ళాన్ని నోరు మూయించాలంటే ఇంత కంటే గొప్ప అయిడియా లేదయ్యా సుందరం" రహస్యం చెబుతున్నట్టుగా మెల్లగా చెప్పాడు.

ఆ సమాధానంతో సుందరం మైండ్ బ్లాంక్ అయిపోయింది. కొద్ది సేపటికి తేరుకుని తన ఫియాన్సీ సుధ బ్యాంక్‌కి ఫోన్‌చేసి చెప్పాడు రాజీవ్ పార్క్‌లో సాయంత్రం ఏడు గంటలకి తనని కల్వమని.

సుందరం కరెక్టుగా ఏడుగంటలకి పార్క్‌కి వెళ్ళగానే అంతకు ముందు నుంచే అతడి కోసం ఎదురు చూస్తోంది సుధ.

పార్క్ లోపల ఓ మూల కూర్చున్నారిద్దరు. ఒకరి కళ్ళల్లో మరొకరు చూసుకుంటూ కబుర్లలో పడ్డారు. పదే పదే ఆఫీసు విషయాల్ని చెబ్తూ ఆనందర్భంగా మాట్లాడుతున్నాడు సుందరం.

అసలు తనని పార్క్‌కి ఎందుకు పిల్చాడో అర్థం కాక ఆ విషయం డైరెక్టుగా అడగలేక అతడు చెప్పిన ప్రతీదానికి వూ కొడుతోంది సుధ.

అప్పటికే వాళ్ళొచ్చి గంట దాటింది. అక్కడక్కడ పొదల మాటున జంటలు ఒకరి ఒడిలో మరొకరు ఇమిడిపోయి స్వీట్ నథింగ్స్‌లో మునిగిపోయారు.

"సుధా!... నేను నిన్నిపుడు ముద్దు పెట్టుకుంటే గట్టిగా అరవవుకదా?" బెరుకుగా అసలు విషయం బయట పెట్టాడు.

"అయితే, నేను అరుస్తే కాని నన్నిపుడు ముద్దు పెట్టుకోవా?" నిట్టూర్చింది సుధ. సుందరానికి మెల్లగా ధైర్యమొచ్చింది. సుధని తీసుకుని దగ్గిరలో వున్న పొదవైపు దారి తీశాడు. ఇంతలో వాచ్‌మెన్ విజిల్ వేశాడు. పార్క్ మూసే టైం అయిందని వుస్సురుమంటూ పార్కులోంచి బయటికొచ్చి ఆమెకి వీడ్కోలు చెప్పాడు సుందరం.

మర్నాడు శనివారం. సుధకి బ్యాంక్ హాఫ్‌డేయే వుంటుంది. ఆ రోజు పది గంటలకి ఫోన్ చేశాడు. మధ్యాహ్నం తన రూమ్‌కి వచ్చి కల్వమన్నాడు. ఎందుకు అని అడగలేదు సుధ.

సుధ చేయ్యిని సుందరం సుతారంగా నొక్కుతూ "మా సుబ్బారావుగాడు చెబ్తే ఏంటో అనుకున్నాకాని, సుదా! నీ అధరామృతం మధురాతి మధురం. తొలి ముద్దులో ఇంత తీయదనముందని ఇప్పుడే తెల్సింది. కొద్ది క్షణాలైనా అది మరపురాని అద్భుతానుభూతి!"

అతడు చెప్పిన టైంకి రూంకి వచ్చింది సుధ. గది లోపలికి రాగానే తలుపు గడియ వేశాడు సుందరం.

"పెళ్ళి కాక ముందు మనం ఇలా కల్సుకోవడం అంత బాగోదేమో" అంది సుధ.

"మనం అంత చేయకూడని తప్పేం చేస్తున్నాం. పెళ్ళికాక ముందు కౌగిళ్ళు, ముద్దులు మామూలే అని చెప్పాడు మా ఫ్రెండ్ సుబ్బారావ్"

"మీ ఫ్రెండ్ చెప్పాడా?" చిన్నగా నవ్విందామె.

సుధని అమాంతంగా వాటేసుకున్నాడు. ఇంతలో టక్ టక్‌మని చప్పుడు విన్పించింది. "ఎవరో తలుపు తడ్తున్నారు చూడండి" అంది.

"తలుపు ఎవరు తట్టడం లేదు. నా మోకాళ్లే కొట్టుకుంటున్నాయి". అపుడు చూసింది సుధ. అతడి కాళ్ళు వణుకుతున్నాయి.

"మొదటిసారి కదా..." నసిగాడు.

సుధ మూడ్ చెడిపోయింది.

ఇంతలో నిజంగానే ఎవరో తలుపుతట్టారు.

తలుపు తీసి చూస్తే స్క్రూడ్రైవరు, వైర్లు పట్టుకొని ఎదురుగా ఇద్దరు వ్యక్తులు నిలబడ్డారు.

"మీ కరెంట్ మీటర్ చెడిపోయింది కదా, రిపేర్ చేయడానికి వచ్చాం" చెప్పాడు ఒక వ్యక్తి.

"మేమేమి కంప్లెయింట్ ఇవ్వలేదు" అన్నాడు సుందరం.

"మీరు కాకపోతే మీ హౌస్ ఓనరు ఇచ్చి వుంటారు. ఇదిగో చూడండి" కంప్లెయింట్ పేపరుఎ చూపించాడు. అంతలోనే వాళ్ళిదర్దరు మీటర్ విప్పదీశారు.

"ఎంతసేపు పడ్తుంది?" అసహనంగా అడిగాడు సుందరం.

"గంటపైనే పడ్తుంది..!" చెప్పాడా వ్యక్తి.

"సుందరం నేనింక వెళ్తాను" హ్యాండ్ బ్యాగ్ పట్టుకుని బయటికి నడిచింది సుధ.

ఆమెని సాగనంపుతూ చెప్పాడు. "సుధా! ఈ రోజు మమతా హెూటల్‌కి డిన్నర్‌కి రావాలి నువ్వు. రాత్రి ఏడు గంటలకి నీ కోసం ఎదురు చూస్తుంటాను" ఏమైనా ఆ విషయాన్ని అంత తేలిగ్గా వదలదల్చుకోలేదతడు.

"అలాగే" అని చిన్నగా నవ్వి అతడి దగ్గిర సెలవు తీసుకొంది.

మమతా హటల్ రెస్టారెంట్ ఫస్ట్ ఫ్లోర్‌లో వుంది. లిఫ్టులో ఎక్కారిద్దరు. లిఫ్టుడోర్ వేసి ఫస్ట్ ఫ్లోర్ స్విచ్ నొక్కాడు పద్నాలుగేళ్ళ లిఫ్టుబాయ్ఎ. ఇంతలో పవర్ పోయింది.

కొద్ది క్షణాల్లో పవర్ రావడం. వీళ్ళు ఫస్ట్ ఫ్లోర్ చేరడం వెంట వెంటనే జరిగిపోయాయి.

లిఫ్ట్ బాయ్ విసురుగా డోర్ తెరచి "నడవండి!" అని గట్టిగా అంటూ సుందర్ని కోపంగా నెట్టినంత పనిచేశాడు.

డిమ్‌లైట్ల కాంతిలో కార్నర్ టేబుల్ దగ్గిర కూర్చున్నారిద్దరు...

సుధ చేయ్యిని సుందరం సుతారంగా నొక్కుతూ "మా సుబ్బారావుగాడు చెబ్తే ఏంటో అనుకున్నాకాని, సుదా! నీ అధరామృతం మధురాతి మధురం. తొలి ముద్దులో ఇంత తీయదనముందని ఇప్పుడే తెల్సింది. కొద్ది క్షణాలైనా అది మరపురాని అద్భుతానుభూతి!"

"ఏంటీ మీరు చెప్పేది. నన్ను ముద్దు పెట్టుకున్నారా, ఎప్పుడు?" విస్తుపోతూ అడిగింది సుధ.

"అదే ఇందాక లిఫ్టులో పవర్ పోయినపుడు".

"లేదు! నన్ను కాదు మీరు ముద్దు పెట్టుకున్నది" కీచుమంది ఆమె గొంతుక.

"ఆ! మరి ఎవర్ని?"

"అర్థమయింది! లిఫ్టు కుర్రాడ్ని ముద్దు పెట్టుకుని వుంటారు. అందుకే లిఫ్టులోంచి బయటి కొచ్చేటపుడు వాడు మిమ్మల్ని అలా కొరకొరా కొరికేలా చూశాడు" ఆ మాటలంటూ తుళ్ళి తుళ్ళి నవ్వింది సుధ.

మరోసారి సుందరం మైండ్ బ్లాంక్ అయింది.

కవిత

# "రాఖీ"... మంగళ"కర" సూత్రం

– బి.ఎం.పి. సింగ్

"రక్షా బంధనం" **'సోదర ప్రేమ'కు** సాదర స్వాగతం.
ఇది చెల్లి, అన్నచేతికి కట్టే 'నూలుపోగుల్లో' దాగివుండే **'సోదరి మనోగతం'.**
'రాఖీ' అన్నయ్యను చెల్లిప్రేమకు కట్టిపడేసే ఓ **మంగళ"కర"** సూత్రం.
"రక్ష" అన్నయ్యను 'అమ్మానాన్నలుగా' మార్చే ఓ **మంగళ"కర" తంత్రం.**
రక్ష కట్టించుకున్న అన్న చెయ్యి చెల్లెలి పాలిట సర్వదా **శ్రీ"కరం", శుభ"కరం", సర్వమంగళ"కరం"**
'అన్న' చెల్లికి దేవుడిచ్చిన వరం,
రక్ష కట్టించుకొన్న మరుక్షణం చెల్లి సంరక్షణ అన్నపరం
అందరికీ సమ్మతం... ఈ **అభినవ "అభిమతం"**
ఎంత కలిమివున్నా **"అన్న చెలిమి"** ఒక్కటే చెల్లికిమిన్న.
రక్షకట్టిన చాలు మాసిపోతాయి (వుంటే) పంతాలు పట్టింపులు,
అన్నాచెల్లెళ్ల ఆప్యాయతలు అవుతాయి రెట్టింపులు.
కలిమిలేములకతీతం ఈ "రక్షాబంధన వ్రతం"
రాఖీతో కక్షలు–కార్పణ్యాలకు తర్పణం
అనుక్షణం స్వచ్ఛమయిన మమతకు ఇది "దర్పణం"
ఇదే రాఖీ ప్రధాన లక్షణం.
**వ్రేలెడెంత** చెల్లికి అన్నరూపంలో **బోలెడంత** అండనిస్తుంది రక్షా బంధనం.
ఏ ధనంతో కొనాలన్నా కొనలేని అమూల్యమీ బం"ధనం"
రాఖీని గురువుకు శిష్యులు కట్టినా, తల్లిదండ్రులకు పిల్లలు కట్టినా,
మనుష్యులు చెట్లకు కట్టినా...
దాని ఉద్దేశ్యం ఒక్కటే – రక్షణ, సంరక్షణల సౌలభ్యం
అన్నపై చెల్లి విశ్వాసానికి 'రాఖీ' నిదర్శనం.
'రాఖీ' చెల్లిని కాపాడే అన్న చేతిలో ఓ **సుదర్శనం.**
స్త్రీలకు భరతభూమిలో వున్న ఉన్నతస్థానానికి రాఖీ ఓ మచ్చుతునక.
ఇది అన్నచే ఆప్యాయతను కురిపించే ఓ మమతల మబ్బుతునక.
మన భారతదేశం 'మమతల కోవెల',
ఇలలో కానరాదెక్కడా ఇలా !
**"రక్షాబంధనం"** భారతీయులందరూ నా సహోదరులనే
భారతీయ సంవిధానము
ఇది ఒకరికొకరు రక్షణగా వుండే సమవిధానము
అన్నాచెల్లెళ్ల అనుబంధాలకు భరతభూమి సన్నిధానము.
ఇది **నెలతకు ఘనతను ఇచ్చెడి ధామము.**
అందరినీ సోదరభావనతో బంధించేదే రక్షాబంధనం.
మన దేశ సరిహద్దులో అహర్నిశలు నిద్రాహారాలు మాని,
మనల్ని, మన దేశాన్ని రక్షిస్తున్న మన సైనిక **సోదరులకు,**
మనకోసం అన్నం పుట్టించడం తప్ప అన్నెంపున్నెం ఎరుగని
మన **రైతన్నలకు,** మన రక్షణే ధ్యేయంగా పనిచేసే **రక్షకభటులకు**
రాఖీలు కట్టి వారి ఋణం కొంచెమైనా తీర్చుకునే శుభతరుణం ఈ రక్షాబంధన పర్వం.
**సర్వమానవ సౌభ్రాతృత్వానికి మన దేశం ప్రపంచానికే ఒక ప్రేరణ**
**మన దేశంలో అందుకే రక్షాబంధనానికి ఇంత ఆదరణ.**



64 కళలు.కామ్
www.64kalalu.com
సకల కళల సమాహారం

సంపుటి :1 సంచిక :11 సెప్టెంబర్ 2011



## శుభాకాంక్షలు...



పాఠకులకు,

కళాకారులకు

వినాయకచవితి శుభాకాంక్షలతో....

పత్రికలో వ్యాసాలు బాగున్నాయని అభిమానంతో ఇ-మెయిల్స్ ద్వారా అభిప్రాయాలు తెలియజేస్తున్న పాఠక, కళాభిమానులకు కృతజ్ఞతాభివందనాలతో...

కళాసాగర్
ఎడిటర్

ముఖచిత్రం చిత్రకారుడు : **రాజా రాంబాబు**

- వెంటపల్లి సత్యనారాయణ

# రూపం నుండి నైరూప్యానికి సాగిన రాజారాంబాబు కళాప్రస్థానం

**జీవితమనేది గొప్ప రంగుల ప్రపంచమే కాదు. అనేక సంఘటనల సమాహారం కూడా. అందులో ప్రతి సంఘటన ఒక అనుభవం అయితే. అన్ని అనుభవాలు ఆనందాలే కానక్కరలేదు. అందులో ఖేధాలు, మోదాలూ కూడా వుంటాయి. ఈ రెండింటి కలయికే జీవితం.**

అది 2009 సం॥. సెప్టెంబర్ నెల 12వ తేదీ మధ్యాహ్నం 12.30 గంటల సమయం ఆఫీసుకు వచ్చిన వివిధ శాఖల బిల్లులను బ్యాంకుకు పంపించాల్సిన సమయం ఆసన్నం అవుతుండడంతో ఎప్పటిలాగే వచ్చిన బిల్స్ అన్నింటినీ పరిశీలించి బ్యాంకు లిస్ట్ పంపించే పనిలో ఉన్నాను. బయట కొందరు ఉద్యోగులు ఆ లిస్ట్ కోసమే ఎదురు చూస్తూ వున్నారు. ఇంతలో ఎక్కడినుండో నా సెల్‌ఫోన్‌కి వచ్చిన ఫోన్‌కాల్ నా పనికి ఆటంకం కలిగిస్తుంది. పనిలో ఉన్న నేను దాన్ని పట్టించుకోలేదు గానీ మళ్లీ మళ్లీ ఫోన్ రింగ్ అవుతుండడంతో ఇక లాభం లేదనుకుని కొంత అసహనానికి గుర్రై ఎవరో అని చూడకుండానే ఫోన్ లిఫ్ట్ చేసాను. అవతలి వ్యక్తి గొంతు నుండి గొప్ప ఆనందకరమైన వార్త. బహుశా ఆ సమయంలో అతని ముఖం నుండి వేయి విద్యుత వాట్‌ల వెలుగు ప్రసరిస్తూ వుండొచ్చు. కారణం...

ఏ ప్రమేయం లేకుండా ఒక పెద్ద సాఫ్ట్‌వేర్ కంపెనీ అధినేత బుద్దిగా ఉద్యోగం చేసుకుంటూ, మిగిలిన సమయాన్ని తన మనసుకు తోచిన బొమ్మలు వేసుకుంటూ తనదైన రంగుల లోకాన్ని సృష్ఠించుకుంటున్న ఒక వర్ధమాన చిత్రకారుని ఇంటికి డైరెక్ట్‌గా రావడం, అక్కడ అతని చిత్రాలను పరిశీలించడం, కొన్ని సెలెక్ట్ చేసుకొని ఒక పెద్ద మొత్తానికి చెక్ చేతిలో పెట్టి కొనుగోలు చేసిన చిత్రాలను తన కారులో వేసుకొని సర్రున నిష్క్రమిస్తే ఊహించని ఆ సంఘటన ఆ




Untitled Pen on canvas Size 14"x21"

వేయడానికి ఆ తర్వాత 60సం॥లు పట్టిందని ప్రఖ్యాత చిత్రకారుడు పాబ్లో పికాసో చెప్పుకున్నాడంటే దాన్ని ఏ విధంగా అర్థంచేసుకోవాలి? అసలు కళాకారుడు కళాసృజనను ఎలా చేస్తాడు? ఎందుకు కాలక్రమంలో అతని సృజనలో పరిణామం చోటుచేసుకుంటుంది? అంటే దానికి కారణం ఆ కళాకారుని మానసిక స్థితిలో వచ్చిన మార్పుగా మనం చెప్పుకోవచ్చు. కారణం కళ అనేది మేధస్సుతో చేసే పనికాదు. మనసుతో చేసేపని.

వర్ధమాన చిత్రకారుని ఆశ్చర్యంతో పాటు ఆనందం కలిగించదా! ఇంతకీ ఎవరా వ్యక్తీ?... ఎవరా చిత్రకారుడు?

కంప్యూటర్ అసోసియేట్స్ అనే పెద్ద సాఫ్ట్‌వేర్ కంపెనీ జనరల్ మేనేజర్ శ్రీ లోకేష్ జిందాల్ ఆ చిత్రాలను కొనుగోలు చేసిన వ్యక్తి అయితే అమ్మిన వ్యక్తి మాత్రం బయట చిత్రకళా ప్రపంచంలో నడుస్తున్న వివిధ ధోరణలును ఏమాత్రం పట్టించుకోకుండా కేవలం తన కోసం, తన ఆత్మ సంతృప్తి కోసమే తనకు వచ్చిన విధంగా అసంఖ్యాకంగా బొమ్మలు వేసుకుంటూ తనదైన కళాప్రపంచాన్ని ఆవిష్కరించుకుంటున్న ఆ వర్ధమాన చిత్రకారుడు శ్రీ వి. రాజారాంబాబు.

ఆ రోజు శ్రీ లోకేష్ జిందాల్ రాంబాబు వద్ద పట్టుకెళ్లినవి ఐదు చిత్రాలయితే, వాటికి ప్రతిగా రాంబాబు చేతిలో పెట్టిన మొత్తం అక్షరాలా లక్షరూపాయిలు. వ్యక్తిగత చిత్రకళాప్రదర్శన పెట్టుకోవడం అన్నది ఎంతో వ్యయప్రయాసలతో కూడుకున్న ఈ రోజుల్లో ఎలాంటి ప్రదర్శన లేకుండానే ఎవరి ద్వారానో తెలుసుకున్న ఆ అధినేత డైరెక్ట్‌గా ఇంటికి రావడం, ఒక పెద్ద మొత్తానికి చిత్రాలను కొనుగోలు చేయడం అన్నది గొప్ప అవకాశమే కదా! అందుకే ఆ రోజు అంత ఆనందంగా నాకు ఫోన్ చేయడం జరిగింది. ప్రస్తుతం ఆ చిత్రాలు దాదాపు 5వేలుకు పైగా ఉద్యోగులతో నడుస్తున్న కంప్యూటర్ అసోసియేట్స్ అనే సంస్థలో అలంకరించబడి వున్నాయి.

13 ఏళ్ల వయసులోనే అత్యంత ప్రతిభావంతమైన చిత్రకారుని స్థాయిలో బొమ్మలు వేసిన తనకు చిన్న పిల్లల స్థాయిలో బొమ్మలు

హృదయాంతరాలలో నుండి ప్రేరణ జనిస్తున్నప్పుడు దాన్ని ఏదో విధంగా వ్యక్తం చేయాలి. ఒక కవి కవితారూపంలో, చిత్రకారుడు చిత్రాల రూపంలో ఆ విధంగా చేసినపుడు ఎలా చేసినా దానిలో జీవం ఉంటుంది. కారణం అది హృదయం నుండి జనించిన సృష్టి కనుక.

చిత్రకళను ప్రారంభించిన తొలినాళ్లలోనే రాంబాబు గిరిజన జీవన విధానంపై ఎన్నో మంచి చిత్రాలు వేసాడు. ఆ రోజుల్లో విశాఖపట్నం ఏరియాలోని గిరిజనుల కోసం పనిచేసే "లయ" అనే ఒక స్వచ్ఛంధ సంస్థ నడిపే 'మన్నెంలో" అనే పత్రికకు ఇలస్ట్రేటర్‌గా పనిచేస్తూ, ప్రతినెలా గిరిజన జీవన విధానంపై చిత్రాలు అందించాల్సి రావడంతో అక్కడ విశాఖజిల్లాలోని గిరిజన ప్రాంతాలైన అరకువ్యాలి,


రాంబాబుతో రచయిత

కించుమండ, టముకు, దమ్రిగూడ మొదలైన ప్రాంతాలను విరివిగా తిరిగి అనేక లైవ్ స్కెచ్చెస్ గీసాడు. ప్రకృతికి అతి సమీపంగా ఉన్న వారి జీవన విదానానికి ముగ్ధుడైన రాంబాబు వాటినే తర్వాత 6×4 అడుగుల పెద్దసైజులో దాదాపు 12 తైల వర్ణచిత్రాలు వేసారు. చంకలో బిడ్డ, నెత్తిన సరుకుల బుట్టలతో సంతకేగుతున్న మహిళలు, బ్రతుకుతెరువు కోసం అటవీ వస్తువులను అమ్ముకుంటున్న గిరిజనులు, తిండికోసం కొర్రగింజలను దంచుతూ ఆహారాన్ని సిద్ధం చేసుకుంటున్న గిరజన స్త్రీలు, ఇంకా గిరిజనుల కట్టు, బొట్టు, ఆచారాలు సాంప్రదాయాలు, ఇలా వారి జీవన విధానంలోని విభిన్న కోణాలను మనం ఆ చిత్రాల్లో చూడవచ్చు.

శ్రీమతి వంకల కళ్యాణం, తాతబ్బాయి దంపతులకు 24.7. 1974న విశాఖ జిల్లా నాతవరం మండలం చెర్లోపాలెం అనే చిన్న గ్రామంలో జన్మించిన రాంబాబు చిత్రకళలో మొదట ఓనమాలు దిద్దింది అనకాపల్లిలోని స్వాతి ఆర్ట్స్ పేరుతో కమర్షియల్ ఆర్టిస్ట్‌గా పనిచేస్తుండే తన సొంత బావగారైన శ్రీ సంబారు సత్యనారాయణ వద్ద అతని ప్రోత్సాహంతోనే రాష్ట్రప్రభుత్వ సాంకేతిక విద్యాశాఖ వారు నిర్వహించే డ్రాయింగ్ లోయర్, హయ్యర్ పరీక్షలతో పాటు అందులో టి.టి.సి కూడా చేసి మూడింట్లోనూ ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణుడయ్యారు అనకాపల్లిలో డిగ్రీ పూర్తిచేసిన రాంబాబు ఆంధ్రవిశ్వ విద్యాలయంలో ఎమ్.ఏ. చదువుతుండగా తన ప్రాణమిత్రుడయిన ఎస్.ఎన్. వెంటపల్లి "వృత్తి-ప్రవృత్తి" అనే అంశంపై తనకు రాసిన లేఖకు ప్రభావితుడై ఎమ్.ఏ ద్వితీయ సంవత్సరానికి స్వస్తి చెప్పి, ఆంధ్రవిశ్వ విద్యాలయంలోనే బి.ఎఫ్.ఏ లో చేరాడు. అక్కడ బి.ఎఫ్.ఏ చదువుతున్న కాలంలో పెయింటింగ్ విభాగపు అధిపతి అయిన టి. సుధాకర్‌రెడ్డిగారు రాంబాబును బాగా ప్రోత్సహించారు. అదే కాలంలో 1998లో లలితకళా అకాడమీ చెన్నైవారు సవరట్రైబల్ ఆర్ట్‌పై నిర్వహించిన వర్క్‌షాప్‌లో పాల్గొన్నారు.

దైనందిన జీవితంలో జరిగిన సంఘటనలన్నీ అతి సరళమైన రీతిలో చిత్రాలుగా వేసి వారి గృహాల గోడలను అలంకరించుకునే సవర గిజనుల చిత్రశైలికి ప్రభావితుడైన రాంబాబు తన బాల్యంలో జరిగే మధుర స్మృతులన్నింటినీ వారి శైలికి దగ్గరగా (50) చిత్రాలుగా వేయడమే గాక వాటితో 2006వ సం॥లో చిత్రమయి స్టేట్ ఆర్ట్‌గేలరీ హైదరాబాద్ నందు తన తొలి వ్యక్తిగత చిత్రకళాప్రదర్శనను నిర్వహించాడు. ప్రఖ్యాత సినీ హాస్యనటుడు ధర్మవరపు సుబ్రహ్మణ్యం తన ఈ చిత్రకళా ప్రదర్శనను ప్రారంబించడం విశేషం. "Memories of my childhood days" పేరుతో వేసిన ఈ చిత్రాలు వాసి పరంగా అంత గొప్పవి కాకున్నా అనుభూతిపరంగా చాలా ఉన్నతమైనవిగా చెప్పుకోవచ్చు. మనిషి జీవితంలో ఎప్పటికీ తిరిగిరాని, మధురమైన మరువలేని మన బాల్యాన్ని ఈ సిరీస్‌లో వేసిన చిత్రాల్లో మనం



చూసుకోవచ్చు. ఈ పరంపరంలో అతను వేసిన "సిగ్గుబిల్ల" చిత్రం ఒక మంచి చిత్రంగా చెప్పుకోవచ్చు. దిశమొలతో కేవలం సిగ్గుబిల్లను మాత్రమే ధరించి ఐస్‌ఫ్రూట్ తింటున్నట్టు ఉన్న ఆ చిత్రంలోని బాలిక ముఖంలోని తన్మయత్వాన్ని చూసినపుడు చిన్నప్పుడు మనం ఐస్‌ఫ్రూట్ తినడంలో పొందే మజా కళ్ల ముందు మనకు మరలా ఒకసారి కనిపిస్తుంది. అలాగే ఇంకో చిత్రంలో ఒకప్పటి గ్రామీణ ప్రాంతాల్లో బహిరంగ విసర్జనకు ఉపక్రమించే కుర్రాళ్లకు ఇబ్బందిని కలగజేస్తూ వరాహం చేసే విన్యాసాలను చూసినపుడు పొట్టచెక్కలయ్యేట్లు నవ్వుకుంటాం. వేరొక చిత్రం "బస్సాట" కూడా ఇదే అంశానికి చెందినదే అయినా దానిని సవరశైలిలో కాకుండా కళంకారి పనితో వస్త్రంపై వేసిన చిత్రమది.

దానిలో ఓ పదిమంది కుర్రాళ్లు వరుసగా నిలబడి చుట్టూ ఓ త్రాడు పట్టుకుని బస్‌లా ఊహించుకుంటూ ముందుకు కదులుతూ వుంటారు. బ్యాక్‌గ్రౌండ్‌లో వారి ఊహకు సంబంధించిన బస్‌ను ఛాయా మాత్రంగా కళంకారీ పద్దతిలో క్లాత్‌పై వేసిన ఈ చిత్రం ఉ త్తమమైనదిగా చెప్పుకోవచ్చును. మినిస్ట్రీ ఆఫ్ టెక్స్‌టైల్స్ డిపార్ట్‌మెంట్ వారు వీవర్స్ సర్వీస్ సెంటర్ విజయవాడ నందు నేచురల్ విజిటబుల్‌డైయింగ్ & ప్రింటింగ్‌లో ఇచ్చిన మూడు నెలల శిక్షణ



STRANG ENOUGH Acrylic on Canvas Size 30"x18"

రాంబాబుకి ఈ తరహా చిత్రాలు వసందుకు ఉపకరించింది. ఆ తర్వాత కలంకారీ పద్ధతిలో గ్రామీణ ప్రకృతి దృశ్యాలు, అలాగే మన వ్యవసాయ పరిణామ క్రమాన్నంతటినీ, విత్తనాలు సిద్ధం చేసుకుంది మొదలు రైతుకు పంట చేతికొచ్చేవరకూ వ్యవసాయంలో గల వివిధ దశలను ఒక పెద్ద వస్త్రంపై సవర పద్ధతిలో కళంకారీ రంగులతో చిత్రించాడు. ఆ తర్వాత విజయ నిర్మాణ్ అనే కంపెనీ వైజాగ్ వారి ఆధ్వర్యంలో ఏటికొప్పాకలో నేచురల్ డైస్‌లో క్లాత్‌పై రాంబాబు 3×3 మీటర్ల పెద్ద సైజులో వేసిన (30) చిత్రాలు మద్రాస్ దక్షిణ చిత్ర సంస్థలో ఒక్క రోజులోనే అమ్ముడు పోయాయి. కానీ దానివలన వ్యక్తిగతంగా రాంబాబుకి ఏ మాత్రం ఆర్థిక ప్రయోజనం చేకూరకపోవడంతో ఆ తర్వాత ఈ తరహా చిత్రాలకు స్వస్తి చెప్పడం జరిగింది.

ఆంధ్రవిశ్వ విద్యాలయంలో బి.ఎఫ్.ఏ చదువుతున్న కాలంలోనే "నటన" మరియు దర్శకత్వం విభాగాలకు చెందిన థియేటర్ ఆర్ట్స్ కోర్స్‌లో కూడా చేరి నటన, డైరెక్షన్ రెండింటిలోనూ గోల్డ్‌మెడల్ సొంతం చేసుకున్న రాంబాబు తన భవిష్యత్తుకు మార్గాన్ని అన్వేషించుకునే క్రమంలో అంతవరకూ తాను ఇష్టపడిన పల్లెటూరు వాతావరణాన్ని వదిలి కేవలం తన బి.ఎఫ్.ఏ, డి.టి.ఏ డిగ్రీలు మరియు చేతిలో ఉన్న తన పనిని నమ్ముకుని 2003వ సం॥లో హైదరాబాద్ చేరుకున్నాడు. ప్రస్తుతం గ్లండేల్ అకాడమీ ఇంటర్ నేషనల్ స్కూల్లో ఆర్ట్ అండ్ డ్రామా టీచర్‌గా పనిచేస్తున్న రాంబాబు హైదరాబాద్ వచ్చిన కొత్తలో ఉద్యోగాన్వేషణ కోసం ఉదయం 8 గంటలకే బయటపడడం, రకరకాల స్కూల్లలో ప్రయత్నాలు చేయడం, ఆశక్తిగల విద్యార్థులకు వాళ్ల ఇంటివద్దనే చిత్రకళా పాఠాలు బోధిస్తూ తన జీవనానికి మార్గాన్ని స్థిరపరుచుకునే క్రమంలో రోజూ ఇల్లు చేరేసరికి రాత్రి 9.30 గంటల సమయం దాటేది. అలా రోజులో సగభాగంపైగా ఆ కాంక్రీటు మహానగరంలోని జనారణ్యంలో తిరుగాడుతూ అలసి పోయిన తనకు అంతవరకూ తన ఆత్మగా భావించుకుంటూ వచ్చిన తన పచ్చని పల్లెటూరు, మధురమైన బాల్యస్మృతులు, అన్నీ నెమ్మదిగా విస్మృతిలోకి జారుకుంటుండగా వాటి స్థానంలో ఏదో ఒక స్పష్టాస్పష్టమైన నూతన కలల ప్రపంచం అతన్ని ఆవహిస్తున్న క్రమంలో బొమ్మ వేయాలనే సంకల్పం అప్రయత్నంగా అతన్ని కాన్వాస్ ముందు నిలబెట్టింది. అతని చేతిలోని బ్రష్‌లు కూడా అప్రయత్నంగానే రంగులను కలపడం కాన్వాస్‌పై రుద్దడంకూడా యాదృచ్ఛికంగా జరిగిపోయింది. ఫలితంగా కొద్దిసేపట్లోనే తను అంతవరకూ చూడని, ఊహించని ఒక నూతన చిత్రం అతని కళ్ళముందు ప్రత్యక్షమయ్యింది. తన ఎదురుగా ఆవిష్కృతమైన ఆ అరూపచిత్రం విచిత్రంగా అప్పటి తన మానసిక ఆలోచనలకు ఖచ్చితమైన రూపంగా కనిపించడంతో అతను వేసిన ఆ చిత్రం పట్ల అతనికే ఆశ్చర్యం కలిగింది. అరూపచిత్రాలను అంతవరకూ యిష్టపడని అతనికి స్వానుభవంలోకి వచ్చిన పిదప వాటిపై గొప్ప ఆశక్తి ఏర్పడింది. అంతే అనేక



YELLOW FLOWS Acrylic on Canvas Size 24"x48"

అరూపచిత్రాలు అతని కుంచెనుండి రూపుదిద్దుకున్నాయి.

ఒకానొక సందర్భంలో రాంబాబు చిత్రాలను పరిశీలించిన ఒకకళావిమర్శకుడు మాట్లాడుతూ Your searching for nothing please try to know your self what searching for అన్నపుడు గాని అతనికి తెలియలేదు తన చిత్రాల్లోని అంతరార్ధం. అవును ఏ ప్రేరణ లేకుండా ఒక కళాకారుడు కళా సృష్టిని ఎలా చేస్తాడు? భౌతికంగా గానీ, మానసికంగా గానీ ఏదైనా ప్రేరణ కలగకుండా ఒక చర్య అనేది ఎలా జరుగుతుంది? నేను నా కాన్వస్‌ముందు కూర్చునేటపుడు ఎలాంటి ముందస్తు ఆలోచనా లేకుండానే చిరతరచనకుపక్రమిస్తాను. కానీ తీరికలేని నా జీవన యానం, ప్రతిరోజూ తనకు కనిపించే విపరీత జనసందోహం, రద్దీరోడ్లు అంబరాలను తాకే అందాల భవనాలకు చెంతనే ఆర్ధిక వ్యత్యాసాలకు ప్రతిరూపంగా కనిపించే పేదవాళ్లపూరిల్లు, తానే అందరికంటే ముందుండాలని ప్రతిఒక్కరిలో ఏర్పడ్డ విపరీతమైన పోటీతత్వం, స్వార్ధం, మనుషుల మధ్య ఆర్ధ్రతలేని పొడి సంబంధాలు, ప్లాస్టిక్ పరిమళాల పలకరింపులు ఇలా ఒక కొంగ్రొత్త నూతన రంగుల ప్రపంచం అంతర్లీనంగా తన మనసుపై ప్రభావం చూపెట్టింది. విస్తృతమైన అపరిమితమైన ఈ అనంతరంగుల లోకాన్ని పరిమితమైన రూపం కంటే అపరిమితమైన నైరూప్యంలోనే వ్యక్తంచేసేందుకు ఎక్కువ ఆస్కారముంది. అందుచేతనే అతనికుంచె అప్రయత్నంగానే రూపం నుండి అరూపం వైపుకు పయనించింది.

యాదృచ్ఛికంగా ఇదే సమయంలో 2008సం॥ తెలుగు విశ్వవిద్యాలయం (11)వ వార్షికోత్సవం సందర్భంగా నిర్వహించిన రాష్ట్రస్థాయి చిత్రకళాపోటీలలో దాదాపు (285)కి పైగా వచ్చిన కళాఖండాల్లో తను పంపిన మొదటి అరూపచిత్రం ఉత్తమ చిత్రాల్లో ఒకదానిగా ఎంపికవడంతో పాటు తెలుగు విశ్వవిద్యాలయం వాళ్లే దానిని కొనుగోలు చేయడం నైరూప్యం వైపుగా సాగుతున్న తన నూతన ప్రయాణానికి గొప్ప ఊతమిచ్చినట్లయ్యింది. అంతే ఇక వెనుదిరిగి చూడకుండా అసంఖ్యాకంగా నైరూప్యచిత్రాలను వేయడం మొదలు పెట్టాడు. నైరూప్యంలో కూడా భావాలను ప్రవేశపెట్టడం ఇతని ప్రత్యేకత. బర్నింగ్‌డిజైర్స్, ఈవిల్‌ఫోర్సెస్, ఎల్లో ఫ్లోస్ తదితర చిత్రాలు చూసినపుడు ఈ విషయం మనకు తెలుస్తుంది.

మనిషిలో రగులుతున్న కోరికల జ్వాలను తన రంగుల విన్యాసం ద్వారా బర్నింగ్ డిజైర్ చిత్రంలో వ్యక్తంచేస్తే, స్వచ్ఛమైన మనిషి మస్తిష్కాన్ని చుట్టూ ఉన్న కామ, క్రోద, లోభ, మోహ, మధ, మాత్సర్యాలనే అరిషడ్వర్గాలు ఎలా ఒత్తిడికి గురిచేస్తాయో "ఈవిల్‌పోర్సెస్" చిత్రంలో చాలా ప్రతిభావంతంగా చూపించారు. అలాగే ''ఎల్లోఫ్లోస్'' అనే చిత్రంలో ప్రదర్శించిన వర్ణవిన్యాసంప్రేక్షకులను ఎంతో ఆకట్టుకునే విధంగా వుంటుంది.

డిపార్ట్‌మెంట్ ఆఫ్ ఫైనార్ట్స్, వాల్తైర్‌క్లబ్ తదితర చోట్ల ఆరంభంలో మూడు సామూహిక చిత్రకళా ప్రదర్శనలలో పాల్గొన్న రాంబాబు 2000సం॥లో అడపా చిత్రకళాపరిషత్ నర్సీపట్నంవారు నిర్వహించిన రాష్ట్రస్థాయి చిత్రకళాపోటీలలో ప్రథమ బహుమతిని దక్కించుకున్నారు. ఆ తర్వాత హైదరాబాద్ చిత్రమయి State Art Gallery అవర్ ప్లేస్ రెస్టారెంట్ తదితర చోట్ల వ్యక్తిగత చిత్రకళా ప్రదర్శనను నిర్వహించాడు. ఆ తర్వాత తెలుగు విశ్వవిద్యాలయం వారు వరంగల్ కళాప్రాంగణంలో 2008లో నిర్వహించిన రాష్ట్రస్థాయి చిత్రకళా వర్క్‌షాప్‌లో పాల్గొన్నారు. అలాగే ట్రిబుల్ ఆర్ట్ సంస్థ ద్వారా తన చిత్రాలను ఒక హైద్రాబాద్ మాత్రమే కాకుండా బెంగుళూర్, జైపూర్, చెన్నై, మొదలైన చోట్ల కూడా ప్రదర్శించారు.



Untitled Acrylic on paper Size 24"x30"

మనిషి జీవన యానంలో చేసే ప్రతిమజిలీ మధురస్మృతి కాకపోవచ్చు. కానీ కళాజీవన యానంలో చేసే ప్రతి మజిలీ ఒక మధుర స్మృతే అవుతుంది. క్రమబద్ధమైన పరిశోధన, పరిశీలన, పరిశ్రమ ఖచ్చితంగా ప్రగతిదాయకం అవుతుంది. అందుకు కళారంగం కూడా మినహాయింపేమీ కాదు.

తన కళా జీవన యానంలో మొన్న రియలిజమ్, సింప్లిఫికేషన్‌లనుండి ఆబ్‌స్ట్రాక్ట్ వైపుగా సాగి అసంఖ్యాకంగా చిత్రాలు వేస్తున్న రాంబాబు కుంచె నేడు ఉడ్‌కట్స్‌పై ప్రయోగాలు చేస్తుంది. అప్రతిహతంగా సాగుతున్న అతని కళాయాత్రలో మరిన్ని ప్రయోగాలతో చిత్రకళా లోకాన్ని మరింత ముందుకు తీసుకెళ్లగలడని తీసుకువెళ్తాడని ఆశిద్దాం.

*email: snventapalli@gmail.com*

కథ

# తేడా!



క్రిష్ణయ్యకి ఎనభై ఏళ్ళు. ఆ వయసులో కూడా ఆయనకు ఉత్సాహం, జిజ్ఞాస అందరినీ ఆశ్చర్యపరుస్తుంది. ఆయనకు ఏది కావాలన్నా స్ఫుటమైన అభిప్రాయాలు కలిగివుంటాడు. ప్రస్తుతం తనకో స్పూను కావాలి!! అది పెద్దదిగా, బండగా వుండకూడదు. అలాగని పల్చగానూ వుండకూడదు. పొడుగ్గా వుండాలి! అమితాబచ్చన్‌లాగా !! వాళ్ళ అబ్బాయిని తెమ్మంటే, అదిగో, యిదిగో అనడమేకానీ తెస్తేగా !!

చివరికి తనే బయల్దేరాడు పక్కవీధిలో వున్న మాల్‌కి. తనకేం కావాలో సేల్స్ గర్ల్‌కి చెప్పాడు. తను తెచ్చింది. తాతయ్య ఇదిగోండి. 35 రూపాయలు చెప్పింది ఆ పిల్ల. క్రిష్ణయ్యకి ఆషాపు బాగానే వుంది కానీ, ధరే నచ్చలేదు. ఆ సేల్స్ గర్ల్ లాంటి వాళ్ళు ఆరెండు ఫ్లోర్లలో పదిహేనుమందికిపైగా వున్నారు. కానీ, కొనేవాళ్ళు తక్కువ !! ఇక్కడ వర్కర్లు, లైట్స్ ఎక్కువ ధరలలాగే !! 35 రూపాయలు పెట్టి తనకోసం ఒక స్పూన్ నచ్చినదే అయినా కొనడం నచ్చలేదు. నిట్టూరుస్తూ రోడ్డు దాటాడు క్రిష్ణయ్య. మాల్‌కి ఎదురుగా వున్నా షాపతను క్రిష్ణయ్యను చూసి ఏంకావాలి పెద్దయ్యా! పలకరించాడు ఆప్యాయంగా. సొంతం విని క్రిష్ణయ్యకు కావాల్సిన స్పూన్ చేతికి యిచ్చాడు.

అరే! అచ్చం మాల్లో చూసిన లాంటిదే! ఆశ్చర్యపోయాడు క్రిష్ణయ్య. తనకు కావాల్సింది అదే!!

ఎంతో ధర!, అడిగాడు. ధర ఎక్కువ అయితే కొనేది లేదని మనస్సులో గొణుక్కొంటూ!!

ఆరు రూపాయలు ఇవ్వండి సార్. వినయంగా చెప్పాడు షాపు అతను. జుబ్బా లోనించి చిల్లర తీసి యిచ్చి, స్పూన్ సొంతం చేసుకొని నవ్వుకొంటూ ఇంటి దారి పట్టాడు క్రిష్ణయ్య.

అవున్లే, 35–6 ఈజ్ ఈక్వల్ టు లైట్లు, ఏసీలు అండ్ సేల్స్ గర్ల్సు!!

నిన్నటికీ, నేటికీ తేడా అదేగా మరి!!

..................

– బి.వి.ఎస్. ప్రసాద్

# ‘చిత్ర’ మైన జీవితం

**Part-5**

**ప్రముఖచిత్రకారుడు, కార్టూనిస్టు, కథారచయిత బాలిగారు 64కళలుడాట్‌కాం పాఠకులకోసం తన కళాజీవిత విశేషాలను, బాల్యస్మృతులను, పరిచయాలను ధారావాహిక రూపంలో అందించనున్నారు. నెల నెలా చిత్రమైన జీవితంలో...**





email: balisankar@gmail.com

**ప్రింటయిన బొమ్మలు చూడ్డం కన్నా ఒరిజనల్ చూస్తే, ఇంకా తొందరగా డెవలప్ అవుతాం. నేను బ్మోమలు మొదలు పెట్టి (అవి అచ్చవుతున్నా) సీనియర్ల బొమ్మలు చూసింది ఓ ఐదుసంవత్సరాలు తరువాతే...**

నేను ఎవరినీ అనుకరించలేదు. అసలు చెయ్యలేం!! చిన్న చిన్న పోకడులుంటే అవి పరిశీలనా ప్రభావంతో మనకు తెలియకుండానే మనమీద పడినవే– అప్పటికి బుజ్జాయి గారి నవ్వుల బండి “డుంబు” ఆంధ్రప్రభ వారపత్రికలో వచ్చేవి. అవి కామిక్‌స్ట్రిప్స్. అందులోని ఆ గీతలు ఏ బ్రష్‌తో గీస్తారో అక్షరాలకు ఏ పాళీ వాడతారో తెలియదు. తెలుగులో అప్పటికే కథలకు బొమ్మలు వేస్తున్న బాపుగారి దగ్గర్నుండి తమిళం పత్రికల్లో బొమ్మలు వేస్తున్న చతర్ ఛటర్జీ (జాబాకుసుం ఆయిల్ అడ్వర్‌టైజ్‌మెంట్‌లో ఈయన బొమ్మలు కనపడేవి) వరకూ అందరి బొమ్మలూ గమనించేవాడ్ని. చక్కని పెరస్పెక్టివ్, కాంపోజిషన్‌లతో ఈయన బొమ్మలుండేవి.





ఇలా ఆంధ్రజ్యోతి వారపత్రికలో బొమ్మలు వేస్తున్న రోజుల్లో మరో చిన్న అనుభవమూ జరిగింది. ఒకపేరున్న రచయిత తన కథకు ఒక ప్రసిద్ధ చిత్రకారుడు ఎలా అద్భుతంగా బొమ్మ వేశాడో సెంట్రల్‌ఐడియాను ఒక్క బొమ్మలో ఇలా చెప్పగలగాలీ అని ఆ ఆర్టిస్ట్‌ని వంగోబెట్టి ప్రశంసలతో ఆయన వీపు తోముతున్నాడు ఒక మీటింగ్‌లో...

“అయితే ఆర్టిస్ట్ అలా చేస్తే గొప్పగా ఉంటుందా?” అని అనుకున్నాను. అన్నీ పాతాలే కదా!! అనుభవాలన్నీ పాతాలే!! తరువాతెప్పుడో ఓ కథకు సెంట్రల్ ఐడియా తీసుకొని బొమ్మ వేశానే. ఆ కథ రాసిన వారు “అల్లం శేషగిరిరావు గారు కథపేరు “వేట”. వేటగాడు వేసే ఎత్తులను తప్పించుకొంటూ ఆవు చివరకు వేటగాని చేతిలో ఛస్తుంది శేషగిరిరావుగారి తండ్రి రైల్వే ఉద్యోగి. ఆయన రాసిన కథలన్నీ వేటకు సంబంధించినవే. కథలోని చెప్పిన విషయాన్ని ఒక్క బొమ్మలో చెప్పగలిగాను అనుకున్నాను. విశాఖ రావుగారు వచ్చారు. ఆయన విశాఖపట్నంలోనే ఉంటారు. మధ్యలో విరామం టైంలో ‘టీ’తాగడానికి ‘కొడిన్’ కేఫ్‌కువెళ్లాం. అప్పటికే శేషగిరిరావుగారు నా చుట్టూ తిరుగుతున్నారు. నేను గ్రహించుకోలేకపోయాను. తరువాతెప్పుడో నా పక్కకు చేరి “బాలీ!



నీవు నా కథకు ఆంధ్రజ్యోతిలో బొమ్మ వేశావు. బాగుంది. కానీ...నేను ఏదయితే సస్పెన్స్‌గా మెయిన్‌టెయిన్ చేసి కథరాశానో అదే బొమ్మలో చెప్పేశావు నా పదిపేజీల కథ వ్యర్థమయిపోయిందనిపించింది అని గొల్లుమన్నాడు.

“ఒక్క ముక్కలో కథలోని సారాంశం చెప్పాలనీ...” గొణిగాను.

“నిజమేగానీ అలా అక్కర్లేదు. మరోలా బొమ్మేసినా ఫరవాలేదు. ఆ విషయం నీకు చెబుదామనే ఇందాకట్నుంచీ ప్రయత్నిస్తున్నాను అన్నాడు”.

నాకిది మంచి అనుభవం.

ఆమాటే అన్నాను ఆయనతో, హాయిగా నవ్వుకున్నాడు.

నేను బొమ్మలు వేసిన మొదటి పూర్తి నవల ద్వివేదుల విశాలక్ష్మిగారు “జారుడుమెట్లు” మారిషస్ దేశపు బ్యాక్‌గ్రౌండ్. నవలలో సరుకు లేకపోయినా స్త్రీల రచనలకు బాగా గిరాకీ ఉన్న రోజులవి. తరువాతది “నందూరిపార్థసారథి”గారి హాస్య నవల (పేరు గుర్తులేదు) బాగుంటుంది. హాయిగా చదువుకోవచ్చు. బొమ్మలు హాస్యంగా వేయాలి కాబట్టి, నాకూ కొత్త కావడంతో చాల కష్టపడ్డాను. బొమ్మలు చూసిన వారు మెచ్చుకున్నారు. ఆ తరువాత “విరామం”నవల బొమ్మలకై వచ్చింది. ఈ రచయితల నవలతోపాటు, ఫొటోలు, పేపర్ కట్టింగ్స్ జతచేశారు కాబట్టి హాయిగా బొమ్మలు వేసుకోవచ్చు. రచయిత “అంగర వెంటకృష్ణారావుగారు” రెండవ ప్రపంచయుద్ధపు చివరరోజులలో బెంగాల్‌లో జరిగిన సంఘటనలు, పద్మావతినది, నదిపక్కన పల్లెలు, యుద్ధ ప్రభావం. పల్లె కారుల అవస్థలు, చక్కటి నవల.

ఇది ఆ సంవత్సరపు ఉత్తమ నవలగా ఎన్నికఅయ్యింది. ఎన్నికచేసిన వారు గొప్ప గొప్పవారే! అలా గొప్ప నవలకు సినీ నటుడు అక్కినేనినాగేశ్వరరావు గారు బంగారు పతకం వస్తుందని చెప్పిందీ వారే. పేపర్లలో ప్రకటనలు గుప్పించారు. శ్రీవారి సాహితీసేవను కొనియాడారు. రెండు వారాలు వీక్లీలో సకాలంలో ఇలాంటి ప్రకటనలు వెలువడ్డాయి. అయితే రచయితకు దక్కింది శూన్యం.

అంగర వారింటికి వెళ్లాను. పాతవైట్‌హౌస్ ఉండే ప్రాంతంలో ఉండేవారు. తెల్లగా, సుమారు ఎత్తులో ఉండేవారు. సంస్కార హృదయం. మిలటరీలోంచి వచ్చేసాక, బ్రూక్‌బాండ్ కంపెనీలో చేరారట.

“విరామం”నవలకు నేను వేసిన బొమ్మలు మెచ్చుకున్నారు” బహుమతి” విషయం ఎత్తితే... ఇలాంటి చెత్తవిషయాలు జీవితంలో చాలచూస్తుంటామని చెప్తూ నిజంగా బంగారు పతకమే బహుమతిగా వస్తే వారి అమ్మాయి తన దగ్గర దాన్ని దాచుకుంటానని చెప్పేదనీ, అదికూడా జరగలేదని చెప్పారు. సముద్రం ఒడ్డున రోడ్డుమీద నడుస్తూ చాల సేపు కబుర్లు చెప్పుకున్నాం. అవన్నీ 2వ ప్రపంచయుద్ధం, బెంగాలు దేశం గురించే. టౌన్‌హాలు నుండి మెయిన్ రోడ్డు మీదకు వస్తోంటే సందుమలుపులో ఉన్న ఓ హొటల్‌ను చూపిస్తూ ఇందులో నేనూ, నా మిత్రులూ శ్రీశ్రీ ఎన్నో సార్లు టీ తాగేవారమని చెపుతూ “నువ్వు పత్రికల్లోకి వెళ్లవలసి వస్తే భయపడుకు. అలాంటి అవకాశం మళ్లీ మళ్లీరావు. అది ఒక్క మారే తలుపు తడుతుంది. శ్రీశ్రీకి ఆ


బాలితో జమదగ్ని, కళాసాగర్

ఆయన అప్పటిలో పనిచేస్తున్న కలెక్టర్ ఆఫీస్ దాటే జిల్లా పరిషత్‌కు పక్కనున్న మా ఆఫీసు 'సర్కిల్'కు నేను వెళ్లాలి. ఓ రోజు ఆఫీస్ అటెండర్‌తో నాకు కబురు పంపాడు తనను కలుసుకోమని, దగ్గరే కదా! వెళ్లాను. ఇక వారి గురించి నా అనుభవాలు

రామగోపాలంగారు విశాఖపట్నం కలెక్టర్ ఆఫీస్‌లో సర్వే డిపార్ట్‌మెంట్‌లో పనిచేసేవారు. ఆయన కేడర్ ఏమిటో నాకు తెలియదు. ఓ టైపిస్ట్, అటెండర్, ఓ లేడీ అసిస్టెంట్ క్లర్క్ ఉండేవారు ఆ సెక్షన్‌లో. ఆయన ఇల్లు ఆఫీస్‌కి చాలా దగ్గర జిల్లా పరిషత్ ఆఫీస్‌కు ఎదురుగా ఉన్న "బీ.కె.రావ్" గారింట్లో పెరటివేపున్న అవుట్‌హౌస్‌లో వారి నివాసం. ఆయనతో పని ఉన్నా లేకపోయినా వీలు చిక్కినపుడల్లా ఆయన ఆఫీస్‌కు వెళ్లేవాడ్ని. రచనా వ్యాసంగం ఆయన కిష్టమయిన విషయం కాబట్టి డిపార్ట్‌మెంట్‌కి కొన్నాళ్లు శెలవు పెట్టి విజయవాడ ఆంధ్రజ్యోతి వీక్లీలో పురాణంగారి దగ్గర సరదాగా పనిచేసినట్టు తెలిసింది. ఇంకా పురాణశర్మగారి గురించి ఆ కబురూ ఈ కబురూ చెప్పేవారు. అప్పటికి నాకు పత్రికాఫీసూ, ఎడిటర్లూ కొత్త కాబట్టి ఆయన చెప్పే కబుర్లు ఎంతో థ్రిల్‌గా ఉండేవి. ఆ రోజుల్లోనే ఆయన్నో విషయం అడిగాను. నేను కార్టూన్‌లను పెద్దగా గీయలేకపోతున్నానని అంతే కాదు. స్ట్రోకుకు తగ్గ కాప్షన్ ఫన్నీగా రాయలేకపోతున్నాననీ.

ఆయన ఫక్కున నవ్వాడు. "కార్టూన్‌లు 'బాపూ' తరువాతే ఎవరయినా గీయగలరు, జోక్ (కాప్షన్) ఫన్నీగా పేల్చాలంటే ముళ్లపూడి తరువాతే అనీ అలా వారిది విడదీయరాని అనుబంధం అనీ ఆయన రాస్తాడు. ఈయన వేస్తాడు, బొమ్మలు గీయగలవేమోగాని రాతగాడు కావాలంటే నువ్వు మరో ముళ్లపూడిని వెతుక్కోవలసిందే" అన్నాడు నేనెలా వెతుక్కోగలను అంటే కార్టూన్‌లు వెయ్యలేనన్నమాట?

నాకు సీతమ్మ ధారలో ఉన్న గవర్నమెంట్ క్వార్టర్ ఎలాట్ అయ్యింది. మహారాణీపేటనుండి అక్కడికి మారిపోయాను. ఆ ఇల్లు విశాలంగా ఉండేది. ఇంటి ముందు ఎర్రగన్నేరు చెట్టు. దాన్నిండా పువ్వులే! చాల మంది ఉదయం పూజకు కోసుకునేవారు.

ఆ గవర్నమెంట్ క్వార్టర్‌కి మారిపోయినట్టు రామగోపాలంగారికి చెప్పాను. "అరె! మా అసిస్టెంట్ క్లర్క్ రోజుల్లో అలాంటి అవకాశం వచ్చింది. భయపడ్డాడు. అందరం అతడ్ని ముందుకు తోశాం అన్నాడు.

నవ్వుకున్నాను. నాలో నేనే. అలాంటి అవకాశం వస్తుందా? నాకు. శెలవు తీసుకున్నాను. ఆ తరువాత ఆయన గురించి ఎన్నో విషయాలు మిత్రులనుండి విన్నాను. అవి దారుణంగా ఉన్నాయి. కాలి, వేలుమీద ఆనకాయవస్తే బ్లేడ్‌తో కట్ చేసుకున్నారని అది వికటించి సెప్టిక్ అయి, అంతకు ముందే షుగర్ పేషెంటు కావడం వల్ల అది ఇంకా ముదిరిపోయి చావుకి దారి తీసిందని విన్నాను.

చోడవరంలో ఉంటుండగానే మా అమ్మాయి వైశాలీ పుట్టింది. శర్మగారు బొమ్మలకై కథలు పంపుతూనే ఉన్నారు. అది కంటిన్యూ అవుతూనే ఉంది. అయితే ఇంతలో నన్ను చోడవరం నుండి విశాఖపట్నం ట్రాన్స్‌ఫర్ చేశారు. విశాఖ పట్నంలో కాస్ట్‌ఆఫ్ లివింగ్ ఎక్కువ ఆ రోజుల్లో. భయంగా ఉండేది బతుకు గురించి. అయినా తప్పదు, విశాఖపట్నం అపుడపుడు వెళ్లిన వాడినల్లా, ఉద్యోగ నిమిత్తం ఇపుడు అక్కడే మకాం పెట్టవలసి వస్తోంది.

చోడవరం ఆఫీస్‌లో కన్నా ఇక్కడ మెయిన్ ఆఫీస్‌లో వర్క్ తక్కువ. శెలవురోజుల్లో ఆఫీస్‌కు వెళ్లక్కర్లేదు. ఈ రకంగా మనసుకొంత తెరిపినపడింది. నేను విశాఖపట్నానికి ట్రాన్స్‌ఫర్ అయి వచ్చినట్లు శర్మగారికి ఉత్తరం రాశాను. ఆయనకు విశాఖపట్నం అంటేనే చాల ఇష్టమని తరువాత తెలిసింది. ఆయనకు ఎంతో పేరు తెచ్చిన "నీలి"కథకు ప్రేరణ విశాఖపట్నమే.

నేను ఇక్కడకు వచ్చినట్లు విశాఖ రచయితలందరికీ ముందే ఓ మాట చెప్పేశారు. ముఖ్యంగా భమిడిపాటి రామగోపాలం గారికి



రామసుగ్రీవ మైత్రిని లేపాక్షి, గుజరాతీ, రాజస్థానీ శైలిలలో బాలి చిత్రాలు






వెంకటనర్సమ్మగారూ అక్కడే ఉంటున్నారే" అన్నాడు. ఆమె వల్ల ఆయన చీటికీ, మాటికీ అవసరమయినపుడల్లా కబుర్లు పెట్టేవాడు నాకు. ఈ వెంకటనర్సమ్మగారు మా వాకిట్లో గన్నేరు పూలకోసం వచ్చి మా అమ్మతో కబుర్లు చెప్పేది. వెంకటనర్సమ్మగారికి నలభై అయిదేళ్ల వయసుండవచ్చు. తమ్ముడు, మరదలు, తల్లితో కలిసి రెండు ఇళ్ల తరువాత ఇంటిలో ఉండేవారు (ఆమెకు భర్తలేదు).

నేనోమారు భరాగో(భమిడిపాటి రామగోపాలం)గార్ని కలిసి నిన్న అప్పలనర్సమ్మగారితో కబురుపెట్టారు కదా! మిమ్మల్ని ఆఫీసులో కలవమని ఏమిటి సంగతి అన్నాను. ఆయన చక్కగా నవ్వి ఆవిడపేరు వెంకటనర్సమ్మగారు. అప్పలనరసమ్మ అని శూద్రులే పెట్టుకుంటారు అన్నాడు. "ఓహో! అలాగా అనుకున్నాను" అయితే ఆమెకు ఎంత విలువ ఇస్తున్నాడో అనుకున్నాను. అయితే ఆ విషయమూ తెలియడానికి ఎన్నాళ్లో పట్టలేదు. ఆమెను వెటకారంగా పిలిచేవాడు. తక్కువ చేసి మాట్లాడేవాడు. అలా ఒకరోజు సాయంత్రం చీకటి పడుతోంటే ఆమె ఆఫీస్‌నుండి వస్తూ మా ఇంటి ముందు నుండి వెళుతూ నేను మెట్లు మీద ఉండడం చూసి "మిమ్మల్ని రేపు ఉదయం, భరోగో ఆఫీస్‌లో కలవమని చెప్పమన్నాడు కొంచెం పెందరాళే వెళ్లండి. ఎవరో వస్తారంట, పరిచయం చేస్తానని చెప్పమన్నాడు. మీరు మరచిపోతే నా ప్రాణం తీస్తాడు. అసలే కోతి వెధవ" అంది భరాగో వాచాలత్వం, మురికితనం చక్కగా తెలిసింది. అలాగే వెళ్లాను.

నాకు పరిచయం చేస్తానన్నది బాపు, ముళ్లపూడి గార్లను వీరందరికి విజయవాడలో ముందే పరిచయం ఉంది, వారు తీసిన ఏదో పిక్చర్ ఎలా పోతుందో అని ఆంధ్రదేశంలో పర్యటిస్తూ అలా ఈ వైజాగ్ కూడా వచ్చారు. ఎలాగూ వచ్చారు కాబట్టి మిత్రుడైన భరాగోను

చూడ్డానికి వస్తున్నారు. నన్ను పరిచయం చేశాడు భరాగో.

విష్ చేసి నిలబడ్డాను. కాసేపు ఆ కబురూ ఈకబురూ చెప్పుకున్నారు. మధ్యలో మాట్లాడ్డానికి నాకు కుదరలేదు. వారు బయలు దేరేటట్టున్నారు."మిమ్మల్ని కలుసుకోవాలనుకుంటున్నాను. ఎక్కడ కలుసుకోవాలి" బాపుగార్ని అడిగాను.

"సాయకాలం వరకూ బిజీగా ఉంటాం. ఐదుగంటలకయితే హోటల్ అప్సరలో ఫలానా రూంలో ఉంటాం" అంటూ రూం నెంబర్ చెప్పారు. "నెంబర్ నోట్ చేసుకున్నాను. ఆ రూం ఇండివిడ్యువల్ రూంల సిరీస్‌లో ఉంది. అంటే ప్రయివేట్ రూంలన్నమాట. అవి ఆహోటల్‌కి మొదట్లోనే కనిపిస్తాయి. అవి తొలకరి రోజులనుకుంటాను. పగలంతా ఎండ బాగా కాసి. సాయంకాలానికి వర్షం మొదలయ్యింది. ఎలాగయినా వారిని కలవాలన్న ఉద్దేశ్యంతో వర్షానికి తడుస్తూ హోటల్‌కి బయలుదేరాను. అక్కడికి చేరేసరికి వర్షంలో బాగా తడిసిపోయాను. బట్టలు తడిసి ముద్దయియిపోయాయి. చేతిలో కేరియర్ సంచీ, రెసెప్షన్‌లో మరో మారు కన్‌ఫర్మ్ చేసుకొని ఆరూం తలుపుతట్టాను. ముందుగా ముళ్లపూడివారు వచ్చారు. కూర్చోండి అన్నారు. బయట పొడవాటి బల్ల సోఫాలాంటిచెక్క కుర్చీలున్నాయి. బల్ల మీద కూర్చున్నాను, కిందంతా వర్షానికి తడిసిపోయి ఉంది. పైనుండి గొట్టంలో పెద్దగా నీళ్లు పడుతున్నాయి. ఆ నీళ్లన్నీ ఇనుపచక్రం ఉన్న కంత గుండా ఎటోపోతున్నాయి. అరుగుకింద పూలమొక్కలు, బాపుగారు, ముళ్లపూడి వారు వచ్చారు. మధ్యాహ్నం పడుకున్నారు కాబోలు, ఫ్రెష్ అయి తెల్లటి బట్టలు కట్టుకొని ఉన్నారు. సోఫాలో ఉన్న చెక్క కుర్చీలో కూచున్నారు. ఇద్దరూ ఏం మాట్లాడరు. నా వంక చూడరు. ఏంమాట్లాడాలో నాకూ తోచడం లేదు. ఉదయమే కదా 'భరాగో' నేనెవరో వీళ్లకి పరిచయం చేసింది.

అప్పటికే నేను కథలకు బొమ్మలు వేస్తున్నాను కాబట్టి నాకు కొన్ని అనుమానాలున్నాయి. బొమ్మలపరంగా ఆ అనుమానాలను నివృత్తి చేసుకోవాలి. అవీ ఒకటీ రెండు అంశాలు మాత్రమే! ఓ కారెక్టర్‌ను లేక ఒక వస్తువును వేసామనుకోండి. ఆ క్యారెక్టర్‌కి అవసరమయితే నీడను నల్లగా వేస్తాం. ఆ నీడ నా కెందుకో అందంగా బాలెన్స్‌డ్‌గా కుదరడంలేదు. అలా కుదరాలంటే ఏంచేయాలి. అదే అడిగాను.

దానికి బాపుగారి నుండి వచ్చిన సమాధానం ఇలా సంక్షిప్తంగా ఉంది.

"సోవియట్ లాండ్ పుస్తకంలోని బొమ్మలు చూడండి తెలుస్తుంది"

తిరిగి మా మధ్య నిశ్శబ్ధం

వాళ్లిద్దరూ జీవితంలో అదే మొదటిసారి చూస్తున్నట్టు, పైనుండి పడుతున్న వాననీరు తూములోకి పోవడం అలా చూసస్తానే ఉన్నారు. పదినిముషాలు గడిచాయి.



ప్రాణమిత్రుడు ముళ్లపూడి రమణతో బాపు

ఇక నాకు ఏం మాట్లాడాలో తోచలేదు. సీతమ్మధారకు పోవాలంటే ఇప్పటిలా ఇన్ని బస్సులు లేవు. తడిసిన వాచీని తుడిచి చూస్తే బస్ వేళయ్యింది. వస్తానన్నట్టు లేచాను. వాళ్లూ లేచారు.

వర్షం తగ్గేదాకా కూర్చోమని కూడా అనలేదు. ఆ రెండు మెట్లు కిందకి దిగి రెండడుగుల వేసి ఎనక్కు చూశాను. వారు లోపలికి పోయి తలుపులు వేసుకుంటున్నారు.

"అది మంచికయినా చెడుకయినా ఫస్ట్ఇంప్రెషన్ ప్రభావం ఉంటుంది ఎదుటివారిపై"

నేను వర్షంలోనే బస్ పట్టుకొని ఇంటికెళ్లిపోయాను. ఇక ఈ చిత్రకళలో ఏవన్నా డెవలప్‌మెంట్స్ కావాలంటే ప్రపంచంలోనే వెతుక్కోదలచుకున్నాను. తరువాత అలాగే చేశాను కూడా. శని, ఆదివారాల్లో సీతమ్మ ధారలోని మా ఇంటినుండి అడ్డంగా ఎంకోజీపాలెం మీదుగా యూరివర్సిటీ '(ఆంధ్రా) లైబ్రరీకి వెళ్లేవాడిని, ఆ లైబ్రేరియన్ నేనెవరో స్టూడెంట్ ని అనుకొని ఉండవచ్చు. అబ్జెక్షన్ పెట్టేవాడు కాదు. మొత్తం విదేశీ మాగజైన్‌లు, పిక్టోరియల్స్ తిరగేసేవాడ్ని. కొన్ని కొన్ని బొమ్మలు చూస్తోంటే ఆస్టయిల్‌లో బొమ్మలే వేయాలన్న తహతహ కలిగేది. అదో అద్భుత ప్రపంచం. మధ్యాహ్నం రెండు గంటల దాటాక కడుపు కరకరమంటుంటే ఇంటికి తిరిగి

వచ్చేసరికి ఎంత లేదన్నా మూడు గంటలు దాటేది. అయితే ఈ చిత్రమైన అనుభవాలలతో, ఆర్తితో ప్రపంచం ఇంకా విశాలంగా కనపడ్డం మొదలెట్టింది నాకు.

ఆంధ్రజ్యోతి వారపత్రికలో బయటనుండి బొమ్మలు వేస్తున్నపుడే పురాణంగారు చెప్పారు. "ఆరునెలలకొకమారన్నా విజయవాడ వస్తుండు. దానివల్ల కొత్త పత్రికలు పరిచయంకావడమే కాదు. నీ రెమ్యూనరేషన్ వెంటనే కలెక్ట్‌చేసుకొని వెళ్లిపోవచ్చుఅని" ఈ విషయం బాగుందనిపించింది. వరుసగా రెండుమూడు రోజులుగాని శెలవులు వస్తే విజయవాడ వెళ్లేవాడిని. నన్ను చూడగానే శర్మగారు ఎగిరి గెంతేసేవాడు. తనకింద ఎకౌంట్లో పనిచేస్తున్న వెంకటేశ్వరరావుని పిలిచి అంతవరకూ అచ్చయిన నా బొమ్మల రెమ్యూనరేషన్ ఓచర్ సిద్ధం చేయించడం, సెలక్ట్ అయిన నవలలు, కథలూ నా కోసం పేక్ చేయించడం, ఆ సాయంకాలం రిక్షాలో తీసుకెళ్లి కొత్త పత్రికల్ని పరిచయం చేయడం అలా పరిచయమైనదే "అనామిక" "ప్రగతి" మొదలైనవి. ఒక్కోమారు నాకు నేనై వెళ్లి పరిచయం చేసుకున్న పత్రిక "స్వాతి మాసపత్రిక".

నా పరిస్థితి ఎలా ఉండేదంటే అంతా రాదు. ఏదో కొంచెం వచ్చు. ఆ కొంచెంలో అంతా బాగావచ్చు. ఇలా ఉండేది. ఇదే రోజుల్లో శ్రీచలసాని ప్రసాద్‌రావుగారు పరిచయం అయ్యారు. ఈ పరిచయాలు ఎలా అయ్యాయో తెలియదు. ప్రతి వారం ఆయన నుండి ఉత్తరం వచ్చేది. ఆ ఉత్తరంలో ఆయన ఆ మధ్య పత్రికల్లో చూసిన నా బొమ్మలు గురించి ప్రస్తావన, అభినందనలతో సగం పేజీ నిండిపోయి ఉండేది. " అలా ప్రాక్టీస్ చేస్తే మంచి ఆర్టిస్ట్‌వు అవుతావని ముక్తాయింపు చివరలో". చలసాని వారు కూడా ఆర్టిస్టే. అప్పటిలో హైదరాబాద్‌లో పౌరసంబంధాల శాఖలో పనిచేస్తున్నారని విన్నాను. ఇదికాక కళ అనే త్రైమాస పత్రికా నడిపేవారు. ఈ పత్రిక పూర్తిగా, శిల్పకళ, చిత్రకళలకు సంబంధించినది. దాన్లో నా చేత చాల బొమ్మలు గీయించాడు. అవన్నీ ఆ తరువాత వచ్చిన సంపుటాల్లో చేర్చాడు కూడ. ఇక్కడ ఈ హైదరాబాద్‌లో ట్రేసింగ్ బాపతే గానీ మంచి ఆర్టిస్ట్‌లు లేరని చాలసార్లు అన్నాడు. నవ్వి ఊరుకున్నాను. ఇది అతని అభిప్రాయం కావచ్చు.



భూమ్మీద పెట్టుబడి పెడితే మంచిదని
అందరూ అంటేనూ...కొన్నా..!!

# ఆకాశమంత... గణేశుడు
# తనివి తీరని... రాజేంద్రుడు

## సమ్‌థింక్ స్పెషల్

థింక్ బిగ్... ఏది చేసినా గొప్పగా చేయాలి.
నలుగురు మెచ్చుకునేలా చేయాలి.
ఏది చేసినా సమ్‌థింక్‌స్పెషల్ గా ఉండాలి
అదే రాజేంద్రన్ ప్రత్యేకత.
ఖైరతాబాద్‌లో పెట్టే వినాయకుడి విగ్రహం
రాష్ట్రంలో భారీ విగ్రహాల తయారీకి నాంది
పలికింది...
పర్యావరణ ప్రేమికుల విమర్శకులకు
గురైంది....

ఎంత పెద్దవాడైనా,ఎంత గొప్పవాడైనా
మనిషి చివరకు ప్రకృతిలో భాగం కావలసిందే.
పదకొండు రోజుల్లో మట్టిలో కలిసిపోయే విగ్రహానికి,
పెద్దా, చిన్నా ఏమిటి అని అనుకునేవాళ్లకి సరైన సమాధానం ఇది.
అలా అని మనిషి ఎదిగే ప్రయత్నం చేయకుండా ఉండకూడదు.
అందరికంటే గొప్పవాడు కావాలన్న
ఆకాంక్షను పోగొట్టుకోకూడదు.
జీవితాంతం నలుగురికీ ఆదర్శంగా జీవించాలి.
ఆకాశమంత వినాయకుడు చెప్పేది ఇదే.
ఏడాదికి ఒక రూపంలో గణేశుణ్ణి సృష్టిస్తున్నా
తనివి తీరని శిల్పి రాజేంద్రన్‌కు స్ఫూర్తి ఇదే.
గొప్ప శిల్పి అనిపించుకోవడానికి..భారీ సైజులే
కానక్కరలేదన్న సంగతి రాజేంద్రన్ త్వరగా గుర్తిస్తే
మంచిదనుకుంటా....

ఖైరతాబాద్‌లో వినాయకుని గత రూపాలు..















# " సాహితీ విశ్వంభరుడు - సినారె "

"అది అక్షరం
అదే చిగురిస్తే శబ్దమవుతుంది
తీగసాగితే వాక్యమవుతుంది
పందిరంత విస్తరిస్తే గ్రంధమవుతుంది
సమస్త వాఙ్మయ సృష్టికి బీజరూపం అక్షరమే".

అంటూ అక్షరానికి ఆకృతి ఇచ్చి తెలుగు సాహిత్య కళామతల్లికి మాలగా అల్లి, తెలుగు కవితా మాధుర్యాన్ని విశ్వానికి రుచి చూపించిన మహాకవి డా॥సి.నారాయణరెడ్డి. పదేళ్ల వయసునాడే కలంపట్టి కవిత్వాన్ని పండించిన కృషీవలుడు డా॥రెడ్డిగారు.



ఎల్.ఆర్. వెంకటరమణ

*"అక్షరాలైనా
బుద్ధిజీవుల వ్యక్తిత్వాలైనా
అటు ఆర్ద్రత
ఇటూ ఆలోచనల సాంద్రత వున్నప్పుడే
అర్ధవంతంగా నిలిచిపోతాయి
అలా కానప్పుడు
అవి గాలిలో కలిసిపోతాయి".*

అంటూ సమాజంలోని వ్యక్తుల వ్యక్తిత్వాలు గానీ, కవితలలోని అక్షరాలుగానీ ఆర్థత, ఆలోచనల సాంద్రత వున్నప్పుడే అర్ధవంతంగా నిలుస్తాయని సూత్రీకరించాడు.

డా॥ సి.నారాయణరెడ్డి గారు కరీంనగర్ జిల్లా వేములవాడ మండలం హనుమాజిపేట గ్రామంలో జన్మించారు. తండ్రి మల్లారెడ్డి, తల్లి బుచ్చమ్మ. నారాయణ వ్రతం చేస్తానని మొక్కుకున్నారు. కుమారుడు కలగడంతో సత్యనారాయణరెడ్డి అని పేరు పెట్టుకున్నారు. సిరిసిల్ల మాధ్యమిక పాఠశాలలో కొడుకును చేర్పించేటపుడు సి.నారాయణరెడ్డి అని వ్రాసుకోవడం జరిగింది.

సిరిసిల్లలో ఉర్దూ మాధ్యమంలో తెలుగు ఐచ్ఛిక విషయంగా విద్య అభ్యసించారు. 1948లో కరీంనగర్‌లోని ప్రభుత్వోన్నత పాఠశాలలో ఉన్నతపాఠశాల విద్యను పూర్తిచేశారు.

రెడ్డిగారిలో సృజనాత్మక శక్తి, అశువుగా కవితలల్లడం, రాగయుక్తంగా పాడటం అన్నవి చిన్ననాటి నుండే అబ్బాయి. చిన్ననాడే జానపద గీతాలను ఆలపించేవారు. హరికథలు, బుర్రకథలంటే ప్రీతి. వేయులవాడకు చెందిన చౌటి నరసయ్యగారి హరికథా గానం నారాయణయరెడ్డిగారిలో ఛందస్సు పట్ల మక్కువ, ఆసక్తి, అభిరుచి కలగడానికి కారణమైంది. శ్రీ దూపాటి వేంకటరమణాచార్యులు మెలుకువలు నేర్పారు.

హైదరాబాద్ ఛాదర్‌ఘాట్ కళాశాలలో ఉర్దూ మాధ్యమంలో ఇంటర్ విద్యను పూర్తిచేశారు. ఈ కాలంలోనే జువ్వాది గౌతమరావుగారి ఆధ్వర్యంలో వెలువడే "జనశక్తి" పత్రికలో తొలి కవిత పురుడుపోసుకుంది. 1952లో ఉర్దూ మాధ్యమంలో ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి బి.ఏ. చదివారు. ఈ కాలంలోనే కళాశాల సాహితీ సంచిక "శోభ"కు సంపాదకత్వం నిర్వహించారు. ఈ కాలంలోనే "రోచిస్, సింహేంద్ర" కలం పేర్లతో రచనలు సాగించారు. ఉస్మానియా విద్యాలయంలోనే ఎం.ఏ. కూడా పూర్తిచేసి , సికింద్రాబాద్ ఆర్ట్స్ అండ్ సైన్స్ కళాశాలలో




విజయవాడలో మహాసభల ప్రారంభోత్సవ కార్యక్రమంలో మాట్లాడుతున్న సినారె

తెలుగుశాఖలో రీడర్‌గా పదోన్నతి పొందారు. నారాయణరెడ్డిగారు 1981 నుండి 1985 వరకు అధికార భాషా సంఘ అధ్యక్షులుగా బాధ్యత నిర్వహించి, భాషాసేవ చేయగలిగారు. అనంతరం డా॥ అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులుగా నియమితులైనారు. అనంతరం పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్ష పదవిని అలంకరించారు. తరువాత "భాషా సాంస్కృతిక

పార్ట్‌టైం లెక్చరర్‌గా కూడా పనిచేసారు. 1958లో నిజాం కళాశాలలో లెక్చరర్‌గా పనిచేశారు. ఇదే కాలంలో శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి సూచనలతో, ఖండవల్లి లక్ష్మీరంజనంగారి పర్యవేక్షణలో "ఆధునికాంధ్ర కవిత్వం-సంప్రదాయములు-ప్రయోగాలు" అన్న విషయంపై పరిశోధన చేశారు. అనంతరం ఉస్మానియా విశ్వవిద్యాలయం



వ్యవహారాల" సలహాదారుగా కూడా పనిచేశారు.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి హోదాలో చరిత్ర, సాహిత్య, సాంస్కృతిక, సంగీత, నృత్య, నాటక, చిత్రకళ, శిల్పకళలు, జానపదకళల సమాహారంగా "కళానికేతన్" నిర్మాణానికి కూడా రూపకల్పన చేయగలిగారు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రసాంస్కృతిక మండలి అధ్యక్షపదవి కూడా అలంకరించారు. అన్ని కళారంగాల వారికినీ ఆదర్శప్రాయంగా నిలిచారు. రచయిత అధ్యయన శిబిరాలు నిర్వహించారు. 1997 నుండి 2003 సం॥ వరకు రాజ్యసభ సభ్యులుగా కొనసాగారు. దక్షిణ భారత దేశం నుండి రాజ్యసభ సభ్యులుగా నియమితులైన తొలి కవి కావడం విశేషం. సభలో 624 ప్రశ్నలు వేశారు. అంతేకాక 32 సార్లు ప్రత్యేక ప్రస్తావనలు చేశారు.

విశ్వవిద్యాలయం ఉపన్యాసకులుగా ఉన్నకాలంలోనే సినిమా పాటలు కూడా రచించారు. ఇంకా దాదాపుగా 18 ప్రక్రియలలో 80 గ్రంథాలు రచించారు. రెడ్డిగారి రచన- "ఋతుచక్రం" కావ్యానికి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డు, "మంటలు మానవుడు" కావ్యానికి కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు, "విశ్వంభర" కావ్యానికి భారత అత్యున్నత జ్ఞానపీఠ్ పురస్కారం అందుకున్నారు. ఎన్నో విద్యాలయాలు డాక్టరేట్‌తో గౌరవించాయి. భారతప్రభుత్వం "పద్మశ్రీ", "పద్మవిభూషణ్"లతో సత్కరించింది. భారతదేశంలోని ఇతర ప్రాంతాలే కాక, ప్రపంచదేశాలు ఎన్నో సందర్శించి తెలుగు పతాకాన్ని ఎగురవేశారు. రెడ్డిగారి సాహిత్యంపై



ట్రస్టు" స్థాపించారు. ప్రతి ఏటా ఉత్తమ రచయిత్రికి పురస్కారాలు ఇవ్వడం జరుగుతోంది. విద్యార్థులకు స్వర్ణపతకాలు ఇవ్వడం కూడా జరుగుతోంది. నారాయణరెడ్డిగారి కుమార్తెలు శ్రీమతి గంగ, శ్రీమతి యమున, శ్రీమతి సరస్వతి, శ్రీమతి కృష్ణవేణి.

సినారెగారు తన "సినారె గజళ్లు" కావ్యాన్ని శ్రీమతి గంగకు అంకితమిస్తూ

"నన్నే కన్నయ్యగ తన
కన్నుల ఒడిలో పొదిగిన
గంగకు అర్పింతును నా
గజళ్లు ఎదలోన ముడిచి" అంటారు.

తెలుగువారి గౌరవాన్ని, తెలుగు సాహిత్య ఔన్నత్యాన్ని ప్రపంచానికి చాటిచెప్పారు సినారె.

"ఆకాశమంత వ్యక్తిత్వం
సముద్రమంత సాహిత్యం
కలగలసిన కవితాత్మ
తెలుగు సాహిత్య సంతకం
ప్రపంచ పదులు పలికించి
గజల్‌కు గజ్జె కట్టించిన కర్పూరవసంతరాయలు
నిత్య చైత్యశీలి. నిరంతర సాహితీమూర్తి
సంగీత సాహిత్య రస చక్రవర్తి"

ఎందరో పరిశోధనలు చేసి డాక్టరేట్ డిగ్రీలు పొందగలిగారు.

నారాయణరెడ్డిగారికి బిరుదుల విషయాన్ని పరికిస్తే అదొక ప్రత్యేక వ్యాసం అవుతుంది. అభినవ శ్రీనాథ, నవ్యకవి, గేయకవి సామ్రాట్, పుంభావ సరస్వతి, అభినవ కవిజలపాతం, ఆధునిక కవితా మహా ప్రభువు, గేయచక్రవర్తి, అభినయ కవి సార్వభౌముడు, గేయ భగీరధుడు, ఆంధ్రరవీంద్రుడు, ధ్వని చక్రవర్తి, ప్రజాకవి, అభినయ జయదేవుడు, గేయ గంగాధరుడు.... ఇలా ఎన్నో ,ఎన్నో సంస్థలు, విశ్వవిద్యాలయాలు బిరుదులు, డాక్టరేట్‌లను ఇచ్చి సరస్వతీ పుత్రునికి సన్మానం చేయగలిగాయి.

నారాయణరెడ్డిగారు 1952 నుండి 2010 వరకూ సుమారు 18 ప్రక్రియల్లో దాదాపుగా 80 గ్రంధాలు రాయగలిగారు. 3,500కు పైగా సినిమా పాటలు రాశారు. వీరి కావ్యాలన్నీ ఇతర భారతీయ భాషలలోకి, ఇతర భాషలలోకి అనువదించబడినాయి.

'నడక నా తల్లి
పరుగు నా తండ్రి
సమత నా భాష
కవిత నా శ్వాస"–

అంటూ తన సాహితీ ప్రతిభను చాటుకుంటూ తెలుగు కవితకు చిరునామాగా మారారు.

నారాయణరెడ్డిగారి సతీమణి శ్రీమతి సుశీల. ఈమె స్వర్గస్తులైనారు. ఆమె స్మృత్యర్థంగా "శ్రీమతి సుశీలానారాయణరెడ్డి



# ఆహ్లాద భరితం-హాస్య నాటిక పోటీలు

**'నవ్వటం ఓ భోగం, నవ్వించటం ఓ యోగం, నవ్వలేకపోవటం ఓరోగం' అని అన్నారు జంధ్యాల. ఆ హాస్యబ్రహ్మ 38 సంవత్సరాల క్రితం నెలకొల్పిన సంస్థ సుమధుర కళానికేతన్. తన వంతు కళా సేవచేస్తూ 16 సంవత్సరాలుగా క్రమం తప్పకుండా రాష్ట్రస్థాయి హాస్య నాటికల పోటీలు నిర్వహిస్తుంది. మూడు రోజులపాటు జరిగే హాస్యోత్సవంలో కళాసంస్థలు, హాస్యనటులు, సినీ హాస్యనటులు, రాష్ట్రవ్యాప్తంగా మమేకం కావటం ఒకచోటుకు చేరటం ఈ ఉత్సవ విశేషం. ఈ ఏడాది జూలై 29, 30, 31 తేదీల్లో విజయవాడలో తుమ్మలపల్లి కళాక్షేత్రంలో ఈ పోటీలు జరిగాయి.**



ప్రాథమిక పరిశీలనలో ఎన్నికైన ప్రతి నాటికకు 10వేల రూపాయలు పారితోషికం, ఉత్తమ నాటకానికి మరో 10వేల రూపాయలు, నాటకంలోని వివిధ విభాగాలకు నగదు పారితోషికం అందజేశారు. ఈసారి ఎన్నికైన నాటికల్లో తొలిరోజు ప్రదర్శనగా 'ప్రియమైన శత్రువు' నాటిక ప్రదర్శించారు. నేటి ఆధునిక కాలంలో మనిషి శాస్త్ర సాంకేతిక రంగాల్లో విప్లవాత్మకమైన అభివృద్ధి సాధిస్తున్నాడు. మరో ప్రక్క ప్రపంచాన్ని కబళించే విషతుల్య సృష్టికి కారణమవుతున్నాడు. నేడు అందరి నోటా వినిపించే మాట ప్లాస్టిక్. వీటి వినియోగం, క్యారీ బ్యాగ్స్ పాలిథిన్ కవర్ల రూపంలో భూమిసారాన్ని మింగేస్తున్నాయి. రకరకాల ఆనారోగ్య సమస్యలకు కారణమవుతున్నాయి. ఈ నేపథ్యంలో 'పాలిథిన్' లేని ఇల్లును చూడాలనే కోరికతో పుట్టిన నాటిక 'ప్రియమైన శత్రువు' దీని రచన దర్శకత్వం కె.వి. వ్యసనాలకు బానిసై తమ కుటుంబాలను సర్వనాశనం చేసుకుంటున్నవారు ఈ లోకంలో చాలా మంది ఉన్నారు. జ్ఞానంతో ఎవరు ఏ మార్గంలో వెళ్లాలో, ఏ గమ్యం చేరుకోవాలో ఆలోచించుకోవాల్సింది మనమే. మంచి మార్గంలో వెళ్లిన వాళు ఉన్నత శిఖరాలు అధిరోహిస్తారు. ఎవరో వస్తారని, ఏదో చేస్తారని, ఆశపడకుండా మన భవిష్యత్తు మనమే తీర్చిదిద్దుకోవాలని చెప్పే నాటిక 'ఎవరో వస్తారని' చెరుకూరి సాంబశివరావు రచన



సత్కారం అందుకుంటున్న రంగస్థలనటుడు ఆదిశేషయ్య



సత్కారం అందుకుంటున్న చంద్రమోహన్






బెస్ట్ మేకప్‌మెన్ అవార్డు తీసుకుంటున్న అడివి శంకరరావు

దర్శకత్వం వహించిన ఈ నాటిక ఈ పోటీల్లో ఉత్తమ ప్రదర్శనగా నిల్చింది. ఈ నాటిక ప్రదర్శకులు ఉషోదయం కళానికేతన్, కాట్రపాడు. ఏ వయస్సులో జరగాల్సిన ముచ్చట ఆ వయస్సులో జరగాలి. వయస్సు మీరిన తర్వాత పెళ్లి జరుపుకోవటం ఓ వ్యంగ్యం. పెళ్లిళ్లు యుక్త వయస్సులోనే జరగటం మంచిదని హాస్యరసంగా చెప్పిన నాటికే 'దొందూ దొందే' ఈ నాటిక ప్రదర్శకులు అభ్యుదయ ఆర్ట్స్, పాతపాడు-రచన కావూరి సత్యనారాయణ దర్శకత్వం మన్నెం జోజి.

బుర్రనిండా అమాయకత్వం వంటి నిండా సోమరితనం డబ్బు సంపాదించటం చాలా ఈజీ అని, కష్టపడకుండా గొప్పవాళ్లు కావాలనుకునే వ్యక్తులకు ఈ సమాజంలో ఎటువంటి స్థానంలో ఉంటుందో తెలియజేస్తూ అలాంటి మసిబారిన కంచాలకు మెరుగులు దిద్దే ప్రయత్నమే 'కంచాల కథ' నాటిక. రచన కె.వి.ఆర్ విజయ్‌కుమార్ దర్శకత్వం ఎండి.ఎస్.పాషా. కల్పనా నికేతన్ నరసరావుపేట వారు ప్రదర్శించారు. చాదస్తాల మధ్య బందీలై అచ్చిరాని అంకె అంటూ ప్రాణి గ్రహానికీ, ప్రాణానికి లింకుపెట్టి ఓ ఆడపిల్ల జీవితాన్ని అడవి కాచిన వెన్నెల ఓ అజ్ఞాని కథే 'బావిలో కప్ప' నాటిక. ఈ నాటిక మల్లాది క్రియేషన్ హైదరాబాదు వారు ప్రదర్శించారు. రచన పి.వి.రామారావు దర్శకత్వం మల్లాది భాస్కర్. ఈ నాటిక తృతీయ ప్రదర్శన బహుమతి పొందింది. కష్టపడి సంపాదించటం ఎంత ముఖ్యమో దానిని పొదుపు చేయటం కూడా అంతే ముఖ్యం. పెళ్లయిన ప్రతి జంట సొంత ఇంటి కోసం ఆలోచించమని చెప్పే నాటిక 'హాయిగా ఉండాలోయ్' రచన దర్శకత్వం సమ్మెట గాంధీ. సద్గురు కళానికేతన్ హైదరాబాద్



'హాయిగా ఉండాలోయ్' నాటికలో ఒక దృశ్యం

వారు ఈ నాటిక ప్రదర్శించారు.

మనిషి సృష్టించిన రూపాయి చుట్టూ మనిషే తిరుగుతాడు. రూపాయి కోసం ఎంతటి పాపానికైనా ఒడికడతాడు. ఈజీగా డబ్బు సంపాదించాలని అందివచ్చిన అవకాశాన్ని వదులుకున్న కార్పొరేట్ డాక్టర్ కథే 'ఆశ దోస అప్పడం వడ' కళానికేతన్ వీరన్నపాలెం వారు దీన్ని ప్రదర్శించారు.

మైత్రి కళానిలయం విజయవాడ వారు 'కళ నిజమాయెగా' నాటిక ప్రదర్శించారు. కలలో వచ్చేవి ఇలలో జరగాలని కోరుతూ అనేక ఇబ్బందులకు లోనైన 'కల నిజమాయెగా' నాటిక రచన కె. సుబ్రమణ్యం, దర్శకత్వం పురుషోత్తం.

సినిమాల్లో జరిగే థ్రిల్స్ తన జీవితంలో కూడా జరగాలని రంగుల కలలు కనేవాడికి షాక్ 'థ్రిల్' నాటిక. థియేటర్ లవర్స్ హైదరాబాదు వారు ఈ నాటికను ప్రదర్శించారు. రచన దర్శకత్వం భరద్వాజ్ గోవిందరాజ్.

ఏ వ్యక్తి అయినా తన అవసరాల కోసం నైతిక విలువలు కోల్పోతే ఆ వ్యక్తి రాముడైనా, సామాన్యుడైన ఆ సమాజం ముందు తలవంచాల్సిందే. ద్వితీయ ఉత్తమ ప్రదర్శనగా ఎన్నికైన 'మనిషి మంచోడే' ఈ నాటిక కళావర్షిణి హైదరాబాద్. రచన కాటా సబ్బారావు. దర్శకత్వం జెట్టి హరిబాబు. ఇంకా ఈ మూడు రోజుల పండుగలో సినీ నటి రాధాకుమారి, హాస్యనటుడు చంద్రమోహన్, రంగస్థల నటుడు ఆదిశేషయ్యలకు సత్కారం జరిగింది. ఈ సందర్భంగా జరిగిన ఉత్సవంలో నల్లమిల్లి మల్లారెడ్డి, సింగార నాగి అజయ్‌కుమార్, ఎంవి సుబ్బరాజు, ఎం.సి.దాస్, డా॥ఎన్ మురళీకృష్ణ, విశాలాంధ్ర సంపాదకులు రాఘవాచారి, నటుడు వి. కొండలరావు, సుత్తివేలు, కోట శంకర్రావు, సింగారమణి అజయ్‌కుమార్, కోగంటి సత్యం, వై. వెంకటేశ్వరరావు, జంధ్యాల సతీమణి అన్నపూర్ణ, కార్యదర్శి విజయభాస్కర్ శర్మ, జయప్రకాష్ రెడ్డి, సుత్తివేలు, 64కళలు.కామ్ ఎడిటర్ కళాసాగర్, కార్టూనిస్టు బాబు, మోహనరాంప్రసాద్, ప్రకాష్, ఆంజనేయరాజు తదితరులు పాల్గొన్నారు.

**– అడివి శంకరరావు**


'కల నిజమాయెగా' నాటిక లో ఒక దృశ్యం

# మేకప్‌కళలో మేటి-అడివి శంకరరావు



**బ్రహ్మ మనుషులను అనేక రూపాలను సృష్టిస్తే, మేకప్‌మేన్ ఒకే మనిషిలో వివిధ రూపాలలో సృష్టిస్తాడు. అందుకే మేకప్‌మేన్‌ని రూపశిల్పి అంటారు. "సృష్టికి ప్రతిసృష్టి చేయగలం మేము. బ్రహ్మ ఇచ్చిన రూపాన్ని మార్చగల శక్తి మాకుంది". అంటారు... నవ్వుతూ విజయవాడకు చెందిన మేకప్‌మేన్ అడివిశంకరరావు. అసలు మేకప్ అంటే ఏమిటనే దానికి, ముఖంలో లోపాన్ని సరిదిద్ది అందంగా చూపడమేనంటారు.**

చతర్విధాభినయాల్లో తృతీయస్థానాన్ని అలంకరించిన ఆహార్యభినయానికి నటుని సహజసిద్ధమైన శారరీక నిర్మాణం, అంగసౌష్టవం, రూపలావణ్యాధులతోపాటు 'రూపశిల్పి' చతురత-నిపుణత తోడైతే పాత్ర ఆహార్యపరంగా పరిపూర్ణత సిద్ధించుకోగలదు-ప్రేక్షక జనాదరణకు నోచరుకోగలదు. నటుడు రంగస్థలంపై ప్రత్యక్షంగా నటిస్తుంటే 'రూపశిల్పి' నటుని ఆహార్యంతో అంతర్భాగమై అభినందనలకు పాత్రడవుతుంటాడు. ఆంగిక వాచిక, సాత్వికాభినయాలకు ధీటుగా సమాన ప్రతిపత్తిని, సముచిత స్థానాన్ని పదిలపరచుకున్న ఈ మేకప్‌కను పాత్రోచితంగా సమకూర్చడంలో మేటి రూపశిల్పిగా పేరొందిన వారు అడివి శంకరరావు.

రూపశిల్పిగానే కాక నటుడిగా, నాటకనిర్వహకుడిగా వ్యాఖ్యాతగా, రంగాలంకరణకుడిగా, పరిషత్ నాటకాల పరిశీలకుడిగా, రచయితగా, పాత్రికేయుడిగా పరిమళిస్తున్న అడివి శంకరరావు, అడివి వెంకటచలపతిరావు, శ్రీమతి కాశీవిశాలాక్షి అన్నపూర్ణమ్మ దంపతులకు విజయవాడలో జన్మించారు.

శంకరరావు నటుడిగా నాటకరంగంలో కాలిడినా, వీరి మనస్సు ఎందుకో మేకప్‌కళ పట్ల ఆకర్షితమైంది. రూపశిల్పిగా ఉన్నత స్థానాన్ని అందుకోవాలని ఉవ్విళ్లూరింది. అంతే తన మనసుకి నచ్చిన- మెచ్చిన మేకప్ కళలో కె.ఎస్. శాస్త్రి వద్ద సునిశిత శిక్షణ పొందారు. మరెంతో మంది సుప్రసిద్ధ మేకప్ కళాకారుల వద్ద మేకప్‌లోని మెళకువలను ఔపోషణ పట్టారు. గురువుల చెంత అభ్యసించినదానికి తన సృజనను జోడించి, నాటకీయతను సహజత్వాన్ని పాత్ర ఔచిత్యాన్ని మేళవించి చక్కని మేకప్ సమకూరుస్తూ మేకప్ కళలో మేటి కళాకారుడుగా తన కంటూ ఒక ప్రత్యేక స్థానాన్ని సంపాదించుకున్నారు.

నాటక రంగానికి నిలువుటద్దం, నడుస్తున్నా నాటకరంగం, ఎన్‌సైక్లోపీడియా ఆఫ్ సోషల్ థియేటర్ అని నాటకరంగ పెద్దల ఆశీస్సులు అందుకున్నారు.

కాలజ్ఞానం, జాతిస్మరామి, పుణ్యపలం, సంచలనం, అరణ్యపరవం వంటి ఎన్నో నాటికలకు అద్భుతమైన మేకప్‌ను సమకూర్చిన శంకరరావు ఉత్తమ మేకప్‌మేన్‌గా దాదాపు 100కు పైగా బహుమతులు అందుకున్నారు.

1968 నుండి అనేక నాటక సమాజాలలో కళాకారునిగా, సభ్యునిగా ఉంటూ నాలుగు దశాబ్దాలుగా పరిషత్‌లతో, కళాకారులతో ఆత్మీయ అనుబంధానికి గుర్తింపుగా 1991లో కె.ఎస్.మూర్తి మెమోరియల్ పరిషత్, విజయవాడవారు కళామిత్ర బిరుదుతో సత్కరించారు.

నాటకరంగంలో అనుభవశాలిగా మెలుగుతున్న శంకరరావు అనురాగవతి అయిన అర్ధాంగి శ్రీమతి సుబ్బలక్ష్మితో పిల్లలు హేమామాళిని, ప్రేమసాయిలతో నిరాడంబరమైన మధ్యతరగతి జీవితాన్ని గడుపుతూ నాటకరంగ కళాసేవలో తన జీవితానికి సార్ధకతను చేకూర్చుకుంటున్నారు.


నంది అవార్డు అందుకుంటూ.....

## కళామిత్ర అడివి శంకరరావు గురించి...

జననం : 1948 ఆగస్ట్ 7వ తేదీన కృష్ణాజిల్లా, విజయవాడలో.

విద్యాభ్యాసం : 1965లో ఎస్.ఎస్.ఎల్.సి., 1968లో ఐ.టి.ఐ.లో ఉత్తీర్ణత

నాటకరంగ విశేషాలు : చిన్నప్పటినుండీ నాటకాభిలాష, 1968 లో 'చేతివ్రాత బావుందని నాటకసమాజంలో ప్రదర్శించే నాటకం స్క్రిప్ట్‌ఫెయిర్ చెయ్యటంతో ప్రారంభం. రంగాలంకరణ, లైటింగ్,నటనల్లో శిక్షణ పొందుతూ, వయసుకి, సైజుకి తగ్గ హాస్యపాత్రల్ని పోషించి, ప్రేక్షకుల ప్రశంసల్ని, బహుమతుల్ని పొందారు. మేకప్‌లో గరువైన శ్రీ కె.ఎస్. శాస్త్రి గారి వద్ద శిక్షణ పొందుతూ మేకప్ మెళువలను గ్రహించి 'మంచి'మేకప్ ఆర్టిస్ట్‌గా, రాష్ట్రంలో ప్రఖ్యాతనొందారు. వందలాది సన్మాన పత్రాలు రచించి చిత్రించారు.



విజయవాడ ఆకాశవాణి కేంద్రంనుంచి శ్రవ్యనాటకాల్లో పాల్గొన్నారు.

విజయవాడ దూరదర్శన్ (సప్తగిరి) కేంద్రంలో మేకప్ ఆర్టిస్ట్‌గా కొనసాగుతున్నారు.

జర్నలిస్టుగా : నాటకరంగంలో నాటక పరిషత్‌లు, సమాజాలు, రచయితులు, దర్శకులు. నటీమణులు, నటులు, సాంకేతిక వర్గమైన మ్యూజిక్, కళాకారుల చిరునామాలు, ఫోన్ నెంబర్లు సేకరించి అడిగినవారికి అందజేయడం.

ఏ పరిషత్ ఏ తేదీలలో ఎప్పుడు ఎక్కడ నాటక ప్రదర్శన జరిగింది ఆపరిషత్ జడ్జీల వివరాలు, నాటికలు, బహుమతుల వివరాలు సేకరించి పత్రికలకి అందజేస్తున్నారు.

బహుమతులు, బిరుదులు : 1991వ సం॥లో కళామిత్ర బిరుదుతో సన్మానించబడ్డారు.



నాటక పరిషత్‌లో మేకప్ శాఖలో "ఉత్తమ ఆహార్యం"కు అనేక బహుమతులు అందుకున్నారు.

అసంఖ్యాకంగా సన్మానాలు అందుకొన్నారు.

2005 నంది నాటకోత్సవాలు తిరుపతిలో జరిగినప్పుడు "పరమాత్మావనస్థిత" సాంఘిక నాటకానికి 36 మందికి వైవిధ్యభరితంగా మేకప్ వేసి బెస్ట్‌మేకప్‌మేన్‌గా నంది అవార్డు అందుకున్నారు.

నాటకమే జీవితం– జీవితమే నాటకం అన్నట్లుగా నాటకమే శ్వాసగా జీవిస్తూ తన 42 సం॥ల నాటకరంగ కళాసేవలో 62 సం॥ల వయస్సులో కూడా నవయువకుడిగా సేవ చేస్తున్నారు.



పురాణపాత్రల రూపకల్పనలోనూ ప్రవేశం..



ఒకే ముఖంలో రెండు పార్శ్వాలు



# పేరులో నేముంది?!



- అమ్మిన శ్రీనివాసరాజు

మనిషిని, జంతువును వేరు చేసేది భాష. అంతటి గొప్ప భావ వ్యక్తీకరణ శక్తిగల మానవునికున్న మరో ప్రత్యేకత "పేరు" సాధారణంగా మానవులకు పేర్లు మొదట స్వభావాన్ని బట్టి ఏర్పాటు చేసినా ఆ పిదప కృతజ్ఞతకు. అభిమానాలకు చిహ్నాలుగా పేర్లు పెట్టుకోవడం సరిపాటి అయ్యింది. క్రమేణా అసలు పేర్లకు, మనుషులకు సంబంధం లేకుండాపోతుంది.

ఏది ఏమైనా పేరుకు మనిషికి సంబంధం లేకుండా వుండదు అదో అవినాభావ సంబంధం. నేటి సమాజంలో కొందరు పేరున్న ప్రముఖులు అసలు పేరు కన్నా కొసరు పేరుతోనే ప్రాచుర్యంలో వున్నారు. అసలు పేరుతో సంబోధిస్తే వారెవరు అనే ప్రమాదం వుంది.

అందుకే 'అరవైనాలుగు కళలు' అంతర్జాల మాసపత్రిక వీక్షక పాఠకుల కోసం ప్రతి మాసం కొందరు ప్రముఖుల అసలు పేర్లు పరిచయం చేయడమే ఈ ప్రయత్న నేపథ్యం...





| | | |
|---|---|---|
| చక్రవర్తి | కొమ్మినేని అప్పారావు | సంగీత దర్శకుడు |
| శోభన్‌బాబు | ఉప్పు శోభనాద్రీశ్వరరావు | సినీనటుడు |
| యం.యం. కీరవాణి | మరకతమణి కీరవాణి | సంగీత దర్శకుడు |
| చండీదాసు | సుబ్రహ్మణ్యేశ్వరరావు | నవలారచయిత |
| చెరబండరాజు | బద్దం భాస్కర్ రెడ్డి | కవి |
| సి.వి. సర్వేశ్వరశర్మ | చావలి వెంకట సర్వేశ్వరశర్మ | సైన్స్ రచయిత |
| కె. రామచంద్రమూర్తి | కొండభట్ల రామచంద్రమూర్తి | పత్రికా సంపాదకులు |





| | | |
|---|---|---|
| వి.వి.గిరి | వరహగిరి వెంకటగిరి | భారత మాజీరాష్ట్రపతి |
| కాళ్ల | కాళ్ల సత్యనారాయణ | చిత్రకారులు |
| మెకాలే | థామస్ బాబింగ్టన్ మెకాలే | ఆంగ్లేయ విద్యాధికారి |
| పైడిశ్రీ | పైడితేలేష్ బాబు | దళితకవి |
| రాధేయ | శేషభట్టర్ నరసింహాచార్యులు | కవి |
| సత్యశ్రీ | జానపరెడ్డి సత్యనారాయణ | కథకుడు |

| | | |
|---|---|---|
| జి. పుల్లారెడ్డి | గుణంపల్లి పుల్లారెడ్డి | మిఠాయి వర్తకుడు |
| అమితాబచ్చన్ | అమితాబ్‌రాయ్ సక్సేనా | హిందీ సినీ నటుడు |
| చక్రపాణి | ఆలూరి వెంకట సుబ్బారావు | సాహితీవేత్త |
| పి. చంద్రశేఖరఆజాద్ | పమిడిముక్కల చంద్రశేఖరఆజాద్ | కథకుడు, నవలారచయిత |
| జయప్రద | లలితారాణి | సినీనటి |
| డి.వి.నరసరాజు | దాట్ల వెంకటనర్సరాజు | సినీరచయిత |
| గజల్ శ్రీనివాస్ | కేశిరాజు శ్రీనివాస్ | గాయకుడు(గజల్స్) |








# పేరులో నేముంది?!







| | | |
|---|---|---|
| శంకరనారాయణ | తురిమెళ్ల శంకరనారాయణరావు | హాస్యరచయిత |
| పి.బి. శ్రీనివాస్ | ప్రతివాద భయంకరశ్రీనివాస్ | గాయకుడు |
| ప్రేమ్‌చంద్ | ధన్‌పత్‌రాయ్ శ్రీవాత్సవ | హిందీ రచయిత |
| త్యాగయ్య | కాకర్ల త్యాగ బ్రహ్మం | వాగ్గేయకారుడు |
| అజంతా | గూడూరి విశ్వనాధ శర్మ | కవి |
| కాళోజీ | రఘువీర్ నారాయణన్ లక్ష్మీకాంత్ శ్రీనివాసరావు-రాంరాజా కాళోజి | సాహితీవేత్త |

# 'కళ' తప్పిన శిల్పారామం!



- జి.ఎల్.ఎన్.మూర్తి

**చుట్టూ పచ్చదనంతో అందమైన పల్లెటూరు... ఒక చోట పొలం పనులు చేస్తున్న పల్లెజనం... మరో చోట హస్తకళల సొబగులు... ఎటు చూసినా అందమైన ప్రకృతి పులకింపజేస్తుంది. పల్లెలన్నీ పట్టణాల బాట పడుతున్నట్టుగా పల్లెసీమల ప్రకృతినంతా పుణికిపుచ్చుకున్న శిల్పారామాన్ని కూడా కాంక్రీట్ కల్చర్ కప్పేస్తోంది. పల్లె కాంతకు హైటెక్ సోకులద్దినట్టు సహజ సౌందర్యాన్ని కోల్పోతోంది. కళ తప్పిన శిల్పారామంపై ప్రత్యేక వ్యాసం...**

పల్లెసీమల పచ్చదనం.. పల్లెపడుచుల సోయగం.. సంప్రదాయం సౌందర్యం... సంస్కృతీ వైభవం... అన్నింటి మేళవింపుతో సృష్టింపబడింది శిల్పారామం. తరతరాల కళల కాసారంగా అందరి ఆదరణ పొందిన ఈ శిల్పారామంలో ప్రకృతి సహజమైన సోయగాలన్నీ కాంక్రీటుతో కలుషితమైపోతున్నాయి దేశంలో మరెక్కడా లేని ప్రత్యేకతతో అచ్చమైన పల్లెపట్టుల అనుభూతిని పంచుతున్న శిల్పారామం తప్పుదారి పడుతోంది. హైదరాబాద్‌కు ప్రపంచ దేశాల్లో ప్రత్యేకమైన గుర్తింపు తెచ్చిపెట్టిన అందచందాల కళాకృతులు, కళా పరిశ్రమలు వన్నె తగ్గి వెలవెలపోతున్నాయి. నెలకు 80 లక్షల పైచిలుకు ఆదాయంతో అన్ని కళలతో కళకళలాడాల్సిన శిల్పారామంలో చేతివాటం అధికారులు వచ్చి తమకు నచ్చినట్టుగా ఇష్టమొచ్చిన రీతిలో చక్కబెట్టుకున్నారు. 22 కోట్లు గల్లంతు అయ్యాయని గుర్తించిన తర్వాత సంబంధిత అధికారి రాజీనామాతో లెక్కల గుట్టు కాగితాల కట్టల్లో కలిసిపోయింది. పైసా పైసా కూడబెట్టి సకల కళాసంపదల నిలయంగా తీర్చిదిద్దిన అసలు పెద్దల్ని శిల్పారామం దాపుల్లోకి కూడా రానీయకుండా ప్రభుత్వ పెద్దలు చక్రబంధనం వేసేశారు. శిల్పారామంలో ఉండాల్సినవి, చేయాల్సిన పనుల గురించి తెలిపే లక్ష్య ప్రకటన ప్రతి కూడా లేకుండా ఇప్పటి నిర్వహణ సాగుతోంది. ప్రభుత్వంలో ఏ శాఖ వారికి ఎంత బాధ్యత ఉందో,అసలు జవాబుదారీ ఎవరిదో కూడా ఆలోచించనీయకుండా మొత్తంగా కొత్త రూపం తెచ్చేశారు. ముగ్ధమనోహరమైన పల్లె పిల్ల కాస్తా,

హైటెక్‌సోకులు, సింగారాల యువతిగా మారిపోయినట్టు అయిపోయింది. కాంక్రీటు కట్టడాల మధ్య అచ్చమైన మట్టితో అలికిన తడికెలు, కళ్లకు ఇంపైన ముగ్గులు, చేతివృత్తుల వారి కళాకృతుల వంటి వాటి మధ్య భారీ కాంక్రీటు కాంప్లెక్స్‌లు వెలుస్తున్నాయి. కృత్రిమమైన కళలు కోట్ల ఖర్చుతో కొత్తతరం సందర్శకులని ఆకర్షించడం కోసం సమాయత్తం అవుతున్నాయి.

## శిల్పాగ్రామం... శిల్పారామం





సకల కళల ఆరామం

# భూలోకంలో యమలోకం

- పద్మకళ

ఏం జరిగిందో ఏమోగానీ యమలోకంలో అకస్మాత్తుగా కలకలం రేగింది. యమధర్మరాజు కిడ్నాప్ చేయబడ్డాడు. విషయం తెలుసుకున్న చిత్రగుప్తుడు గుట్టుచప్పుడు చేయకుండా మూటాముల్లే సర్దుకుని ఉడాయించాడు. 'పాపులము మేము'... అంటూ నరలోకానికి తాజాగా చచ్చి వచ్చిన విజిటర్స్ పాడుకుంటుంటే, 'మేమే పాపం చేయలేదు. ఇదంతా చిత్రగుప్తుడు చిత్రమే' యముడి శిక్షనుండి తప్పించుకున్న పాపులు పారిపోయే ప్రయత్నాలు చెయ్యసాగారు. దొరికిందే సందని రాక్షసులు వారి ప్రతాపం చూపించటం మొదలెట్టారు. పాలన గతి తప్పింది. బ్రహ్మ లోకానికి ఫిర్యాదు వెళ్ళింది. యమలోకంలో *144*వ సెక్షన్ విధించారు. పాలనా సౌలభ్యం కోసం పనివిభజన చేశారు. దేవతలందరికీ అదనపు బాధ్యలు పడ్డాయి. *6* నెలల పాటు అత్యవసర పరిస్థితికి కావలసిన రంగం మొత్తం సిద్ధమయింది. అన్ని విధులకీ జనం కుదిరిపోయారు యమధర్మరాజు, చిత్రగుప్తులకి తప్ప. నా వల్ల కాదంటే నా వల్ల కాదంటూ అందరూ తప్పించుకున్నారు. చేసేదేమీ లేక చేతులెత్తి పరమేశ్వరుని ప్రార్థిస్తే గజాననుడికి ఆ బాధ్యతను అప్పగించాడు. ఎలాగూ చవితి పండక్కి జనాన్ని కలిసే పనుంది కనుక అందుకు బొజ్జ గణపయ్యా ఒప్పుకున్నాడు.



## తెలుగు దనానికి ప్రతీక

# కాకతీయ శిల్పం

**తెలుగునాట విభిన్న శైలుల శిల్పకళారీతులే వర్ధిల్లాయి. వాటిలో బౌద్ధశిల్పంగా నాగార్జున కొండ పాలరాతి శిల్పాలు ఖండాంతర ఖ్యాతిని పొందాయి. హంపి, విజయనగరం శిల్పాలు, లేపాక్షి కడ్యచిత్రాలు భారతీయ చిత్రకళా చరిత్రలో తగుస్థానాన్నే పొదాయి.**

- చలసాని ప్రసాదరావు



ఈ రెండు విభిన్న రీతుల కళకు మధ్యకాలంలో వికసించిన "కాకతీయ శిల్పకళ". దీనికి ముందుకాలపుదైన దైవ భౌద్ధ శిల్పరీతుల ప్రభావం కాకతీయ శిల్పంపై లేక పోవటం దీని ప్రత్యేకత. తరువాత కాలపుదైన విజయగర శిల్పంపై తన ప్రభావాన్ని వేయగలిగి ఉండటం మరో ప్రత్యేకత. విజయనగర శిల్పంలోని అలంకార రీతి పూర్తిగా కాకతీయ శిల్పరీతికి అనుకరణే అయిన కాకతీయ శిల్పానికి రావలసినంతగా గుర్తింపు రాలేదు. అందుకు కారణం ఈ కాకతీయ యుగపు శిల్పాలు ఒక్క వరంగల్, హనుమ కొండలను మినహాయిస్తే మిగతావన్నీ సుదూరంగా అటవీ ప్రాంతాలలో ఉండటమే!

సువిశాలమైన తెలుగు దేశాన్ని దాదాపు 323 సం॥ల పాటు అవిఘ్నంగా పాలించిన రాచవంశం బహుశా కాకతీయులదే. వారిలో రుద్రమదేవి పేరు తెలియని తెలుగువారుండరు. ఆమెకు ముందు 1198. నుండి 1262 వరకు పాలించిన గణపతి దేవుడు, ఆమె తర్వాత 1296 నుండి 1323 వరకూ పాలించిన ప్రతాపరుద్రదేవుడూ చరిత్ర ప్రసిద్ధులు. ఈ యుగారంభానికి ఆది పురుషుడు క్రీశ1000 నుండి 1030 వరకూ పాలించి తెలుగు వారందర్నీ ఏకపాలన క్రిందకి తేవాలనే లక్ష్యానికి శ్రీకారంచుట్టిన మొదటి బేతరాజు, ఆ లక్ష్యం గణపతి దేవుని కాలంలో పూర్తయి రుద్రమదేవి నాటికి స్థిరపడింది.

అందువలననే ఆ తరువాత ఆ పాలకులు ఎక్కువగా విజయ చిహ్నాల నిర్మాణం మీద కేంద్రీకరించారు. ఆనాడు ఎక్కడైన పదిమందికీ సమావేశ స్థలంగా దేవాలయం స్థిరపడి ఉన్నది. పైగా కాకతీయుల సేనాని జాయప అప్పటికే "నృత్య త్నారం" రచించి ఉన్నాడు. ఈ నాటికీ అదొక ప్రామాణిక గ్రంధంగా ఉందంటే అప్పటికే అక్కడ నృత్యం అపురూపంగా వికసించి ఉండాలి. ఆ రోజుల్లో నృత్యం అనేది పరమశివుడిని ఆనందింపజేయటానికేనని వారు అనుకునేవారు. తాండవశివుడే నృత్యానికి కాకతీయులంతా శైవతావలంబులు. కనుక వారు భారీ ఎత్తున శివాలయాలు నిర్మాణం కొనసాగించారు. ఈ ఆలయాల స్థంభాలు, ద్వారాలు, గర్భగృహాలు, చివరికి పై కప్పుసైతం ఆశ్చర్య గొలిపే అపురూప కళానైపుణ్యంతో శిల్ప మయంగా తీర్చిదిద్దారు. వాటిలో శివలీలలూ, భాగవత గాధలూ, అనేక రకాల నృత్యభంగిమలూ లయాత్మకంగా ప్రాణం పోసుకున్నాయి.

కాకతీయ శిల్పులు ప్రధానంగా తమ కళాసృష్టిలో రెండు రకాల రాళ్లు ఉపయోగించారు. ఇవి స్థానికంగా విరివిగా లభ్యమయినవే. ఎర్రరాయి మీద చెక్కటం సులభం. కానీ, రాయి కాస్త గరుకుగా ఉంటుంది కనుక చిన్న చిన్న వివరాలను స్పష్టంగా చూపటం కష్టతరం. అందువలన ఈ ఎర్రరాయిపై చెక్కిన శిల్పాలను బయటి గోడలకు అలంకారంగానే ఉపయోగించారు. నల్లరాయి అలాకాక కఠినమైనది. నున్నగా నునుపుచేయటానికి అనువైనది. ఈ రాయిపైనే కాకతీయ శిల్పుల కళానైపుణ్యం అంతా వెన్నెలలా ప్రవహించి అపురూప శిల్పాలకు ప్రాణంపోసింది.

కాకతీయు కాలంలో నిర్మించిన దేవాలయాలు ఎక్కుగా వరంగల్, కరీంనగర్, నల్లగొండ, గుంటూరు జిల్లాలోనూ, అరుదుగా అటు కర్నూలు నుండి ఇటు గోదావరి జిల్లాల వరకూ అన్ని చోట్లా ఉన్నాయి. అయినా శిల్పంలో పరిపూర్ణతకు వరంగల్, కరీంనగర్, నల్లగొండప్రాంతాల ఆలయాలే ప్రసిద్ధి. వీటి తర్వాత కర్నూల్ జిల్లాలోని త్రిపురాంతకం ఆలయం ఖ్యాతినొందింది.

**రామప్పగుడి**





64 కళలు.కామ్
www.64kalalu.com
సకల కళల సమాహారం
సంపుటి :1 సంచిక :12 అక్టోబర్ 2011



## శుభాకాంక్షలు...

పాఠకులకు,

కళాకారులకు

విజయదశమి శుభాకాంక్షలతో....

పత్రిక ప్రారంభించి సంవత్సరం పూర్తయినది. నవంబరు నెల నుండి కొత్త శీర్షికలు ప్రారంభించనున్నాం. ఎప్పటి లానే మీ ఆదరణ కోరుకుంటూ...

పత్రికలో వ్యాసాలు బాగున్నాయని అభిమానంతో ఇ-మెయిల్స్ ద్వారా అభిప్రాయాలు తెలియజేస్తున్న పాఠక, కళాభిమానులకు కృతజ్ఞతాభి వందనాలతో...

కళాసాగర్

ఎడిటర్

ముఖచిత్రం చిత్రకారుడు : కొండపల్లి శేషగిరిరావు



- వెంటపల్లి సత్యనారాయణ

# చిత్రకళా "హిమగిరి"- ఈ కొండపల్లి "శేషగిరి"



*దాదాపు ఇరవయ్యేళ్ళ క్రితమనుకుంటా!, సాధారణంగా ప్రభుత్వ పథకాల అభివృద్ధికి సంబంధించిన ఫొటోలను, చిత్రాలను ముఖపత్రాలుగా ప్రచురించే రాష్ట్రప్రభుత్వ అధికారిక మాసపత్రిక "ఆంధ్రప్రదేశ్" మూడవ అట్టపై ఒక గొప్ప కళాకారుని కుంచెనుండి జాలువారిన గొప్ప చిత్రాన్ని ప్రచురించారు. ప్రకృతిలోని సమస్త సౌందర్యాన్ని రంగరించి ఒక్కచోట ప్రతిష్ఠించడంతో పాటు కేవలం జీవులకు మాత్రమే సొంతమైన వివిధ అనుభూతులను అందులో చిత్రించిన అన్ని రూపాలకు ఆపాదించినట్లున్న ఆ చిత్రం ఒక్కసారిగా నన్ను ఆశ్చర్యచకితున్ని చేసింది.*

ఒకపెద్ద దట్టమైన అరణ్యం. ఆ అరణ్యం ప్రాచీనతకు, ప్రాశస్త్యానికి చిహ్నాలుగా పెరిగిన మహావృక్షాలతో పాటు చిన్న, పెద్ద కలిపి వివిధ రకాల మొక్కలు, చెట్లలో అలరారుతున్న పచ్చని ప్రకృతి, మధ్య, మధ్యలో అక్కడక్కడా శిలలుగా మారిన భూస్వరూపాలు మహావృక్షాల వయస్సు, సౌంధర్యాలను ప్రతిబింబించే విధంగా వాటి కాండాలు, మరియు వేర్లభాగాలలో అణువణువునా రంగరించిన లయాత్మకతతో పాటు చిత్రం వెనుక భాగంలో ఎక్కడో దూరంగా కొండలలో ప్రారంభమై నెమ్మదిగా ప్రవహించుకుంటూ ముందుకు వస్తున్న నది, నది వెంబడి అక్కడక్కడా కనిపిస్తున్న చిన్న, పెద్ద ఆశ్రమాలు, కాషాయ వస్త్రదారులై నదీతీరానికి చేరిన వివిధ వయో బేధాలున్న కొందరు మునిపురుషులు, స్త్రీల మధ్య దవళ వస్త్రదారియై దీనంగా నిలబడి ఒక ప్రత్యేకంగా కనిపిస్తున్న ఒక యవ్వన వయస్కురాలైన స్త్రీ, ప్రక్కన ఓదారుస్తున్నట్లున్న ఓ వృద్ధమహర్షి, జాగ్రత్తలు చెబుతున్న మరో వృద్ధ మహిళ, కంటతడి పెడుతున్న చెలికత్తెలు వెనుక భాగంలో మమ్మల్ని వీడి వెళ్ళొద్దు అన్నట్లు కథానాయకి పైటచెంగు పట్టుకుని లాగుతున్న ఓ జింకపిల్ల, చుట్టూ చేరి దీనంగా చూస్తున్న మరో కొన్ని వనజీవులు, తమ నెచ్చెలిని మరలా చూడలేమేమో అని ఆతృతతో ఎక్కడినుండో వేగంగా ఆ ప్రదేశానికి

దూసుకువస్తున్న రామచిలుకలు, ఇలా సమస్త ప్రకృతి విచారవదనంతో ఉన్నట్లున్న ఆదృశ్యం "శకుంతలను అత్తవారింటికి పంపుట" అనేచిత్రం. ప్రఖ్యాత చిత్రకారులు డాక్టర్ కొండపల్లి శేషగిరి రావుగారి కుంచెనుండి జాలువారిన అనేక చిత్రాల్లో ఒక గొప్ప కళాఖండం అది.

భారతీయ సాహిత్యంలో అజరామమైన నాటకం కాళిదాసు విరచితమైన అభిజ్ఞాన శాకుంతలమైతే ఆ శాకుంతలానికి తనకుంచె విన్యాసాలతో చిత్రరూపాల్ని కల్పించి మరింత శోభాయమానం చేసిన మహా చిత్రకారుడు డా॥కొండపల్లి శేషగిరిరావు.

అచిరకాలములోనే అపారమైన కళాసంపదను ఆంధ్రదేశానికి అందించి అనంత లోకాలకు ఏగిపోయిన స్వర్గీయ దామెర్ల రామారావు యూరోపియన్ గురువులవద్ద యూరోపియన్ శైలిలోనే చిత్రకళను అభ్యసించినప్పటికీ ఆ చిత్రకళా అనుభవానికి ఆంధ్రత్వాన్ని జోడించి అద్భుతంగా "మనచిత్రాలు" అని గర్వంగా చెప్పుకునే కళాప్రపంచాన్ని సృష్టించిన మొదటివ్యక్తి స్వర్గీయ దామెర్ల రామారావు అయితే ఆ తర్వాత చిత్రకళలో తెలుగుతనాన్ని మరింతగా మూర్తీభవింపజేసిన మరో గొప్ప చిత్రకారుడు శ్రీ శేషగిరిరావు.




ఆయన చిత్రాల్లో ముఖ్యంగా ప్రకృతికి ప్రథమ భాగాన్ని కేటాయిస్తే చిత్రాల్లో గల మూర్తుల రూపాల్లో ఖచ్చితమైన అనాటమీ, గీతల్లో, రూపంలో అడుగడుగునా అంతటా గొప్ప లయ, లావణ్యాలు ఒలికిస్తూ ఇదే మన తెలుగుబొమ్మ అని గర్వంగా చెప్పుకొనేంతటి గొప్ప సృజనాత్మకశైలిని మనకందించిన మహాచిత్రకారుడు డాక్టర్ కొండపల్లి శేషగిరిరావు. వీరు సృజించిన గోదాదేవి, వరూధినీ ప్రవరాఖ్య, అహల్యాశాపవిమోచనం, కలవకొలను లచ్చి, హరిహర బుక్కరాయలు, దమయంతి, అభినవగుప్తుడు ఇంకా శకుంతలపై వేసిన చిత్రాలన్నీ చూసినట్లయితే ప్రకృతికి వీరు ఎంత ప్రాముఖ్యతనిచ్చారో మనకు తెలుస్తుంది.

ఆయన దృష్టిలో కళ అనేది గొప్పయోగం. యోగానికి ఏకాగ్రత ఎంత అవసరమో, కళాసాధనకు కూడా అంతే అవసరం. అలా ఏకాగ్రతతో సాధన చేసిన కళాకారునికి ఆత్మశాంతి చేకూరుతుంది. అటువంటి శాంతిని, ఆనందాన్ని నేను అనుభవించానని చెప్పుకుంటారాయన. అంత ఏకాగ్రత, తపస్సుతో చేసినివి కాబట్టే ఆయన చిత్రాలు ముఖ్యంగా శాకుంతలంపై వేసినవి అంత అద్భుతంగా వుంటాయి. తెలంగాణా ప్రాంతంలోని బండరాళ్లు, ఎండుచెట్లు, వయోవృక్షాలు శేషగిరిరావుగారి కుంచె ద్వారా దైవత్వాన్ని నింపుకున్నాయి.

ఒక చిత్రానికి ప్రాముఖ్యత అనేది ఆ చిత్రకారునికి ఒక ఆలోచన జనించిన పిదప దానికి ఏమేరకు స్పందించాడో, ఎంత బాగా ఆలోచించాడో, ఏ మేరకు ఆ చిత్రరచనకు కృషి చేసాడో ఆ మేరకు మాత్రమే ఆ చిత్రం ప్రామాణికతను సంతరించుకుంటుంది. చిత్రకారునిగా తనకున్న పేరుని వినియోగించుకుని కేవలం ఆర్థిక ప్రయోజనమే పరమావదిగా ఆయన పనిచేయలేదు. చిత్రకళను ఒక యోగంగా భావించిన వ్యక్తి గనుక ఒక చిత్రాన్ని వేసేముందు దాని కోసం ఎంతో పరిశోదన, పరిశీలన, పరిశ్రమ ఆయన చేసేవారు. ఉదా॥కు 1975లో రాష్ట్రప్రభుత్వం మొదటి ప్రపపంచ తెలుగు మహాసభలు నిర్వహించే సమయంలో "తెలుగుతల్లి" చిత్రానికి రూపమివ్వాల్సిందిగా ఆయనను కోరినపుడు అంత చేయితిరిగిన చిత్రకారుడైనప్పటికీ ఆ చిత్రం గీయడానికి ముందుగా ఆయన తయారు చేసుకున్న నోట్సు చూసినట్లయితే ఔరా! అనిపిస్తుంది.

ఒక జాతికి ప్రతిరూపమైన తల్లిని రూపొందించేటప్పుడు ఆ తల్లి యొక్క రూపం మనం నిత్యం చూసే సాధారణ రూపాలకు, విగ్రహాలకు మాదిరిగా ఉండకూడదు. ఆ రూపం ఖచ్చితంగా




అంటా రాయన. సోకాల్డ్ మోడ్రన్ ఆర్ట్ ఎక్కువకాలం నిలవదని, ఒకవేళ నిలిచినా దాని రూపం మారిపోతుందని ఆయన చెప్తారు.

అలాగే చిత్రాల్లో వెలుగు నీడల గురించి ప్రశ్నించినపుడు పాశ్చాత్యుల చిత్రాల్లో చూపే వెలుగు నీడలు శాశ్వతంగావని, అవి తరచూ మారుతూ వుంటాయి కాబట్టి వాటిని నేను అంతగా వాడనని ఆయన చెప్తారు. నందలాల్ బోస్, అవనీంద్రనాధ్ ఠాగూర్‌లు భారతీయ చిత్ర కళను ముఖ్యంగా వాష్ పెయింటింగ్‌ను మోడరనైజ్ చేసారు అది నాకు నచ్చిందని ఆయనంటారు.

ఇతర వాటికి భిన్నమైనదై, ఒక ప్రత్యేకతను సంతరించుకున్నదై వుండాలి. అంతేకాదు చారిత్రక నేపధ్యానికి సంబంధించిన రూపాలు దానిలో ప్రవేశపెట్టాలి. భౌగోళిక స్వరూప ప్రత్యేకతలు కూడా ఆ చిత్రం వ్యక్తపరిచేలా వుండాలి. జాతిపరమైన చిహ్నాలను, లక్షణాలను దానిలో ప్రతిఫలింపజేయాలి. అప్పుడే ఆ చిత్రం మిగతావాటికి భిన్నంగా ఆ జాతి చరిత్ర సంస్కృతులను వ్యక్తపరుస్తూ ఒక ప్రత్యేకతను కలిగి వుంటుంది. కొండపల్లి శేషగిరిరావు చేతిలో రూపుదిద్దుకున్న తెలుగుతల్లి చూసినపుడు పైన పేర్కొన్న ప్రత్యేకతలన్నీ మనం గమనించగలం.

రూపంలోనూ, వేషంలోనూ, నడత, నడవడిక అన్నింటా శుద్ధ శాస్త్రీయతను, సాంప్రదాయాన్ని కలబోసుకున్న శ్రీ శేషగిరిరావు కేవలం సాంప్రదాయ శైలిలోనే గాక ఆధునిక శైలిలో కూడా ఎన్నో చిత్రాలు వేసారు. క్షామ, డెడ్కా, విశ్రాంతి, సంతాపం మొదలయిన చిత్రాలను ఆధునిర శైలిలో వేయడమే గాక రాష్ట్రజాతీయ స్థాయిల్లో వాటికి ఎన్నో బహుమతులు సొంతం చేసుకున్నారు. కానీ మోడ్రన్‌ఆర్ట్ అని దేనినను కుంటున్నారో దానిపై ఆయనకు అంతగా సుముఖత లేదు. చిత్రకారుడు ముందుగా ప్రకృతిలో తాను చూసింది చూసినట్లుగా వేయగలగాలి. ఆబ్జెక్టివ్ డ్రాయింగ్ సరిగా వేయ లేనివారు మోడ్రన్ ఆర్టిస్ట్ అయిపోతే ఎలా? అంటూ ఆయన ప్రశ్నిస్తాడు. రియలిజానికి కొంత ఎమోషన్ కలిపి కాళిదాసు కవితలా రస రమ్యంగా చిత్రించాలి

ఇక చిత్రకారుని సామర్థ్యానికి ప్రతీకగా భావించే రూపచిత్రణలో కూడా ఆయన సిద్ధహస్తుడే. ఆయన వేసిన రూపచిత్రాల్లోని మూర్తుల ముఖాలలో వారి వైశిష్ట్యానికి సంబంధించిన ప్రతిభా పాటవాలు, ధీరత్వం, హుందాతనం, మేధస్సులు ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. ఆయన చిత్రించిన నన్నయ్య, పోతన చిత్రాలు చూసినపుడు నిజంగా వాళ్లు ఇలాగే వుండి వుంటారని అనిపిస్తుంది. అలాగే నెహ్రూ, ఇందిర, ప్రకాశం పంతులు, రాజీవ్ తదితర కాంగ్రెస్ నాయకులతో పాటు అనేక ఇతర వ్యక్తుల రూపచిత్రాలను కూడా ఆయన ఎన్నో వేసారు. వ్యక్తుల రూపచిత్రాలు వేసేటప్పుడు వారి వ్యక్తిత్వానికి సంబంధించిన అంశాలను పరిగణలోనికి తీసుకుని దానికి చిత్రకారుడు తనయొక్క అనుభవాన్ని జోడించి రూపచిత్రాల్లో ఆయా భావాలను ప్రస్ఫుటింపజేయాలని చెప్తారు.

శ్రీమతి రామచూడమ్మ, గోపాలరావు దంపతులకు 27-1-1924న వరంగల్ జిల్లా పెనుగొండలో శేషగిరిరావు గారు జన్మించారు. 8 ఏళ్ళవయస్సులోనే కుటుంబం మానుకోటకు (నేటివరంగల్ జిల్లాలోని మహబూబాబాద్) తరలి రావడంతో ఆయన విద్యాభ్యాసం మానుకోట, హనుమకొండలలో సాగింది. అప్పటి డ్రాయింగ్ టీచర్ మజహరుద్దీన్ శిష్యరికంలో చిత్రకళలో మెళకువలు నేర్చుకుని డ్రాయింగ్‌లో లోయర్, హైయ్యర్ పరీక్షలు ఉత్తీర్ణులయ్యారు.

ఆ తర్వాత దీన్‌దళ్‌నాయుడు అనే మరో డ్రాయింగ్‌టీచర్ ఆయనపై బాగా ప్రభావం చూపారు. చరిత్ర ప్రసిద్ధినొందిన వరంగల్, హనుమకొండలలోని చారిత్రక నిర్మాణాలు కూడా ఆయనలోని చిత్రకారున్ని తట్టిలేపాయి. 1942లో అప్పటి నిజాం ప్రభుత్వ ఆర్థికమంత్రిగా ఉన్న "మొహదీ నవాబ్‌జంగ్" గారి సహాయ, సహకారాలతో ఐదేళ్ళ ఫైనార్ట్స్ కోర్స్ పూర్తి చేయడమే గాక శాంతినికేతన్ వెళ్లి నందలాల్‌బోస్ గారివద్ద చిత్రకళాభ్యాసం చేయాలనుకున్న తన కోరిక కూడా సాకారం చేసుకున్నారు.

భారతీయచిత్రకళపై యూరోపియన్ చిత్రకళ ఆదిపత్యం చేసే ఆ రోజుల్లో అవనీంద్రనాద్‌ఠాగూర్, నందలాల్‌బోస్, జామినీరాయ్‌లు తమదైన శైలిలో భారతీయ చిత్రకళను కాపాడారని చెప్పవచ్చును. ఇంతటి గొప్ప వారిలో ఒకరైన నందలాల్‌బోస్ గారి శిష్యరికంలో ఆ శాంతినికేతన్ వాతావరణంలో శేషగిరిరావుగారి చిత్రకళ క్రొత్తపుంతలు తొక్కింది. అదే సమయంలో శాంతినికేతన్‌లో ఒక చైనా చిత్రకారిణి యొక్క చిత్రకళా ప్రదర్శనను చూసి ముగ్ధుడై అక్కడగల చైనా చిత్రకళా విజ్ఞాన సర్వస్వాలు ఎక్కువగా చూడడంతో వాటి ప్రభావం ఆయనపై బాగా పడింది. ఆ తర్వాత చైనా, పశ్చిమదేశాల శైలులను రంగరించి తనదైన ఒక కొత్త శైలిని రూపొందించుకొని విరివిగా చిత్రాలు వేయడం మొదలుపెట్టారు.

నిరంతరం కళలో కొత్త విషయాలు నేర్చుకోవాలనే తపనకు గురువు నందలాల్‌బోస్ సూచనలు తోడవ్వడంతో అక్కడ ఇచ్చే శెలవుదినాలు సైతం సాధారణ విషయాలలో కాలక్షేపం చేయకుండా ఒరిస్సా రాష్ట్రం భువనేశ్వర్‌లో ప్రసిద్ధిగాంచిన కోణార్క్ సూర్యదేవాలయ శిల్పసౌందర్యాన్ని తన స్కెచ్‌బుక్‌లో చిత్రించారు. అలాగే రాజస్థాన్ ఒనస్థలి విద్యాపీఠ్ వారు నిర్వహించిన ఫ్రెస్కో పెయింటింగ్ వర్క్‌షాప్‌లో పాల్గొని ఆ మెళకువలను నేర్చుకుని దానికి తన ఊహాశక్తిని జోడించి అక్కడ వేసిన ఫ్రెస్కో చిత్రాలు ప్రఖ్యాత చిత్రకారులు యస్.ఎన్.బెంద్రే, ఇంద్రదేవకీనందన్‌శర్మల ప్రశంసలందుకున్నాయి. భారతదేశ సంస్కృతిని తెలియజేసే విధంగా హైదరాబాద్ భారతీయ విద్యాభవన్ గోడలపై 35 అడుగల పొడవు 10 అడుగుల వెడల్పులో ఆయన వేసిన కుడ్యచిత్రాన్ని పరిశీలించినచో కుడ్య చిత్రరచనలో ఆయన ఎంతటి ఘణాపాటో తెలుస్తుంది.

ఇక చిత్రకళలో ఆయన పొందిన బహుమానాల గురించి రాయాలంటే మరో పెద్ద వ్యాసమవుతుంది. 1949లో హైదరాబాద్ ఆర్ట్ సొసైటీ అఖిలభారతస్థాయిలో నిర్వహించిన పోటీల్లో మూడు విభాగాల్లో మూడు ప్రథమ బహుమతులు ఆయనకు దక్కాయి. ఈ చిత్రాలను చూసిన అప్పటి మంత్రి దొండెరాజ్ బహదూర్ స్కూల్ ఆఫ్ ఆర్ట్స్ & క్రాఫ్ట్స్‌లో ఉద్యోగం వచ్చేలా చేసారు. ఇక వృత్తి, ప్రవృత్తి ఒకటైన శేషగిరిరావు గారి కళావ్యాసంగం మరింత ద్విగుణీకృతం కావడానికి ఆస్కారమేర్పడింది. వాష్ టెక్నిక్‌లో నేడు మంచి ప్రామాణిక



మేనక–విశ్వామిత్ర

చిత్రాలు వేస్తున్న మంచెం సుబ్రహ్మణ్యేశ్వరరావును తీర్చిదిద్దిన ఘణత చిత్రకారుడు "ఉల్చి" దయితో అలాంటి చిత్రకారుడు స్వర్గీయ ఉల్చిని తయారుచేసిన గురువు డాక్టర్ కొండపల్లి శేషగిరిరావుగారు. 1984లో ఆయన పదవీవిరమణ చేసే వరకూ ఆయన ఎందరో ప్రతిభావంతులైన చిత్రకారులను ఆయన తయారుచేయడం జరిగింది. తన చిత్రకళా చరిత్రలో మన ప్రథమ రాష్ట్రపతి డా॥బాబూరాజేంద్రప్రసాద్, నెహ్రూ, ఇందిర, పి.వి. నరసింహారావు వంటి జాతీయ నాయకులతో పాటు ఎందరో ప్రశంశలను ఆయన

అందుకోవడం జరిగింది.

కేవలం చిత్రకారునిగానే గాక చిత్రకళాపరిణామంపై కూడా ఆయన ఎన్నో రేడియో ప్రసంగాలు, రచనలు చేసారు. తెలంగాణాలోని జానపదకళ అయిన "కాకిపడగలు"ను వెలుగులోకి తెచ్చిన ఘణత ఈయనదే.

దాదాపు 20 యేళ్లుగా ఆ మహా చిత్రకారున్ని కలుసుకోవాలన్న నా అభిలాష ఇటీవల నా మిత్రులు మంచెం సుబ్రహ్మణ్యేశ్వరరావు గారి ద్వారా నెరవేరింది. గత జూన్ 4,5,6 తేదీలలో బాపుగారి ఒరిజనల్ చిత్రాల ప్రదర్శన హైదరాబాద్ చిత్రమయి స్టేట్ఆర్ట్గేలరీలో జరుగుతుందని చూసేందుకు నీవు తప్పక రావాలని ప్రముఖ కార్టూనిస్ట్, కేరికేచరిస్ట్ శంకర్ (సాక్షి) ఫోన్చేయడంతో చర్లనుండి నా మిత్రుడు బీరశ్రీనివాస్తో కలిసి మేము హైదరాబాద్ వెళ్లడం ఉదయం శంకర్గార్ని కలిసిన పిదప మేము స్టేట్ ఆర్ట్గేలరీకి వెళ్లాము. అక్కడ యాధృశ్చికంగా మిత్రులు శ్రీమంచెంగారు, రాజారాంబాబు, అన్వేష్లు కలవడం మహదానమైంది. ఆ మధ్యాహ్నం మంచెంగారింట్లో మాకు ఆత్మీయ ఆతిథ్యం అయిన పిదప కొండపల్లి శేషగిరిరావు గారిని కలవాలన్న ఆలోచన రావడంతో నేను శేషగిరిరావు గారి కోడలు ప్రముఖ రచయిత్రి శేషగిరిరావుగారి జీవిత చరిత్రను ఎంతో హృద్యంగా రాయడమేగాక, ఆయన రచనలను కూడా ఆమె భర్త శ్రీ వేణుగోపాలరావుగారి సహకారంతో చిత్ర, శిల్పకళా రామణీయకం పేరుతో ప్రచురించిన శ్రీమతి కొండపల్లి నీహారిణి గారికి ఫోన్చేసిన


శేషగిరిరావు గారితో రచయిత



వెంటనే ఆమె ఎంతో సాదరంగా ఆహ్వానించడమే గాక ఎంతో ఓపికగా చిత్రాలన్ని చూపించారు. 20 ఏళ్ళుగా ఎదురుచూస్తున్న ఆ మహాచిత్రారుడ్ని 88 ఏళ్ళవయస్సులో చూసినపుడు మాకు గొప్ప అనుభూతికలిగింది. దాదాపు 4గంటల పాటు ఆయనతో మేము పంచుకున్న సమయం ఒక మధురమైన జ్ఞాపకం. మేడపై గదిలో ఉన్న ఆయన ఒరిజనల్ చిత్రాలను ఒక్కొక్కటి చూస్తుంటే ఆ రంగుల విన్యాసాలకు ఆ గీతల్లో ఒలికించిన హొయలుకు మేము ఎంత సంబరపడిపోయామో, మా వెంటే పైకెక్కి మాతో పాటు చిత్రాలను చూసుకున్న ఆయన కూడా అంతే ఆనందపడిపోయారు. వయసు మీరి జ్ఞాపకశక్తి తగ్గడంతో ఆయన ఎన్నిసార్లడిగారో మమ్మల్ని. ఎక్కడి నుండి వచ్చారని. నాకు ఆటోగ్రాఫ్ ఇస్తూ దానిలో ఆయన వేసిన రేఖాచిత్రం నాకు ఒక గొప్ప బహుమానమయ్యింది. శ్రీమతి నిహారిణిగారు తన మామగారు సృజించిన ఆ గొప్ప కళాసంపద రక్షణ కోసం పడే తపనతో పాటు ఏదో కొంచెం వేదన కూడా కనిపించింది. జాతికి గర్వకారణమైన ఆ కళాసంపదనను ముందు తరాలకు అందించాలి అంటే ప్రభుత్వం కూడా భాధ్యత తీసుకోవల్సిన అవసరం ఉందని మాకనిపించింది.

హిమశిఖరంలా ఎత్తుగా కనిపిస్తున్న ఆ కళాచక్రవర్తి ముందు మరుగుజ్జులుగా మారిన మాకు తక్షణం కనీసస్థాయికి ఎదగాలని అనిపించి వెంటనే బయలుదేరాం శెలవు తీసుకుని అక్కడినుండి ఆ సాయంత్రం ఆరున్నర గంటలకు...

# మైమ్



– కనకాల దేవదాస్

మైమ్ అంటే తెలుగులో మూకాభినయమని అంటారు. చతుర్విధాభినయాలలో "వాచికాభినాయాన్ని" తప్పించగా మిగిలిన మూడు అభినయప్రక్రియల సముదాయమే మూకాభినయం. ఆది నుంచి మానవుడు ఈ మూకాభి నయంలోని విశిష్టతను, ప్రత్యేకతను గుర్తించి ఉపయోగించుకున్నాడు. మానవుడు అనుకరణశీలి, తాను శైశవ దశ నుండీ తనను, తన చుట్టూ ఉండే మనుషులను, పరిసరాలను పరిశీలిస్తూ నడక, మాట, పాట నేర్చుకుంటాడు. తన భావాల్ని వ్యక్తం చేయడంలో తన అబ్జర్వేషన్‌ని బట్టి మాటలద్వారా, చేతుల కదలికల ద్వారా, ముఖంలోని భావాలద్వారా ప్రస్ఫుటంగా తెలియబరుస్తాడు.

ఈ మూకాభినయం ఒక విశిష్టమైన కళకాగా అతి ప్రాచనమైనది కూడా, ప్రపంచమంతటా అన్ని దేశాలలోను దీన్ని ఒక ప్రశస్తమైన కళగా గుర్తించారు. క్రీ.పూ. 3000సం॥ క్రిందట చైనాదేశంలో "మెంగ్" అనే ప్రసిద్ధ మూకాభినయ కళాకారుడు ఉండేవాడు. అతని నటనాకౌశలానికి ముగ్ధుడై అప్పటిరాజు అతడ్ని తన ఆస్థానంలో నియమించాట్ట. కళాకారుడు రాజకీయాలతో అప్పటికే పరిచయమయ్యాడని అనడానికి ఇదొక నిదర్శనంగా లేదూ? కేవలం చైనాలోనే కాదు. మరోచోట రోమ్ సామ్రాజ్యంలో నటులకు ఎంత విశిష్టమైన స్థానం కల్పించారంటే అలనాడు సామ్రాజ్యాలను ఏలిన చక్రవర్తులను శిలాప్రతిమతో బాటుగా ప్రసిద్ధిచెందిన కొంతమంది కళాకారుల ప్రతిమలు కూడా ప్రతిష్ఠించారట. దాన్ని బట్టి కళాకరుడెప్పుడూ అటు ఏలినవారికి ఇటు ప్రజలకు ప్రీతిపాత్రుడని అర్థమవుతోంది.

ఈ మూకాభినయం విదేశాలలో కాక మన భారతీయ సాంప్రదాయ నృత్యాలన్నిటిలోను చాలా విస్తృతంగా ఇమడ్చబడి వుంది. ముఖ్యంగా ఈ కళ కేరళ ప్రాంతానికి చెందిన "కథాకేళి" నాట్య సంప్రదాయములో విరివిగా కనబడుతుంది. తెలుగుదేశంలోని కూచిపూడి నృత్యములో కూడా ఇది మనం చూసే వున్నాం. ఉదా॥భామాకలాపం, దశావతారాలు, మువ్వగోపాల తరంగం మొదలయినది. మూకాభినయంతో కృష్ణుడు వెన్న దొంగిలించుట, సత్యాకృష్ణుల ప్రణయ ప్రళయ సన్నివేశాలను ప్రదర్శించుట గమనిస్తున్నాం. ప్రాచీన గ్రీకు నాట్యకళారూపాల్లో కూడా ఈ మూకాభినయం ద్వారానే భావాన్ని వ్యక్తంచేసేవారు 'Warriordances'లో సైనికులు యుద్ధం చేస్తున్నట్టుగా మూకాభినయంతో నటించేవారు. 'Pythic dance' (Ritual dances)లో కూడా కళను ఉపయోగించేవారు. ఆనాటి నాటక ప్రదర్శనలు వృత్తరంగస్థలాల్లో (ఎరీనా థియేటర్స్‌లో) జరిగేవి. వేలాదిసంఖ్యలో చూసే ప్రేక్షకులకు అర్థమయ్యే విధంగా సంభాషణలతో బాటుగా అంగికాభినయాన్ని బాహాటంగా విస్తృతీకరించి భావప్రకటన చేసేవారు.

ఈ భావప్రేషక ప్రక్రియలలో కళాత్మకంగా వ్యక్తీకరించడానికి అనేక విధాలుగా సాధనాలు అభివృద్ధి చెందాయి. మూకీచిత్రాలు విస్తృతంగా వెలువడ్డాయి. వాటికి మూకాభినయ కళే ఆధారం. నటులు మాట్లాడే వీలులేదు కనుక వారి ప్రవర్తనల ద్వారా, కదలికల ద్వారా, ఉద్వేగ స్పందనలను అభినయించవలసి వచ్చేది. దాంతో తప్పనిసరిగా మూకాభనియం అభినయ కళాక్షేత్రంలో లోతుగా నాటుకుంది. ఈ

చిత్రాలలో అత్యద్భుతంగా నటించి అప్పటికీ ఇప్పటికీ ప్రజల అభిమానాన్ని చూరగొన్న మహానటుడు "చార్లీ చాప్లిన్", "బస్టర్ కీటన్" ఇంకా ఎందరెందరో మహానుభావులు, ఉద్దండులైన నటులు ప్రేక్షకులను రంజింపజేసేవారు.

ఈ నాడు మూకాభినయ కళలో ప్రవీణులైన అనేకమంది కళాకారులున్నారు. ఫ్రెంచి దేశస్థుడు ''మార్సెల్ మార్సొ'' చెకొస్లొవేకియాలోని "లాడిస్లేట్ సియాల్కి" ప్రసిద్ధులు. వారు వారి వారి మూకరూపక బృందాలను నిర్వహిస్తున్నారు. జర్మన్ దేశస్థుడు ''మిలన్‌స్లేడక్''కూడా ఈ విషయంలో చెప్పుకోదగ్గవాడు ఇంగ్లండ్ దేశస్థుడు "లిండ్జెకెంప్" మరొక ప్రవీణుడు.



ఈ కళను నేర్చుకోడానికి ఎంతో పరిశీలన అవసరం. ప్రతి విషయాన్ని , వస్తువునూ అనేక కోణాలనుండి పరిశీలించి దృష్టిలో పెట్టుకోవాలి. వివిధ రీతులలో ప్రవర్తించే వ్యక్తులు, వారి నడక రీతులు, స్వభావాలు సునిశితంగా పరిశీలించాలి. ఇవే కాక చుట్టూవున్న పరిసరాలు ప్రకృతిలో గోచరించే అనేక ఆకృతులు గమనించాలి. చెట్టు గుబురులు, కొండలు, కొండరాళ్ళు మొ॥. ఇవేకాక సముద్రపు అలలు కదిలే రీతులు, పక్షులు ఎగిరే పద్ధతులను కూడా గమనించాలి, మూకాభినయంలో వీటన్నిటినీ తిరిగి ప్రదర్శించకలిగి ఉండేందుకు.

చిత్రకారునికి కుంచె, కాన్వాసు, సంగీత విద్వాంసునికి గాత్రము, వాయిద్యము, ఎటువంటివో మూకాభినయ కళాకారునికి అతని శరీరమే అతని పరికరము. చిత్రకారుడు కుంచెను, రంగులను ఉ యోగించి బొమ్మను గీసినట్లు ఈతడు తన శరీరము, కదలికల ద్వారా భావాలను ప్రదర్శిస్తాడు.

ఈ విధంగా కళాకారుడు తన శరీరములోని ప్రతి అంగమును విస్తృత భావప్రకటనకు వీలుగా తయారు చేసుకొంటాడు .ఇది శిక్షణాపరంగా నటునికి కావలసింది.

ఈ మూకాభినయ ప్రక్రియను నాటకాలలో అటు విదేశాలలోను, ఇటు భారతదేశంలోనూ రచనా పరంగానే కాక ప్రదర్శనా పరంగా కూడా ఉపయోగించినట్లు నిదర్శనాలున్నాయి. కేవలం ఉద్వేగాలను, ఆకృతులను, ముద్రనలను చూపించుటే కాక దూరాన్ని సూచించే విధానం ఇందులో కలదు. కనుక ఆ రోజుల్లో షేక్‌స్పియర్ నాటకాల ప్రదర్శనలలో వివిద ప్రదేశాల్లో జరిగే సన్నివేశాల సూచనకు ఇది బాగా ఉపయోగపడింది. ఉదా: మేక్‌బెత్ నాటకంలో లేడీ మెక్‌బెత్ చేతులకు రక్తం ఉన్నట్టు పదేపదే కడుగుతున్నట్టు నటించుట.

అలాగే కాళిదాసు వ్రాసిన సంస్కృత నాటకాల్లో కూడా రచయిత నటులకు కొన్ని సూచనలు ఈయడం గమనార్హం. ఉదా॥ అభిజ్ఞాన శాకుంతలంలో ''దుష్యంతుడు రథమును అత్యంతవేగముగా నడుపునట్లు అభినయించును", "శకుంతల నాటికుండతో చెట్లకు నీరు పోయినట్లు అభినయించును"

నాటినుంచి ప్రత్యేకంగా మూకరూపకాలు ఉన్నప్పటికీ ఈ అభినయం వల్ల ఉండే సౌలభ్యత బట్టి ఆధునిక నాటకాలలో ఇది ధారాళంగా వాడుకలోకి వచ్చింది.

నాటక రచనా ప్రక్రియలలో వివిధ శైలులు (స్టయిల్స్) వృద్ధి అవుతున్నకొద్ది ఈ మూకాభినయం మరింతగా ఉపయోగపడుతూ వస్తోంది. ముఖ్యంగా "ఎబ్సర్డ్ ప్లేస్"ను ప్రదర్శించటంలో ఇది విపరీతంగా కావలసివచ్చింది. స్పేస్ డైమన్షన్, రంగాలంకారణ మొదలైనవి సూచించడానికి వీలుపడడంతో తెలుగు నాటకరంగంలో అనేక ప్రయోగాలలో నాటక ప్రదర్శనలు వెలువడ్డాయి. ఉదా॥ లావొక్కింతయులేదు, కొక్కొరొకో, మరో మొహంజదారో, ఇటీవల డా॥ మొదలి నాటభూషణ శర్మగారి దర్శకత్వంలో ప్రదర్శించిన "మృచ్ఛకటిక " నాటకంలో కూడా మూకాభినయాన్ని విరివిగా వాడారు.

''సౌండ్ ఎఫెక్ట్సను, స్పెషల్ లైటింగ్ ఎఫెక్ట్స్''ను మూకాభినయానికి జోడించి కొత్తకొత్త ప్రయోగాలతో రూపకాలు వెలువడ్డాయి.

ప్రపంచమంతటా ఆదరించబడుతున్న ఈ కళ గురించి తెలుగుదేశంలో ప్రత్యేక శ్రద్ధ వహించి అభ్యసించిన కళాకారులు ఒకరో, ఇద్దరో తప్ప ఇందులో స్పెషలైజ్ చేసి ప్రయోగాలు చేస్తున్న వాళ్ళు లేరనే చెప్పాలి.

మన తెలుగు నాటకాలకు సరియైన రంగస్థలాలు లేకపోవడం వలన రచనాపరంగాను, ప్రదర్శనపరంగాను సౌలభ్యం గురించి, ఈ కళను జొప్పించడం తప్పించి దీని గురించి ప్రత్యేక శ్రద్ధ చూపినవారు చాలా తక్కువ.

ఇప్పుడిప్పుడే ప్రభుత్వ అండదండలతో నడిచే నటశిక్షణా కళాశాలల్లోని విద్యార్థులు నటశిక్షణలో భాగంగా ఈ కళను అభ్యసిస్తున్నందుకు అభినందనలు. మన తెలుగు నాటకరంగంలో కూడా సుశిక్షితులైన కళాకారులు అనేక ప్రదర్శనలిచ్చి ప్రేక్షకులకు ఆనందాన్ని పంచి ఇచ్చి ఈ కళను మన రాష్ట్రంలో కూడా పాపులర్ చేస్తారని ఆశిస్తూ

సంస్కృతి

# కాసులుంటే చాలు.. కళలెందుకు?!

అక్షర క్రమంలో మన రాష్ట్రం ముందుంది.

సాంస్కృతిక వికాసంలో మాత్రం చాలా వెనుకబడిఉంది. కళా సాంస్కృతిక వికాసం కోసం గట్టిగా ఎవరూ నడుం కట్టకపోవడం, ప్రభుత్వాల చిన్న చూపు, అధికారుల అవినీతి, నిర్లక్ష్య పర్వాలు మన కళాసాంస్కృతిక రంగాలకు పెనుశాపంగా పరిణమించాయి. మొక్కుబడిగా నిర్వహిస్తున్న కార్యక్రమాలు కూడా అనుభవశూన్యుల చేతిలో పడి నవ్వుల పాలవుతున్న సందర్భాలు కోకొల్లలు, ఈ ధోరణితో కాస్తోకూస్తో కళాభిమానం ఉన్న ప్రజలు కూడా విసిగిపోయి, ఈ కళారాజకీయాలకు దూరంగా ఏ టీవీ ప్రోగ్రాంతోనో సరిపెట్టుకుంటున్నారు.

- జి.ఎల్.ఎన్.మూర్తి

### అన్నీ ఉన్నా... శ్రద్ధ సున్నా

దక్షిణాది రాష్ట్రాల్ల మధ్య కళా, సాంస్కృతిక వారధి సౌత్ జోన్ కల్చరల్ సెంటర్. మన రాష్ట్రంలో వారు నిర్వహించాల్సిన కార్యక్రమాలు, చేపట్టాల్సిన పథకాలు అవగాహన లేని అధికారుల అవినీతి వాటం సాక్షిగా నిస్తేజం అవుతున్నాయి. మన రాష్ట్రసాంస్కృతిక శాఖ మంత్రి, ప్రిన్సిపల్ సెక్రటరీ, సాంస్కృతిక కార్యదర్శి, ఇంకొందరు అధికారులు, కళారంగం ప్రతినిధులతో అట్టహాసంగా నిర్వహించాల్సిన కార్యక్రమాలు అసలు వేదిక ఎక్కకుండానే నీరసించి పోతున్నాయి. రెండున్నర దశాబ్దాల కిందట ఏర్పాటైన దక్షిణాది రాష్ట్రాల సాంస్కృతిక మండలి కార్యక్రమాలు నానాటికీ వన్నె పెరగాల్సిందిపోయి వెలా వెలా పోతున్నాయి. పరిస్థితిని చక్కదిద్దే లక్ష్యంతో కళాప్రముఖుల చేసిన ప్రతిపాదనలన్నీ కాగితాలకే పరిమితం అవుతున్నాయి. సంస్థ తరపున అసలు ఏం జరగాలి? ఏం జరుగుతున్నదనే విషయం పూర్తిగా గందరగోళంగా మిగిలింది. రాష్ట్రానికి చెందిన ఏడుగురు కళారంగ ప్రముఖుల్ని కీలక పదవుల్లో నియమించారే కానీ 20 నెలలుగా వారిని సంప్రదించిన వారు లేరంటే పరిస్థితి ఎంత అధ్వాన్నంగా ఉందో అర్థం చేసుకోవచ్చు.

### ఆరంభశూరత్వమే!

దక్షిణ భారతంలోని అన్ని రాష్ట్రాలు కేంద్రపాలిత ప్రాంతాలకు కలసి ఎస్.జడ్.సి.సి. ఏర్పాటయిది. దేశవ్యాప్తంగా ఏడుజోన్‌లలో గవర్నర్ ఐ.ఎ.ఎస్. అధికారుల స్థాయిలో సమగ్రసాంస్కృతిక వికాసం అసలు ధ్యేయం. 1986లో మూల నిధికోసం అప్పటి ముఖ్యమంత్రి ఎన్టీరామారావు మన వంతుగా కోటి రూపాయల్ని అందించారు. కేంద్రం వాటా నిధులు కూడా వచ్చాయి, మూలనిధి ఏర్పడిందే



కానీ తరువాత కాలంలో ఎంత ఇవ్వాలి, ఎన్ని నిధుల తెచ్చుకోవాలి? కళావికాసం ఎలా పనిచేయాలనే ఆలోచన లేకుండాపోయింది. తొలినాళ్ళలో ఎందరో ప్రముఖుల జోన్‌తో పటిష్టమైన సాంస్కృతిక బంధం పెంచారు. ఆ తరువాత కార్యక్రమాలు మెల్లిగా కళ తప్పడం మొదలైంది. అధికారుల ఆలోచనలు పెడదారి పట్టాయి. దేశ రాజధానితో పాటు పలు నగరాల్లో దక్షిణాది కళావైభవాన్ని చాటిచెప్పిన పసందైన కార్యాక్రమాలు ఎన్నెన్నో! నాటి డైరెక్టర్ షీలాప్రియ వంటివారి చొరవతో 500 మంది జానపద కళాకారుల కేంద్రరాజధాని ఢిల్లీలో

## పరిమళించని కళాసౌరభం

దక్షిణాది సంస్కృతిక మండలి లక్ష్యాలు ఎంత ఉన్నతమైనవో, మనం వాటిన ఏ స్థాయిలో నీరు కారుస్తూ కళామతల్లికి కన్నీళ్లకు కారణం అవుతున్నామో చూద్దాం.

సాంస్కృతిక కార్యక్రమాలు, కళాబృందాల మార్పిడి పథకాలు, ఆయా కళాకారుల రాక పోకడలతో రాష్ట్రంలోని అన్నా ప్రాంతాలు 'కళ'కళలాడాలి. కానీ మనవాళ్ళు రాష్ట్ర రాజధానిలో కేవలం రవీంద్రభారతిలో, అది కూడా ప్రేక్షకుల ప్రమేయం లేకుండా ఎన్నో కార్యక్రమాలు నిర్వహించారు.

ఆసక్తి కలవారికి శిక్షణ తరగతులు, ప్రదర్శన అవకాశాలు కల్పించాలి. గతంలో శిల్పారామం, రవీంద్ర భారతి, చిత్రమయిల్లో శిక్షణ నిర్వహించారు. ఇప్పుడు ఆ ఊసేలేదు.

శాస్త్రీయం- జానపదం -గిరజన నృత్యకళలకు ప్రత్యేక ప్రోత్సాహం ఇవ్వాలి. ప్రదర్శనలు, ఫెస్టివల్స్ నిర్వహించేందుకు పుష్కలంగా నిధులున్నాయి. కానీ మన రాష్ట్రంలో ఈ కార్యక్రమాలు సిబ్బంది, అధికారుల నిర్లక్ష్యం, అవినీతి పుణ్యమా అని మొక్కుబడిగా జరుగుతున్నాయి.

జాతీయ స్థాయి ఉత్తమ కళాకారులతో తరుచు ప్రదర్శనలు ఏర్పాటు చేయాలి. కానీ మన రాష్ట్రంలో ఎవరి ప్రదర్శన, ఎందుకు,

నిర్వహించిన కార్యక్రమాలు అద్భుత కళావిన్యాసాలు. చిందు ఎల్లమ్మ వంటి కళాకారిణిని చూసి పులకించిన రాజీవ్‌గాంధీ ఆమెను ప్రేమగా పలకరించి, ఫొటోలు తీయించుకొని సత్కరించిన సందర్భం మరో కమ్మని జ్ఞాపకం. హైదరాబద్‌లోని శిల్పారామం ఏర్పాటులో సౌత్‌జోన్ నిధులు పుష్కలంగా అందివచ్చాయి. పలు కార్యక్రమాలతో కళకళలాడిన శిల్పారామం ఇప్పుడు వన్నె తరిగి అవినీతి పుట్టంగా మారి, ప్రతిష్టపోగొట్టుకుంది, జోన్ వారికి బకాయిలు పడి కార్యక్రమాలు కూడా లేకుండా పరువు కోల్పోయింది. సౌత్‌జోన్ కల్చరల్ సెంటర్ వారిని అడిగితే చాలు ఏవో కొన్ని నిధులు వస్తాయనే



వివరం తెలిసిన వారు ఒడుపుగా సొంత ఖాతాల్లో డబ్బు జమచేసుకుంటున్నారు. కొందరు ప్రబుద్ధులైన అధికారులు, సిబ్బంది వాళ్లతో లాలూచీ పడి, కళాకారులకు అందాల్సిన నిధుల్ని స్వాహా చేస్తున్నారు. జ్ఞానపీఠ పురస్కార గ్రహీత ప్రొఫెసర్ యు.ఆర్. అనంతమూర్తి సారధ్యంలో జోన్‌ల స్థాయిలో కళా, సాంస్కృతిక వికాసానికి తోడ్పడే అద్భుతమైన పథకాలు, విధానాలు రూపుదిద్దుకున్నాయి. వాటిని అందిపుచ్చుకోవటంలో మాత్రం మన రాష్ట్రానికి ఏ మాత్రం లక్ష్యం లేకుండా పోయింది. చిత్తశుద్ధిలేని కొందరు అధికారులు మండలి ప్రతిపాదన్ని, చివరకు నిధుల్ని సైతం తిప్పి పంపిన సందర్భాలు అనేకం.



ఎప్పుడు ఉంటుందో ఎవరికీ అర్థం కాదు. 75 మంది ఉత్తరాది కళాబృందం, అద్భుతమైన నృత్య రూపకంతో రాష్ట్రానికి వస్తే వాళ్లను ముప్పతిప్పలు పెట్టి, 30 మంది ప్రేక్షకులు మాత్రమే చూసేలా కార్యక్రమం ఏర్పాటు చేయించిన ఘనత మనది.

జోన్ వారు క్యాలెండర్ ఆఫ్ ఈవెంట్స్‌ను రూపొందించి దాన్ని కచ్చితంగా పాటిస్తారు. మన రాష్ట్రంలో ప్రకటనలు వేరు, ప్రదర్శనలు వేరు.

ఇంతటి అశ్రద్ధ, అవకతవకలకు కారణం నిధులు లేకపోవడమా అంటే అది కానే కాదు. మూలధనంపై వచ్చే వడ్డీతోనే సులువుగా పలు కార్యక్రమాలు నిర్వహించే అవకాశాలు ఉన్నాయి. చక్కగా నిర్వహిస్తే నిధులిచ్చి కళా బంధువులకు కొరత లేదు. కానీ మనకు అవే పట్టువు. మనకు రావాల్సిన నిధుల్ని సవ్యంగా తెచ్చుకోవడం, వాటిని కళా వికాసం కోసం సద్వినియోగం చేయడం మనకు అసలే చేతకాదు. అంతెందుకు దక్షిణభారత సాంస్కృతిక మండలివారు తాజాగా వివిధరాష్ట్రాల వారికి కేటాయించిన నిధులు చూస్తే ఆంధ్రప్రదేశ్ కళావైభవం ఏ పాటిదో తెలుస్తుంది. తమిళనాడుకు 14, పాండిచ్చేరికి 12.25, కేరళకు 10.5, లక్షదీవులకు 8, కర్నాటకకు 7, అండమాన్‌కు 3.5 లక్షల నిధులు కేటాయిస్తే ఆంధ్రప్రదేశ్‌కు కేవలం 3.5 లక్షలు మాత్రమే వచ్చాయి. ఎలాంటి ప్రయాస లేకుండా జోన్‌నుంచి రాష్ట్రానికి రావాల్సిన కేటాయింపు విషయంలో కూడా మనం శ్రద్ధచూపకపోవడం ఎంత వరకు క్షమార్హం. పరిస్థితి ఇలాగే కొనసాగితే తెలుగునేలపై కళామతల్లికి కన్నీళ్లు కాక ఇంకేం మిగులుతాయి?!





# 'చిత్ర' మైన జీవితం

Part-6

ప్రముఖచిత్రకారుడు, కార్టూనిస్టు, కథారచయిత బాలిగారు 64కళలుడాట్‌కాం పాఠకులకోసం తన కళాజీవిత విశేషాలను, బాల్యస్మృతులను, పరిచయాలను ధారావాహిక రూపంలో అందించనున్నారు. నెల నెలా చిత్రమైన జీవితంలో...





email: balisankar@gmail.com

ఎప్పటిలాగే ఆయన్నుండి ఉత్తరం వచ్చింది. అందులో "వసుధ" అనే మాసపత్రిక హైదరాబాద్ నుండి వస్తుందని దానికి తనను ఎడిటర్‌గా నియమించారని, బద్రంగారు దాని పెట్టుబడి దారుడని, దానికి నువ్వు, రవిబాబూ, బొమ్మలు వేయవలసి ఉంటుందని రాశాడు. ఈ బద్రంగారెవరో, రవిబాబుగారెవరో నాకు తెలియదు. కథలు పంపాడు. బొమ్మలు వేశాను. ఆ బొమ్మలు కొన్ని కొలతల్లోనే నేను వెయ్యాలి. చలసానికున్న మహా అలవాట్లలో అది ఒకటి. కొన్ని కొలతలు ఆయనిస్తాడు. అలా ఆ కొలతల్లో మనం వెయ్యాలి. కార్టూన్‌లన్నా, జోకులన్నా, అంతే! మొన్న మొన్నటి వరకూ ఆయన ఎడిట్ చేసిన పత్రికల్లో అదే గొడవ కనపడుతుంది. ఫ్రీనెస్ ఉండదు. ఎవడి వెర్రి వాడికానందం" అంటే అదే!!.



ఈయన చెప్పినట్టే ఏ నెల రెమ్యూనరేషన్ రెండవనెలలో ఉండేది. ఇంతకీ బద్రంగారెవరో అప్పటికీ తెలియదు. రవిబాబుగారయితే "ఏ.బి.కే" గారి బావమరిది అని తెలిసింది. ఆయన బొమ్మలు ఏ బెస్ట్రాక్ట్ శైలిలో ఉంటాయి. అదొక ప్రత్యేకత.

ఆ పత్రికకు ఎన్ని నెలలు బొమ్మలు వేసానో తెలియదు. ఒకరోజు చలసాని గారినుండి ఉత్తరం వచ్చింది. 'వసుధ' పత్రిక నుండి తాను తప్పుకొంటున్నట్టూ, మీకు ఇవ్వవలసిన డబ్బు బద్రంగారి నుండి త్వరలో అందుతుందనీ రాశాడు. ఏదో తేడా! ఎడిటర్‌కీ, ఫౌండర్‌కీ... వచ్చింది సరే మంచిదే!!

నెలరోజులు గడిచి ఉంటాయి. "వసుధ" పత్రిక "బద్రం"గారు వైజాగ్‌లో మా ఆఫీసుకు వచ్చారు. నా గురించి అడిగారు వరండాలోని నిలబడి ఆయన్ని అదే చూడ్డం. జరిగిన చాల విషయాలు చెప్పారు.

నా రెమ్యూనరేషన్ నాకందచేశారు. వెళ్లిపోతూ అన్నారు. "చలసాని" పెద్ద తలనొప్పిమనిషి అని, "ఓహెూ" అనుకున్నాను. తమాషా ఏమంటే అప్పటి వరకూ చలసాని గార్నీ ముఖత:చూసి ఎరుగను.

ఆయన వెళ్లిన తరువాత నేను వరండాలోనుండి ఆఫీస్ హాల్లోకి ఎంటర్ అయ్యాను. అయితే నన్ను ఇద్దరు వ్యక్తులు ఆఫీసులోని వారే గమనిస్తున్నట్లు తెలియదు. వారిలో ఒకరు మా ఆఫీస్ మేనేజర్‌గారు "పోకలచలపతిరావుగారు" రెండో వ్యక్తి ఆఫీస్ పి.ఏ. బ్రహ్మంగారు. నీకోసం ఎవరో వచ్చారు. మీ చుట్టమా?" అనడిగారు మేనేజర్. కాదని చెబుతూ విషయమంతా చెప్పాను.

"నువ్వు బొమ్మలు వేస్తావని విన్నానేగానీ, పెద్దగా తెలియదు. అయితే ఈ విషయం ఎవరికీ చెప్పకు. ఆ డబ్బులు దాచుకో. ఈ మనుషులు మూర్ఖులు. మన టాలెంట్‌తో డబ్బులు సంపాదిస్తే భరించలేరు" అన్నాడాయన.

నిజానికి నేను బొమ్మలు వేస్తానని ఎవరకీ చెప్పేవాడ్ని కాను. మరో పదినిముషాల్లో బ్రహ్మంగారు నా పక్కకి చేరారు. "ఆయనెవరూ ఏమిటి సంగతీ'' అన్నాడు. ఆయన మా బంధువు అని చెప్పాను."అమ్మయ్యా! అలాగా!! ఆయన నీచేతులో ఏదో పెడుతుంటే అనుకున్నాను. డబ్బులేమో! అని. మనం గవర్నమెంట్‌లో పనిచేస్తూ బయట సంపాదించకూడదు అది విరుద్ధం. గొప్ప చిక్కులు వస్తాయి" అన్నాడు. మరి లంచం సంగతో... ఈ ఇద్దరిలో అంత తేడా ఉంది. గమనించడంలో ఇద్దరూ ఒకటే ఇక్కడ, టాలెంట్ అక్కర్లేదు. లంచమే పరమపదసోపానం. విషయమొచ్చింది కాబట్టి మరో అనుభవం చెబుతున్నాను. అది చోడవరం సబ్ డివిజన్‌లో నేనుండగా జరిగినదే. మార్చి నెలలో గవర్నమెంట్ ఆఫీసులు చాల హడావుడిగా ఉంటాయి. లెఖ్ఖలు, శాంక్షన్సూ, ఖర్చులూ వీటితో. ఆ సంవత్సరం అలాగే ఉంది. చెమటలు పట్టేట్టు (ఎలాగూ ఎండలు ముదుతుంటాయి) పనిచేస్తున్నాం. ఆఫీసర్ గదిలో తప్ప మా గదిలో ఫాన్ ఉండేది కాదు.

ఏప్రిల్‌లో రెండో వారానికల్లా హడావుడి సద్దు మనిగింది. "కష్టేఫలి" లంచాలు వచ్చిపడ్డాయి. అసిస్టెంట్ ఇంజనీరుగారు, జూనియర్ ఇంజనీర్లూ, సూపర్‌వైజర్లూ, మా హెడ్ గుమాస్తా, అందరూ సంతోషంగా ఉన్నారు. ఎవరి కేడర్ బట్టీ వారికి డబ్బులు ముట్టాయి. మా హెడ్ గుమాస్తా, అందరూ అలా కుదించి పిలిచేవారు. ఆయన నా దగ్గరికి వచ్చారు. నా స్థాయిబట్టీ నాకు 35 రూపాయిలు లంచం వచ్చిందని చెప్పారు. జేబులోంచి ఆ మొత్తం తీసి బల్లమీద ఉంచాడు. సంతోషంగా ఆ డబ్బులు తీసుకోబోయాను.

"డబ్బులుంటే పిచ్చి ఖర్చులు పెడతావ్! ఏదన్నా గుర్తుగా వస్తువుకొనడం మేలు. సాయంత్రం ఆఫీస్ అయ్యాక బజారుకి వెళదాం. ఈ డబ్బులకు ఏమొస్తే అది కొందాం!!" అని తిరిగి ఆ డబ్బులు తన జేబులో పెట్టికున్నాడు. సాయంకాలం అయ్యింది. ఆఫీసూ అయిపోయింది. తిన్నగా బట్టలషాపునకు తీసుకెళ్లి ఆ డబ్బులకి ఏమొస్తుందని ఎంక్వయిరీ చేస్తే గుడ్డల మూటలో నలిగి ఉన్న చొక్కా గుడ్డవచ్చింది."అంచులు నల్లగా ఉన్న ఉతికితే మురికిపోతుందని, నా వంటికి ఆరంగు బావుంటుందన్నాడు. నేనూ తలాడించాను అవునన్నట్లు, తీసుకున్నాం చొక్కా కుట్టించుకొని ఆఫీసుకి వేసుకొని వెళ్లాను. సంతోషపడ్డాడు అప్పారావు. అది



బాలి గ్రీటింగ్స్

మాసిపోయిన తరువాత చాకలికి వేశాను. "ఇంతపాతగుడ్డను ఎందుకుకొన్నారు సారూ! ఇస్త్రీ పెట్టె తిప్పుతోంటే చొక్కా వీపు భాగం రెండుగా చీలిపోయింది'' అన్నాడు. ఆచాకలాయన. చొక్కా బయటపారేశాను.

పి.ఏ. బ్రహ్మంగారిది గొప్ప లిటిగేషన్ బుర్ర. ఓరోజు నా సీట్లో తలవంచుకొని వర్క్ చేసుకుంటున్నాను. అప్పటికే పురాణంగారు నాకు "బాలి" అనే పెన్ నేమ్ తగిలించడం వల్ల, బొమ్మలు కింద"బాలి" అనే సంతకం చేస్తున్నాను. ఉగాది ఆంధ్రప్రభ ప్రేత్యేక సంచికకు ఓ పూర్తి పేజీ కార్టూన్‌ను గీసి పంపాను. దానిపేరు "ఆఫీస్". అది మా ఆఫీసు గురించే. మా మేనేజర్ రూంబయట గుమ్మానికి పైనున్న "మేనేజర్" అనే ప్లాస్టిక్ ప్లేట్‌కి, ఓ పక్క మేకు లేక ఎపుడూ వేలబడిఉండేది. అవసరం లేకపోయినా ఓ హెడ్‌క్లర్క్, ఓఅమ్మాయి సీట్లోకి చూస్తూ తెగమాట్లాడేవాడు. రామమూర్తి అనే మరో ఎకౌంటెంట్ తన టేబుల్ సొరుగు ముందు భాగమే వాడేవాడు. అందులోనే పూరీలు, జంతికలూ, ఇంట్లోనుంచి తెచ్చుకొని తినేవాడు. వెనక సొరుగు లాగేవాడుకాదు. ఒక మారు ఎందుకో సొరుగు




మొత్తం లాగితే వెనక పాతికదాకా ఎలకలున్నాయి. పిల్లలూ... కళ్లు తెరవని పిల్లలు అందులో ఉన్నాయి. రామమూర్తిగారు తినగా మిగిలిన పదార్థాలు వెనక్కు పట్టుకుపోయి అవి తినేవన్నమాట. ఆ రోజు అవి అలా బయటపడి ఆఫీసంతా ఎలుకలమయం అయిపోయింది. డిస్పేచింగ్ క్లర్క్.. అతడు అటెండర్‌ని పిలిచి కవర్లకు స్టాంపులు అంటించమంటే అతడు ఏనాడూ నీళ్ళు తెచ్చుకొని అంటించేవాడుకాదు. అంతా నాలుకపనే! ఆ విషయంలో ఆ క్లర్క్‌కీ, అటెండర్‌కీ పడేది కాదు. ఇలాంటి విషయాలతో ఆ కార్టూన్‌లు ఉంటాయి.

ఆ కార్టూన్ ప్రింటయిన 'ఆంధ్రప్రభ' ఇంకా విశాఖపట్నం వచ్చినట్టులేదు. ''ఇక్కడ ''బాలి''గారు ఎవరు?'' ఎవరో అడుగుతున్నారు, ఆఫీస్. పి.ఏ. బ్రహ్మంగార్ని అది నా పెన్ నేమ్, దాని గురించే అడుగుతున్నారు. అటూ చూశాను. ఎవరో యుకుడు పైకి తలదువ్వి, లేతరంగు షర్ట్‌ని టక్‌చేసుకొని ఉన్నాడు.

ఈ ఆఫీస్‌లో ఆ నాపేరు, ఎవ్వరికీ తెలియదు. బ్రహ్మంగారు ఆ కుర్రవానివేపే చూస్తున్నాడు. "సో శంకర్రావు"అన్నాడా యువకుడు తిరిగి. ఆకుర్రవాడెవరో నాకు తెలియదు. చెవులు అటే వేసి నా పని నేను చేసుకుంటున్నాను. బ్రహ్మంగార్కి అతడు పరిచయం వున్న వ్యక్తిలాగే ఉన్నాడు. కుర్చీ చూపించి కుశల ప్రశ్నలు వేస్తున్నాడు. శంకర్రావుతో ఏం పని అని గుచ్చి గుచ్చి అడుగుతున్నాడు.

అతను ఏవో చెప్పి మళ్లీ అడిగాడు "శంకర్రావు ఎక్కడా అని" బ్రహ్మంగారికి తప్పలేదు "శంకర్రావుగారూ! ఇలా రండి" అని బ్రహ్మంగారు పిలిచారు. మహా అయితే రెండు గజాల దూరంలో ఉన్నాను. లేచివెళ్లాను.

ఆ యువకుడు కుర్చీలోంచి అమాంతంగా లేచి, నాకు షేక్‌హేండ్ ఇచ్చాడు. అతడు అప్పటికే ఆంధ్రపత్రికలో బొమ్మలూ, కార్టూన్‌లూ వేస్తున్న "సాంబు". ఆయన స్వస్థలం విశాఖపట్నమేనట. బ్రహ్మంగారు పరిచయం చేశారు. ఆయన తండ్రి పోస్టల్ శాఖలో ఆఫీసర్. అయితే వీరంతా మద్రాస్‌లో ఉంటారు. ఇతని అక్కయ్యలే, మందరపు లలతి, పద్మలు. ఇప్పుడు నన్ను చూడ్డానికి మా ఆఫీసుకు వచ్చాడన్న మాట. నా చిరునామా ఎలా తెలిసిందీ అంటే ఆంధ్రప్రభ ఆఫీసుకు ఈయన వెళితే , నా కార్టూన్ ఒరిజనల్ వెనక నా అడ్రస్ ఉంది. దాన్ని నోట్ చేసుకొన్నాడు. ఇవన్నీ ఒక ఎత్తయితే మా బ్రహ్మంగారికీ, వీరికీ చుట్టరికం ఉంది. అదీ సంగతి. బయట వరండాలోకి వెళ్లి మాట్లాడుకున్నాం. ఆ కార్టూన్ ఆయనకు నచ్చింది. వారి ఇల్లు దాబాగార్డెన్‌లోనే అని చెపుతూ శెలవు రోజున రమ్మన్నాడు వారింటికి. అప్పటికే పత్రికల్లో నా బొమ్మలు అడపా, తడపా వస్తున్నాయి, ఈయన ఏకంగా పత్రికలోనే పనిచేస్తున్నాడు కాబట్టీ నాకూ సరదా వేసింది. తప్పక కలుసుకుందామనుకున్నాను. మరో నాలుగు రోజుల్లో ఆదివారం వచ్చింది. 'సాంబు" ఇచ్చిన చిరునామా ప్రకారం వారింటికి వెళ్లాను. సంతోషంగానే ఆహ్వానించాడు. ఒక్క ప్రశ్న వేస్తే నాలుగు సమాధానాలు ఇస్తున్నాడు. వాటిల్లో అతిశయంపాలు ఎక్కువగా కనిపిస్తోంది. తానో గొప్ప చిత్రకారుడ్ని అని ఆంధ్రపత్రిక ఆఫీసు తన కోసం ఎదురుచూస్తుంటుందనీ చెప్పాడు, తన కార్టూనులు కోసం 'యువ' పత్రికవారు నాలుగు సార్లు ఫోన్ చేస్తే కాని స్పందించననీ, చివరకు టెలిగ్రాంలు ఇస్తారని ఇనుపకొక్కేనికి గుచ్చిన బోల్డు గులాబీ రంగు టెలిగ్రాం కాగితాలు తెచ్చి చూపించాడు. నా ఆనందానికి హద్దులేదు. రాసేపెన్నులు, కాగితాలు గురించి అడిగాను. ఏవేవో చెప్పారు. అవి మద్రాస్‌లో తప్ప మరెక్కడా దొరకవని చెప్పాడు. అంతగొప్ప చిత్రకారుడ్ని ఇలా కలుసుకోవడం నా పూర్వజన్మ సుకృతఫలమనిపించింది. అప్పటికి సెలవు తీసుకొని వచ్చేవారం కలుసుకుంటానానని చెప్పి వచ్చేశాను.




బ్రష్‌లూ ఆయన్ని బ్రతిమాలి మద్రాస్‌నుండి తెప్పించుకోవాలనీ... ఇక ముందు ఎవరన్నా కోరనిదే కార్టూన్లు గీయరాదనీ ఆలోచించాను.

అయినా నా కార్టూన్లు ఎవరిక్కావాలి! నేనేం గీయగలను. అవన్నీ పగటికలలు.

మరో రోజు ఆఫీసుకి సెలవు వస్తే 'సాంబు' ఇంటికి వెళ్లాను. ఇంకా ఏవేవో తెలుసుకోవాలి. ఆ ఉత్సాహం అటువంటిది.

నన్ను చూడగానే విసుగ్గా ముఖంపెట్టాడు.

విష్ చేశాను సరదాగా!! తిరిగి విష్ చెయ్యలేదు, సరికదా నా ముఖంలోకి చూస్తే "మా ఇంటి చుట్టూ కుక్కలా ఎందుకు తిరుగుతావు" అన్నాడు.

"నేను కుక్కనా?" వాడి సంస్కారానికి, సభ్యతకూ ఆశ్చర్యపోయాను. సారీ చెప్పి తిరుగు ముఖంపట్టాను. ఆ తరువాత ఆరునెలలకు అనుకుంటాను. "డాక్టర్ తంబు" గారు పరిచయమయి, ఆయన ద్వారా మరికొంతమంది ఎం.బి.బి.యస్ చదువుతున్న యువకులు పరిచయమయి మా ఇంటికి వచ్చారు. వారంతా ఆ సంవత్సరం వారి కాలేజ్ మాగజైన్ కమిటీ మెంబర్సట. కథలూ, గేయాలూ నా ముందు పెట్టారు బొమ్మలకోసం, వేశాను. వేస్తున్నంతసేపూ నా ముందు చాపలమీద కూచుని నాతో కబుర్లు చెప్పడం, మా అమ్మాయితో ఆడడం చేసేవారు. నా బొమ్మలూ, నా టైంసెన్సూ వారికి నచ్చాయి. ఒకరోజు మాటల్లో 'సాంబు' గురించి వచ్చింది. ఆ ముందు సంవత్సరం ఆయనతోనే బొమ్మలు గీయించారట. "ఆడో పిచ్చోడు" అన్నాడు ఈ గుంపులో ఒకడు. "పోయిన సంవత్సరం మా మేగజైన్‌కి బొమ్మలు వేయించాం. మద్రాస్‌నుండి వచ్చాడు. తెగ ఏడిపించాడు. వాడికి చాకరీ చెయ్యలేకచచ్చాం. మూడ్ కావాలంటాడు. మందు కావాలంటాడు. బయటకు పొమ్మంటాడు. అంతలోనే లోపలికి రమ్మంటాడు" అన్నాడు మరో విద్యార్థి. బొమ్మలయిపోయాయి. సకాలంలో మేగజైన్‌బయటకు వచ్చింది . ఆ తరువాత చాలకాలం వరకూ ఈ మెడిసన్ స్టూడెంట్స్‌తో నా పరిచయం సాగింది.

అలా అన్న ట్టే ఆ తరువాత వారం వెళ్లాను. ఈసారి కొత్త సంగతులు"మౌలీస్ అడ్వర్‌టైజ్‌మెంట్" అని మద్రాసులో ఉంది. అందులో మేనేజర్ నా ఫ్రెండ్, ఎంత ఫ్రెండ్సంటే ఒక కంచంలో తిని ఓ మంచంలో దొర్లే అంత! పైగా అతను నిర్మాత కూడ. "వోహ్...కౌన్‌థీ" అనే హిందీ సిన్మాని తెలుగుకి హక్కులు కొని "ఆమె ఎవరు?" అని తీశాడు. దాని పబ్లిసిటీ విభాగాన్ని నేనే చూశాను. పెద్ద హిట్ డబ్బులొచ్చాయి. నా టేబుల్‌మీద నాలుగు ఫోన్లు ఉంటాయి. ఎంత సమాధానాలు ఇస్తున్నా ఆ ఫోనులు అలా మోగుతూనే ఉంటాయి. ఒక్కో మారు నేనే తీయను. క్షణం తీరిక ఉండదు..." ఇలా సాగింది ఇతని వాగ్ధాటి. నేను వెర్రెక్కిపోయాను. ఇష్టంలేని దిక్కుమాలిన P.W.D గుమాస్తా గిరి కళ్లముందు కనపడింది అప్పటికి సెలవు తీసుకొని ఇంటికిపోయాను. ఆయన చెప్పిన పెన్నులూ,

## భరాగో

భరాగోగారు నాకు ఎలా పరిచయం అయ్యారో ముందే చెప్తాను. ఒకరోజు మా ఆఫీసులోపని చూసుకొని కలెక్టర్ ఆఫీసు టర్న్ తిరుగుతున్నాను. భరాగో ఎదురుపడ్డాడు. ఇంటికి పోయి

భరాగో



ఏంచేస్తావు, మా ఇంటికి రా! అని గొడవ చేశాడు. అప్పటిలో ఆయన కలెక్టర్ ఆఫీస్‌కి దగ్గర్లో ఉన్న "బి.కె.రావు" గారింట్లో పెరడివేపున్న ఇంట్లో ఉండేవాడు. ఆ ఇల్లు విశాలంగా ఎదురుగా ఉన్న సముద్రపుగాలిలో చుట్టూ ఉన్న చెట్లతో, హాయిగా, ఓ తోటలో ఉన్నట్టుండేది. ఎత్తయిన వీధి గేట్లలోంచి లోపలికి వెళ్తోంటే , మామిడి, సపోటా, అరటిచెట్లు అటూ ఇటూ స్వాగతం పలికేవి. ఆ చల్లగాలీ, చల్లదనం వల్ల కాబోలు ఆ చెట్లనిండా రకరకాల పిట్టలు కువకులాడుతూ పరుగులు తీసేవి.

"ఇల్లు చాల బాగుంది. మీరు ఫేన్ వేసుకోనవసరం లేదు. చల్లటిగాలి. ఈ చెట్లకింద మంచం వేసుకున్నా ఫరవాలేదన్నాను." సరదా పడ్డాడు.

ఆ కబురూ, ఈ కబురూ చెబుతూ "నువ్వన్నట్టు నాకూ ఈ ఇల్లన్నా ఈ చెట్లన్నా చాల ఇష్టం. అయితే ఈ ఎండలకి కోపం ఎక్కువ. చెట్లకిందమడత కుర్చీవేసుకుచున్నానోసారి, రెట్టలు వేసి చంపాయి. వాటికి గల ఇబ్బందేమిటో నాకు తెలియలేదు. ఇంట్లోకి వెళ్లిపోయాను" అన్నాడు.

అయితే ఆయన సరదా ఇంకోలా తీరినట్టుంది. ఆ ఇంటికి మరుగుదొడ్డి విసిరేసినట్టు దూరంగా ఉంది. దానిపై గొడుగు పట్టినట్టు చెట్ల కొమ్మల ఆకులూ...ఈయనగారు మరుగుదొడ్లో ఉంటే ఏదన్నా పిట్ట అరిస్తే అది ఏ పిట్ట అయ్యింటుందో, ఎంతబాగా అరిచిందో లెఖ్ఖ వేసుకొనేవాడట! ఈ లెఖ్ఖలు కట్టడం, వాటి అరుపులకు ఆనందం, తన్మయత్వం చెందడం వల్ల అక్కడే, అందులోనే ఓ గంట ఉండిపోయేవాడన్నమాట. "అయ్యా! అయ్యిందా!! ఇక లేచిరండి, అటు ఆఫీసుకి టైమవుతోంది!! అని ఆయన భార్య అరుగు చివరవరకూ వచ్చి అరిస్తేనే ఆయన బయటకు రావడం.

గువ్వలూ, కొంగలూ, నీలిపిట్టలూ, పావురాళ్లూ, బంగారు పిచికలూ, కాకులూ, గోడపక్కనున్న గుడిసెల వాళ్ల కోళ్లూ అన్నీ అక్కడే! ఆ చెట్లమీదే ఆ చెట్ల కిందే... ఇంకా ఈయనకు సరదాచావక ఓచేత్తో దొడ్డిచెంబు పుచ్చుకొని, మరో చేత్తో నేలమీద పడి ఉన్న రంగురంగుల ఈకలు ఏరడం, వాటి అందాలకు పరవశించి, అక్కడే పడెయ్యలేక... వాళ్ళావిడ గమనిస్తోందేమో అని కొంచెం భయమూ కలిగి, మోకాళ్లవరకూ మడత పెట్టి కట్టిన లుంగీలో ఆ ఈకలను దాచి గదిలోకి చేరిన తరువాత పందిరమంచపు పరుపు ఎత్తి దానికింద దాచేవాడు. ఇలా పెట్టి పెట్టి కొన్నాళ్లకు అది ఈకల పరుపు అయ్యింది.



అంటే హంసతూలికలు కాక, రకరకాల పక్షీకల పరుపయ్యిందన్నమాట!




బాలి (గ్రీటింగ్స్)




మరచిపోకు" అనీ అలాగే వెళ్లాను. వెళ్లిన కాసే పటికివచ్చాడు" నలుగు రికీ ఓ గొప్ప విషయం చెప్పి ఉంచాను. నీకూ చెప్తున్నాను బేరం చూసి పెట్టమన్నాడు. విషయ మేమిటో ముందు తెలియ లేదు. రిక్షా ఎక్కించేడు. ఇద్దరం పూర్ణా మార్కెట్ ముందు దిగాం. తూర్పు వేపు చూడమన్నాడు. ఏదో రాతి గోడలా ఉంది. ఆపైన ఎర్రమన్ను దిబ్బట. వాటిపై దూరంగా దిబ్బమీద

ఇలా ఎన్నాళ్లు సాగిందో తెలీదు. ఇంటికి సున్నాలు వేయించాలని సామాన్లు సర్దుతూ వాళ్లావిడ పరుపుచుట్టి పైకెత్తితే ఇంటినిండా ఈకలు తూళ్లాయట. ఆవిడ కంగారుపడింది. దొంగకోళ్ళు తిన్నవాళ్ల పరిస్థితి అది బాపన కొంపలో కోడీకలేమిటి? అని ఈయనను నిలదీసే సరికి అవి కోడీకలు కావు. అవి అందమైన రకరకాల పక్షీకలు అని నచ్చచెప్పి, అవన్నీ చేటలో ఎత్తి బయట పారబోశారు. అయినా ఈయన మనసుఒప్పుకోక ఆ పక్కనే చతికిలబడి నచ్చిన కొన్నీకలు సెలక్ట్‌చేసి మరోచోట దాచేడట. ఇవన్నీ నాతో చెప్పి "ఏమిటో బాలీ! ఆ ఈకలు వాటికి భగవంతుడిచ్చిన రంగులు చూస్తోంటే మనసుండదు. ఎంతసేపన్నా చూడాలనిపిస్తుంది" అన్నాడొకసారి.

మరొకసారి ఆయన ఆఫీస్‌లో ఆయన టేబుల్‌దగ్గరే కలుసుకున్నాను. ఇంట్లో టిఫిన్ తినే టైం లేక ఆఫీస్‌కు వచ్చాడు. మరో అరగంటలో వాళ్లబ్బాయో మరొకరో పెద్ద స్టీల్ డబ్బా, ఓ ప్లాస్కూ తీసుకొచ్చాడు. ఈయన మూత తెరిచాడు. ఆవకాయ వాసన గుప్పుమంది. దానికింద బోల్డు ఇడ్లీలు. అవన్నీ పదిహేనుకిపైగానే. నన్నూ తినమన్నాడు. వద్దన్నాను. అవన్నీ లాగించేసి, కాఫీ కూడా తాగడం ముగించారు. అవన్నీ ఇరవై ఇడ్లీలట. చేయి కడుక్కుంటూ "నాకు తిండిపుష్టి ఎక్కువ" అన్నాడు సరదాగా.

అలాగే మరొకసారి వెంకటనరసమ్మగారితో కబురుపెట్టాడు రేపు సెకండు సాటర్‌డే సెలవు కాబట్టి ఉదయం తొమ్మిదింటికల్లా కలెక్టర్ ఆఫీస్ గేటు దగ్గరుండు. మనమొకచోటుకి వెళ్లాలి.

ఎర్రచా రలతో లైట్‌హౌస్ (ఇప్పుడు ఆప్రాంతంలో చాల మార్పు వచ్చి ఉండవచ్చు). వేలితో పైనున్న ఎర్రదిబ్బలు వేపు చూపిస్తూ "బాలీ" ఆ దిబ్బల మధ్య ఓ తొంభై గజాల స్థలముంది. నేను సర్వేయర్‌ను కదూ! లెక్కలు చూస్తే అది తేలింది. అది ఎవరికీ చెందనిది పైగా ఎవరికీ అక్కర్లేదు గవర్నమెంట్‌ది కావచ్చు అడిగినపుడు చెబుదాం! ఇపుడు మనం దాన్ని ఎవడికయినా అమ్మాలి" అన్నాడు. నాకు ఇలాంటి పితలాటకాలు తెలియవు. అమ్మకాలూ, కొనడాలూ అసలే తెలియవు. అదే అన్నాను.

"ఇంతకీ ఆ స్థలానికి దారెటూ?"

"కొనుకున్నవాడు, వాడి తంటాలు వాడు పడతాడు ఇక్కడ్నుంచి నిచ్చెన వేసుకొనీ, లేకపోతే కాళ్లమీదనన్నా ఒక సెకండు చాలు. మనకో పదివేలొస్తేచాలు" అన్నాడు

"ఓరి దేవుడోయ్- ఇదేం లంపటం"

అందుకా నన్ను పిలిచిందీ అని మనసులోనే అనుకొని "చూద్దాలెండి" అన్నాను బయటకు. ఇద్దరం వెన్క బయలు దేరాం.

భరాగోగారి ఇలాంటి విచిత్రాలు వినాలంటే విశాఖ రచయితలు... శ్రీద్విభాష్యం రాజేశ్వరరావు, శ్రీనవులూరి వెంకటేశ్వరరావు లాంటి వారయితే ఇంకా చెప్తారు.

*(రాబోయే సంచికలో... మరికొన్ని విశేషాలు)*

కళాప్రపంచం

# "సాహితీ కళాకౌముది- డా॥ సంజీవ దేవ్"

**ఎల్.ఆర్. వెంకటరమణ**

*"ఎందుకు వ్రాయటం?*
*ఎందుకు వ్రాయకపోవటం?*
*ఎందుకు వ్రాయకపోవటయో అందుకే వ్రాయటం*
*చేతకాక వ్రాయరు కొందరు*
*కొందరు చేతకాక వ్రాస్తారు.*
*కొందరు చేతయి వ్రాస్తారు.*

చేతయి వ్రాయటం, చేతకాక వ్రాయటం ఈ రెంటి సమ్మేళనం"

రసరేఖలు గ్రంథానికి స్వీయగానం ఇలా ఉంటుంది శైలి. ఇలా ఎవరు వ్రాయగలరు. ప్రపంచానికి తెలుగు సొబగులు చూపగలిగిన ఒక వ్యక్తి తప్ప. ఎవరా వ్యక్తి? తెగిన జ్ఞాపకాలు రూపారూపాల దీప్తిధారను మన గంతంలోకి స్మృతి బింబాలుగా రసరేఖలను సృష్టిస్తాడు. ఇంకా అడిగితే Blue Blooms ను Grey and Green తో కలిపి Her life యొక్క జీవితాన్ని Biosymphony పలికిస్తాడు. ఎవరా వ్యక్తి? ... నిజంగా అతడే ... అతనొక్కడే అలా వ్రాయగలడు ... అలాగే వ్రాస్తాడు.

గుంటూరు జిల్లా తుమ్మపూడి గ్రామంలో 1914లో రైతు కుటుంబంలో పుట్టాడు శ్రీ సంజీవదేవ్. అనుభవాలను, అనుభూతులను అక్షరీకరించడం, చిత్రీకరించడం తెలిసిన ప్రజ్ఞాశాలి. మేజికల్ థింకింగ్‌లో హెర్మన్ హెస్‌తోనూ, ఫ్రీ థింకింగ్‌లో జిడ్డుకృష్ణమూర్తిగారితోనూ పోల్చదగిన వ్యక్తి. కళాపాసనలో ఆనందకుమారస్వామితోనూ చార్లెస్‌ఫ్రేబ్రీలతోనూ ఏమాత్రం తీసిపోడు.

మనిషి చేత సృష్టించబడిన దైవంకన్నా, దైవం సృష్టించబడిన మనిషి అంటేనే మక్కువ ఎక్కువ. ఆయన క్రోడీకరించుకున్న జీవితపు విలువలకు ఆత్మ సౌందర్యమే ఆధారం. కృత్రిమ నీతి, నియమాలకన్నా ఆత్మయొక్క పరిశుద్ధత, పవిత్రతయే ఆయనకు ముఖ్యం. మనిషిని చూసి మనిషి భయపడటం కాదు భయపడవలసినది, తనలోని మనిషికే తాను భయపడాలి అంటారాయన.



"బయోసింఫనీ"– ఏడు అధ్యాయాల ఆంగ్ల గ్రంథంలో జీవితాన్ని సమగ్రంగా విశ్లేషించారు. తన దృష్టిలో మనిషి అంటే ఏమిటో సమగ్రంగా చర్చించారు. ఈ పుస్తకానికి ముందుమాట ప్రొ॥ కె. సచ్చితానందమూర్తిగారు వ్రాశారు. ఆయ వ్రాస్తూ– "Shri Sanjiva Dev calls his ideal "Psycho- human" society and philosophy "Psycho-humanism", which he says, is different from other types of humanism and religion, as it culminates is a superconsious state is which supreme delight, spontaneity and freedom are enjoyed" అంటారు.

దేవ్‌గారు ఈ పుస్తకానికి "బయో సింఫని" అని నామకరణం చేశారు. లయ బద్ధమైన భౌతిక, సమ్మేళనం. మానవ వాదాన్ని మరింత ముందుకు తీసుకుపోయే మార్గం. ఇందులో మానవవాదం గురించిన దేవ్‌గారి అభిప్రాయం "మానవ మేథస్సుకు మానవవాదం విలువ ఇస్తుంది. అదే విధంగా రమణీయతకు సైకోమానవవాదం విలువ ఇస్తుంది. మానవ మేథస్సుపై ముద్రవేస్తూ మానవ జీవితం రమణీయతను

అక్కినేనితో సంజీవదేవ్



దృశ్యాల గంభీర, లలితమైన సుందర ముద్రలు వేయగలిగాయి. కంటికి కనిపించే సంగీతం అంటూ చెప్పారు.

దేవ్‌గారి మద్రాను ప్రయాణాలు అనిబిసెంటు, జిడ్డుకృష్ణమూర్తితో పరిచయం, ఆయన జీవన విధానంలో మార్పులు తెచ్చాయి. దేవ్‌గారి పదునాలుగవ ఏటనే రామతీర్థగారితో పరిచయం హిమాలయాలు చూడాలనే ఆకాంక్ష పెరిగింది. ఈ ప్రయాణాలలోనే ప్రేమ్‌చంద్, అసిత్‌కుమార్ హల్దర్, రవీంద్రుడు, నికోలస్ రోరిక్ కుటుంబం పరిచయం పెరిగింది. ఈ యాత్రలు చిత్రకళ, సాహిత్యం పట్ల ఉన్నత ఆలోచనలు కలిగేలాగా చేయగలిగాయి.

విస్మరించని ధోరణిలో సాగిపోవాలంటారు దేవ్. మానవ వాదాన్ని సైకోమానవవాదం అశ్రద్ధ చేయదు. ఆమోదిస్తుందని సూత్రీకరించారు.

"హిమాలయాలలోనో, కాశ్మీర్‌లోనో కాక తుమ్మపూడి నేలలో మీరు ఋతువుల అందాన్ని ఆస్వాదిస్తున్నారంటే మీ దృష్టి ఎంత ఆర్టిస్టిక్ డెప్త్ కలిగినదో" అంటూ దేవ్‌ను చలం ప్రశంసిస్తారు. దేవ్ గారి Grey and Green, Blue Blooms, Dust and Mist అన్న ఆంగ్ల కవితా సంపుటాలు సంజీవదేవ్ గారి సాహితీ స్రష్టకు ప్రతిబింబాలు.

బాల్యంలో తనను ప్రేమించేవారు తిరిగిరాని లోకాలకు వెళ్లిపోయినపుడు, అతడు ప్రేమించే స్వభావం కలవాడైతే తీవ్ర ప్రతిస్పందనలు అతని హృదయంలో కలిగి ఒంటరిని చేస్తాయి. దేవ్ తన ఆత్మకథలో ఇలా అంటాడు "అమ్మలేని ఇల్లు చెల్లి ఉన్నప్పుడు అంతగా శూన్యంగా తట్టలేదు. ఇక అమ్మా, చెల్లీ ఉభయలూ లేని ఇల్లు శూన్యంగా తట్టసాగింది", జనన మరణాల మీద తీవ్రంగా ఆలోచించే లక్షణం దేవ్‌లో ప్రారంభమైంది.

అమ్మమ్మ ఊరైన ఓనాయపాలెం, తండ్రిగారి ఊరైన తుమ్మపూడి ప్రయాణం జీవన విధానంలో వచ్చిన మార్పులు. పెదనాన్న గారైన చిన వెంకట కృష్ణయ్యగారు చెప్పిన యోగుల గురించిన వివరాలు, హిమాలయాల విషయాలు, దేవ్‌పై ప్రభావం చూపాయి.

దేవ్‌గారి హిమాలయ ప్రయాణం, ప్రకృతి మైత్రి లభించింది. అంతేకాక అక్కడ మహనీయులు, పఠించిన పుస్తకాలు దేవ్‌గారి సృజనాత్మక వ్యక్తిత్వ వికాసాన్ని మరింత ప్రోది చేయగలిగాయి. చిన్ననాడే హిమాలయాల సౌందర్యం అతన్ని ఆకర్షించింది. ప్రకృతి

ఈ ప్రయాణాల అనంతరం దేవ్‌గారిలో స్థిరమైన ప్రవృత్తి, శాంతమైన మనస్థితీ తత్వసంవేదనా, సృజనాత్మక వికాసం కలిగాయి. ఈ భావాలన్నీ విభిన్న మార్గాలద్వారా దేవ్‌గారి నుండి వెలువడ్డాయి. అవి ఉపన్యానాసాలు కావచ్చు. తెలిసిన వారికి వ్రాసిన లేఖలు కావచ్చు, కవితలు, వ్యాసాల రూపాలు కావచ్చు. ఫొటోగ్రఫీ, చిత్రకళలతో తనలోని మేధోమానవుడు మేల్కొన్నాడు. ఇలా వీటి ఫలితమే "స్మృతిబింబాలు", "గతంలోకి" అన్న సంపుటాలు, "తెగిన జ్ఞాపకాలు", " స్మృతిబింబాలు", గంతంలోకి" ఈ మూడు కలిపి "ఆత్మకథ"గా చెప్పబడుతుంది. తిరపతిలోని "రాజాచంద్ర ఫౌండేషన్" వారు ఇటీవలనే "తుమ్మపూడి" పేరుతో సంజీవదేవ్‌గారి స్వీయ చరిత్రను ప్రచురించారు.

ఎన్నో గ్రంధాలకు పీఠికలు రూపంలో విమర్శ, పరామర్శచేశారు. తన విమర్శను లయాత్మకంగా చెబుతూ "మౌనం అభివ్యక్తమైతే భాష. భాష అవ్యక్తమైతే మౌనం" అంటూ విమర్శ లక్షణ సూత్రాన్ని చెబుతారు.

దేవ్‌గారి కవిత్వం కూడా విలక్షణ పండినదే. పాఠకుని మెదడుకు మేతలా పనిచేస్తుంది కవి హృదయం నుంచి భావం సూటిగా పాఠకుని గుండెలో నాటుకుంటుంది. "జీవన రాగం" అన్న కవితలో దేవ్‌గారి భావన

"తెర కావల
విరాట్ రూపం
తెర కీవల
జీవ స్వరూపం



సంజీవదేవ్ పెయింటింగ్

తెర తెగితే

రెండూ ఒకటే”.

ఇందులో తాత్త్విక మర్మాన్నీ చెబుతారు. ఆత్మ ఒక వైపు పరమాత్మ మరోవైపు. ఏ క్షణాన ఏ మార్పు జరుగునో ఎవరూ చప్పలేరు. కానీ మార్పు తథ్యం. దేవ్‌గారు కవిత్వాన్ని ఆత్మానందం కోసం రచించారనవచ్చు.

దేవ్‌గారి చిత్రాలు–చిత్రాలలో రూపం నిమిత్త మాత్రంగా ఉంటే, రంగు ప్రధానంగానూ, రూపచిత్రం తీరు భావానుబంధంగానూ ఉంటుంది. వర్ణరచన సర్వస్వతంత్రంగా ఉంటుంది. కుంచె కన్నా ప్యాలెట్ నైఫ్‌ను ఎక్కువ వాడతారు. వాటర్ కలర్ మాధ్యమంలో అధికచిత్రాలు వేశారు. పేస్టల్స్‌లోనూ, ఆక్రిలిక్స్‌తోనూ చిత్రించారు.

పాఠశాలకు వెళ్లి విద్యను అభ్యసించలేదు. ముఖేముఖ సరస్వతీ అన్న సూత్రం ఆధారంగా తన జీవన ప్రయాణంలో కలిసిన వ్యక్తులు, చదివిన పుస్తకాలతో స్వీయజ్ఞానాన్ని పొందిన స్వయం అభ్యసన కళాహృదయుడు సంజీవదేవ్. బెంగుళూర్‌లో గల “ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ వరల్డ్ కల్చర్” సభ్యునిగా, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, లలిత కళా అకాడమీలలో గౌరవ సభ్యునిగా పనిచేశారు. “తెలుగు విజ్ఞాన సర్వస్వం” గ్రంథరూపకర్తలలో ఒకరిగా ఉన్నారు.

విషయాన్ని సరళంగా వివరించే దేవ్‌గార్ ఆగష్టు25, 1999లో మరణించారు. కళారచనలో విశేషకృషి చేస్తున్న వారికి డా॥సంజీవదేవ్‌గారి అవార్డును ఇవ్వడం జరుగుతోంది. దేవ్ రచనలు అన్నిటినీ ప్రచురించాలని సంజీవదేవ్ ఫౌండేషన్ తెనాలి వారు కృషి చేస్తున్నారు.

ఈ ఫౌండేషన్‌లో దేవ్‌గారి సతీమణి శ్రీమతి సులోచనా సంజీవదేవ్‌గారు అధ్యక్షులుగాను, శ్రీ యడ్లపల్లి వేంకటేశ్వరరావుగారు కార్యదర్శిగానూ, ఇతర ప్రముఖులు సభ్యులుగా కృషి చేస్తున్నారు.






వ్యాసరచయితకు సంజీవదేవ్ రాసిన ఉత్తరం



L. R. Venkata Ramana
S/o Sri L. Satyanarayana
2/159-A, 11-Road
New Town
ANANTAPUR
PIN 515001

Tummapudi
522 330

22.4.91

వెంకటరమణా,

సంజీవదేవ్

# చిత్రకారుడు "ఎట్గర్ వాల్టర్"

-బాలి

***నాకు కార్టూన్లంటే చాల చిన్న చూపు ఉండేది ఒకప్పుడు. ఆ ఒకప్పుడు ఎప్పుడంటే రెండు దశాబ్దాల కిందటన్నమాట. అప్పటిలో ఆంధ్రపత్రిక వారు ప్రతి రెండు వారాలకూ కార్టూన్ పోటీ పెట్టి, అందులో ఆయా తేదీలలోగా వచ్చేవాటిని పరిశీలించి అందులో ఉత్తమంగా ఉన్నదానికి మొదటి బహుమతి అని ప్రకటించేవారు. ప్రయత్నిద్దాం. అయినా గియ్యడం ఎంత సేపు అనుకున్నాను. ప్రయత్నిస్తున్నకొద్దీ దానిలోని లోటుపాట్లు తెలియవచ్చాయి. 25/- రూ॥ మొదటి బహుమతి, అది ఆ రోజుల్లో తక్కువేం కాదు. వరుసగా మూడు వారాలు నా కార్టూన్లే మొదటి బహుమతి గెలుచుకున్నాయి. ఇంకేం సరదా పెరిగింది.***



అది ఔత్సాహికులను ప్రోత్సహించడమన్నమాట. అసలు ఐడియాలు ఎలా వస్తాయి? చుట్టూ ఉన్న వాతావరణం నుండి హ్యూమర్‌ని వెతుక్కోవడమే అన్నది అప్పుడే తెలిసింది. అలాంటి వెతుకులాటలో... నేను ఒక రోజు సాయంకాలం శివాలయానికి వెళ్లాను. పూజారి దేవునికి హారతి ఇచ్చి శఠగోపం భక్తుల శిరస్సున పెడుతున్నాడు. నా ముందున్న కుర్రాడు క్రాఫ్ చాలా అందంగా ఉంది. నూనె రాసి, నీళ్లు రాసి కష్టపడి దువ్వినట్టున్నాడు, "క్రాఫ్ చెరగకుండా శఠగోపం పెట్టండి స్వామీ" అన్నాడు. పంతులుగారు నవ్వారు. నాకూ నవ్వొచ్చింది. అదే కార్టూన్‌గా గీసి పంపాను బహుమతి వచ్చింది. అలాగే మరి రెండు కూడా!!

కార్టూన్ల మీద అభిమానం ఏర్పడింది.

దానిలో గల కష్టమూ తెలిసింది.

లోటుపాట్లు తెలుస్తున్నకొద్దీ కార్టూన్ల మీద చిన్నచూపు తగ్గి అనుకున్నంత తేలిక కాదనిపించింది.





గీసిన కార్టూన్ దానిపై రాసిన కాప్షన్ కలిసిపోవాలి. అప్పుడే అది మంచి కార్టూన్ అవుతుంది.

కొంతమంది కాప్షన్ లేని కార్టూన్‌లే మంచివంటారు

ఇంకొందరు వాడుక పదాలలో అద్భుతమైన మాటలు రాస్తారు. ఇలా ఇంగ్లీష్ కార్టూన్‌లలోనూ ఉంది. అయితే ఎవరి ఉద్దేశ్యం వారిది.

ఒక్క కార్టూన్‌లోనే అంటే ఒక్క బొమ్మలోనే హ్యూమర్‌ని పండించిన వారున్నారు. రెండు మూడు బొమ్మలు వేసి బాక్స్‌లు కడుతూ చివరి బొమ్మలో హ్యూమర్‌ని పండించినవారూ ఉన్నారు. అంటే ఆ చివరి బొమ్మలో స్పార్క్ ఇస్తారన్నమాట. అయితే ఇవన్నీ కార్టూన్ స్టైయిల్‌లోని రకాలు.

ఒక్క బొమ్మ మాత్రమే వేసి, మన బుర్రకో ఫజిల్ వంటిది పెట్టి, దాన్లోనే చిత్రమైన కవిత్వాన్నీ జోడించాడు. "ఎడ్గర్ వాల్టర్" రష్యన్ చిత్రకారుడు, సున్నితమైన రేఖలు, ఇంకా సున్నితమైన భావాలు.

"జోక్ అంటే మనకు గుడ్ మేనర్స్ నేర్పే కేర్‌టేకర్, అందుకే చదివీ, వినీ ఆనందించాలి. దానికి కార్టూన్ వంటి సంక్షిప్త వ్యంగ్య చిత్రం తోడయితే ఇంక చెప్పవలసిన పనిలేదు. రాజకీయ వ్యంగ్యచిత్రాల పాత్ర నాకు తెలుసు. అదొక బెత్తం. ఆ బెత్తం పని సమాజంలోని తప్పులను ఎత్తి చూపడం, మృదువుగా విమర్శించడం, దారి తప్పిన వ్యవస్థను, నాయకులను అదుపులో పెట్టడం, వారి కర్తవ్యాన్ని ఎరుకపర్చడం... కార్టూన్‌లనుచూసి అందులోని వ్యంగ్యానికి ఉక్కిరి బిక్కిరి అయి నవ్వుతోపాటు, కన్నీరు కార్చిన వారిని నేనెరుగుదును..."

ప్రియమైన పాఠకులారా! ఎడ్గర్ వాల్టర్ పుస్తకాన్ని తిరగెయ్యండి. మీమీ ఆలోచనా పరిమితులమేరకు అవధులమేరకు చూసి ఆనందించండి. కమ్మటి సంగీతంతో పాటు చిన్న చిరునవ్వు మీ పెదిమల మీదకు వస్తుంది". అంటాడు ఆయన మిత్రుడూ ప్రతికాధిపతీ అయిన "హెండుహేకర్" అతని కార్టూన్ పుస్తకానికి ముందు మాటరాస్తూ.

ఈ పుస్తకాన్ని ఎప్పుడో కొన్నాను. షెల్ఫ్‌లో కనపడి నప్పుడల్లా పేజీలు తిరగేస్తుంటాను. ఇతని కార్టూన్లు ఒకటి రెండు నా కార్టూన్ సంకలనంలోనూ వాడాను. చదివితే మన సంతా సరదాగా అయిపోతుంది. ముఖ్యంగా ఆ గీతలు వాతావరణమూ, గురుడు ఏ పెన్ను వాడాడో గానీ చక్కటి బాలెన్స్, తనమీద తను వేసుకున్న కేరికేచర్‌తో కూడిన కార్టూన్‌నూ.... తలకాయలు (ఆలోచనలు) బయటే బల్లమీద ఉంచి సమావేశాలకు వెళ్లే నాయకులూ...

మగవాడికి నెట్ వేసే అమ్మాయిలూ– అలాగే అమ్మాయిలను చూసి వెర్రెక్కే మగజాతీ

భర్తను అనుక్షణం అనుమానంతో వెంటాడే భార్యామణీ

పిల్లీ ఎలుకల మధ్య సాన్నిహిత్యం ఇలా ప్రతి కార్టూన్లు ఓ అందమైన కవిత.



# మనిషి మనసుపై మదనుడి గెలుపు 'తొలివలపు'



ఆడ-మగ ఇరువురి మనసుల కలగలుపు తొలివలపు
మనిషి మదిలో మదనుడి ఆదికదలిక తొలివలపు
స్త్రీ పురుష ప్రణయానికి తొలిపిలుపు తొలివలపు
ప్రకృతి-పురుషుల ప్రాకృతిక ఈప్సితము తొలివలపు
మానవ జీవనంలో మధురమైన మరపురాని మలుపు తొలివలపు
మానవుని శరీరంలో అశరీరుని విరిశర పరంపరల పర్వం తొలివలపు
మదనుడి ఇల్లు ఆశల హరివిల్లు విరివానల జల్లు తొలివలపు
**కొందరి తొలివలపు వాంఛల వల**
**అది ఓ రంగుల కల**
నిజమైన వలపు వయసుకు, కులమతాలకు
కలిమిలేములకు, వేష భాషలకు ఇతర తారతమ్యాలకు వుంటుంది ఆ వల
ఆపజాలదు తొలివలపుని ఎట్టి గట్టి కాపలా
తొలివలపు మానవ హృదయాలపై మరుడు విసిరినవల
వలపులో దాగుంటాయి...
సుమశరుడు పెట్టే యమశరలు
వలపు వలదని వారించే వారి అడ్డుతెరలు
చందమామను చూసినా, చల్లగాలి తాకినా
మదిలో మరులు, మధుర జ్ఞాపకాల దొంతరలు
ప్రియులకు వారి కలయిక పైనే ధ్యాసమరలు
మేలిమి బంగారు మేని మిసమిసమసలు
గుండె నరాల గుసగుసలు
వలపున్ననాడు రుచించవు రాజ్యాలు - రుచికరమైన భోజ్యాలు
పార్వతీపరమేశ్వరులు, సీతారాములు, రాధాకృష్ణులు
శకుంతలా దుష్యంతులు తొలివలపుల సాక్ష్యాలు
అలౌకికానందమే వీరి వలపుల లక్ష్యాలు
ప్రేమికులను బ్రతికించేది శ్వాస కాదు - ఒకరిపై ఇంకొకరి గల ధ్యాస
నిజంకావాలి వలపుకల
వలపు విఫలమైననాడు హృదయాలు విలవిల
వలపెరుగని మనిషి బ్రతకాలి కలకాలం ఏకాకిలా
వలపు వలయంలో భూవలయం కావాలి ప్రేమికుల కోవెల
మదనుడి సదనాలు ప్రేమికుల వదనాలు
తొలివలపుపై కవుల కల్పనలకందని వేలవేల కథనాలు
సుఖాంతం, దుఃఖాంతం ఏదైనాగాని తొలివలపు ఆద్యంతం రసవంతం

బి.యం.పి.సింగ్ (సాయిప్రసన్న)
M.A. (P.A.), M.A. (Hindi), M.A. (Litt.), R.B.P. B.Ed.,



# జయదేవుని అష్టపదులు

- మాకినీడి సూర్య భాస్కర్

## దశావతార పదావళి - ప్రళయ పయోధి జలే!

రాధా కృష్ణుల ప్రణయ పయోధి జల పానం చేసి పావన చరితుడైనవాడు జయదేవుడు. కావ్యాన్ని మంగళాదికంగా, శ్రీకారం చుట్టకుండా ... మంగళ కరమైన భావాన్ని తెలియజెప్పే శ్లోకంతో ప్రారంభిస్తున్నారు.

మేఘైర్మేదురమమ్బరం వనభువశ్శ్యామాస్తమాలద్రుమైః
నక్తం భీరురయం త్వమేవ తదిమం రాధే! గృహంప్రాపయ
ఇత్థం నందనిదేశతశ్చలితయోః ప్రత్యధ్వకుంజద్రుమం
రాధామాధవయోర్జయన్తి యమునాకూలే రహః కేళయః

పిల్లలు ఎదిగి తామంత పెద్దవారైనా, పెద్దల కెప్పుడూ వారి బాల్యంలో సందిట జేర్చుకు లాలించిన పిల్లవారిగానే ముద్దుగా, గోముగా కనిపిస్తారు. నందుడి దృష్టిలో యశోదానందనుడూ అంతే. కృష్ణుడ్ని యమునాతీరానికి తీసుకు వచ్చిన రాధను నిష్ఠురమాడుతున్నాడు.

"చీకటి పడుతోంది. చిన్న పిల్లాడు చీకటంటే భయపడడూ! ఒక్కడూ పోవాలంటో... అందునా నది ఒడ్డున దారిలో అడవిలా పెరిగిన నల్లని కానుగ చెట్ల మధ్యనుంచి పోవాలంటే పిల్లలెవరైనా భయపడడం సహజం."

"పైన ఆకాశంలో నల్లని మబ్బులు దట్టంగా పరచుకుని ఇంకా చీకటైపోతోంది. చిన్న పిల్లాడు చీకటంటే భయపడడూ! నువ్వు తీసుకొచ్చావు కనుక నువ్వే అతడ్ని క్షేమంగా ఇంటి దగ్గర దించాలి సుమా!" అంటూ కృష్ణుడ్ని రాధకు అప్పగించాడు.

రాధను చెడామడా నాలుగు తిట్టి తానే ఆ బాధ్యత తీసుకునేవాడే నందుడు. ఏ కార్యభారమో ఉండడంవల్ల ఆ విధంగా చేసి ఉండకపోవచ్చును. రాధాదేవికైతే, నందుడి మాటలు అమృతోపమానాలే అయ్యాయి. మసక మసక చీకట్లోయమునానదీ సైకతతీరంలో చల్లనిగాలి మేనుసు తాకి పరవశింపజేస్తున్న తరుణంలో ఒంటరిగా కృష్ణుడితో విహారం. అందుకేగా, అసలు తామొచ్చింది కూడా!

విప్రలంభ అయిపోయింది రాధ.ప్రేమ, కోరిక...తీరబోతోందనే తహతహ...దడదడ కొట్టుకుంటున్న గుండెలు...వెరసి-ఏదో చెప్పనలవి కాని భయం. దాన్ని కప్పివేసిన ఉత్సాహం...ఉన్నట్టుండి ముంచుకొచ్చిన సిగ్గు...ఈర్ష్యాసూయావిరహ తాపాల్లో చిక్కుకుని ఏదో తెలియని చాపల్యంలో కొట్టుకుంటున్న మనసు ఊగిసలాడుతూ!

చిత్ర విచిత్రమైన మనఃస్థితి. శృంగార రసస్థాయీ భావమంటే అదేనని తెలియని రాధ, ఆ రాత్రి వేళ యమునానది ఇసుక తిన్నెలపై చల్లని గాలి మేనుని చుట్టి మేలమాడుతుంటే ... ప్రక్కన ప్రియ సఖుడితో... కారుమబ్బులు క్రమ్ముకున్న ఆ నల్లని చీకట్లో, ఇంకా నల్లగా కనబడుతున్న కానుగ చెట్ల చాటున దొరికిన ఏకాంతంలో...విరహోత్కంఠితయై!

రాధ వెంట కృష్ణుడే వెళ్తున్నాడో...కృష్ణుని వెంబడే రాధ పోతోందో...ఆ చీకట్లో ఎవరికి కనబడుతుంది?

ఒక్కమాటలో చెప్పాలంటే, మోహం వెంట మోహం దాసోహమై ...సమ్మోహనమై!!

ఇదేనా జయదేవుడు చెప్పదలచుకున్నది?

దట్టంగా పట్టిన మబ్బులు. కళ్ళముందు ఏకాంతంలో నల్లని మబ్బులాంటి కృష్ణుడు రాధామానసాన్ని దట్టంగా కమ్ముకున్నాడు. అడవిలా గుబురుగా పెరిగిన నల్లని కానుగ చెట్లు జ్ఞానేంద్రియాల్ని మలినపరుస్తున్న శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలనే విషయ వాసనలు. రాత్రి, కానుగచెట్లు, మబ్బులు ... అంతా చుట్టూరా పరచుకున్న నల్లదనం. అదే మనసును ఆవరించిన అజ్ఞానం. తెలుసుకోవలసిన దానిని తెలుసుకోలేకపోతున్న అంధకారం. అదే సంసార బంధం. మాయ. ఈ యానంలో ఎన్నో మజిలీలు. దారిలో ఒక్కో పొదరింట్లో సాగిన రాధామాధవ రహస్య ప్రణయ కేళీకలాపం! హృదయోల్లాస ప్రేమ తన్మయ సల్లాపం!!

ఆ కలాపంనుంచీ...ఆ సల్లాపం నుంచీ బయటపడడమే మోక్షం. దానినే ఎరుకపరుస్తూ గీత గోవింద కావ్యాన్ని, తన ఎదుట తన ఇల్లాలు ప్రేరణ కలిగిస్తూ నృత్యం చేస్తున్న సమయాల్లో ... మదిలో నృత్యం చేస్తున్న భావాలకు రసరమ్యమైన అక్షరాకృతినిస్తూ అష్టపదులుగా వెలయించారు భక్త జయదేవులు. ఆమె నృత్యంలో తన కళ్ళ ఎదుట సరస్వతీదేవినే ప్రత్యక్షంగా చూస్తూ కావ్యమల్లారు పుంభావ సరస్వతీ రూపంలో జయదేవులు. అందుకే తనను తాను 'పద్మావతీ చరణచారణ చక్రవర్తి'గా అభివర్ణించుకున్నారు. మరో శ్లోకంలో అదే చెబుతున్నారు.

> వాగ్దేవతా చరిత్ర చిత్రిత చిత్తసద్మా పద్మావతీ చరణచారణ చక్రవర్తీ
> శ్రీ వాసుదేవ రతికేలి కథాసమేత మేతం కరోతి జయదేవ కవిః ప్రబంధమ్॥

వాగ్దేవి సరస్వతీ మాత చరిత్రని కుడ్యచిత్రాలుగా చిత్రించుకున్న విశాల మనఃగేహం జయదేవ కవి హృదయపు లోగిలి. తాను రాస్తున్న రాధామాధవీ యమైన ప్రేమ గీతాలకు సతి పద్మావతి చేత గజ్జె కట్టించి నృత్యమాడించి, ఆ నృత్య భంగిమల్లోంచి తిరిగి ప్రేరణ పొంది, మనసులో పెల్లుబికి వచ్చే భావాలను అక్షరనృత్యంగా...హృద్యంగా మలచిన సహజ కవిచక్రవర్తి ... పద్మావతీ చరణచారణ చక్రవర్తి కూడా!

కృష్ణుడికి రాధ; జయదేవుడికి పద్మావతి! సతి పద్మావతి పాదాలను సపర్యకంగా పూజించిన జయదేవుడు, తమ ప్రణయాన్నే అష్టపదులుగా మలచి పద్మావతికే కాక అందరికీ ఇష్టసఖు దయ్యాడంటే అతిశయోక్తి ఎంతమాత్రమూ కాదు. ఇద్దరిదీ పద సంపదే! ఒకరిది కాలి అందియల్ని ఘల్లు ఘల్లుమనిపించిన పద సంపద అయితే, మరొకరిది రాధామాధవుల ప్రేమ కలాపి కల్లాపంలో మమేకం చేసి హృదయాలను ఉర్రూతలూగించిన పద సంపద. పదసంపద్విభవైక మూర్తులే ఇద్దరూ; జీవితాల్ని ధన్యం చేసుకున్న మూర్ధన్య తాపసులు. జయదేవుడంటారందుకే మరో శ్లోకంలో, తన పదాలు 'మధుర కోమల కాన్త పదావళు'లని.

> యది హరిస్మరణే సరసం మనో యది విలాసకలాసు కుతూహలమ్
> మధుర కోమలకాన్త పదావళీం శ్రుణు తదా జయదేవ సరస్వతీమ్॥

హరిస్మరణమనే 'సరసం'లో మునిగి తేలే భక్తులు 'మధుర కోమల కాన్త పదావళు'లతో కూడిన జయదేవుని అష్టపదులు విని తరిస్తారని కోరుకుంటు న్నారు జయదేవులు. ఈ సమాసంతో తన కవితాగుణాన్ని తెలియజేస్తున్నారు. మధురమైన, కోమలమైన పదాలతో కూడిన కవిత్వం. సమకాలికుల ప్రశంస పొందడం చాలా అరుదైన విషయం. అయితే అది జయదేవులకు దక్కింది.

> వాచః పల్లవయత్యుమాపతిధరస్సందర్భశుద్ధిం గిరామ్
> జానీతే జయదేవ ఏవ శరణః శ్లాఘ్యోదురూహ్యద్రతేః
> శృంగారోత్తర సత్ప్రమేయ రచనైరాచార్య గోవర్ధన
> స్పర్ధీకో2పి న విశ్రుత శ్రుతిధరో ధోయీ కవిక్ష్మాపతిః

లక్ష్మణసేనుని ఆస్థానంలోని పండితులు తనని ప్రస్తుతిస్తూ చెప్పిన శ్లోకమిది; మొదటి అష్టపదికి ముందే దీన్ని పొందుపరిచారు జయదేవులు.

భావగర్భితమైన విశేషణాలతో గద్యరూపంలో కవిత్వం చెప్పగల మేటి ఉమాపతిధరుడు. సందర్భాని కనుగుణమైన పదగుంఫనం జయదేవుని నైపు ణ్యం. లోతైన భావాలతో ప్రబంధాలు అల్లగల సమర్థుడు శరణుడు. శృంగారం ప్రధానంగా కావ్యాన్ని మధురంగా, దోషరహితంగా అనన్యంగా సంతరించగల కవి గోవర్ధనాచార్యుడు. పండిత కవి శ్రుతిధరుడు. కవిరాజు ధోయీ.

ఈ శ్లోకం భావం స్థూలంగా ఇదే. ఐతే తరచి తరచి ఆలోచిస్తే తేలే విషయాలివీ. ఉమాపతివి లోతైన భావాలే కాని, వాగాడంబరమైన భాషతో వ్యర్థ పదాలతో పేలవంగా ఉంటాయి. అతని సచ్చిత్ర కావ్యమే అందుకు నిదర్శనం. గొప్ప పదాలైతే వేయగలడుగాని, శరణుడి కవిత్వం లోతు తక్కువ. శృంగారాన్ని ప్రధానం చేసే గోవర్ధనుడి కవిత్వం నవరసభరితంగా ఉండదు. ధారణా రాక్షసుడైన ధోయీ ఇతరుల కవిత్వాన్ని అప్పజెప్పగలడే కాని, సొంతంగా రాయగలిగిన వాడు కాదు. ఇందరి సమకాలీనుల్లోనూ రసాలంకార సుశోభితమైన, సహృదయ హృదయానంద కారకమైన రచనను జయదేవుడు మాత్రమే చేయగలడన్నది అంతరార్థమని పండితులంటారు.

ఇంత సుదీర్ఘమైన ఉపోద్ఘాతం తర్వాత ఒకటవ అష్టపదిని మొదలు పెడుతున్నారు జయదేవులు.మాళవ రాగంలో రూపక తాళంతో సాగే ఈ అష్టపది చాలా జనప్రియమైనది. ఎందుకంటే, దీనిలో దశావతారాలను కీర్తించారు. 1961లో ఎన్.ఎ.టి. సంస్థ పతాకంపై నందమూరి తారక రామారావు, మొదటిసారి దర్శకత్వం వహిస్తూ నిర్మించిన చలన చిత్రం 'శ్రీ సీతారామ కళ్యాణం'లో సముద్రాల, గాలి పెంచల సంగీత సారథ్యం వహించగా, శ్రీరామ జననానికి ముందు ఈ అష్టపదిని నృత్యదృశ్యీకరణ చేశారు. దీనితొ ఈ అష్టపది తెలుగు శ్రోతలకు మరింత ప్రాచుర్యంలోకి వచ్చింది. ఇలా సాగుతుందీ అష్టపది.



ప్రళయపయోధిజలే ధృతవానసి వేదమ్
విహిత వహిత్ర చరిత్రమఖేదమ్
కేశవ! ధృతమీన శరీర! జయ జగదీశ హరే!

ఒకటై జలప్రళయ మేర్పడి సముద్రాలన్నీ లోకాలను ముంచెత్తినప్పుడు వేదాలను నీ మూపున కట్టుకుని చేపలా ఈదుకుంటూ వాటిని రక్షించిన శ్రీకృష్ణా! కేశవా! జగదీశా! హరీ! నీకు జయమగు గాక!

క్షితి రతివిపులతరే తవ తిష్ఠతి పృష్ఠే
ధరణి ధరణ కిణ చక్ర గరిష్ఠే
కేశవ! ధృతకచ్ఛపరూప! జయ జగదీశ హరే!

పాతాళంలోకి దిగబడిపోతున్నప్పుడు తాబేలు అవతారమెత్తి నీ వీపుపై సమస్త భూమండలాన్నీ మోస్తూ పైకి తీసుకువచ్చిన శ్రీకృష్ణా! కేశవా! జగదీశా! హరీ! నీకు జయమగు గాక!

వసతి దశనశిఖరే ధరణీ తవ లగ్నా
శశిని కళఙ్కలేవ నిమగ్నా
కేశవ! ధృత సూకర రూప! జయ జగదీశ హరే!

మరోసారి ఆదివరాహ అవతారమెత్తి భూమిని నీ రెండు కోరల మధ్య పట్టుకుని పైకి లేపి రక్షించిన శ్రీకృష్ణా! కేశవా! జగదీశా! హరీ! నీకు జయ మగు గాక!

తవ కరకమలే నఖమద్భుత శృఙ్గం
దళిత హిరణ్యకశిపు పర భృఙ్గమ్
కేశవ! ధృత నరహరి రూప! జయ జగదీశ హరే!

నరసింహావతారమెత్తి నీ వాడియైన గోళ్ళతో దుర్మార్గుడైన హిరణ్య కశ్యపుని శరీరాన్ని చీల్చి చంపిన శ్రీకృష్ణా! కేశవా! జగదీశా! హరీ! నీకు జయ మగు గాక!

ఛలయసి విక్రమణే బలి మద్భుత వామన!
పదనఖ నీరజనిత జనపావన
కేశవ! ధృత వామనరూప! జయ జగదీశ హరే!

వామనావతారమెత్తి మూడు అడుగుల నేల దానమడిగి, త్రివిక్రమునిలా ఎదిగి భూనభోనాంతరాలూ ఆక్రమించి బలి చక్రవర్తిని పాతాళానికి పంపిన శ్రీకృష్ణా! కేశవా! జగదీశా! హరీ! నీకు జయమగు గాక!

క్షత్రియ రుధిరమయే జగ దపగత పాపం
స్నపయసి పయసి శమిత భవతాపం
కేశవ! ధృత భృగుపతి రూప! జయ జగదీశ హరే!

పరశురామావతారమెత్తి ఇరువదొక్క మార్లు క్షత్రియులైన వారందరినీ ఓడించిన శ్రీకృష్ణా! కేశవా! జగదీశా! హరీ! నీకు జయమగు గాక!

వితరసి దిక్షు రణే దిక్పతి కమనీయం
దశముఖ మౌళిబలిం రమణీయం
కేశవ! ధృత రామ శరీర! జయ జగదీశ హరే!

రామావతారమెత్తి దనుజుడు రావణాసురుడి పది తలలూ నరికి కమనీయమైన పది మంది దిక్పాలురకీ రమణీయంగా బలి ఇచ్చి వారిని సంప్రీతుల జేసిన శ్రీకృష్ణా! కేశవా! జగదీశా! హరీ! నీకు జయమగు గాక!

వహసి వపుషి విశదే వసనం జలదాభమ్
హలహతి భీతిమిలిత యమునాభమ్
కేశవ! ధృత హలధర రూప! జయ జగదీశ హరే!

బలరామావతారమెత్తి నాగేటి దెబ్బతో భూమిని చీల్చి యమునానదిని పంట పొలాల్లోకి మళ్ళించిన శ్రీకృష్ణా! కేశవా! జగదీశా! హరీ! నీకు జయమగు గాక!

నిన్దసి యజ్ఞవిధే రహహ శ్రుతిజాతమ్
సదయ హృదయ దర్శిత పశుఘాతమ్
కేశవ! ధృత బుద్ధ శరీర! జయ జగదీశ హరే!

బుద్ధావతారమెత్తి అహింసను పరమ ధర్మంగా నిరూపించి జంతు బలులను పరిహరించిన శ్రీకృష్ణా! కేశవా! జగదీశా! హరీ! నీకు జయమగు గాక!

మ్లేచ్ఛనివహనిధనే కలయసి కరవాలమ్
ధూమకేతు మివ కిమపి కరాలమ్
కేశవ! ధృత కల్కి శరీర! జయ జగదీశ హరే!

మ్లేచ్ఛుల కారణంగా జరగనున్న మారణహోమంనుంచి లోకాన్ని సంరక్షించడానికి కల్క్యవతార మెత్తనున్న శ్రీకృష్ణా! కేశవా! జగదీశా! హరీ! నీకు జయమగు గాక!

శ్రీ జయదేవ కవే రిద ముదిత ముదారమ్
శ్రుణు శుభదం సుఖదం భవసారమ్
కేశవ! ధృత దశవిధ రూప! జయ జగదీశ హరే!

లోక రక్షణార్థం దశావతారాలను ధరించిన శ్రీకృష్ణా! కేశవా! జగదీశా! హరీ! నీకు జయమగు గాక!

ఈ అష్టపదిలోని కొన్ని కవితాంశాల్ని, విశేషాంశాల్ని వివరించుకోవాలి. ప్రతి పదంలోనూ తదవతార రూపాన్ని కీర్తిస్తూ "శ్రీకృష్ణా! కేశవా! జగదీశా! హరీ! నీకు జయమగు గాక!" అని మంగళాశాసనం చేశారు జయదేవులు. కః+ఈశః – కేశవ; 'కః' అంటే బ్రహ్మదేవుడు. 'ఈశః' అంటే ఈశ్వరుడు. బ్రహ్మ మహేశ్వరులిద్దరూ ఏక శరీరకంగా ప్రభవించిన ప్రభువు 'కేశవుడు'. జగత్తుకే ఈశుడు జగదీశుడు. భక్తుల కష్టాలు హరించేవాడు 'హరి'. అట్టి "శ్రీకృష్ణా! కేశవా! జగదీశా! హరీ! నీకు జయమగు గాక!" అని సంబోధిస్తూ జగత్కళ్యాణాన్ని కాంక్షిస్తున్నారు జయదేవులు.

ఆది వరాహమై భూమిని ఎత్తినప్పుడు కోరల కొసలు చంద్రుడిలో కళంక రేఖల్లా మెరుస్తున్నాయనడం, నరసింహావతారంలో తామరతూళ్ళ వంటి కోమల హస్తాలకు వాడియైన గోళ్ళు ఎక్కడివనడం కవితాంశలు. వామనుడి ఒక పాదం భూమండలమంతా వ్యాపించింది. రెండో పాదాన్ని ఆకాశంలోకి చాచినప్పుడు అది బ్రహ్మలోకం చేరితే, అప్పుడు దాన్ని బ్రహ్మ దేవుడు అభిషేకించాడు. కనుకనే 'బ్రహ్మ కడిగిన పాద'మైంది. 'బ్రహ్మము తానే ఐన పాద'మైంది. అలా కడిగినప్పుడు భూమ్మీదికి జాలువారిన నీళ్ళే గంగానది అయింది. ఇలాంటి విశేషాలు చాలానే చెప్పుకోవచ్చు. కాని స్థలాభావం

సారాంశాన్ని మరోసారి స్మరించి శ్రీకృష్ణునికి నమస్కారం చేస్తూ అష్టపదిని ముగిస్తున్నారు.

వేదానుద్ధరతే, జగన్నివహతే, భూగోళ ముద్బిభ్రత్
దైత్యాన్దారయత్, బలిం ఛలయతే, క్షత్ర క్షయం కుర్వతే
పౌలస్త్యం జయతే, హలం కలయతే, కారుణ్య మాతన్వత్
మ్లేచ్ఛాన్ మూర్ఛయతే దశాకృతికృత్, కృష్ణాయ తుభ్యం నమః

# సంపూర్ణ సంపాదకుడు-నండూరి

**సున్నితమైన పదపొందిక, సముచితమైన వాక్యనిర్మాణం, సమతుల్య ప్రతిస్పందన కలిస్తే నండూరి రామమోహనరావు. సాహితీరంగంలో కొత్త పోకడలకు పునాదిని వేసిన ఆదర్శనీయుడు, సాహితీ ధృవతార నండూరి రామమోహనరావు కలం ఆగింది. పాత తరానికి చెందిన ఒక నక్షత్రం రాలిపోయింది.**



విశ్వరూపం, విశ్వదర్శనం పేరు విన్న వెంటనే గుర్తుకు వచ్చేది నండూరి రామోహనరావు. పత్రికా రంగంలోనే కాక సాహిత్యం, సైన్స్, తత్వశాస్త్రం, అనువాదం, బాలసాహిత్యం వంటి అనేక రంగాలలో విశేషమైన కృషి చేసి అమూల్యమైన రచనలను మనకు అందించారు నండూరి.

కృష్ణాజిల్లా హనుమాన్ జంక్షన్ సమీపంలో ఆరుగొలనులో నండూరి 1927 ఏప్రియల్ 24వ తేది జన్మించారు. బి.ఎ.లో పట్టా పొందిన ఆయన 1947వ సం॥లో ఒక ప్రయివేట్ కళాశాలలో భోదకుడిగా పనిచేసారు. పత్రికారంగంపై మక్కువతో "జన్మభూమి" దినపత్రికలో ఉప సంపాదకునిగా చేరి.




పాత్రికేయునిగా జీవితం ప్రారంభించారు. తర్వాత 1948వ సం॥ ఆంధ్రపత్రికలో చేరారు. 1950వ సం॥ ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రికకు మారారు. 1958-1960 మధ్యకాలంలో ఆ పత్రికకు తాత్కాలిక సంపాదకులుగా మారారు. 1960వ సం॥ ఆంధ్రజ్యోతిలో సహ సంపాదకులుగా చేరినారు. అప్పటి సంపాదకుడు నార్ల వెంకటేశ్వరరావు సహ సంపాదకులుగా పనిచేసిన ఆయన 1976లో సంపాదకుడిగా మారి 1993వ సం॥ రిటైర్ అయ్యారు.

నండూరి రచనాశైలి నల్లేరు మీద నడకవలే సున్నితంగా ఉంటుంది. దాదాపు అర్ధశతాబ్దం పాటు సాగిన ఆయన సాహిత్య రచనా పర్వంలో తెలుగు పదాలు సముద్ర కెరటాల్లా ఎగసి పాఠకులను రంజింపచేసాయనటంలో సందేహం లేదు. తెలుగు బాషపై ఆయనకు అంత పట్టు ఉంది. సాహిత్యంపై అభిలాష, రచనలలో కొత్తదనం చూపటం ఆయనకు వెన్నతో పెట్టిన విద్య ఆయన రాసిన 'విశ్వరూపం' విశ్వదర్శనం పుస్తకాలు ఈనాటికి ప్రజాదరణ పొందుతున్నాయి. ఇవేకాక నరావతారం పుస్తకం ఆయనకు ఎనలేని పేరు తెచ్చింది. మానవ వికాశంపై ఆయన రాసిన శులభయోగ వ్యాసాలు, అక్షరయాత్ర, అనుపల్లవి, చిరంజీవులు, కాంచనదూపం చిలక చెప్పిన రహస్యం, మయూరి




కన్య, ఉషస్విని, బాలరాజు వంటి రచనలు ఎన్నో చేసారు.

రచయితగా, పాత్రికేయుడిగా నండూరి అందుకున్న సన్మానాలు, సత్కారాలు బిరుదులు ఎన్నెన్నో, అందులో ముట్నూరి కృష్ణారావు అవార్డు, జులూరి నాగరాజారావు స్మారక పురస్కారం, ఉగాది వెలుగు, కళాసాగర్, పాత్రికేయరత్న, నెల్లూరు వెంకటరామానాయుడు పురస్కారం, సి.వై. చింతామణి పురస్కారం. ఇవి కాక తెలుగు విశ్వవిద్యాలయం గౌరవ డాక్టరేటు, తాపిధర్మారావు పురస్కారం, అమెరికా అసోసియేషన్ శిరోమణి అవార్డు రాష్ట్రప్రభుత్వ ఉత్తమ పాత్రికేయ అవార్డు అందుకొన్నారు.

ఇంతటి గొప్ప పురస్కారాలు, పొందిన నండూరి తెలుగువాడు అయినందుకు తెలుగువారమైన మనం గర్వించాలి. అంతటి మహోన్నతమైన వ్యక్తి. సెప్టెంబరు 11, 20011వ సం॥ శుక్రవారం రాత్రి 7 గం॥ అనారోగ్యంతో కన్నుమూసారు. అప్పటికి ఆయన వయస్సు 83 సం॥లు. వ్యక్తిగా ఆయన చనిపోయినా ఆయన రచనల్లో, ఆయన ఇప్పటికి, ఎప్పటికి చిరస్థాయిగా మనముందు నిలిచే వుంటారు.

**– విష్ణుభొట్ల రామకృష్ణ**



# పేరులో నేముంది?!



- అమ్మిన శ్రీనివాసరాజు

మనిషిని, జంతువును వేరు చేసేది భాష. అంతటి గొప్ప భావ వ్యక్తీకరణ శక్తిగల మానవునికున్న మరో ప్రత్యేకత "పేరు" సాధారణంగా మానవులకు పేర్లు మొదట స్వభావాన్ని బట్టి ఏర్పాటు చేసినా ఆ పిదప కృతజ్ఞతకు. అభిమానాలకు చిహ్నాలుగా పేర్లు పెట్టుకోవడం సరిపాటి అయ్యింది. క్రమేణా అసలు పేర్లకు, మనుషులకు సంబంధం లేకుండాపోతుంది.

ఏది ఏమైనా పేరుకు మనిషికి సంబంధం లేకుండా వుండదు అదో అవినాభావ సంబంధం. నేటి సమాజంలో కొందరు పేరున్న ప్రముఖులు అసలు పేరు కన్నా కొసరు పేరుతోనే ప్రాచుర్యంలో వున్నారు. అసలు పేరుతో సంబోధిస్తే వారెవరు అనే ప్రమాదం వుంది.

అందుకే 'అరవైనాలుగు కళలు' అంతర్జాల మాసపత్రిక వీక్షక పాఠకుల కోసం ప్రతి మాసం కొందరు ప్రముఖుల అసలు పేర్లు పరిచయం చేయడమే ఈ ప్రయత్న నేపధ్యం...



| | | |
|---|---|---|
| చక్రవర్తి | కొమ్మినేని అప్పారావు | సంగీత దర్శకుడు |
| శోభన్‌బాబు | ఉప్పు శోభనాద్రీశ్వరరావు | సినీనటుడు |
| యం.యం. కీరవాణి | మరకతమణి కీరవాణి | సంగీత దర్శకుడు |
| చండీదాసు | సుబ్రహ్మణ్యేశ్వరరావు | నవలారచయిత |
| చెరబండరాజు | బద్దం భాస్కర్ రెడ్డి | కవి |
| సి.వి. సర్వేశ్వరశర్మ | చావలి వెంకట సర్వేశ్వరశర్మ | సైన్స్ రచయిత |
| కె. రామచంద్రమూర్తి | కొండభట్ల రామచంద్రమూర్తి | పత్రికా సంపాదకులు |







| | | |
|---|---|---|
| వి.వి.గిరి | వరహగిరి వెంకటగిరి | భారత మాజీరాష్ట్రపతి |
| కాళ్ల | కాళ్ల సత్యనారాయణ | చిత్రకారులు |
| మెకాలే | థామస్ బాబింగ్టన్ మెకాలే | ఆంగ్లేయ విద్యాధికారి |
| పైడిశ్రీ | పైడితేలేష్ బాబు | దళితకవి |
| రాధేయ | శేషభట్టర్ నరసింహాచార్యులు | కవి |
| సత్యశ్రీ | జానపరెడ్డి సత్యనారాయణ | కథకుడు |

| జి. పుల్లారెడ్డి | గుణంపల్లి పుల్లారెడ్డి | మిఠాయి వర్తకుడు |
|---|---|---|
| అమితాబచ్చన్ | అమితాబ్‌రాయ్ సక్సేనా | హిందీ సినీ నటుడు |
| చక్రపాణి | ఆలూరి వెంకట సుబ్బారావు | సాహితీవేత్త |
| పి. చంద్రశేఖరఆజాద్ | పమిడిముక్కల చంద్రశేఖరఆజాద్ | కథకుడు, నవలారచయిత |
| జయప్రద | లలితారాణి | సినీనటి |
| డి.వి.నరసరాజు | దాట్ల వెంకటనర్సరాజు | సినీరచయిత |
| గజల్ శ్రీనివాస్ | కేశిరాజు శ్రీనివాస్ | గాయకుడు(గజల్స్) |







# పేరులో నేముంది?!





| శంకరనారాయణ | తురిమెళ్ల శంకరనారాయణరావు | హాస్యరచయిత |
|---|---|---|
| పి.బి. శ్రీనివాస్ | ప్రతివాద భంకరశ్రీనివాస్ | గాయకుడు |
| ప్రేమ్‌చంద్ | ధన్‌పత్‌రాయ్ శ్రీవాత్సవ | హిందీ రచయిత |
| త్యాగయ్య | కాకర్ల త్యాగ బ్రహ్మం | వాగ్గేయకారుడు |
| అజంతా | గూడూరి విశ్వనాధ శర్మ | కవి |
| కాళోజీ | రఘువీర్ నారాయణన్ లక్ష్మీకాంత్ శ్రీనివాసరావు–రాంరాజా కాళోజి | సాహితీవేత్త |



64కళలు.కామ్
www.64kalalu.com
సకల కళల సమాహారం

సంపుటి :2 సంచిక :1 నవంబర్ 2011



# రెండవ వసంతం లోకి...

## పాఠకులకు, కళాకారులకు ఆంధ్రప్రదేశ్ అవతరణ శుభాకాంక్షలతో....

64కళలుడాట్‌కాం మొదటి సంవత్సరం పూర్తి చేసుకొని రెండవ సంవత్సరంలోకి అడుగుపెట్టింది. కళలపై నున్న ఆశక్తితోనూ-అభిరుచితోను ప్రారంభించిన ఈ వెబ్ పత్రికకు విశేష ఆదరణ లభించింది.

ప్రారంభంలో నెలకు వెయ్యిమంది రీడర్స్‌ను (యూజర్స్) కలిగివున్న 64కళలు డాట్‌కాంను ప్రస్తుతం పదివేలకు పైగా యూజర్స్ విజిట్ చేస్తున్నారు. మొదటి సంవత్సరం పూర్తైన సందర్భంగా కొన్ని కొత్త శీర్షికలను ప్రారంభించనున్నాము. త్వరలో ఆ వివరాలు కూడా ప్రకటిస్తాం.

రెండవ సంవత్సరంలోకి అడుగిడిన సందర్భంగా కళాకారుల నుండి, కళాభిమానుల నుండి శుభాకాంక్షలు, ప్రశంసలు అందుతూనే వున్నాయి. వారందరికీ మా కృతజ్ఞతాభివందనాలు.

**కళాసాగర్**
ఎడిటర్

ముఖచిత్రం చిత్రకారుడు : **తలిశెట్టి రామారావు**



ఈ సంచిక లోని రచనల్లో ఆయా రచయితలు వెలిబుచ్చిన భావాలు వారి సొంత భావాలు మాత్రమే

సంస్కృతి

# నమస్కారం మన సంస్కారం

– పద్మకళ

**మనలోని అహంకారాన్ని అణచి ఎదుటి వారిని గౌరవిస్తూ వారి ముందు వినయాన్ని ప్రదర్శించే గొప్ప సంస్కారం నమస్కారం. భారతీయ సంస్కృతిలో నమస్కారానికి విశేషమైన స్థానం ఉంది. పాశ్చాత్యానుకరణల ప్రభావం మన సంప్రదాయాలను రోజురోజుకు ఎంతగానో ప్రభావితం చేస్తున్న తరుణంలో నేటి, రేపటి తరాలకు సదాచారమైన నమస్కారం ఎందుకు, ఎలా చేయాలో వివరించే వ్యాసం...**



మీకు వందనాలు...' అంటూ చెప్పే క్రమంలో శిరస్సును మనస్ఫూర్తిగా కిందకు వంచుతాం. అలా చేస్తూనే చేతులను ఛాతీకి ఆన్చి అక్కడి నుంచి శ్వాస తీసుకుంటూ హృదయపూర్వకంగా 'నమస్కారం' అని పలుకుతూ రెండు చేతుల్నీ జోడిస్తాం. ఇదీ నమస్కారం ప్రక్రియ. తన కంటే చిన్న వయస్సు వారికి నమస్కరిస్తే వారికి ఆయుక్షీణమని పెద్దలు చెబుతారు. ఈ విషయంలో కొన్ని మినహాయింపులు లేకపోలేదు. కొన్ని సందర్భాలను నేపథ్యంగా తీసుకుంటే నమస్కరించడానికి వయసుతో నిమిత్తం లేదు. విద్యాధికులు వయసులో చిన్నవారైనప్పటికీ వారికి నిస్సందేహంగా నమస్కరించవచ్చు.

## పూజలు, వ్రతాల్లో ఎవరికైనా నమస్కరించవచ్చు

నిత్యం నిర్వహించే వివిధ పూజలు, వ్రతాల్లో తాంబూలం ఇచ్చి ఏ వయసు వారికైనా నమస్కరించడం సంప్రదాయం. అతిధి భగవంతుడితో సమానం కాబట్టి ఏ వయస్కుడైనా నమస్కరించవచ్చు. ముత్తయిదువలు దేవతా రూపాలు కాబట్టి వయసులో చిన్నవారైనా

సరే భక్తిపూర్వకంగా నమస్కరించవచ్చు.

## పిల్లలకు శిక్షణ ఇవ్వాలి

ఇతరులు మనకు ఇచ్చే మర్యాద, గౌరవాలకు ప్రధాన కారణం మన నడవడిక, సంస్కారం తమ పిల్లలు భవిష్యత్తులో నలుగురి మెప్పు పొంది ప్రయోజకులుగా ఎదగాలని కోరుకునే తల్లిదండ్రులు ఈ రెండింటినీ వారికి నేర్పాలి. ఇంటికి వచ్చిన వారిని పలకరించడం, మర్యాద పూర్వక సంభాషణ చేసే విధంగా తర్ఫీదు నివ్వడం చేయాలి. పెద్దలు కనిపించినపుడు రెండు చేతులతో నమస్కరించడం, వినయ, విధేయలతలతో కూడిన సమాధానిలిచ్చే విధంగా చిన్ననాటి నుంచే పిల్లలకు శిక్షణ ఇవ్వాలి.

## ఏవేని నమస్కారాలు కావు?

ఈ రోజుల్లో 'నమస్కారం' అరకొర చేష్టగా మారింది. ఒంటి చేత్తో చేసేది అసలు నమస్కారమే కాదు. చెయ్యి ఎత్తీ ఎత్తకుండా అర్ధచంద్రాకారంగా చేతిని చూపి కింద పడేసినట్టుగా దించడం, అసలు చేతులతోనే పనిలేకుండా ఊరికే తలాడించి నమస్కరించడం ఈరోజుల్లో పరిపాటి అయ్యింది. అటువంటి చర్యలు నమస్కారాలు కావు.



### నమస్కారం ప్రియుడు సూర్యుడు

జగతి మొత్తాన్ని వెలుగురేఖలతో పరిపూర్ణం చేసే అద్వితీయ శక్తి సంపన్నుడు సూర్యదేవుడు. నిత్యం ఉష్ణోగ్రత ద్వారా ప్రాణికోటి మనుగడకు ఆధారభూతుడైన సూర్యుడు కేవలం నమస్కారాలతోనే సంతృప్తి చెందుతాడని పెద్దలు చెబుతారు.

## ప్రతి నమస్కారం తప్పనిసరి

నమస్కారానికి ప్రతి నమస్కారం చక్కని సంస్కారం అని ఆర్యోక్తి. కానీ కొందరు ఎంతో అభిమానంతో, ఆప్యాయతతో నమస్కరిస్తే ఏమాత్రం పట్టించుకోకుండా ఉండడమో, తలాడించడమో, నిర్లక్ష్యంగా స్పందించడమో జరుగుతుంది. ఇది మంచి పద్ధతికాదు. కొందరు తమ కంటే చిన్నవారు, పెద్దవారు, పామరులు అయినప్పటికీ సాటి మనిషిగా గుర్తించి ప్రేమపూర్వకమైన నమస్కారాలతో పలకరిస్తారు. మరికొందరైతే తాము నమస్కరిస్తే ఎక్కడ తమ స్థాయికి భంగం కలుగుతుందో అనే ఉద్దేశంతో నమస్కరించేందుకు విముఖత ప్రదర్శిస్తారు. నేనెందుకు ముందుగా పలకరించాలి? ముందుగా నమస్కరించాలి? అనుకుంటూ లేనిపోని దర్పాలు ప్రదర్శిస్తారు. తరచూ ఇలా చేయడం వల్ల ఇటువంటి వారు మంచి బంధాలను దూరం చేసుకునే ప్రమాదం ఉంది.

### నమస్కరించే పద్ధతి ఇదీ

రెండు చేతులూ జోడించి వాటిని గుండెలకు ఆన్చి, శిరస్సు వంచి, ఒక్క క్షణం వినమ్రతతో కళ్లు మూసి మనం నమస్కరిస్తున్న వారి హృదయానికి 'మన' అనే భావన చేరుకునే విధంగా ప్రణామం చెయ్యాలి.

# పల్లెజీవనం కళ్లకు కట్టిన వెల్లటూరి

*నవంబరు 1 వెల్లటూరి జయంతి*

**అర్ధశతాబ్దం క్రిందట పండుగలొస్తే చిత్రకారులకు, కథకులకు, పత్రికలకు నిజంగా పర్వమే! పోటాపోటీగా పత్రికలు కథలు, చిత్రాలతో ప్రత్యేక సంచికలు ప్రచురించేవారు. మామూలు కన్నా ఈ సంచికలు అత్యధికంగా అమ్మకాలు జరిగేవి. పాఠకులు కూడా అదే విధంగా వాటిని ఆదరించేవారు. అప్పటి ప్రత్యేక సంచికలు తిరగేస్తే ఒక పేరు విధిగా కనిపించేది. పండగ ఏదైనా వెల్లటూరి పూర్ణానందశర్మ గీచిన చిత్రం లేకుండా ప్రత్యేక సంచిక వెలవడేది కాదంటే అతిశయోక్తి కాదు వెల్లటూరి గీచిన రంగుల ముఖచిత్రం కాని, రేఖాచిత్రంకాని తప్పనిసరి.**

గ్రామీణ ప్రాంతాల్లో ఆ పండుగను ఆయన ప్రతిబింభించేవారు సక్రాంతి, దీపావళి, ఉగాది, దసరా, నాగులచవితి, ఒక గ్రామీణుడు ఎలా జరుపుకొనేది ఆయన తన చిత్రాల్లో చూపించేవారు. అప్పటి గ్రామీణుల జీవన విధానం, ఆచార వ్యవహారాలు, అలంకరణలు వెల్లటూరి సహజసిద్ధంగా, ఎలాంటి కల్పనలు లేకుండాచూపించేవారు. ఒక సంవత్సరకాలంలో తెలుగు ప్రజలు ముఖ్యంగా గుంటూరు జిల్లా గ్రామీణులు జరుపుకొనే చిన్నా, పెద్ద పండుగలన్నీ ఆయన చిత్రించారు. అప్పట్లో ప్రచురితమయ్యే దిన, వార, మాస పత్రికలన్నిట్లో ఆయన చిత్రాలు ప్రచురితమయ్యేవి. పండక్కి సుమారు రెండు, మూడు నెలల ముందే ఆయన సంబంధిత చిత్రాన్ని గీచి ఆయా పత్రికలకు పంపేవారు. ఆయన రేఖాచిత్రాలతో పాటు, నీటిరంగుల చిత్రాల్ని గీయడానికి ఎక్కువ ఆ శక్తి చూపేవారు. డ్రాయింగ్ పేపరుపై పెన్సిల్ స్కెచ్ వేసి, తర్వాత ఇండియన్ ఇంక్‌తో రేఖల్ని గీచేవారు రేఖాచిత్రాల కన్నా పెద్ద పరిమాణంలో నీటిరంగుల చిత్రాలు గీయడం వారి ప్రత్యేకత. పండుగ చిత్రాలతో పాటు ఆయన స్నాతకం, పేరంటం, పెళ్లి, అలంకరణ, మీరాబాయి, గుణాఢ్యుడు-బృహత్కథ, ఆచార్యనాగార్జునుడు, దంపతులు, గోమాత వంటివి వెల్లటూరికి కీర్తి తెచ్చిన చిత్రాలు, రామప్పగుడిలో గల పలు కాకతీయ శిల్పాల్ని ఆయన రేఖా చిత్రాలుగా మలిచారు. 1977లో రేఖాంజలి, 2000లో చిత్రకళాదీపిక, రేఖాచిత్రాల్లో మన పండుగలు 1985లో గ్రంథరూపంలో ఆయన వెలవరించి, తెలుగు చిత్రకళకు విలువైన సేవలందించారు. వీరి చిత్రాలు కేంద్ర, రాష్ట్ర లలితకళా అకాడమీలు సేకరించి భద్రపర్చారు.

వెల్లటూరి పూర్ణానందశర్మ గుంటూరు జిల్లా వెల్లటూరులో 1934 నవంబరు 1న జన్మించారు. పాఠశాల విద్యపూర్తి చెయ్యకుండా డ్రాయింగ్‌లో లోయర్, హయ్యర్ ఉత్తీర్ణులై, గుంటూరు జిల్లా పరిషత్‌లో డ్రాయింగ్‌టీచర్‌గా చేశారు. ఆయన పని చేసిన పాఠశాల్లో దేశనాయకుల చిత్రాలు గీసి విద్యార్థులకు తెలియజేసేవారు. ప్రముఖ చిత్రకారుడు, చిత్రకళోపాధ్యాయుడు అయిన శ్రీఫణితపు నాగేశ్వరరావు గారి వద్ద చిత్రలేఖనంలో మెళుకువలు నేర్చుకున్నారు. పెన్ను ఎత్తకుండా వినాయకుడిని గీసి, చిత్ర రచన ప్రారంభించారు. అప్పట్లో అదో సంచలనం. అలా ప్రారంభమైన ఆయన చిత్రకళ ఆయన కన్ను మూసేవారుకూ కొనసాగించారు. వెల్లటూరి చిత్రకారుడే కాదు. చిత్రకళారచయిత కూడా. సమకాలీన ప్రముఖ చిత్రకారుల్ని, చిత్రకళా శైలుల్ని ఆయన తెలుగువారికి పరిచయం చేశారు. ఎందరో విద్యార్థుల్ని చిత్రకారులుగా తీర్చిదిద్ది, వారు జీవితంలో స్థిరపడే విధంగా కృషిచేశారు.

1968లో వెల్లటూరులో స్థానికుల సహాయ, సహకారములతో 'నవరంగ్ చిత్రకళానికేతన్' అనే చిత్రకళాసంస్థను ఏర్పాటు చేసి, 25సం॥ పైగా క్రమం తప్పకుండా, జాతీయ స్థాయిలో బాలలకు, యువకులకు చిత్రలేఖనం పోటీలు నిర్వహించి, ఔత్సాహికుల్ని విశేషంగా ప్రోత్సహించారు. మారుమూల పల్లెలో ఇలాంటి జాతీయ స్థాయి కార్యక్రమాలు చేసిన ఏకైక చిత్రకళా సంస్థగా నవరంగ్ చిత్రకళానికేతన్ కీర్తి ప్రతిష్ఠలు పొందింది.

రాష్ట్రానికి చెందిన లలిత కళా అకాడమీ కార్యవర్గ సభ్యునిగా బాలల అకాడమీ సాధారణ సభ్యునిగా, రాష్ట్ర ఆర్టు ఎడ్యుకేషన్ రివ్యూ కమిటీ సభ్యునిగా ఆయన సేవలందించారు. 1986లో అప్పటి ముఖ్యమంత్రి నందమూరి తారకరామారావు వీర్ని 'తెలుగు వెలుగులు' టైటిల్ సత్కరించింది. అదే సం॥ రాష్ట్రస్థాయిలో ఉత్తమ చిత్రకళోపాధ్యాయ అవార్డు పొందారు. అదే విధంగా నర్సారావుపేటలో శిలాశిల్పుల మహాసభలో అప్పటి విద్యామంత్రి మండలి వెంకటకృష్ణారావు 'చిత్రకళాప్రపూర్ణ' బిరుదుతో సత్కరించారు.

తెలుగు గ్రామీణ జీవితాల్ని ప్రతిబింబించే ఆయన విలువైన చిత్రాల్ని సేకరించి ఆయన పుట్టి, పెరిగి, కీర్తి ప్రతిష్ఠలు అందుకొన్న వెల్లటూరులో ఒక చిత్రశాల ఏర్పాటు చేస్తే సముచితంగా వుంటుంది. ఆయన కుటుంబసభ్యులు, శిష్యులు, అభిమానులు ఈ దిశగా యోచిస్తారని ఇందుకు నా వంతు సహాయ, సహకారాలు అందజేస్తానని తెలియజేస్తున్నాను.

*- సుంకర చలపతిరావు*

# 'చిత్ర' మైన జీవితం

**Part-7**

**ప్రముఖచిత్రకారుడు, కార్టూనిస్టు, కథారచయిత బాలిగారు 64కళలుడాట్‌కాం పాఠకులకోసం తన కళాజీవిత విశేషాలను, బాల్యస్మృతులను, పరిచయాలను ధారావాహిక రూపంలో అందించనున్నారు. నెల నెలా చిత్రమైన జీవితంలో...**





email: balisankar@gmail.com

**నేను విజయవాడ వచ్చేసినా నన్ను మరచిపోలేదు ఆయన. ఆంధ్రజ్యోతి ఆఫీసుకి వచ్చి పురాణం గార్ని కలవడం, నాతో కాసేపు మాట్లాడ్డం మామూలే! లబ్బీపేటలో ఉన్న మా ఇంటికి ఓరోజు ఉదయం ఎనిమిది గంటలయ్యిందో లేదో మెడలో ఓ పెద్ద సంచితో చేతిలో సిగరెట్టుతో ప్రత్యక్షమయ్యాడు. విషయమేమంటే తన కథలపుస్తకాన్ని ఎవరో వేస్తున్నారు. ముఖచిత్రంగా ఫొటో వేయించుకోవడం ఇష్టంలేదు. నాతో ఆ తనపోర్ట్రయిట్ గీయించుకొని వేయించుకోవాలి. "ఎంత? పదినిముషాల్లో గీస్తావు అది ఆ పబ్లిషర్ ముఖాన్న వేసి మూడుగంటల ట్రయిన్‌కు వైజాగ్ వెళ్లిపోతానన్నాడు".**

అక్కడ వాలు కుర్చీ ఉంటే అందులో చతికిలబడ్డాడు. అప్పటికి నేనింకా స్నానం చెయ్యలేదు. ఇక నా అవస్థ చూడాలి. కిందకూచుని స్కెచ్ వేసుకోవడం మొదలెట్టాను. ఇష్టం వచ్చినట్టు కదిలిపోవడం, సంచిలోని కాయితాలు బయట పెట్టడం, అవన్నీ చూసుకోవడం తిరిగి కొన్ని సంచిలో సర్దటం, అటూ ఇటూ చూడ్డం. తొడెత్తి పెద్ద శబ్దంతో గ్యాస్ వదలడం... పట్టుమని పదినిముషాలన్నా స్థిరంగా కూచోలేదు... ఏదో గీసాను చివరకు నాకు తృప్తిలేదు. అతను బావుందన్నాడు. సంచిలో బొమ్మను వేసుకొని బయలుదేరేసరికి 11 గంటలయ్యింది. ఉదయం నుండి నాకు స్నానం లేదు, టిఫిన్ లేదు. ఇలాంటి వ్యక్తిని ఇంకెప్పుడూ ఇంటికి పిలవకండి అంది మా ఆవిడ కోపంగా. పాత పాటలు ఓ వంద సంకలనం చేసి సి.డి. తెస్తాడని తెలిసి, దాన్ని కొందామనీ, బాలసరస్వతిగారిమీద వేసిన పుస్తకాన్ని



# మధురమైన జ్ఞాపకాల మజిలీ - బాలి ఆత్మకథ



వ్యక్తి యొక్క గతాన్ని ఒక క్రమ పద్ధతిలో తెలియజేసేది ఆటోబయోగ్రఫీ అయితే, సమస్త వ్యక్తుల గతాలను ఒక విస్తృతమైన అర్థంలో తెలియజేసేది చరిత్ర. అందుకే ఒక చరిత్ర నిర్మాణానికి వ్యక్తి చరిత్ర మూలాధారం. అంత కీలకమైనది కనుకనే ఆత్మకథలు రాయడం అన్నది అందరూ చేయాల్సిన ముఖ్య కర్తవ్యం.

వ్యక్తి ఉన్నతమైనప్పుడు ఆచరిత్ర కూడా ఉన్నతమైనదవుతుంది. 64కళలు ద్వారా తన ఆత్మకథను వెలువరిస్తున్న శ్రీ 'బాలి' గారు చిత్రకళలో ఎంతో అనుభవజ్ఞులే గాక తెలుగు చిత్రకళ మరియు కార్టూన్ కళారంగాన్ని ప్రభావితం చేసిన మరియు చేస్తున్న కొద్దిమంది ప్రముఖులలో ఆయనొకరు. ఇలాంటి అనుభవజ్ఞుల గతాన్నుంచి వెలువరించే ఆత్మకథ తప్పనిసరిగా భావితరాలకు ఎన్నో పాఠాలు నేర్పేవిధంగానే ఉంటుందని వేరే చెప్పనవసరం లేదు.

తన ఉద్యోగ మరియు కళాజీవనయానంలో ఎదురైన ఎన్నో ఎత్తు పల్లాలతో పాటు, మధురమైన జ్ఞాపకాల మజిలీలను కూడా ఎంతో ఓపికగా అక్షరబద్ధం చేస్తున్న బాలిగారి కృషి అభినందనీయమైనదైతే దాన్ని అందరికీ ఆశక్తి కలిగేలా నెలనెలా ధారావాహికంగా ప్రచురించి పాఠకులకు అందిస్తున్న కళాసాగర్ గారి కృషి మరింత అభినందనీయమైనది.

**- వెంటపల్లి సత్యనారాయణ**

చూద్దామని విశాఖపట్నం వెళ్లినపుడు వారింటికి వెళ్లాను. ఏదో అపార్ట్‌మెంట్‌లో, పుస్తకాలూ, ఆయుర్వేదం మందుల వాసనలమధ్య ముణుకులు కొబ్బరిబొండాల్లా అయి, అడుగుతీసి అడుగు వెయ్యలేక వాటి మధ్య పాతకుర్చీలో, చీకట్లో కూచుని ఉన్నాడు.

డబ్బులిచ్చేసి ఆ "సి.డీ" పుస్తకం తీసుకున్నాను అదే ఆఖరిగా ఆయన్ని చూడ్డం. చనిపోయారని పేపర్లో చదివాను.

పురాణంగారితో పరిచయమైన తరువాత ఆయన నాకు ఉత్తరం రాశారు. దీపావళి జ్యోతి మాసపత్రికకు బొమ్మలు గియాలనీ, వారిని నీకు పరియంచేస్తాననీ...ఇంకా ఏవేవో విశేషాలు రాశారు. నేను వెళ్లాను. అదే నేను మొదటి సారిగా విజయవాడ వెళ్లి వర్క్ చెయ్యడం. అలవాటయిన తరువాత ఆరునెలల కొకమారన్నా వెళ్లేవాడిని. ఆయన చెప్పినట్టే జ్యోతి మాసపత్రిక వారిని పరిచయం చేశారు. అప్పట్లో ఆ ఆఫీసు మాచవరండౌనులో ఉండేది. నేను గీయవలసిన బొమ్మలు దీపావళి ప్రత్యేక సంచిక కోసం ఆ పత్రిక యజమాని రాఘవయ్యగారు, వారి సతీమణి లీలావతిగారు, ఓవారం రోజులు వారింట్లోనే ఉండి మొత్తం బొమ్మల పని ముగించాను. లీలావతిగారి ఆత్మీయత మరువలేనిది. గొప్పఇల్లాలు. అయితే ఆ సంచిక విడుదల అయిన తరువాత చూస్తే లోపల నా బొమ్మలున్నా ముఖచిత్రం నేను గీసింది కాదు. ఈశ్వర్‌గారు వేశారు. నేను వేసింది వాష్ డ్రాయింగ్. దాని ఖర్చు ఎక్కువయి సింపుల్‌గా చేశామని తరువాత చెప్పారు. ఆ తరువాత కాలంలో లీలావతి గారు పత్రిక బాధ్యత వహించినా, వేమూరి సత్యన్నారాయణగారు ఎడిట్ చేసినా నన్ను మరచిపోలేదు. చాల వరకూ నాతో బొమ్మలు గీయించారు. ఈ జ్యోతి మాసపత్రిక విజయవాడ మాచవరండౌన్‌లో ఉన్నప్పుడే రచయిత ఆది విష్ణుగారిని మొదటగా చూశాను. దీపావళి ప్రత్యేక సంచిక కోసమే ఓ కథ రాసి తెచ్చి రాఘవయ్య గారికిలా చూపించి, టేబుల్ మీదపెట్టి, పక్కనున్న మరో సొరుగులాగి అందులోనుండి డబ్బులు తీస్తూ "నా రెమ్యూనరేషన్ తీసుకుంటున్నా"నన్నారు. రాఘవయ్యగారు నవ్వారు.






అలా కథను ఓక్షణంలో పరిశీలనకు పెట్టడం, ప్రతిఫలంపొందడం నాకు ఆశ్చర్యమేసింది. వారి ఇద్దరి మధ్యా గల స్నేహభావం అటువంటిదని తరువాత కాలంలో తెలిసింది.

అలాగే మరోకసారి విజయవాడకు తమ పత్రికలో బొమ్మలకై పిలిచిన వారు స్వాతి బలరాంగారు. అప్పటిలో ఆయన అద్దె ఇల్లు సత్యన్నారాయరణపురం రైల్వే ట్రాక్ పక్క నే ఉండేది. ఆ వీధి పేరు గుర్తులేదు. సంక్రాంతి ప్రత్యేకసంచికకు బొమ్మలు వేయాలి. కథ సెలక్షన్ యర్రంశెట్టి శాయిది. అప్పటికి సెలక్షన్ అయిపోయింది. శాయిగారు సెలవుమీద హైదరాబాద్‌నుండి వచ్చినట్టున్నారు. ఆయననూ అదే మొదటిగా చూడడం. బలరాంగారూ నేనే బొమ్మలు ఎలా వేస్తే బాగుంటాయో మాట్లాడుకున్నాం. హెడ్డింగ్ పక్కన చిన్న బొమ్మ, రెండో పేజీలో పెద్ద బొమ్మ వస్తే బాగుంటాయని చివరకు నిర్నయించుకున్నాం. ఆ రోజుల్లో బొమ్మలు, బ్లాకులుగా చేయించాలి. కాబట్టి ఖర్చు గురించీ ఆలోచించాలి. తప్పదు. అలాగే చేశాను. ఆయన భార్య అమ్మాజీ చేతిభోజనం తినడం అప్పుడే.

భోజనం దగ్గర ముఖమాటం వద్దని వడ్డిస్తూ ఆమెచెప్పడం నాకింకా గుర్తుంది. బ్లాకులవెనుక చెక్క ముక్కలను తీసి, బాయిలర్‌తో వేడినీళ్ళు కాచుకోవటం ఆ ఇంట్లోనే చూశాను. బొమ్మల ఉపయోగం అయిపోయిన తరువాత ఇక ఇవి వేస్ట్ కదా అన్నారావిడ ఆశ్చర్యపోయాను.

బలరాంగారు స్వాతి వారపత్రిక (మాసపత్రిక) కు ఓ పక్కనున్న లోగోను పూజ అల్మరాలో దేవుళ్ల బొమ్మలకు ఓ పక్కగా పెట్టుకొని పూజచేయడం అప్పుడే చూశాను. ఆ బొమ్మ స్వాతి మాసపత్రికగా ఉన్నప్పుడు కవర్‌పేజీగా వచ్చింది. దాని గీతలు సరిచేసి కలర్ సజిషన్ చేసింది నేనే.

వారంరోజులు ఆ ఇంట్లో ఉన్నట్టున్నాను. నాకు కేటయించిన గదిలో ఓరాత్రి నిద్రపోతుంటే పెద్ద పెద్ద కేకలకి తెలివి వచ్చింది అప్పటికి టైమ్ ఎంతయ్యిందో తెలియదు. కిటికీ అవతలనుండి ఆ కేకలు వినిపిస్తున్నాయి. బలరాంగారు ఓ అరగంట ఈగదిలోకి వచ్చి వెళ్లారు. ఆయనకూ నిద్రపట్టలేనట్టుంది. మధ్యలో ఓ అరగంట విశ్రాంతి. హమ్మయ్య అనుకొని లైట్ ఆర్పితే మళ్లీ గొడవ మొదలు. నాకు అర్ధమయినదేమంటే అక్కడ గుడిసెలూ లేక తాటాకు ఇంట్లో ఉన్న కుర్రకారు ఓ ఆడదాన్ని ఆ రాత్రి ఆనందానికి తెచ్చుకున్నాడు. కొంచెమో, బాగానో తాగాడో ఇంతలో మరొక డు వచ్చాడు. వాడూ తాగాడు. దాన్ని ఎంజాయ్ చేశాడు. అయితే వీళ్లు ఒప్పుకున్నది ఇద్దరిలోనే. మూడోవానికోసం మొహమాటంపెట్టారు. పాపం ఆవెలయాలు వప్పుకొంది. అయితే అంతవరకూ బాగానే ఉంది. అయితే ఆ అమ్మాయిపోతూ పోతూ సగం బాటిల్‌ని వీళ్లకు తెలియకుండా ఒంటిన దోపుకొని వెళ్లిపోయింది. వీళ్లు కొంచెం మత్తులో ఉన్నారు. అలాగని పూర్తిగా కాదు. ఆ సీసా కోసం వెతికితే కనపడలేదు. అదే ఎత్తుకెళ్లిందని ఊహించి వెంటపడ్డారు. మధ్యలో గోలలేని విశ్రాంతి.

నిజంగానే దాని ఒంటినే ఆ సీసా ఉంది. దాన్ని లాక్కొచ్చారు. మళ్లీ గోల మొదలు. దాని కేకలు ముగ్గురు మగవారినీ డామినేట్ చేసేటంత

దాని లాజిక్ ఎంత బావుందంటే ఇద్దరన్నారు ఇప్పుడు ముగ్గురు నామీద పడ్డారు. డబ్బులూ ఇవ్వలేదు. ఈ సీసాలో గుక్కెడు మందుంటే ఛస్తున్నారా! అని దాన్ని తీసుకెళ్లే బూతులూ కేకలూ వాళ్ల అరుపులూ. నాకు నిద్రపట్టదు. తరువాతెప్పుడో కేకలు తగ్గాయి. కొంచెం నిద్ర పట్టింది.

మొత్తం మీద ఆ సంచిక బాగా వచ్చింది. బాపుగారు కవర్‌డిజైన్ వేశారు. లోపల నా బొమ్మలు. బలరాం గారి కొడుకుపేరు అనిల్‌ని, అమ్మాయినీ అప్పుడే చూశాను. అనిల్ చాలవరకూ బలరాంగారి పోలికలే. అమ్మాయి పాకుతూ గుమ్మాలు దాటుతూ ఉండేది. బలరాంగారు స్టేషన్‌కు దిగబెట్టారు. ప్లాట్‌ఫాంమీద చాలసేపు మాట్లాడుకున్నాం. నేను వైజాగ్ వెళ్లిపోయాను. మరో పదిరోజుల్లో సంచిక మార్కెట్‌లోకి వచ్చింది.

నిండుగా వచ్చింది. అందరూ బావుందన్నారు.

ఆ తరువాత విన్నాను బలరాంగారి అబ్బాయి చనినపోయాడని. సంచిక అందంగా రావడం, చాలామంది మెచ్చుకోవడం, అనుకున్న పాయింట్‌కు సేల్స్ రీచ్ అవడం. కాని దురదృష్టవశాత్తూ వారి అబ్బాయి చనిపోవడం ఆయనలో ఏదో సెంటిమెంట్ పనిచేసిందన్నారు. ఆ తరువాత ఇక ప్రత్యేక సంచికలు వెయ్యడం మానేశారు.

విశాఖపట్నంలో ఉన్నప్పుడే ఆఫీస్‌కి వెళుతోంటే పెద్ద జంక్షన్ అయిన ఎల్లమ్మతోట (ప్రస్తుతం జగదాంబ సెంటర్)లో ఓ సందులోని మొదటి ఇంటి గోడమీద "శ్రీశ్రీ షష్ఠిపూర్తి" దాని కింద చిన్న అక్షరాలతో దానికి మీ సహకారం కావాలి అనే చిన్న బోర్డు మేకులు కొట్టి ఉండేది. కింద చిరునామా లేదు. అదే రకమయిన సహకారమో తెలియలేదు. అయితే అప్పటిలో అక్కడి రచయితలతో నాకు పరిచయం లేదు. కొన్నాళ్లకు నేనూ విశాఖ సాహితి మెంబర్‌ని అయ్యాను. చాలామంది రచయితలు పరిచయం అయ్యారు. అందులో కొందరు శ్రీ.శ్రీ. షష్ఠిపూర్తితో వాలంటరీగా పనిచేశారని విన్నాను.




గణపతిరాజు అచ్చుతరామరాజుగారు అందర్నీ గౌరవిస్తూ సరదాగా మాట్లాడితే. నవులూరి వెంకటేశ్వరరావు, యల్లా ప్రగడ రామారావు, ద్విభాష్యంరాజేశ్వరరావు, ఇత్యాదులు తోటి రచయితలకు సూచనలూ, సలహాలూ అందిస్తూ రచనా పరంగా మరింత ఎదిగేందుకు సహకరించేవారు. ఆ ఉత్సాహంతోనే నేనూ కథలకు శ్రీకారం చుట్టాను. అప్పటికే బొమ్మల పరంగా చాలకథలు చదివి ఉండటం వల్ల సరే, మనమూ మన పరిధిలో ప్రయత్నిద్దాం అని రాశాను. అది చోడవరంలో మేమున్న వారి ఇంటిలో జరిగిందే! కొంత కల్పన, ఎక్కువ పాలు నిజం. సభలో చదివితే చిన్న చిన్న మార్పులు సూచించి మొత్తం మీద అందరూ బాగుందన్నారు. అది ఆ తరువాత విశాఖ సాహితీవారు ప్రకటించిన కథల సంపుటిలోనూ వచ్చింది. దానిపేరు "రేవు దాటిన వాడు". అయితే దానికి ముందు, హైద్రాబాద్‌నుండి వచ్చే 'కరుణ' అనే మాసపత్రిక ప్రత్యేక సంచికలో వచ్చింది. దాని సంపాదకులు శ్రీ బాసాని సుదర్శన్ రెడ్డిగారు. ఎవరిద్వారానో, నా చిరునామా తెలుసుకొని బొమ్మలు నిమిత్తం కొన్ని కథలు పంపారు. ఆ కథలకు బొమ్మలు గీసి ఉత్తర మొకటి జతచేసి పంపేవాడిని. ఆ ఉత్తరంలో ఆ కథల్లోని విశేషాలు, నా రెమ్యూనరేషన్ విషయాలు ఇవన్నీ ఉండేవి. ఇలా చాలసార్లు జరిగింది. ఒకమారు ఆయన నుండి ఓ ఉత్తరం వచ్చింది. నేను పంపుతున్న కథల్లోని విశ్లేషణ ఏమో గాని మీ ఉత్తరమే కథలా కనిపిస్తోంది. వీలయితే ఓ కథ రాసి పంపమనీ, దానికినన్నే బొమ్మ వేసుకోమనీ

'రేవుదాటనివాడు' కథ సిద్ధంగా ఉంది. బొమ్మగీసి పంపాను. ఆయనకు నచ్చింది. కరుణ ప్రత్యేక సంచికలో వేశారు. అప్పటి వరకూ నాకు ఈ హైదరాబాద్ తెలియదు. మా ఆఫీస్ వారు ఏదో రికార్డ్ "ఏజీ" ఆఫీస్‌లో సబ్మిట్‌చేయాలని దాని నిమిత్తం నన్ను పంపారు. ఆపని ముగించుకొని నారాయణగూడలో ఉన్న 'కరుణ' ఆఫీస్‌కి వెళ్లాను. సదర్శన్ రెడ్డిగారు నన్ను బాగానే రిసీవ్‌చేసుకున్నారు. మొదటిసారిగా చిత్రకారుడు 'చంద్ర'ను అక్కడే, ఆ ఆఫీస్‌లోనే చూశాను. ఈ కథ తిరిగి రచన మాసపత్రికలో ఈ మధ్యనే వచ్చింది. రచన శాయిగారికి ఆ కథంటే ఇష్టమని చెప్పారు. అలాగే చంద్రకు కూడా ఆ కథ ఇష్టమే. ఓ పక్క బొమ్మలు వేయడం వల్ల టైం లేక రచనలను వెనక్కు పెట్టవలసివస్తోంది. నేను ఆంధ్రజ్యోతిలో చేరిన తరువాతే పురాణంగారు రాయమంటే రెండు కథలు చిట్టితల్లి–చిక్కుడుగింజ" అనే పిల్లల నవల రాశాను. ఆ కథలను చాలామంది మెచ్చుకున్నారు. "చిట్టితల్లి–చిక్కుడు గింజ" పిల్లల నవల మాత్రం కొంచెం కుదించవలసివచ్చింది. "ఆత్మహత్య" అనే నవల

వీక్లీలో వస్తూ పాఠకులకు పట్టలేదు. వీక్లీ సర్క్యులేషన్ విపరీతంగా పడిపోవడం మొదలయ్యి అసలు వీక్లీయే 'ఆత్మహత్య'కు దారి తీసింది. శర్మగారు కంగారు పడ్డారు. ఎలాగో ఆ నవల ముగించి, మరో రసవత్తరమయిన నవలను ఎత్తుకున్నారు. సర్క్యులేషన్ నిలబడింది.

అనకాపల్లి కాలేజీలో చదువుతున్న రోజుల్లోనే మా ఇంటికి కొంచెం దూరంలో ఉన్న ఓ వెచ్చాల షాపుకి వెళ్లాను. కుంకుడుకాయలో, పెసర పప్పో ఓ పేపర్ చింపి అందులో ఆ ఐటం వేసి ఇచ్చాడు షాపాయన. ఇంటికి పోయి విప్పి చూస్తే పసుపురంగు టింట్ వేసిన బేక్‌గ్రౌండ్‌లో కె.యల్. ధర్‌గారి బొమ్మ ఉంది. అయితే నాకు వచ్చిన బొమ్మ కింద భాగంది. పేరు కనిపిస్తోంది.



*2011 వెంకట్ అవార్డును రమణాచారి చేతులమీదుగా అందుకుంటూ..*

టైటిల్ 'బద్ధకం'. నులక మంచంలో అస్తవ్యస్తమయిన చీరలో, చేతలు పైకెత్తి బద్ధకం తీర్చుకుంటున్న పడుచుపిల్ల బొమ్మ అది. అయితే బొమ్మకు తల కాయలేదు. ఇది సగం ముక్క మాత్రమే. రెండో ముక్క కోసం ఆ కొట్టుకు వెళ్లాను అడిగాను ఇచ్చాడు. దగ్గరగా అంటించాను. బొమ్మ బాగుంది. అది ఆంధ్రప్రభ వారపత్రికలో ప్రింటయ్యింది. ఆ చిత్రకారుని పేరు నాలో గుర్తుండిపోయింది. ఆయనను చూస్తానని అనుకోలేదు. ఇన్నాళ్లకు నేను విజయవాడ ఆంధ్రజ్యోతి ఆఫీసుకు వస్తే అక్కడ స్టాఫ్ ఆర్టిస్ట్‌గా ఆయనున్నారు పలకరించాను. బాగా పరచయమైన తరువాత ఈ విషయం చెప్పాను. సంతోషించాడు.

అప్పటికి నేనింకా విజయవాడకు పూర్తిగా చేరుకోలేదు. అప్పుడప్పుడు ఈ ఆఫీస్‌కు రావడం వల్ల ఆయనతో పరిచయం ఇంకా పెరిగి వారింటికి భోజనానికి ఆహ్వానించాడు. ఇల్లు ఈ లబ్బీపేట, ఆంధ్రజ్యోతి ఆఫీస్ పక్క సందులోనే గుమ్మంలో కూచుని పిచ్చాపాటీ మాట్లాడుతున్నాం. అయితే మేం కూచున్న స్థలానికి కొంచెం దూరంలో గోడపక్కన చాల కాయితాల గుట్టలున్నాయి. నేను అటు చూడగానే ఆయన గది గమనించి "అవన్నీ కథలు. వీక్లీలో అచ్చు కావలసినవి. సెలక్టడ్ కథలు" అంటూ వెళ్లి ఆ గుట్టలోంచి మడత పెట్టిన రెండు కథలు తెచ్చాడు. ఓ కథ టైటిల్ చూసి నా చేతిలో పెడుతూ "ఈ కతకు బొమ్మ నీవయితే ఎలా వేస్తావు అన్నాడు. కథ చదివాను. సైన్స్ ఫిక్షన్. మరో వందసంవత్సరాలలో మన భవిష్యత్ ఇలా ఉండవచ్చన్న ఊహతో రచయిత రాసిన కథ అది. వేస్తాను అన్నాను లోపలినుండి ప్లాంక్,పేపర్, ఇండియన్ ఇంక్ తెచ్చాడు వేశాను. దాన్ని అటూ ఇటూ చూసి "ఇంత కష్టపడీ- ఈస్టయిల్‌లో నేనయితే వెయ్యలేను" అని నా బొమ్మనూ, ఆ కథనూ చింపేశాడు. నాకు ఆశ్చర్యం మిగిలింది. "సరే! మిగిలిన కథలన్నీ ఏంచేస్తారని అడిగాను.

"వీశెల లెఖ్ఖన అమ్మేస్తాను- ఆ పురాణానికి ఏం పనిలేదు! సెలక్ట్ చేయడం. మా ముఖాన్న వెయ్యడం. బొమ్మలు వెయ్యొద్దూ!!" అన్నాడు విసుగ్గా. ఇది నాకో లెషన్. ఆ రచయితెంతో కష్టపడి రాసి పేపర్‌లో వస్తుందనీ ఎదురుచూస్తాడు. కష్టపడి బొమ్మ వెయ్యాలి. వీలయినంత బాగా వెయ్యాలి. ఇటువంటి పాఠాలే నాకు ఎదగడానికి దోహదం చేసాయి. కొన్ని సంవత్సరాల తరువాత ఆయనా సంస్థలో మానెయ్యడమూ, అదే సీట్లో నేను చేరడమూ జరిగాయి.

బొమ్మలూ, కథలూ తెచ్చి విజయవాడ ఆంధ్రజ్యోతి ఆఫీసులో పురాణంగారికి అందచేసి ఆయనతో మాట్లాడుతున్నాను. తెల్లగా ఏక్టివ్‌గా ఉన్న వ్యక్తి ఆ సమయంలో వచ్చాడు. నా వేపు ఎగాదిగా చూసి ఈయనేనా 'బాలి'గారంటే అన్నాడు. "అవును... మీరా పుస్తకం ఆయనకివ్వండి" అన్నారు పురాణంగారు.

ఆయన చేతిలో ఏదో పుస్తకం ఉంది. దాన్ని నాకు అందించాడు. మొత్తం విషయం నాకేమీ అర్థంకాలేదు. పేజీలు తిరగేస్తున్నాను అసలు సంగతేమంటే, యాక్టివ్‌గా, తెల్లగా ఉన్న వ్యక్తి పేరు 'ఎ.బి.కె. ప్రసాద్'గారు. ఆయన "హొచిమన్ గేయాలు" అనే పుస్తకం స్వేచ్ఛానువాదం చేశారు. ఆ గేయాల వ్రాతపతి అది. అందులో ఉన్న ప్రతి గేయానికీ ఒక బొమ్మ కావాలి. డబ్బులు ఇవ్వలేరు. అయినా వేస్తానని తీసుకున్నాను. శర్మగారు సంతోషించారు. ఆ గేయాలకు బొమ్మలు వేశాను "ఏ.బి.కే" గారికి




నచ్చాయి. అందులో ఒక దానికి మాత్రం నేను అర్థంచేసుకోలేకపోయానని ఆయనన్నారు. (అవన్నీ హెచ్‌మిన్, రెవల్యూషన్ స్టయిల్‌లో రాశాడు). త్వరలోనే పుస్తకరూపంలో వచ్చాయి. నా బొమ్మలూ, నా డిసిప్లిన్ ఆయనకు నచ్చి 'ఈనాడు' దినపత్రికలో మొదటి స్టాఫ్ ఆర్టిస్ట్‌గా (కార్టూన్స్ కం ఇల్‌స్ట్రేటర్) నన్నే (ఆయన ఎడిటర్) సెలక్ట్ చేశారు (నాకు పోటీగా 'టీ.వి' (తిప్పాన వెంకటేశ్వరరావు) వచ్చాడు. దానికి శ్రీ రామోజీరావుగారు కూడా ఇష్టపడ్డారు. మరో పార్శ్వంలో కొంచెం ముందుగా ఇదే విషయాన్ని చలసాని ప్రసాదరావుగారు ఉత్తరం ద్వారా తెలియజేశారు. వైజాగ్‌నుండి దినపత్రిక రాబోతోంది. నీకిష్టమయితే ప్రయత్నించమనీ... ఈ లోపు నేనూ వైజాగ్ వస్తాను. మనం మాట్లాడుకుందాం అన్నారు. అలాగే ఆయన రావడం, ఆంధ్రాయూనివర్శిటీ క్వార్టర్స్‌లో ఉంటున్న కృష్ణాబాయి గారింట్లో దిగి ఆ సాయంకాలమే మా ఇంటికి రావడం ఇక్కడ కాదు అక్కడ అంటూ నన్ను "బీచ్"కి తీసుకుపోయి ఇసుకలో కూచోపెట్టి ఇంటర్వ్యూలాంటిది చెయ్యడం జరిగింది. నాకు మంచి స్ట్రోకు ఉందని నాలో కాన్ఫిడెన్స్ పెంచుతూ, పేషన్సీ ఉండాలని నొక్కి చెబుతూ చివరిగా ఈ కొత్త దినపత్రిక 'ఈనాడు'లో చేరితే మంచిది అన్నాడు. అప్పటికే నాకు గవర్నమెంట్‌లో పర్మనంట్ ఉద్యోగం ఉంది. కాబట్టి 'చూద్దాం' అన్నాను.

'ఏబికె' గారి భార్య రాణీగారు కూడ నేను విజయవాడ వచ్చినపుడు భోజనానికి పిలిచి మాటల్లోనే తమాషాగా నన్ను ఇంటర్వ్యూ చేశారు. బొమ్మల విషయంలో చాల ఎంకరేజ్‌గా మాట్లాడారు. ఆలోచించి చివరకు 'కొన్నాళ్లు నా ఉద్యోగానికి సెలవు పెట్టి పత్రికలో చేరుదామనే నిర్ణయించుకున్నాను. ఆ లోచనకు మరో కారణం ఏమంటే...

తాండవ రిజర్వాయర్ డామ్‌లో పనిచేస్తున్నప్పుడే ఫ్రీలాన్స్‌గా పత్రికలలో బొమ్మలు వేసే వాడిని కదా! అందువల్ల ఆంధ్రపత్రిక నుండి నాకు కబురు వచ్చింది. వారికే బొమ్మలు వేయమని... ఆంధ్రజ్యోతి వారపత్రికలో ఎలా బొమ్మలు వేస్తున్నానో ఆంధ్రపత్రికకూ అలాగే బొమ్మలు వేసేవాడిని. అక్కడా ఇక్కడా కూడా నేను కోరిన వెంటనే, నా బిల్లు చెక్‌చేసి డబ్బు పంపేవారు. శివవెంకట రాధాకృష్ణగారూ నన్ను అభిమానంగా చూసుకొనేవారు.

అందువల్ల ఆంధ్రపత్రికతోనూ నా పరిచయం పెరిగింది. వైజాగ్ నుండి తాండవ రిజర్వాయర్‌కు నన్ను ట్రాన్స్‌ఫర్ చెయ్యడానికి వెనకో చిన్న కథ ఉంది. మాకు కొత్తగా ఓ సూపరెండెంట్‌గారు వచ్చారు. ఆయన గొప్ప బ్రహ్మణ వాది. ఆ సంగతి మొదటిరోజే తెలిసిపోయింది. ఆఫీస్‌లో అందర్నీ పరిచయం చేసుకొని, షేక్ హేండ్ ఇచ్చాం చివరి టేబుల్‌మీద గిన్నెలో ఉన్న డెట్టాల్ నీళ్లతో చెయ్యి కడుక్కొని నాప్‌కిన్‌తో చేయి తుడుచుకున్నాడు. ఈ ఆఫీస్‌లో ఎంతమంది బ్రాహ్మణులున్నారో లిస్ట్ తెప్పించుకున్నాడు. అందులో జూనియర్ క్లర్క్‌గా ఉన్నవాడూ, బ్రాహ్మణుడూ, తనశాఖ వాడు, తమ ప్రాంతం (ధవళేశ్వరం)వాడూ అయిన బ్రహ్మానందాన్ని తన పి.ఏ.గా నియమించుకున్నాడు. వాడు తాండవలో ఉన్నాడు. వాడు వైజాగ్ వస్తే వాడి ప్లేస్‌లోకి నేను తాండవ వెళ్లేను. వాడు నా మిత్రుడే! వాడికున్నన్ని సుఖరోగాలు ఎవరికీ లేవు. పి.ఏ. అయిన తరువాత లంచం విషయంలోగాని, లంజలు విషయంలో గానీ ఇంకా విజృంభించాడు. త్వరలోనే భార్యకు రోగాలూ, వైధవ్యమూ ఇచ్చి పరలోకానికి వెళ్లిపోయాడు.

ఈ తాండవ రిజర్వాయర్ విశాఖజిల్లా, తూర్పుగోదావరి బోర్డర్‌లో ఉంది. నది పుట్టుక ప్రదేశాన్ని మన్యం అంటారు.


ఏబికె

అల్లూరి సీతారామరాజు తిరిగిన ప్రదేశం. చిట్టడవులూ, గుట్టలూ ఉన్న ప్రదేశం. ఈ రిజర్వాయర్ ఉన్న ప్రదేశాన్ని చేరుకోవాలంటే తునిలో దిగి (ట్రయిన్‌లో వస్తే) నర్సీపట్నం బస్ ఎక్కి మధ్యలో

(పేరుగుర్తులేదు) ఆవూర్లో దిగి అక్కడ తిరిగి బస్ పట్టుకొని 'డాం' స్పాట్‌కి రావాలి. కనెక్షన్ బస్‌లు ఎక్కువ లేవు ఆరోజుల్లో. ఇప్పుడు ఉన్నాయేమో తెలియదు. అలాంటి రోజుల్లో, శివవెంకరాధాకృష్ణ (ఆంధ్రపత్రిక)గారు. విజయవాడలో మరెవరూ ఆర్టిస్ట్‌లు లేనట్టు. "ఈ నవలలో అర్జంట్‌గా బొమ్మలు వెయ్యాలి. ముందు నాలుగు భాగాలకు వేసి, ఆ పార్ట్ పంపేయ్! అని ఆ నవల పోస్ట్‌లో పంపారు. అదే 'బంగారుకలలు' నవల. సిన్మాగా వచ్చింది. టైం లేదు.

వెంటనే మొదటి నాలుగు భాగాలకూ బొమ్మలు వేసి, దాని మేటర్‌తో జతచేసి పంపాను. మాకు ఆ వూరిలో పోస్ట్ రావాలన్నా, వెళ్లాలన్నా ముందు 'తుని పోయి, ఆ పోస్టాఫీస్‌లో స్టార్ట్ అయి గమ్యానికి వెళ్లాలి. మరో రెండు రోజులు ఎక్కువ తీసుకుంటుంది దీనికోసం. అదీ వర్షాలూ, వరదలూ లేకపోతేనే!. వారు అనుకున్న రోజుకి బొమ్మలు అందలేదు. పత్రికా ఆఫీస్‌లో ఒకటే కంగారట. ఓ మనిషిని పంపారు. ఆయన దారీ, తెన్నూ తెలియక నానా బాధలు పడి మా ఆఫీసుకు వచ్చాడు. ఇంటికి తీసుకుపోయి, స్నాన, పానాదుల ఏర్పాటుచేసి, మరో రెండు బొమ్మలు ఆయన చేతిలోపెట్టి, జరిగిన విషయం చెప్పి ఇంకా నేను పంపిన పోస్ట్ 'తుని'లోనే ఉంటే వీరికి ఇవ్వమని మరో లెటర్ తుని పోస్ట్‌మేష్టర్ గారిని అడ్రస్ చేస్తూ రాసి వీరికిచ్చాను.

ఆయనది బందర్ అట– పత్రికాఫీస్‌లో అకౌంట్స్ సెక్షన్‌లో పనిచేస్తారు. ఆయన నన్ను చూసి ఇలా అన్నారు. ఆ మాటలు నాకు గుర్తున్నాయి "ఇంత బాగా బొమ్మలు వేస్తూ, ఇంత గుర్తింపు తెచ్చుకున్న మీరు ఇలా మారుమూల, కొండల్లో ఉండటం బాగా లేదు. ఏదన్నా మెయిన్ బ్రాంచికి , పెద్దవూరికి ట్రాన్స్‌ఫర్ చేయించుకోండి". అన్నాడు.

పాలిటిక్స్, లంచగొండితనం ఉన్న మా డిపార్ట్‌మెంట్‌లో ఇవన్నీ కుదురుతాయా?

తరువాత తెలిసిన విషయమేమంటే ఈయన తుని వెళ్లి పోస్టాఫీస్ ఎంక్వయిరీ చేస్తే ఆ పార్శిల్ అప్పటికే వెళ్లిపోయింది. ఈయన తెల్లారేసరికి ట్రయిన్‌లో విజయవాడ వెళ్లినా, ఆఫీస్ వాళ్లంతా పోస్టాఫీస్‌కీ, ఆఫీస్‌కీ చచ్చీ, చెడీ తిరిగి నిస్సహాయంగా ఉంటే, ఆఖరి బేగ్ తిరగేస్తే అందులోంచి ఆ పార్శిల్ వూడిపడిందట. హమ్మయ్య అని అందరూ ఊపిరిపీల్చుకొని, పేజీల్లో మేటర్ బొమ్మా పెట్టేసరికి, ఆ వారం వీక్లీ ఒకరోజు ఆలస్యంగా మార్కెట్‌లోకి వచ్చిందని తెలిసింది. నేను ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా, బొమ్మలను వీలయినంత ముందుగా అందచేశాను ఆ తరువాత కాలంలో తమాషా ఏమంటే పత్రికలో ఇంకో రెండు వారాల్లో ఆ సీరియల్ అయిపోతుందనగా ముందుగానే 'బంగారుకలలు" సినిమా విడుదలయిపోయింది.

దాని ఫలితం నాకు తెలియదు. అవకాశం వస్తే స్టాఫ్ ఆర్టిస్ట్‌గా వెళ్లడం మంచిదనే నిశ్చయించుకున్నాను.

ఇలా ఈ రంగంలోకి రావడానికి ఈ అనుభవమొక కారణం...



ఇలాంటి పనులమీదే వైజాగ్‌నుంచి వచ్చి హొటల్‌రూంలో విశ్రాంతి తీసుకొని, ఆంధ్రపత్రిక ఆఫీసుకి వెళ్లాను ఒకసారి అది ఏప్రియల్ నెల. ఈ విజయవాడ ఎండలు చురుక్కుమంటున్నాయ్. స్టాఫ్ ఎవరూ ఇంకా రాలేదు. బల్లలు శుభ్రంచేస్తున్న 'బోయ్' వస్తారు కూచోండి అన్నాడు. కొద్దిసేపటిలో సికరాజు వచ్చాడు. పలకరించాను. ఆయనా సమాధానంగా పలకరించి 'బోయ్'ని మంచినీళ్లడిగాడు తాగడానికి 'గ్లాసులేదన్నాడు' ఆ కుర్రాడు.

సికరాజుకి వళ్లు ఇంకా మండిపోయింది.

వేసవికాలం... దాహం.. ఆ సెక్షన్‌లో ఒకటే గాజుగ్లాసు... అది ఇపుడు లేదు.

"ఏమయ్యింది" సికరాజు కేక.

"వీరాజీ గారి టేబుల్లో ఉంది..." ఆ కుర్రాడి సమాధానం. ఇది నాకు మంచి కాలక్షేపం. "ఆయన సొరుగులో పెట్టి వెళ్లిపోయాడన్నమాట. మేమంతా దాహమేస్తే ఇలా చావాల్నమాట! ఉండు–నేనిపుడే మేనేజ్‌మెంట్ దృష్టికి ఈ సంగతి తీసుకెళతాను. ఇంత ధారుణమా?" పొలికేకలు. గబగబా కాగితం మీద ఆ విషయాన్నే రాసి విసురుగా లేచాడు సికరాజు సీట్లోంచి.

ప్రయివేట్ ఆఫీసుల్లో ఇంతగోల ఉంటుందా?

కింద చెక్కమెట్లు ఎక్కుతున్నది వీరాజే. ఈ కేకలకు ఆగిపోయి నింపాదిగా అడుగులో అడుగు వేస్తున్నాడు. అదంతా నాకు కనిపిస్తోంది.

ఏమయింది రా బాబూ! అన్నాడు" ఆ బోయ్‌ని

"మీరు గ్లాసుని సొరుగులో పెట్టుకొని వెళ్లారు. ఆయన మంచినీళ్లు కావాలన్నారు" అన్నాడు గోళ్లు గిల్లుకొంటూ.

"నేను నా టెబుల్‌లో పెట్టుకోవడమేమిటి? అసలు అందులో ఎవరుపెట్టారు" నెత్తి బాదుకున్నాడు. "చూశావా బాలీ! ఆఫీసులో ఉదయాన్నే ఈ గోల. ఇక ఏం పనిచేస్తాం"? తన సీట్లో చతికిలపడ్డాడు చెమట తుడుచుకుంటూ.

ఇద్దరూ ఆ గదిలో –వీక్లీ సెక్షన్‌లోనే ఉండాలి. ఇద్దరికీ సరిపడదు. ఆ తరువాత చాల గోల జరిగింది. ఎక్స్‌ప్లేషన్లూ అయ్యాయి', బోయ్' ఆ గ్లాసు తీసుకొని మంచినీళ్లు ఇవ్వబోతే "చావనన్నా ఛస్తాను గానీ ఆ గ్లాసుతో నీళ్లు తాగనంటాడు సికరాజు. ఎవరూ బ్రతిమాలలేదు. ఇద్దరూ చెరో పేపరూ ముఖాన్న అడ్డంపెట్టుకున్నారు.

నా పని నేను త్వరగానే ముగించుకొని బయటపడ్డాను. ఈ దెబ్బతో వీరాజీ అంటే ఏమిటో, సికరాజు అంటే ఎవరో తెలిసిపోయింది.

( మిగతా వచ్చే సంచికలో)



కళాప్రపంచం

# తెలుగు సాహితీ వెలుగుజాడ - గురజాడ

ఎల్.ఆర్. వెంకటరమణ



*"గుత్తునా యని జాతి ముత్యాల్*
*గుచ్చినాడే మేలి సరముల*
*ఇత్తునా యని తెలుగు తల్లికి*
*ఇచ్చినాడే భక్తితో"*

అంటూ "ముత్యాల సరాల" సృష్టికర్త గురజాడ వారిని కీర్తించాడు-దేవులపల్లికృష్ణశాస్త్రి. ఈ "ముత్యాల సరముల" రాకతో తెలుగు కవిత్వంలో విప్లవశకం ఆరంభమైనదంటాడు-శ్రీశ్రీ. "యువ లోకపు కవుల కలలకు రూపమిచ్చి, ఆధునిక కవిత్వ ధ్వజాన్ని ప్రతిష్ఠించి, నవ్యకవితకు ముత్యాల సరాలు నాంది అన్నాడు"-ఖండవల్లి లక్ష్మీరంజనం.

ఒక సామాజిక చైతన్యం, మానసిక సంవేదన, మానవీయ విలువల ఆదర్శం, అభ్యుదయ దృక్పథం-వ్యవస్థీకరించి తెలుగు కవిత్వానికి పునాది వేసిన వ్యక్తి గురజాడ అప్పారావు.

అప్పారావుగారు 1862 సెప్టెంబరు 21న విశాఖజిల్లా యలమంచిలిలోని రావవరంలో జన్మించారు. తండ్రి వెంకటరామదాసు, తల్లి కౌసల్యమ్మ, విద్యాభ్యాసం విజయనగరంలో జరిగింది. గిడుగు రామమూర్తి, గురజాడ కలిసి చదువుకున్నారు. 1882లోనే "కూకూ" అన్న ఆంగ్ల పద్యం రచించాడు. 1883లో "సారంగధర" అన్న ఆంగ్ల పద్యకావ్యం ప్రచురించాడు. ఈ రచన "ఇండియన్ లీజర్ అవర్" పత్రికలో ప్రచురించబడినది. కలకత్తానుండి వెలువడే "రీస్ అండ్ రయ్యత్" (రాజు, రైతు) పత్రిక సంపాదకుడు శంబు చంద్రముఖర్జీ గురజాడ వారికి ఒక సలహా ఇచ్చారు. అదేమంటే- "ఇంగ్లీషులో ఎంత ప్రావీణ్యం ఉన్నా అది పరభాష అవుతుంది. అందువల్ల మాతృభాషలో రాస్తే ఎప్పటికైనా మంచి పేరు వస్తుందన్నాడు". ఈ మాట ప్రేరణగా పనిచేసి తెలుగులో రచనలు చేశాడు.




1884-86 మధ్య కాలంలో తత్త్వశాస్త్రం, సంస్కృతంతో బి.ఏ. చదివాడు 1885లో 'అప్పలనరసమ్మ'తో వివాహం జరిగింది. విజయనగరం మహారాజా వారి పాఠశాలలో ఉపాధ్యాయ పదవి అలంకరించాడు. 1886 నుండి డిప్యూటీ కలెక్టర్ ఆఫీస్‌లో గుమాస్తా ఉద్యోగం చేశాడు. 1887లో కళాశాలలో ప్రవేశించాడు.

విద్యార్థులకు సంస్కృతం, ఇంగ్లీషు వ్యాకరణం, గ్రీకు -రోమన్ చరిత్రలతో పాటు అనువాద పాఠాలు బోధించేవాడు. 1892లో 'కన్యాశుల్కం" మొదటి కూర్పు ప్రదర్శించబడినది. అనేక సవరణలతో రెండవ కూర్పు 1909లో ప్రచురించబడినది. ఇదే ప్రాచుర్యం పొందింది. ప్రస్తుతం లభిస్తున్నది.

గురజాడవారు "సారంగధర" అన్న ఆంగ్ల కవిత ప్రారంభంలో సుప్రభాత వర్ణన ఇలా ఉంటుంది.- ""The Labouring dawn gave out



the child of light Whose infant became played o'er the river's breast and woke the bees asleep in lotus bowers". దీన్ని రాంభట్ల కృష్ణమూర్తిగారు తెలుగులోకి మారుస్తూ

"వేగు కానువు వెలుగు పాపడు
ఆటలాడెను యేటి తరగల
తుమ్మెసెజ్జల నిదురపోయిన
తెమ్మెదల లేపన్".

గురజాడవారి కవిత్వం అనగానే "దేశభక్తి" గీతం, ముత్యాల సరాలు వెంటనే గుర్తుకు వస్తాయి. 1910లో దేశభక్తి గీతాన్ని ప్రచురించాడు. 1913 ఆగస్టు 9న కృష్ణా పత్రికలో ప్రచురించబడింది. ద్వారం వెంకటస్వామినాయుడు గారు ఈ గీతానికి స్వరాలు కూర్చారు. దేశమంటే మట్టి కాదోయ్– దేశమంటే మనుజులోయ్ అంటూ ఎలుగెత్తి చాటాడు. సొంత లాభం కొంత మానుకు – పొరుగువాడికి తోడుపడవోయి అంటూ మానవ ధర్మాన్ని, సామ్యవాద సారాన్ని మానవీకరించాడు. ఈ పాట వలన గురజాడలో ఒక కవి మాత్రమే కాక– ఆర్థిక శాస్త్రవేత్త, సామాజికవేత్త, మానవతా వాది, తత్త్వవేత్త, వక్త, ప్రవక్త... ఇలా అందరూ ఒక్కటై కనిపిస్తారు. నాటి స్వాతంత్ర్య సంగ్రామానికి తెలుగువాడి వేడిని ఈ గీతం ద్వారా ప్రపంచానికి చాటాడు.

"ముత్యాల సరములు"– 1910 జూలైలో ఆంధ్రభారతి పత్రికలో ప్రచురించబడినాయి. కవిత్వం ప్రజలకు అర్థంకాని భాషలో ఉండరాదని, ప్రజల భాషలోనే ఉండాలని ఆ విధంగా ముత్యాల సరాలు గ్రుచ్చాడు. ఒకజాతి ఫారసీ గజల్ ఛందస్సు నడకతో గురజాడ వారు వీటిని కూర్చాడు. ఇదే విషయాన్ని వ్యాసచంద్రికలో పేర్కొంటాడు. 1953లో పుస్తకరూపంలో వెలువడింది. వాసిరెడ్డి భాస్కరరావు పీఠిక రాశాడు. 1958 ముద్రణలో శ్రీశ్రీ రెండవ పీఠిక రాశాడు.

ఆదికాలంలో తిక్కన, మధ్యకాలంలో వేమన, ఆధునిక కాలంలో గురజాడ మన తెలుగులో మహాకవులు" అంటాడు శ్రీశ్రీ. గణబద్ధ ఛందస్సుల ఫ్యూడలిజం నుండి మాత్రాబద్ధ ఛందస్సుల ప్రజాస్వామ్య యుగానికి ఆంధ్రసాహిత్య చరిత్ర గమనాన్ని పరివర్తన చేసినవాడు గురజాడ అంటాడు.

ఆంగ్ల కవులు వర్డ్స్‌వర్త్, టెన్నిసన్, బర్న్స్– గురజాడ అభిమాన కవులు. వీరు సమకాలీన కవిత్వంలో అనేక ప్రయోగాలు చేసినవారు. వీరి స్ఫూర్తితోనే ముత్యాలసరాల కూర్పు చేసి ఉండాలని విమర్శకుల భావన. ఇదే విషయాన్ని – "ముత్యాలసరములలో"

"కన్ను కానని వస్తుతత్త్వము
కాంచనేర్పరు *లింగిరీజులు;*
కల్లనొల్లరు; వారి విద్యల
కరచి సత్యము నరసితిన్".

ఇందులోనిదే "పూర్ణమ్మ" చిరస్మరణీయ కావ్యం. లవణరాజుకల, కన్యక, సుభద్ర, మనిషి, డామన్ పితియన్, దించులంగరు, లంగరెత్తుము, నీలగారి పాటలు... మరికొన్ని ఇందులో ఉన్నాయి.

ఆధునిక కథానికలకు సరళము, సులభతరం చేస్తూ, సంస్కృత సమాస రహితం చేసిన వచన శైలి అందించినవాడు గురజాడ. వందేళ్ల క్రితం నాటి కథలుగా ఉండవు. కథలోని భాష, వ్యంగ్యం, అధిక్షేపం, హాస్యం కలబోసిన వాక్యనిర్మాణం ఆధునికంగా అగుపిస్తుంది. పాత్రోచిత భాష పట్ల గురజాడ వారి శ్రద్ధ కథలలో కనిపిస్తుంది.

తప్పటడుగులు వేస్తున్న తెలుగు సాహిత్యాన్ని "దిద్దుబాటు" కథానికి రూపంలో అడుగులు తడబడకుండా వేయించి ప్రగతి శీలక మార్గం మీదకు ఎక్కించిన తొలి తెలుగు ఆధునిక రచయిత గురజాడ అప్పారావు. సమాజంలోని స్థితిగతులను ఎక్స్‌పోజ్ చేయడం రచయిత బాధ్యతగా గుర్తించి, అత్యంత నాటకీయ ఎక్స్‌పోజర్ టెక్నిక్‌ను గురజాడ తన రచనలలో ఎంచుకున్నారు.

1910లో వచ్చిన కథానిక "దిద్దుబాటు", భర్త పరాయి స్త్రీ వ్యామోహంతో ప్రతీ రోజూ ఇంటికి ఆలస్యంగా వస్తున్నాడని గ్రహించిన భార్య ఆ సమస్యను ఎలా దిద్దుబాటు చేసుకున్నదన్నదే కథావస్తువు". మూడు పాత్రలు ఇందులో కలవు. కమలినిలోని కుశాగ్రబుద్ధి; రావుది లోని విశ్వాసగుణం; గోపాలరావులోని పశ్చాత్తాపం సంస్కరించబడిన అద్భుత కథ "దిద్దుబాటు".

తెలుగు సాహిత్యానికి తొలి కథానికను అందించాడు గురజాడ. ఆధునికత, దేశీయత, సమకాలీనత, సామాజికత, వాస్తవికత అన్న

పునాదులపై కథానికా సౌధాన్ని నిల్పాడు. తరువాత తరం వారైన చింతాదీక్షితులు, శ్రీపాద, చలం వంటి వారే కాక నేటితరం వారికి కూడా గురజాడ వారి భాషా సూత్రం వర్తిస్తూనే ఉంది.

గురజాడ అంటే "కన్యాశుల్కం", కన్యాశుల్కం అంటే గురజాడ అన్నంతగా ప్రపంచ ఆమోదం పొందిన నాటకం "కన్యాశుల్కం". పురుషుడు తన పెళ్ళికోసం వధువు తల్లిదండ్రులకు డబ్బులివ్వడం 'కన్యాశుల్కం', దీనితో ముడిపడి జరుపుతున్నవి – బాల్యవివాహాలు, అనంతర సమస్యలన్నీ ఈ నాటకంలో కనిపిస్తాయి. పాత్రలు స్వార్థ, లాభ ప్రయోజనాలను ఏవిధంగా ఉపయోగించుకోవాలన్న లౌక్యాన్ని తెలియచేసే సాటకం కన్యాశుల్కం.

నాటకంలో కన్యాశుల్క వివాహం ప్రధానమైతే, విధవా వివాహ సమస్య అంతర నాటకం. అంతర్లీనంగా వేశ్యా సమస్య కూడా కనబడుతుంది. 1880 ప్రాంతంలో ఆనందగజపతి రాజావారు ఒక సర్వే చేయిస్తే దాదాపు 1034 కాన్యశుల్క వివాహాలు జరిగినట్లు సర్వే చెబుతుంది. 1888లో కన్యాశుల్కం బిల్లు ప్రతిపాదించబడినది. ప్రభుత్వం ఈ బిల్లును తిరస్కరించింది.

ఈ నటకాన్ని పరిశీలిస్తే– ఏపని చేయక, మాటలతో కాలం గడిపే "గిరీశం" వంటివారు; ప్రతి విషయాన్ని కోర్టు వరకూ లాగే "రామప్పపంతులు"; కోపంతో ఊగిపోయే "అగ్నిహోత్రావధాన్లు"; అమాయక ప్రజలను మోసగించే దొంగస్వాములు "భైరాగి" వంటివారు; ఏ ఎండకు ఆ గొడుగు పట్టే "అసిరిగాడు"; ముసలితనంతో పెళ్లికావాల్సి వచ్చిన "లుబ్దావధాన్లు"; ఉత్తముడైన న్యాయవాది "సౌజన్యరావు"; వృత్తి వేశ్యఅయిన మంచితనం మాకూ ఉంటుందని చెప్పే "మధురవాణి" వంటి పాత్రలను నేటికి సమాజంలో మనం



చూడవచ్చు. అందుకే "కన్యాశుల్కం" నాటకం సార్వజనీనమైన, సార్వకాలీయమైన నాటకం.

"కన్యాశుల్కం" నాటకం ఎన్నో పలుకుబళ్లు అందించింది. "నాతో మాట్లాడడమే ఓ ఎడ్యుకేషన్"; "డామిట్ కథ అడ్డంగా తిరిగింది"; "తాంబూలాలిచ్చేసేను యిహ తన్నుకు చావండి"; "అనుభవంలోకి వస్తే కానీ తత్వం బోధపడదు"; "అన్నీ వేదాల్లోనే ఉ న్నాయట".... ఇలా ఎన్నో పదబంధాలు తెలుగులో వచ్చి చేరాయి.

గురజాడ సమాజంలో, సాహిత్యంలో పాతుకుపోయిన మూఢవిశ్వాసాలను ఖండిస్తూ హేతువాదాన్ని, మానవతావాదాన్ని ఆవిష్కరించాడు. 1930 నవంబర్ 30న మరణించాడు.





# అభిరుచితో అద్భుతాలను సాధించిన యం.వి. రమణారెడ్డి

- వెంటపల్లి సత్యనారాయణ

**అభిరుచి అనే లక్షణానికి అద్భుతాలను సృష్టించే శక్తి వుంటుందా! అంటే ఉంటుందనే చెప్పాలి. అయితే అభిరుచికి మంచి ఆలోచన, తోడైతేనే అది ఆదర్శంగా మారుతుంది. అందరికీ ఉపయుక్తమౌతుంది. లేకుంటే పొడవైన గెడ్డాలు, కత్తిలాంటి మీసాలు, పొడవాటి గోళ్లు, భీముల్లా బోంచేయడాలు లాంటి మహామహా పనులతో గిన్నిస్ బుక్‌లోనో, లిమ్కా రికార్డుల్లోనో ఎక్కేసి చరిత్ర సృష్టించేయగలరు. కానీ మన వాడికి అంతసీన్‌లేదు. అలాంటి గొప్ప గొప్ప ఆసక్తులతో గొప్ప గొప్ప రికార్డుల్లోకి ఎక్కేయడానికి ఆయనంత తెగబలిసిన ధనవంతుడూ కాదు, పనిలేని పాపాయీ కాదు. కేవలం నెల జీతంపై ఆధారపడి ఇంటింటికీ ఉత్తరాలు బట్వాడా చేసే ఒక సాధారణ పోస్ట్‌మేన్. తన 22 ఏళ్ళ ఉద్యోగ విధి, నిర్వాహణలో ఎప్పుడూ నిర్ణీత పనివేళలను విస్మరించలేదు సరికదా, ఎప్పుడూ ఆఫీసుకు ముందు, ఇంటికి ఆఖరున వెళ్లి, ఏరోజు కూడా పని రేపటికి వాయిదా వేయకుండా రాక్షసంగా పనిచేసి తనపై వాల్లచే "A Cultured male over seer" అని పిలిపించుకుని సగటు భారతీయ ఉద్యోగ విధి నిర్వాహణా రీతులకు తిలోదకాలిచ్చిన పరమచాందస పనిరక్కసి, పుస్తక పిపాసి, ఆదర్శాలను అక్కున చేర్చుకునే ఆశాజీవి అతడే... అతడే 73 ఏళ్ల నవయువకుడు అయిన ముల్లంగి వెంకటరమణారెడ్డి.**

ఇంతకీ ఈయన వెలగబెట్టిన ఆ గొప్ప కార్యమేమిటో నాకు ఈ మధ్యనే తెలిసింది. ఇతను చిత్రకారుడు కాదు, చరిత్రకారుడూ కాదు పోనీ కార్టూనిస్ట్ కూడా కాదు. అలాగని రచయిత అంతకంటే కాదు. కానీ పైన చెప్పిన అన్నింటి మీద, ఆమేరకు వస్తే మొత్తం చరిత్ర, సంస్కృతులపై ఎంతో ఆశక్తి వున్న వ్యక్తి. రాష్ట్రంలో ఎంతోమంది చేయితిరిగిన చిత్రకారులు , చరిత్రకారులు, చిత్రకళావిమర్శకులు, చిత్రకళాచరిత్రను ఔపాసన పట్టేసిన మహామహులు, ఇంకా కవులు, కళాకారులు, కళాపోషకులకు కూడా అంతగా తెలియని ఒక వేళ తెలిసినా అంతగా పట్టించుకోని మన తెలుగు వ్యంగ్య చిత్రాలకు తొలిశెట్టి రామారావు తలిశెట్టి గారి చిత్రాలను, కార్టూన్లను ఎన్నింటినో వెలుగులోకి తెచ్చి చిత్రకళ, కార్టూన్ రంగాలను ఆయా కళాకారులను వెలుగులోకి తేవడానికే కంకణ బద్దులమయ్యామనీ రేయింబవళ్లు ఫీలైపోతున్న మనలాంటి వాల్లందరినీ ఆయన ఆశ్చర్యపరిచాడు. అంతటితో ఊరుకున్నాడా! అంటే అదీ లేదు. ఆలోచన రావడమే ఆలస్యం చలసాని ప్రసాద్, రచన సాయి, ఎ.బి.కే. ప్రసాద్, శ్రీకాకుళం కథానిలయం, లాంటి

పెద్దవాళ్లతోను, పెద్ద సంస్థలతోనూ సంప్రదించడమేకాక జయదేవ్, మోహన్, బాలి, బాబు, బ్నిం, శ్రీధర్, శంకర్, సురేంద్ర, శేఖర్, కళాసాగర్ , శ్రీరమణ లాంటి సీనియర్ కార్టూనిస్టుల సందేశాలు రాయించి, శ్రీశ్రీ ప్రింటర్స్ ద్వారా ఎంతో అందంగా పుస్తక రూపంలోకి తెచ్చి ఆంధ్రలోకానికి అందించేశారు. 75 వసంతాలు పూర్తిచేసుకున్న తెలుగు కార్టూన్‌కు ఆధ్యుడైన తలిశెట్టి రామారావు గారిపై వీరు పుస్తకం ప్రచురించడం ఒక చారిత్రక అవసరం కూడా.



శంకర్స్ వీక్లీ కలక్షన్

కార్టూనిస్టులు, కార్టూన్-ఇష్టులు కళాపోషకులు, కళోద్ధారకులు చేయాల్సిన ఇంతపెద్దపనిని సింగిల్‌హేండ్‌తో చేసిన ఈయనకు ఉన్న అర్హత లేంటో తెలుసుకోవాలన్న ఆశక్తితో అడుగెట్టాను వైజాగ్‌లో. వారి ఇంటికి దారి తెలుసుకొనేందుకు ఫోన్ చేసాను అవతలి వ్యక్తి నుండి కంగుమన్న కంఠం ఎవరూ అని! మేము కళోద్ధారకులమని 64కళలుడాట్‌కాం ద్వారా కళాప్రపంచానికి మిమ్మల్ని పరిచయం చేస్తాం అని, మేము మద్రిపాలెంలో ఉన్నాం అని అనగానే - సర్ అయితే మీరు మాకు దగ్గరలోనే ఉన్నారు నన్ను సైకిల్‌పై రమ్మంటారా అని అడిగారు. మేమే వస్తాంలే అని మా బావమరిది ఆనంద్, నేను కలిసి కారులో బయలుదేరి ఆయనుండే ప్రాంతం మాకు దగ్గరే అయినప్పటికీ మాకు తెలియక చుట్టూ తిరిగి తిరిగి ఎలాగో చేరుకున్నాం. మాధవధారలో స్టేట్ ఎక్సైజ్ ఆఫీసుకి ఎదురుగా ఆయనుండే శ్రీసాయి సూర్య రెసిడెన్సీకి మేము చేరుకునేసరికి గుర్తుగా అనుకుంటాను ఆయన తలిశెట్టి రామారావు గారిపై మొన్న ప్రచురించిన కార్టూన్‌ల పుస్తకం చేతిలో పెట్టుకుని మాకోసం చూస్తున్నారు. వెంటనే ఆబుక్ ద్వారా గుర్తుపట్టాం. ఆయన అపార్ట్‌మెంట్‌లోకి తీసుకెళ్లారు. మూడుగదుల్లో నీట్‌గా అల్మరాల్లో పేర్చిన పుస్తక భాండాగారాన్ని చూసి మాకు కళ్లు బైర్లుకమ్మాయి. మొదటిసారిగా ఈయన సామాన్యుడు కాదు అనిపించింది. అలా మేము తేరుకునేంతలో నెహ్రూ కాలంనాటి అబూ అబ్రహం కార్టూన్ బుక్స్, ఇందిర కాలంనాటి ప్రఖ్యాత కార్టూనిస్ట్ శంకర్ పిల్లే అపురూపమైన శంకర్స్‌వీక్లీల కట్టలు మాముందుంచారు అవి చూస్తూ వున్నంతలోనే మరలా ఆర్.కె. లక్ష్మణ్ నుండి మన బాపు, బాలి, శ్రీధర్ వరకూ ఎన్నో కార్టూన్ పుస్తకాలను బయటకు తీసారు.


రమణారెడ్డి గారితో
రచయిత వెంటపల్లి

అయ్యబాబోయ్ కార్టూన్‌లపై ఇన్ని పుస్తకాలా! అని అనుకున్నంతలో ఒక్కో సబ్జెక్టుపై ఒక్కో పెద్ద బౌండ్ బుక్‌లుగా వచ్చిన ఆంగ్ల కార్టూన్ బుక్స్ "మిస్టర్ పంచ్ బుక్స్ (17) పుస్తకాలు దబీమని మాముందేశారు. ఓరిదేవుడా అని విస్మయం వ్యక్తం చేస్తున్నంతలో, మరలా 1920లలో తలిశెట్టి రామారావుగారు చిత్రాలు మరియు అరుదైన కార్టూన్లు, చిత్రకళపై ఆయన రాసిన ఆర్టికల్స్ అన్నీ చూపించారు. కార్టూన్‌లపై మాపై మోయలేని భారాన్ని వేస్తున్న ఆయన్ని టాపిక్ మార్చాలని చిత్రకళపై దృష్టి మరల్చాం. అంతే ఆయన పుట్టకముందు వెలువడిన The royal Acadamy of Illustrations-1929, 1935, మోడరన్ జర్మన్ ఆర్ట్-1938, ఇంటర్‌నేషనల్ కాంటంపరరీ ఆర్ట్ ఎగ్జిబిషన్ -1946, లాంటి ఎన్నో చిత్రకళకు సంబంధించిన ఆంగ్ల పుస్తకాలతో పాటు కూర్మ్రే, దామెర్ల, అడవి బాపిరాజు, వడ్డాది పాపయ్య, కాపు రాజయ్య, శీలా వీర్రాజు లాంటి చిత్రకారులపైనా ఇంకా చిత్రకళపై ఇతరులు రాసిన పుస్తకాలు కూడా ఎన్నో చూపించారు. ఇక సాహిత్యం గురించి చూసినట్లయితే చలం, శ్రీశ్రీ, భమిడిపాటి కామేశ్వరరావు, ముని మాణిక్యం నరసింహారావు, పానుగంటి లక్ష్మీనరసింహారావు, గోపీచంద్ , అడవి బాపిరాజు, రావిశాస్త్రి, తాపీ దర్మారావు, నారాయణరెడ్డి లాంటి గొప్ప గొప్ప సాహితీ వేత్తల సాహిత్యం అంతా ఆయన అల్మారాల్లో బద్రపరిచారు ఇంతే గాక The left handed Dictionary, Pens and neadles, గాంధీ కార్టూన్లు లాంటి అరుదైన పుస్తకాలతో పాటు, జాగ్రఫీ, నాణేలు, చరిత్రకు సంబంధించిన పుస్తకాలు కూడా ఆయన వద్ద వున్నాయి. ఇంతజ్ఞాన బాండాగారాన్ని సొంతం చేసుకున్న ఆ వ్యక్తి ఒక సాధారణ పోస్ట్‌మేనా? అని మాకు ఆశ్చర్యం కలిగింది. మమ్మల్ని ఇంత

# తలిశెట్టి రామారావు గారు కార్టూనిస్టే కాదు, మంచి చిత్రకారుడు కూడాను...




రమణారెడ్డి గారు సేకరించిన తలిశెట్టి రామారావుగారి ఒరిజినల్ ఫొటో.

ఒకగొప్ప మనుసుతో చేసిన కార్యం ఎంతటి సత్ఫలితాలనిస్తుందో చెప్పడానికి గొప్ప ఉదాహరణ ఈ సంఘటన.

ఇటీవల ఆయన ప్రచురించిన తలిశెట్టి రామారావు గారి కార్టూన్ల పుస్తకాన్ని ఇక్కడ మన తెలుగు వారెవరికీ తెలియనంత దూరంలో ఎక్కడో ఒరిస్సా రాష్ట్రంలో నవరంగ్‌పూర్‌జిల్లా ఉమర్‌కోటలో ఉంటున్న తలిశెట్టి రామారావు గారి అబ్బాయి డాక్టర్ తలిశెట్టి జయరాంకు చేరడంతో ఆశ్చర్యంతో 78 ఏళ్ల వయస్సు జైళ్ళశాఖలో వైద్యాధికారిగా పనిచేసి రిటైరైన ఆయన మహదానందంతో ఆయన వయస్సును సైతం లెక్కచేయక ఆ పుస్తకంలో ఉన్న అడ్రస్‌ను వెతుక్కుంటూ వైజాగ్ వచ్చి శ్రీ ముల్లంగి వెంకటరమణారెడ్డిగారిని కలిసి మేము ఆయన కుమారులమై వుండి, మంచి ఉన్నత స్థానాల్లో ఉండి కూడా మేము చేయలేని గొప్ప పనిని ఓ చిన్న పోస్ట్‌మేన్ గిరీని చేసిన మీరు చేయడం నాకు ఆశ్చర్యం ఆనందం కలిగించాయని, ఆయనను హత్తుకుని అభినందించడమే కాకుండా శ్రీరెడ్డిగారిని బలవంతంగా ఒరిస్సాలో వారు వుండే ఉమర్‌కోటకు తీసుకెళ్లి వారంరోజులు పాటు ఆయన్ను వారింటి వద్ద ఎంతో గౌరవంగా చూసుకోవడమే గాక తనతండ్రి తలిశెట్టి రామారావుగారి కాలంలో ఆయన సేకరించుకున్న మరెన్నో విదేశీకార్టూన్, మరియు చిత్రకళలపై గల దాదాపు 20 పుస్తకాలను మరియు తలిశెట్టి రామారావు గారు స్వయంగా వేసిన మరెన్నో కార్టూన్‌లు, వ్యాసాలను రమణారెడ్డిగారికిచ్చి వారు కృతజ్ఞతలు తెలుపుకోవడం జరిగింది.

కొత్తగా సేకరించిన తలిశెట్టి రామారావు గారి మరిన్ని కార్టూన్లు మరియు ఆయన చరిత్రతో మరోపుస్తకం వేసేందుకు శ్రీకాకుళం కథానిలయం వారు ముందుకు రావడం ఒక ఎత్తైతే ,నేడు తెలుగు పత్రికలలో ఎంతో గొప్ప చింతనాత్మక సారస్వతాన్ని నెలనెలా అందిస్తున్న ప్రఖ్యాత "మిసిమి" మాసపత్రికవారు తలిశెట్టి రామారావుగారిపై ఒక ప్రత్యేక సంచికను వేసేందుకు సన్నద్ధం కావడంతో ఆ వైపుగా నేడు ఆయన ప్రయత్నం చేస్తున్నారు.



తలిశెట్టి రామారావుగారి చిత్రించిన పెయింటింగ్




రమణారెడ్డి గారు ప్రచురించిన తలిశెట్టి రామారావుగారి కార్టూన్ల పుస్తకం



తలిశెట్టి రామారావుగారి చిత్రించిన పెయింటింగ్

ఆశ్చర్యానికి గురిచేసిన ఈ వ్యక్తికి ఇంత గొప్ప ఆశక్తి ఎలా ఏర్పడిందబ్బా! అని ఆరా తీస్తే చెప్పుకొచ్చారాయన.

1954వ సం॥లో "స్వతంత్ర" అనే ఒకవారపత్రికలో డా॥ పి.శ్రీదేవి రచించిన "కాలాతీత వ్యక్తులు" అనే నవలలోని ఇందిర మరియు కృష్ణమూర్తి పాత్రలు రగిలించిన స్ఫూర్తి నాయీ వ్యాపకానికి కారణమన్నారు. ఇంతేనా ఇంకా ఏమైనా ఎగ్జ్రాటలున్నాయా అని అడిగాం. వీరేశలింగం సాహిత్యంతో పాటు తన వద్దనున్న పుస్తకాలు ఇంచుమించు చదివానని చెప్పాడు. విశాఖ పబ్లిక్ లైబ్రరి, జిల్లా గ్రంధాలయ సంస్థ, శ్రీకాకుళం కధానిలయం, కడప బ్రౌన్ లైబ్రరీలకు ఎన్నో వందల పుస్తకాలు దానమిచ్చారు. అందుకు ఆధారాలు కూడా ఆయన చూపించారు. బహువిధ కళాకారుడు "బ్నిం" మరియు కళాసాగర్‌లు ఈయన కృషిని మెచ్చి యిచ్చిన సన్మాన పత్రంతో పాటు ఇంకా వివిధ పౌరసన్మానపత్రాలు అందంగా గదిలో వేలాడతీసారు.



*తలిశెట్టి కార్టూన్ల పుస్తకావిష్కరణ సభలో రమణారెడ్డి గారిని సత్కరిస్తున్న మోహన్, కళాసాగర్, శేఖర్ లు.*

పుట్టింది 01-07-1938న శ్రీవీరరాఘవరెడ్డి, లక్ష్మీనరసమ్మ దంపతులకు పశ్చిమగోదావరి జిల్లా దేవరపల్లి మండలం త్యాజంపూడి గ్రామంలో, చదివింది ఎస్.ఎస్.ఎల్.సి. అయినా చిన్నతనంలోనే వీరేశలింగం సాహిత్యం బాగా వంటి పట్టించుకున్నాడు. చదివింది ఎక్కడికి పోతుంది. బాలవితంతువు మంగాయమ్మను 1957లో పెళ్లి చేసుకోవడమే గాక ఇద్దరు కుమారులకు హంగూ, ఆర్భాటం లేని దండల పెళ్లిళ్ళు చేసారు. అలాగే అమ్మాయికి కులాంతర వివాహం చేసాడు. అంతేగాదు ఎస్.ఓ.ఎస్. చిల్డ్రన్ విలేజ్ నుండి ఒక అమ్మాయిని దత్తత తీసుకుని తనకు వచ్చే కొద్ది పెన్షన్ నుండి ప్రతి నెలా రు. 200/- ఆ అమ్మాయికి ఠంచనుగా పంపిస్తున్నారు. 1968



ఆగస్టు 10న బ్రాంచిపోస్ట్‌మాస్టర్‌గా ఉద్యోగంలో చేరి 1996 జూన్ 30న పదవీవిరమణ చేసారు. తన పిల్లల్లో ఒక అబ్బాయి వైజాగ్‌లో మంచి ఉద్యోగంతో స్థిరపడడంతో 1996 ఆగస్టులో తన మకాంను పూర్తిగా ఏలూరునుండి వైజాగ్‌కు మార్చారు. ఇక ఉద్యోగ విరమణ అయ్యిన పిదప తన జీవితాన్ని పాత పుస్తకాలతో పెనవేసుకున్నారు.

మనకి వంట్లో బాగుండకపోతే 108 వాహనాన్ని నేడు మనం పిలిచినట్టే, ప్రస్తుతం వైజాగ్‌లో ఎవరైన పుస్తకాలు, చీలికలు, పేలికలు అయి జబ్బుపడితే ఈయనకు ఫోన్ చేస్తారు. వెంటనే ఆయన సైకిల్‌పై సదరు చిరునామా గల ఇంటికి స్వయంగా వెళ్లి అక్కడ పాడైపోయిన పుస్తకాలను బయటకు తెస్తారు. సైకిలు వెనుక ఆ పాడైపోయిన పుస్తకాలను మూటకట్టుకుని వెళ్లి, చినిగిన కాగితాలను మరలా అవసరమైతే కొత్తగా జిరాక్స్ తీయించి వాటిని ఆయా స్థానాల్లో జాగ్రత్తగా అతికించి నీట్‌గా బైండింగ్ చేసి ఆపుస్తక యాజమానికి తిరిగి అందజేస్తారు. పుస్తకాలను బ్రతికించితే ఒక తరాన్ని బ్రతికించినట్లే, అవి నా చేతిలో ఉంటే నా పిల్లలు నాచేతిలో ఉన్నట్లే అని ఆయన ఆనందపడతారు.

అద్భుతాలు సృష్టించడానికి ఆర్థికంగా పరిపుష్టిమైన వ్యక్తులే కానవసరం లేదు. బలమైన సంకల్పసిద్ది గనుక వుంటే సామాన్యులు కూడా అసాధ్యాలను సుసాధ్యం చేయవచ్చని నిరూపిస్తున్న ముల్లంగి వెంకటరమణారెడ్డి గారిని మనసులో ఎంతగానో అభినందించుకుంటూ అక్కడినుండి శెలవు తీసుకుని బయలుదేరాను ఇంటికి.

ప్రొఫైల్

# చిత్రకళాన్వేషి - రమణాచారి

**ప్రతీకళాకారుని ప్రతిభ రెండు కోణాల్లో వుంటుంది. మొదటిది పుట్టుకతోనే వచ్చే సహజ ప్రావీణ్యం అయితే రెండవది కృషి, పట్టుదల, నిరంతర అన్వేషణలో రాణించేది. ఇప్పుడు మనం తెలుసుకోబోయే ఆర్టిస్టు మొదటి కోవకు చెందివారు. సంప్రదాయ చిత్రకళలో తనదైన శైలిని సృష్టించుకొన్న చిత్రకారుడు జి. వెంకటరమణాచారి.**

స్వర్ణకళాకారుల వంశములో పుట్టి, బాల్యంనుండి చిత్రకళపై మక్కువతో, నిరంతర కృషితో డ్రాయింగ్ పరీక్షలలో ప్రథమస్థానం పొంది, టి.టి.సి. కోర్సు పూర్తిచేసి 1954లో ప్రభుత్వ పాఠశాలలో చిత్రకళోపాధ్యాయుడుగా జీవితం ప్రారంభించారు. అప్పటినుండి తను చిత్రకారుడిగా పరిణితి చెందుతూ, ఎందరో బాల బాలికలకు చిత్రకళలో శిక్షణయిచ్చారు. 1993సం॥లో డ్రాయింగ్ టీచర్‌గా గవర్నమెంట్ బాలుర జూనియర్ కాలేజీ నుండి ఉద్యోగవిరమణ పొందారు.



రమణాచారి గారు చిత్రించిన ప్రతీ చిత్రానికి ఏదో ఒక ప్రాధాన్యత ఉంటుంది. నీటిరంగులతో వీరి కలర్ కాంబినేషన్ పెయింటింగ్‌లో సాధికారతను తెలియజేస్తుంది.

వీరు భగవాన్ సత్యసాయిబాబా చిత్రం వేస్తున్న సమయంలో కలలో సత్యసాయి కన్పించి, చిత్రాన్ని తను చెప్పిన విధంగా రూపొందించమని కోరారట. అలా పూర్తిచేసిన ఆ చిత్రం తర్వాత పుట్టపర్తి సత్యసాయి భక్తులందరిచే కొనియాడబడినది. అలానే



టి.టి.డి. వారి సన్మానం అందుకుంటున్న రమణాచారి దంపతులు



## రమణాచారి ప్రొఫైల్

| | | |
|---|---|---|
| పేరు | : | గూడూరు వెంకటరమణాచారి |
| పుట్టింది | : | **1-7-1935** |
| జన్మస్థలం | : | అనంతపురం (పాతవూరు) |
| తల్లిదండ్రులు | : | కీ॥శే॥ శ్రీ గూడూరు గోవిందాచారి, శ్రీమతి సుబ్బమ్మ |
| భార్యపేరు | : | శ్రీమతి ఈశ్వరమ్మ |
| చదువు | : | ఇంటర్‌మీడియట్, డ్రాయింగ్ హైయర్-టి.టి.సి, డిప్లొమా ఇన్ ఫైన్ ఆర్ట్సు |
| గురువు | : | కీ.శే. అల్లాబక్ష్ |
| ఉద్యోగము | : | డ్రాయింగ్ మాష్టర్‌గా **1954**వ సం॥లో చేరిక, **1993**వ సం॥లో పదవీ విరమణ |
| సెల్ | : | **9704202402** |

వీరి చిత్రించిన చిత్రాలలో ప్రముఖమైనవి జీసస్, శ్రీకృష్ణదేవరాయలు అశ్వారూరుడై వెళుతున్నట్లు వేసిన చిత్రం, గౌరీకళ్యాణము, శివపార్వతులు, సరస్వతీదేవి, గాంధీజీ పతనం, దీపవనిత, వీణాపాణి, ఎదురుచూపు, ప్రకృతి రమణులు, కోకిల, విధుషీమణులు మొదలగునవి.

చిత్రకళలో వీరి కృషికి గుర్తింపుగా పెనుగొండలో ప్రసిద్ధకవుల సమక్షంలో శ్రీశ్రీశ్రీ కాళేశ్వరస్వామివారు దుశ్శాలువతో సన్మానించి, వీరి ప్రతిభను కొనియాడారు.

ప్రస్తుతం తన 79 యేళ్ళ వయస్సులో కూడా మానసికానందం కోసం చిత్రకళా రచన చేస్తూ-ఆనందమయ జీవితాన్ని అనుభవిస్తున్నారు.

**- ఎస్.బి.ఎస్ మురళీధర్**

అనంతపురం.





# పేరులో నేముంది?!

- అమ్మిన శ్రీనివాసరాజు

మనిషిని, జంతువును వేరు చేసేది భాష. అంతటి గొప్ప భావ వ్యక్తీకరణ శక్తిగల మానవునికున్న మరో ప్రత్యేకత "పేరు" సాధారణంగా మానవులకు పేర్లు మొదట స్వభావాన్ని బట్టి ఏర్పాటు చేసినా ఆ పిదప కృతజ్ఞతకు. అభిమానాలకు చిహ్నాలుగా పేర్లు పెట్టుకోవడం సరిపాటి అయ్యింది. క్రమేణా అసలు పేర్లకు, మనుషులకు సంబంధం లేకుండాపోతుంది.

ఏది ఏమైనా పేరుకు మనిషికి సంబంధం లేకుండా వుండదు అదో అవినాభావ సంబంధం. నేటి సమాజంలో కొందరు పేరున్న ప్రముఖులు అసలు పేరు కన్నా కొసరు పేరుతోనే ప్రాచుర్యంలో వున్నారు. అసలు పేరుతో సంబోధిస్తే వారెవరు అనే ప్రమాదం వుంది.

అందుకే 'అరవైనాలుగు కళలు' అంతర్జాల మాసపత్రిక వీక్షక పాఠకుల కోసం ప్రతి మాసం కొందరు ప్రముఖుల అసలు పేర్లు పరిచయం చేయడమే ఈ ప్రయత్న నేపథ్యం...

| | | |
|---|---|---|
| విద్వాన్ విశ్వం | విశ్వరూప శాస్త్రి | కవి |
| కరుణశ్రీ | జంధ్యాల పాపయ్యశాస్త్రి | భావకవి |
| నిఖిలేశ్వర్ | యాదవరెడ్డి | కవి |
| మహాస్వప్న | కమ్మిశెట్టి వెంకటేశ్వరరావు | కవి |
| నగ్నముని | మానేపల్లి హృషికేశవరావు | కవి |
| ఈలపాట రఘురామయ్య | వెంటకసుబ్బయ్య | రంగస్థల నటుడు |
| బళ్లారి రాఘవ | తాటిపర్తి రాఘవాచార్యులు | రంగస్థల నటుడు |





| | | |
|---|---|---|
| జెన్నీ | పోలాప్రగడజనార్ధనరావు | సినీ హాస్యనటుడు |
| యం.ఎఫ్. హుస్సేన్ | మహ్మద్ ఫిదా హుస్సేన్ | చిత్రకారులు |
| పి.టి. ఉష | పిల్లవల కందితెక పిరంబి ఉష | క్రీడాకారిణి |
| పి.బి.శ్రీనివాస్ | ప్రతివాద భయంకర శ్రీనివాస్ | గాయకుడు |
| క్షేత్రయ్య | వరదయ్య | వాగ్గేయకారుడు |
| డా॥ బి.ఎస్. రాములు | డా॥ బేతి శ్రీరాములు | కథకుడు |



| జి. పుల్లారెడ్డి | గుణంపల్లి పుల్లారెడ్డి | మిఠాయి వర్తకుడు |
|---|---|---|
| అమితాబచ్చన్ | అమితాబ్‌రాయ్ సక్సేనా | హిందీ సినీ నటుడు |
| చక్రపాణి | ఆలూరి వెంకట సుబ్బారావు | సాహితీవేత్త |
| పి. చంద్రశేఖరఆజాద్ | పమిడిముక్కల చంద్రశేఖరఆజాద్ | కథకుడు, నవలారచయిత |
| జయప్రద | లలితారాణి | సినీనటి |
| డి.వి.నరసరాజు | దాట్ల వెంకటనర్సరాజు | సినీరచయిత |
| గజల్ శ్రీనివాస్ | కేశిరాజు శ్రీనివాస్ | గాయకుడు(గజల్స్) |



# పేరులో నేముంది?!







| శంకరనారాయణ | తురిమెళ్ల శంకరనారాయణరావు | హాస్యరచయిత |
|---|---|---|
| పి.బి. శ్రీనివాస్ | ప్రతివాద భంకరశ్రీనివాస్ | గాయకుడు |
| ప్రేమ్‌చంద్ | ధన్‌పత్‌రాయ్ శ్రీవాత్సవ | హిందీ రచయిత |
| త్యాగయ్య | కాకర్ల త్యాగ బ్రహ్మం | వాగ్గేయకారుడు |
| అజంతా | గూడూరి విశ్వనాధ శర్మ | కవి |
| కాళోజీ | రఘువీర్ నారాయణన్ లక్ష్మీకాంత్ శ్రీనివాసరావు-రాంరాజా కాళోజి | సాహితీవేత్త |

# డయాగ్నోసిస్

**'నామాట వినవే... నాకేం కాలేదే'.. గుర్నాధం గోడు.**

**'మీరు ఊర్కోండి. మీకేం తెలీదు...' నిలేసింది అలివేణి.**

**'అబ్బే.. దీన్తో...' సగంలోనే రాగం ఆపాడు. అలివేణి అందుకొంది...**

- బీ.వీ.ఎస్. ప్రసాద్

'ఆం! దీన్తో వేగలేక ఛస్తున్నా అనేగా మీరనేది..

నేనిపుడు మిమ్మల్ని ఏవన్నా పీక పిసికి చంపేశానా? అమాంతం నమిలి మింగేసానా?" గదిమింది... ఏవండీ.. డాక్టరు దగ్గరకు రండీ అన్నా.. అంతేగా" వెంటనే తగ్గింది..

ఏవండోయ్.. మొగుడూ పెళ్లాం అన్నాక ఆ మాత్రం మాట మాట అనుకోక పోతే ఒక సంసారంలో సారం ఏం వున్నట్టు చెప్పండి.

గుర్నాధం మళ్లీ డాక్టరు దగ్గరకు రావల్సిన అవసరం లేదంటున్నాడు.

వేణి ఉంటుంది. ఇదీ వారి వాదన.

'పోయి నెలలోనే చూపించుకొన్న .. టెస్టులు చేశారు. మందులిచ్చారు. వారంక్రితమే మళ్ళీ ఇంకో డాక్టరుకు చూపించాం. టెస్టులు రిపీట్ చేసాడు. మందులిచ్చాడు కదా. వేసుకొంటున్న కదా...' ఇదీ గుర్నాధం వరస.

"వేసుకొన్నారు...రెగ్యులర్‌గా వేసుకొన్నారా? లేదే.. తగ్గలేదే..." చెప్పింది.

ఇంతకీ ప్రోబ్లెం ఏమిటంటే.. గుర్నాధం యూరిన్ పోస్తే బాత్రూం కంపురేగిపోతోంది.. వేణి దగ్గర్లో డాక్టర్ దగ్గరకు తీసుకొని వెళ్లింది. యూరిన్ ఇన్‌ఫెక్షన్ టెస్టులు చేసి మందులు ఇచ్చాడు. వాడినా తగ్గలేదు. నెలైపోతోంది. తగ్గలేదని వారం క్రితం కిడ్నీ స్పెషలిస్ట్ దగ్గరకు తీసుకెళ్లింది అలివేణి. ఆయన స్కానింగ్, స్క్రీనింగ్, ఎమ్, ఆర్. ఐ. గట్రా తీసి 'ఏంలేదులే' అంటూ మందులిచ్చాడు. మరో వారానికల్లా తగ్గిపోవచ్చు అన్నాడు. యిప్పటికి వారం అయింది. ఐనా ప్రోబ్లమే. గుర్మాధం బాత్రూంకి వెళ్లి వచ్చినప్పుడల్లా డెట్టాల్తో క్లీన్ చేయాల్సిందే.

ఏవండోయ్. కిడ్నీలు పాడైతే డయాలసిస్ చేయాల్సివస్తుంది. అంటే నెలకో పాతికవేలు అవుతుంది. అందుకే నేను మిమ్మల్ని మళ్లా రమ్మంటున్నది. విజయవాడ నుండి ఎక్స్‌పర్టు వచ్చాడట. చూపించుకొందాం రండి.. మీరు రానంటే అన్నం తినను..." ఉదయం నుంచీ యిదే గొడవ.

'ఈనెలరోజుల్లో యిప్పటికే స్క్రీనింగులు, స్కానింగులంటూ నెలఖైవేలు తగలేశాం.. మళ్లీనా.. వద్దే... అలగకే అలివేణీ..



బ్రతిమాలాడు గుర్నాధం.

'వస్తారా..రారా... ఫైనల్‌గా చెప్పండి' మూతి ముడుచుకుంది అలివేణి.

'సర్లే.. సాయంత్రం పోదాం' అన్నాడు. దారికి వచ్చాడని అలక అప్పటికి మానింది!

కాస్త కాఫీ తాగి వరండాలో పేపర్ చదువుతున్నాడు గుర్నాధం. వెంకటేశ్వర్లు పలకరించాడు... 'అయ్యగారూ, బాగున్నారా? ఓ షర్టుంటే యిప్పించండయ్యా..." 'సరే. వుండరా'.. అని లోపల్నించి ఒక షర్టూ, టీషర్టూ తెచ్చిచ్చాడు వీదులు చిమ్మే వెంటకటేషుకి.

'ఒరేయ్ వెంకటేషూ,.. ఓసారి లెట్రిన్లూ, బాత్రూంలూ కడిగిపోరా...' పని చెప్పాడు.

'వందైనా యివ్వకపోరని ఆనందపడ్డాడు వెంకటేశ్వర్లు.

'అయ్యగారూ.. అమ్మగారూ వాడే బయట బాత్రూం బాగుంది కాని, ఇంట్లో వున్న గల్లీ ట్రాప్‌లో చెత్త, చెదారం చాలా కాలంగా నిలిచిపోయి ఖంపుకొడుతోందయ్యా.." డెట్టాలు, ఫినైలు యియ్యండి" అని అడిగి బాగా శుభ్రం చేశాడు". ఇక నీళ్ళు యిప్పుడు ధారాళంగా పోయేలా చేశా పని ఎక్కువైంది స్వామీ.. రెండు వందలిమ్మన్నాడు వెంకటేషు.. గుర్నాధం మరో వంద ఎక్కువ ఇచ్చి పంపాడు!

"అలివేణీ! నీ పాదు పోరు పడలేక ఎక్స్‌పర్టు దగ్గరకు వెళ్లుంటే మరో యిరవై వేలు వదిలేవి. మూడు వందల్లో వదిలింది... ఆ మాత్రలన్నీ తెచ్చి కాలువలో పడై!!" అంటున్న గుర్నాధం నవ్వుల్తో నవ్వు కలిపింది అలివేణి సిగ్గుపడుతూ!!

# చాచా నెహ్రూ ప్రేమికులం

- బి.యం.పి.సింగ్

తల్లీ భారతి పిల్లలం - చల్లని వెన్నెల సోనలం
మా కన్నతల్లుల దీవెనలం - తెల్లని మల్లెల తీవలం
ముద్దు మురి'పాల' బుగ్గల కూనలం
నేటికి మేము బాలలం - రేపటికవుతాం పౌరులం
చాచా నెహ్రూ ప్రేమికులం - మన జాతి నౌకలో నావికులం
'సత్యనిరతి'లో బాపూలం - మన దేశ ప్రగతిలో దీపాలం
చదువులతోటే సతమతము - 'స్నేహమె' అందరి అభిమతము
పలకా - బలపం నేస్తాలం - కులమతాలకతీతులం
ఎరుగము మేము ఎత్తు-పల్లం...
అంతట చూస్తాం సమతలం
అల్లరి చేసే పిల్లలమయినా
'అల్లూరి'కి మేమే వారసులం !
కోపం వస్తే కలకలం
నవ్వామంటే... చిలుకలం
తల్లీభారతి పిల్లలం
చల్లని వెన్నెల సోనలం !!

Happy Children's Day

బాలలదినోత్సవం సందర్భంగా

64కళలు.కామ్ www.64kalalu.com
సకల కళల సమాహారం

సంపుటి :2 సంచిక :2 డిశంబర్ 2011



# రెండవ వసంతం లోకి...

## పాఠకులకు, కళాకారులకు ఆంధ్రప్రదేశ్ అవతరణ శుభాకాంక్షలతో....

64కళలుడాట్‌కాం మొదటి సంవత్సరం పూర్తి చేసుకొని రెండవ సంవత్సరంలోకి అడుగుపెట్టింది. కళలపై నున్న ఆశక్తితోనూ-అభిరుచితోను ప్రారంభించిన ఈ వెబ్ పత్రికకు విశేష ఆదరణ లభించింది.

ప్రారంభంలో నెలకు వెయ్యిమంది రీడర్స్‌ను (యూజర్స్) కలిగివున్న 64కళలు డాట్‌కాంను ప్రస్తుతం పదివేలకు పైగా యూజర్స్ విజిట్ చేస్తున్నారు. మొదటి సంవత్సరం పూర్తైన సందర్భంగా కొన్ని కొత్త శీర్షికలను ప్రారంభించనున్నాము. త్వరలో ఆ వివరాలు కూడా ప్రకటిస్తాం.

రెండవ సంవత్సరంలోకి అడుగిడిన సందర్భంగా కళాకారుల నుండి, కళాభిమానుల నుండి శుభాకాంక్షలు, ప్రశంసలు అందుతూనే వున్నాయి. వారందరికీ మా కృతజ్ఞతాభివందనాలు.

**కళాసాగర్**
ఎడిటర్

ముఖచిత్రం చిత్రకారుడు : **సురేష్ కె.వి.**



ఈ సంచిక లోని రచనల్లో ఆయా రచయితలు వెలిబుచ్చిన భావాలు వారి సొంత భావాలు మాత్రమే

# అలరించిన "ఆర్ట్‌బీట్"

**చిన్నారుల్లో అంతర్లీనంగా దాగివున్న సృజనాత్మక శక్తిని వెలికి తీసి నగరంలో ఆర్ట్ అండ్ ఆర్ట్ కల్చర్‌ని అభివృద్ధి చేయాలనే ముఖ్య ఉద్దేశంతో నగరానికి చెందిన "స్ఫూర్తి" క్రియేటివ్ ఆర్ట్ స్కూల్ ఆధ్వర్యంలో బందర్‌రోడ్ గల మాంటిస్సోరి ఆడిటోరియంలో నవంబర్ 25, 26 మరియు 27వ తేదీల్లో నిర్వహించిన ఆర్ట్‌బీట్-2011 కార్యక్రమానికి విశేష స్పందన లభించింది. కె.జి. నుండి పి.జి చదివే 30 మంది విద్యార్థులు చిత్రించిన 1000 పెయింటింగ్‌లతో చిత్రకళా ప్రదర్శన ఏర్పాటు చేసారు.**



డా॥ రావి శారద, జి. శ్రీనివాస్ మరియు స్నేహ

ఈ కార్యక్రమాన్ని కృష్ణాజిల్లా జాయింట్ కలెక్టర్ శ్రీ గౌరవ్ ఉప్పల్ లాంఛనంగా ప్రారంభించారు. అనంతరం చిన్నారి చిత్రకారులనుద్దేశిస్తూ ఆయన మాట్లాడుతూ చిత్రలేఖనం వలన సృజనాత్మకత, ఏకాగ్రత పెరుగుతాయని తద్వారా వారు విద్యలో సైతం రాణించగలరన్నారు. చిన్నారులు చిత్రించిన పలు చిత్రాలను ఆయన తిలకిస్తూ... వాటిల్లో దాగివున్న భావాన్ని అడిగి తెలుసుకున్నారు. నగరంలో చిత్రకళకి పునరుజ్జీవనం కల్పించేందుకు ఇలాంటి కార్యక్రమాలను నిర్వహిస్తున్న "స్ఫూర్తి" డైరెక్టర్ జి. శ్రీనివాస్‌ని ఆయన అభినందించారు. ఈ చిత్రకళా ప్రదర్శనలో చిన్నారులు చిత్రించిన పెన్సిల్ షేడింగ్, కలర్ పెన్సిల్, ఆయిల్ పేస్టల్, వాటర్/పోస్టర్/ఆయిల్ పెయింటింగ్స్ చాలా బాగున్నాయని ఆయన ఆనందం వ్యక్తం చేసారు. ఇంకా ఆ రోజు కార్యక్రమంలో నాట్యాచార్య సరవరపు రమేష్‌బాబు, పాతూరి నాగభూషణం లైబ్రరీ సైన్సెస్ ప్రిన్సిపాల్ డా॥ రావి శారద, ఎస్.ఆర్.ఆర్ కళాశాల లెక్చరర్ ఇళ్ళారవి, విక్రమ్ పబ్లిసర్స్ అధినేత శ్రీనివాస విక్రమ్ తదితరులు పాల్గొన్నారు. ఈ కార్యక్రమం సందర్భంగా ఏర్పాటు చేసిన ఆదర్శ సాంస్కృతిక నృత్యనికేతన్ వారి సాంస్కృతిక కార్యక్రమాలు ఆహుతులను అలరించాయి.

ఆర్ట్‌బీట్ కార్యక్రమంలో భాగంగా నవంబర్ 26న "టాలెంట్‌హంట్" పేరుతో నిర్వహించిన రాష్ట్రస్థాయి చిత్రలేఖనం పోటీలకు రాష్ట్రం నలుమూలల నుండి 3,500 మంది విద్యార్థులు ఈ కాంటెస్ట్‌లో పాల్గొన్న చిన్నారులు తమ మదిలో మెదిలే భావాలకు చక్కటి రూపమిచ్చి ఎంతో సందేశాత్మకంగా చిత్రాలను రూపొందించి పెద్దలను సైతం ఆశ్చర్యపరిచారు. అదే రోజు సాయంత్రం ఏర్పాటు చేసిన బహుమతి ప్రధానోత్సవ కార్యక్రమానికి కృష్ణాజిల్లా యువజన








సత్కారం అందుకుంటున్న కళాసాగర్

అంతరించిపోతున్న కళలకు జీవం పోస్తున్న ప్రముఖ విద్యావేత్త, మాంటిస్సోరి విద్యాసంస్థల డైరక్టర్ వి. కోటేశ్వరమ్మకి స్ఫూర్తి సంస్థ "కళాపోషక" అవార్డునిచ్చి సత్కరించింది. అలాగే చిత్రకళలో గత కొన్ని సంవత్సరాలుగా విశేష సేవలందిస్తున్న సీనియర్ చిత్రకారుడు నెల్లి బాబూరావు, ప్రముఖ కార్టూనిస్ట్, 64కళలు.కామ్ ఎడిటర్ కళాసాగర్‌లను స్ఫూర్తి సంస్థ "కళారత్న" అవార్డుతో ఘనంగా సత్కరించింది. అనంతరం ఆర్ట్‌బీట్-2011లో పాల్గొని తమ చిత్రకళా నైపుణ్యంతో నగరవాసులను ఆహ్లాదపరచిన 30 మంది చిన్నారులను స్ఫూర్తి సంస్థ విలువైన బహుమతులతో ఘన సన్మానంతో అభినందించారు. అలాగే ఒక్కో విభాగంలో బెస్ట్ ఎంట్రీల రూపంలో ప్రత్యేక అవార్డులనిచ్చి

సంక్షేమ శాఖాధికారి, ఎ.పి. స్టడీసర్కిల్ ప్రత్యేకాధికారి డా॥ వెలగా జోషి ముఖ్య అతిధిగా విచ్చేసారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ నేటి తరం చిన్నారులను సృజనాత్మకత కలిగిన పలు రంగాల వైపు ప్రోత్సహిస్తున్న వారి తల్లిదండ్రులను ఆయన అభినందించారు. తలపండిన పెద్దలను సైతం ఆలోచింపచేసే విధంగా చిత్రాలు గీసిన చిన్నారుల చిత్రకళా నైపుణ్యానికి ఆయన జై కొట్టారు. అనంతరం పోటీల్లో గెలుపొందిన విజేతలకు బంగారు, వెండి, రజిత పతకాలతో పాటు ప్రశంసా పత్రం, జ్ఞాపిక మరియు వరల్డ్ ఆఫ్ టైటాన్ వారి జూప్ వాచ్‌లను అందజేసారు. ఇంకా ఈ కార్యక్రమంలో విజయవాడ అర్బన్ కమిటీ డెవలప్‌మెంట్ ప్రాజెక్ట్ ఆఫీసర్ విశ్వేశ్వరనాయుడు, 93.5 రెడ్ ఎఫ్.ఎమ్ రేడియో జాకీ రిమ్ జిమ్ రియా, టైటాన్ ఇండస్ట్రీస్ రిటైల్ ఆఫీసర్ ఎ. నాగేంద్రబాబు, బిజినెస్ పోస్ట్ సెంటర్ ఇన్‌ఛార్జ్ ఎ.రవి, రోహిత్ ప్రింటర్స్ అధినేత పి.అప్పారావు తదితరులు పాల్గొన్నారు. ఈ సందర్భంగా ఏర్పాటు చేసిన ప్రముఖ మిమిక్రీ ఆర్టిస్ట్ సిల్వెస్టర్ మాట్లాడే బొమ్మ కార్యక్రమం చిన్నారులను అమితంగా ఆకట్టుకుంది. ఈ కార్యక్రమానికి ప్రారంభంలో "మోడ్రన్‌డాన్స్ ఇనిస్టిట్యూట్" వారి సాంస్కృతిక కార్యక్రమాలు అతిధులను అలరించాయి.

ఆర్ట్‌బీట్ ముగింపు కార్యక్రమంలో కళాకారులను ప్రోత్సహిస్తూ..

ప్రోత్సహించింది. ఈ కార్యక్రమానికి కోనసీమ చిత్రకళాపరిషత్ డైరక్టర్ శ్రీ కొరసాల సీతారామ స్వామి ముఖ్య అతిధిగా విచ్చేసారు. ఎక్స్‌రే సంస్థ అధ్యక్షులు కొల్లూరి సభాధ్యక్షత వహించగా సమన ఫ్యాషన్ టెక్నాలజీ డైరక్టర్ సమనా మొసావి, హిందూ దినపత్రిక రీజినల్ జనరల్ మేనేజర్ చంద్రశేఖరన్, ఎన్.సి.సి. వింగ్ కమాండర్ ఎస్.ఎస్.సింగర్, అల్లు రాంబాబు, గోవింద రాజులు, గుంటూరు చిత్రాకారులు దేవీ ప్రసాద్, ఒస్మాన్‌ఖాన్ తదితరులు పాల్గొన్నారు.

**- జి.శ్రీనివాస్**

డైరక్టర్.





బహుమతి అందజేస్తున్న అతిథులు

# 'చిత్ర' మైన జీవితం

Part-8

**ప్రముఖచిత్రకారుడు, కార్టూనిస్టు, కథారచయిత బాలిగారు 64కళలుడాట్‌కాం పాఠకులకోసం తన కళాజీవిత విశేషాలను, బాల్యస్మృతులను, పరిచయాలను ధారావాహిక రూపంలో అందించనున్నారు. నెల నెలా చిత్రమైన జీవితంలో...**





email: balisankar@gmail.com

## ఒకసారి విజయవాడలో

**వైజాగ్‌లో, చేస్తున్న ఉద్యోగంలో ఇమడ లేకపోతున్నాను. ఇన్ని బొమ్మలు వేస్తున్నాను ఇంతలా నన్ను ఉపయోగించుకొంటున్నారే, ఈ ఆంధ్రజ్యోతి సంస్థవారు. ఇందులోనే ఉద్యోగం అడిగితే... ఆఫీస్‌లో పని అయిపోయిన తరువాత ఆ సాయంకాలం ఆయనతో పాటు (పురాణం) ఆయన ఇంటికి వెళుతున్నాం.**

ఇద్దరం పక్కపక్కన నడుస్తున్నాం. ఉద్యోగం విషయం అడిగాను. ఏ స్థలంలో ఆ మాట అడిగానో ఇంకా గుర్తుంది. బందర్



రోడ్డు మీద నుండి బాడవపేట టర్నింగ్‌లో నాలుగడుగులు వేసిం తరువాత. అక్కడ ఆ రోజు రోడ్ వేస్తున్నారు. కిందంతా గ్రయినేట్ రాళ్లు గుచ్చుకొంటున్నాయి. ఆయన ఆగిపోయాడు. నా ముఖంలోకి చూస్తున్నాడు. రమ్మంటాడా? వద్దంటాడా??(రికమెండేషన్ మాత్రం చెయ్యగలడు. అంతా మేనేజ్‌మెంట్ వారి ఇష్టమని నాకూ తెలుసు) ఇంట్లో పెళ్లాం వత్తిడి బట్టీ న్యాయాధీశుల తీర్పులుంటాయన్న పాత జోక్ గుర్తొచ్చింది. కిందరాళ్లు గుచ్చుకోవడం, నొప్పి పెట్టడం బట్టి ఈయన మాట ఉంటుందనిపించింది. నన్ను తిరిగి ఎగాదిగా చూసి అన్నాడు" పత్రికాఫీసు అన్నది రైలింజన్ లాంటిది. దాంతో పరుగులు తియ్యాలి".. పరుగులు వేయగలవా"? అన్నాడు.

నేను మౌనంగా అయిపోయాను.

తిరిగి నడక మొదలెట్టాం. సమాధానం లేకపోయినా ఆయన నా కోసం ఆలోచిస్తున్నట్టు తెలిసిపోయింది.

మధ్యలో ఓ సంవత్సరం గడిచినదనుకుంటాను. వైజాగ్‌లో 'ఈనాడు' దినపత్రిక మొదలయ్యింది. నా పాత ఆఫీసుకి శెలవుపెట్టి అందులో చేరిపోయాను. ఈ విషయంలో ఎక్కువ మోరల్ సపోర్ట్ ఇచ్చినవారు 'డాక్టర్ తంబు'. రామోజీరావుగారు నాకు అప్పటిలో "బిలీవ్ ఇట్ ఆర్ నాట్" పుస్తకాలు, ఆయన సేకరించిన "మేడ్"పుస్తకాల బౌండ్లు ఇచ్చారు. అవి ఇంచు ఆఫీసు లైబ్రరీలోనివన్నమాట? 'బిలీవ్ ఇట్ ఆర్ నాట్' (నమ్ము! నమ్మకపో)లోని కొన్ని పేజీలు, మరికొన్ని వాటితో కలిపి కొత్త పేజీలు తయారు చేసి ఆదివారం ఈనాడులో

ఆయన కోరిక మేర వేసేవాడిని. అన్ని పత్రికల్లో వచ్చే వాటికి భిన్నంగా హెడ్డింగ్‌లు ఎడిటర్ గారిస్తే, పక్కన చిన్న చిన్న బొమ్మలతో డిజైన్ చేసి వాడేము. అప్పటిలో అదో ఆకర్షణ. దినఫలాలు, వారఫలాలు, ఈరోజు తిధులు ఇటువంటివి 'ఈనాడు' పత్రికలో ఆనాడు లేవు. అంతా మార్పు. ఈ కొత్తదనం, ఈ మార్పు అందర్నీ ఆకర్షించేది. ఆయన నన్ను అభిమానంగానే చూసుకున్నారు. "ఏ.బి.కే" గారి ఫామిలీ కూడా. విజయవాడ నుండి విశాఖపట్నం సీతమ్మధార చేరుకుంది. ఆఫీసు లైఫ్ సజావుగానే సాగుతోంది. ముందో ఆరునెలలు ప్రిపరేషన్ కోసం అందరికీ ట్రయినింగ్ ఇచ్చి ఆ తరువాత పేపర్ ప్రింటయి మార్కెట్‌కు రావడం మొదలయ్యింది. హైదరాబాద్‌లో ఉన్న చలసాని ప్రసాదరావుగారు తను చేస్తున్న గవర్నమెంట్ ఆఫీస్‌కి రిజైన్ చేసి ఈనాడులో చేరినట్టు విన్నాను. నన్నూ, ఎడిటర్‌గార్నీ 'ఈనాడు'కి మెయిన్ ఆఫీస్ హైదరాబాద్, కాబట్టీ హెడ్‌క్వార్టర్‌లోనే ఉంటే బాగుంటుందని తాఖీదు వచ్చింది. ఆయనా, నేనూ అలాగే వచ్చేశాం. అక్కడి నుండే విశాఖపట్టణం 'ఈనాడు'కి కార్టూన్‌లూ, ఆదివారం స్పెషల్ మేటర్‌కి బొమ్మలూ పంపేవాడిని. అలా వేసిన కొన్ని బొమ్మలూ, కార్టూన్‌లూ బాగున్నాయని రామోజీరావుగారి దగ్గర్నుండి 'ఉత్తరాలు వచ్చాయి. (అవి ఇప్పటికీ నా డెయిరీలో ఉన్నాయి).

అయితే ఆయనకు 'టైమ్స్ ఆఫ్ ఇండియా' చిత్రకారుడు ఆర్.కె. లక్ష్మణ్' అంటే ఇష్టం. అది అప్పుడే తెలిసింది. ఒకసారి మా మధ్య మాటల్లో 'లక్ష్మణ్ దగ్గరకు వెళదాం. పరిచయం చేస్తానన్నారు". ఆయన బొమ్మలూ, అందులోని పెరస్పెక్టివ్, లైన్లూ నాకూ ఇష్టమే. ఈ


మేరియో మిరండా తో బాలి

రూపంలోనన్నా ఆయన్ను కలవవచ్చన్నది. నామైండ్‌లో నిలిచిపోయింది.

ఆ తరువాత రోజుల్లో–రామోజీరావుగారు 'లక్ష్మణ్'ని పరిచయం చెయ్యలేకపోయినా, ఆ కోరిక మరోలా తీరింది. నా కజిన్‌బ్రదర్ బొంబాయిలో రైల్వేలో ఉంటున్నాడు. ఆయన ఆఫీస్‌కీ "టైమ్స్ ఆఫ్ ఇండియా" ఆఫీస్‌కి మహా దగ్గర. అలా నేను బొంబాయి వెళ్లినపుడు మా కజిన్ నన్ను ఆ ఆఫీస్‌కి తీసుకెళ్లాడు. మీరు "ఒక గంట' ఆగాలి అని లక్ష్మణ్ రూం ముందరి బోయ్ అన్నాడు. ఆ టైంలో సరిగ్గా కింద స్టెయిర్‌లో ఉన్న "మేరియో మిరండా" చక్కటి ఇంటర్వ్యూ ఇచ్చి మాట్లాడేడు తన సంతకంతో కూడిన తన ప్రచురణ (కార్టూన్)ను ఇచ్చాడు. తనకు తోచకపోతే ఎదురుగా గోడకు అంటించిన 3×5 అంగులాల సన్నని గీతలలో అది కొంచెం భాగమే అయ్యింది. ఇంకా ఏదో పెన్సిల్ స్కెచ్ ఉంది. ఉన్నంత సేపు హాయిగా నవ్వుకున్నాం. లక్ష్మణ్ నుండి కబురు వచ్చింది. వెళ్లాం– కార్టూనిస్ట్ ముఖము ఏడుపు గొట్టులా ఉంది. మూడీఫెలో అట. ఏదో మాటాడేడు. అంతా హిపోక్రసీ బయటకొచ్చాక మమ్మల్నే గమనిస్తున్న ఓ ఆయన్ని అడిగాను 'లక్ష్మణ్ గారి సంగతి ఏమిటా అని?" ఆయన పెదవి విరిచాడు ఆయనంతే! విజిటర్స్‌తో ఆయన పద్ధతే అంత. పైగా 'కమల' విడాకుల కేసు వేసింది 'కమల' ఆయన భార్య సినిమాల్లో శాస్త్రీయనృత్యాలు చేస్తుంది. ఇద్దరి మధ్యా గొడవలు. "కమాలక్ష్మణ్" ఆమె పూర్తిపేరు. వీధి వేపు చూపించాడు. గోడపక్కనున్న క్రోటన్ మొక్కలలో రాయిమీదకూర్చుని, ఇనుపగ్రిల్స్‌ను ఆనుకొని ఓ పది పదకొండేళ్ల కుర్రాడు స్కూలు యూనిఫాంలో కాలిబూట్లతో రాళ్లతో ఆడుకొంటున్నాడు 'అతడెవరో తెలుసా! లక్ష్మణ్ కొడుకు. అమ్మా, నాన్నల మధ్య నలిగిపోతున్నాడు" అన్నాడాయన.


ఆర్.కె. లక్ష్మణ్ తో బాలి

ఆ ఆఫీసు మెట్లు దిగుతూ ఆ కుర్రవాడిని చూశాను. చెమటలు పట్టిన ముఖం. తెల్లగా నీరసంగా ఉన్నాడు.

విశాఖపట్నం ఈనాడులో చేరక ముందు నుండీ నేను పత్రికలకు ఫ్రీలాన్స్‌గా బొమ్మలు వేయడం వల్ల "జ్యోతి" మాసపత్రిక స్థాపకులు "లీలావతి రాఘవయ్య"గారి నుండి కార్డు వచ్చింది. "మీరు హైదరాబాద్ ఈనాడులో స్టాఫ్‌గా చేరినట్లు తెలిసింది. సంతోషం. అయితే మీరు బయట పత్రికలకు ఎప్పటి వలె బొమ్మలు వేయవచ్చా? త్వరలోనే జ్యోతి సంక్రాంతి ప్రత్యేక సంచిక రాబోతోంది. బొమ్మలు వేయిద్దాం అనుకొంటున్నాం. ఏ సంగతీ త్వరలో చెప్పగలరు. "ఇదీ ఆ ఉత్తరంలోని సారాంశం.

ఆకార్డ్‌ను నా టేబుల్ మీద ఆఫీస్‌బోయ్ పెట్టినట్టున్నాడు. అప్పుడే నేను ఆఫీస్‌కు వచ్చాను. ఈ ఆఫీస్ అబిడ్స్‌లోని మార్గదర్శి ఆఫీస్‌లోని ఓ వింగ్. తెచ్చిన కేరియర్ బల్లకిందపెట్టి ఉత్తరం చదివి, బాత్‌రూంకి వెళ్లాను.

ఈ ఆఫీస్‌లో జాయిన్ అయినప్పటి నుండీ అంటే ఈ హైదరాబద్ వచ్చినప్పటినుంచి చూస్తున్నాను. చలసాని ప్రసాద్‌రావు నన్ను వదలడం లేదు అంటే అది నా మీదగల గొప్ప అభిమానం అనుకుంటున్నాను. దూరంగా, పక్కగదిలో ఉన్న నా సీటుని తన పక్క సీటుగా మార్పించాడు. ఆఫీస్ వదిలేవరకూ ఎవరితోనూ నన్ను కలవనివ్వడు. మాట్లాడనివ్వడు. నేను బాత్‌రూంలోంచి వచ్చి నాటేబుల్‌పై పెట్టిన ఉత్తరం కోసం వెతికాను. గాలికి ఎగిరిపోయిందేమోనని బల్లకిందా, ఆ పక్కా ఈ పక్కా చూశాను దొరకలేదు. అప్పుటికి చలసాని ప్రసాద్‌రావు వచ్చేశారు. ఆయన పుస్తకాలు టిఫిన్ బాక్స్ ఉన్న బేగ్ ఆయన బల్ల చివర కనిపిస్తున్నాయి. నా కుర్చీలో నేను సరిగ్గా కూర్చొని ఆరోజు వచ్చిన పేపర్ చూస్తున్నాను. రామోజీరావుగారి కేబిన్ నుండి కబురువచ్చింది. వెళ్లాను. చలసాని,



రామోజీరావు



చలసాని ప్రసాదరావు



రామోజీరావుగారి ఎదురుగా ఉన్న కుర్చీలో ఉన్నాడు. ఆయన టేబుల్ మీద ఇందాక నాకు వచ్చిన ఉత్తరం ఉంది చూశాను. అసహ్యంవేసింది. తనో నమ్మకమయిన, విశ్వాసంగల వ్యక్తిగా ప్రూవ్ చేసుకుంటున్నాడన్నమాట ఈ చలసాని. "మీరేం నిర్ణయించుకున్నారని అడిగారు""ఇప్పుడే కదా వచ్చాను. ఇంకా సరిగ్గా చదవనన్నా లేదు. బాత్‌రూంకి వెళ్లానన్నాను". "నేను ప్రతి ఒక్కరి మీదా పక్క వారితోని నిఘా పెడతాను. లేకపోతే ఇంత పెద్ద సంస్థను నడపడటం కష్టం కదా" అన్నారు.

నేనేం మాట్లాడలేదు.

ఇక మాటలు అయిపోయినట్టున్నాయి. నేను తిరిగి వచ్చి నా సీట్లో కూర్చున్నాను. ఆలోచించాను. ఇంతలో నా ఎదురుబల్ల మీదకు రచయిత 'రామవరపు వేణుగోపాలరావు' వచ్చాడు. రిజైన్ లెటర్ రాశాను. ఆయన కోమారు చూపించి, మడత పెట్టి రామోజీరావుగారి కేబిన్‌కు వెళ్లి ఆయన ముందుంచాను. దాన్ని ఆయన తెరవలేదు దాన్ని. "అదేమిటో చెప్పగలను" అన్నారు. సంతోషం నన్ను మీరు



అతను ఇంకా ఏదో చెప్పాడు. నేనేదో చెప్పాను. నేను గట్టిగానే నిర్ణయించుకున్నాను. అక్కడ్నుంచి తిన్నగా అప్పటిలో కృష్ణా నగర్‌లో ఉంటున్న 'నార్ల వెంకటేశ్వరరావు'గారి ఇంటికి వెళ్లాను. ఆయన భార్య సులోచనగారు బయటకు వచ్చారు. నన్ను బాగా రిసీవ్ చేసుకున్నారు. విషయం చెప్పాను ఓ కొద్ది సేపటిలో ఇంటర్వ్యూలోలా పిచ్చాపాటీ మాట్లాడేరు. అంతకుముందెప్పుడో 'బాలి' ఆంధ్రజ్యోతిలో చేరితే బాగుంటుందని నార్ల వారు అన్నారని పురాణంగారు చెప్పారు. ఇప్పుడు ఆవిషయమే గుర్తు చేశాను. అదే ధైర్యం. "అయితే ఆయన గవర్నమెంట్ సర్వీస్‌లో ఉన్నాడుగా. వస్తాడా!" అన్నది నార్లవారి ప్రశ్న. ఇపుడెలాగూ గవర్నమెంట్ సర్వీస్‌లోంచి బయటకొచ్చాను. "ఈనాడు" ముచ్చటా తీరిపోయింది. ఇల్లంతా చూపించారు. ఇంటి నిండా చెక్క బీరువాల నిండా పుస్తకాలే! అక్కడక్కడా పాలరాతి బొమ్మలు, వీధిలో మెట్లపక్కా, గేటుకు వెళ్లేవరకూ రాతి శిల్పాలు.

'నేను ఈరోజే విజవాడ ఆఫీసుకు ఫోన్ చేస్తాను రెండు మూడు రోజుల్లో ఇక్కడి పనులు చూసుకొని వెళ్లిపో" అన్నారు. అలా అంటూనే నా ముందే ఫోన్ చేశారు. అట్నుంచీ సమాధానం వచ్చింది.

ఆ తరువాత రెండురోజుల్లో కుటుంబంతో విజయవాడ వెళ్లిపోయాను. ఈ రెండురోజుల్లోనే పురాణంగారు మొగల్రాజపురంలో ఉన్న ఎర్రమేడలోని వారి పక్క పోర్షన్‌ను నాకోసం చూసి అట్టిపెట్టి ఉంచారు. తిన్నగా అందులోకి ప్రవేశించాను.

ఆంధ్రజ్యోతి ఆఫీస్‌లో నాకు కావలసినంత వర్క్ ఉండేది. నేను ఎదగాలి, నాకదే కావాలి. వీక్లీ మొత్తం నేనే అయినా డెయిలీ పేపర్ వర్క్ కూడా చేసేవాడిని. అన్ని సంవత్సరాలు అక్కడ పనిచేసినా డెయిలీ ఎడిటర్ రామ్మోహనరావుగారి సన్నిహితంలో మూడు విషయాలు తమాషాగా జరిగాయి.

మొదటిది– ఒకరోజు సాయంత్రం మూడుగంటల ప్రాంతంలో ఆయన నా సీట్లోకి ఓ ఫొటో తీసుకొచ్చారు. అది బెంగాలీ రచయిత 'శరత్‌బాబు'ది ఫొటో బాగుంది. ఆ ఫోజులో ఆయన చాల చోట్ల కనిపిస్తాడు. ఇది రేపు లైన్ డ్రాయింగ్‌లో వేసి ఇవ్వండి. అంతవరకూ మీ సొరుగులో ఉంచండి అన్నారు. అలాగే చేశాను. మరుసటి రోజు మామూలుగా పదిగంటలకు ఆఫీసుకు వచ్చి సొరుగు తెరిస్తే ఫొటో లేదు. వేసిన తాళం వేసినట్టే ఉంది. ఇక్కడ నైట్ డ్యూటీ చేసేవారు, డూప్లికేట్ తాళంలతో అన్ని సొరుగులూ చక్కపెడతారని నాకు అంతవరకూ తెలీదు.

ఈ రంగానికి పరిచయం చేసినందుకు" అన్నాను. చలసాని ఇంకా అక్కడే ఉన్నాడు.

నేను నా సీట్లోకి తిరిగి వచ్చేశాను.

చలసాని వెంటనే నా సీట్లోకి పరుగెత్తుకొని వచ్చాడు. అతని స్పైనల్‌కార్డ్ పనిచెయ్యదు. ఆయన మాట మనకు వినబడదు. కాగితం మీద రాస్తాడు. ఆ పక్కనే సమాధానం మనం రాస్తాము. మనం అటూ ఇటూ చూస్తాము. ఆ కాయితం ముక్కలు జేబులో పెట్టుకొని అవసరమయినపుడు "విట్‌నెస్‌గా" ప్రదర్శిస్తాడు. ఇది ఆయన అలవాటు.

"పదకిందకు కాఫీకెళదాం" అన్నాడు.

దగ్గరలోని హోటల్‌కు తీసుకెళ్లి. "నీకెంతో భవిష్యత్ ఉంది. తొందరపడ్డావ్" అన్నాడు.

మరి ఇతను తొందరపడలేదా! నన్నెందుకు మొత్తం విషయం అడగలేదు. ఎందుకీ దొంగబుద్ధి.

నేనూ ఆ ఫోటో కోసం మొత్తం సరుగు వెతికాను. కాసేపటిలో ఆయనా వచ్చారు. ఇందులో పెట్టాను. మీరూ చూశారు కదా! ఇపుడు కనపడడం లేదన్నాను.

ఆయన కొంచె బాధపడ్డారు "ఇక్కడ ఇంటిదొంగలున్నారు. ఇకపై విలువైన వస్తువులు ఇందులో పెట్టకండి "అన్నారు. ఇక రెండోది–

నా కార్టూన్‌ల సంకలనం 'న్యూస్టూడెంట్' వారు వేస్తానన్నారు. దానికి ముందు మాట కావాలన్నాను. "ఇబ్బందిగా ముఖంపెట్టి" మన గురించి మనం రాసుకుంటే బావుంటుందా" అన్నారు. "ఇల్‌స్ట్రేటెడ్ వీక్లీ"లో 'మేరిమో మిరండా' లాంటి కార్టూనిస్ట్ సంకలనానికి ఎడిటర్ 'కుష్వంత్‌సింగ్' గారు రాయలేదా?" అన్నాను. ఓ క్షణం ఆలోచించి" సరే రాస్తానన్నారు".

సాయంకాలానికే రాసి ఇచ్చేశారు కూడ. అయితే అందులో నేను ఆశించినది ఒకటి! ఆయన ఇచ్చింది వేరు. ఆయన రాతల్లో నా బొమ్మల గురించే కావాలి. మంచీ, చెడూ ఏదన్నాగానీ. కానీ ఆయన ఎవరెవర్నో చెప్పారు. అది నాకిష్టం లేదు. అడిగేను కాబట్టి యధాతధంగా ప్రింటుకి ఇచ్చేశాను.

ఇక మూడవది–

బాలజ్యోతి పత్రిక పిల్లల పత్రిక వారిని ఆకర్షించడం కోసం రకరకాల శీర్షికలు అందులో నిర్వహించేవారు. 'శశికాంత్ శాత్‌కర్ణి' దానికి ఎడిటర్. పేరు ఆయనిదే గానీ సలహాలన్నీ రామమోహనరావు గారివే. అందులో నా పార్టిషిపేసన్ చాల ఉండేది. అందులో ఒకటి ఏమంటే రామమోహనరావుగారు ఆంధ్రపత్రికలో (వీక్లీ) పనిచేస్తున్నపుడు అట్ట రెండవ, మూడవ పేజీల్లో బొమ్మల పంచతంత్రం నడిపించేవారట. ఆ చిత్రకారుడెవరో నాకు తెలియదు. మిత్రబేధం, మిత్రలాభం, కాక ఉలూకీయం ఇవన్నీ అలా వచ్చి చాల పాప్యులర్ అయ్యాయట. కథ చివర్లో వచ్చే "ఎవరా రాజు? ఏమా కథ" లేక ఎవరాచిన్నది? ఏమా కథ?" అనే మాటలు వస్తాయి. ఈ మాటలను ఆ రోజుల్లో ప్రతిఇంట్లో, ప్రతి కాలేజీల్లో స్టూడెంట్స్ ప్రయోగించేవారని ఆయన చెప్పారు. ఇపుడు తిరిగి అదే రచనను, చిన్న చిన్న మార్పులతో, నాతో బొమ్మలు వేయించి ఈ పిల్లలపత్రికలో ప్రకటించాలి. అలాగే వేశాను. మూడు, నాలుగు సంవత్సరాలు వేసి ఉంటాను. బొమ్మలూ బాగా వచ్చాయి. పుస్తకంగా వస్తే బాగుంటుంది. అదే విషయం ఆయనతో చెప్పాను. ఇంట్రస్టు చూపలేదు. "రంగుల్లో ఎవరు వేస్తారు" అని పెదవి విరిచారు. అదే వ్యక్తి ఆ మధ్య ఫోన్ చేశారు. ఆ వర్క్ అన్నీ కరెక్ట్ చేశావా? అని. ఏం చెపుతాను?. ఆ



మొత్తం వర్కంతా ఆంధ్రజ్యోతిలో ఉండిపోయింది. ఊరుకున్నాను. మంచి వర్క్ అలా పోయింది. ఈ మూడు సంఘటనలూ తప్ప ఆయనతో ఏ ఇబ్బందీ కలగలేదు. ఆయనకు కావలసినవి 'బాలి' బొమ్మలు. అరగంటలో అందించే వాడ్ని, నా బల్ల ముందు కుర్చీలో కూర్చుని ఎన్నో బొమ్మలు గీయించుకున్నారు.

ఇక్కడే మరో విశేషం చెప్పుకోవాలి, నా కన్నా సీనియర్, నా సాటి చిత్రకారుడు ఆంధ్రజ్యోతి డెయిలీలో బొమ్మలూ, కార్టూన్‌లూ గీసే "ఈ.వి.ఆర్" గురించి. తొలినాళ్లలో ఈ ఆంధ్రజ్యోతి ఆఫీస్ లబ్బీపేటలో (విజయవాడ) అదే కాంపౌండ్‌లో ఓమూల ఉండేది. అది ఒకప్పుడు పొగాకు బేరన్స్ అట. ముందు చాల ఖాళీ స్థలం. ఆ స్థలంలో పక్కా బిల్డింగ్ కట్టి మిషన్‌ల ఏర్పాటు చేసి చక్కగా తీర్చిదిద్దారు. ఆతరువాత దశలో. నేను ఆఫీస్‌లో అడుగుపెట్టింది ఆ ఖాళీస్థలంలో ఓమూలగా ఉన్నప్పుడే. అదే ఆంధ్రజ్యోతి ఆఫీసును మొట్టమొదటగా చూడడం. వరండా లాంటి స్థలంలో చిన్న చిన్న బల్లలూ, కుర్చీలూ ఉన్నాయి. సమయం ఉదయం తొమ్మిదిగంటలు. ఇంకా ఎడిటర్లు ఎవరూ రాలేదు. మరో అరగంటలో ఆ పత్రిక స్టాఫ్ ఆర్టిస్ట్ వచ్చాడు. నన్ను నేను పరిచయం చేసుకున్నాను. పెన్సిల్‌లో స్కెచ్ మొదలెట్టాడు స్కెచ్ అయిపోయింది. దాన్ని ఇంక్ చెయ్యాలి.

ఆయనకు అలవాటు అనుకుంటాను. బ్రష్‌కు ఇంక్ ఎక్కువయితే పాయింట్ కోసం ఇంక్ బాటిల్‌కు రాయడం మానేసి, లేకపోతే, చిన్న వేస్ట్ పేపర్ ముక్కయినా దగ్గర పెట్టుకోడం మానేసి వెనక గోడమీద దులుపుతున్నాడు. గోడంతా ఇంక్ మరకలతో, రంగుల మరకలతో కరాబుగా ఉంది.

సరే! ఈ యన అలవాటు కొత్తగా ఉందే అనుకున్నాను. ఆర్ట్‌లో 'హయ్యర్' పాసయినట్టు చెప్పాడు. నాకు ఇప్పటివరకూ ఆర్ట్‌లో ఏ డిగ్రీలూ లేవు, ఎవరో ఇచ్చిన సర్టిఫికెట్ తప్ప! మరికొన్ని సంవత్సరాలు ఇదే ఆంధ్రజ్యోతిలో నేనూ స్టాఫ్ ఆర్టిస్ట్‌గా చేరి ఆయన పక్క సీట్లోనే కూర్చోవలసి వచ్చింది క్రమేపీ ఆయన మేనరిజమ్స్ తెలియవచ్చాయి. గోడకు విదిల్చే ఆయన, రంగులూ, ఇంక్‌లూ పక్కనున్న డస్ట్‌బిన్‌కే పరిమితమయ్యాయి. అది రంగు రంగులుగా తయారయింది. ఇది కొంచెం మార్పు. ఇంకా విశేషమేమంటే ఆయనకు బొమ్మలు వేయడంలో శ్రద్ధ లేదని తెలిసింది. వాడిన బ్రష్‌లూ, కలాలూ కడిగేవాడు కాదు (ఇది మంచి చిత్రకారులకుండే లక్షణం కాదు). అతను డెయిరీలో పొలిటికల్ కార్టూన్స్ వేయాలి కాబట్టి లైన్లకు, కేరక్టర్ డిజైన్లకు, బ్యాక్‌గ్రౌండ్ కంపోజింగ్‌లకు పనికి వస్తుందని కాబోలు ఎడిటర్ నార్ల వెంకటేశ్వరరావు పాత మెయిల్ పేపర్లలో వేసిన ఫ్రంట్ పేజీ కార్టూన్లను కత్తిరించి ఓ పెద్ద బౌండ్ బుక్‌లో అంటింపచేసి బహూకరించారు. ఈ.వి.ఆర్. కు. కానీ ఈయన ఆ పుస్తకంలోని పేజీలు ఏనాడూ తిప్పలేదు. ఎడమచేతికింద రెస్ట్‌గా ఉపయోగించేవాడు. ఏది ఎలాగున్నా డెయిలీ పాకెట్ కార్టూన్‌లు వెయ్యడం తప్పనిసరి. బ్రష్ కడగడం ఇంక్‌లో ముంచడం శ్రమ అని కాబోలు మైక్రో టిప్ పెన్‌తో బొమ్మలు వేయడం మొదలెట్టాడు.

నాకు వారంలో కొన్ని రోజులు తలెత్తి, చుట్టూ చూసేటంత తీరిక ఉండేదికాదు. "నా బొమ్మలు 'ఎవరో' ఆర్టిస్ట్ బొమ్మల్లా ఉంటాయనీ, కాపీ కొడతాననీ, ప్రచారం మొదలెట్టాడు. అదే నిజమయితే అన్ని బొమ్మలు ఆ ఎవరో ఆర్టిస్ట్ నుండి తీసుకోగలమా? ఇంతేకాదు మీరు ఈనాడు దినపత్రిక నుండి వచ్చారు. కదా! అక్కడ ఉండకుండా అనవసరంగా వచ్చారని బుర్ర తినేసేవాడు. నా ఇబ్బందులూ, నా విషయాలు ఆయనకేంతెలుసు. అతనితో మాటలు తగ్గించుకున్నాను. ఆ తరువాత్తరువాత మానేశాను. నా సీటును మరో చోట, మరో గదిలో వేయించమని ఎడిటర్‌గారిని అడిగాను. ఆర్టిస్ట్‌లందరూ ఒకే చోట ఉంటే బాగుంటుందని ఆయన సలహా ఇక ఇది తప్పలేదు. తలవంచుకొని బొమ్మలు వేసుకోవడమే నా వంతయ్యింది.

ప్రతిరోజూ సాయంకాలం మూడు గంటలలోపు ఇ.వి.ఆర్. పాకెట్ కార్టూన్‌ను ఎడిటర్ గార్కికి అందచేయవలసి ఉండేది. ఒక సారి టైమ్ నాలుగయినా ఆయన బొమ్మలను వేయలేదు. ఐడియాల కోసం ఆయన చేతిలో నిన్నటి ఆంధ్రజ్యోతి నలుగుతోంది. పేజీ మేకప్ చేయించే సీనియర్ ఎటడిటర్ 'వీరభద్రరావు' గారు కంపోజిటర్‌ను వెంట బెట్టుకొని ఆయనసీట్‌లోకి వచ్చారు. "ఈ.వి.ఆర్' గారు ఇంకా మీరు పాకెట్ కార్టూన్‌ను గీయలేదా" అని అడిగారు.

"ఐడియాలు రావడం లేదండీ" అన్నాడాయన

ఆయన వాచీ చూసుకొంటూ, ఇంకెపుడిస్తారు. టైము నాలుగుదాటుతోంది. ఇంకా మీరు గీయాలి. బ్లాక్‌చేయాలి. పేజీల్లో పెట్టాలి". కంపోజిటర్ వేపు తిరిగి నాగేశ్వరరావ్ వీరికి ఈ పూట ఐడియాలు వచ్చేటట్టులేవు వీరిది ఏదన్నా పాత బ్లాక్ తియ్యి. బుట్టలో ఉంటుంది. చిన్న వార్తలాంటి జోక్ దానికి రాద్దాం" అన్నారు.

ఇద్దరూ వెళ్లిపోయారు.

ఇది ఒక సీనియర్ ఆర్టిస్ట్‌కి పెద్ద దెబ్బ!

అవమానం!!

ఉదయం నుండి మొదటి పేజీలో రావలసిన ఓ ఐదు సెంటీమీటర్ల బొమ్మ గీయలేదంటే ఎంత అవమానం. అప్పటికి ఆయనకు ఆరు సంవత్సరాలన్నా అనుభవమన్నా ఉంది. ఇదో పెద్ద లెషన్



నాకు . ఇలాంటి పరిస్థితి తెచ్చుకోరాదన్న మాట. మనసులోనే అనుకున్నాను.

ఆంధ్రజ్యోతిలో చేరాంటే రైలింజన్‌లా నువ్వు పరుగులు తీయాలి అని లోగడ నన్ను భయపెట్టిన పురాణంగారు ఆ మాట మరచిపోయారు. నేను జాయిన్ అవడం మొదలు ఆయన ఎంతో హ్యాపీ ఫీలయ్యారు. సెలక్ట్ చేసిన కథలు కట్టలు కట్టలుగా నా బల్లమీదకు చేరేవి. వాటికి వరుస నెంబర్లు వంటివి లేవు. నాకు నచ్చిన కథల్ని, చదివించే గుణం ఉన్నవి ఎన్నకొని ముందుగా వాటిఇక బొమ్మలు వేసేవాడ్ని. కొన్ని రెకమెండేషన్ కథలు, కొన్ని తప్పని పరిస్థితుల్లువేయవలసిన కథలు, ఇలాంటివి శర్మగారే దగ్గరకొచ్చి చెప్పేవారు. వాటిఇక వెంటనే బొమ్మలు వేసి ఇచ్చేసేవాడిని.

కొన్ని మహాచెత్త కథలు-కిట్టింపుకథలు. అయినా బొమ్మలు వేయకతప్పదు. నిజానికి కథే బొమ్మవేయించుకుంటుంది. నేను ఆంధ్రజ్యోతిలో చేరే వరకూ శర్మ చక్కటి రచయిత అయితే కావచ్చునేమోగానీ, చక్కటి ఆర్టిస్టిక్ పేజ్‌మేకర్‌కాదు. నేను ఎంత చక్కటి బొమ్మవేసినా, ఆ బొమ్మకింద ఎర్రపెన్సిల్‌తో రెండు కాలములు-మూడు కాలములు అనే రాసేవారు. అంటే ఆ బొమ్మ రెండుడ కాలముకొలతో బ్లాకు చెయ్యమనీ- మూడు కాలముల కొలతలో బ్లాకు చెయ్యమనీ అన్నమాట.

ఆయన అలా బొమ్మకింద సజెషన్ చేయగానే ఆ బొమ్మలు పట్టుకెళుతున్న నాగేశ్వరరావు లేక డేనియల్ వెనకనే వెళ్లి ఆ సైజులును కొట్టివేసి చిత్రకారుడ్ని నేను కాబట్టి నేను అనుకున్న సైజు కాలం కొలత వేసేవాడిని. నాగేశ్వరరావు గానీ, డేనియల్ గానీ నన్ను అబ్జెక్షన్ పెట్టేవారు కాదు. గౌరవించేవారు. అందువల్ల పేజీలు అందంగా వచ్చేవి. పురాణంగారు ఒకమారు మాటల సందర్భంలో ఒప్పుకున్నారు కూడా "నాకు ఈ పేజీలు గోల తెలియదు కంటెన్యూయేషన్ చూసుకుంటాను. కథలు రాస్తాను. రాయిస్తాను అంతే అని".

*నిజానికి పేజ్‌మేకప్ అన్నది గొప్పకళ. అదోకోర్స్. ఒకపేజీలో ఓ బొమ్మగానీ, ఫొటోగానీ, కార్టూన్ గానీ, లేకపోయి వఠి మేటరే ఉంటే ఏమిటీ ఈ "గోడపేజీ" అని నార్లవారు విసుక్కొనేవారట. బొంబాయి ఇల్‌స్ట్రేటెడ్ వీక్లీలో అలాంటి స్టాఫ్‌ని చూశాను. పేజ్‌మేకప్‌లో ప్రత్యేక శ్రద్ధ వారు తీసుకుంటారు. అలా ఆ పేజీలు పూర్తయ్యే వరకూ ప్రెస్‌లో నిలబడేవారు.*

నేను కథలకు బొమ్మలు వేస్తూనే, కొత్త కొత్త పద్ధతుల కోసం ఆలోచిస్తూనే, నాశ్రమకూ, ఆలోచనలకూ మెరుగులు దిద్దుకునేవాడిని.

నేను విజయవాడలోనే వారి అందుబాటులోనే ఉండటం వలన ఏలూరురోడ్‌లోని చాలమంది పబ్లిషర్స్ పరిచయమయి వర్క్ ఇస్తూండేవారు. ముఖచిత్రాలు, లేకపోతే కొత్తగా అచ్చేసిన వారి పుస్తకాల అడ్వర్‌టైజ్‌మెంట్లూ ఇలాంటివి. స్పెషల్ ఇష్యూల రోజుల్లో వర్క్ మరీ ఎక్కువగా ఉండేది. సకాలంలోనే వారికి వర్క్ చేసి రిటర్న్ చెయ్యడం వలన మంచి గుడ్‌విల్లే సంపాదించాను. వీటివల్ల మరో కొత్త గొడవ వచ్చింది. నవలలు పట్టుకొని రచయిత్రులు మా ఇంటికి రావడం మొదలెట్టారు. సీరియల్‌గా వచ్చిన నవలలుంటే మంచి పబ్లిషర్స్ (బాగా డబ్బులిచ్చే)ను చూసి పెట్టమనీ, స్క్రిప్ట్ ఉంటే ఆంధ్రజ్యోతిలో పురాణంగార్కి చెప్పి సీరియల్‌గా వేయించమనీ (రికమండేషన్) ఇలాంటివి.

నేను ఏదో పనిమీద గుంటూరు వెళ్తున్నాను. బస్‌లో పెద్దగా రష్ లేదు. సీట్లో కూర్చున్న ముందుకు వంగి టికెట్ చెక్ చేసుకుంటున్నాను. ఇంతలో నా వీపు మీద దభీమని పెద్ద గుద్దుపడింది. నడుం విరిగినంత పని అయ్యింది. పైన ఉన్న పెట్టో, బుట్టో వీపు మీద పడిందనుకున్నాను. అప్రయత్నంగానే నా నోటి వెంట అమ్మదేవుడా! అని వచ్చింది. పక్కకు చూస్తే నవ్వుతున్న చలసాని ప్రసాద్‌రావుగారు. మూగభాషలో కొంచెం సంజ్ఞచేస్తూ ఎలా ఉన్నావ్!" అన్నాడు. ఇప్పటి వరకూ బాగానే ఉన్నాను -ఇదిగో నువ్వు చేరావుగా!" అన్నాను. వీపు తడుముకొంటూ, ఆయన కసిని అలా తీర్చుకున్నాడు.

వెనక సీట్లో ఆయన భార్యా, పిల్లలూ కూర్చుంటున్నారు. చూపించాడు.

"నిన్ను చూసాను-అందుకే ఇటొచ్చాను, షాపులోల్లకి ఎడ్వర్‌టైజ్‌మెంట్లు బాగానే గీస్తున్నావే అన్నాడు.

ఏదో చెప్పాను. అతనేదో చెప్పాడు సంజ్ఞతో. ఇక ఆ తరువాత ఆయన్ని కలవలేదు. హైదరాబాద్ వచ్చినా కలవడానికి నేనే ఇష్టపడలేదు చనిపోయాడని పేపర్లో చదివాను. మంచి ఆర్ట్‌క్రిటిక్. గొప్ప శాడిస్ట్.

ఇక ఆ తరువాత నా అనుభవాలన్నీ ఆంధ్రజ్యోతి, విజయవాడతోనే ముడిపడి ఉన్నాయి.

*మిగతా తరువాయి సంచికలో....*

నీరాజనం

# వడ్డాది పాపయ్య కు స్నేహితులు లేరా !




***డిశంబరు 30 న వడ్డాదిపాపయ్య గారి 19 వ వర్ధంతి సందర్భంగా వారి స్నేహితులలో ముఖ్యులు సుంకర చలపతిరావుగారు తెలిపిన కొన్ని ముఖ్య విషయాలు మీకోసం...***

వ.పా., పావనం, వడ్డాదిపాపయ్య అనేపేరు తెలుగు చిత్రకళారంగంతో పరిచయం వున్న వారికీ, పత్రికా పాఠకులకీ సుపరిచితం. 1940-90ల మధ్య కాలంలో పిల్లల పత్రిక 'చందమామ', పెద్దల పత్రిక 'యువ' తర్వాత స్వాతి పత్రికల్లో వేలాది వర్ణచిత్రాల్ని గీసి, అటు సాహితీ అభిమానుల్ని, ఇటు కళాభిమానుల్ని అలరించిన ఆంధ్రుల అభిమాన చిత్రకారుడు వడ్డాదిపాపయ్య. ఆయన చిత్రాల గురించి తెలిసినంతగా ఆయన్ని గురించి ఎవరకీ తెలియదు. పొగడ్తలకు, ప్రశంసలకు, సన్మానాలకు, ప్రచారాలకు ఆమడ దూరంగా ఉండేవారు.

శ్రీకాకుళం/కశింకోటలో ఆయన్ని చూడటానికి ఎవరైనా వెళ్ళినా నిర్మొహమాటంగా తిప్పి పంపేవారు. అది ఆయన తత్వం. ఆయన బొమ్మలను గాని, ఆయన స్టూడియోని గాని ఎవరికీ చూపించడానికి ఇష్టపడేవారు కాదు. అలాంటి వ.పా. కు స్నేహితులు ఎవరూ లేరా! అంటే... ఉన్నారు. వారు కూడా బహు తక్కువ. అలాంటి వారిలో ముఖ్యులు విశాఖపట్నానికి చెందిన చిత్రకారుడు, చిత్రకళావిమర్శకులు, శ్రీ సుంకరచలపతిరావు. వపాతో వీరిది పాతికేళ్ల స్నేహం. ఉత్తర ప్రత్యుత్తరాలు జరపడం, ఇంటర్వ్యూలు తీసుకోవడం, వ.పా. వేసిన చిత్రాలు వీలున్నప్పుడల్లా కశింకోట వెళ్లి చూసి వచ్చేవారు. వ.పా. ఒరిజినల్ చిత్రాలు చూసి తరించే భాగ్యం లభించడం తన అదృష్టం అని చలపతిరావు ఇప్పటికీ గర్వంగా చూసుకుంటారు. వ.పా.లతో స్నేహం జీవితంలో తనకో మధురస్మృతి అంటారు. వ.పా. గొప్ప చిత్రాకారుడే కాదు, అంతకు మించిన సాహితీపరుడు కూడా. పోతన భాగవతం ఆయనకు అత్యంత ఇష్టమైన గ్రంథం. 1944లో 'కథాంజలి' అనే మాసపత్రికకు దిగంతరేఖ, నాగ కథలు రాసారు. శకుంతల కథ, బుద్ధుడుపై రేఖాచిత్రాలతో కథలు రాసారు. అవినీతిపై రాష్ట్రపతి, ప్రధానీ, సర్పంచ్ అనే వర్ణచిత్రాలు గీసారు. జంబూలోకచరిత్ర కథ ద్వారా అవినీతిని ఎండకట్టారు. పురాణాలు, ఇతిహాసాలు, రాగాలు, రుతువులు, సమకాలీన సమస్యలపై ఆయన గీయని చిత్రం లేదని చలపతిరావు చెప్పారు.



వ.పా.తో వున్న పరిచయం పురస్కరించుకొని రంగులరాజు (తెలుగు) ది వేకింగ్ డ్రీమర్ ఇన్ కలర్స్ (ఇంగ్లీషు) గ్రంథాన్ని రచించి ప్రచురించారు. అంతేకాక వ.పా. 'లేఖల్ని' పుస్తకంగా ప్రచురించారు చలపతిరావు. యువ, చందమామలో ప్రచరించిన సుమారు 500 చిత్రాలను ఈయన బధ్రపరిచారు. 1992లో వ.పా. మరణించినప్పటి నుండి ప్రతీ సంవత్సరం ఆయన 'వర్ధంతి' సభలను నిర్వహిస్తున్నారు. ఇటీవల వ.పా.పై వీరు రాసిన 'వ.పా. జీవితచరిత్ర' పుస్తకాన్ని హైదరాబాద్‌కు చెందిన సి.పి.బ్రౌన్ అకాడెమీ వారు ప్రచురించారు. ఇందులో వ.పా. జీవిత చరిత్రతో పాటు 30 రంగుల చిత్రాలు కూడా ఉన్నాయి.

వ.పా.తో ముఖాముఖి జరిపిన ఇంటర్వ్యూ 'ఆడియో కేసెట్' (40 నిమిషాలు) కూడా వీరి వద్ద ఉంది.

తెలుగుదనానికి ప్రతీకమైన వ.పా. చిత్రాల్ని 'తెలుగు విశ్వవిద్యాలయం' సేకరించి బధ్రపర్చాలని చలపతిరావుగారి సూచన.

వ.పా. స్నేహితునిగా తెలుగుజాతి గర్వించదగ్గ చిత్రకారుని అజరామరం చేసేందుకు చలపతిరావుగారు చేస్తున్న కృషి ప్రశంసనీయం.

# ఉలివాడని శిల్పి- ఇనపకుర్తి

సమ్‌థింక్ స్పెషల్

వృత్తి కొందరికి పొట్టనింపే వ్యాపకమయితే, మరొకరికి ఓ తపస్సు. ఎల్లప్పుడూ శ్రమిస్తూ, మనసును తొలుచుకుంటూ, మధనపడుతూ వృత్తి ఔన్నత్యాన్ని చాటడానికి, తమ ప్రతిభను ప్రదర్శించడానికి కృషిచేస్తుంటారు. ఈ రెండో కోవకు చెందినవారే డ్రాయింగ్ టీచర్ ఇనపకుర్తి సత్యనారాయణ. ఉపాధ్యాయుడుగా విధ్యార్థులకు చిత్రలేఖనంలో ఓనమాలు నేర్పుతూనే, తనకు ఇష్టమైన చిత్రకళలో కొత్త ఒరవల్లకు శ్రీకారం చుడుతూ ప్రశంసలందుకుంటున్నారు. లోతైన ఆలోచన, సామాజిక స్పృహ, అరుదైన సృజనాత్మకత ఆయన చిత్రాల్లో, శిల్పాల్లో మనకు కనిపిస్తాయి. సబ్బుబిళ్లలపైన, సుద్దముక్కలపైన దేవతారూపాలను, ప్రముఖుల రూపాలను రూపొందించి కళాప్రియులను అలరిస్తున్న సత్యనారాయణ గారి కుంచె కబుర్లు ఈ నెల "సమ్‌థింక్ స్పెషల్"లో చదవండి.



Cell: 9440184494



చాక్‌పీస్‌లపై చెక్కిన బొమ్మలు



సబ్బుబిళ్ళపై చెక్కిన వినాయకుడి శిల్పం



సబ్బుబిళ్ళపై చెక్కిన చంద్రబాబు

## ఇనపకుర్తి - పర్సనల్ చిత్రం

| | | |
|---|---|---|
| పేరు | : | **ఇనపకుర్తి చిన సత్యనారాయణ** |
| కుంచెపేరు | : | శ్రీను |
| పుట్టినతేది | : | 15-11-1966 |
| తల్లిదండ్రులు | : | సత్యవతి, సూర్యనారాయణ |
| స్వస్థలం | : | లంకలపల్లిపాలెం, పూసపాటిరేగ (మండలం) |
| వృత్తి | : | చిత్రకళోపాధ్యాయుడు, జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, రఘుమండ, డెంకాడ (మండలం) విజయనగరం (పోస్ట్) |
| చిత్రకళా గురువు: | | శ్రీ కర్రి బ్రహ్మానందంగారు |
| చదువు | : | బి.ఎ. |
| సాంకేతిక విద్య | : | డ్రాయింగ్ హయ్యర్ టి.టి.సి. రాజమండ్రి, కాకినాడలో |
| ప్రవృత్తి | : | కవితలు, కథలు వ్రాయటం |
| ఉద్యోగస్థలాలు | : | 1992 వేపాడ, 2003 పూసపాటిరేగ, 2011 రఘుమండ జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాలలో. |


ఎక్స్‌రే ఉత్తమ కవితా అవార్డు అందుకుంటూ..


చంద్రబాబునాయుడు అభినందనలు అందుకుంటూ..

### చిత్రకళా విజయాలు:

- 1999 కల్పనా కల్చరల్ ఎడ్యుకేషన్ సొసైటీ. పార్వతీపురం, రాష్ట్రస్థాయి బహుమతి.
- 2000 ప్రతిమా ఆర్ట్ సొసైటీ హనుమకొండ, కళారత్న అవార్డు
- 2001 ప్రతిమా ఆర్ట్ సొసైటీ- గుంటూరు కళాపోషక్ అవార్డు
- 2001. ది ఆర్ట్ క్లబ్, విశాఖపట్నం- సబల హైలీ కమాండేడ్ సర్టిఫికేట్
- 2002 ప్రతిమా ఆర్ట్ సొసైటీ గుంటూరు- కళాతపస్వి అవార్డు
- 2002 లలితకళాపరిషత్ విశాఖపట్నం- ప్రతిభా పురస్కారం
- 2003 ప్రతిమా ఆర్ట్ సొసైటీ గుంటూరు- కళాతేజస్వి అవార్డు
- 2004 ప్రతిమా ఆర్ట్ సొసైటీ గుంటూరు- విశిష్టాచార్య అవార్డు
- 2005 ప్రతిమా ఆర్ట్ సొసైటీ గుంటూరు- ఆచార్య దేవోభవ అవార్డు
- 2002 యంగ్ ఎన్వాయిస్ ఇంటర్నేషనల్, హైదరాబాద్ వారు, సద్గురు పురస్కారం
- 2003 ప్రతిమా ఆర్ట్ సొసైటి గుంటూరు-ఉత్తమ ఆర్ట్ టీచర్ అవార్డు
- 2004 యంగ్ ఎన్వాయిస్ ఇంటర్నేషనల్, హైదరాబాద్-నెహ్రూ కల్చరల్ అవార్డు.

### సాహితీ సేవ:

అనేక దిన,వార, మాస పత్రికలలోను పలుకథా, కవితా సంకలనాలలోను కథలు, కవితలు ప్రచురింపబడ్డాయి.

2001లో వీరు రాసిన "మోజు" కవితకు ఎక్స్‌రే ఉత్తమ కవితా అవార్డు, జాతీయస్థాయి

2006లో "సమాజం మారాలి" కవితకు రాష్ట్రస్థాయి ద్వితీయ బహుమతి అనకాపల్లి సాహితీ వేదిక వారు ఇచ్చి ఘనసన్మానాలు చేశారు.

విద్యార్థులకు: వీరి వద్ద నేర్చుకున్న విద్యార్థులకు జిల్లా, రాష్ట్ర, జాతీయస్థాయిలలో బంగారు, వెండి పతకాలు, అనేక అవార్డులు, పురస్కారాలు, సర్టిఫికేట్లు వందలమంది విద్యార్థులు సాధించారు.

వీరి సేవలను మెచ్చి వేపాడ మండల ఉద్యోగులు, ప్రజలు సువర్ణ ఉంగరంతో ఘనసన్మానం చేశారు. పూసపాటిరేగ ప్రజలు, స్థానిక సేవా సంస్థలు పలు సన్మానాలు జరిపించారు

కళాప్రపంచం

# ఆలోచన, ఆచరణల ప్రయోగశీలి - టాల్‌స్టాయ్

ఎల్.ఆర్. వెంకటరమణ



**"ప్రతి ఒక్కరూ ఈ సమస్త ప్రపంచాన్ని మార్చాలనే చూస్తారు. కానీ ఏ ఒక్కరూ తాము మారాలని తాపత్రయపడరు".**

**"కళ అన్నది కేవలం విషయం కాదు. ఆ కళారూపాన్ని కళాకారుడు అనుభవించిన భావనాత్మక ఆనందాన్ని మనతో పంచుకుంటాడు".**

ఈ మాటలన్నది ప్రపంచ ప్రసిద్ధ సాహితీవేత్త టాల్‌స్టాయ్. అతను అందించిన సాహిత్యాంశాలను అతను అనుసరించి, అనుభవించిన సత్యాలను అందించినవాడు. అందుకే అజరామరమైనది. "సమాజాన్ని అర్థం చేసుకొని టాల్‌స్టాయ్ అత్యుత్తమ సాహిత్యాన్ని అందించాడు. రష్యన్ పేదరైతుల స్థితిగతులను వారి గొంతకలో వినిపించి, మానవజాతి కళాత్మక అభివృద్ధికి బాటలు వేసిన మహోన్నతుడు" అని రష్యన్ నిర్మాత లెనిన్ అంటాడు. టాల్‌స్టాయ్ సాహిత్యం చదివిన గాంధీజీ, టాల్‌స్టాయ్ పట్ల ఆరాధకుడిలా మారిపోయానన్నాడు.

టాల్‌స్టాయ్-రష్యన్ ఉచ్ఛారణలో "తొలిస్తొయ్", పూర్తిపేరు లెవ్ నికొలాయెవిచ్ టాల్‌స్టాయ్. 1828 సెప్టెంబర్ 9వ తేదీన ఒక ధనిక భూస్వామ్య కుటుంబంలో రష్యాలోని 'టులా' రాష్ట్రంలో గల యస్నయా పోలియానాలో జన్మించాడు. చిన్ననాడే తల్లిదండ్రులు చనిపోవడంతో బంధువులు పెంచి పెద్ద చేశారు. కజిన్, పీటర్స్ బర్గ్ విశ్వవిద్యాలయాలలో చదువుకున్నాడు. కానీ డిగ్రీపొందలేకపోయాడు. అక్కడి విద్యా విధానం అతనికి నచ్చలేదు.

1851లో తన సోదరుడు "నికోలాయ్" సహాయంతో సైన్యంలో చేరాడు. ఖాళీ సమయాలలో కథారచన చేసేవాడు. 1852లో "శైశవం" అనే కథ రాశాడు. "సొవ్రొమెన్నిక్" పత్రికలో ఈ కథ పడింది. 1854లో "బాల్యం" రచించాడు. ఇలా ఈ కథాత్రయంలో మూడవ కథ "యవ్వనం" 1857లో ప్రచురించాడు.

సైనికుడిగా యుద్ధాలలో రష్యన్ సైనికుల తరపున పాల్గొన్నాడు. క్రిమియా యుద్ధ సందర్భంగా సెబాస్టపోల్ ముట్టడిలో పాల్గొన్నాడు. 'సెబాస్టపోల్' కథాసంపుటి కూడా ప్రచురించాడు.

సైన్యం నుండి తిరిగి వచ్చిన తరువాత సెయింట్ పీటర్‌బర్గ్ చేరుకున్నాడు. ఇక్కడి సాహితీ బృందాలలో కలిసిమెలసి తిరిగాడు. నాటి ప్రసిద్ధ రచయితలు ఓస్త్రోవిస్కీ, తుర్గినేవ్, సెక్రొసోవ్‌లతో పరిచయాలు ఏర్పడినాయి. విరివిగా కథలు రాశాడు. ఇదే కాలంలోనే "కోసక్కులు" నవలారచన చేశాడు.

1857లో టాల్‌స్టాయ్-ఫ్రాన్స్, స్విట్జర్లాండ్, జర్మనీ దేశాలు సందర్శించాడు. విదేశాల నుండి తిరిగి వచ్చిన తరువాత "యస్నయా పోలియానా"లోని తన సొంత భూమిలో ఒక పాఠశాల ప్రారంభించాడు. పిల్లల మీద ఎలాంటి ఒత్తిడిలేని విద్యావిధానాన్ని అమలు చేశాడు. పిల్లలో గల సహజ ప్రతిభను వెలికితీసే విద్యావిధానమని చెప్పుకున్నాడు. విద్యా విషయంగా సంభాషణల ద్వారా పిల్లలకు చదువు చెప్పడం, రాయడం వంటి విషయాలు నేర్పేవారు. "స్వేచ్ఛ ఒకటే విద్యకు ప్రమాణం"- అన్న సూత్రం ఆధారంగా విద్యాబోధన జరిగేది. "The Primer", "The New Primer" What is అన్న పాఠ్యపుస్తకాలు

కూడా రచించాడు. టాల్‌స్టాయ్‌ని సాహితీవేత్తగానే కాక, విద్యావేత్తగా కూడా ప్రపంచం గుర్తించింది. కానీ ఈ పాఠశాల ఎంతో కాలం నడుపలేకపోయాడు.

1862లో టాల్‌స్టాయ్‌కి సోన్యా అంద్రియేవ్ నాచెర్స్ అన్న ఆమెతో పెళ్లి జరిగింది. పెళ్లికి ముందు టాల్‌స్టాయ్‌లో ఆనాటి ధనిక వర్గానికి చెందిన యువకులతో ఉండే బలహీనతా లక్షణాలు అన్నీ ఉండేవి. ఇవన్నీ టాల్‌స్టాయ్ "రిసెరెక్షన్" అన్న నవల కథానాయకునిలో కనిపిస్తాయి. అనుక్షణం తనను తాను విశ్లేషించుకునే అంతర్‌దృష్టి ఉండటం వలన టాల్‌స్టాయ్ త్వరలోనే ఈ బలహీనతల నుండి బయట పడగలిగినాడు. సోన్యాతో వివాహం తరువాత జీవితంలో ఒక స్థిరత ఏర్పడింది. ఈ కాలంలో రెండు ప్రసిద్ధ గ్రంథాలు రచించాడు. అవి "యుద్ధము–శాంతి", అన్నాకరేనినా".

1863లో "యుద్ధము–శాంతి" (War and Peace) రాయడం మొదలు పెట్టి 1869లో పూర్తిచేశాడు. ఈ నవల ఏడుసార్లు రాసి చివరగా దాన్ని ప్రచురణకు ఇచ్చారట. అంటే ఏడుమార్లు రాయబడిన నవల ఇది. ఈ నవలలో నెపోలియన్ రష్యాపై దాడి చేయడం. ఈ దండయాత్ర నవల ఇది. ఈ నవలలో నెపోలియన్ రష్యాపై దాడి చేయడం. ఈ దండయాత్ర మునుపు, తరువాత రష్యన్ ప్రజల జీవన విధానం సంబంధించిన విషయమే ఈ నవల. ఇందులో దాదాపుగా 500 పాత్రలు; 6 ప్రధాన కుటుంబాల గురించిన సంపూర్ణ చిత్రణ ఈ నవల.

"యుద్ధం గెలవడం. ఓడిపోవడం అన్నది మనకళ్లకు కనిపించని, ఫలానా అని చెప్పవీలు కాని ఎన్నో యాదృచ్ఛిక సంఘటనల మీద ఆధారపడి ఉంటుందన్నదే టాల్‌స్టాయ్ సిద్ధాంతం. ఈ నవలలోని–పైరీ, నటాషా, ప్రిన్స్ ఆంద్ర్యూ పాత్రలు పాఠకుని హృదయాన్ని దాటి వెళ్లలేవు.



"యుద్ధానికి, యుద్ధానికి మధ్య ఉన్న విరామమమే శాంతి అని, బయట జరిగే యుద్ధం, మనిషి లోపల జరిగే యుద్ధం ఎప్పుడూ నిరంతరం సాగేదని, శాంతి అన్నది ఒక స్వప్నం మాత్రమని" టాల్‌స్టాయ్ చెబుతాడు.

టాల్‌స్టాయ్‌ని ప్రసిద్ధునిగా చేసిన మరో నవల "అన్నాకరేనినా", 1873లో మొదలు పెట్టి 1877దాకా రచించాడు. తన పొరుగునున్న భూస్వామి బిబినివ్‌కోవ్‌తో నివసిస్తున్న అనా అనే ఆమె రైలు క్రిందపడి ఆత్మహత్య చేసుకుంటుంది. ఈ శవ పంచాయితీకి టాల్‌స్టాయ్





స్వయంగా పాల్గొంటాడు. ఈ సంఘటన అతన్ని కలిచివేస్తుంది. అలా పుట్టుకొచ్చినదే "అన్నాకరేనినా" నవల. తాపీధర్మారావు గారు ఈ నవలను తెలుగులోకి అనుసృజించారు.

టాల్‌స్టాయ్ తన 71వ ఏట నవజీవనం (Resurrection) అన్న మరో నవల రచించాడు. 1896 నుండి 1904 మధ్య ఈ నవలా రచన సాగింది. ఈ నవల టాల్‌స్టాయ్ జీవితంపై అధిక ప్రభావం చూపింది. ఇది వరకు రాసిన నైతిక విషయాలు ఆచరణలోకి చేపట్టాడు. మాంసం, మద్యం, పొగత్రాగడం గడిపాడు. ఇతరుల శ్రమ మీద ఆధారపడకుండా స్వయంగా సంపాదించి బ్రతకాలి అనుకున్నాడు. చెప్పులుకుట్టి వచ్చిన డబ్బులతో జీవితం గడిపాడు.

టాల్‌స్టాయ్ ఆలోచనలు చేయుడమే కాక ఆచరించి చూపగలిగాడు. ఇదే విషయాన్ని రష్యన్ విమర్శకుడు లియోనిద్ లిమినోవ్ ఇలా అంటాడు. "హెర్క్యులిస్ విరోచిత కృత్యలతో టాల్‌స్టాయ్ జీవితాన్ని పోల్చవచ్చునంటాడు". టాల్‌స్టాయ్ సమాజంలో ఎవరూ పట్టించుకోలేని చీకటి కోణాలను తన రచనల ద్వారా బయటపెట్టి, వాటికి వెలుగులు నింపాడు. "దీపం చీకట్లో ప్రకాశిస్తుంది" అన్న అసంపూర్తి నాటకం రచించాడు. ఇది అతని ఆత్మకథ అన్నది విమర్శకుల వాదన.

కథలలో వాస్తవికత, మనోవిశ్లేషణలతో, నీతి, లోకరీతి మధ్య జరిగే ఘర్షణలో లోకరీతిపై నీతి విజయం సాధించడాన్ని కథల రూపాన హృద్యంగా చెబుతాడు. టాల్‌స్టాయ్ సాగిస్తున్న జీవిత విధానం అతని భార్యా పిల్లలకు నచ్చలేదు. కూతురు కొంత జాలిపడగలిగింది. చివరిదశలో టాల్‌స్టాయ్ ఇల్లువదిలి బయటకు వెళ్లిపోయాడు.

ఒక అనాధలా న్యూమోనియా వ్యాధితో బాధపడుతూ అస్టోపోలో రైల్వేస్టేషన్‌లో 1910 నవంబర్ 7న మరణించాడు. కొన్ని రోజుల తరువాత గానీ ఆయన మరణవార్త బయటికి తెలిసి రాలేదు. తన సాహితీ ప్రస్థానంలో కథా రచయితగా ఆరంభించాడు. నవలలు రాశాడు, జీవనశైలి మారిన తరువాత కళలు, సౌందర్యం, నైతిక విలువలు వంటి ఆలోచనలు చేశాడు. తిరిగి కథా రచయితగానే మారాడు.

1897లో "What is Art" అన్న ప్రసిద్ధ గ్రంధం రచించాడు. ఇందులో కళలు సరళమైనవని, బహుళ ప్రయోజనాలు కలవని, మనిషి నైతిక స్థాయిని పెంచుతాయన్నాడు. "కళ" అన్న దానికి ఒక ప్రత్యేక, రూప, భాషలుంటాయి. అనుభూతులు, మనోభావాలు, సెంటిమెంట్లు గల ఉద్విగ్నతల భాష ఇవి. కళాకారుడు తనకు తానుగా ఉద్వేగబరితుడై, ఉత్తేజితుడై ఆ అనుభూతిని ఇతరులకు అందివ్వాలని తహతహలాడుతాడు. ఇలా అతని నుండి కళారూపం బయటపడి అజరామరమవుతుందంటాడు.

భావాల పరస్పర మార్పిడి సాధనమే "కళ" అన్నది టాల్‌స్టాయ్ ప్రతిపాదించిన సిద్ధాంతం. టాల్‌స్టాయ్ మరణించిన తరువాత వెలువడిన అతని రచనలు-"విందు తరువాత"; "ఫాధర్ సెర్జాయ్' వంటి మెరికొన్ని.

***గాంధీజీ మొదటగా చదివిన టాల్‌స్టాయ్ రచన "ది కింగ్‌డమ్ ఆఫ్ గాడ్ ఈజ్ వితిన్ యు" ఈ పుస్తకం గాంధీజీలో నూతన ఉత్తేజాన్ని ప్రసాదించింది "నా సందేహాల నివారణ చేసి నన్ను సంపూర్ణ అహింసా వాదిగా ఈ పుస్తకం తీర్చిదిద్దింది" అంటాడు గాంధీజీ.***

దక్షిణాఫ్రికాలో పోరాటం సాగిస్తున్న గాంధీజీ 1909 అక్టోబర్ ఒకటిన టాల్‌స్టాయ్‌కు ఆత్మీయతతో ఉత్తరం రాశారు. దీనికి ప్రతిగా 1909 అక్టోబర్ 7న టాల్‌స్టాయ్ ఉత్తరం రాశాడు. "మానవ జీవితపు గొప్ప సిద్ధాంతం ప్రేమ ఒక్కటే! హృదయాంతరాలలో ప్రతి వ్యక్తికీ ఈ విషయాలు తెలుసు. భ్రాతృత్వంతో మీకు నేను స్వాగతం పలుకుతున్నాను. మీతో పరిచయం కలిగినందుకు నేనెంతో సంతోషిస్తున్నాను" అంటూ టాల్‌స్టాయ్, గాంధీజీకి ఉత్తరం రాశారు. దక్షిణాఫ్రికాలో గాంధీజీ "టాల్‌స్టాయ్ ఫాం" కూడా ఏర్పాటు చేశాడు. భారత ప్రభుత్వం కూడా టాల్‌స్టాయ్ స్టాంపును విడుదల చేసింది.

*email: venkataramana_lanka@yahoo.com*

# నఖచిత్ర శిల్పి శిష్టా రామకృష్ణారావు



- వెంటపల్లి సత్యనారాయణ

***1976 ఆప్రాంతంలో అనుకుంటాను. ప్రముఖ సినీ గేయ రచయిత స్వర్గీయ వేటూరి సుందరామమూర్తిగారు, ఆనాడు తెలుగు చలనచిత్ర రంగాన్ని ఏలుతున్న ప్రఖ్యాత సినీ హీరో ఆ తర్వాత కాలంలో తెలుగుదేశం పార్టీని స్థాపించి రాష్ట్రంలో తొలి కాంగ్రెసేతర ముఖ్యమంత్రిగా చరిత్ర సృష్టించిన స్వర్గీయ నందమూరి తారకరామారావు గారి చిత్రం 'అడవి రాముడు'లో ఒక పాటరాస్తూ దానికి ఒక అద్భుతమైన పల్లవిని అందించారు. అది..***

'కృషి వుంటే మనుషులు ఋషులౌతారు. మహా పురుషులైతారని' అవును ఒక వ్యక్తిని ఋషిగా లేదా మహాపురుషుడిగా మార్చేది ఏమిటి? అని అనుకున్నప్పుడు కచ్చితంగా అతని కృషే అని వేరే చెప్పనవసరంలేదు.

సాహిత్యంలో అనేక గ్రంథాలు వస్తాయి, ఆయా కాలాలలోనూ, మన కాలంలోనే గాక మన తర్వాత కాలంలోనూ కూడా శాస్వతంగా నిలిచిపోయే గ్రంథాలు మాత్రం కొన్నే వుంటాయి. అవే రామాయణ, మహాభారత, భాగవత గ్రంథాలతో పాటు బైబిలు లాంటి గ్రంథాలు. ఇలాంటి గ్రంథాలన్నింటినీ రచించింది గొప్ప గొప్ప మహాఋషులే. రామాయణాన్ని వాల్మీకి రచిస్తే భారత భాగవతాలను వేదవ్యాసుడు రచించాడు. బైబిలును అనేకమంది దైవజ్ఞులు రాసారు. మరి ఇన్ని గ్రంథాలను ఆయన రాయలేదు గానీ అన్నింటికీ ఆయన చిత్రరూపం ఇచ్చాడు. మరలా ఆ రూపకల్పన కోసం అందరిలా ఆయన రంగులూ బ్రష్‌లూ కూడా వాడలేదు. కేవలం కొన్ని చిన్న సైజు దళసరి తెల్ల కాగితాలు మాత్రమే వాడారు. వాటిపై తన గోటికి పనిపెట్టారు. అంతే అందరూ ఆశ్చర్యపోయేలా అద్భుతాలను వాటిపై ఆవిష్కరింపచేసారు. ఆయనే ప్రసిద్ధ హనుమాన్ ఉపాసకులు, 'లిమ్కా బుక్ ఆఫ్ రికార్డ్స్'తో పాటు పదకొండు అంతర్జాతీయ అవార్డులను సొంతం చేసుకొని 'విశ్వనఖ చిత్రకళా సామ్రాట్'గా పేరు గాంచిన శ్రీ శిష్టా రామకృష్ణారావుగారు.

చిత్రకారుడు ఒక చిత్రాన్ని గీయాలి అంటే దానికి ముందు ఒక ఆలోచన రావాలి. ఆ ఆలోచనలో అతనికి ఒకరూపం జనించాలి. లేదా సృష్టిలో మనకు కనిపించే ప్రకృతి స్వరూపమో, మానవమూర్తుల రూపాలో లేదా ఏద్దైనా వస్తురూపమో ఏదో ఒకటి కావాలి. చిత్రకారుడు ఆవిధంగా ఒక రూపాన్ని ఎంచుకున్న పిదప దానికి తన కళానైపుణ్యం జోడించి చిత్రరూపం కల్పిస్తాడు. అందుకు అతడు రేఖ, రంగు అనే మాధ్యమాలను వాడతాడు. ఈ రేఖలను

రంగులను పేపర్ లేదా కాన్వాస్‌పై వ్యక్తంచేయడానికి చిత్రకారుడు పెన్సిల్ చార్‌కో ర్‌లతో పాటు రకరకాల కుంచెలు, రంగులనూ వినియోగిస్తాడు. వీటి అన్నింటి కలయికకు చిత్రకారుని నైపుణ్యం తోడైనపుడు వీక్షకుడి కంటికి హాయినీ, ఆనందాన్ని కల్పించే ఒక చిత్రాన్ని అతడు అందించడం జరుగుతుంది. మరి పైన పేర్కొన్న మాధ్యమాలైన పెన్సిల్, చార్‌కోల్, కుంచె, రంగు వీటితో దేనినీ వుపయోగించకుండా చిత్రకారుడు భావాలకు లేదా ప్రకృతి అందలి



కొనగోటితో నఖచిత్రాన్ని గీస్తున్న శిష్టా

వ్యక్తుల రూపాలను లేదా పరిసరమందలి వస్తువులకు రూపకల్పన చేసి ప్రేక్షకులను మెప్పించగలగడం అన్నది అసాధ్యమైన పని. కానీ ఈ అసాధ్యాలను సుసాధ్యం చేసి నఖచిత్రకళా బ్రహ్మగా పేరు గాంచిన వ్యక్తి శ్రీ శిష్టా రామకృష్ణారావు.

చిత్రకళాప్రక్రియల్లో మూర్తి చిత్రణ అనేది చాలా క్లిష్టమైనది. ఎంతో పరిశీలన, పరిశ్రమ, పరిణతి ఉంటేనే తప్ప ఒక వ్యక్తి యొక్క రూపురేఖలను యధాతథంగా కాన్వాస్‌పై కెక్కించడం, వీక్షకులను మెప్పించడం అన్నది అంత సులభమైన పనికాదు. ఇంతటి క్లిష్టమైన చిత్రణలో పెన్సిల్‌స్కెచ్‌ను, రంగులనూ వాడకుండా కేవలం చేతివ్రేళ్ళ గోళ్ళతోనే చిన్న దళసరి కాగితంపై డైరెక్ట్‌గా గీసి వ్యక్తుల రూపు రేఖలను ప్రతిబింబింపజేయడం, చూసే వారిని మెప్పించడం అన్నది మరింత క్లిష్టమైన పని. కానీ అంతటి క్లిష్టమైన రూపచిత్రాలను సైతం తన గోటి వ్రేళ్ళనుపయోగించి నఖరూపచిత్రాలను సునాయాసంగా గీయగల దిట్ట ఈయన. సంఘసంస్కర్తలైన రాజా రామ్మోహనరాయ్, కందుకూరి, గురజాడలతో పాటు జాతీయ నాయకులైన గాంధీజీ, నెహ్రూ, బాబు రాజేంద్రప్రసాద్, ఇందిర, లాల్‌బహదూర్ శాస్త్రి. అంబేద్కర్, ప్రకాశంపంతులు, డాక్టర్



అబ్దుల్‌కలామ్, రాజీవ్‌గాంధీ, సోనియా, ఎన్.టి.ఆర్, వై.ఎస్.ఆర్. చంద్రబాబులతో పాటు యాసర్ ఆరాఫత్, పుతిన్, బిల్‌క్లింటన్, జార్జిబుష్, నెల్సన్ మండేలా టోనీ బ్లెయిర్ లాంటి అంతర్జాతీయ వ్యక్తుల రూపచిత్రాలను కూడా ఎంతో గొప్పగా తన గోటితో చిత్రించారు.

శిల్పకళలో కనిపించే నాలుగు అయతనాలు (Four








మాజీ గవర్నర్ శ్రీమతి కుముద్‌బెన్‌జోషి, మాజీ ముఖ్యమంత్రులయిన ఎన్.టి. రామారావు, కోట్ల విజయభాస్కరరెడ్డి ల నుండి సత్కారం అందుకుంటూ...

dimension) చిత్రకళలో చూపించుట సాధ్యం కాదు. కేవలం పొడవు, వెడల్పులనే రెండు అయతనాలనే సాధారణంగా చిత్రకళలో సృష్టించగలం. వెలుగు నీడలను చూపించడం ద్వారా మూడవ అయతనాన్ని కొంతవరకూ చూపించినా అది రంగుల చిత్రకళలో అంతస్పష్ఠంగా చెప్పలేము. కానీ ఏ రంగులు, కుంచెలూ వాడకుండా కేవలం ఎడమచేతి బొటనవేలు, మధ్యవేళ్ళను ఉపయోగించి చిత్రించే ఈ నఖ చిత్రాల్లో సాధారణ చిత్రలేఖనంలో అంతగా కనిపించని మూడవ అయతనాన్ని స్పష్ఠంగా చూడవచ్చు. అసలు ఈ ప్రకియలో సృష్ఠించబడే చిత్రానికి ఉనికి అనేది ఈ మూడవ అయతనం ద్వారానే వస్తుంది. గోటితో గీసిన రేఖల వెంబడి ప్రకృతి సిద్ధంగా పడిన వెలుగు నీడలేగాక చిత్రంలో లోతు కూడా స్పష్ఠంగా కనిపించడంతో ఈ తరహా చిత్రాలు Paper murals గా కాగితంతో చేయబడిన పాక్షిక శిల్పాలుగా కూడా పరిగణించవచ్చును. ఉదాహరణకు ఈయన గీసిన “పాములోడు” నఖచిత్రాన్ని చూసినట్లయితే దానిలో పాములోడు బూర ఊదడంలో చూపించిన ఏకాగ్రత, తన్మయత్వాల ద్వారా వెలువడిన నాదస్వరానికి అనుగుణంగా లేచి ఆడుతున్న పాము ఆకారాలలో ఒలికించిన లయ, విన్యాసాలను చూసినట్లైతే నిజంగా ఔరా అనిపించక తప్పదు. నిజంగా ఇది గొప్ప mural ని తపిస్తుంది.


అక్కినేని నుండి సత్కారం అందుకుంటూ...

శ్రీ శిష్టా సాంబశివరావు, శ్రీమతి సరస్వతమ్మ దంపతులకు 1-7-1936లో విజయనగరం జిల్లా పార్వతీపురంలో జన్మించిన శ్రీరామకృష్ణారావుగారికి చిన్నతనంలోనే చిత్రకళపై ఆశక్తి ఏర్పడింది. ఇంట్లో, పరిసరాలలో తనకు కనిపించిన ప్రతీ దానినీ గీయడమే పనిగా పెట్టుకున్న శ్రీ శిష్టా మొదట్లో పెన్సిల్, పేస్టల్, జలవర్ణాలలో కూడా బొమ్మలు వేసేవారు. మరి ఈ నఖచిత్ర ప్రక్రియ మీకెలా అలవడిందని ఆయనను అడిగినపుడు ఆయన ఇలా చెప్పారు. ఒకానొక సందర్భంలో తన ఎడమచేతి వేళ్ళగోళ్ళమధ్య గుండ్రంగా తిప్పబడిన కాగితంపై ఏర్పడ్డ ఒక వృత్తాకారం తనకు ఆశ్చర్యాన్ని కలుగజేసిందని, ఉత్సాహంతో ఆ వృత్తం చుట్టూ మరిన్ని వృత్తాలు గోటితో గీయడం ద్వారా పుష్పాకారం, దానికి నిలువుగా గీయబడ్డ రేఖ కొమ్మగా మారడంతో ఈ రకంగా చిత్రాలపై ఆసక్తి ఏర్పడింది ప్రారంభంలో ఇలాంటి పుష్పాలు, లతలు గీసిన తర్వాత నెమ్మదిగా పక్షులు, జంతువులు ఆ తర్వాత ప్రకృతి దృశ్యాలు ఆపై మనుష్యుల రూపాలు ఇలా క్రమక్రమంగా నఖ చిత్రాలపై ఆశక్తి ఏర్పడిందన్నారు. జలవర్ణాలు, తైలవర్ణాలలో చిత్రాలు వేడమన్నది ఖర్చు మరియు శ్రమతో కూడుకున్నదే కాక వాటి బద్రత కూడా కష్ఠమే. ఒక్కసారి ఈ చిన్న పేపర్‌పై ఏ ఖర్చూ, పరికరం లేకుండా గోటితో చిత్రాలు బాగా గీయగలను అన్న నమ్మకం ఏర్పడిన తర్వాత ఇక సాంప్రదాయ చిత్రాల రచనకు స్వస్తి చెప్పి పూర్తిగా నఖ చిత్రరచనకే ఆయన తన జీవితాన్ని అంకితం చేసినట్లు చెప్పారు.

విజయనగర మహారాజాకళాశాలలో డిగ్రీ చదివిన తర్వాత

ఆయన కొంతకాలం విశాఖపట్నం షిప్‌యార్డ్‌లో ఉద్యోగం చేసారు. అదే కాలంలో రామయణ గాథను నఖచిత్రాలలో చిత్రించాలనే ఆలోచన ఆయనకు రావడంతో ఉద్యోగ బాధ్యతలు నిర్వహిస్తూనే తీరిక సమయాలలో రామాయణానికి రూపకల్పన చేయడం ప్రారంబించారు. కానీ మహా కావ్యమయిన ఆ గ్రంధానికి రూప మివ్వడమంటే ఒకటా రెండా! ఎన్ని వందల బొమ్మలు వేస్తే రామయణం పూర్తి అవుతుంది. ఒక ప్రక్క ఉద్యోగం చేసుకుంటూ ఇది పూర్తిచేయడమన్నది అసాధ్యం అని భావించిన శ్రీ శిష్టా తన ఆశయ సాధనకు అడ్డుగా ఉందని భావించి తన ఉద్యోగానికి స్వచ్ఛందంగా రాంరాం చెప్పి రాముడి కథా చిత్రణే సద్యోగంగా స్వీకరించారు. 1981లో రామాయణానికి అంకురార్పన చేసిన ఆయన 1995 నాటికి మొత్తం (800) చిత్రాల్లో నఖ చిత్ర రామాయణానికి రూపకల్పన చేసి తన ఆశయ సాధనను పరిపూర్తి చేసారు. వాటిలో బాలకాండ, అయోధ్య, అరణ్య, కిష్కింద, సుందరకాండలను తెలుగు, ఇంగ్లీషుల్లో ఇది వరకే పుస్తక రూపంలో తీసుకు రాగా, యుద్ధ కాండ, ఉత్తర కాండలను మాత్రం ఇంటన్‌నెట్‌లో పెట్టి అంతర్జాలంలో కూడా నఖచిత్రకళా విశిష్టతను చాటుతున్నారు..

చిత్రకళా చరిత్రలోనే ఆశ్చర్యము, అనితర సాధ్యమూ అయిన ఈ ప్రయోగానికి సుప్రసిద్ధమైన జాతీయ రికార్డుల్లో ఒకటైన The limca book of records 2000 మిలీనియం ఎడిషన్‌లో అరుదైన రికార్డుగా నమోదయ్యేలా చేసింది. అరుదైన ఈ చిత్రలేఖనంలో లోతును కనుగొన్న పిదప ఎందుకు విశ్రమిస్తాడు అలా విశ్రమిస్తే కళాకారుడెలా అవుతాడు? అందుకే





శిష్టా తో రచయిత వెంటపల్లి

రామాయణం తర్వాత మరలా రాముని ప్రియభక్తుడు శిష్టాగారికి ఆరాధ్య దైవమూ అయిన హనుమంతునికి సంబంధించిన హనుమాన్ చరిత్రను మొత్తం (200) చిత్రాల్లో గీసారు. ఆ తర్వాత శ్రీ కృష్ణుని భాగవతాన్ని ( 425) చిత్రాల్లో, క్రైస్తవుల పవిత్ర గ్రంథమైన బైబిలును (498) చిత్రాల్లో, పిదప పరవస్తు చిన్నయ సూరి పంచతంత్ర కథలను (198) చిత్రాల్లో రూపకల్పన చేయడం జరిగింది.

ప్రాచీన కాలంలో మహా ఋషులు సృష్టించిన ఆ గొప్ప కావ్యాలకు నేటి ఆధునిక కాలంలో కూడా కాషాయవస్త్రాన్ని ధరించి నడక, నడవడిక, రూపం, వేష భాషలలో కూడా నాటి ఋషిని పోలివుండే నేటి ఈ ఆధునిక ఋషి అనితర సాధ్యమైన రీతిలో వాటన్నింటికీ నఖచిత్రరూపమివ్వడం అన్నది ఓ గొప్ప యోగం. ఓ తపస్సులా ఈ పనిని భావించారు కాబట్టే ఇంత గొప్ప కార్యాన్ని ఆయన సాధించగలిగారు. మరి ఇంత చేసిన వ్యక్తిని జాతి, ప్రపంచం విస్మరిస్తుందా! విస్మరించదు. అందుకే ఆయనకు లిమ్కాబుక్, ఇండియా బుక్ ఆఫ్ రికార్డ్స్ లాంటి జాతీయ






శిష్టా గీసిన నఖరూపచిత్రాలు

రికార్డులతో పాటు అంతర్జాతీయస్థాయిలో (11) అవార్డులను ఆయన సొంతం చేసుకున్నారు. యునెస్కో క్లబ్ ఆఫ్ ఇండియా తరపున నేషనల్ ఆంబాసిడర్‌గా కూడా ఎన్నుకోబడ్డారు.

నఖచిత్రకళలో ప్రసిద్ధి గాంచిన శ్రీ శిష్టా ఇంతవరకూ ఒక్క భారతదేశంలోనే గాక నేపాల్, దారుసలేము, నైరోబి, ఉగండా, టాంజానియా, జాంబియా తదితర ఆఫ్రికా దేశాలతో పాటు ఒక్క అమెరికాలోనే ఏకంగా ఆరుసార్లు తన నఖ చిత్రకళాప్రదర్శనను నిర్వహించారు. ఈ క్రమంలో 1999 లో ఉగండా భారత హైకమీషన్ నుంచి, 2000లో అమెరికా అధ్యక్షుడు బిల్‌క్లింటన్, 2010లో నెల్సన్‌మండేలా, 1996లో ఈస్ట్ ఆఫ్రికా దేశాల ప్రతినిదుల నుంచి, 1998లో నేపాల్ ప్రభుత్వం నుండి ఎన్నో అవార్డులను అందుకున్నారు. బిల్‌క్లింటన్ చేతులమీదుగా అందుకున్న అవార్డుకు మనదేశ ప్రధాని నుండి ప్రత్యేక ప్రశంసలు లభించాయి.



శిష్టా గారి నఖచిత్రరామాయణం, బైబిలు, హనుమాన్ చరిత్ర ఆయన వెబ్ సైటు www.rksista.com లో చూడగలరు..

ఇక స్వదేశంలో అయితే 1961లో మన తొలి ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ, 1962లో రాష్ట్రపతి డా॥సర్వేపల్లి రాధాకృష్ణ, 1980లో మహరాష్ట్ర గవర్నర్ కోన ప్రభాకర్‌రావు, ఉపరాష్ట్రపతి శ్రీకృష్ణకాంత్, మన మాజీ గవర్నర్ శ్రీమతి కుముద్‌బెన్‌జోషి, లోక్‌సభ స్పీకర్ జి.యమ్.సి. బాలయోగి, మన మాజీ ముఖ్యమంత్రులయిన ఎన్.టి. రామారావు, చంద్రబాబునాయుడు లాంటి రాజకీయ నాయకులతో పాటు పలువురి సినీ ప్రముఖులచే కూడా ఎన్నో సన్మానాలు అందుకున్నారు.

ఇక బిరుదుల విషయానికి వచ్చినట్లయితే విశ్వనఖ చిత్రకళాసామ్రాట్ బిరుదుతో పాటు, నఖచిత్రకళాబ్రహ్మ, నఖచిత్రకళాప్రపూర్ణ, నఖచిత్రశిల్పి వినూత్న కళాసృష్ట, నఖచిత్రకళాసార్వభౌమ, నఖచిత్రవాల్మీకి, విశ్వనఖచక్రవర్తిలాంటి (15) బిరుదులు వివిధ సంస్థలనుండి ఆయన అందుకోవడం జరిగింది.

ఎంతో అరుదైన ఈ చిత్రకళను భావితరాలకు అందించాలనే లక్ష్యంతో ఆసక్తి గల కొందరికి ఆయన శిక్షణ ఇస్తున్నారు. ఎంతో తపస్సులా సృష్టించిన ఈ చిత్రకళాసంపదను బధ్రపరిచి భావితరాలకు అందించేందుకు ముందుకు వచ్చినట్లయితే శ్రీ శిష్టాగారి వద్ద గల ఒరిజనల్ చిత్రాలను ఇచ్చేందుకు ఆయన సిద్ధంగా వున్నారు. కళాఋషి, నఖచిత్రకళాతపస్వి అయిన శ్రీ శిష్టారామకృష్ణారావు గారు ఆశయం నెరవేరాలని, తద్వారా ఈ కళ మరింత విశ్వవ్యాప్తం కావాలని ఆశిద్దాం.

ప్రొఫైల్

# మిమిక్రీ కళలో సూపర్ స్టార్-సిల్వెస్టర్

*మిమిక్రీ అనేది ఒక అద్భుతమైన కళ. ప్రతి మనిషిలోనూ అంతర్గతంగా ఈ కళ దాగివుంటుంది. ప్రాచీన మానవుడు సైగలు చేస్తూ 'శబ్దం' ద్వారానే ఎంతో కాలం మనుగడ సాగించాడు కూడా, అన్ని శబ్దాలకూ శృతి-లయ వుంటాయి. శబ్దానికి అవే తల్లితండ్రీ. ఆ శబ్దాలను అనుకరించడమే మిమిక్రీ అంటే. ఇది ఒకరు నేర్పితే వచ్చే విద్యేమీ కాదు. 'సాధనమున పనులు సమకూరు ధరలోన'-అన్నట్లు కృషి చేస్తే తప్ప ఓపట్టాన మిమిక్రీ పట్టుపడదు"... అంటున్నారు సుప్రసిద్ధ మిమిక్రీ కళాకారుడు, 'మిమిక్రీ స్టార్' బిరుదాంకితుడు తోట సిల్వెస్టర్, గత నలభై ఐదేళ్ళుగా ... ప్రేక్షకులను అలరిస్తున్న సిల్వెస్టర్ ఆంధ్రదేశంలోనే కాదు అంతర్జాతీయ స్థాయిలో ఎన్నో వేల మిమిక్రీ ప్రదర్శనలిచ్చారు. 64కళలుడాట్‌కామ్‌లో సిల్వెస్టర్‌గారి ప్రొఫైల్ మీకోసం...*





అది పాట కావచ్చు. మాట కావచ్చు, సంగీతం కావచ్చు, వాక్కుతో లయబద్ధంగా సాగే మిమిక్రీ కళలో, సిల్వెస్టర్ ఆరితేరిన యోధుడు. ఒకే వ్యక్తి... ఒకే మైక్... అంతే అంతా కనికట్టు విద్యగా వుంటుంది. ఆయన మిమిక్రీ వింటుంటే. ఎంత సేపైనా సరే అలాగే వింటుండిపోవాలని అనిపిస్తుంటుంది. అదీ ఆ కళలోని కథ, ఒక్క గొంతుగా వేనవేల గొంతులన్నీ ఒక్కసారి వినాలన్నా సరే, సిల్వెస్టర్ గొంతు ఆ మహా జన ప్రభంజనాన్ని కళ్ళెదుటే వినిపిస్తుంది.

ధ్వన్యనుకరణ (మిమిక్రీ)తో ప్రజలను ఉర్రూతలూగిస్తున్నారాయన. ఇప్పటిదాకా వేలాది ప్రదర్శనలిచ్చారు. ఎన్నో అవార్డులు, ఎన్నెన్నో సత్కారాలు... గ్రామగ్రామాలో, రాష్ట్రవ్యాప్తంగా, దేశ వ్యాప్తంగానే కాక, అమెరికాలోనూ ప్రదర్శనలిచ్చి కరతాళధ్వనులందుకున్నారు. ఎంతో విశిష్టమైన 'నంది' అవార్డులను సైతం అందుకుని మిమిక్రీ కళకే గౌరవం తెచ్చారు.

## ఒకే వ్యక్తి... ఎనిమిది గొంతులు

తండ్రిగా, కుమారునిగా, వృద్ధునిగా, విలన్‌గా ఇలా ఎనిమిది మంది గొంతులను, సిల్వెస్టర్ ఒక్కరే అత్యద్భుతంగా అనుకరించి, అందరూ అచ్చెరువొందేలా మిమిక్రీ చేసి నాలుగు నంది అవార్డులు అందుకున్నారు. ప్రేమ సామ్రాజ్యం నాటకంలో సిల్వెస్టర్

**విజయోత్సం:** 'సిల్వెస్టర్ విజయోత్సవం' పేర 1987లో హైదరాబాద్ చైతన్య ఆర్ట్ థియేటర్స్-యువకళావాహిని వారి సారథ్యంలో దాసరి నారాయణరావుగారు, కోనప్రభాకరావుగారు, బి.యన్.రెడ్డి, తుర్లపాటి కుటుంబరావు గార్ల చేతుల మీదుగా "ధ్వన్యనుకరణ రత్న" బిరుదు ప్రధానం చేసి ప్రత్యేక అభినందన సంచికను ప్రచురించడం వీరి మిమిక్రీ కళాప్రతిభకు తార్కాణం.



సభలో ప్రసందిస్తున్న దాసరి నారాయణరావు




**రజతోత్సవం:** ఏ కళాకారుడినైనా ప్రేక్షకులు ఆదరించాలంటే, ఆ కళాకారుని ప్రదర్శన జనరంజకం కావాలి. అప్పుడే ఆ కళ-ఆ కళాకారుడు చిరకాలం ఆదరణపొందగలరు. మిమిక్రీ అనే కళను నమ్ముకొని-అదే సర్వస్వం అనుకొని పాతికేళ్ళ పాటు కళతో పాటే తను ఎదుగుతూ జాతీయస్థాయి కళాకారుడిగా ప్రఖ్యాతినొందిన సందర్భంగా హైదరాబాద్‌లో జస్టిస్ పున్నయ్య, మురళీమోహన్, ప్రభాకరరెడ్డి, కె.కె. రాజా ఆధ్వర్యాన "సిల్వెస్టర్ మిమిక్రీ కళాప్రదర్శనా రజతోత్సవ వేడుక"ను ఘనంగా నిర్వహించారు.

ధ్వన్యనుకరణ ప్రేక్షకులను ఉర్రూతలూగించింది. అటు, మిమిక్రీలోనూ, వెంట్రిలాక్విజమ్ (మాట్లాడే బొమ్మ)లోనూ ఆయన కళాప్రదర్శన నిజంగా చూసి తీరవలసిందే. ఎంత సేపు విన్నా, అదో మాటల పాటల ప్రవాహంగా వుంటుంది. జలజలపారే జలపాతపు హోరును కళ్లముందు సాక్షాత్కరింపజేసినట్టు వుంటుంది. విమానహోరు, కడలితరంగాల జోరు... పక్షుల కువకువలు, జంతువుల అరుపులు, సుప్రసిద్ధ నటీనటులు హావభావాలతో సహా వారి మాటలు... ఇలా ఏదైనా సరే, ధ్వన్యనుకరణ చేయాలంటే అది సెల్వెస్టరే చేయాలన్నంత అద్భుతంగా చేస్తారాయన. చిన్నతం నుంచి నాటకాలపై ఆసక్తి, 'రక్తకన్నీరు' నాగభూషణం నాటకాల స్ఫూర్తి.. తల్లిదండ్రులు, సహచరుల ప్రోత్సాహం అన్నీ కలిసి మిమిక్రీ. ఆ తర్వాత విజయవాడ లయోలా కళాశాలలో చదివే రోజుల్లో, ఎం.సి దాస్ గురుత్వంలో ఆయన మిమిక్రీ కళకు మరింత మెరుగులు దిద్దుకున్నారు. నేటికీ మొక్కవోని దీక్షతో మిమిక్రీ ప్రదర్శనలు ఇస్తూనేవున్నారు.

**ఎన్నెన్నో బిరుదులు:**

దర్శకరత్న దాసరి నారాయణరావు చేతుల మీదుగా 'ధన్వన్యనుకరణ రత్న', రాయపూర్ ఆంధ్ర అసోసియేషన్ వారిచే 'విశ్వ ధ్వన్యనుకరణ చక్రవర్తి', మధ్యప్రదేశ్‌వారిచే 'మిమిక్రీ కింగ్', హుబ్లీ తెలుగు కళా సంస్థ వారిచే 'స్వరబ్రహ్మ', అదే విధంగా ధ్వన్యనుకరణ సామ్రాట్,' 'మ్యాస్ ఆఫ్ ది ఇయర్', 'గోల్డెన్ స్టార్' ఇలా ఎన్నో బిరుదులు పొందిన ఘన మిమిక్రీ చక్రవర్తి సిల్వెస్టర్. అయితే, తానెంత నేర్చినా, ఇంకా ఇంకా నేర్చుకోవాల్సింది, సాధించాల్సింది ఎంతో వుందని ఆయన వినమ్రంగా అంటున్నారు. మిమిక్రీ కళ తనకు ఇంత అన్నం పెడుతోందని, కళ కోసం అజన్మాంతం కషి చేస్తానని ఆయన దృఢంగా అన్నారు.

మిమిక్రీ అనేది బాత్రూమ్ సంగీతం కాదు. ముఖ్యంగా చెప్పాల్సింది ఏమిటంటే, మిమిక్రీ నవ్వులాట కాదు. అపహాస్యపు క్యామెడీ చేయడం మిమిక్రీ కానే కాదు. కష్టపడి సాధన చేసే కళ... ఒకరు నేర్పితే వచ్చేకళ కాదు ఇది... చిత్తశుద్ధితో సాధన చేస్తే మిమిక్రీలోనైనా, 'మాట్లాడే బొమ్మ' కళలోనైనా ఎన్నో చిత్ర విచిత్రాలెన్నో చేసిప్రజలను ఆనందింపజేయవచ్చు... వర్ధమాన మిమిక్రీ కళాకారులకు తాను చెప్పాల్సింది ఏమైనా వుంటే ఇదే... అన్నారాయన నవ్వుతూ.

**- కళాసాగర్**

Left to Right
Son-in-Law & only Daugther N. Amar Kumar - Dr. Sharmilee (USA)
Elder Son & Daugther in Law : Jagadish - Bindu (USA)
Younger Son & Daughter-in-Law : Vijesh Babu - Indu (Mumbai)
Sylvester & Dhana Lakshmi

## ప్రొఫైల్ :

పూర్తిపేరు: తోట సిల్వెస్టర్

పుట్టింది: 5 డిశంబరు 1949, ముట్లూరు-గుంటూరు జిల్లాలో

చదువు: బి.కాం.(ఆంధ్రలయోలా కళాశాల, విజయవాడ)

ప్రస్తుత నివాసం : విజయవాడ, గుణదల

ఇచ్చిన ప్రదర్శనలు : సుమారు 8000

ఫ్యామిలీ: అర్ధాంగి శ్రీమతి ధనలక్ష్మి(Retd. ICDS Project Officer), పెద్దకుమారుడు అమెరికాలో సాఫ్ట్‌వేర్ ఇంజనీర్‌గా, రెండవ కుమారుడు ముంబైలోని కొటక్ మహేంద్రాలో క్యాపిటల్ మార్కెట్ ఫైనాన్స్, కూతురు డా॥ షర్మిలీ అమెరికాలో గైనకాలజిస్టుగా స్థిరపడ్డారు.

పుస్తకం: మిమిక్రీ కళ గురించి, ఆయన అనుభవాలను రంగరించి ఒక పుస్తకం రాస్తున్నారు సిల్వెస్టర్. మిమిక్రీ కళలో ప్రవేశించే వారికి, ఈ కళ గురించి తెలుసుకోవాలనుకునే వారికి ఈ పుస్తకం ఉపయోగపడగలదు.



*with Chadramohan*



*with Nandamoori Taraka RamaRao*

ప్రముఖ నటుల
అభినందనలందు
కుంటూ...సిల్వెస్టర్ ....




*with Abdul Kalaam*



*with Murali Mohan*



*with Ex. Governor Jyoshi*

కథ

# చుట్టాలా మజాకా !

– డాక్టర్ రాగతి రమ

**అమృతరావు కూతురు షాలిని పెళ్ళి అత్యంత ఘనంగా జరిగిపోయింది. కూతురు అత్తవారింటికి కూడా వెళ్ళిపోయింది. బంధుమిత్రులంతా ఎవరి వూరికి వాళ్ళెళ్ళిపోయారు. కానీ ఒక తంటా వచ్చి పడింది అమృతరావు నెత్తిమీద. అమృతరావు భార్య వేలు విడిచిన పినతల్లి కూతురు సంధ్యారాణి, భర్త శ్యామలరావు, ఇద్దరు కొడుకులు, ఇద్దరు కూతుళ్ళు మాత్రం మిగిలారు.**

"పిల్లలకి స్కూళ్ళు సెలవులు కదా అక్కయ్యా అందుకే కొన్ని రోజులు ఇక్కడే వుంటాం" అంది సంధ్యారాణి.

"దానిదేం పోయింది. వుండండి" అంది అమృతరావు భార్య విమల.

ఆ మాట విని హడలిపోయాడు అమృతరావు. మరేం లేదు, ఆ నలుగురు పిల్లలు హాలులో ఫుట్‌బాల్ ఆడుతున్నారు. బాల్ టి.వి.కి తగిలి పగిలింది. లేండ్‌ఫోన్ పాడయింది. దిండులతో కుస్తీపట్లు పడితే దూది చెల్లాచెదురుగా బయటపడింది.

ఆ రాత్రి భార్య మీద రంకెలేసాడు అమృతరావు. "నువ్వు వాళ్లని ఎలా పంపిస్తావో తెలీదు! వాళ్ల వూరు చెక్కేయాలి. తెలిసిందా...! ఆ గుంటలు మన సామానంతా ఖరాబు చేస్తుంటే వాళ్ల తల్లి తండ్రీ వినోదం చూస్తున్నట్లు కూర్చుంటున్నారేం. వాళ్లకు వార్నింగ్ ఇచ్చి పంపించు. వెళ్లము అంటే వెళ్లేదారి ఆలోచించు".

విమలకు తన తరుపువాళ్లు అని యావ పడింది గానీ ఇప్పుడు దిమ్మతిరిగిపోయింది. శెలవుల్లో అంటే ఈ నెల్లాళ్లూ వీళ్ల అల్లరితనం భరించాలా...! ఎలా భరించగలగాలి... అని వాళ్లను ఎలా పంపాలా అని కూడా విమల ఆలోచిస్తోంది.

"అంకుల్ మమ్మల్ని షికారుకి తీసుకెళ్లవూ...' అని నలుగురు పిల్లలూ అమృతరావు చుట్టూ చేరి అల్లరి చేస్తే.

మీరు సైలెంట్‌గా వుంటే తీసికెళ్తా" అనేసాడు.

"ఇంట్లోనా వీధిలోనా" అడిగారు ఒకేసారి.

"ఇంట్లోను, వీధిలోను" కూడా అన్నాడు.

"అలాగే అంకుల్" అన్నారు. ఆ రోజు ఆఫీసునుండి తొందరగా



ఇంటికొచ్చాడు. ముందే చెప్పడం వల్ల అందరూ తయారై సిద్ధంగా వున్నారు. కారు ఎక్కేటప్పుడు నాకు ఫ్రంట్ సీటంటే నాకని తగవులాడుకున్నారు పిల్లలంతా. ఎలాగో విమల అమృతరావుకు సర్దిచెప్పేసరికి తల ప్రాణం తోకకు వచ్చినట్లయింది.

ఇద్దరు మొగపిల్లలు ఫ్రంట్ సీట్లో కూర్చున్నారు. సంధ్యారాణి శ్యామలరావు తమకు పట్టనట్లు కూర్చోవడం ముంచుకొచ్చింది అమృతరావుకి.

"అమృతరావుగారూ, వేడివేడి కాఫీ త్రాగుదాం. నేను ఇప్పిస్తాను గానీ మంచి హొటల్ ముందు కారాపండి" అన్నాడు శ్యామలరావు.

కారు ఆగగానే అంతా బిలబిలలాడుతూ లోపలికి వెళ్లారు.

"పిల్లలు కూడా కాఫీ త్రాగుతారా!" అడిగాడు అమృతరావు సందేహంగా.

"త్రాగుతారు. ఏదైనా త్రాగుతారు, ఏదైనా తింటారు. మా పిల్లలు పిడుగులు" అంది సంధ్యారాణి ముసి ముసి నవ్వుల్తో.

కాఫీలు వచ్చాయి. అందరూ త్రాగారు. శ్యామలారావు ఎందుకో బైటికెళ్లాడు. బిల్లు చెల్లిస్తాడేమోనని ఎదురు చూస్తున్నాడు అమృతరావు.

"ఎంతసేపని కూర్చుంటాం పదండి, ఆయన బైటటి ఎక్కడో వుండి వుంటారు." అంది సంధ్యారాణి లేస్తూ.

బిల్లు ఎగ్గొట్టడానికి బైటికి శ్యామలరావు వెళ్లాడని అర్థం అయి, మనస్సులో తిట్టుకుంటూ బిల్లు చెల్లించాడు అమృతరావు. అందరూ బైటికొచ్చేటప్పటికి కారులో కూర్చొని కూనిరాగాలు తీస్తున్నాడు శ్యామలరావు. అమృతరావుకి ఒళ్లు మండిపోయింది. నాలుగు దులుపుదాం అనుకున్నంతలో తగ్గు తగ్గు అని మనస్సు వెనక్కు లాగింది.

కారు బయలుదేరింది. బీచ్‌కి బీచ్‌కి అన్నారు పిల్లలంతా.

రామకృష్ణా బీచ్‌కు చేరుకుంది కారు. కారు పార్కు చేసి దిగారంతా.

"నాకు మొక్కజొన్న పొత్తు కావాలి" అరిచాడో గుంటడు.

"నాకు పల్లీలు కావాలి" అన్నాడు మరొక గుంటడు.

"నాకు బజ్జీలు" అంది ఒక గుంట

"నాకు మురీమిర్చీ కావాలి" అరిచింది మరో గుంట.

అందరికీ అన్నీ కొనిపెట్టి శ్యామలరావు కోసం చూశాడు. కనిపించలేదు. బిల్లు తనే చెల్లించవలసి వచ్చింది అమృతరావుకి. అందరూ ఇసుకలో నడుస్తూ వుంటే శ్యామలరావు వచ్చి కలిసాడు.

"అమ్మా మల్లెపూలు, మల్లెపూలు" అనుకుంటూ మల్లెపూలు అమ్మేవాడు వెంటపడ్డాడు.

"నాకు మల్లెపూలంటే ఎంతో ఇష్టం" అంది సంధ్యారాణి

"నాకూనూ" అంది విమల.

"అయితే తీసుకోండి ఆలస్యం ఎందుకు? రెండు మూర్ల మల్లెలు ఇవ్వవోయ్" అన్నాడు శ్యామలరావు.

పూలవాడు ఇచ్చాడు. ఇద్దరూ ఇంతులు జెడలో ముడుచుకున్నారు.

ఇటు చూసేటప్పటికి శ్యామలరావు లేడు.

పూలవాడు-అమృతరావును చూస్తూ" బాబు పైసలు" అన్నాడు.

అమృతరావు మనస్సులో తిట్టుకుంటూ డబ్బులు చెల్లించాడు. ఎక్కడికెళ్లినా ఇదే పరిస్థితి. జేబులు ఖాళీ అవుతున్నాయి. ఇంట్లో వస్తువులన్నీ ముక్కలవుతున్నాయి. ఇంకా నెల్లాళ్లు అమ్మో అనుకున్నాడు అమృతరావు.

తెల్లవారింది. ఒక్కసారిగా కలకలం బయలుదేరింది అపార్టుమెంటు అంతా, అపార్టుమెంటులో వాళ్లంతా బైటికి పరుగు తీస్తున్నారు.

"ఏం జరిగింది...?" అమృతరావు ఆతృతగా అడిగాడు.

"అపార్ట్‌మెంటులో టెర్రరిస్టులు బాంబు పెట్టారట-పెట్టారట-పదండి బైటికి పరిగెత్తండి" శ్యామలరావు అన్నాడు ఒగరుస్తూ. అతని పిల్లలు, భార్యా ఎప్పుడో బైటికి దౌడు తీసారు. అమృతరావు హడలిపోతూ భార్య చెయ్యి పట్టుకొని బైటికి పరిగెత్తాడు. పోలీసులు వచ్చారు. తనిఖీలు జరుగుతున్నాయి. సాయంత్రానికి పరీక్షలన్నీ పూర్తయి బాంబులేదని నిర్ధారణకు వచ్చారు. అయినా జాగ్రత్తగా వుండాలని హెచ్చరించి వెళ్లారు. ఇంట్లోకి రాగానే అతిధుల కోసం వెతికాడు అమృతరావు. శ్యామలరావు కుటుంబంగానీ, సామానుగానీ లేదు. అమృతరావు హృదయం పులకించి పోయింది.

"ఈరోజు భలే మంచి రోజు... వసందైన రోజూ... మీకేమన్నా బుద్ధి అనేది వుందా?"

"వుంది కనుకనే పాడుతున్నా" అన్నాడు అమృతరావు నవ్వుతూ.

"మీకలాగే వుంటుంది. బాంబు పెట్టారేమోనని పొద్దుటి నుండి టెన్షన్‌తో ఛస్తున్నా.." అంది విమల.

"ఓసి పిచ్చిదానా నన్ను చూసి ఆ మాత్రం అర్థం చేసుకోలేవూ..." అన్నాడు.

"అంటే!" అంది.

"బాంబులూ లేదు, టెర్రరిస్టులూ లేరు. ఇదంతా నేను పుట్టించిన బాంబు బూచి నాటకం" అన్నాడు అమృతరావు నవ్వుతూ.

"ఆం..." విమల తెల్లముఖం వేసింది. అదే సమయంలో కాలింగ్‌బెల్ మ్రోగింది. అమృతరావు గబగబా వెళ్లి వీధి తలుపు తీసి నిర్ఘాంతపోయాడు.

శ్యామలరావు, సంధ్యారాణి, రౌడీ గుంటలూ తోసుకుంటూ లోపలికొచ్చారు.

"ఎవరో ఆకతాయి వెధవ బాంబు పెట్టారని పోలీసులకు ఫోన్ చేసాడట. బాంబూ లేదు, గీంబూ లేదు. మళ్లీ వచ్చేశాం." అన్నాడు శ్యామలరావు నవ్వుతూ.

అప్పుడే ఆ నలుగురు గుంటలూ సోఫా ఎక్కి నాశనం చేస్తుంటే అవాక్కయ్యాడు అమృతరావు.

# వార్తలు

ఏవిఎమ్

టి.విలో వార్తలు వస్తున్నాయి

కరెంటు కోత ఎత్తేశారు. బొగ్గు ఉత్పాదన వల్లా, ప్రాజెక్టుల్లో నీళ్లు నిండుగా వున్నందువల్లా కరెంటు ఉత్పత్తి పెరిగింది. మన అవరాలకు పోగా మిగిలిన కరెంటును మాత్రమే ఇతర రాష్ట్రాలకు అమ్మాలని 'జీవో' పాసైంది. కరెంటు రేటు తగ్గించారు!, వచ్చే సంక్రాంతిలోగా మనరాష్ట్రంలో మట్టిరోడ్లు కనబడవు, అన్నీ సిమెంట్ రోడ్లే! పొలాలకు భూసారం తగ్గకుండా ఎరువులు కనిపెట్టారు పైగా అవి కారు చౌకగా అమ్ముతారు! కూరలు, బియ్యం నిత్యావసరవస్తువులు ప్రభుత్వం ఒత్తిడితో సగానికి సగం తగ్గించారు! బంగారం, వెండి రేట్లు కూడా పాతిక సంవత్సరాల క్రితం వున్న రేట్లకు దిగి వచ్చాయి! పెట్రోలు, డీజిల్ రేట్లు అనూహ్యంగా తగ్గాయి! పెట్రోలు కొంటే కిరసనాయిలు ఉచితం పథకాలు కూడా అమలవుతున్నాయి. రాష్ట్రంలో ఎటునుంచి ఎటు తిరిగినా ఐదు రూపాయల నామమాత్రపు చార్జీలతో రాష్ట్ర రోడ్డు రవాణాసంస్థ అన్ని దేశాల కన్నా ముందు వరుసలో వున్నది! ఆదాయ పన్ను వుంచారు! ఆస్థిపన్ను, వృత్తిపన్ను, భూమిశిస్తు లాంటి తదితర పన్నులన్నీ ఎత్తేశారు! 'రామరాజ్యం' మరోసారి వచ్చింది అంటే నమ్మండి! "అందువల్ల ప్రభుత్వం వారు ఉద్యోగుల జీతభత్యాలు కూడా తగ్గించారు!"

ఈ చివరి మాట విని... "ఆ.." అన్న పొలికేక పెట్టాడు మహర్షి! "వురేయ్ మహర్షీ! ఏమిట్రా ఆ మొద్దునిద్ర.. ఆ కలవరింతలూ... ఆ పొలికేకలూ... ఆఫీసులోనే కాక ఇంట్లో కూడా నిద్రపోతున్నావన్న మాట!" వంటింట్లోనించి అరుస్తోంది తల్లి కాత్యాయిని.



# బాపూగారి పాదాలకు నమస్కరించాను-సురేష్ కె.వి.

శ్రీరామరాజ్యం సినిమాకు ఆర్ట్ డైరెక్టర్ గా, పబ్లిసిటీ డిజైనర్ గా పనిచేసిన సురేష్ కె.వి. తో ప్రత్యేక ఇంటర్వ్యూ....



'నేడే చూడండి'... అంటూ ఒకప్పుడు రిక్షాల్లో మైకులు పట్టుకొని... విడుదలైన సినిమా గురించి ప్రచారం చేసేవాళ్లు.అలాగే వాల్‌పోస్టర్స్ ద్వారా కూడా సినిమాకు ప్రచారం చేసేవారు. ఆ తర్వాత వినైల్స్, కటౌట్లు, టీవీల్లో ప్రచారం... ఇలా పలు రకాలుగా కొనసాగుతుంది.ఎన్ని వచ్చినా 'వాల్‌పోస్టర్స్' ప్రాముఖ్యత తగ్గలేదు. వాల్‌పోస్టర్ డిజైన్ ఆర్టిస్టులలో కేతా, గంగాధర్, ఈశ్వర్ నాటి తరంలో ప్రసిద్దులు. నేడు కంప్యూటర్ ప్రవేశంలో పోస్టర్ డిజైన్ ఆర్టిస్టులు చాలా మంది ఉన్నప్పటికీ... ప్రతిభతో రాణించేవారు బహు తక్కువ. ఇటీవల విడుదలై-విజయవంతంగా ప్రదర్శించబడుతున్న శ్రీరామరాజ్యం సినిమాకు 'పోస్టర్ డిజైన్స్' రూపొందించడమే కాకుండా సినిమాలో కొన్ని సెట్టింగులకు, గ్రాఫిక్స్ వర్క్ుకు బాపుగారివద్ద పనిచేసిన సురేష్ కె.వి. స్వహతాగా చిత్రకారుడు. గతంలో పల్నాటిసింహం, అమ్మోరు, ఆహుతి, అంకుశం, శ్రీనాధ కవిసార్వభౌముడు, తాండ్రపాపారాయుడు లాంటి ఎన్నో విజయవంతమైన చిత్రాలకు పబ్లిసిటీ డిజైనర్‌గా పనిచేసారు. 'శ్రీరామరాజ్యం' సినిమా పోస్టర్స్‌తో ప్రేక్షకులను ధియేటర్లకు కదిలిస్తున్న... చిత్రకారుడు కె.వి. సురేష్ అనుభవాలు... వారి మాటల్లో...

**ముందుగా మీ కుటుంబ నేపథ్యం గురించి చెప్పండి?**

నేను పుట్టింది పశ్చిమగోదావరి జిల్లా నరసాపురంలో మాది చాలా బీదకుటుంబం మానాన్నగారు కడలి ముసలయ్యగారు కళాహృదయులు మా చిన్నతనంలోనే కాలం చేసారు. మేము నలుగురు అన్నదమ్ములం, ఒక చెల్లి అన్నయ్య యాక్సిడెంట్‌లో మరణించారు. ప్రస్తుతం నేనే పెద్దవాడిని సురేష్ అంజన్. సురేష్‌బుజ్జి నా తమ్ముళు ్ల. సినీ పబ్లిసిటీ ఆర్టిస్టులుగా స్థిరపడ్డారు. శాస్త్రీయ చిత్రలేఖనంపై మక్కువతో చాలాకాలం సినీ పబ్లిసిటీ డిజైన్స్‌కి దూరమయ్యాను ఆర్థికంగా చాలా ఇబ్బందులు పడుతూ 48 ఏళ్ల వయసు వచ్చినా ఇంకా స్థిరపడలేదు నాకు ఒక కొడుకు, ఒక కూతురు కూతురుకి పెళ్లి చేసాను. ఒక రాముడిలాంటి మనవడు పుట్టాడు ఆయనే నా ప్రస్తుత లోకం.

నాకు నేనే సాటి " అనుకునే శతకోటి లింగాల్లో నేను ఒకడిని. అలా అనుకుంటూ దాదాపు 300 సినిమాలకు పనిచేసాను. పల్నాటిసింహం, తలంబ్రాలు, ఆహుతి, అంకుశం, కలియుగపాండవులు, విజేత, తాండ్రపాపారాయుడు వంటి ఎన్నో పెద్ద సినిమాలకూ పనిచేస్తూ మధ్యమధ్యలో ఆర్టుడైరెక్షన్ వర్క్‌కూడా చేస్తూ ఉండేవాడిని పల్నాటిసింహం కాస్ట్యూం గెటప్ చూసి పరుచూరి బ్రదర్స్ కథను తయారుచేసారు. తాండ్రపాపారాయుడు గెటప్‌లు చాలామంది ఆర్టిస్టులతో వేయించారు. ఊహించిన విధంగా రాకపోతే చివరిగా నన్ను వేయమన్నారు నేను వేసిన ఒకే ఒక గెటప్. రెబల్‌స్టార్‌ని. దర్శకరత్నను మంత్రముగ్ధుల్ని చేసింది. దాదాపు ఆ సినిమాతో అందరి గెటప్స్ నాతోనే వేయించారు. అభినందన మందారమాల అనే సాంగ్‌కి సెట్ స్కెచ్ కూడా నేను వేసిందే . ఇలా చాలా సినిమాలు చేసాను. కానీ నా అభిమాన హీరో ఎన్.టి. రామారావు సినిమా చేయాలనే కోరిక మాత్రం తీరలేదు. ఒకరోజు వారపత్రిక చదువుతుంటే బాపూ దర్శకత్వంలో ఎన్.టి. రామారావు శ్రీనాధకవిసార్వభౌమ సినిమా


సురేష్ స్కెచ్‌లను పరిశీలిస్తున్న బాపుతో నిర్మాత సాయిబాబు

తీస్తున్నట్టు న్యూస్ చదివాను. ఇష్టమైన చిత్రకారుడు ఇష్టమైన హీరో. ఎలాగైనా ఈ సినిమాకి పనిచేయాలనుకున్నాను . నాదీ అనుకున్న స్టైల్‌లో లోగోలు తయారు చేసి ఎన్.టి.ఆర్ స్టూడియోలో ఎడిటర్‌గా ఉంటున్న దాసినేని సుభాష్ గారి ద్వారా లోగోలు రామారావు గారికి అందజేసాము. రామారావుగారు కవరు కూడా విప్పకుండా ఈ సినిమాకు అంతా బాపూగారే చూసుకుంటున్నారు వారికే చూపించండి అని చెప్పగా బాపుగారు లోగోలు చూసి పిలిపించమన్నారు. అలా మొదలైంది మా గురు శిష్యుల బంధం. నేను మద్రాసు నుంచి నేను రాసి లోగోలు విపరీతంగా నచ్చేసి ఉంటాయనుకుని కాలరు ఎగురు వేసుకుంటూ బయలు దేరాను. రామకృష్ణా సినీ స్టూడియోకి చేరుకుని ఎన్.టి.ఆర్, బాపుగారికి సుభాష్‌గారు పరిచయం చేసారు. బాపూగారు రాసిన లైన్ డ్రాయింగ్ లోగో చూపించారు. అప్పుడు తెలిసింది. నాకు నేనే సాటి అనుకునే శతకోటి లింగాల్లో నేనూ ఒకడినని ఆ లోగో చూసి ఆశ్చర్యంతో మంత్రముగ్ధుడ్నై బాపూగారి పాదాలకు ప్రేమతో భక్తితో నమస్కరించాను. ఆ లోగోలో అంత మహత్తు కనిపించింది నాకు. అప్పటి నుంచీ ఆరాధ్య గురువుగా సేవించాను. ఆయన కూడా నన్ను శిష్యుడిలాగా, సొంత కొడుకులాగా ఆదరిస్తూ వచ్చారు. ఇదీ మా గురుశిష్యుల బంధం.

**'శ్రీరామరాజ్యం' సినిమాకు పనిచేసే అవకాశం ఎలా వచ్చింది?**

శ్రీరామరాజ్యం సినిమాకు పనిచేయటం నిజంగా చాలా అదృష్టం సినీ పరిశ్రమలో సురేష్ అనేవాడు ఒకడున్నాడని ఫీల్డు మర్చిపోయి చాలా కాలమైంది. కంప్యూటర్ డిజైన్స్ తప్ప కుంచెతో చేసే డిజైన్ పని కూడా మర్చిపోయి చాలాకాలమైంది. ఒకరోజు బాపుగారు ఫోన్‌చేసి సీతారాములు పట్టాభిషేకం పెయింటింగ్ వేయాలి. వీలవుతుందాండి అని అడిగారు. అది దైవ సంకల్పంగా భావించి తప్పనిసరిగా చేస్తానన్నాను అలా చేసిందే శ్రీరామరాజ్యం ప్రారభోత్సవ పత్రిక, సుమారు నెలా పదిహేను రోజుల సమయం పట్టింది. శ్రీరామరాజ్యం లోగోకి వారంరోజుల సమయం పట్టింది. అందుకే అంత విజయం సాధించింది. చాలామంది ఫ్రేమ్ చేయించుకుని పూజా మందిరాల్లో పెట్టుకున్నారు. ఆడియో రిలీజ్ వాల్‌పోస్టర్స్‌కి కూడా ఆ పెయింటింగ్స్‌నే వాడారు.


Ayodhya palace

చిత్రకారుడు:

**'శ్రీరామరాజ్యం' సినిమాతో మీ అనుభవాలు...! అనుభూతులు?**

ఆర్ట్ డైరెక్టర్ని అవ్వాలనే మద్రాసు వచ్చాను. మా చిన్నాన్నగారి పరిచయాల మేరకు పబ్లిసిటీ డిజైనర్ కీ.శే. కేతా గారి దగ్గర చేర్పించారు. ఆయన వద్దే పెయింటింగ్ బాగా నేర్చుకున్నాను. తరువాత గంగాధర్ గారి దగ్గర, ఈశ్వర్, దావూద్, పాణి గార్ల దగ్గర చేసాను. ఒకరోజు పాణీగారి ద్వారా ఆర్ట్‌డైరెక్టర్ తోట గారి (తోట తరణిగారి తండ్రి) దగ్గరకు వెళ్లి అసిస్టెంట్‌గా చేరతానన్నాను ఇంతమంచి పెయింటర్‌ని ఆర్ట్ డైరెక్షన్ కంటే పబ్లిసిటీలోనే బావుంటుందన్నారు అలా పబ్లిసిటీ డిజైన్స్ చేస్తూ కొన్ని సినిమాలకు కాస్ట్యూమ్ గెటప్స్ వేసాను. శ్రీరామరాజ్యం సినిమాకి బాపుగారు ఫోన్‌చేసి అర్జంటుగా మీరు హైదరాబాదు రావాలన్నారు. ఫ్లైట్‌లో గంటన్నర సమయంలో బాపుగారు ముందు వాలాను సీన్లు వివరించి సెట్టింగుల స్కెచ్‌లు కావాలన్నారు. మూడునెలల పాటు గెస్ట్‌హౌస్‌లోనూ, రామోజీ ఫిల్మ్‌సిటీలోను ఉండి అయోధ్యాపురవీధులు, రాజభవనాలు, రాముని దర్బారు పూజామందిరం, రాముని శయనమందిరం, కౌసల్యామందిరం పూర్వీకుల విగ్రహాలు, సూర్యభగవానుని విగ్రహాలు దీపస్తంభాలు గోడలకు శిల్పాలు, పుష్పకవిమానాలు పురవీధుల భవనాలు, వీధుల్లో శిల్పాలు సీలింగు స్కెచ్చులు వైకుంఠద్వారాలు, భూదేవి ఆవిర్భవించుట ఇలా లెక్కలేనన్ని స్కెచ్‌లు రాత్రింబవళ్లు నెలలపాటు ఇదే వర్క్‌లో మునిగిపోయాను. రెండు నెలలపాటు గ్రాఫిక్స్ దగ్గర కూర్చుని చేయించటం చాలా గొప్ప అనుభూతి కలిగింది.







**● పౌరాణిక సినిమాలకు పోస్టర్స్ రూపొందించడంలో మీ ప్రత్యేకత ఏమిటి?**

పౌరాణిక సినిమాలకు పోస్టర్స్ డిజైన్ చేయటం నిజంగానే ప్రత్యేకత కలిగి ఉండాలి. ఎందుకంటే యాక్షన్ సినిమాలకు కంపోజ్ చేసినట్టు ఒక సీన్‌లో హీరో స్టిల్ ఇంకో సీన్లో హీరోయిన్ స్టిల్ తీసుకుని కంపోజ్ చేయలేం. పౌరాణికం అనగానే అందరికీ తెలిసిన సబ్జెక్ట్ అయి ఉంటుంది. ప్రతీ పోస్టరు సీన్‌కి సంబంధించిన స్టిల్స్ వాడాలి. లేదంటే హీరో స్టిల్స్ సోలో వాడాలి. మిగిలిన కాస్టింగ్‌స్టాంపుల్లాగా అందమైన డిజైన్ బాక్సుల్లాగా వాడాలి. సంప్రదాయ బద్ధకంగా తోరణాలు ముగ్గులు వాడాలి. అప్పుడే డిజైన్‌లో ఓ ప్రత్యేకత ఉంటుంది. శ్రీరామరాజ్యం సినిమాకి మొత్తం పోస్టర్ డిజైన్స్ పెయింటింగ్స్‌తోనే చేయాలనుకున్నాను కాని టైం చాలా తక్కువ ఉండటంతో, అటు ఆర్ట్ డైరెక్షను, ఇటు పబ్లిసిటీ రెండూ బాధ్యతలు చేపట్టడం వల్ల ఒకే ఒక్క డిజైన్ మాత్రమే పెయింటింగ్ చేయటం జరిగింది. ఆ ఒక్క డిజైనే ఎన్నో రకాలుగా మన్నలందుకుంది. తమిళ డబ్బింగ్ నిర్మాతలు కూడా ఆ డిజైన్ చేసి మీరే తమిళంలో కూడా డిజైన్స్ చేయాలంటూ వచ్చారు. ఇదీ పెయింటింగ్‌కి ఉన్న ప్రత్యేకత.

**● ఈ రంగంలో ప్రోత్సాహం ఎలా ఉంది? ఇకపై పబ్లిసిటీ డిజైనర్‌గా కొనసాగుతారా ?**

ఇక ముందు కూడా పబ్లిసిటీ డిజైన్స్ చేస్తారా అంటే కొంచెం ఆలోచించాల్సిన విషయమే ఎందుకంటే మా పబ్లిసిటీ డిపార్ట్‌మెంట్‌లో ఉన్నత విలువలు గలిగిన వ్యక్తులు చాల తక్కువ. ఎంగిలాకులకు ఎగబడే డిజైనర్లు ఎక్కువగా ఉన్నారు. నిర్మాతలూ అలాగే ఉన్నారు. ఎవరు తక్కువ డబ్బు తీసుకుంటే వాళ్లకే ఇస్తున్నారు. బుర్రలు బద్దలు కొట్టుకుని కష్టపడి లోగోలు తయారుచేసేది ఒకరయితే నిర్మాతకు భజనలు చేసి కాకాలు పట్టి పోస్టర్ డిజైన్స్ చేసేది మరొకరు ఇలా చాలా సినిమాలకు జరిగింది. అందుకే ఆలోచించాల్సిన విషయమన్నాను. శ్రీరామరాజ్యం సినిమాకు ఆర్ట్ డైరెక్టర్స్ అయిన రవీందర్, కిరణ్‌రుమార్‌లతో పాటు నేనూ కొన్ని సెట్స్‌కు స్కెచ్‌లు వేసాను. చిత్రవిచిత్రమేమంటే ఈ సినిమాకి ఆర్ట్ డైరెక్టరుగా టైటిల్ కార్డువేసి, తర్వాత కొందరి ప్రోద్భలంతో తీసేసారు. భజన చేసేవాడికే భోజనం. ఇల్లున్న వాడికే ఇల్లు. ఈ చిత్ర పరిశ్రమ శ్రీరామరాజ్యమైయ్యేదెప్పుడో...!

**● మీరు ఇటీవల పోస్టర్స్‌పై యం.ఎస్.కె. అని సంతకం చేస్తున్నారెందుకని?**

నా పేరు కదలి సురేష్ నాకు ఆర్టు మీద మక్కువ కలిగించిన నాకు ఆర్ట్ నేర్పించింది మా అమ్మ కదలి వెంకటనర్సమ్మగారు. నా తల్లిపేరు కలవాలని కదలి వెంకట సురేష్ ( కె.వి.సురేష్) అని పెట్టుకున్నాను కానీ వెంకట సురేష్ అనేది నా పేరే అనుకుంటున్నారే తప్ప తల్లిని గుర్తుచేయటం లేదు. అందుకే పైగా మదర్ సురేష్ కదలిగా మార్చుకున్నాను

మరి కొన్ని స్కెచ్‌లు తర్వాత పేజీలో..



అంతపుర స్త్రీలతో సీత వనవాస ముచ్చట్లు..







హైదరాబాద్ రవీంద్రభారతిలో దాసరి నారాయణరావు చేతులమీదుగా సన్మానం అందుకుంటున్న సురేష్ కె.వి.











# నాట్య కళ

భారతీయ నృత్యకళ దైవాన్ని ఆశ్రయించింది. ఆత్మ ప్రభోదం చేసి, అంతర్ముఖ సౌందర్యంతో బ్రహ్మానందాన్నిస్తుంది. పద విన్యాసం తక్కువగా ఉంటే నృత్యం ఒక భావం స్పష్టం చేయటానికి గానం, వాద్యం సమ్మేళనంతో పద విన్యాసం ఎక్కువగా వుంటే నృత్యం అంటారు. ఆ నృత్యానికి నటన జోడిస్తే నాట్యం. భారత దేశంలో నృత్యానికీ, నాట్యానికి దగ్గర సంబంధం వుంది. ఆహార్యం (Costume ), ఆంగికం (gesture), వాచకం (Words), సాత్వికం (feeling) కలిగింది నాట్యం. పురుషులు ఉధృతంగా చేసేది తాండవం శివుడు, తాండవ కేళీవినోదుడు. లలితంగా, కోమలంగా స్త్రీలు చేసేది లాశ్యం. శివా అంటే పార్వతీదేవి చేసే నృత్యం లాశయం. అదే శివాలాశ్యం .. శివుడు చేసేది శివతాండవం. అదే ఆనంద తాండవం.



- గబ్బిట దుర్గాప్రసాద్

వైదిక కాలమ్‌లో కూడా నృత్యం వుంది వర్షాల కోసం. అశ్వమేధ యాగం చేసేటప్పుడు. నెత్తిమీద బిందెలతో కన్యలు “ఇదం అమృతం” అంటూ పాడతూ నృత్యంచేసినట్లు వుంది. వివాహ వేడుకల్లో నృత్యాలు ఉండేవి. ఇంద్రుడు యుద్ధానికి వెళ్లేటప్పుడు నృత్యం చేసేవాడట. నాట్యపోషకుడు, విశ్వనటుడు అయిన పరమశివుడు సంధ్యాసమయంలో తాండవం చేస్తాడని ప్రతీతి. విష్ణుమూర్తి మృదంగం వాయిస్తాడు. గణపతి సహ నృత్యం చేస్తాడు. సకల దేవతలు ఋషులు, ఆ నృత్య వినోదంలో ఆనందిస్తారు. ఇదే ఆనంద తాండవం అంటారు. తాండవానికి ఉన్న ప్రాముఖ్యత దేనికీ లేదు.

“ఆంగికం భవనం యస్య వాచికం సర్వ వాఙ్మయం.. ఆహార్యం చంద్ర తారాది తం నమ, సాత్వికం శివం”

అని నృత్య ప్రదర్శన ముందు, నాటక ప్రదర్శన ముందు ప్రార్థన చేస్తారు. దీని అర్థం. “ఎవని అంగవిన్యాసం ప్రపంచక్రమయో, ఎవని



వాక్కు సర్వ గ్రంధాల సారమో ఎవరి అలంకరణ చంద్రుడు, నక్షత్రాలో, అట్టి సాత్విక బావుడైన శివునికి అంటే మంగళ ప్రదునికి నమస్కారం “ఆయనే “నట రాజు'' చిదంబరం దేవాలయం లోని నటరాజ మూర్తి అద్భుత సౌంద ర్యానికి ప్రతీక ప్రపంచంలో అంతటి కళా విరాజితమైన శిల్పంలేదని విశ్లేషకుల ఏకాభిప్రాయం. ఈ కళా సౌందర్యాన్ని చూసి ముచ్చట పడి Dr. George Arundel ఇలా అంటారు “Thou who art the Lord of Universe, who art clothed with infinite space. who holdeth infinity itself within thy grasp who art the lord of Universe and of worlds and who art very bliss of life” అన్నారు.

నటరాజా మూర్తిపై పరిశోధన చేసిన ఆనంద కుమార స్వామి అనే సింహళ దేశ రచయిత, కళా మర్మజ్ఞుడు, ఆ మూర్తిలోని భావాలను ఆవిష్కరణ చేశారు. ఆ విగ్రహం చుట్టూ వున్న దీర్ఘ వలయాకార చట్రం విశ్వం యొక్క కదలికకు చిహ్నం. అదే భ్రాంతి నుంచి విముక్తి చేయటానికి గుర్తు. చిదంబరం విశ్వానికి కేంద్రం. అంటే హృదయం కేంద్రం అన్న మాట. శివుని నాట్య భంగమే నటరాజా మూర్తి. జటాజూటం వ్యోమకేశంగా ఉంటుంది. స్వర్గలోక వాసులకు హెచ్చరిక. తలపై అర్దచంద్రుడు అదృశ్యం అయినట్టే ప్రపంచం లయం అవుతుందని చెప్పే సూచిక. ఆనంద తాండవ శివుని పాదాల క్రింద వున్న “మాయలక” అనే రాక్షసుడు అపస్మారకానికి సంకేతం అంతే కాక అజ్ఞానంపై విజయాన్ని కూడా సూచిస్తుంది అంతే కాదు. దైవ గుణం పదార్ధంగా మారటానికి సంకేతం. ఆయన విగ్రహంలో అయిదు భావాలు గోచరిస్తాయి. ఆయనకు నాలుగు చేతులున్నాయి మొదటి భావం. సృష్టి ఇదే. ఆయన కుడిచేతిలో డమరుకం సృష్టిని తెలియజేస్తుంది. దానిలోంచి వచ్చే నాదమే సృష్టికి మూలం. ఆయన

నాద బ్రహ్మ కదా. రెండవ రక్షణ రెండవ కుడి చేతిలోని అభయ ముద్ర ఆ భావాన్ని తెలియజేస్తుంది. మూడవ భావం. లయం ఎడమచేతిలోని అగ్ని దీనికి సంకేతం అంటే కాదు ముక్తికి చిహ్నం కూడా. రెండవ ఎడమచేయి క్రిందకు చూపుతూ వుంటుంది. ఇది అజ్ఞానంపై విజయ దరహాసం. జటలో సర్పం, దానితో పాటు కాసిందచెట్టు దళాలు అయిదు వున్నాయి కుడిచెవికి మగవారి కర్ణాభరణ, ఎడమ చెవికి ఆడవారికి కర్ణాభరణం వుంటాయి. భుజకీర్తులు, అందెలు ప్రత్యేకం. చర్మాంబరధారి. సర్పమే జందెం. పైన కాషాయ ఉత్తరీయం కింద వున్న కుడి పాదం రహస్యానికి చిహ్నం. పైకెత్తిన ఎడమ పాదం వరదానానికి గుర్తు. అగ్ని మద్యంలో నటరాజు తాండవం చేస్తాడు. ఇది సృష్టి కార్యాన్ని తెలియజేస్తుంది. నడుము చుట్టూ వున్న సర్పం కుండలినికి ప్రతీక. అదే జంధ్యం కూడా. ఆయన ముఖం తటస్థ భావంగా వుంటుంది. అంటే అన్నిటినీ సమదృష్టిలో చూసే విధానం కన్పిస్తుంది.

కొన్ని చోట్ల నటరాజు పాదాలక్రింద అదిశేషుని రూపంలో వుండే మహావిష్ణువు కన్పిస్తాడు. ఆయనపై ఉంచిన పాదం రహశ్యానికి చిహ్నం. ఆయన సర్వసాక్షి అని అర్థం చెబుతారు. చిదంబరంలోని నటరాజ శివునికి ఎడమ వైపు అమ్మ వారుంటారు. అంటే అర్ధనారీశ్వరం. కుడితెర వుంటుంది. దీపాలు వెలిగింది తెర తీస్తారు. అక్కడ అయిదు బిల్వదళాలు కన్పిస్తాయి. దాని వెనుక ఏమీ వుండదు. అదే చిదంబర రహశ్యం అంటే.. దీని అర్ధమేమిటంటే. భగవంతునికి సర్వసమర్పణ చేస్తే అజ్ఞానాన్ని పోగొట్టుతాడు. చూసి అనుభవం పొందాలని భావం. ఇదీ చిదంబర రహస్యం. అందులోని నటరాజా మూర్తిలోని ఆంతర్యం.

అరవై నాలుగు కళలలో నాట్యకళ శ్రేష్టం అయినదిగా చెబుతారు. భరతముని నాట్యశాస్త్రం రాశాడు. దానినే భరతం అంటారు. దీనిపై జాయప సేనాని నృత్య రత్నావళి, కొమరాగిరిరెడ్డి రాజు "వసంత రాజీవం "వ్యాఖ్యలు రాశారు నాట్యం ఆయా ప్రదేశాలను బట్టి పేర్లు మార్చుకుంది. తమిళనాడులో భారతనాట్యం, కేరళలో కథాకేళి, ఉత్తరదేశంలో కథక్ పేర్లతో వర్ధిల్లింది. ఆంధ్రదేశంలో కూచిపూడికి చెందిన సిద్ధేంద్రయోగి "కూచిపూడి యక్షగానం "అనే ప్రక్రియను ప్రవేశపెట్టారు. అదే కూచిపూడి నాట్యం అయింది. అలాగే ఒడిస్సీ, గార్బీ, బే, సున్తాల్ కూడా వర్ధిల్లాయి. ఇందులో భరతనాట్యం మాత్రం భరతుని నాట్యశాస్త్రానికి దగ్గరగా వుంటుంది.

"Bharata naatyam is the most brilliant dance and most classic" అన్నాడు బోవర్స్ అనే ఆంగ్ల విశ్లేకుడు. నాట్యంలో ప్రేమ, శృంగారం దు:ఖం, శాంతం, రాగద్వేషాలు మొదలైన భావాలన్నీ ప్రదర్శింపబడతాయి. నవరసాలతో ప్రజలు మానసిక ఉద్వేగాలను తగ్గించి శాంతి, సౌఖ్యంలను కల్గించడమే నాట్యకళపరమార్ధం అందంగా రాగ, రాగిణులతో, రక్తితో, రసిక జన రంజనంగా కైవల్యాన్నిస్తుంది. వినోదం కోసమే ప్రారంభమైనా, విజ్ఞానం కూడా కలిస్తే నాట్యం శాశ్వత విలువలను కల్గిస్తుంది. సరస్వతీ దేవి వారాలైన సంగీతా, సాహిత్య సమాహారమే నట్యకళ. అతి పవిత్రమైనది, ఆనందదాయకమయినది.

స్త్రీలకూ నాట్యం నిరపాయకరమైన వ్యాయామం. శరీర సౌష్టవానికి, ఆరోగ్యానికి, దీర్ఘాయుస్సుకు, సౌందర్యపోషనానికి వరం. కళ ఒక తపస్సు. అది భగవరారాధనా సాధనం అని మర్చిపోరాదు.